హరిః ఓమ్

శ్రీగురుచరణసరోజాభ్యాం నమః.

# తత్త్వానుసంధానము.

ఇది

ఆత్మపురాణగూఢార్థదీపికాది గ్రంథకర్త యగు శ్రీస్వామి చిద్ఘనానందగిరిచే
హిందీభాషను రచింపఁబడినదియు, సమస్తవేదాంతవిషయములను
గరతలామలక మగునట్లు ప్రబలయుక్తులతో శాస్త్రీయ
మార్గానుసారముగఁ బ్రతిపాదించునదియు నగు
సర్వతోముఖ మహావేదాంతగ్రంథము.

ఇయ్యది,

బ్రహ్మనిష్ఠు లగు

శ్రీగురుసామిస్వాములయొక్క ప్రేరణచే

దేహశూరవంశోద్భవు లగు

దే- ఆదినారాయణరెడ్డి

పే- కృష్ణారెడ్డి

వీరలచే నాంధ్రీకరింపఁబడి

బ్రహ్మశ్రీ చదలువాడ సుందరరామశాస్త్రులవారిచే
ప్రామాదికాదిదోషములు లేనట్లు పరిష్కరింపఁబడినది.

శారదాంబావిలాసముద్రాక్షరశాలయందు
ముద్రితమై ప్రకటింపఁబడినది.


1919.
[వెల రు. 4-0-0.

ఓం తత్ సత్.

శ్రీగణేశాయ నమః, శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

శ్రీశంకరాచార్యేభ్యో నమః, శ్రీకాశీవిశ్వేశ్వరాయ నమః.

# ఉపోద్ఘాతము.

ఈ సంసారమునందు మోక్షముకన్నఁ బరముగా వేఱొకపదార్థము లేదు. మఱి యే మనఁగా మోక్షమే సర్వముకన్న శ్రేష్ఠ మైనది. ఎట్లనఁగా మోక్షమును బొందినయధికారిపురుషులు మరల జన్మమరణాదిరూపసంసారమును బొందరు. ఈ యర్థము లోకప్రసిద్ధము. అట్లే "న స పునరావర్తతే, యద్గత్వా న నివర్తంతే" ఇత్యాది శ్రుతిస్మృతులచేతను సిద్ధమై యున్నది. అందువలన నీయధికారిపురుషులు జన్మమరణాదిరూపసంసారమును మరలఁ బొంద కుండుటకై యామోక్షమునే సంపాదింపవలయును. ఇచ్చట, ఈజీవాత్మ కజ్ఞాననివృత్తిపూర్వకముగాఁ దనసచ్చిదానందబ్రహ్మరూపముచేత స్థితి యేది గలదో అది మోక్ష మనఁబడును. బ్రహ్మలోకాదులయొక్క ప్రాప్తి మోక్షరూపము కాదు. ఏల యన "తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే । ఏవమేవా ఽముత్ర పుణ్యచితో లోకః క్షీయతే" అను శ్రుతి యీ లోకమువలె నా బ్రహ్మలోకాదులును నాశవంతము లని చెప్పుచున్నది.

మఱియు "ఆబ్రహ్మ భువనా ల్లోకాః పునరావర్తి నోఽర్జున" అను గీతావచనముచేత శ్రీభగవంతుఁడును ఆ బ్రహ్మలోకాదిలోకములు పునరావృత్తిసహితములని చెప్పియున్నాఁడు. అందువలన నాలోకాదులయొక్క ప్రాప్తి మోక్షరూపము కాదు. ఆమోక్ష మీయధికారిపురుషుల కాత్మజ్ఞాన మొకటిచేతనే ప్రాప్త మగుచున్నది. కర్మోపాసనాద్యన్యోపాయములచేతఁ బ్రాప్త మగుట లేదు. ఎట్లన "జ్ఞానాదేవతు కైవల్యమ్, త మేవ విదిత్వా ఽతి మృత్యుమేతి నాన్యః పంథా విద్యతే ఽయనాయ" ఇత్యాది శ్రుతులచేతఁ గేవలాత్మజ్ఞానముచేతనే మోక్షప్రాప్తి చెప్పఁబడియున్నది. మఱియు "నాస్త్యకృతః కృతేన, నకర్మణా నప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వ మానశుః" ఇత్యాది శ్రుతులచేతఁ గర్మోపాసనాదికములవలన మోక్షప్రాప్తి నిషేధింపఁబడి యున్నది. అందువలన నాత్మజ్ఞాన మొకటియే ఆ మోక్షప్రాప్తికి సాధనమై యున్నది. ఇచ్చట బ్రహ్మముకన్న నభిన్నరూపముచేతఁ దన యాత్మయొక్క "అహం బ్రహ్మాస్మి" యనుజ్ఞాన మేది గలదో అది యాత్మజ్ఞాన మనఁ

బోసును. ఈప్రకారమైన యాత్మజ్ఞానముచేతనే పూర్వోక్తమోక్షము ప్రాప్తమగుచున్నది. జీవబ్రహ్మములయొక్క భేదజ్ఞానమువలన నామోక్షము ప్రాప్తమగుట లేదు. ఏలయన "ఉదర మంతరం కురుతే। అథ తస్య భయం భవతి, ద్వితీయాద్వై భయం భవతి" ఇత్యాది శ్రుతులవలన భేదదర్శిపురుషునకు భయముయొక్కప్రాప్తి చెప్పఁబడియున్నది. అట్లే "మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" ఇత్యాది శ్రుతులచేత నాభేదదర్శిపురుషునకుఁ బునఃపున ర్జన్మమరణప్రాప్తి చెప్పఁబడి యున్నది. మఱియు "అథ యోఽన్యాం దేవతా ముపాస్తే ఽన్యోఽసావన్యోఽహ మస్మీతి నసవేద యథాపశుః" ఇత్యాది శ్రుతులు భేదదర్శిపురుషునిఁ బశు వని చెప్పుచున్నవి. కావున నాభేదజ్ఞానమునకు మోక్షసాధనత్వము సంభవింపదు. మఱే మనఁగా, ఉక్తశ్రుతులవలన జన్మమరణరూపసంసారసాధనత్వమే సిద్ధమగుచున్నది.

మఱియు, "ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి, అయమాత్మా బ్రహ్మ" ఇత్యాదిశ్రుతులచేతను, "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" ఇత్యాది స్మృతివచనములచేతను జీవబ్రహ్మములయొక్కయభేదమే చెప్పఁబడి యున్నది. అందువలన "అహం బ్రహ్మాస్మి" యను జీవబ్రహ్మములయొక్కయభేదజ్ఞానమే మోక్షమునకు సాధన మని సిద్ధమగుచున్నది. ఆమోక్షసాధనరూపాత్మజ్ఞాన మీయధికారిపురుషునకు బ్రహ్మవేత్త యగు గురుముఖమువలన వేదాంతశాస్త్రశ్రవణ మనననిదిధ్యాసనములచేతనే ప్రాప్తమగుచున్నది. అందువలన మోక్షేచ్ఛగల యధికారిపురుషుఁడు శ్రవణాదిసాధనములచే నాయాత్మజ్ఞాన మవశ్యము సంపాదింపవలయును. మఱియు నేపురుషుఁడు ప్రమాదముచే నాయాత్మజ్ఞానమును సంపాదింపఁడో ఆపురుషునకు "నచే దిహాఽవేదీ ర్మహతీ వినష్టిః" అను శ్రుతిచేత జన్మమరణాదిరూపమహాహాని యొక్కప్రాప్తి చెప్పఁబడి యున్నది.

మఱియు "యోవా ఏత దక్షరం గార్గ్య విదిత్వాస్మాల్లోకాత్ప్రైతి స కృపణః" అను శ్రుతి యాత్మజ్ఞానరహితపురుషునిఁ గృపణుఁ డని చెప్పుచున్నది. అనఁగా, ఎట్లు లోకప్రసిద్ధకృపణుఁ డగుపురుషుఁడు తనకుఁ బ్రాప్తమైనధనము ననుభవింపక యున్నాఁడో అట్లజ్ఞానిపురుషుఁడును నిత్యప్రాప్తబ్రహ్మానందరూపధనముయొక్క సాక్షాత్కారరూపానుభవము లేనివాఁ డగుటవలనఁ గృపణుఁడే యగుచున్నాఁడు. మఱియు నేయధికారిపురుషుఁడు శ్రవణాదిసాధనములచే నాత్మజ్ఞానము సంపాదించుచున్నాఁడో ఆయధికారిపురుషుని "అథయ ఏత దక్షరం గార్గి విదిత్వాస్మాల్లోకాత్ప్రైతి స బ్రాహ్మణః" అను శ్రుతి బ్రాహ్మణుఁ డని చెప్పుచున్నది. అట్లే గీతయందు శ్రీభగవంతుఁడును "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" అను వచనము

చేత జ్ఞానవంతుఁ డగు పురుషుఁడు తనయాత్మయే యని చెప్పియున్నాఁడు. అగుట వలన నీయధికారిపురుషునిచేత మోక్షప్రాప్తికొఱ కాయాత్మజ్ఞానము శ్రవణాదులచే నవశ్యము సంపాదించుటకు యోగ్యమై యున్నది. ఈకారణముచేతనే వేదమునందు "ఆత్మావా అరే ద్రష్టవ్యః" అను శ్రుతిచేత నాత్మజ్ఞాన మవశ్య కర్తవ్య మని చెప్పి ఆయాత్మజ్ఞానప్రాప్తికొఱకు "శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అనుశ్రుతిచేత శ్రవణమనననిదిధ్యాసనము లను నీ త్రివిధసాధనములు విధింపఁబడి యున్నవి. ఇందు చేత సర్వవేదములకు సాక్షాత్తుగా నైనను బరంపరచేత నైనను ఆత్మజ్ఞానమునందే తాత్పర్య మున్నది. ఇచ్చట వేదముయొక్క కర్మకాండ కైననో అంతఃకరణశుద్ధిద్వారమున నాత్మజ్ఞానమునందుఁ దాత్పర్య మున్నది. ఉపాసనాకాండమునకుఁ జిత్తైకాగ్రతాద్వారమునఁ దాత్పర్య మున్నది. మఱియు నుపనిషద్రూపజ్ఞానకాండమున కైననో సాక్షాత్తుగానే యాత్మజ్ఞానమునందుఁ దాత్పర్య మున్నది. ఈప్రకారముగా మనుభగవద్యాజ్ఞవల్క్యపరాశరాదిఋషులచేతఁ జేయఁబడిన యేధర్మశాస్త్రరూప స్మృతు లున్నవో మఱియు శ్రీవ్యాసభగవంతునిచేఁ జేయఁబడిన యే బ్రహ్మసూత్రేతిహాసపురాణము లున్నవో యాసర్వమునకును బ్రహ్మాత్మైకత్వజ్ఞానమునందే తాత్పర్య మున్నది. అట్లే వాల్మీకిమహర్షిచేతను వాసిష్ఠరామాయణమునం దనే కేతిహాసములచే నీయాత్మజ్ఞానమె నిరూపింపఁబడి యున్నది. అట్టి యనాదిశ్రుతిస్మృత్యాదులచే సిద్ధ మగు నాత్మజ్ఞానమునే శ్రీభగవంతు లగు శంకరాచార్యు లుపనిషద్భాష్యము నందును సూత్రభాష్యమునందును గీతాభాష్యమునందును అతిస్పష్టముగా నిరూపించి యున్నారు. ఈయర్థము శ్రీవ్యాసభగవంతునిచే శివపురాణమునందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. వ్యాకుర్వన్ వ్యాససూత్రార్థం శ్రుతే రర్థం యథోచివాన్ । శ్రుతే ర్న్యాయ్య స్స ఏవార్థ శ్శంకరః సవితాననః"—భావము॥ వేదముల కన్యార్థము నిశ్చయించి యనర్థమును బొందిన లోకులను జూచి సర్వదేవతలచేఁ బ్రార్థింపఁబడినవాఁడై శ్రీభగవంతుఁ డగుశంకరుఁడు పృథివియందు శ్రీశంకరాచార్యావతారరూపమును ధరించి శ్రీవ్యాసకృతబ్రహ్మసూత్రములకు వ్యాఖ్యానముఁ జేసినవాఁడై యేప్రకారముగా శ్రుతుల కర్థముఁ జెప్పియున్నాఁడో ఆయర్థమే శ్రుతులకు సమీచీనమై యున్నది. తదన్యప్రకార మైనయర్థము సమీచీనము గాదు.

మఱియు భగవంతు లగు శంకరాచార్యులయొక్క శిష్యపరంపరయం దనేక విద్వత్సన్న్యాసులును విద్వాంసు లగు ననేకగృహస్థులును ఉండిరి. వారిచేత నా సూత్రభాష్యాదులమీఁదను స్మృతీతిహాసపురాణాదులమీఁదను టీకాగ్రంథములు వ్రాయఁబడి యున్నవి. అట్లే వారు స్వతంత్రముగా ననేకప్రకరణగ్రంథములును

వ్రాసి యున్నారు. ఆగ్రంథము లీకాలమునందును సర్వత్ర ప్రసిద్ధములై యున్నవి. ఆగ్రంథములయందును జీవబ్రహ్మములయొక్క యభేదజ్ఞానమే సిద్ధము చేయఁబడి యున్నది. అందుఁ గొన్నిగ్రంథము లైననో యితరమతఖండనపూర్వకముగా స్వమతస్థాపన చేయునవి యగుచున్నవి. అవి చిత్సుఖి, అద్వైతసిద్ధి, సంక్షేపశారీరకము, స్వారాజ్యసిద్ధి, వేదాంతపరిభాష, సిద్ధాంతలేశసంగ్రహము, అద్వైతకౌస్తుభము, భేదధిక్కారము ఇత్యాది గ్రంథములై యున్నవి. మఱియుఁ గొన్నిగ్రంథము లైననో కేవలము స్వమతస్థాపన చేయునవే యగుచున్నవి. అవి పంచదశి, వేదాంతసారము, అపరోక్షానుభూతి, వాక్యవృత్తి, వాక్యసుధ, జీవన్ముక్తి, వివేకచూడామణి, ఆత్మబోధము, తత్త్వబోధము ఇత్యాది గ్రంథములై యున్నవి. ఈప్రకారముగా నధికారిపురుషుల బుద్ధియొక్క తారతమ్యము ననుసరించి విద్వాంసు లగుపురుషులచే నత్యంతవిస్తరము గలవియును గించిద్విస్తరము గలవియును అత్యంతకఠినములును అత్యంతసుగమములు నైన యనేక వేదాంతగ్రంథములు రచియింపఁబడి యున్నవి. ఆసర్వగ్రంథకర్తలకును అధికారుల కాత్మజ్ఞానముఁ గలిగించుటయందే తాత్పర్యము. అనఁగా, ఏప్రకారముచేత నైనను ఈయధికారిపురుషుల కాత్మసాక్షాత్కారము కలిగి దానిచే మోక్షమును బొందవలయు ననియే వారితాత్పర్యమై యున్నది. మఱియు నేయధికారిపురుషులు శ్రద్ధాభక్తిపూర్వకముగా నాగ్రంథములను విచారించుచున్నారో ఆయధికారిపురుషుల కాత్మసాక్షాత్కారప్రాప్తి యవశ్య మగుచున్నది. అయినను ఆసర్వగ్రంథములు సంస్కృతభాషయం దుండుటవలన సర్వాధికారిపురుషుల కాగ్రంథములయొక్క విచారణయందుఁ బ్రవృత్తి కలుగనేరదు. మఱే మనఁగా వ్యాకరణకావ్యకోశాదికసాధనగ్రంథములయొక్క యభ్యాసము గలపురుషులకే యాసంస్కృతగ్రంథములయొక్క విచారణయందుఁ బ్రవృత్తి కలుగుచున్నది. మఱియు నేయధికారిపురుషులు శరీరముయొక్క యాలస్యముచే నైనను వ్యాధి మొదలగు నేదైన నొకనిమిత్తముచే నైనను ఆవ్యాకరణాదుల యభ్యాసమం దసమర్థులగుచున్నారో మఱియు నాత్మజ్ఞానమునం దుత్కటేచ్ఛ గలిగియున్నారో యాముముక్షుజనుల బోధకొఱకు మహాత్ము లాయాదేశభాషలయందు వేదాంతగ్రంథముల రచియించి యున్నారు. ఆ భాషాగ్రంథముల విచారణచేయుటవలన నీయధికారిపురుషుల కాత్మసాక్షాత్కార మవశ్యము కలుగుచున్నది. ఎట్లన, సంస్కృతవేదాంతగ్రంథములయం దాత్మజ్ఞానోపయోగు లగు నేయేపదార్థములు నిరూపింపఁబడి యున్నవో యా సర్వపదార్థములును ఆ భాషాగ్రంథములయందును నిరూపింపఁబడి యున్నవి. ఆపదార్థముల నిరూపణమందుఁ గించిన్మాత్రమును విలక్షణత్వము

లేదు. కనుక నాభాషాగ్రంథములయొక్క విచారణవలన నధికారిపురుషుల కాత్మ జ్ఞాన మవశ్యము కలుగు చున్నది.

మఱియు నాయా దేశములయందు సంస్కృతగ్రంథములపాఠము చెప్పు పురుషులు శ్రోతలనుగూర్చి యాసంస్కృతవాక్యోచ్చారణచేసి యావాక్యములకు స్వదేశభాషయం దెప్పు డర్థముఁ జెప్పుచున్నారో యప్పుడే శ్రోతల కావాక్యార్థబోధ యగుచున్నది. కేవలసంస్కృతవాక్యపాఠమాత్రమువలన శ్రోతలకు బోధ కానేరదు. ఈప్రకారముగా పఠనపాఠనములయొక్క రీతి యీకాలమునందు సర్వత్ర ప్రసిద్ధమై యున్నది. అందువలన నావిద్వాంసు లగు పురుషులచేఁ జేయఁబడిన సంస్కృతవాక్యములకు దేశభాషయందు వ్యాఖ్యాన మెట్లు శ్రోత లగుపురుషులయొక్క బోధకు హేతు వగుచున్నదో అట్లు విద్వాంసు లగుపురుషులచేఁ జేయఁబడిన సంస్కృతవాక్యములయొక్క వ్యాఖ్యానరూపము లైన యా భాషాగ్రంథములు గూడ నధికారిపురుషులయొక్క బోధకు హేతువుగా నవశ్య మగును.

మఱియు భాషాగ్రంథములయొక్క విచారణ కాత్మజ్ఞానహేతుత్వము కేవలయుక్తిచేతనే సిద్ధించుటయే గాక ప్రత్యక్షానుభవముచేతను సిద్ధించుచున్నది. హృషీకేశాదిస్థలములయం దనేకమహాత్ములు కేవలభాషాగ్రంథములనే విచారణ చేసి యున్నారు. అయినను ఆమహాత్ములయందు జ్ఞాననిష్ఠయును దైవసంపద్గుణములును వేదాంతశాస్త్రముయొక్క పదపదార్థజ్ఞానమును బరిపూర్ణముగాఁ జూడఁబడుచున్నవి. అందువలన సంస్కృతవేదాంతగ్రంథము లెట్లధికారిపురుషులయొక్క యాత్మజ్ఞానమునకు హేతు వగుచున్నవో అట్లు భాషావేదాంతగ్రంథములును అధికారిపురుషులయొక్క యాత్మజ్ఞానమునకే హేతు వగుచున్నవి. ఈ యభిప్రాయముచేతనే మహాత్ము లగుపురుషు లాయాదేశములయం దధికారిపురుషులయొక్క బోధకొఱ కాయాదేశభాషలయందు వేదాంతగ్రంథములను రచియించియున్నారు. అందువలన నధికారిపురుషులయొక్క బోధకు హేతు వగుటవలన నాభాషాగ్రంథములయొక్క రచనమును సఫలమై యున్నది.

# ఆంధ్రీకర్తల విజ్ఞాపనము.

ఇంతవఱకు హిందీభాషలోఁ దత్త్వానుసంధాన మను నీగ్రంథమును రచియించిన శ్రీచిద్ఘనానందగిరిస్వామివారి యుపోద్ఘాతము. తత్త్వానుసంధాన మను వేదాంతప్రకరణము సంస్కృతములోఁ బూర్వము శ్రీమహాదేవసరస్వతీస్వామివారిచే రచియింపఁబడినది. దానికి సంస్కృతమునందే యద్వైతకౌస్తుభ మను విపులవ్యాఖ్యానము కలదు. ఆ మూలగ్రంథమును వ్యాఖ్యానమును జేర్చి శ్రీచిద్ఘనానందగిరిస్వామివారు హిందీభాషలోఁ దత్త్వానుసంధాన మను పేర నీమహాగ్రంథమును గావించిరి. మేము శాస్త్రజ్ఞులము కాము. ఆంధ్రభాష మాకు మాతృభాష యైనను దానియందును మాకుఁ దగినపరిజ్ఞానము లేదు. అయినను హిందీభాషలోని యీ తత్త్వానుసంధానముఁ జదివినవారము కావున నీగ్రంథమునందలి యభిమానమువలన యథాశక్తి నాంధ్రీకరించితిమి. భాషలో నధికదోషములు లేకుండునట్లు బ్రహ్మశ్రీ చదలువాడ సుందరరామశాస్త్రులవారిచే సవరింపించుకొంటిమి. ఇందుఁ గల ప్రామాదికములఁ బరికించి విద్వాంసులు క్షమించి సవరింపవలయు నని ప్రార్థించుచున్నాము.

చెన్నపట్టణమునం దుండిన అపరోక్షానుభవి శ్రీవకుళాభరణపరదేశి యనువారు మాకు వేదాంతమునందుఁ బ్రవేశము గలిగించిన ప్రథమగురువులై యుండిరి. పిమ్మట మ-రా-రా-శ్రీ, వి. మురుగేశ మొదలియారువారు మాస్వల్పజ్ఞానమును వృద్ధిఁ బొందించి యీగ్రంథము నాంధ్రీకరించుట కుత్సాహము గలుగఁజేసిరి. ఆంధ్రీకరించుటయందు మా కర్థముకాని హిందీభాషలోని శబ్దములకును వాక్యములకును బ్రహ్మశ్రీ జనార్దనస్వామి చైతన్యులవారు మేము చెన్నపట్టణమునకు వచ్చినపుడెల్లఁ గరుణాపూర్వకముగాఁ దాత్పర్యమును బోధించి యెంతయు నుపకారము చేయుచుండిరి.

మఱియు మ-రా-రా-శ్రీ, మేలకొండుంగాలూరు పేరారెడ్డిగారు మాతోఁ గూడ గ్రంథము వ్రాయుట మొదలగు కార్యములయందుఁ బాటుపడి సాహాయ్యము చేయుటయే గాక ముద్రింపించుటకును మిక్కిలి ధనసాహాయ్యము గావించి పరహస్తములచేతను జేయించిరి. మఱియు మ-రా-రా-శ్రీ, కా. శ్రీనివాసరెడ్డిగారు మొదలగు పుణ్యపురుషులు దీని ముద్రణపరిపూర్తికి యథాశక్తి విరాళము లిచ్చి తోడుపడిరి. వీరి కందఱకును మేము కృతజ్ఞతతో వందనము లాచరించుచున్నాము.

ఇట్లు సాధుజనవిధేయులు,

5-4-1919 } దే - ఆదినారాయణరెడ్డి.
మరుదాడు. } పే - కృష్ణారెడ్డి.

మరుదాడుగ్రామము, వందవాసితాలూకా, నార్త్ఆర్కాడుజిల్లా.

శ్రీ

శ్రీకృష్ణాయ నమః.

# పండితాభిప్రాయములు.

విచారసాగరాది బహుగ్రంథకర్తలును ఆత్మపురాణాంధ్రీకరణకృతకృతులును నిరంతర బ్రహ్మనిష్ఠాగరిష్ఠులు నగు బ్రహ్మశ్రీ వేదమూర్తు లగు జనార్దనస్వామిచైతన్యుల వారి యభిప్రాయము.—

మ-రా-రా-శ్రీ, దే - ఆదినారాయణరెడ్డి, పే - కృష్ణారెడ్డిగార్లచే హిందీ భాషనుండి యాంధ్రీకరింపఁబడిన తత్త్వానుసంధాన మను వేదాంతగ్రంథమును నే నక్కడక్కడఁ జదివి చూచితిని. ఇది నాలుగుపరిచ్ఛేదములు గలిగి వేదాంతసిద్ధాంత మును జిజ్ఞాసువులకుఁ జక్కగా బోధించునదియై యున్నది. సంస్కృతముఁ దెలియని వారును ఆంధ్రభాష దెలిసినవారు నగు జిజ్ఞాసువులు ఈగ్రంథమును జదివినయెడ వారికి సుఖంబున వేదాంతతత్త్వ మవగత మగు నని నాయభిప్రాయము.

ఇట్లు

జనార్దనస్వామిచైతన్యులు.

బ్రహ్మశ్రీ, వేదమూర్తులగు చదలువాడ సుందరరామశాస్త్రిలవారి యభిప్రాయము.—

శ్లో. సంస్కృతాభ్యాసహీనానాం ముముక్షూణాం జితాత్మనామ్
ఉపకారాయ విద్వద్భి స్తత్త ద్భాషాసు నిర్మితాః.
వేదాంతతత్త్వబోధిన్యః కృతయః పురుషార్థదాః
తత్ర శ్రీ చిద్ఘనానందగిరిస్వామీ యతీశ్వరః.
న్యాయవేదాంతశాస్త్రాబ్ధి పారగామీ మహాశయః
శ్రీమదాత్మపురాణాదీ ర్హిందీభాషామయీః కృతీః.
సుబహ్వీశ్చ సువిస్తీర్ణా శ్చకార బుధసమ్మతాః
తత్త్వానుసంధాన మితి తాసు ప్రకరణం మహత్.
చతుర్భి స్సకలం శాస్త్రం పరిచ్ఛేదై ర్నిరూపయత్
సుబోధంచ విజిజ్ఞాసులోకానన్దిచ భాసతే.

త దిదం పండితాభ్యాశే శుశ్రూషా వినయాన్వితౌ
దేహశూరకులే జాతౌ విచారైకపరాయణౌ.
ఆదినారాయణః కృష్ణ ఇతి మా గుణసంయుతౌ
అనూదతు స్స్వాన్ధ్రగిరా యథామూలం యథాక్రమమ్.
భాషాదోషా అత్ర మయా శోధితాశ్చ యథామతి
త దిదం నాతివిస్తీర్ణం నాతిసంక్షిప్త ముద్యతమ్.
ఆంధ్రభాషావిదా మాత్మతత్త్వజ్ఞానాభిలాషిణామ్
ఉపకారా యేతి మన్యే విస్పష్టార్థాభిధాయకమ్.

చదలువాడ సుందరరామశాస్త్రి.

స్త్రీశ్రీ, వేదమూర్తు లగు దండిగుంట సూర్యనారాయణశాస్త్రులవారి యభిప్రాయము.——

ఆంధ్రతత్త్వానుసంధానము మా కందినది. అయ్యది సంస్కృతభాషయందు
హాదేవసరస్వతీస్వాములవారిచే ముముక్షుజనుల కత్యంతోపకారకముగా రచి
పఁబడినది. అద్వైతకౌస్తుభ మను వ్యాఖ్యానముతోఁ గూడిన యాతత్త్వాను
ానము శ్రీచిద్ఘనానందస్వామివారు హిందీభాషలోనికిఁ బరివర్తనము గావించిరి.
యాతత్త్వానుసంధాన మను ప్రకరణమును శ్రీ దే - ఆదినారాయణరెడ్డిగారును,
- కృష్ణారెడ్డిగారును నాంధ్రీకరించిరి. ఆంధ్రతత్త్వానుసంధానమును స్థాలీపులాక
ముముగా నచ్చటచ్చటఁ గొన్ని భాగములను జదివితిని. భాష సుబోధముగాను
నము విపులముగాఁ జర్చింపఁబడియు నుండుటం జేసి యియ్యది సంస్కృతభాషా
నము లేనివారికి ఆత్మజ్ఞానసిద్ధికి మిక్కిలి యుపకరించు నని తలంచుచున్నాఁ
ఇట్టి గ్రంథములు మనదేశభాషయందుఁ దఱచు లేమిం జేసి యీగ్రంథకర్తలు
ారికిఁ బ్రోత్సాహకులై యిట్టి గ్రంథరచనకు మార్గదర్శకులై యున్నా రని
లి నొక్కి చెప్పుచున్నాఁడను. ఈ గ్రంథమును జదివి గ్రంథకర్తలకు మఱి
ప్రకరణములు సేయ నుత్సాహము గలిగింతు రని జనులను బదింబదిగ వేఁడు
ఁడ.

ఇట్లు విద్వజ్జనవిధేయుఁడు
దండిగుంట సూర్యనారాయణశాస్త్రి.

బ్రహ్మశ్రీ, వేదమూర్తులగు నాగపట్టణము అరుణాచలశాస్త్రులవారి యభిప్రాయము.—

తత్త్వానుసంధాననామకోయం గ్రన్థః హిందీభాషాపరిజ్ఞానవతా ముపకారాయ శ్రీచిద్ఘనానందగిరిస్వామిపాదైః హిందీభాషయా నిరమాయి. సోయ మాత్మతత్త్వబోధనే పటుతర ఇతి.తత్తద్భాషయా పణ్డితై ర్భాషాంతరీకృతః. పర మాన్ధ్రభాషయా కే నాపి న విరచిత ఇతి తద్దేశవాసినా ముపకారాయ దే- ఆదినారాయణరెడ్డి పే- కృష్ణారె డ్డీతి ద్వాభ్యా మాన్ధ్రభాషయా విరచితః. అయంచ నిర్దోషతయా పర్యాప్తవిషయతయా చ ఆన్ధ్రదేశవాసినాం మహోపకారాయ భవ తీతి నిశ్చీయతే.

అరుణాచలశాస్త్రి.

బ్రహ్మశ్రీ, వేదమూర్తులగు కనుపర్తి మార్కండేయశర్మగారి యభిప్రాయము.—

శ్లో. ఆదినారాయణాభిఖ్య కృష్ణాభిఖ్య సుధీవరైః
ఆంధ్రభాషామాతృదేవ్యా స్సేవానిరతమానసైః.
శ్రీమత్తత్త్వానుసంధానగ్రంథ ఆన్ధ్ర్యా మనూదితః
స్థాలీపులాకన్యాయేన తత్ర తత్రావలోకితః.
ఇతః పూర్వం ప్రబంధానా మీదృశానా మభావతః
యో లోప స్సమభూ దాంధ్రభాషాయా స్స నివారితః.
అన్యానపీ దృశాన్ గ్రంథా నమీ కుర్వంతు సర్వదా
ఇ త్యేవం గ్రంథరత్నస్య సమాలోకనతో ముదా.
ప్రశస్తి ర్లిఖితా హ్యేయం శ్రీమార్కండేయశర్మణా.

కనుపర్తి మార్కండేయశర్మ.

మ-రా-రా-శ్రీ, ఓ-వై- దొరసామయ్యగారి యభిప్రాయము.—

తత్త్వానుసంధాన మను నీమహాగ్రంథమును త దాంధ్రీకరణకర్తలు విశ్వాసంబుతో నొసంగఁగాఁ గైకొని పఠించి సంతసించితిమి. ఇయ్యది సంస్కృతభాష యందలి తత్త్వానుసంధాన మను చిన్నపొత్తము నాధారముగాఁ గొని శ్రీబ్రహ్మనిష్ఠ పండిత చిద్ఘనానందగిర్యాచార్యస్వాములు సర్వజనోపయోగముకొఱకు హిందీభా

షలో విపులముగా రచియించిరి. ఆగ్రంథప్రాశస్త్యము నెఱింగి బ్రహ్మజిజ్ఞాసు లగు కేవలాంధ్రుల కత్యంతము మహోపకారముగ నుండునట్లు ఉత్తరార్కాడుజిల్లా వందవాశితాలూకా మరుదాడుగ్రామవాస్తవ్యులును దేహశూరవంశోద్భవులును నగు శ్రీయుత, దే - ఆదినారాయణరెడ్డిగారును శ్రీయుత, పే - కృష్ణారెడ్డిగారును తెనుఁగున పరివర్తనము కావించిరి. ఈ మహాగ్రంథగౌరవమునకుఁ దగినట్లు ఉభయ భాషాపండితప్రకాండులును శ్రీమద్రామాయణా ద్యనేకసంస్కృతాంధ్రగ్రంథము లకు వ్యాఖ్యానటీకాతాత్పర్యాదుల నొనర్చినవారును జగద్విదితయశులును నగు బ్రహ్మశ్రీ, చదలువాడ సుందరరామశాస్త్రిులవారిచే పరిష్కరింపఁబడినందున సాన దీరిన దివ్యరత్నంబుమాడ్కి తేజరిల్లు చున్నయది. లోకంబునం దనేక వేదాంత గ్రంథము లుండఁగా దీనివిశేష మే మని కొందఱు శంకింప వచ్చును. అట్టివారికి "సకలగ్రంథంబులందును జీవబ్రహ్మైక్యస్థితియే నిరూపింపఁబడి యున్నది. అయినను పరబ్రహ్మము విషయమునందు వివిధసిద్ధాంతములు ప్రబలియుండుటంజేసి మహాత్ము లైనవారు లోకక్షేమార్థమై వాస్తవసిద్ధాంత మిట్టి దని బోధించి సకలజనులును సద్గతి నొందవలయు ననెడి తలంపుతోను తత్కాలజనులమనంబునకు నాటునట్లుగను తా మెఱింగిన సకలగ్రంథములసారాంశము నంతయు సుగ్రహముగాఁ దెలుపవలయు నను నాసక్తిచేతను రచియించు చున్నారు గాన ప్రతినూతనగ్రంథమును ప్రశస్త మైనదే" అని సమాధాన మిచ్చుచున్నారము.

మఱియు వేదాంతవిషయదార్ఢ్యము గలుగునంతదాఁక వివిధవేదాంతగ్రంథ పఠనమును వేదాంతశ్రవణాదులును అవశ్యానుష్ఠేయములై యున్నవి. ఇందు బ్రహ్మ జిజ్ఞాసువులు తెలిసికొనం దగిన జడచేతనవిచారమును మనోజయోపాయమును జీవబ్ర హ్మైక్యలక్షణమును స్పష్టముగా బోధ మగునట్లు సకలసంశయనిరాకరణపూర్వకము గా వ్రాయంబడి యున్నది. కావున వేదాంతవిద్యాభిలాషులు దీనిం గైకొని పఠించి కృతకృత్యులు కావలయు నని విన్నవించెదము.

| | |
|---|---|
| మదరాస్. 5-4-1919. | ఇట్లు విన్నవించు విచారసాగరాదిగ్రంథకర్త ఓ-వై - శ్రీ దొరసామయ్య. |

# విషయసూచిక.

## ప్రథమపరిచ్ఛేదము.

సంఖ్య. | విషయములు. | పుటసంఖ్య.

## ద్వితీయపరిచ్ఛేదము.

## తృతీయపరిచ్ఛేదము.

# చతుర్థపరిచ్ఛేదము.

ఈ తత్త్వానుసంధానగ్రంథమును

వలయువారలు ఈక్రిందివిలాసమునకు వ్రాసికొని పొందవచ్చును.

క్రయము. రు. 4-0-0.

వాల్యూపేబిల్ సహా ,, రు. 4-5-0.

ఇట్లు

దే - ఆదినారాయణరెడ్డి

పే - కృష్ణారెడ్డి

మరుదాడు పోష్టు,

వందవాసి తాలూకా,

నార్తార్కాడు జిల్లా.

ఓం తత్ సత్.

గణేశ్వరస్తుతి.

కారణం ఖాదిజగతా మాగమార్థ మనాగసమ్
వారణానన మాత్మాన మద్వయం ప్రణతోఽస్మ్యహమ్.

పరబ్రహ్మస్తుతి.

అచిన్త్యావ్యక్తరూపాయ నిర్గుణాయ గుణాత్మనే
సమస్తజగదాధార మూర్తయే బ్రహ్మణే నమః.

శ్రీరామచంద్రస్తుతి

శ్రీరామం సరసీరుహాక్ష మమలం దూర్వాఙ్కురశ్యామలం
విద్యుత్కోటినిభప్రభామ్బరధరం పీఠాసనాధిష్ఠితమ్
వామాఙ్కే పరిసంస్థితాం జనకజా మాలిఙ్గ్య తాం బాహునా
తత్త్వం చాపరపాణినా మునిగణా నాజ్ఞాపయన్తం భజే.

శ్రీశంకరాచార్యస్తుతి.

నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తించ తత్పుత్రపరాశరంచ
వ్యాసం శుకం గౌడపదం మహాన్తం గోవిన్దయోగీన్ద్ర మథాస్య శిష్యమ్
శ్రీశఙ్కరాచార్య మథాస్య పద్మపాదంచ హస్తామలకంచ శిష్యమ్
తం తోటకం వార్తికకార మన్యా నస్మద్గురూన్ సన్తత మానతోఽస్మి.

శ్రీదక్షిణామూర్తిస్తుతి.

మౌనవ్యాఖ్యాప్రకటితపరబ్రహ్మతత్త్వం యువానం
వర్షిష్ఠాన్తేవసదృషిగణై రావృతం బ్రహ్మనిష్ఠైః
ఆచార్యేన్ద్రం కరకలితచిన్ముద్ర మానన్దమూర్తిం
స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తి మీడే.

శ్రీసద్గురుస్తుతి.

నిత్యానన్దం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.

సహనావవతు । సహనౌ భునక్తు । సహవీర్యంకరవావహై
తేజస్వి నావధీత మస్తు మా విద్విషావహై, ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.



శ్రీం తత్ సత్.

శ్రీగణేశాయ నమః, శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

శ్రీశంకరాచార్యేభ్యో నమః, శ్రీకాశీవిశ్వేశ్వరాయ నమః.

# తత్త్వానుసంధానము

## ప్రథమపరిచ్ఛేదము.

### మంగళాచరణము.

శ్లో. శ్రీగురుచరణద్వన్ద్వం నమో వ్యాసముఖా న్మునీన్
విఘ్నహర్తౄ న్గణేశాదీన్ పండితాంశ్చ విమత్సరాన్.
నత్వా ఽథ శంకరాచార్యముఖ్యాన్ సర్వా న్గురూనపి
తత్త్వానుసన్ధానగ్రన్థం వర్ణయామి యథామతి.

### ప్రథమశ్లోకతాత్పర్యము.

గురువుయొక్క పాదద్వయమును శ్రీవ్యాసవసిష్ఠసనకాదిసర్వమునీశ్వరులను విఘ్నముల ధ్వంసముఁజేయునట్టి శ్రీగణేశ్వరుఁడు శ్రీమహాదేవుఁడు శ్రీవిష్ణువు బ్రహ్మ సూర్యుఁడు దేవి మొదలగుసర్వదేవతలను మత్సరాదిసర్వదోషరహితపండితజనులను స్తుతించుచున్నాము.

### ద్వితీయశ్లోకతాత్పర్యము.

శ్రీమహాదేవునియొక్క అవతారస్వరూపులైన శ్రీశంకరాచార్యులును వారి శిష్యప్రశిష్యాదిసంప్రదాయమునందుండు శ్రీసురేశ్వరాచార్యులు శ్రీపద్మపాదాచార్యులు శ్రీతోటకాచార్యులు శ్రీహస్తామలకాచార్యులు శ్రీసర్వజ్ఞమహామునులు శ్రీచిత్సుఖాచార్యులు మొదలగువృద్ధులైనమహాత్ములనందఱను నమస్కరించి నేను ఈ ప్రాకృతతత్త్వానుసంధాననామగ్రంథమును నాబుద్ధికి గోచరించినంతవఱకు వ్రాయుచున్నాను.

ఇఁక సంస్కృతతత్త్వానుసంధానగ్రంథమును రచియించిన శ్రీమహాదేవసరస్వతి ఆగ్రంథము నిర్విఘ్నముగా సమాప్తినొందుటకై చేసినట్టిమంగళాచరణమును ఇచ్చట వ్రాయుచున్నాను.—

# ప్రథమపరిచ్ఛేదము.

శ్లో. బ్రహ్మాహం యత్ప్రసాదేన మయి విశ్వం ప్రకల్పితమ్
శ్రీమత్స్వయంప్రకాశాఖ్యం ప్రణౌమి జగతాం గురుమ్.

శ్లో. దేహోనాహం నాహం శ్రోత్రవాగాదికాని
నాహం బుద్ధిర్నాహ మధ్యాసమూలమ్
నాహం సత్యానన్దరూపశ్చిదాత్మా
మాయాసాక్షీ కృష్ణ ఏవాహ మస్మి.

ఇఁక ఈరెండుశ్లోకములలో ప్రథమశ్లోకార్థమును నిరూపించుచున్నాము.—

ఏగురువుయొక్క ప్రసాదముచే నేను బ్రహ్మస్వరూపుఁడనై యున్నాఁడనో ఈసర్వవిశ్వమును నాయందు కల్పితముగా — మిథ్యాభూతముగా నయ్యెనో అట్టి శ్రీమత్స్వయంప్రకాశసరస్వతి యనునామము వహించి నాకు గురువై అధికారిజనరూపసర్వజగద్గురువై యుండునట్టివారిని స్తుతించుచున్నాను.

## (1) ప్రథమశ్లోకార్థ విస్తరనిరూపణము.

ఉక్తశ్లోకమునందు "బ్రహ్మాహమ్" అనువాక్యమునందుండు బ్రహ్మశబ్దముచేత మాయారహితాఖండచైతన్యమును గ్రహింపవలయును. "అహం" శబ్దముచేత స్థూలసూక్ష్మకారణాఖ్యశరీరత్రయసహితప్రత్యక్చైతన్యమును గ్రహింపవలయును. "బ్రహ్మ అహమ్" అనురెండుపదములకు సామానాధికరణ్య మున్నది. పదములయొక్క సామానాధికరణ్యము అర్థముయొక్క అభేదస్థలమునందే ప్రతీత మగుచున్నది. అందువలన "బ్రహ్మాహమ్" అనువాక్యముచేత గ్రంథకర్తచే "తత్త్వమసి. అహం బ్రహ్మాస్మి" ఇత్యాదిమహావాక్యములకు అర్థమైనబ్రహ్మాత్మలయొక్క అభేదమే ఈతత్త్వానుసంధానప్రకరణమునకు విషయము మని సూచింపఁబడినది. ఆబ్రహ్మాత్మలయొక్క అభేదజ్ఞానముచేత నజ్ఞాననివృత్తిద్వారమున ఏపరమానందప్రాప్తి యున్నదో అది ఈగ్రంథమునకు ప్రయోజన మని సూచింపఁబడినది. ఆపరమానందమును పొందు నిచ్ఛతోఁ గూడిన వివేకాదిచతుష్టయసాధనసంపన్నపురుషుఁడు ఈగ్రంథమునకు అధికారి యని సూచింపఁబడినది. విషయగ్రంథాదులకు పరస్పరప్రతిపాద్యప్రతిపాదకభావాదిరూపసంబంధములును సూచింపఁబడినవి. అది యెట్లనఁగా, బ్రహ్మాత్మలయొక్క యేకస్వరూపవిషయమునకును గ్రంథమునకును ప్రతిపాద్యప్రతిపాదకభావసంబంధ మున్నది. ఈవేదాంతగ్రంథము ప్రతిపాదకము, తదుక్తవిషయము ప్రతిపాద్యము, ఏది ప్రతిపాదనము చేయునది యగునో అది ప్రతిపాదక మని చెప్పఁబడును,

ఏది ప్రతిపాదనము చేయుటకు యోగ్యమగునో అది ప్రతిపాద్యమని చెప్పఁబడును. అధికారికిని ఫలమునకును ప్రాప్యప్రాపకభావసంబంధ మున్నది. అజ్ఞాననివృత్త్యుపలక్షితపరమానందప్రాప్తిరూపఫలము ప్రాప్యము, ఉక్తాధికారి ప్రాపకుఁడు, ఏవస్తువు పొందుటకు యోగ్యమైనదగునో ఆవస్తువు ప్రాప్యమని చెప్పఁబడును, ఏ పురుషుఁడు ఆవస్తువును పొందుచున్నాఁడో వాఁడు ప్రాపకుఁడని చెప్పఁబడును. మఱియు అధికారికిని విచారమునకును కర్తృకర్తవ్యభావసంబంధ మున్నది. ఉక్తాధికారి కర్త, విచారము కర్తవ్యము, చేయువాఁడు కర్తయనియును చేయఁదగిన యర్థము కర్తవ్యమనియును చెప్పుదురు. జ్ఞానమునకును గ్రంథమునకును జన్యజనకభావసంబంధ మున్నది. విచారద్వారమున గ్రంథము జ్ఞానమునకు జనకము, అజ్ఞానము జన్యము, ఉత్పత్తి చేయుదానిని జనక మందురు, ఉత్పన్నమగుకార్యమును జన్య మందురు. ఇట్లు * అన్యసంబంధములను తెలియవలయును. విషయము, ప్రయోజనము, అధికారి, సంబంధము అను నీయనుబంధచతుష్టయము గ్రంథావలోకనము చేయువివేకులయొక్క ప్రవృత్తికి హేతువగుచున్నది. అనఁగా అనుబంధచతుష్టయమును తెలిసియే బుద్ధిమంతులగుపురుషులు గ్రంథమునందు ప్రవర్తించుచున్నారు. ఈకారణముచేతనే గ్రంథకర్తవలన "బ్రహ్మాహమ్" అను వచనముచేత సూచింపఁబడిన యీయనుబంధచతుష్టయము ఇచ్చట స్పష్టముగా నిరూపింపఁబడినది. మఱియు గ్రంథకర్తచే "బ్రహ్మాహమ్" అనువచనముచేత సాక్షాత్తుగా గ్రంథము నిర్విఘ్నముగా పరిసమాప్తి నొందుటకొఱకు తత్త్వానుసంధానరూపమంగళాచరణమే చెప్పఁబడినది. ఇచ్చట బ్రహ్మాత్మలయొక్క యేకత్వమే తత్త్వము, ఆతత్త్వముయొక్క స్మరణమే తత్త్వానుసంధానము.

శంక:—తత్త్వానుసంధానము మంగళాచరణరూప మనుటయందు ప్రమాణ మేమి?

సమాధానము:—వ్యాసాదిమునులచేత స్మృతివచనములయందు ఆపరమాత్మయొక్క స్మరణమునకు మంగళాచరణరూపత్వము చెప్పఁబడి యున్నది.

అందు స్మృతి.—

స్మృతే సకలకల్యాణభాజనం యత్ర జాయతే
పురుషం తమజం నిత్యం వ్రజామి శరణం హరిమ్.

* ఇచ్చట అన్యశబ్దముచేత శ్రవణాదిసాధనముయొక్కయు మఱియు మోక్షముయొక్కయు సాధ్యసాధనభావము ఇత్యాదిసంబంధములను తెలియవలయును.

భావము॥ ఏపురుషుఁడు ఏహరిని స్మరణ చేయఁగా సర్వకల్యాణములకు భాజన * మగుచున్నాఁడో అట్టి జన్మరహితుఁడై నిత్యుఁడగుహరిని శరణముగా పొందుచున్నాను.

అన్యస్మృతి.—

సర్వదా సర్వకార్యేషు నాస్తి తేషా మమఙ్గళమ్
యేషాం హృదిస్థో భగవాన్ మఙ్గలాయతనం హరిః.

భావము॥ ఏపురుషులహృదయమునందు సర్వమంగళములకు ఆశ్రయభూతుఁడైనభగవంతుఁడగుహరి యున్నాఁడో ఆపురుషులకు ఏకాలమునందును ఏకార్యమందును అమంగళము లేదు. మఱేమనఁగా సర్వకాలములయందును సర్వకార్యములయందును మంగళమే యున్నది.

అన్యస్మృతి.—

అశుభాని నిరాచష్టే తనోతి శుభసన్తతిమ్
స్మృతిమాత్రేణ యత్పుంసాం బ్రహ్మ తన్మంగళం విదుః.

భావము॥ ఏబ్రహ్మము తనస్మరణమాత్రముచేత ఈయధికారి పురుషులయొక్క సర్వాశుభముల నివృత్తిఁ జేయునదియును సర్వశుభములను విస్తరిల్లఁ జేయునదియు నగుచున్నదో ఆబ్రహ్మమును వేదవేత్తలగుపురుషులు మంగళరూపముగా తెలియుచున్నారు.

అన్యస్మృతి.—

హరి ర్హరతి పాపాని దుష్టచిత్తై రపి స్మృతః
అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః.

భావము॥ ఎట్లు ఇచ్ఛ లేక స్పృశింపఁబడినను అగ్ని దహించుచున్నదో, అట్లు దుష్టచిత్తులగుపురుషులు స్మరణము చేసినను హరి వారిపాపముల నాశముఁ జేయుచున్నాఁడు.

ఇత్యాదిస్మృతివాక్యములు పరమాత్మస్మరణరూప తత్త్వానుసంధానమునందు మంగళాచరణరూపత్వమే చెప్పుచున్నవి. అందువలన బ్రహ్మాహమ్మను తత్త్వానుసంధానమునందు మంగళాచరణరూపత్వము సంభవించుచున్నది.

శంక:—బ్రహ్మాహమ్మనువాక్యముచేతఁ జెప్పఁబడియుండు బ్రహ్మాత్మలయొక్క ఏకత్వము ఘటిల్లదు. ఏల యన, బ్రహ్మము జీవాత్మ ఇవి రెండును పరస్పర

* స్థాన.

విరుద్ధధర్మములతో యుక్తములై యున్నవి. ఏపదార్థములు పరస్పరవిరుద్ధధర్మసహితము లగునో, ఆపదార్థములకు ఏకత్వము కలుగదు. ఉష్ణస్పర్శము గల యగ్నికిని శీతస్పర్శము గల జలమునకును ఎట్లు ఏకత్వము సంభవింపదో, అట్లు జీవునకును బ్రహ్మమునకును ఏకత్వము సంభవింపదు. "యః సర్వజ్ఞః సర్వవిత్" ఇత్యాది శ్రుతిస్మృతివచనములవలన బ్రహ్మము జగత్కల్పనకు అధిష్ఠానరూపముగాను సర్వజ్ఞరూపముగాను తెలియఁబడు చున్నది. "అనీశయా శోచతి ముహ్యమానః" ఇత్యాదిశ్రుతిస్మృతివచనములవలన జీవాత్మ ఆబ్రహ్మముకన్న విపరీతమైన అల్పజ్ఞత్వాదిధర్మము గలవాఁడుగా తెలియఁబడు చున్నాఁడు. మఱియు, నేను బ్రహ్మముకానను ప్రత్యక్షానుభవము సర్వత్ర కలుగుచున్నది. ఆయనుభవమును జీవబ్రహ్మల యొక్క భేదమునే స్థాపించు చున్నది. అందువలన "బ్రహ్మాహమ్" అనువచనముచేత చెప్పఁబడిన జీవబ్రహ్మముల యేకత ఘటిల్లదు

సమాధానము:—ఇట్లు పూర్వవాది శంకించినయెడల దానికి వక్ష్యమాణ సమాధాన మున్నది. "మయి విశ్వం ప్రకల్పితమ్" — అంతఃకరణోపలక్షిత సాక్ష్యాత్మస్వరూపుఁడ నగు నాయందు పర్వతనద్యాదిబ్రహ్మాండపర్యంతభేదము గల సర్వజగత్తును కల్పితమై—అధ్యస్తమై యున్నది. ఇచ్చట తాత్పర్యమే మనఁగా, అహంశబ్ద వాచ్యార్థమైనజీవునకు బ్రహ్మశబ్దవాచ్యార్థముతో విలక్షణత యున్నను, అహంశబ్దలక్ష్యార్థమైనయంతఃకరణాదిసాక్షి ప్రత్యగాత్మయై యున్నాఁడు. ఆప్రత్యగాత్మకు మాయోపలక్షితబ్రహ్మముతో నామమాత్రమే భేదము. వాస్తవమునందు ఆరెండులక్ష్యార్థములకు అభేదమే యున్నది. అందువలన ఎట్లు బ్రహ్మమునందు జగత్కల్పనాఽధిష్ఠానత యున్నదో అట్లు ప్రత్యగాత్మయందును జగత్కల్పనాఽధిష్ఠానత సంభవించు చున్నది. అందువలన పూర్వోక్తార్థమునకు విరోధము లేనందున ఆలక్ష్యార్థములకు రెంటికిని ఏకత ఘటిల్లును. ఈయర్థము శ్రుతియందును చెప్పఁబడి యున్నది.

శ్రుతి.—

మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితమ్
మయి సర్వం లయం యాతి తద్బ్రహ్మాఽద్వయ మస్మ్యహమ్.

భావము॥ ఈసర్వజగత్తును ప్రత్యగాత్మ యగు నాయందే ఉత్పత్తిని, నాయందే స్థితిని, నాయందే లయమును పొందు చున్నది. అందువలన బ్రహ్మమువలె సర్వజగత్కల్పనకు అధిష్ఠాన మగుటచే ప్రత్యగాత్మ యగు నేను అద్వితీయబ్రహ్మరూపముగానే యున్నాను. ఈశ్రుతి అంతఃకరణోపలక్షితప్రత్యక్సాక్ష్యాత్మయందు

సర్వజగత్కల్పనను చూపి ఆప్రత్యగాత్మకు బ్రహ్మముతో అభేదమును బోధించు చున్నది. అందువలన «బ్రహ్మాహమ్» అనువాక్యముచేత గ్రంథకర్తచే ఏజీవబ్రహ్మములయొక్క అభేదము చెప్పఁబడినదో అది సర్వప్రకారములచేతను అవిరుద్ధము.

మఱియు «మయి విశ్వం ప్రకల్పితమ్» అనువాక్యముచేత గ్రంథకర్తచే ప్రపంచమునందు మిథ్యాత్వముగూడ సూచింపఁబడినది. ఆప్రపంచముయొక్క మిథ్యాత్వము అనేకశ్రుతులవలన సిద్ధించుటయే గాక అనుమానప్రమాణమువలనను సిద్ధించు చున్నది. ఆయనుమాన మెట్లనఁగా.

వ్యావహారికః ప్రపంచః మిథ్యా, దృశ్యత్వాత్, శుక్తిరూప్యవత్.

భావము॥ ఈవ్యావహారికప్రపంచము మిథ్య, దృశ్యరూప మగుటవలన, ఏయేపదార్థము దృశ్య మగుచున్నదో ఆయాపదార్థము మిథ్యయే యగును. ఉదాహరణము—శుక్తియందు ప్రతీత మగురజతము దృశ్య మగుటవలన మిథ్యయే యగుచున్నది.

మఱియు, భేదవాది పూర్వము నేను బ్రహ్మము కానను ఏజీవబ్రహ్మభేదగ్రాహకప్రత్యక్షము చెప్పెనో దానిగుఱించి యావాది నడుగవలసిన దేమనఁగా, నీవు చెప్పినప్రత్యక్షము అంతఃకరణాదివిశిష్టాత్మయందు బ్రహ్మభేదమును గ్రహించు చున్నదా? లేక, శుద్ధాత్మయందు బ్రహ్మభేదమును గ్రహించు చున్నదా? ఆవాది ప్రథమపక్ష మంగీకరించిన యెడ, అది మాకును ఇష్టమై యున్నది. ఎట్లన ఆవిశిష్టాత్మకు బ్రహ్మముతో అభేదము మేమును అంగీకరింపము. ఆవాది ద్వితీయపక్ష మంగీకరించిన యెడ, అది ఘటిల్లదు. ఏల యన, శుద్ధాత్మ అతీంద్రియము, అనఁగా ఇంద్రియజన్యజ్ఞానమునకు విషయము గానిది. అట్టిశుద్ధాత్మను గ్రహించుటకొఱకు చక్షురాదీంద్రియములయొక్క ప్రవృత్తి యెప్పుడును కలుగదు. భేదముయొక్క ధర్మియైనశుద్ధాత్మ ఇంద్రియములచేత గ్రహింపఁబడకుండఁగా ఆశుద్ధాత్మ నాశ్రయించియుండు బ్రహ్మభేదము ఇంద్రియములకు ఎట్లు గ్రాహ్య మగును? అనఁగా, గ్రహింప శక్యము గాదు. ఏల యన, ధర్మియొక్కయు ప్రతియోగియొక్కయు జ్ఞానము లేక భేదముయొక్క జ్ఞానము కలుగదు. మఱి యే మనఁగా, ధర్మిప్రతియోగులయొక్క జ్ఞానము కలిగియే భేదముయొక్క జ్ఞానము కలుగు చున్నది. ఉదాహరణము—«ఘటః పటో న» అనుప్రతీతిచేత ఘటమునందు ప్రతీత మగుపటభేదమునకు ఆఘటము ధర్మి యగు చున్నది. పటము ప్రతియోగి యగుచున్నది. ధర్మి యగుఘటముయొక్కయు ప్రతియోగి యగు పటముయొక్కయు జ్ఞానము కలిగియే ఆఘటమునందు పటభేద

జ్ఞానము కలుగుచున్నది. ఈలాగుననే నీవు శుద్ధాత్మయం దంగీకరించి యుండెడు బ్రహ్మాభేదమునకు ఆశుద్ధాత్మ ధర్మి యగును. ఆబ్రహ్మము ప్రతియోగి యగును. ఆధర్మి ప్రతియోగులయొక్క జ్ఞానము లేక ఆభేదముయొక్క జ్ఞానము కలుగనేరదు. ఆభేదముయొక్క శుద్ధాత్మరూపధర్మియును బ్రహ్మరూపప్రతియోగియు నగు రెండును అతీంద్రియములు. ఆధర్మి ప్రతియోగులయొక్క ప్రత్యక్షము లేక ఆభేదముయొక్క ప్రత్యక్ష మెట్లు కలుగును? అందువలన జీవబ్రహ్మముల భేదమును గ్రహించునది ప్రత్యక్షప్రమాణమై యున్నది యను వాదియొక్క వచనము కేవలమనోరథమాత్రమై యున్నది.

మఱియు, విచారించి చూచినయెడల ఏభేదమునకును ఎచ్చటను స్థితి సంభవింపదు. ఎట్లన, ఏవాది ఆభేదమును అంగీకరించినాఁడో ఆవాదిని ఇట్లడుగ వలయును. ఆభేదము అభిన్నధర్మియం దున్నదా? లేక భిన్నధర్మియం దున్నదా? ఇచ్చట భేదరహితము అభిన్న మనఁబడును. భేదసహితము భిన్న మనఁబడును.

ఆవాది ప్రథమపక్ష మంగీకరించినయెడల ఒకటి వ్యాఘాతదోషము ప్రాప్తమగుచున్నది. ఎట్లన పరస్పరవిరుద్ధధర్మములకు ఏకాధికరణమునందు సముచ్చయము చెప్పుట వ్యాఘాత మనఁబడును. ఈప్రసంగమునందు భేదరహితత్వము భేదము ఈరెండును పరస్పరవిరుద్ధధర్మములు. అది యెట్లన, ఎచ్చట భేద మున్నదో అచ్చట భేదరహితత్వ ముండదు, ఎచ్చట భేదరహితత్వ మున్నదో అచ్చట భేద ముండదు. ఏకాధికరణమునందు పరస్పరవిరుద్ధధర్మములకు సముచ్చయ మంగీకరించుటవలన వ్యాఘాతదోషము స్పష్టము. మఱియొకటి భేదరహితధర్మియందు భేదమును గ్రహించునట్టి ప్రత్యక్షజ్ఞానమునందు భ్రమరూపత్వము ప్రాప్తమగుచున్నది. అందువలన అభిన్నధర్మియందు భేదము వర్తించు ననుట ఘటిల్లదు.

ఆరెండుదోషముల నివృత్తిచేయుటకొఱకు ఆవాది ఆభేదము భిన్నధర్మియం దున్న దను ద్వితీయపక్ష మంగీకరించినయెడల వాని నిట్లడుగవలయును. ఆబేదము తనచేత భిన్నము చేయఁబడినధర్మియందు తాను * ఉన్నదా? లేక, వేఱొకభేదముచేత భిన్నము చేయఁబడినధర్మియందు ఆభేద మున్నదా? ఆవాది ప్రథమపక్ష మంగీకరించినయెడల ఆత్మాశ్రయదోషము ప్రాప్తమగును. ఎట్లన, తన యుత్పత్తియందు తనయపేక్ష, లేక, తనస్థితియందు తనయపేక్ష, లేక, తనజ్ఞానమునందు తనయపేక్ష, ఆత్మాశ్రయ మనఁబడును. ఈప్రసంగమునందు స్వవిశిష్టధర్మి

* ఆభేదము.

యందు స్వస్థితిని అంగీకరించుటవలన తనస్థితియందు తనయపేక్ష యనునాత్మాశ్రయదోషము స్పష్టము. అందువలన స్వవిశిష్టధర్మియందు ఆభేద ముండుట ఘటిల్లదు. మఱియు ఆత్మాశ్రయదోషము నివృత్తి చేయుటకొఱకు ఆవాది వేఱొకభేదముచేత భిన్నము చేయఁబడినధర్మియందు ఆభేద మున్న దను ద్వితీయపక్ష మంగీకరించినయెడల ఆవాదిని ఇట్లడుగవలయును. ఆద్వితీయభేదము అభిన్నధర్మియం దున్నదా? లేక భిన్నధర్మియం దున్నదా? ఆవాది ప్రథమపక్ష మంగీకరించినయెడల పూర్వమువలె మరల వ్యాఘాతదోషము ప్రాప్త మగును. ఆవ్యాఘాతదోషము నివృత్తి చేయుటకొఱకు ఆవాది ద్వితీయపక్ష మంగీకరించినయెడల వానిని ఇట్లడుగవలయును. ఆద్వితీయభేదము తనచే భిన్నము చేయఁబడినధర్మియందు తా నున్నదా? లేక ప్రథమభేదముచే భిన్నము చేయఁబడినధర్మియం దాద్వితీయభేద మున్నదా? లేక వేఱొకతృతీయభేదముచే భిన్నము చేయఁబడినధర్మియం దాద్వితీయభేద మున్నదా? అందు ప్రథమపక్షమునం దైననో పూర్వమువలె మరల ఆత్మాశ్రయదోషము ప్రాప్త మగును. మఱియు ద్వితీయపక్షమునందు అన్యోన్యాశ్రయదోషము ప్రాప్త మగును. ఎట్లన, రెండుపదార్థములకు తమయుత్పత్తియందు, లేక, తమస్థితియందు, లేక, తమజ్ఞానమునందు పరస్పరాపేక్షకు అన్యోన్యాశ్రయ మని పేరు. ఈప్రసంగమునందు ప్రథమభేదమునకు తనస్థితికొఱకు ద్వితీయభేదముయొక్క యపేక్ష కలుగుచున్నది. ఆద్వితీయభేదమునకు తనయొక్కస్థితికొఱకు ప్రథమభేదముయొక్క యపేక్ష కలుగుచున్నది. అందువలన ప్రథమభేదవిశిష్టధర్మియం దాద్వితీయభేదముయొక్కస్థితిని అంగీకరించుటయందు ఆయన్యోన్యాశ్రయదోషము స్పష్టము. మఱియు, ఆయన్యోన్యాశ్రయదోషము నివృత్తి చేయుటకొఱకు ఆవాది తృతీయపక్ష మంగీకరించినయెడల, అనఁగా, వేఱొకతృతీయభేదముచేత భిన్నము చేయఁబడినధర్మియం దాద్వితీయభేద మున్న దను తృతీయపక్షమును ఆవాది యంగీకరించినయెడల, వానిని ఇట్లడుగవలయును. ఆతృతీయభేదము అభిన్నధర్మియం దున్నదా? లేక భిన్నధర్మియం దున్నదా? అందు ప్రథమపక్షమం దైననో, పూర్వమువలె మరల వ్యాఘాతదోషము ప్రాప్త మగును. ఆదోషము నివృత్తి చేయుటకొఱకు ఆవాది ద్వితీయ మగుభిన్నపక్ష మంగీకరించినయెడల ఆవాదిని ఇట్లడుగవలయును. ఆతృతీయభేదము తనచే భిన్నము చేయఁబడినధర్మియందు తా నున్నదా? లేక ద్వితీయభేదముచేత భిన్నము చేయఁబడినధర్మియందు ఆతృతీయభేద మున్నదా? లేక, ప్రథమభేదముచేత భిన్నము చేయఁబడినధర్మియందు

ఆతృతీయభేద మున్నదా ? లేక, వేఱొక చతుర్థభేదము చేత భిన్నము చేయఁబడిన ధర్మియం దాతృతీయభేద మున్నదా? అందు ప్రథమపక్షమునం దైననో పూర్వమువలె మరల ఆత్మాశ్రయదోషము ప్రాప్త మగును, ద్వితీయపక్షమందును పూర్వమువలె మరల అన్యోన్యాశ్రయదోషము ప్రాప్త మగును, తృతీయపక్షమునందు చక్రికాదోషము ప్రాప్త మగును. ఎట్లన, ప్రథమముయొక్క యపేక్ష ద్వితీయమునకును ద్వితీయముయొక్క యపేక్ష తృతీయమునకును తృతీయము మొదలగుదానికి మరల ప్రథమముయొక్క యపేక్షయుఁ గలుగుట చక్రిక యనఁబడును ఈ ప్రసంగమునందు ప్రథమభేదమునకు తనస్థితియందు ద్వితీయభేదముయొక్క యపేక్షయును ద్వితీయభేదమునకు తనస్థితియందు తృతీయభేదముయొక్క యపేక్షయును ఆతృతీయభేదమునకు తనస్థితియందు మరల ప్రథమభేదముయొక్క యపేక్షయుఁ గలదు. ఈరీతిగానే చతుర్థము పంచమము మొదలగుదానికి మరల ప్రథమముయొక్క యపేక్షచేత చక్రికాదోషప్రాప్తి తెలియవలయును. ఆచక్రికాదోషము నివృత్తి చేయుటకొఱకు ఆ వాది చతుర్థపక్ష మంగీకరించినయెడల, అనఁగా, ఆతృతీయభేదము వేఱొకచతుర్థభేదముచేత భిన్నము చేయఁబడినధర్మియం దున్న దను చతుర్థపక్ష మంగీకరించినయెడల అనవస్థాదోషము ప్రాప్త మగును. ఎట్లన, ఆచతుర్థభేదముగూడ పూర్వము చెప్పఁబడిన వ్యాఘాతమును ఆత్మాశ్రయమును అన్యోన్యాశ్రయమును చక్రికాదోషమును ప్రాప్తించుటవలన అభిన్నధర్మియం దైనను స్వవిశిష్టధర్మియం దైనను తృతీయభేదవిశిష్టధర్మియం దైనను ద్వితీయభేదవిశిష్టధర్మియం దైనను ప్రథమభేదవిశిష్టధర్మియం దైనను ఉండఁజాలదు. మఱేమనఁగా, వేఱొకపంచమభేదముతోఁ గూడిన ధర్మియందే యుండవలయును. ఆపంచమభేదము మఱియు షష్ఠభేదవిశిష్టధర్మియందే యుండవలయును. ఈరీతిగా ఉత్తరోత్తరభేదములయొక్క ధార నంగీకరించుటయందు అనవస్థాదోషము ప్రాప్త మగును. పర్యవసానరహితముగా పూర్వపూర్వమునకు ఉత్తరోత్తరముయొక్క యపేక్ష అనవస్థాదోష మనఁబడును.

వ్యాఘాతాత్మాశ్రయాన్యోన్యాశ్రయచక్రికానవస్థ లనుదోషములయొక్క సంస్కృతలక్షణము న్యాయప్రకాశమునందు షష్ఠపరిచ్ఛేదమున తర్కనిరూపణమునందు మాచేత విస్తరముగా నిరూపింపఁబడి యున్నది. దానిని తెలియఁగోరువారు అచ్చట నెఱుఁగవలయును.

ఈప్రకారముగా జీవబ్రహ్మభేదము అసంభవ మగుటవలన «బ్రహ్మాహమ్» అనువచనముచేత తత్త్వానుసంధానరూపమంగళాచరణము సంభవించు చున్నది.

శంక:— "బ్రహ్మాహమ్" అను తత్త్వానుసంధానరూపమంగళాచరణము చేతనే గ్రంథము నిర్విఘ్నముగా పరిసమాప్తి నొందుచుండఁగా గ్రంథకర్త "గురుం ప్రణౌమి" [illegible] గురుస్తుతి యేల చేయవలయును?

సమాధానము:— పురుషునకు ఆతత్త్వానుసంధానము బ్రహ్మవేత్త యగు గురువునందు భక్తిలేక సంప్రాప్తము కాదు. మరేమనఁగా గురుభక్తివలననే ఆ తత్త్వానుసంధానము సంప్రాప్తమగుచున్నది. ఈయర్థము శ్రుతిసిద్ధమై యున్నది.

శ్రుతి.—

యస్య దేవే పరా భక్తి ర్యథా దేవే తథా గురౌ
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః.

భావము॥ ఏయాధికారిపురుషునకు పరమాత్మదేవునియందు పరమభక్తియును, ఎట్లు ఆపరమాత్మదేవునియందు పరమభక్తి యున్నదో అట్లు బ్రహ్మవేత్తయగు గురువునందు పరమాభక్తియును, ఎప్పుడు కలుగుచున్నదో అప్పుడే మహాత్ముఁడగు నాయధికారిపురుషునకు ఈవేదాంతప్రతిపాదితము లగు జీవబ్రహ్మైకత్వాదిరూపార్థములు బుద్ధియందు ప్రకాశించుచున్నవి. గురుభక్తిరహితపురుషునకు వేదాంతప్రతిపాదితార్థములు ఏకాలమునందును ప్రకాశింపవు. ఈశ్రుతి గురుభక్తిని తత్త్వానుసంధాప్రాప్తికి అంతరంగసాధనముగా ప్రతిపాదించుచున్నది. ఈకారణముచేతనే గ్రంథకర్త గురువిషయకస్తుతిరూపభక్తిని ఇచ్చటఁ జేసెను. ఇది ప్రథమశ్లోకవ్యాఖ్యానము.

ఇఁక ద్వితీయశ్లోకార్థమును నిరూపించుచున్నాము.—

దేహము నేను కాను, శ్రోత్రాదు లగు నింద్రియములు నేను కాను. బుద్ధియును నేను కాను. అధ్యాసమూలమును నేను కాను. సత్యానందచిదాత్మకమై మాయాసాక్షిగా నుండు పరబ్రహ్మమే నేను.

(*) (2) ఇఁక ద్వితీయశ్లోకార్థవిస్తరనిరూపణము. (*)

ప్రథమశ్లోకమునందు "బ్రహ్మాహమ్" అనువాక్యముచేత అనుసంధింపఁబడిన బ్రహ్మాత్మతత్త్వమునే ఈద్వితీయశ్లోకమునందు అహంశబ్దార్థవివేచనపూర్వకముగా ఇష్టదేవతావాచకమైనకృష్ణశబ్దమును చెప్పి మరల అనుసంధించుచున్నాఁడు —"దేహో నాహమ్" భావము॥ స్వప్నమునందు ఈస్థూలదేహము ప్రతీతమగుటలేదు నేనో ఆస్వప్నమునందును సాక్షిరూపమునఁ బ్రకాశమానుఁడనై యున్నాను. అందువలన నేను స్థూలదేహము కాను.

## (౩) స్థూలదేహము ఆత్మ కాదనువిషయమునందు శంకాసమాధానములు.

శంక:—“అహం స్థూలః, అహం కృశః, అహం మనుష్యః” అను ననుభవము సర్వప్రాణులకును గలుగుచున్నది. ఆయనుభవముచేత స్థూలదేహమే ఆత్మ యని సిద్ధించుచున్నది. ఎట్లన, సర్వశాస్త్రకారులయొక్క మతమునందు అహంశబ్దమునకు అర్థమును అహంప్రతీతికి విషయమును ఆత్మయే యగును. ఉక్తరీతిగా అహంప్రతీతికి విషయత స్థూలత్వ కృశత్వ మనుష్యత్వాదిధర్మవిశిష్ట మైనస్థూలదేహమునందే ప్రతీత మగుచున్నది. ఆస్థూలదేహమునకు భిన్నముగా నేయాత్మయుఁ బ్రతీత మగుట లేదు. మఱియు స్వప్నమునందును “అహం స్థూలః” అను ననుభవము సర్వలోకులకును గలుగుచున్నది. అందువలన ఈస్థూలదేహమే ఆత్మయై యున్నది.

సమాధానము:—ఈస్థూలశరీరముయొక్క యుత్పత్తివినాశములు సర్వలోకులకును బ్రత్యక్షముగాఁ బ్రతీతము లగుచున్నవి. ఏవస్తువు ఉత్పత్తివినాశసహితమో ఆవస్తువు అనాత్మయె యగును. ఎట్లు ఘటాదివస్తువులు ఉత్పత్తివినాశసహితము లగుటవలన అనాత్మయే యగునో అట్లు ఈస్థూలశరీరమును ఉత్పత్తివినాశసహిత మగుటవలన అనాత్మయే యగును. మఱియు, ఈస్థూలశరీరమునే ఆత్మగా నంగీకరించినయెడల కృతనాశము అకృతాభ్యాగమము నను రెండుదోషములు ప్రాప్తించును. అందు చేయఁబడినపుణ్యపాపకర్మములకు సుఖదుఃఖరూపఫలభోగము లేకయే నాశ మగుట కృతనాశ మనఁబడును. మఱియు, చేయఁబడనిపుణ్యపాపకర్మముల సుఖదుఃఖరూపఫలముయొక్క ప్రాప్తి అకృతాభ్యాగమ మనఁబడును. ఈస్థూలదేహమునే ఆత్మగా నంగీకరించినయెడల ఈదేహరూపాత్మ నాశము నొందఁగా ఆదేహమునకు వేఱైనభోక్త యగు నాత్మ లేకుండుటవలన ఏతద్దేహకృతపుణ్యపాపకర్మములకు ఫలభోగము లేకయే నాశము కలుగును. ప్రకృతమునందు నవీనోత్పన్నదేహరూపాత్మ పూర్వము ఏపుణ్యపాపకర్మములును జేసినది కాదు. దానికిని ఉత్పత్తికాలము మొదలు సుఖదుఃఖరూపఫలప్రాప్తియో కలుగుచున్నది. ఆఫలప్రాప్తి ఆపుణ్యపాపకర్మములు లేకయే కలిగినదిగా నంగీకరింపవలయును. చేయఁబడినకర్మమునకు ఫలభోగము లేకయే నాశమును చేయఁబడనికర్మమునకు ఫలప్రాప్తియు నంగీకరించుట సర్వశాస్త్రవిరుద్ధమై యున్నది. యద్యపి ప్రాయశ్చిత్తాదులచేతను తత్త్వజ్ఞానముచేతను ఆపుణ్యపాపకర్మములకు ఫలభోగము లేకయే నాశము శాస్త్రముల

యందుఁ జెప్పఁబడి యున్నది. తథాపి, ఆశాస్త్రోక్తప్రాయశ్చిత్తాద్యుపాయములు లేకయు ఫలభోగము లేకయుఁ గలుగుకర్మనాశము కృతనాశ మనఁబడును. అందువలన నీస్థూలదేహ మాత్మ కాదు.

మఱియు, ఆదేహాత్మవాది ఈస్థూలదేహాత్మయందు «స్థూలోహమ్, కృశోహమ్” ఇత్యాదిక మగు నేప్రత్యక్షానుభవమును చెప్పెనో, ఆయనుభవము «లోహితః స్ఫటికః» అను ననుభవమువలె భ్రమరూపమై యున్నది. అనఁగా, ఎట్లు «లోహితః స్ఫటికః» అను ననుభవము లోహితత్వరహిత శుక్లస్ఫటికమునందు లోహితత్వమును విషయము చేయునదై భ్రమరూప మగునో, అట్లు ఉక్తానుభవము గూడ స్థూలకృశాదిభావరహితుఁ డగునాత్మయందు స్థూలకృశాదిభావమును విషయము చేయునదై భ్రమరూపమే యగును. అందువలన ఉక్తానుభవము స్థూలదేహము ఆత్మ యని సాధించుటకు శక్తము కాదు. ఏకారణముచేత ననఁగా, యథార్థానుభవమే అర్థమునకు సాధకమై యున్నది. మఱియు ఈస్థూలదేహమునకు భిన్నముగా ఏయాత్మయును ప్రతీత మగుట లేదను దేహాత్మవాదివచనము అసంగతము. ఎట్లనఁగా, «నాదేహము వ్యాధిసహితము, నాదేహము వ్యాధిరహితము» అను ననుభవము సర్వలోకులకును గలుగుచున్నది. ఈయనుభవముచేత దేహమునకు ద్రష్టయగుసాక్షియైనయాత్మ ఆదేహమునకు భిన్నుఁడుగా నున్నాఁ డని సిద్ధించుచున్నది. శ్రుతి స్మృతి ఇతిహాసము పురాణము యుక్తి విద్వాంసులయొక్క అనుభవ మను సర్వప్రమాణములచేతను ఆత్మ ఈస్థూలదేహమునకు భిన్నుఁడే యని సిద్ధ మగుచున్నది. ఈరీతిగా ననేకప్రమాణములచేత సిద్ధించియుండు నాత్మకు నిషేధము ఘటిల్లదు. మఱియు, ఆదేహాత్మవాది స్వప్నమునందును «అహం స్థూలః” అను నేయనుభవముచేత స్థూలదేహముయొక్క సిద్ధిని చెప్పెనో, అదియును అసంగతము. ఎట్లన, «అహం స్థూలః” అని స్వప్నమునందు ఏ యనుభవము కలుగుచున్నదో ఆ యనుభవము జాగ్రదవస్థయొక్క «అహం స్థూలః” అను ననుభవముచేఁ గలుగు సంస్కారమువలన జన్యమై యున్నది. అందువలన ఆ స్వాప్నానుభవము జాగ్రదవస్థయొక్క స్థూలదేహమును విషయము చేయుటలేదు. మఱి యే మనఁగా, ఆ యనుభవము స్వప్నముయొక్క వాసనామయ మగుశరీరమునే విషయము చేయుచున్నది. అట్లు గాక, ఆ స్వాప్నానుభవము జాగ్రదవస్థయొక్క స్థూలదేహమునే విషయము చేయుచున్న దనిన, కాశియందు నిద్రించినపురుషుఁడు స్వప్నమునందు రామకృతసేతువునందు రామనాథు ననుభవించినవాఁడై ఎప్పుడు జాగ్రత్తను పొందుచున్నాఁ

జో అట్టిడు ఆపురుషుఁడు ఆరామసేతువునందే యుండవలయును. కాశియం దుండుట కూడదు. అట్లు చూడఁబడుట లేదు. అందువలన స్వప్నమునందు ఈ స్థూలశరీరము నకు అభావమే యగుచున్నది. ఆత్మ యైననో ఆ స్వప్నమునందును ఆ స్వప్నపదార్థ ములకు ద్రష్టయై సాక్షిరూపమున ననుభవింపఁబడు చున్నాఁడు. అందువలన నేను స్థూలదేహము కాను అనునర్థము సంభవించు చున్నది.

## (4) ఇంద్రియము ఆత్మ కా దనుటకు శంకాసమాధానములు.

శంక:—పూర్వోక్తదోషములచేత స్థూలదేహమునకు ఆత్మత్వము సిద్ధింపక పోయినను చక్షురాదీంద్రియములే ఆత్మయై యున్నవి. ఎట్లన "అహం కాణః అహం మూకః" అను ననుభవము లోకమునందు తెలియఁబడు చున్నది. ఆయను భవముచేత కాణత్వ మూకత్వాది ధర్మవిశిష్టచక్షురాదీంద్రియములయందే ఆత్మత్వము సిద్ధ మగుచున్నది. మఱియు వేదమునందుఁ బ్రాణమునకును ఇంద్రియముల కును తమతమశ్రేష్ఠతయందు పరస్పరసంవాదము చెప్పఁబడి యున్నది. ఆపరస్పర సంవాదము చేతనములకే కలుగును. జడపదార్థములకుఁ గలుగదు. చేతనము ఆత్మయే యగును. అందువలన ఆప్రాణసంవాదశ్రుతిచేతను చక్షురాదీంద్రియములే ఆత్మ యని సిద్ధించు చున్నది. అందువలన ఇంద్రియములే ఆత్మ యగును.

సమాధానము:—ఎట్లు స్థూలదేహము ఆత్మ కాదో అట్లు చక్షురాదీంద్రియములును ఆత్మ కాదు. ఏల యన, చక్షురింద్రియముచేత నేను రూపమును జూచు చున్నాను, శ్రోత్రేంద్రియముచేత నేను శబ్దమును విను చున్నాను. అను ననుభవ మెల్లరకును గలుగు చున్నది. ఆయనుభవముచేత ఆచక్షురాదీంద్రియము లకు దర్శనాదిక్రియలనుగుఱించి కరణరూపత్వమే సిద్ధించు చున్నది. ఏయేపదార్థము క్రియనుగుఱించి కరణ మగుచున్నదో ఆయాపదార్థము అనాత్మయే యగును. ఎట్లు ఛేదనాదిక్రియను గుఱించి కరణ మగుటవలన కుఠారాదులు అనాత్మయే యగు చున్నవో అట్లు దర్శనాదిక్రియలనుగుఱించి చక్షురాదీంద్రియములును కరణ మగుట వలన అనాత్మయే యగుచున్నవి. ఈరీతిగానే యీయనుమానము బోధించు చున్నది. "ఇంద్రియాణి అనాత్మా, కరణత్వాత్, కుఠారవత్" ఎట్లు ఛేదనాదిక్రియకుఁ బురుషుఁడు కర్త యగుచున్నాఁడో, అట్లు ఆయింద్రియాత్మవాది యింద్రియరూపాత్మయే దర్శనాదిక్రియలకు కర్త యని యంగీకరింపవలయును. అట్లంగీకరించుట యత్యంత విరుద్ధ మై యున్నది. ఎట్లన. లోకమునందు ఏపదార్థము ఏక్రియకుఁ గరణ మగు చున్నదో ఆపదార్థము ఆక్రియకుఁ గర్త యగుట లేదు. మఱియు ఏ పదార్థము ఏ

క్రియకుఁ గర్త యగుచున్నదో ఆపదార్థము ఆక్రియకుఁ గరణ మగుట లేదు. మఱి యే మనఁగా, ఆకరణమును గర్తయును భిన్నభిన్నమే యగుచున్నది. ఉదాహరణము—ఛేదనరూపక్రియ ననుసరించి కరణ మగుకుఠారమునకుఁ గర్తృత్వము సిద్ధింపదు. ఛేదనరూపక్రియకుఁ గర్త యగుపురుషునియందుఁ గరణత్వము సిద్ధింపదు. మఱి యే మనఁగా, ఆకుఠారరూపకరణమును బురుషరూపకర్తయును భిన్నభిన్నమే యగుచున్నది. ఆచక్షురాదీంద్రియములకు దర్శనాదిక్రియాకరణత్వ మైననో పూర్వోక్తానుభవముచేత సిద్ధ మగుచున్నది. అందువలన, ఒకచక్షురాదీంద్రియములకే దర్శనాదిక్రియయొక్క కరణత్వమును గర్తృత్వమును రెండును అంగీకరించుట ప్రత్యక్షప్రమాణమునకు విరుద్ధమై యున్నది. ఈకారణముచేత నింద్రియము లాత్మ కాదు. మఱియు, ఏవాది యింద్రియములనే యాత్మగా నంగీకరించినాఁడో ఆవాదియొక్క మతమునందు ఒకేశరీరమునందు చక్షుశ్శ్రోత్రాదిరూపానేకాత్మలు సిద్ధ మగును. ఆచక్షుశ్శ్రోత్రాదిసర్వేంద్రియములును ఒకేపదార్థమును గ్రహించుట లేదు. ఇఁక నే మనఁగా, రూపశబ్దాదిభిన్నభిన్నపదార్థములనే గ్రహించుచున్నవి. అందువలనఁ బూర్వదిక్స్థితరూపముయొక్క దర్శనముకొఱకు చక్షురింద్రియ మీశరీరము నాపూర్వదిక్కున కాకర్షింపవలయును. పశ్చిమదిక్స్థితశబ్దమును వినుటకొఱకు శ్రోత్రేంద్రియ మీశరీరము నాపశ్చిమదిక్కున కాకర్షింపవలయును. ఈప్రకారముగా, ఇతర త్వగాదీంద్రియములును ఆయాదక్షిణాదిదిక్స్థితము లగుస్పర్శాదులను గ్రహించుటకొఱ కీ శరీరము నాయాదక్షిణాదిదిక్కుల కాకర్షింపవలయును. అందువలన, ఎట్లు అనేకగజములచే నాకర్షింపఁబడిన కదళీవృక్షము శీఘ్రమే నాశ మొందుచున్నదో, అట్లు పరస్పరవిరుద్ధాభిప్రాయము గల చక్షురాదీంద్రియములచే ఆయాదిక్కుల కాకర్షింపఁబడినదై యీశరీరముగూడ నాశము పొందవలయును. ఈకారణముచేతను ఇంద్రియము లాత్మ కాదు. మఱియు, ఒకేశరీరమునం దింద్రియరూపబహుతరాత్మల నంగీకరించినయెడలఁ బూర్వము రూపమును గ్రహించిన నేనే యిప్పుడు స్పర్శమును గ్రహించుచున్నాను అనునసుభవమునకును బాధ కలుగును. ఎట్లన, ఈయనుభవము రూపద్రష్ట యగు నాత్మయొక్కయు స్పర్శజ్ఞాత యగు నాత్మయొక్కయు నేకత్వమునే విషయము చేయుచున్నది. మీమతమునందు చక్షురింద్రియరూపాత్మయును త్వగింద్రియరూపాత్మయును ఏకము కాదు. అందువలన మీమతమునందు ఉక్తానుభవమునకు మిథ్యాత్వరూపబాధ కావలయును.

మఱియును, ఆయింద్రియాత్మవాది యింద్రియములకుఁ జేతనరూపత్వము నందు వీప్రాణసంవాదమును బ్రమాణముగాఁ జెప్పి యున్నాఁడో, ఆసంవాద మింద్రియములయొక్క యభిమానదేవతలను విషయము చేయు చున్నది. ఇంద్రియములను విషయము చేయుట లేదు. అందువలన ఆసంవాదముచేతను ఇంద్రియముల కాత్మత్వము సిద్ధింపదు. స్థూలదేహమునకువలెఁ జక్షురాదీంద్రియములకును ఉత్పత్తి వినాశములు కలుగు చున్నవి. అట్టి యుత్పత్తివినాశసహితము లగు నింద్రియములను ఆత్మ యని యంగీకరించుటయందుఁ బూర్వోక్త స్థూలశరీరాత్మవాదమునందు వలె ఇచ్చటను కృతనాశము అకృతాభ్యాగమ మను రెండుదోషములు ప్రాప్తము లగును. ఈకారణముచేతను ఇంద్రియములు ఆత్మ కాదు. మఱియు "అహం కాణః, అహం మూకః" అను ననుభవ మైననో "లోహితః స్ఫటికః" అను ననుభవమువలె భ్రమరూపమై యున్నది. అందువలన నాయనుభవముచేతను ఇంద్రియముల కాత్మత్వము సిద్ధము కాదు. మఱియు "నానేత్రము మందదృష్టి కలిగినది" ఇత్యాద్యనుభవమువలనఁ జక్షురాదీంద్రియములకు ద్రష్ట యగునాత్మ యాచక్షురాదీంద్రియములకన్నను భిన్నముగానే ప్రతీతుఁ డగుచున్నాఁడు. మఱియు, శ్రుతిస్మృతీతిహాసపురాణాదులచేతను ఆత్మ యింద్రియములకంటె భిన్నముగానే చెప్పఁబడి యున్నది. అందువలనఁ జక్షురాదీంద్రియములు ఆత్మ కావు.

## (5) ప్రాణము ఆత్మ కా దనుటకు శంకాసమాధానములు.

శంక:—ఉక్తదోషములచేత నింద్రియముల కాత్మత్వము సిద్ధింపక పోయినను ప్రాణమే యాత్మ యగు చున్నది. ఎట్లన. "క్షుత్పిపాసావాన్ అహమ్" అను నెల్లరయొక్క యనుభవము క్షుత్పిపాసాధర్మవిశిష్టప్రాణమునకే ఆత్మత్వమును సిద్ధము చేయుచున్నది. మఱియు. "అన్యో ఽంతర ఆత్మా ప్రాణమయః" అను శ్రుతియును ప్రాణమునే ఆత్మగాఁ జెప్పి యున్నది. స్వప్నసుషుప్తులయం దింద్రియములకు లయము కలిగినను ప్రాణము విద్యమానమై యున్నది. అందువలన ఆప్రాణమే ఆత్మ యగును.

సమాధానము:—వాయువుయొక్క వికార మగుటవలనఁ బ్రాణమును బాహ్య మగువాయువువలె ఆత్మ కాదు. "క్షుత్పిపాసావాన్ అహమ్" అను ననుభవమో "లోహితః స్ఫటికః" అను ననుభవమువలె భ్రమరూపమై యున్నది. అందువలన ఆయనుభవముచేతను ప్రాణమున కాత్మత్వము సిద్ధించుట లేదు. ప్రాణముయొక్క యాత్మత్వమునందు నీవు చెప్పినశ్రుతి కాప్రాణమున కాత్మత్వము బోధించుట

యుండదే తాత్పర్యము లేదు. మఱి యే మనఁగా, ముముక్షుజనులకు సోపానక్రమముగా శుద్ధాత్మను గోచరింపఁజేయుటయందే తాత్పర్యము. ఒకవేళ, ఆశ్రుతికి ప్రాణముయొక్క యాత్మత్వమునందే తాత్పర్యమైనయెడల « అన్యోఽన్తర ఆత్మా మనోమయః " అనుశ్రుతి ప్రాణమునకంటె నంతరమైన వేఱు మనోమయమున కాత్మత్వముఁ జెప్పుట యసంగత మగును. ఈశ్రుతులకు శుద్ధాత్మను గోచరింపఁజేయుటయందే తాత్పర్యమున్న దనుప్రకారము నాత్మపురాణముయొక్క దశమాధ్యాయమునందు మాచే విస్తరముగా నిరూపింపఁబడి యున్నది. దాని నచ్చటఁ దెలియవలయును. అందువలనఁ బ్రాణముగూడ ఆత్మ కాదు. ఈసర్వాభిప్రాయములను మనసునందు వహించి గ్రంథకర్త « శ్రోత్రవాగాదికాని నాహమ్ "— శ్రోత్రము వాక్కు మొదలగునవి నేను కాను—అని చెప్పెను. ఇచ్చట శ్రోత్రేంద్రియ మనుటచే చక్షురాది సర్వజ్ఞానేంద్రియములను గ్రహింపవలయును. వాగింద్రియ మనుటచే హస్తపాదాది సర్వకర్మేంద్రియములను గ్రహింపవలయును. ఆదిశబ్దముచేత వాయురూపముఖ్యప్రాణమును గ్రహింపవలయును. అందువలన నీయర్థము సిద్ధ మగుచున్నది. శ్రోత్రాది పంచజ్ఞానేంద్రియములును వాగాదిపంచకర్మేంద్రియములును బంచప్రాణములును నేను కాను. ఏకారణముచేత ననఁగా, స్వప్నసుషుప్త్యవస్థలయం దాయింద్రియ ప్రాణములు లయము నొందినను ఆత్మస్వరూపుఁ డగు నే నైననో ఆస్వప్నసుషుప్తులయందును సాక్షిరూపమున విద్యమానుండనై యున్నాను. యద్యపి, స్వప్నసుషుప్తులయం దన్యపురుషులయొక్క దృష్టికిఁ బ్రాణము ప్రతీత మగుచున్నది. తథాపి, సుషుప్తినొందినపురుషునిదృష్టికి ప్రాణము ప్రతీత మగుట లేదు. అందువలన స్వప్నసుషుప్తులయందుఁ బ్రాణముయొక్క లయము చెప్పఁబడినది.

### (6) అంతఃకరణము ఆత్మ కా దనుటకు శంకాసమాధానములు.

శంక:—ఉక్తదోషములచేత నింద్రియములకును బ్రాణమునకును ఆత్మరూపత్వము సిద్ధింపక పోయినను విజ్ఞానమే ♦ ఆత్మ యగును, ఎట్లన. « అహం కర్తా అహం భోక్తా " అను నెల్లరయొక్క యనుభవము కర్తృత్వ భోక్తృత్వ ధర్మవిశిష్టవిజ్ఞానమునకే ఆత్మత్వము సిద్ధము చేయుచున్నది. మఱియు « అన్యోఽన్తర ఆత్మా విజ్ఞానమయః " అనుశ్రుతియును ఆవిజ్ఞానమునే ఆత్మగా చెప్పుచున్నది. అందువలన ఆవిజ్ఞానమే ఆత్మ యగు ననుశంక కలుగఁగా « బుద్ధిర్నాహమ్ "—నేను బుద్ధియును కాను—అని చెప్పఁబడినది. ఇచ్చట బుద్ధియనుశబ్దముచేత నంతఃకరణవృత్తిని గ్రహింప

♦ బుద్ధిరే.

తలయును, ఆబుద్ధి నంతఃకరణమున కుపలక్షణముగాఁ దెలిసికొనవలయును, అందువలన నీయర్థము సిద్ధించుచున్నది. అంతఃకరణమును అంతఃకరణవృత్తియు నను నీరెండును నేను కాను, ఏలయన, శ్రుతియం దాకాశాదిభూతములయొక్క సాత్త్వికాంశమునం దుండి యంతఃకరణముయొక్క యుత్పత్తి చెప్పఁబడి యున్నది. అందువలన నాయంతఃకరణము భూతములయొక్క వికారమగుటచే ఘటాదులవలె జడమే యగును. మఱియు సుషుప్తియం దాయంతఃకరణముయొక్క లయమే తెలియఁబడుచున్నది. ఏది లయసహితమో అది యాత్మ కాదు. అందువలన ఆయంతఃకరణ మాత్మ కాదు. మఱియు « అహం కర్తా అహం భోక్తా " అను ననుభవమో "లోహితః స్ఫటికః " అను ననుభవమువలె భ్రమరూపమై యున్నది. అందువలన ఆయనుభవముచేతను అంతఃకరణమున కాత్మత్వము సిద్ధింపదు. మఱియు, « అన్యోఽంతరఆత్మా విజ్ఞానమయః " అను శ్రుతికిని ఆవిజ్ఞానమయముయొక్క యాత్మత్వమునందుఁ దాత్పర్యము లేదు ఎట్లనఁగా « అన్యోఽంతరఆత్మా ఆనందమయః " అను శ్రుతి ఆ విజ్ఞానమయమునకును అంతరముగా నుండు వేఱొకయానందమయమునే ఆత్మ యని చెప్పుచున్నది అందువలన ఆశ్రుతిచేతను విజ్ఞానమయమునకు ఆత్మత్వము సిద్ధింపదు. అందువలన అంతఃకరణమును అంతఃకరణవృత్తియును ఆత్మ కాదు. ఇట్లు చెప్పుటవలన మనోమయకోశమునకును ఆత్మత్వము నిరాకరింపఁ బడినది. ఎట్లన. బుద్ధివలె ఆమనస్సును అంతఃకరణవృత్తి యగుటవలన దాని కాత్మత్వము ఘటిల్లదు.

### (7) అజ్ఞానము ఆత్మ కా దనుటకు శంకాసమాధానములు

శంక:—ఉక్తదోషములచేత ఆవిజ్ఞానమయమునకు నాత్మత్వము లేక పోయినను సర్వాధ్యాసములకుఁ గారణమును ఆనందమయశబ్దముయొక్క వాచ్యార్థము నైన యజ్ఞానమే ఆత్మ యగును. ఎట్లన. « అజ్ఞోఽహమ్ " అను ననుభవము ఆయజ్ఞానమునకే ఆత్మత్వము సిద్ధము చేయుచున్నది. మఱియు « అన్యోఽంతర ఆత్మా ఆనందమయః " అను శ్రుతియును ఆయానందమయమునే ఆత్మగాఁ జెప్పుచున్న దనుశంక కలుగఁగా « అధ్యాసమూలం నాహమ్ " — నేను అధ్యాసమునకు మూలము * కాను—అని చెప్పఁబడినది. ఇచ్చట తద్ధర్మరహితపదార్థమునందు తద్ధర్మసహిత బుద్ధిరూపవిపర్యయము మిథ్యాజ్ఞాన మనఁబడును. దానికే అధ్యాస మనియును పేరు. ఉదాహరణము — ఆత్మత్వధర్మరహిత దేహేంద్రియాదులయందు నాత్మత్వబుద్ధియును రజతత్వధర్మరహితశుక్తియందు రజతత్వబుద్ధియును అధ్యాస మనఁబడును. ఈయ

* కారణము.

ధ్యాసము ద్వితీయపరిచ్ఛేదమునందు విస్తరముగా నిరూపింపఁబడును. ఈయధ్యాసమునకు మూల మనఁబడు కారణమైన యేయజ్ఞాన మున్నదో యాయజ్ఞానమును నేను కాను. ఏల యనిన. ఆయజ్ఞానము మహావాక్యజన్యజ్ఞానముచే నివర్తిల్లునదియును దేహాదులవలె జడము నగును. మఱియు సమాధ్యవస్థయందు తత్త్వవేత్తలకు ఆయజ్ఞానము ప్రతీత మగుట లేదు. అందువలన ఆయజ్ఞానము ఆత్మ కాదు. మఱియు «అహ మజ్ఞః» అను నుక్తానుభవమో «లోహితః స్ఫటికః» అను ననుభవమువలె భ్రమరూపమై యున్నది. అందువలన ఆయనుభవముచేతను అజ్ఞానమునకు నాత్మత్వము సిద్ధ మగుట లేదు. మఱియు «బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా» అనుశ్రుతి యానందమయకోశముకన్న భిన్నమైన యాయానందమయకోశమునకు నధిష్ఠానమును సాక్షియు నగు ఆత్మను ప్రతిపాదించుచున్నది. అందువలన «అన్యోంతర ఆత్మా ఆనందమయః» అను నుక్తశ్రుతి కానందమయముయొక్క యాత్మత్వమునందుఁ దాత్పర్యము లేనందున ఆశ్రుతిచేతను ఆయానందమయమునకు నాత్మత్వము సిద్ధింపదు. అందువలన నాయజ్ఞానముగూడ ఆత్మ కాదు. శరీరేంద్రియప్రాణమనోబుద్ధులను క్రమముగా నాత్మ యని యంగీకరించువాదులయొక్క మతములనిరూపణమును ఖండనమును న్యాయప్రకాశము ద్వితీయపరిచ్ఛేదమున నాత్మనిరూపణమునందు మాచే విస్తరముగా నిరూపింపఁబడి యున్నది. అందువలన ఆమతము లిచ్చట సంక్షేపముగా నిరూపింపఁబడినవి.

మఱియు శంకాసమాధానములు.—

పూర్వోక్తరీతిగా దేహేంద్రియాదులకు ఆత్మత్వము మీ రంగీకరింపనప్పుడు మీమతమునందు ఆత్మ యనునది యేది? ఏయాత్మకు «అహం బ్రహ్మాస్మి» యని బ్రహ్మరూపత్వము మీ రనుభవించుచున్నారు? అని శంక కలుగఁగా సత్యేత్యాదిగా చెప్పఁబడినది. అజ్ఞానతత్కార్యములకు సాక్షి యగునదియే మామతమునం దాత్మ యగును. ఆసాక్షి యగు నాత్మయే అహ మ్మని యనుభవింపఁబడుచున్నది. ఆసాక్షియగునాత్మకే «అహం బ్రహ్మాస్మి" యని బ్రహ్మరూపత్వము మేమనుభవించుచున్నాము.

ఆసాక్షి యగునాత్మయందు ఏబ్రహ్మరూపత్వము మీ రనుభవించుచున్నారో ఆబ్రహ్మము ఏది యనుశంక కలుగఁగా «కృష్ణ ఏ వాహ మస్మి" — కృష్ణుఁడే పరబ్రహ్మము—అని చెప్పఁబడినది. అందులకు స్మృతి. «కృషి ర్భూవాచకశ్శబ్దో ణశ్చ నిర్వృతి వాచకః । తయో రైక్యం పరం బ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయ

తే"– కృష్ అనుశబ్దము సత్తయొక్క వాచకమై యున్నది. ణ అనుశబ్దము ఆనందము యొక్క వాచకమై యున్నది. ఆసత్తానందద్వయముయొక్క యేకత్వము పరబ్రహ్మము, ఆపరబ్రహ్మమే కృష్ణుఁ డనునామముచేఁ జెప్పఁబడు చున్నది–ఈస్మృతి పరబ్రహ్మమునే కృష్ణనామముచేఁ బ్రతిపాదించు చున్నది. అందువలన "కృష్ణ ఏవాహమస్మి" అనువచనమునకు బ్రహ్మమే నేను అని యర్థము సిద్ధించు చున్నది. ఇచ్చట నభిప్రాయ మే మనఁగా, "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్, అనేన జీవే నాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి, స ఏష ఇహ ప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః"– ఆపరమాత్మదేవుఁడు ఈజగత్తును సృష్టించి తానే యీజగత్తునందు ప్రవేశము చేసెను, మఱియు నీజీవరూపముతో జగత్తునందు ప్రవేశము చేసి పరమాత్మ యగునేను నామరూపములను ప్రకటింతును గాక, మఱియు ఆపరమాత్మయే ఈసంఘాతములయందు నఖాగ్రభాగపర్యంతము ప్రవేశముఁ జేసెను – ఇత్యాదిశ్రుతులు ఈయర్థమును జెప్పుచున్నవి. వాస్తవముగా జన్మమరణాదిసర్వవికారరహిత మైనదియు నిత్యశుద్ధబుద్ధముక్తస్వరూపమునైన యేయాత్మ యున్నదో ఆయాత్మ యనాద్యనిర్వచనీయమాయాశక్తిచేత నాకాశాదిస్థూలశరీరపర్యంత సర్వజగత్తును బుట్టించి మరల ఆజగత్తునందు ప్రవేశము చేసి ఆజగత్తునకు సాక్షి యయ్యెను అవివేకమువలన ఆజగత్తుయొక్కధర్మములను దనయం దారోపించుకొని "అహం కర్తా, అహం భోక్తా, అహం మనుష్యః, అహం బ్రాహ్మణః" అని యీప్రకారముగా సంసార మనుభవించు చున్నది. ఆయాత్మయే, ఎపుడు ఒకానొకపూర్వపుణ్యకర్మముయొక్క ప్రభావముచే సాధనసంపత్తి గలదై శ్రుత్యాచార్యప్రసాదమువలన వివేకమును బొందు చున్నదో యపుడు అవివేకముచేతఁ గర్తృత్వభోక్తృత్వాదిరూపసంసారమును బరిత్యజించి నిజస్వరూపసాక్షాత్కారముచేత నామాయను నాశము చేసి తనపరమానందస్వరూపము ననుభవించు చున్నది. అందువలన సాక్షి యగునాత్మయొక్క బ్రహ్మరూపత్వమునం దేవిరోధమును లేదు. ఈయర్థమే ముందును స్పష్టముగా నిరూపింపఁబడును.

(*) (8) బ్రహ్మముయొక్క స్వరూపతటస్థలక్షణములను నిరూపించుట. (*)

ఇఁక స్వాత్మరూపముగా సాక్షాత్కరించుటకు యోగ్యమైనబ్రహ్మముయొక్క స్వరూపతటస్థలక్షణములను నిరూపించు చున్నాము. "సత్యానందరూపశ్చిదాత్మా మాయాసాక్షీ"–ఆబ్రహ్మము సత్యరూపమును ఆనందరూపమును చిదాత్మరూపమును మాయాసాక్షియు నగును. ఇచ్చట మాయాసాక్షి యనుపదముచేత

బ్రహ్మముయొక్క తటస్థలక్షణము చెప్పఁబడినది. జగత్తున కుపాదానకారణభూతమాయను ఏది సాక్షాత్తుగా బ్రకాశింపఁజేయుచున్నదో అది మాయాసాక్షి యనఁబడును. ఈమాయయొక్క స్వరూపము ముందు చెప్పఁబడును. మఱియు సత్యాది పదములచేత బ్రహ్మముయొక్క స్వరూపలక్షణము చెప్పఁబడినది. ఏది కాలత్రయమునందు బాధింపఁబడకున్నదో అది సత్య మనఁబడును. ఏది నిరతిశయసుఖస్వరూపమై యున్నదో అది యానంద మనఁబడును. ఏది జ్ఞానస్వరూపమై యున్నదో అది చిదాత్మ యనఁబడును. ఈప్రకారముగా సత్యానందచిదాత్మ యా బ్రహ్మమే యగును. ఇచ్చట బ్రహ్మమునందు భ్రాంతిచేఁ బ్రాప్తమైన యేమిథ్యావస్తువుయొక్క తాదాత్మ్య మున్నదో అది సత్య మనువిశేషణముచే నివర్తింపఁబడినది మఱియు బ్రహ్మమునందు భ్రాంతిచేఁ బ్రాప్తమైనయేదుఃఖమునయొక్కయు తత్సాధనములయొక్కయు తాదాత్మ్య మున్నదో యది యానంద మనువిశేషణముచేత నివర్తింపఁబడినది. బ్రహ్మమునందు భ్రాంతిచేఁ బ్రాప్తమైనయేజడముయొక్క తాదాత్మ్య మున్నదో అది చిదాత్మ యనువిశేషణముచేత నివర్తింపఁబడినది అందువలన నీయర్థము సిద్ధించుచున్నది సత్యరూప మగుటచే నా బ్రహ్మము మిథ్యావస్తువు కాదు. ఆనందరూపమగుటచే ఆబ్రహ్మము దుఃఖమును తత్సాధనరూపమును కాదు. చిదాత్మరూప మగుటచే ఆబ్రహ్మము జడరూపము కాదు. అట్టి సచ్చిదానందస్వరూపసర్వసాక్షి యైన పరమాత్మ నేను. ఎట్లన "తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి" ఇత్యాదిశ్రుతివచనములు ఈజీవాత్మను బ్రహ్మరూపముగానే ప్రతిపాదించుచున్నవి. ఇది ద్వితీయశ్లోకముయొక్క వ్యాఖ్యానము.

(*) (9) మంగళాచరణము కర్తవ్యము కాదనుశంక. (*)

శంక:—పూర్వోక్తశ్లోకద్వయముచేత "బ్రహ్మోహమ్" అను తత్త్వానుసంధానరూపమంగళాచరణము చేయఁబడినది. గ్రంథారంభమునందు మంగళాచరణముఁ జేయుట యోగ్యము కాదు. ఏల యన. దేనిని జేయుటయందుఁ బ్రమాణమును దేనిని జేయుటకుఁ బ్రయోజనము నున్నదో యదియే చేయుటకు యోగ్యమైనది. మంగళాచరణముఁ జేయుటయం దేప్రమాణమును ఏప్రయోజనమును లేదు. అది యెట్లనఁగా, ఆమంగళాచరణమునందుఁ బ్రత్యక్షప్రమాణ మైననో ఘటిల్లదు. ఏల యన. ఆమంగళాచరణముయొక్క కర్తవ్యత్వము ధర్మాధర్మములవలె అతీంద్రియము. ఆయతీంద్రియార్థమునందు నింద్రియరూపప్రత్యక్షప్రమాణము ఘటిల్లదు. మఱియు నాస్తికాదిగ్రంథములయందు మంగళాచరణము లేకయే గ్రంథ

సమాప్తి దెలియఁబడు చున్నది. కొన్నిగ్రంథములు మంగళాచరణము చేసియు సమాప్తిఁ బొందినవి కావు. ఈవ్యతిరేకవ్యభిచారజ్ఞానమును అన్వయవ్యభిచారజ్ఞానమును ఆమంగళాచరణమునందు గ్రంథసమాప్తికారణత్వజ్ఞానమునకుఁ బ్రతిబంధకమై యున్నది. అందువలన ఆమంగళాచరణమునందు గ్రంథసమాప్తియొక్క కారణత్వము ప్రత్యక్షప్రమాణముచేఁ దెలియ నశక్యమై యున్నది మఱియును ఆమంగళాచరణమునందు అనుమానప్రమాణమును ఘటిల్లదు. ఏల యన. ఏహేతువు ఏసాధ్యముయొక్క వ్యాప్తి గలిగి యున్నదో ఆహేతువే ఆసాధ్యమును సాధించును. ఎట్లు వహ్నిరూపసాధ్యముయొక్క వ్యాప్తి గలిగిన దగుటవలన ధూమరూపహేతువావహ్నిరూపసాధ్యమును సాధించు చున్నదో అట్లు. ఆమంగళాచరణకర్తవ్యత్వరూపసాధ్యముయొక్క వ్యాప్తి గలిగినది యేహేతువును లేదు. ఆహేతువు లేక యనుమానము సిద్ధింపదు. మఱియును ఆమంగళాచరణమునందు వేదరూపశబ్దప్రమాణమును లేదు. ఏల యన. ఆమంగళాచరణమునకుఁ గర్తవ్యతను బోధించునట్టి యేవేదవాక్యమును బ్రకృతమునందుఁ బ్రత్యక్షముగాఁ దెలియఁబడుట లేదు. మఱియు, ఆమంగళాచరణమునందు అర్థాపత్తిప్రమాణమును ఘటిల్లదు. ఏల యన, ఆమంగళాచరణము లేక గ్రంథసమాప్తి యసంభవమైనయెడల గ్రంథసమాప్తి సిద్ధమైనపుడు అది మంగళాచరణము లేక యనుపపన్న మగుటవలన మంగళాచరణము కల్పింపఁబడును. ఉదాహరణము — "దివా౽భోజిపురుషునకు స్థూలత్వము రాత్రిభోజనము లేక యనుపపన్న మగుటవలన రాత్రిభోజనము కల్పింపఁబడు చున్నది. గ్రంథసమాప్తి యైనన్నో మంగళాచరణము లేకయే చూడఁబడు చున్నది. అందువలన మంగళాచరణమునందు అర్థాపత్తిప్రమాణము గూడ ఘటిల్లదు. మఱియు నెట్లు మంగళాచరణమునందు ఏప్రమాణమును లేదో యట్లే మంగళాచరణమునకు నేప్రయోజనమును దెలియఁబడుట లేదు. గ్రంథసమాప్తియో మంగళాచరణము లేకయుఁ దెలియఁబడు చున్నది. అందువలన గ్రంథసమాప్తియును మంగళాచరణమునకుఁ బ్రయోజనము కాదు. ఏది యొకప్పుడును ఏది లేక కలుగదో యదియే దానికిఁ బ్రయోజనమై యున్నది. మఱియు ఏపురుషునియందు స్వతస్సిద్ధ మగు విఘ్నములయొక్క యత్యంతాభావ మున్నదో ఆపురుషునియం దామంగళాచరణము చేయఁబడినను విఘ్నధ్వంస మగుట లేదు. అందువలన ఆవిఘ్నధ్వంసమును ఆమంగళాచరణమునకుఁ బ్రయోజనము కాదు. ఏది కలుగుట కేది యవశ్య మగునో యదియే దానికిఁ బ్రయోజనము. గ్రంథసమాప్తి విఘ్నధ్వంసము అనునీరెంటికిని భిన్నము

గా మంగళాచరణమునకు నేక ప్రయోజనము శాస్త్రకారులచేత నంగీకరింపఁబడ లేదు. అందువలనఁ బ్రమాణము ప్రయోజనము అను నీరెండును లేకుండుటవలన మంగళాచరణము చేయుటకు యోగ్యమైనది కాదు.

### (10) మంగళాచరణము అవశ్యకర్తవ్య మనుసమాధానము.

సమాధానము:— గ్రంథారంభమునందు మంగళాచరణము అవశ్యకర్తవ్యమై యున్నది. అందు మంగళాచరణమునందు వాదిచేత ఏప్రమాణాభావము చెప్పఁబడినదో అది యసంగతము. ఏల యన, « నిర్విఘ్నసమాప్తికామో మంగలమాచరేత్ » అను శ్రుతియే మంగళాచరణమునందుఁ బ్రమాణమై యున్నది. యద్యపి ఈకాలమునం దేవేదశాఖయందును నీశ్రుతి ప్రత్యక్షముగాఁ దెలియఁబడ లేదు, తథాపి శిష్టాచారరూపహేతువువలన ఈశ్రుతి యనుమానింపఁబడుచున్నది. ఏతచ్ఛ్రుతిఘటిత వేదశాఖ నష్టమైనందువలన ఈకాలమునం దీశ్రుతి ప్రత్యక్షముగాఁ బ్రతీత మగుట లేదని కల్పింపఁబడుచున్నది. ఆయనుమానముయొక్క స్వరూప మెట్లనఁగా « మంగలం వేదబోధితాభీష్టోపాయతాకమ్, అలౌకికావిగీత శిష్టాచారత్వాత్, దర్శాదివత్ » భావము॥ మంగళాచరణము వేదముచే బోధింపఁబడిన నిర్విఘ్నసమాప్తిరూపాభీష్టోపాయమై యుండునది, అలౌకికావిగీతవిశిష్టాచార మగుటవలన, ఏది యేది అలౌకికావిగీతవిశిష్టాచారమై యున్నదో యది యది వేదముచే బోధింపఁబడిన యిష్టప్రాప్త్యుపాయమై యున్నది. ఎట్లు దర్శపౌర్ణమాసకర్మములు అలౌకికావిగీతశిష్టాచారరూపములగుటవలన « దర్శపౌర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత " అను వేదవాక్యముచేత బోధింపఁబడిన స్వర్గరూపేష్టోపాయమై యున్నదో అట్లు ఈమంగళాచరణముగూడ అలౌకికావిగీతశిష్టాచారరూప మగుటవలన వేదబోధిత నిర్విఘ్నసమాప్తిరూపేష్టోపాయ మనుట యవశ్యమై యున్నది. ఇచ్చట మంగళాచరణము పక్షము, వేదబోధితేష్టార్థోపాయత సాధ్యము, అలౌకికావిగీతశిష్టాచారత్వము హేతువు దర్శపౌర్ణమాసాదిరూపకర్మములు దృష్టాంతము. ఇట్లే యనుమానక్రమము ముందును దెలియవలయును. ప్రత్యక్షాదిప్రమాణములును అనుమానమునకు అంగములైనపక్షదృష్టాంతాదుల లక్షణములును ద్వితీయపరిచ్ఛేదమునందుఁ జెప్పఁబడును. ఇచ్చట ఈహేతువునందుండు, అలౌకిక, అవిగీత, శిష్ట అను మూఁడుపదములయొక్క యర్థ మేమనఁగా. శాస్త్రముయొక్క ఆజ్ఞ లేకయే కేవలరాగముచే ప్రాప్త మగు నేయాహారాదికార్యము లున్నవో అవి లౌకికము లనఁబడును, ఏవి లౌకికవ్యవహారమునకు భిన్నమై యున్నదో అవి

యలౌకిక మనఁబడును. మఱియు నేయాచారము నరకాదిరూపప్రబలానిష్టాఁజనకమై స్వర్గాదిరూపేష్టమునకు సాధనమై యున్నదో యాయాచారము అవిగీత మనఁబడును. ఏపురుషులు వేదమును బ్రమాణముగా నంగీకరించు చున్నారో ఆ పురుషులు శిష్టు లనఁబడుదురు. ఈరీతిగా ననుమానముచే సిద్ధించిన పూర్వోక్త శ్రుతిప్రమాణముచేతనే మంగళాచరణమునకు నిర్విఘ్నగ్రంథసమాప్తి కారణత్వము నిశ్చిత మగుచున్నది. అందువలన, ఏ నాస్తికాదులగ్రంథములకు మంగళాచరణము లేకయే గ్రంథసమాప్తి దెలియఁబడు చున్నదో యానాస్తికాదులయందు గ్రంథసమాప్తిరూపకార్యమువలని జన్మాంతరమునందు మంగళాచరణ మనుమానింపఁబడు చున్నది. ఆజన్మాంతరమంగళాచరణమే యాగ్రంథసమాప్తికిఁ గారణమై యున్నది. అందువలనఁ బూర్వోక్తవ్యతిరేకవ్యభిచారము సంభవింపదు. ఎచ్చట మంగళాచరణము చేసియు గ్రంథసమాప్తి కలుగుట లేదో యచ్చట గ్రంథకర్తయందు విఘ్నములయొక్క బాహుళ్యమును దెలియవలయును. లేక ప్రబలైకవిఘ్నమును దెలియవలయును. బహుతరవిఘ్నములయొక్క నివృత్తియును ప్రబలైకవిఘ్నముయొక్క నివృత్తియును అనేకమంగళాచరణములచేతను ప్రబలైకమంగళాచరణముచేతను గలుగు చున్నది. ఈప్రకారముగా విఘ్నముల నివృత్తిచేయఁజాలు మంగళాచరణ మాగ్రంథములయందు లేదు. అందువలనఁ బూర్వోక్తాన్వయవ్యభిచారము గూడ ప్రాప్తింపదు. ఈరీతిగా మంగళాచరణమునందు నుక్తశ్రుతి ప్రమాణముగా సంభవించు చున్నది. అట్లే నిర్విఘ్నగ్రంథసమాప్తిరూపప్రయోజనమును సంభవించు చున్నది. అందువలనఁ గ్రంథారంభమునందు మంగళాచరణ మవశ్యము చేయుటకు యోగ్యమై యున్నది. మఱియుఁ గొన్నిగ్రంథకారు లైననో గ్రంథసమాప్తికిఁ బ్రతిబంధకము లైనవిఘ్నములయొక్క ధ్వంసమే మంగళాచరణమునకుఁ బ్రయోజన మని యంగీకరించు చున్నారు. ఈమంగళవాదము న్యాయప్రకాశము యొక్క ప్రథమపరిచ్ఛేదమునందు విస్తరముగా మాచే నిరూపింపఁబడి యున్నది. అందువలన నిచ్చట సంక్షేపముగా నిరూపింపఁబడినది. అధికముగాఁ దెలియుట కిచ్ఛ గలవార లచ్చటఁ దెలియవలయును.



# గ్రంథారంభము.

శ్రీమచ్ఛంకరాచార్యకృత భాష్యసహిత శ్రీవ్యాసభగవత్ప్రణీతసూత్ర సమూహరూప మయిన యేశారీరకమీమాంసాశాస్త్ర మున్నదో దానియందు "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అను ప్రథమసూత్రముచేత వివేకాదిసాధనచతుష్టయ సంప త్త్యనంతరము అధికారులనుగుఱించి బ్రహ్మజ్ఞానేచ్ఛ విధింపఁబడి యున్నది. విచారింపఁబడిన తత్త్వమస్యాదివాక్యములచేత జన్య మైనదియు జీవబ్రహ్మముల యొక్క యేకత్వమును విషయము చేయునదియు నగు "అహం బ్రహ్మాస్మి" యను ఫలరూపజ్ఞానమే యీయిచ్ఛకు విషయమై యున్నది. ఆమోక్షహేతు వైనఫలరూప జ్ఞానము తత్త్వంపదార్థజ్ఞానముయొక్క యధీనమై యున్నది. ఎట్లన, పదార్థజ్ఞాన రహితపురుషునకు వాక్యార్థజ్ఞానము గలుగదు. మఱి యే మనఁగా పదార్థజ్ఞానము గలపురుషునకే వాక్యార్థజ్ఞానము కలుగుచున్నది. ఆవాక్యార్థజ్ఞానమునకు హేతు భూత మైనపదార్థజ్ఞానమును తత్త్వంపదార్థవిచారముయొక్క యధీనమై యున్నది. ఆతత్త్వంపదార్థవిచారము లేక ఆపదార్థజ్ఞానము కలుగదు. అందువలన పూర్వోక్త సూత్రార్థముచేత ఆవిచారమునందుఁ గర్తవ్యత విధింపఁబడి యున్నది. అనఁగా, సాధనచతుష్టయసంప త్త్యనంతరము అధికారి బ్రహ్మవిచారముఁ జేయవలయు నని యీ సూత్రమున కర్థము సిద్ధించుచున్నది.

## ( (12) ద్వివిధబ్రహ్మవిచారనిరూపణము. )

ఆవిచారము ద్వివిధమై యున్నది. ఒకటి ప్రధానవిచారము, మఱియొకటి సహకారివిచారము. అందు అహం బ్రహ్మాస్మి యను వాక్యార్థజ్ఞానమువలనఁ బొందుటకు నధికముగా వాంఛింపఁబడుటవలన బ్రహ్మము ప్రధానము. అట్టి ప్రధాన బ్రహ్మముయొక్క యేవిచార మున్నదో యీవిచారము ప్రధానవిచార మనఁబడును. మఱియు ఆబ్రహ్మవిచారము సమన్వయాదివిచారము లేక సంభవింపదు. అందువలన సమన్వయము, అవిరోధము, సాధనము, ఫలము అనునట్టి యేచతుర్విధసహకారు లున్నవో వానివిచారములు సహకారివిచారము లనంబడును. అందు, ఉపనిషద్రూప వేదాంతములయం దుండువాక్యములకు బ్రహ్మాత్మైకత్వప్రతిపాదనరూప మైన యే తాత్పర్య మున్నదో అది సమన్వయ మనఁబడును. ఆసమన్వయముయొక్క విచారము శారీరకమీమాంసాశాస్త్రముయొక్క ప్రథమాధ్యాయమునందుఁ జెప్పఁబడి యున్నది. మఱియు శ్రుతికి విరుద్ధము లైన స్మృత్యాదులును ప్రత్యక్షాదిప్రమాణములును

ఆభాసరూపము లగుటవలన వేదాంతసమన్వయమునకు స్మృతిప్రత్యక్షాదిప్రమాణాంతరములతోఁ గల విరోధాభావ మవిరోధ మనఁబడును. ఆయవిరోధముయొక్క విచారము శారీరకమీమాంసాశాస్త్రముయొక్క ద్వితీయాధ్యాయమునందుఁ జెప్పఁబడి యున్నది. మఱియు జ్ఞానప్రాప్తికి ఏయుపాయము లున్నవో అవి సాధనము లనఁబడును. ఆసాధనములును అంతరంగబహిరంగభేదముచేత ద్వివిధములు. ఆ ద్వివిధసాధనములయొక్క విచారము శారీరకమీమాంసాశాస్త్రముయొక్క తృతీయాధ్యాయమునందుఁ జెప్పఁబడి యున్నది. మఱియు ఆసాధనములచేతఁ బొందుటకు యోగ్యమైన యేయర్థ మున్నదో అది ఫల మనఁబడును. ఆఫలమును పరాఽపరభేదముచే ద్వివిధము. ఆద్వివిధఫలవిచారము శారీరకమీమాంసాశాస్త్రముయొక్క చతుర్థాధ్యాయమునందుఁ జెప్పఁబడి యున్నది. ఈరీతిగా సమన్వయాదిచతుర్విధవిచారములును సహకారివిచారము లనఁబడును. అచ్చట ఆ సాధనములలో తత్త్వమస్యాది మహావాక్యార్థవిచారము బ్రహ్మజ్ఞానమునకు అంతరంగసాధనమై యున్నది. ఆవాక్యార్థవిచారమునకు, తత్త్వంపదార్థవిచారము సహకారియై యున్నది. అందువలన ఆతత్త్వంపదార్థవిచారమును బ్రహ్మజ్ఞానమునకు అంతరంగసాధనమై యున్నది. ఈకారణముచేతనే గ్రంథారంభమునందుఁ బ్రథమమున ఆతత్త్వంపదార్థవిచారమే నిరూపింపఁబడినది. ఇచ్చటఁ దాత్పర్య మేమనఁగా, సాధనచతుష్టయసంపన్నాధికారికి మోక్షప్రాప్తి తత్త్వమస్యాదిమహావాక్యార్థజ్ఞానముచేతనే కలుగుచున్నది. ఆవాక్యార్థజ్ఞానప్రాప్తి తత్త్వంపదార్థజ్ఞానముచేతనే కలుగుచున్నది. ఆపదార్థజ్ఞానప్రాప్తి తత్త్వంపదార్థములయొక్క విచారముచేతనే కలుగుచున్నది. అందువలన ఆతత్త్వంపదార్థవిచారము ముముక్షువుల కవశ్యకర్తవ్యమై యున్నది.

శంక:—లోకమునందును శాస్త్రమునందును సుఖప్రాప్తియును దుఃఖనివృత్తియునే పురుషార్థముగాఁ దెలియఁబడుచున్నది. ఆపురుషార్థమే సంపాదింపఁదగినది. ఆతత్త్వంపదార్థజ్ఞానమో సుఖప్రాప్తిరూపమును దుఃఖనివృత్తిరూపమును గాదు. అందువలన అపురుషార్థ మగుటచే ఆపదార్థజ్ఞానము సంపాదింపఁదగినది కాదు.

సమాధానము:—యద్యపి, ఆపదార్థజ్ఞానమునకు స్వరూపముచేఁ బురుషార్థరూపత్వము లేదు. తథాపి, ఆపురుషార్థమునకు సాధనము మహావాక్యార్థజ్ఞానము. ఆవాక్యార్థజ్ఞానమునకుఁ బదార్థజ్ఞానము హేతువై యున్నది. అందువలన వాక్యార్థజ్ఞానద్వారమునఁ బురుషార్థమునకు సాధనమై యున్నందునఁ బదార్థజ్ఞాన మవశ్యము సంపాదింపఁదగినది.

### (13) తత్త్వంపదములయొక్క వాక్యార్థజ్ఞానమునందు శంకాసమాధానములు.

శంక:—ఏమోక్షముకొఱకు మీరు తత్త్వంపదార్థమును నిరూపించుచున్నారో ఆమోక్ష మనునది యేది? అజ్ఞాననివృత్తి యనునది మోక్షమా? లేక బ్రహ్మభావ మనునది మోక్షమా? అందుఁ బ్రథమపక్ష మంగీకరించినయెడల అది ఘటిల్లదు. ఏలయన, ఆయజ్ఞాననివృత్తిరూపమోక్షము బ్రహ్మస్వరూపమునకన్న భిన్నమే యగును. అందువలన "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అనుశ్రుతికి విరోధ మగును. యద్యపి బ్రహ్మమునకన్న భిన్నముగా వేఱొకభావపదార్థము లేదు. ఆయజ్ఞాననివృత్తి యభావరూప మగుటవలన దానిస్థితిచే బ్రహ్మముయొక్క అద్వితీయరూపత్వమునకు హాని లేదు. ఈరీతిగా భావాద్వైతపరత్వమువలన ఆశ్రుతికి విరోధము లేదు. తథాపి, బ్రహ్మమునకన్న భిన్నమైన భావాభావరూపసర్వప్రపంచమును నిషేధించు నద్వైతపదార్థమును సంకోచించి కేవల భావపదార్థనిషేధపరత్వ మంగీకరించుటయందే ప్రమాణమును లేదు. మఱియు మీమతమునందు బ్రహ్మమునకంటె భిన్నమైన సర్వపదార్థములకుఁ గల్పితత్వమే యంగీకరింపఁబడి యున్నది. అందువలన నాయవిద్యానివృత్తి బ్రహ్మమునకంటె భిన్న మగుటవలనఁ గల్పితమే యగును. ఏపదార్థము కల్పిత మగుచున్నదో ఆపదార్థము శుక్తిరజతమువలె మిథ్యయే యగును. అందువలన నాయవిద్యానివృత్తిరూపమోక్షమునకును గల్పితత్వమువలన అనిత్యత్వమే ప్రాప్త మగును. మఱియు మీమతమునం దవిద్య కల్పితముగానే యంగీకరింపఁబడి యున్నది. కల్పితవస్తువుయొక్క యభావమును గల్పితమే యగును. అందువలనఁ గల్పితావిద్యానివృత్తియును గల్పితమే యగును. కల్పితవసువునకు సత్యరూపత్వము సిద్ధింపదు. ఈకారణముచేతను అవిద్యానివృత్తిరూపమోక్షమున కనిత్యత్వమే ప్రాప్త మగును. మోక్ష మనిత్య మనుట మీకిష్టము కాదు. ఏల యన, సర్వమోక్షవాదులచేతను మోక్షమునకు నిత్యత్వమే యంగీకరింపఁబడి యున్నది. ఏమోక్షవాదియును మోక్షము ననిత్యముగా నంగీకరించుట లేదు. ఒకవేళ మోక్ష మనిత్య మనినయెడల ముక్తపురుషులకుఁ బునరుత్పత్తి కలుగవలయును. "న స పునరావర్తతే, యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ" ఇత్యాదిశ్రుతిస్మృతులచేత ముక్తపురుషులకుఁ బునరుత్పత్తి నిషేధింపఁబడి యున్నది. అందువలన నవిద్యానివృత్తికి మోక్షరూపత్వము ఘటిల్లదు. మఱియు బ్రహ్మభావము మోక్ష మనుద్వితీయపక్ష మంగీకరించినయెడల నదియును ఘటిల్లదు. ఏల యన, బ్రహ్మభావ మనాది యగుటవలన నిత్యసిద్ధము. ఏపదార్థము నిత్యసిద్ధమై యున్నదో యా

పదార్థమే సాధనముచేతను సాధ్యమగుట లేదు. అనిత్యపదార్థమే సాధనములచేత సాధ్యమగును. అందువలన బ్రహ్మభావరూపమోక్షము ఆత్మజ్ఞానముచేత సాధింపఁబడు ననుట కూడదు. మీరు మోక్ష మాత్మజ్ఞానముచే సాధింపఁబడు నని యంగీకరించు చున్నారు. అందువలన బ్రహ్మభావమునకు మోక్షరూపత్వము ఘటిల్లదు. ఈరీతిగా మోక్షము నిరూపింప నసాధ్య మగుటవలన మోక్షమునకు సాధన మైన మహావాక్యార్థజ్ఞానము ప్రయోజనవంత మని నిరూపింప సాధ్యము కాదు.

సమాధానము:—మా మతమునం దవిద్యానివృత్తియే మోక్షము. ఆ యవిద్యానివృత్తి బ్రహ్మమునకన్న భిన్నము కాదు. మఱి యేమనఁగా, అధిష్ఠాన బ్రహ్మస్వరూపముగానే యున్నది. ఎట్లన, కల్పితవస్తువుయొక్క యభావము అధిష్ఠానమునకన్న భిన్నము కాదు. ఎట్లు కల్పితసర్పరజతాదులయొక్క యభావము రజ్జుశుక్త్యాద్యధిష్ఠానములకన్న భిన్నము గాక యధిష్ఠానరూపమే యగుచున్నదో అట్లు కల్పితావిద్యానివృత్తియు నధిష్ఠానబ్రహ్మరూపమే యగుచున్నది.

శంక:—ఆ యవిద్యానివృత్తిరూపమోక్షము బ్రహ్మరూప మని యంగీకరించినయెడల బ్రహ్మరూపమోక్షము జ్ఞానముచే సాధింపఁబడు ననుట కూడదు. మీరు మోక్షము జ్ఞానముచే సాధింపఁబడు నని యంగీకరించు చున్నారు.

సమాధానము:—జ్ఞానముచే మోక్షము సాధింపఁబడు ననుచోట సాధింపఁబడు ననుశబ్దముచే మాకు జన్యత్వము వివక్షితము కాదు. అనఁగా, జ్ఞానముచే మోక్షము జనియించు నని మాయభిప్రాయము కాదు. ఏల యన, బ్రహ్మభావ మనాదిసిద్ధ మగుటవలన దాని యుత్పత్తియే సంభవించుట లేదు. మఱేమనఁగా, సాధింపఁబడు ననుశబ్దముచే మాకు అభివ్యక్తి* మాత్రమే యభిప్రాయమై యున్నది. అనఁగా, జ్ఞానముచే మోక్ష మభివ్యక్తమౌ నని మాత్రమే మాయభిప్రాయము. « అహం బ్రహ్మాస్మి » యను జ్ఞానముచే ద్వైతభ్రమ నివృత్తియును అఖండైకరసానందస్వాప్తియునే మోక్షముయొక్క యభివ్యక్తి యందురు. అందువలన « అహం బ్రహ్మాస్మి » యను వాక్యార్థజ్ఞానము మోక్షమునకు సాధన మనుట సంభవించుచున్నది. అట్టి వాక్యార్థజ్ఞానము తత్త్వంపదార్థజ్ఞానముచేతనే కలుగుచున్నది. ఆ పదార్థజ్ఞానము తత్త్వంపదార్థనిరూపణముచేతనే కలుగుచున్నది. అందువలనఁ బ్రథమమునఁ బదార్థముయొక్క నిరూపణము చేయఁబడుచున్నది.

* ప్రకాశము.

## (*) (14) తత్పదార్థనిరూపణము. (*)

అందు అసాధారణధర్మరూపలక్షణమును ప్రత్యక్షాదిరూపప్రమాణము నను నీరెంటిచేతనే వస్తుసిద్ధి యగుచున్నది. లక్షణప్రమాణములు లేక వస్తుసిద్ధి యగుట లేదను న్యాయము నంగీకరించి ప్రథమమున ఆతత్పదార్థముయొక్క లక్షణము చెప్పఁబడుచున్నది. ఆబ్రహ్మరూపతత్పదార్థముయొక్క లక్షణము ద్వివిధమై యున్నది. ఒకటి తటస్థలక్షణము, మఱియొకటి స్వరూపలక్షణము. « కాదాచిత్కత్వేసతి వ్యావర్తకం తటస్థలక్షణమ్ » — భావము॥ ఏలక్షణము తనలక్ష్యమునందు ఒకానొకప్పుడుండి తనలక్ష్యము నన్యపదార్థములనుండి భిన్నముఁ జేయుచున్నదో ఆలక్షణము తటస్థలక్షణ మనఁబడును. ఉదాహరణము— పృథివికి—గంధవత్త్వలక్షణము తటస్థలక్షణమై యున్నది. నైయాయికమతమునందు ఏక్షణమునందు ద్రవ్య ముత్పన్న మగుచున్నదో ఆక్షణమునం దాద్రవ్యమునందు రూపాదిగుణము లుత్పన్న మగుట లేదు. మఱి యే మనఁగా ద్వితీయక్షణమునం దారూపాదిగుణము లుత్పన్న మగుచున్నవి. ప్రథమక్షణమునందు ద్రవ్యము నిర్గుణముగానే యుత్పన్న మగుచున్నది. ఈయర్థమునందు యుక్తియో న్యాయప్రకాశముయొక్క ద్వితీయపరిచ్ఛేదమునందు మొదట విస్తరముగా నిరూపించి యున్నాము. దాని నచ్చటఁ దెలియవలయును. అందువలనఁ బృథివియొక్క యుత్పత్తిక్షణమునందు గంధగుణము పృథివియం దుండుట లేదు. మఱి యే మనఁగా, మధ్యకాలమునందే గంధగుణము పృథివియం దున్నది. అందువలన గంధగుణము కాదాచిత్కమే యగుచున్నది. మఱియు నాగంధగుణము స్వాశ్రయభూతపృథివి నితరజలాదిపదార్థములయం దుండి భిన్నము చేయుచున్నది. అందువలన కాదాచిత్కమే యగుటచేతను వ్యావర్తక మగుటచేతను గంధవత్త్వము పృథివియొక్క తటస్థలక్షణమై యున్నది. ఈరీతిగా, తత్పదార్థరూపబ్రహ్మమునకును « సృష్టిస్థితిలయకారణత్వమ్ » అనునది తటస్థలక్షణమై యున్నది. ఇచ్చట సృష్టిశబ్దముచేత జగదుత్పత్తియును స్థితిశబ్దముచేత జగత్పాలనమును లయశబ్దముచేత జగత్ప్రళయమును గ్రహింపవలయును. జగదుత్పత్తిస్థితిలయకారణత్వము బ్రహ్మమునందు సర్వదా యుండుట లేదు. మఱి యే మనఁగా, మాయాధిష్ఠానకాలమునందే యున్నది. అందువలన సృష్టిస్థితిలయకారణత్వము కాదాచిత్కమే యగుచున్నది. మఱియు సాంఖ్యనైయాయికాదులు జగత్కారణముగాఁ గల్పించుప్రధానము పరమాణువు మొదలగుదానికన్నను ఆలక్ష్యరూపబ్రహ్మమును భిన్నము చేయునదియు నగుచున్నది. అందువలన వ్యావర్తకమునై యున్నది. ఈరీతిగా, కాదాచిత్కమే

యొక్కటచేతను స్వాతంత్ర్యకర్తృక మగుటచేతను సృష్టిస్థితిలయకారణత్వము బ్రహ్మముయొక్క తటస్థలక్షణ మనఁబడుచున్నది.

ఇఁక, ఆలక్షణమునం దుండు పదములయొక్క ప్రయోజనము చెప్పఁబడు చున్నది. అందు బ్రహ్మము స్థితిలయకారణ మనిమాత్రమే చెప్పినపక్షమందు జగత్తునకు బ్రహ్మముకంటె వేఱుకర్త యుండవచ్చునని శంక కలుగును. దాని నివారించుటకై సృష్టిపదము చెప్పఁబడినది. బ్రహ్మమునకు సృష్టిలయకారణ మని మాత్రమే లక్షణము చెప్పినపక్షమున జగత్తునకు బ్రహ్మముకంటె భిన్నమైన యుపాదాన ముండునట్లు శంక దోఁచును. దాని నివారించుటకై స్థితిపదము చెప్పఁబడినది. సృష్టిస్థితికారణ మనుట మాత్రమే లక్షణ మని యంగీకరించినయెడల జగల్లయమునకు బ్రహ్మముకంటె నిమిత్తాంతర ముండునట్లు శంక వచ్చును. దాని నిరసించుటకై లయపదము చెప్పఁబడినది. ఈరీతిగా సృష్టిస్థితిలయత్రయకారణత్వరూపతటస్థలక్షణముఁ జెప్పుటవలన బ్రహ్మము జగత్తున కభిన్ననిమిత్తోపాదానకారణ మని సిద్ధించు చున్నది. అనఁగా, బ్రహ్మ మొకటియే జగత్తున కుపాదానకారణమును నిమిత్తకారణమును నగు చున్నది. ఇట్లు చెప్పుటవలన బ్రహ్మమునకు నీతటస్థలక్షణము సిద్ధ మగుచున్నది « జగత్కర్తృత్వేసతి జగదుపాదానత్వమ్ ''—భావము॥ జగత్కర్తృత్వవిశిష్ట మయినయే జగదుపాదానత్వ మున్నదో యదియే బ్రహ్మముయొక్క తటస్థలక్షణమై యున్నది. ఇట « జగదుపాదానత్వ » మను నింతమాత్రమే బ్రహ్మమునకు తటస్థలక్షణ మనిన యెడల మాయయం దాలక్షణమునకు నతివ్యాప్తి కలుగును. ఏల యన, శుద్ధబ్రహ్మమునకైనను జగదుపాదానత్వము లేదు. మఱి యేమనఁగా మాయావిశిష్టబ్రహ్మమునకే జగదుపాదానత్వ మున్నది. మఱియు విశిష్టమునం దుండుధర్మము విశేషణమునం దవశ్య ముండును. అందువలన బ్రహ్మమునకు విశేషణమైనమాయకును జగదుపాదానత్వకారణ మవశ్య మగును. « మాయాంతు ప్రకృతిం విద్యాత్ » అను శ్రుతియును మాయకు జగదుపాదానకారణత్వముఁ జెప్పు చున్నది. అందువలన నాయతివ్యాప్తి దోషమును నివారించుటకొఱకు లక్షణమునందు « జగత్కర్తృత్వే సతి '' యని చెప్పఁబడినది. కార్యోపాదానముయొక్క యపరోక్షజ్ఞానమును ఆకార్యమును చేయు నిచ్ఛయును దదిచ్ఛాజన్యప్రయత్నరూపకృతియు నను నీమూఁడును గలవాఁడే కర్త యనఁబడును. ఉదాహరణము—కులాలాదు లిచ్ఛాజ్ఞానకృతిసహితు లగుటవలన ఘటాదికార్యములకుఁ గర్తలని చెప్పఁబడుదురు. ఈరీతిగాఁ గర్తృత్వము చేతనమునందే సంభవించు చున్నది. జడమైనమాయయందు సంభవించుట

లేదు. అందువలన « జగత్కర్తృత్వే సతి » యని చెప్పుటవలన మాయాయందుఁ బూర్వోక్తలక్షణమునకు నతివ్యాప్తి గలుగదు.

లేక, « జగత్కర్తృత్వ'' మను నింతమాత్రమే బ్రహ్మమునకుఁ దటస్థలక్షణ మనినయెడల నైయాయికులు జగత్తునకుఁ గేవలము కర్తగా నంగీకరించియుండు నీశ్వరునియందుఁ బూర్వోక్తలక్షణమునకు నతివ్యాప్తి యగును. ఆయతివ్యాప్తిదోషమును నివారించుటకొఱకు లక్షణమునందు « జగదుపాదానత్వ'' మ్మను పదము చెప్పఁబడినది. నైయాయికులు పరమాణువులను జగత్తునకుపాదానకారణముగా నంగీకరించుచున్నారు ఈశ్వరుని జగత్తునకుఁ గర్తగా నంగీకరించుచున్నారు. ఈరీతిగా నైయాయికులచేత జగత్తుయొక్కయుపాదానమునకును గర్తకును భేదమే యంగీకరింపఁబడి యున్నది. మాసిద్ధాంతమందో బ్రహ్మము జగత్తునకు నభిన్ననిమిత్తోపాదానకారణ మని యంగీకరించి యున్నాము. అందువలన « జగదుపాదానత్వ » మ్మనుపదముఁ జెప్పుటవలన నైయాయికు లంగీకరించియుండు నీశ్వరునియందు లక్షణమున కతివ్యాప్తి కలుగదు.

శంక:—అతివ్యాప్తిసహితలక్షణము స్వలక్ష్యము నేల సిద్ధము చేయదు?

## (15) అతివ్యాప్తి మొదలగు దోషములయొక్క లక్షణములను నిరూపించుట.

సమాధానము:—లక్షణమున కతివ్యాప్తి, అవ్యాప్తి, అసంభవ మను మూడుదోషములు గలవు ఆమూడుదోషములయందు నొకదోష మైనను ఏలక్షణమునం దున్నదో ఆలక్షణము దుష్ట మనఁబడును. ఆదుష్టలక్షణముచేత లక్ష్యముయొక్కసిద్ధి యగుట లేదు. మఱియు నేలక్షణ మామూడుదోషములు లేని దగుచున్నదో ఆలక్షణము దుష్టము కాని దనఁబడును. దుష్టముకాని లక్షణముచేతనే లక్ష్యముయొక్కసిద్ధి యగుచున్నది. అందువలన లక్షణమునందుఁ బదములయొక్కనివేశము చేసి యతివ్యాప్తి మొదలగుదోషముల నవశ్యము నివారింపవలయును. అందు, ఏలక్షణము స్వలక్ష్యమునందు వర్తించునదై అలక్ష్యమునందుఁ గూడ వర్తించుచున్నదో యాలక్షణ మతివ్యాప్తిదోషసహితమై యున్నది. ఉదాహరణము—గోవునకు శృంగిత్వలక్షణము ఆగోరూపలక్ష్యమునందు వర్తించునదై మహిషాజాదిరూప మైనయలక్ష్యమందుఁ గూడ వర్తించు చున్నది. అందువలన గోవునకు శృంగిత్వలక్షణ మతివ్యాప్తిదోషసహితమై యున్నది. మఱియు, ఏలక్షణము స్వలక్ష్యముయొక్కయేకదేశమునందు వర్తించు చున్నదో ఆలక్షణ మవ్యాప్తిదోష

సహితమై యున్నది. ఉదాహరణము— గోవునకుఁ గపిలత్వలక్షణముఁ గొన్నిగోవుల యం దున్నది, సర్వగోవులయం దుండుట లేదు, అందువలనఁ గపిలత్వలక్షణ మవ్యాప్తిదోషసహితమై యున్నది. మఱియు నేలక్షణము స్వలక్ష్యమాత్రమునందే యుండుట లేదో ఆలక్షణ మసంభవదోషసహితమై యున్నది. ఉదాహరణము— గోవునకు నేకశఫత్వలక్షణము ఒకగోవునందుఁ గూడ నుండుట లేదు, అందువలన అసంభవదోషసహితమై యున్నది. శఫ మనఁగా ఖురము. మఱియు నేపదార్థమున కేలక్షణము చేయఁబడు చున్నదో ఆలక్షణమున కాపదార్థము లక్ష్య మనఁబడును. అందువలన, అతివ్యాప్తి మొదలగు సర్వదోషములు లేని దగుటవలనఁ బూర్వోక్త బ్రహ్మము నొక్క తటస్థలక్షణము సమీచీనమై యున్నది.

### (16) బ్రహ్మము జగత్తున కభిన్ననిమిత్తోపాదాన మనుటయందు శంకాసమాధానములు.

శంక:—ఒకటేబ్రహ్మమునకు జగత్తుయొక్క యుపాదానత్వమును గర్తృత్వమును ఘటిల్లదు. ఏలయన, లోకమునం దాకీతిగాఁ జూడఁబడుట లేదు. ఉదాహరణము—ఘటముయొక్క కర్త యగుకులాలుఁడు ఘటమున కుపాదానకారణ మగుట లేదు. ఆఘటమున కుపాదానకారణ మగుమృత్పిండ మాఘటమునకుఁ గర్త యగుట లేదు. ఇది యేమనఁగా, మృత్పిండము ఘటమున కుపాదానకారణమే యగు చున్నది. కులాలుఁడు ఘటమునకుఁ గర్తయే యగుచున్నాఁడు. ఈరీతిగా ఘటాది కార్యములయం దుపాదానకారణమును గర్తయును భిన్నముగానే తెలియఁబడు చున్నది. దృష్టార్థము ననుసరించియే యదృష్టార్థము కల్పింపఁబడు చున్నది. దృష్టార్థమునకు విరుద్ధముగా నదృష్టార్థముయొక్క కల్పన గలుగుట లేదు. ఒకటేబ్రహ్మము జగత్తున కుపాదాన మనియును గర్త యనియు నంగీకరించుట యదృష్టార్థముయొక్క కల్పనమై యున్నది. అది దృష్టార్థము లేక యెట్లు సంభవించును? కావున దృష్ట విరుద్ధ మగుటవలన బ్రహ్మ మొకటియే జగత్తున కుపాదాన మనియును గర్త యనియు నంగీకరించుట యసంగతమై యున్నది. మతే మనఁగా, ఈశ్వరుని జగత్తునకుఁ గర్త యనియును ఆయీశ్వరునికన్న భిన్న మగుపరమాణ్వాదికమును జగత్తున కుపాదానకారణ మనియు నంగీకరింపవలయును. ఈయర్థమునందు దృష్టవిరోధము కలుగుట లేదు. మఱియు ఘటాదికార్యములయం దుపాదానకర్తలయొక్క భేద మెల్లరకును బ్రసిద్ధమే యగు చున్నది. ఇట్లు చెప్పుటవలన నీయనుమానము సిద్ధించు చున్నది. "ఇదం జగత్ భిన్ననిమిత్తోపాదానకం, కార్యత్వాత్, ఘటాదివత్"—

భావము॥ ఈజగత్తు ఉపాదానకారణమును కర్తృరూపనిమిత్తకారణమును భిన్నము గాఁ గలిగినది, కార్యమగుటవలన, ఘటాదికార్యములవలె.

మఱియు బ్రహ్మమునకు జగత్తుయొక్క యభిన్ననిమిత్తోపాదానత్వము మేము కల్పించుట లేదు ఇఁక నేమనఁగా, "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి" అనుశ్రుతియే యాయర్థమును బోధించుచున్న దని మీరు చెప్పినను, అది ఘటిల్లదు. ఏల యన, పూర్వోక్తరీతిగా దృష్టార్థమునకు విరుద్ధముగా నాశ్రుతికి మీరు చెప్పిన యర్థము సంభవింపదు. మఱే మనఁగా, అన్యార్థమే సంభవించుచున్నది. అందువలన బ్రహ్మమునకు జగత్తుయొక్క యభిన్ననిమిత్తోపాదానత్వము ఘటిల్లదు.

సమాధానము:— "తదైక్షత బహుస్యామ్, సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి"— భావము॥ ఆపరమాత్మదేవుఁడు అనేకరూపము లగుదు నని సంకల్పించెను. ఆపరమాత్మదేవుఁడు అనేకరూపములుగా నుద్భవింతు నని యిచ్ఛించెను. అను నీశ్రుతిచేత నొకటే బ్రహ్మమునకు అనేకరూపము లగుదు ననెడి యిచ్ఛ చెప్పఁ బడి యున్నది. ఆయిచ్ఛ చేతనముయొక్క ధర్మమే యగుచున్నది. జడముయొక్క ధర్మము కాదు. అందువలన నాశ్రుతియొక్క బలముచేతఁ జేతనబ్రహ్మమునకే జగత్తుయొక్క యుపాదానత్వమును కర్తృత్వమును నిశ్చయింపఁబడుచున్నది. మఱియుఁ దాత్పర్యమును నిశ్చితముచేయు నుపక్రమోపసంహారాది షడ్విధలింగములచేత సర్వవేదాంతవాక్యముల కద్వితీయబ్రహ్మమునందే తాత్పర్యము నిశ్చయింపఁబడుచున్నది. అందువలనఁ బూర్వోక్తానుమానముచేత నాశ్రుత్యర్థము బాధింపఁబడుటలేదు. మఱే మనఁగా, ఆశ్రుతికి విరుద్ధములైన ప్రత్యక్షానుమానాదిప్రమాణములే యాభాసరూపత్వమును బొందును. ఉపక్రమాది షడ్విధలింగములయొక్క స్వరూపము ముందు ద్వితీయపరిచ్ఛేదమునందుఁ జెప్పఁబడును. మఱియు, లోకమునందే కారణమును గార్యమున కభిన్ననిమిత్తోపాదానముగాఁ జూడఁబడుట లేదు, అందువలన జగత్తుయొక్క యుపాదానకారణమునకును నిమిత్తకారణమునకును భేదమే యంగీకరింపవలయు నని వాదిచేతఁ బూర్వ మేది చెప్పఁబడినదో యది యసంగతము. ఏల యన, లోకమునందు దూర్ణనాభి మొదలగు జంతువులయందు స్వరచిత తంతురూప కార్యమున కభిన్ననిమిత్తోపాదానకారణత్వమే చూడఁబడుచున్నది. అనఁగా నాయూర్ణనాభిజంతువు తంతురూపకార్యమునకుఁ దానే యుపాదానకారణమును దానే కర్తృరూపనిమిత్తకారణము నగుచున్నది. మఱియు, నైయాయికమతమునందు ఘటమునకును ఈశ్వరునకును ఈరెంటికిని ఏసంయోగసంబంధ మున్నదో యాసం

యోగము సమవాయసంబంధముచేత నా రెంటియందు దుత్పన్నమగుచున్నది. అందువలన నీశ్వరుఁడా సంయోగమునకు నుపాదానకారణ మగుచున్నాఁడు. మఱియు నా యీశ్వరుఁడు కార్యమాత్రమునకు నిమిత్తకారణము నగుచున్నాఁడు. అందువలన నాసంయోగరూపకార్యమునకీశ్వరుఁడు నిమిత్తకారణము నగుచున్నాఁడు. ఈరీతిగా నైయాయికు లెట్లు సంయోగరూపకార్యమును గుఱించి యీశ్వరునకు అభిన్ననిమిత్తోపాదానకారణత్వము నంగీకరించుచున్నారో అట్లు మేమును బ్రహ్మమునకు జగత్తుయొక్క అభిన్ననిమిత్తోపాదానకారణత్వము నంగీకరించు చున్నాము. అందువలనఁ బూర్వోక్తదృష్టవిరోధముగూడఁ బ్రాప్తము కాదు. అందుచేత జగత్తుయొక్క యభిన్ననిమిత్తోపాదానకారణత్వము బ్రహ్మమునకుఁ దటస్థలక్షణముగా సంభవించు ననునది సిద్ధమైనది.

శంక:—ఎప్పుడొక ప్రమాణముచేత బ్రహ్మమునందు జగత్కారణత్వము సిద్ధమగుచున్నదో అప్పుడు పూర్వోక్తతటస్థలక్షణము బ్రహ్మమునందు సంభవించు చున్నది. కారణత్వము సిద్ధింపక పూర్వోక్తలక్షణము సంభవింపదు.

సమాధానము:—బ్రహ్మమునకు జగత్తుయొక్క యుత్పత్తిస్థితిలయకారణత్వము సాక్షాత్ శ్రుతిప్రమాణముచేతను వ్యాసభగవానుల సూత్రముచేతను సిద్ధించు చున్నది. అందు శ్రుతి—“యతో వా ఇమాని భూతాని జాయంతే। యేన జాతాని జీవంతి। యత్ప్రయంత్యభి సంవిశంతి” — భావము॥ ఏబ్రహ్మమునందుండి యీసమస్తభూతము లుత్పన్న మగుచున్నవో, ఉత్పన్నములైన ఈసమస్తభూతములు ఏబ్రహ్మముచేత జీవనమును పొందుచున్నవో, మృత్యువును పొందిన యీ సర్వభూతము లేబ్రహ్మమునందు లయమును పొందుచున్నవో. సూత్రము—“జన్మాద్యస్య యతః”—భావము॥ సర్వజ్ఞత్వమును సర్వశక్తియుఁగల యేకారణమునందుండి ఈయాకాశాదిప్రపంచముయొక్క యుత్పత్తిస్థితిలయములు గలుగుచున్నవో యది యే బ్రహ్మము. ఇంతపర్యంతము బ్రహ్మముయొక్క తటస్థలక్షణము నిరూపింపఁబడినది.

మఱియుఁ దటస్థలక్షణముయొక్క జ్ఞానము కలిగియు నెంతపర్యంతము బ్రహ్మముయొక్క స్వరూపలక్షణజ్ఞానము గలుగుట లేదో, అంతపర్యంతము వాస్తవమైనస్వరూపముచే ఆబ్రహ్మము తెలియఁబడుట లేదు. అందువలన నిఁకఁ దత్పదార్థరూపబ్రహ్మముయొక్క స్వరూపలక్షణము చెప్పఁబడుచున్నది.

(*) (17) తత్పదార్థస్వరూపలక్షణనిరూపణము. (*)

అందు “స్వరూపం సద్వ్యావర్తకం స్వరూపలక్షణమ్” — భావము॥

లక్షణము స్వాశ్రయముయొక్క స్వరూపమైయుండి స్వాలక్ష్యమును అన్యపదార్థములనుండి భిన్నము చేయునట్టి లక్షణము స్వరూపలక్షణ మనఁబడును. ఉదాహరణము—పృథివికి పృథివీత్వము స్వరూపలక్షణమై యున్నది. జాతివ్యక్తుల కెట్టికిని సిద్ధాంతమునందు తాదాత్మ్యమే యంగీకరింపఁబడి యున్నది. అందువలనఁ బృథివీత్వమునకుఁ బృథివీవ్యక్తికిని తాదాత్మ్యమే యున్నది. అందువలనఁ బృథివీత్వజాతి పృథివియొక్క స్వరూపమైయున్నది ఆపృథివిని జలాదీతరపదార్థములనుండి భిన్నము చేయుచున్నది. అందువలనఁ బృథివీత్వజాతి యాపృథివికి స్వరూపలక్షణమై యున్నది. ఈలాగుననే సత్యజ్ఞానానందములు మూఁడును బ్రహ్మముయొక్క స్వరూపలక్షణమై యున్నవి. అసత్యజ్ఞానానందము లనుమూఁడును బ్రహ్మముయొక్క స్వరూపమయ్యును బ్రహ్మమును అసజ్జడదుఃఖరూపజగత్తునుండి భిన్నము చేయుచున్నది. అందువలన అసత్యాదులయందు బ్రహ్మముయొక్క స్వరూపలక్షణత్వము సంభవించుచున్నది.

శంక:—సత్యాదులు బ్రహ్మముయొక్క స్వరూపమని యంగీకరించిన యెడల అసత్యాదులయందు బ్రహ్మముయొక్క లక్షణత్వమును బ్రహ్మమునందు అసత్యాదిలక్షణములకు లక్ష్యత్వమును కలుగకపోవలయును. ఏల యన, లక్ష్యలక్షణభావములు భేదమునందుమాత్రమే ప్రసిద్ధములై యున్నవి. అభేదమునందు లక్ష్యలక్షణభావములు కలుగుటలేదు. అటుగాక, అభేదమునందును లక్ష్యలక్షణభావములు కలుగునన్నయెడలఁ బృథివియును బృథివికి లక్షణము కావలయును. అట్లే బ్రహ్మమును బ్రహ్మమునకు లక్షణము కావలయును.

సమాధానము:—అసత్యాదులు యద్యపి వాస్తవముగా బ్రహ్మముయొక్క స్వరూపమే యగుచున్నవి. తథాపి అసత్యాదులయందు బ్రహ్మముయొక్క కల్పితభేదము మేము అంగీకరించుచున్నాము. ఆకల్పితభేదము నంగీకరించుటచేతనే బ్రహ్మమునకును సత్యాదులకును లక్ష్యలక్షణభావములు సంభవించుచున్నవి. ఈయర్థము పూర్వాచార్యులచేతను చెప్పఁబడి యున్నది. శ్లో. ॥ ఆనందో విషయానుభవో నిత్యత్వం చేతి సంతి ధర్మాః బ్రహ్మణో ఽపృథక్త్వేపి పృథగివావభాసంతే— భావము॥ ఆనందము జ్ఞానము నిత్యత్వము అను మూఁడును బ్రహ్మముయొక్క ధర్మములై యున్నవి. ఆమూఁడుధర్మములు వాస్తవముగా బ్రహ్మముకంటె నభిన్నమై యుండియు భిన్నములవలెఁ బ్రతీతము లగుచున్నవి.

శంక:—అసత్యాదిధర్మములు వాస్తవముగా బ్రహ్మమునకన్న నభిన్నము లైనయెడల నవి బ్రహ్మమునకన్న భిన్నముగా నేకారణముచేతఁ బ్రతీతము లగుచున్నవి?

సమాధానము:—అంతఃకరణమును ఆయంతఃకరణధర్మము నను నుపాధులవశముచేత ఆసత్యాదులకు బ్రహ్మమునకన్న పృథక్ప్రతీతి సంభవించుచున్నది. అది యెట్లనఁగా, బాధాభావవిశిష్టచైతన్యము సత్యపదముయొక్క వాచ్యార్థమై యున్నది. వృత్త్యవచ్ఛిన్నచైతన్యము జ్ఞానపదముయొక్క వాచ్యార్థమై యున్నది. ప్రీత్యాదివృత్త్యవచ్ఛిన్నచైతన్య మ్మానందపదముయొక్క వాచ్యార్థమై యున్నది. అందువలన నాసత్యాదులకును బ్రహ్మమునకును వాస్తవముచేత భేదము లేక పోయినను ఉపాధికృతభేద ముండుటచే లక్ష్యలక్షణభావము సంభవించుచున్నది. మఱియు ఆసత్యాదిపదములు భాగత్యాగలక్షణచేత నఖండబ్రహ్మమునే బోధించుచున్నవి. అందువలన నాలక్షణవాక్యముచేత సత్యాదులకును బ్రహ్మమునకును గుణగుణిభావము సిద్ధింపదు. మఱియు ఆసత్యాదిపదములయొక్క వాచ్యార్థమునకు భేదము పూర్వము చెప్పఁబడి యున్నది. అందువలన ఆసత్యాదిపదములయందు పర్యాయత్వమును కలుగదు.

ఇఁక, ఆలక్షణవాక్య మందుండు సత్యాదిపదములయొక్క ప్రయోజనము చెప్పఁబడుచున్నది. అచ్చట «సత్యం బ్రహ్మ» అని యింతమాత్రమే బ్రహ్మముయొక్క స్వరూపలక్షణ మనినయెడల, నైయాయికు లంగీకరించియుండు సత్తాజాతియందు ఆలక్షణమున కతివ్యాప్తి కలుగును. మఱియు లక్ష్యబ్రహ్మమునకు జడత్వము ప్రాప్త మగును. ఆదోషమును నివారించుటకొఱకు లక్షణమునందు «జ్ఞాన» మను పదము చెప్పఁబడినది. అచ్చట ఆసత్తాజాతియందు జ్ఞానరూపత్వము లేదు. అందువలన ఆసత్తాజాతియం దాలక్షణమున కతివ్యాప్తి కలుగదు. బ్రహ్మమునందు జడత్వమును కలుగదు. «జ్ఞానం బ్రహ్మ" అను నింతమాత్రమే బ్రహ్మముయొక్క లక్షణ మనినయెడల నైయాయికు లంగీకరించి యుండు నాత్మయొక్క జ్ఞానగుణమునందు లక్షణమున కతివ్యాప్తి కలుగును. మఱియు లక్ష్యబ్రహ్మమునకు అనిత్యత్వమును అపురుషార్థత్వమును ప్రాప్త మగును. ఆదోషమును నివారించుటకొఱకు లక్షణమునందు «ఆనంద» మ్మనుపదము చెప్పఁబడినది. అచ్చట ఆజ్ఞానగుణమునం దానందరూపత్వము లేదు. అందువలన జ్ఞానగుణమునందు ఆలక్షణమున కతివ్యాప్తి కలుగదు. లక్ష్యబ్రహ్మమునకు అపురుషార్థరూపత్వమును గలుగదు. «ఆనందం బ్రహ్మ» యను నింతమాత్రమే బ్రహ్మముయొక్క లక్షణ మనినయెడల విషయజన్యసుఖమునందు ఆలక్షణమున కతివ్యాప్తియును లక్ష్యబ్రహ్మమునకు జడత్వమును ప్రాప్త మగును. ఆదోషమును నివారించుటకొఱకు లక్షణమునందు «జ్ఞాన" మ్మనుపదము చెప్పఁబడినది. విషయసుఖమునందు జ్ఞానరూపత్వము లేదు. అందువలన దానియం దతి

వ్యాప్తియును లక్ష్యబ్రహ్మమునకు జడత్వమును గలుగదు. మఱియు, ఆలక్ష్య బ్రహ్మమునకు అనిత్యత్వమును నివర్తించుటకొఱకు సత్య మ్మనుపదము చెప్పఁబడినది. ఈ రీతిగా ప్రయోజన ముండుటవలన ఆసత్యాదిపదములు మూఁడును సార్థకములై యున్నవి. ఇందువలన సత్యము జ్ఞాన మానంద మను మూఁడుధర్మములును చేరి బ్రహ్మము యొక్క స్వరూపలక్షణ మగుచున్నది.

శంక:—ఎప్పుడు బ్రహ్మమునకు సత్యాదిరూపత్వ మేదైన నొకప్రమాణముచేత సిద్ధించు చున్నదో అప్పుడే ఆసత్యాదులకు బ్రహ్మముయొక్క స్వరూపలక్షణత్వము సిద్ధించును. ఆప్రమాణ మేమి?

సమాధానము:—బ్రహ్మముయొక్క సచ్చిదానందరూపత్వమునందు సాక్షాత్ శ్రుతియును వ్యాసభగవానులసూత్రమును ప్రమాణములై యున్నవి. అందు శ్రుతి.—"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, ఆనందో బ్రహ్మ" — భావము॥ బ్రహ్మము సత్యరూప మయ్యును జ్ఞానరూప మయ్యును అనంతరూప మయ్యును ఆనందరూప మయ్యు నున్నది. ఇచ్చట అంత మనఁగా పరిచ్ఛేదము. అది దేనియందు లేదో అది అనంత మనఁబడును. అనఁగా దేశపరిచ్ఛేద కాలపరిచ్ఛేద వస్తుపరిచ్ఛేదాఖ్య త్రివిధపరిచ్ఛేదరూప మైనయంతము లేని దేదియో అది అనంత మనఁబడును. అట్టి యనంతత్వము బ్రహ్మమునందే యున్నది. ఈయర్థము అన్యశాస్త్రములందును జెప్పఁబడి యున్నది. శ్లో. "నవ్యాపిత్వా ద్దేశతోఽంతః నిత్యత్వా న్నాపి కాలతః। నవస్తుతోఽపి సార్వాత్మ్యా దానంత్యం బ్రహ్మణి త్రిధా"—భావము॥ బ్రహ్మము సర్వదేశమునందును వ్యాపకమై యున్నది. అందువలన బ్రహ్మమునకు దేశముచేతను అంతము లేదు. మఱియు బ్రహ్మము నిత్య మగుటవలన ఆబ్రహ్మమునకు కాలముచేతను అంతము లేదు. బ్రహ్మము సర్వాత్మరూప మగుటవలన బ్రహ్మమునకు వస్తువుచేతను అంతము లేదు. ఈరీతిగా బ్రహ్మమునందు త్రివిధానంత్వ మున్నది. మఱియు, వ్యాససూత్రము. "ఆనందాదయః ప్రధానస్య" — భావము॥ ఆనందము సత్యము జ్ఞానము అనునది మొదలగుగుణములు బ్రహ్మముయొక్క స్వరూపములై బ్రహ్మమును గోచరింపఁజేయునవి యగుచున్నవి. అందువలన నిర్గుణబ్రహ్మధ్యానముకొఱకు ఆ యానందాదిగుణములు వేదముయొక్క సమస్తశాఖలయందును ఉపసంహార్యములై యున్నవి. ఈశ్రుతిసూత్రములచేత బ్రహ్మమునకు సత్యజ్ఞానానందరూపత్వము సిద్ధించు చున్నది. ఇందువలన నాసత్యజ్ఞానాదులయందు బ్రహ్మముయొక్క స్వరూపలక్షణత్వము సంభవించు చున్నది.

శంక:—బ్రహ్మమున కీస్వరూపలక్షణము సంభవించినను బూర్వోక్తజగదుత్పత్తిస్థితిలయకారణత్వరూపతటస్థలక్షణము ఘటిల్లదు. ఏల యన, బ్రహ్మము జగత్తుయొక్క ఉపాదానకారణ మనియును నిమిత్తకారణ మనియును మీ రంగీకరించుచున్నారు. దానియందుఁ బ్రథమ మగు నుపాదానకారణత్వమే బ్రహ్మమునకు ఘటిల్లదు. ఏల యన, ఆయుపాదానకారణము ఆరంభకము పరిణామి వివర్తాధిష్ఠానము అనుభేదముచేతఁ ద్రివిధ మగుచున్నది. ఆత్రివిధమునందు బ్రహ్మము నెట్టియుపాదానకారణముగా మీ రంగీకరించుచున్నారు? అందు మీమతమునందు బ్రహ్మ మేకము నద్వితీయము నగుటవలన బ్రహ్మమునకు జగత్తుయొక్క ఆరంభకత్వము ఘటిల్లదు. పరస్పరసంయుక్తానేకద్రవ్యములకే ఆరంభకత్వము గలదు. ఉదాహరణము—నైయాయికమతమునందు పరస్పరసంయుక్తానేకపరమాణువులకే జగత్తుయొక్క ఆరంభకత్వ మున్నది. మఱియు “సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ, నిష్కలం నిష్క్రియం శాంతమ్, అవికార్యోయ ముచ్యతే” ఇత్యాదిశ్రుతిస్మృతులచేత బ్రహ్మము నిర్గుణము నిష్క్రియము నిరవయవము నని చెప్పఁబడి యున్నది. అందువలన బ్రహ్మమునకుఁ బరిణామ్యుపాదానత్వమును ఘటిల్లదు. ఏల యన, గుణక్రియాసహితసావయవమైన క్షీరాదికమే దధ్యాదిపరిణామమును బొందుచున్నది. మఱియుఁ దృతీయ మగు వివర్తాధిష్ఠానత్వరూపమైన యుపాదానత్వము గూడ బ్రహ్మమునకు ఘటిల్లదు. ఏల యన, ఘట మున్నది పట మున్నది యని ఘటపటాదిప్రపంచ మెల్లరకును సత్యముగానే అనుభూత మగుచున్నది. అట్టి సత్యప్రపంచమునకు బ్రహ్మముయొక్క వివర్తరూపత్వముచేత మిథ్యాత్వకల్పనయం దేప్రమాణమును లేదు. మఱియుఁ బ్రపంచమునకు మిథ్యాత్వము లేక బ్రహ్మమునకు వివర్తాధిష్ఠానత్వము ఘటిల్లదు. అందువలనఁ బూర్వోక్తత్రివిధోపాదానత్వమునం దేవిధమైన యుపాదానత్వమును బ్రహ్మమునకు ఘటిల్లదు.

మఱియు బ్రహ్మమునకు జగత్తుయొక్క కర్తృత్వము గూడ ఘటిల్లదు. ఏల యన, కార్యోత్పత్తి కనుకూలమైనజ్ఞానేచ్ఛాప్రయత్నములను మూఁటిని గలవాఁడే కర్త యని పూర్వము చెప్పఁబడి యున్నది అచ్చట బ్రహ్మముయొక్క జ్ఞానేచ్ఛాప్రయత్నములు మూఁడును నిత్యములా? లేక అనిత్యములా? నిత్యము లయినయెడల సర్వకాలములయందును జగత్తున కుత్పత్తియే కావలయును, ఒకకాలమునందును జగత్తుయొక్క ప్రళయము కలుగఁగూడదు. అందువలనఁ బ్రళయమును బ్రతిపాదించునట్టిశాస్త్రములకు విరోధము కలుగును. జ్ఞానాదుల ననిత్యము లనినయెడల జగత్తువలె జ్ఞానేచ్ఛాదులును గార్యరూపములే యగును. అందువలన జ్ఞానాదులకు

బ్రహ్మోశితత్వము కలుగకపోవలయును. ఏల యన, బ్రహ్మమునకుఁ బరిణామాఽభావము పూర్వము చెప్పఁబడి యున్నది. ఈరీతిగా బ్రహ్మమునం దుపాదానత్వమును గర్తృత్వమును అసంభవ మగుటచే అభిన్ననిమిత్తోపాదానకారణత్వము ఘటిల్లదు. అందువలనఁ బూర్వము చెప్పఁబడిన జగదుత్పత్తిస్థితిలయకారణత్వరూపతటస్థలక్షణ మసంగతము. మఱియుఁ గారణము లేక కార్యోత్పత్తి కలుగదు, అందువలన నీజగద్రూపకార్యమునకు బ్రహ్మమునకన్న భిన్నమైన యొకకారణ మంగీకరింపవలయును. అట్టికారణము సత్త్వరజస్తమోనామక త్రిగుణరూపప్రధానమై యున్నది. ఆప్రధానమునందుండియే మహత్తత్త్వాదిక్రమముగా ఈజగత్తుత్పన్న మగుచున్నది. పరిణామి యగుటవలనఁ బ్రధానమునకు జగదుత్పత్త్యాదులయొక్క కారణత్వము సంభవించుచున్నది. మఱియు ఆత్మరూపపురుషుఁ డైననో అసంగుఁడు నిర్వికారుఁడు. అందువలన నాపురుషునియందు జగత్తుయొక్క కారణత్వము ఘటిల్లదు.

సమాధానము:—ఈరీతిగా శంకించుసాంఖ్యులను ఖండించుటకొఱకుఁ బూర్వోక్తతత్పదార్థము విభజింపఁబడుచున్నది ఆతత్పదార్థము ద్వివిధము. ఒకటి వాచ్యార్థము, మఱియొకటి లక్ష్యార్థము. ఏయర్థము ఏపదముయొక్క శక్తి వృత్తి వలనఁ దెలియఁబడు చున్నదో ఆయర్థము ఆపదముయొక్క వాచ్యార్థ మనఁబడును. ఏయర్థము ఏపదముయొక్క లక్షణావృత్తిచేతఁ దెలియఁబడు చున్నదో ఆయర్థము ఆ పదముయొక్క లక్ష్యార్థ మనఁబడును. శక్తిలక్షణలయొక్క స్వరూపము ముందు ద్వితీయపరిచ్ఛేదమునందుఁ జెప్పఁబడును. అందు మాయోపహితచైతన్యము తత్పదముయొక్క వాచ్యార్థము. మాయారహితశుద్ధచైతన్యము తత్పదముయొక్క లక్ష్యార్థము. ఇచ్చట అభిప్రాయ మే మనఁగా, మాయారహితనిర్వికారశుద్ధబ్రహ్మమునకు జగదుపాదానత్వము సంభవింపక పోయినను మాయోపహితబ్రహ్మమున కుపాదానత్వము సంభవించు చున్నది. ఆయుపాదానత్వమును ఆరంభకత్వరూపముగాని పరిణామిత్వరూపముగాని కాదు. మ ఱే మనఁగా వివర్తాధిష్ఠానత్వరూపమై యున్నది. అచ్చట నధిష్ఠానవస్తువుయొక్క యథార్థముకాని వేఱురూపము వివర్త మనఁబడును. ఎట్లు రజ్జుశుక్త్యాద్యధిష్ఠానములకు వాస్తవము కాని సర్పరజతాదులు వేఱురూపములై యున్నవో అట్లు బ్రహ్మమునకును ఈజగత్తు వాస్తవముకాని వేఱురూపమై యున్నది. అట్టి జగద్రూపవివర్తాధిష్ఠానత్వ మామాయోపహితబ్రహ్మమునకు సంభవించు చున్నది.

మఱియు, ఘట మున్నది పట మున్నది — ఇత్యా ద్యనుభవములచేత జగత్తుయొక్క సత్యత్వమే సిద్ధించు చున్నది. అందువలన బ్రహ్మముయొక్క వివర్తత్వ

ముచేత జగత్తునందు మిథ్యాత్వము సంభవింపదని వాదిచేత పూర్వ మేది చెప్పఁబడినదో యది యసంగతము. ఏల యన, ఆయనుభవము ఆఘటపటాదులయందుండు నధిష్ఠానచైతన్యముయొక్క సత్యత్వమునే విషయము చేయుచున్నది గాని యాఘటాదులయొక్క సత్యత్వమును విషయము చేయుట లేదు. అందువలన ఆయనుభవము ప్రపంచముయొక్క మిథ్యాత్వమునకు బాధకము గాదు. మఱియు « నేహ నానాస్తి కించన » అనుశ్రుతి బ్రహ్మమునకన్న వేఱైన సర్వప్రపంచమును నిషేధించు చున్నది. అందువలనఁ బ్రపంచమునకు స్వతఃసత్త సంభవింపదు. మఱియు నావాదిచేత జగత్తుయొక్క మిథ్యాత్వమునందే ప్రమాణాభావము చెప్పఁబడినదో యదియు నసంగతము. ఏకారణముచేత ననఁగా « వాచారంభణం వికారో నామధేయమ్ " అనుశ్రుతియే సాక్షాత్తుగా జగత్తుయొక్క మిథ్యాత్వమును జెప్పుచున్నది. మఱియు బ్రహ్మమునకు జగత్తుయొక్క యుపాదానత్వ మవశ్య మంగీకరింపవలయును. ఎట్లన « యత్ప్రయం త్యభిసంవిశంతి " యనుశ్రుతి ఆబ్రహ్మమునందే జగత్తుయొక్క లయము చెప్పి యున్నది. ఏకార్య మేకారణమునందు లయ మొందుచున్నదో యాకార్యమునకు నాకారణ ముపాదానమే యగును. ఎట్లు ఘటాదికార్యములు మృత్తికాదికారణములయందే లయ మగుటవలన ఆఘటాది కార్యములకు మృత్తికాదికారణము లుపాదానములుగానే చూడఁబడు చున్నవో అట్లు శ్రుతిప్రతిపాదించినచొప్పున జగత్తుయొక్క లయమున కాధార మగుటవలన బ్రహ్మమునకు జగత్తుయొక్క యుపాదానత్వ మవశ్య మంగీకరింపవలయును. లేక « బహుస్యాం ప్రజాయేయ » అను శ్రుతిచేత బ్రహ్మమే యనేక మగుట చెప్పఁబడి యున్నది. మఱియు లోకమునందు మృత్తికాద్యుపాదానకారణములకే ఘటశరావాదిరూపానేకత్వము చూడఁబడు చున్నది. ఈకారణముచేతను బ్రహ్మమునకు జగత్తుయొక్క యుపాదానత్వము సంభవించు చున్నది. మఱియు సాంఖ్యవాదిచేతఁ బ్రధానమునకు జగత్తుయొక్క యుపాదానత్వ మంగీకరింపఁబడి యున్నది. అది యుక్తము కాదు. ఏల యన, ఆప్రధానము జగత్తున కుపాదానకారణ మనునర్థమునం దొక ప్రమాణమును లేదు. అనఁగా, ఒకశ్రుతియందును త్రిగుణాత్మకప్రధానము జగత్తున కుపాదానముగాఁ జెప్పఁబడ లేదు. మఱే మనఁగా, « ఆత్మన ఆకాశః సంభూతః " ఇత్యాదిసమస్తశ్రుతులయందును జేతనబ్రహ్మమునకే జగత్తుయొక్క యుపాదానత్వము చెప్పఁబడి యున్నది. యద్యపి ఈశ్రుతిచేత నాత్మకే జగత్తుయొక్క యుపాదానత్వము ప్రతీత మగు చున్నది. బ్రహ్మమున కుపాదానత్వము ప్రతీత మగుట లేదు. తథాపి « తత్సృష్ట్వా తదే వానుప్రావిశత్ " ఇత్యాదిశ్రుతులయందు బ్రహ్మమునకే జీవ

భావముచేత జగత్తునందు ప్రవేశము చెప్పఁబడి యున్నది. అందువలన నీయాత్మ బ్రహ్మముకన్న భిన్నము కాదు. మఱియును, ఆబ్రహ్మమే యాత్మశబ్దముచేఁ జెప్పఁబడినది. అందువలన ఈయాత్మ జగత్తున కుపాదానకారణ మనుటచేతను బ్రహ్మమునకే యుపాదానత్వము సిద్ధించుచున్నది. లేక "తదైక్షత సో உకామయత బహుస్యాం ప్రజాయేయ" ఇత్యాదిశ్రుతులయందు అనేకరూపములగుటకుఁ గారణమునందు సంకల్పముయొక్క కర్తృత్వమును నిచ్ఛయొక్క కర్తృత్వమును జెప్పఁబడి యున్నవి. దానిచేతను బ్రహ్మమునకే యుపాదానత్వము సిద్ధించుచున్నది. ప్రధానమున కుపాదానత్వము సిద్ధించుట లేదు. ఏల యన, ఆసంకల్పేచ్ఛలయొక్క కర్తృత్వము చేతనముయొక్క ధర్మములే యగును, జడముయొక్క ధర్మములు కావు. మీారంగీకరించియుండు ప్రధానము జడమై యున్నది. అందువలన ఆప్రధానమునందు సంకల్పేచ్ఛలయొక్క కర్తృత్వము సంభవింపదు. అందువలన బ్రహ్మమునకే జగత్తుయొక్క యుపాదానత్వ మున్నది. ప్రధానమునకు లేదనునది సిద్ధమైనది.

ఎట్లు మాయోపహితబ్రహ్మమునకు జగత్తుయొక్క యుపాదానత్వము సంభవించుచున్నదో అట్లు జగత్తుయొక్క కర్తృత్వమును ఆమాయోపహితబ్రహ్మమునకే సంభవించు ననునది పూర్వము చెప్పఁబడి యున్నది. మాయోపహితేశ్వరునియొక్క జ్ఞానేచ్ఛాప్రయత్నము లను మూఁడును ఉత్పత్తినాశసహితములై యున్నవి. అట్టి జ్ఞానేచ్ఛాప్రయత్నవిశిష్టమైనకర్తృత్వమున కాశ్రయత్వము యద్యపి నిర్వికారశుద్ధబ్రహ్మమునకు సంభవించుట లేదు. తథాపి ఆమాయోపహితబ్రహ్మమునకు సంభవించుచున్నది ఆకారణముచేత, అనఁగా ఆమాయోపహితబ్రహ్మమునకే సర్వజగత్తుయొక్క వివర్తాధిష్ఠానత్వ మున్నది. అందువలనఁ బూర్వోక్తదోషము ప్రాప్తమగుట లేదు. ఇందుచేతఁ బూర్వోక్తాభిన్ననిమిత్తోపాదానకారణత్వము బ్రహ్మమునకు తటస్థలక్షణముగా సంభవించు ననునది సిద్ధమైనది.

### (18) మాయయొక్క స్వరూపలక్షణప్రమాణములందు శంకాసమాధానములు.

శంక:—మాయచేత నుపహితమైన బ్రహ్మము జగత్తునకుఁ గారణమై యున్న దనిన, ఆమాయ యెట్టివస్తువు? అనఁగా, ఆమాయయొక్క స్వరూపము లక్షణము ప్రమాణ మనుమూఁడును నిరూపించుటకు సాధ్యము కానందువలన ఆమాయ యొకవస్తువు కాదు. ఆమాయయొక్క స్వరూపము లక్షణము ప్రమాణము అను మూఁటియొక్క అసంభవము క్రమముగా నిరూపింపఁబడును. ఆమాయ సత్యమా? లేక

మిథ్యయా? అచ్చట సత్య మను ప్రథమపక్షమునందును ఆమాయ బ్రహ్మమునకు భిన్నమా? లేక యభిన్నమా? భిన్న మను ప్రథమపక్ష మంగీకరించిన యెడల "ఏక మేవా ద్వితీయం బ్రహ్మ" అను శ్రుతికి విరోధ మగును. ఏల యన, ఈ శ్రుతి బ్రహ్మమును అద్వితీయ మని చెప్పుచున్నది. బ్రహ్మమునకు భిన్న మైనమాయ సత్య మైనయెడల బ్రహ్మమున కద్వితీయత్వము ఘటిల్లదు. లేక "అసంగో నహి సజ్జతే" ఇత్యాదిశ్రుతులయందు బ్రహ్మము అసంగ మని చెప్పఁబడి యున్నది. అట్టి అసంగ బ్రహ్మమునకు దేనితోడను సంబంధము సంభవింపదు. ఆసంబంధము లేక బ్రహ్మము నందు మాయోపహితత్వమే ఘటిల్లదు. లేక, బ్రహ్మమునకు మాయతో నెట్టిసంబంధ మున్నది? సంయోగసంబంధమా? లేక సమవాయసంబంధమా? లేక తాదాత్మ్యసంబంధమా? లేక భేదాభేదసంబంధమా? అచ్చట సంయోగ మను ప్రథమపక్షము ఘటిల్లదు. ఏల యన, ఆసంయోగము అవ్యాప్యవృత్తి యగుటవలన సావయవద్రవ్యములయొక్క ధర్మ మగుచున్నది. ఉదాహరణము—పక్షికి వృక్షముతో సంయోగ మున్నది, ఆసంయోగము వృక్షముయొక్క సర్వదేశమునం దుండదు. మఱే మనఁగా, వృక్షముయొక్క శాఖ యగు నేకదేశమునందే ఆసంయోగ మున్నది. మూలాదిదేశములయందు లేదు. అందువలన ఆసంయోగము అవ్యాప్యవృత్తి యగుచున్నది. ఈకారణముచేతనే సంయోగము ఆపక్షివృక్షాదిసావయవద్రవ్యములయొక్క ధర్మమే యగుచున్నది. బ్రహ్మమో నిరవయవము. అందువలన బ్రహ్మమునకు మాయతో సంయోగసంబంధము ఘటిల్లదు. ద్వితీయ మగు సమవాయపక్షమును ఘటిల్లదు. ఏల యన, ఆసమవాయసంబంధము మీమతమునం దంగీకరింపఁబడుట లేదు. గుణగుణులు క్రియాక్రియావంతములు జాతివ్యక్తులు అవయవావయవులు ఇవి మొదలగువానికే సమవాయసంబంధ మున్నది. ఆగుణగుణిభావాదులు బ్రహ్మమాయలయందు లేవు. అందువలన బ్రహ్మమునకు మాయతో ఆసమవాయసంబంధము ఘటిల్లదు. తృతీయ మగు తాదాత్మ్యపక్షమును ఘటిల్లదు. ఏల యన, భేదరహితపదార్థములకే ఆతాదాత్మ్య ముండును, బ్రహ్మము మాయ అను రెండును పరస్పరము భేదసహితములు అందువలన ఆరెంటికిని బరస్పరతాదాత్మ్యము ఘటిల్లదు. చతుర్థ మగుభేదాభేదపక్షమును ఘటిల్లదు. ఏల యన భేదాభేదములు రెండును బరస్పరము విరుద్ధ మగుటవలన ఏకాధికరణమునం దుండవు ఈరీతిగా బ్రహ్మమునకు మాయతో సంబంధము నిరూపించుటకు సాధ్యము కానందున బ్రహ్మము నందు మాయోపహితత్వము ఘటిల్లదు. మఱియు ఆమాయ బ్రహ్మముతో అభిన్న మను ద్వితీయపక్ష మంగీకరించినయెడల, అదియును ఘటిల్లదు. ఏల యన, బ్రహ్మ

మో చేతనము, మాయ జడము, జడచేతనములకు అభేదము ఘటిల్లదు. మఱియు, మాయ మిథ్య యను ఆద్యద్వితీయపక్ష మంగీకరించినయెడల, అదియును ఘటిల్లదు; ఏల యన, మాయ మిథ్య యగుటచే ఆమాయావిశిష్టేశ్వరునకును మిథ్యాత్వము ప్రాప్త మగును. ఈశ్వరుఁడును మిథ్య యని యంగీకరించినయెడల, ఈశ్వరజ్ఞానము చేత మోక్షప్రాప్తిని చెప్పునట్టిమోక్షశాస్త్ర మప్రమాణ మగును. ఏకారణముచేత ననఁగా, మిథ్యావస్తువుయొక్క జ్ఞానముచేత మోక్షప్రాప్తి ఘటిల్లదు. ఈరీతిగా ఆ మాయయొక్క స్వరూపము నిరూపించుటకు సాధ్యము కానిదగును. ఆమాయను నిరూపించుటకు సాధ్యము కాక పోవుటచే ఆమాయయొక్క లక్షణమును నిరూపించుటకు సాధ్యము కానిదే యగును. ఏల యన ధర్మి యుండినప్పుడే దానియొక్క ధర్మములు విచారింపఁబడు చున్నవి. ధర్మిని నిరూపించుటకు సాధ్యము కానప్పుడు ఆధర్మియొక్క అసాధారణధర్మరూపలక్షణమును నిరూపించుటకు అత్యంతము దుస్సాధ మగును. మాయను నిరూపించుటకు సాధ్యము కానందున ఆమాయయందు ప్రమాణమును నిరూపించుటయు దుస్సాధమే యగును. ఏకారణముచేత ననఁగా, విషయము లేక యొక ప్రమాణమును ప్రవర్తించుట లేదు. ఈరీతిగా స్వరూపము లక్షణము ప్రమాణము లనుమాటచే మాయను నిరూపించుట కసాధ్య మగుటవలన ఆమాయోపహితచైతన్యమునకుఁ దత్పదముయొక్క వాచ్యార్థత్వము సంభవింపదు.

ఇట్లు శంక కలుగఁగా, ఇఁక స్వరూపము లక్షణము ప్రమాణము అనుమాటచే మాయను నిరూపించుటకొఱకు ప్రథమమున దానియుపోద్ఘాతముచేత దృష్టాంతసహితముగాఁ బరమాత్మయందు సామాన్యముగా అధ్యాసము నిరూపింపఁబడు చున్నది. ముందు చెప్పఁదగినయర్థమును బుద్ధియం దుంచుకొని ఆయర్థము సిద్ధించుట కొఱకుఁ బ్రథమమున అన్యార్థమును జెప్పుట యుపోద్ఘాత మనఁబడును.

॥ (19) పరమాత్మయందు సామాన్యముగా అధ్యాసము చెప్పుట. ॥

ఎట్లు శుక్తిరజ్జ్వాదులయందు రజతసర్పాదులు కల్పితము లగుచున్నవో అట్లు చేతనమునం దచేతనము కల్పిత మగుచున్నది.

శంక:—చేతనమునం దచేతనము కల్పిత మనునర్థమునందుఁ బ్రమాణమేమి ?

సమాధానము:—ఈయర్థమునందు శ్రుతార్థాపత్తియే ప్రమాణము. శ్రుత మగువాక్యార్థమునకు అనుపపత్తి యగుటవలన అన్యార్థకల్పన శ్రుతార్థాపత్తి యనఁబడును. అది చెప్పఁబడు చున్నది. « ఇదం సర్వం య దయ మాత్మా, ఆత్మై

వేదం సర్వమ్, పురుష ఏవేదం విశ్వమ్, సర్వం ఖల్విదం బ్రహ్మ, వాసుదేవః సర్వమ్, నారాయణః సర్వ మిదం పురాణః" ఇవి మొదలగు ననేకశ్రుతిస్మృతివాక్యముల యందుఁ జేతనమున కన్యమగు నచేతనముయొక్క యభావమే ప్రతిపాదింపఁబడి యున్నది. పూర్వోక్తశ్రుతివచనములయందు "ఇదం సర్వమ్" అను వాక్యము చేత ప్రత్యక్షాదిప్రమాణములచే సిద్ధించి యుండు నీయాకాశాదిజడజగత్తు చెప్పఁబడు చున్నది. మఱియు ఆత్మ బ్రహ్మము పురుషుఁడు వాసుదేవుఁడు నారాయణుఁడు అను శబ్దములచేత అద్వితీయమును సర్వమునకు సాక్షియును బ్రత్యగ్రూపము నైన పరమాత్మ చెప్పఁబడు చున్నది. అచ్చట ప్రథమశ్రుతియందు ప్రపంచముయొక్క వాచక మైన "ఇదం సర్వమ్" అనుశబ్దమునకును బరమాత్మయొక్క వాచక మైన "ఆత్మా" యనుశబ్దమునకును సామానాధికరణ్యము ప్రతీత మగుచున్నది. అచ్చట జడమగుజగత్తునకును జేతన మగునాత్మకును వాస్తవమున నేకత్వము సంభవింపదు. అందువలనఁ జేతనాఽచేతనముల కభేదప్రతిపాదకత్వరూపముఖ్యసామానాధికరణ్య మాస్థానమునందు సంభవింపదు. మఱే మనఁగా, ఎట్లు "యో ఽయం చోరః స స్థాణుః" అనువచనమునందు చోరస్థాణువు లను రెండుశబ్దములకును బాధసామానాధికరణ్య మున్నదో అట్లు పూర్వోక్తశ్రుతులయందు ఆత్మ సర్వము అను రెండు పదములకును బాధసామానాధికరణ్యమే యున్నది. అనఁగా, దృష్టాంతవాక్యమునం దుండు చోరస్థాణువు లను రెండుపదములయొక్క సామానాధికరణ్యముచేత స్థాణువునకు వేఱుగాఁ జోరునియొక్క యభావ మెట్లు ప్రతీత మగుచున్నదో, అట్లు దార్ష్టాంతికశ్రుతివాక్యములయందును ఆత్మ సర్వము అను రెండుపదములయొక్క సామానాధికరణ్యముచేత ఆత్మకు భిన్నముగా సర్వజడరూపజగత్తుయొక్క అభావమే ప్రతీత మగుచున్నది. అనఁగా, ప్రపంచాఽభావసహితము ఆత్మ అనుజ్ఞానము ఆశ్రుతివాక్యముచేత కలుగుచున్నది. ఎప్పుడు జడప్రపంచము బ్రహ్మమునందుఁ గల్పిత మని యంగీకరింపఁబడుచున్నదో అప్పుడే ఆజడప్రపంచముయొక్క అభావము సంభవించును. ప్రపంచము కల్పితము గా దన్నయెడ దానియొక్క యభావము సంభవింపదు. అందువలన ఆశ్రుత్యుక్తజడప్రపంచాభావము స్వప్రతియోగి యైన జడప్రపంచమునకుఁ గల్పితత్వము లేక యనుపపన్న మగుటవలన ఆజడప్రపంచమునకుఁ గల్పితత్వము కల్పింపఁబడు చున్నది. ఈరీతిగా శ్రుతార్థాపత్తిచేతనే చేతనమునందు అచేతనముయొక్క కల్పితత్వము నిశ్చిత మగుచున్నది. ఈరీతి యగునర్థము పూర్వోక్తేతరశ్రుతిస్మృతివాక్యములకును నెఱుఁగవలయును.

శంక:—పూర్వము చేతనమునందు అచేతనము కల్పిత మనఁబడినది. అచ్చట చేతన మనునది యెట్టివస్తువు? అచేతన మనునది యెట్టివస్తువు?

సమాధానము:—నిత్యశుద్ధబుద్ధముక్తసత్యపరమానందాద్వయబ్రహ్మము చేతన మనఁబడును. అజ్ఞానాదిజడసమూహ మంతయు నచేతన మనఁబడును.

## (20) బ్రహ్మముయొక్క విశేషణఫలప్రమాణముల నిరూపణము.

ఇఁక బ్రహ్మముయొక్క నిత్యాదిసప్తవిశేషణములయొక్క ఫలమును వానికి శ్రుతిప్రమాణమును జెప్పఁబడును. బ్రహ్మమునందు వాస్తవముచే ననాత్మవస్తువుయొక్క తాదాత్మ్యము లేకపోయినను భ్రమచేత నాబ్రహ్మమునం దనాత్మవస్తువుయొక్క తాదాత్మ్యము ప్రతీత మగుచున్నది. భ్రమసిద్ధతాదాత్మ్యమును నిత్యాది విశేషణములు నివారించుచున్నవి. దానియందును గార్యప్రపంచముయొక్క తాదాత్మ్యమును నిత్య మనువిశేషణము నివారించుచున్నది. బ్రహ్మమునకు నిత్యత్వము "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః" అనునది మొదలైన శ్రుతిప్రమాణములచేతనే సిద్ధ మగుచున్నది. మఱియు ఆకార్యప్రపంచధర్మములయొక్క తాదాత్మ్యమును "శుద్ధ" మనువిశేషణము నివారించుచున్నది. బ్రహ్మమునకు శుద్ధత్వము "అస్నావిరꣳ శుద్ధ మపాపవిద్ధమ్" అనునది మొదలగు శ్రుతిప్రమాణములచేతనే సిద్ధ మగుచున్నది. రాగద్వేషాదివికారరహితత్వ మేదియో అదియే బ్రహ్మమునందు శుద్ధత్వమై యున్నది. మఱియు, కారణరూపమైనయజ్ఞానముయొక్క తాదాత్మ్యమును బుద్ధ మనువిశేషణము నివారించుచున్నది. సర్వథా యేకరసజ్ఞానరూపత్వము బుద్ధత్వ మనఁబడును. బ్రహ్మమునకు బుద్ధత్వము "ప్రజ్ఞానఘనః" అనునది మొదలగు శ్రుతిప్రమాణములచేతనే సిద్ధమై యున్నది మఱియు అజ్ఞానకృతావరణాదులయొక్క తాదాత్మ్యమును ముక్త మనువిశేషణము నివారించుచున్నది. బంధరహితత్వము ముక్తత్వ మనఁబడును. బ్రహ్మమునకు ముక్తత్వము "విముక్తశ్చ విముచ్యతే" ఇత్యాది శ్రుతిప్రమాణములచేతనే సిద్ధించుచున్నది. మఱియు మిథ్యాత్వమును సత్య మనువిశేషణము నివారించుచున్నది. త్రికాలములయందును ఏది యబాధితమై యున్నదో అది సత్య మని చెప్పఁబడును. బ్రహ్మమునకు సత్యత్వము "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" ఇత్యాది శ్రుతిప్రమాణముల చేతనే సిద్ధ మగుచున్నది. మఱియు ఆనంద మనువిశేషణము బ్రహ్మముయొక్క పురుషార్థత్వమును చెప్పుచున్నది. బ్రహ్మమునకు ఆనందరూపత్వము "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్, విజ్ఞాన మానందం బ్రహ్మ" ఇత్యాది శ్రుతిప్రమాణములచేతనే సిద్ధ

మగుచున్నది మఱియు అద్వయ మనువిశేషణము బ్రహ్మముయొక్క యఖండైకరసత్వమును జెప్పుచున్నది. ద్వైతము లేనిది అద్వయ మనఁబడును. అనఁగా భేదవాదులచేత కల్పింపఁబడిన యేపంచవిధభేదము లున్నవో ఆభేదములు లేనిది అద్వయ మనఁబడును. ఆపంచవిధభేదము లేవి యనఁగా—జీవులయొక్క పరస్పరభేదము, జీవేశ్వరద్వయముయొక్క పరస్పరభేదము, ఘటాదిజడపదార్థములయొక్క పరస్పరభేదము, ఈశ్వరునకును జడజగత్తునకును గల పరస్పరభేదము, జీవునకును జడజగత్తునకును గల పరస్పరభేదము. ఈప్రకారముగా జీవేశ్వరాదిరూపప్రతియోగులయొక్క భేదముచేత నాభేదములు పంచవిధములై యున్నవి. ఆసర్వభేదములును గల్పితములై యున్నవి. అందువలన ఆపంచవిధభేదరహితత్వము బ్రహ్మమునందు సంభవించుచున్నది. లేక, సజాతీయభేదము విజాతీయభేదము స్వగతభేదము లను నీత్రివిధభేదములు లేనిది అద్వయ మనఁబడును. బ్రహ్మమునకు అద్వయరూపత్వము “ఏక మేవా ద్వితీయమ్” ఇత్యాదిక శ్రుతిప్రమాణములచేతనే సిద్ధించు చున్నది

శంక:—పూర్వము అజ్ఞానాది జడసమూహ మచేతన మనఁబడినది. అచ్చట ఆయజ్ఞానముయొక్కస్వరూపము ఏది? లక్షణ మేది? ప్రమాణ మేది?

ఈశంకకు సమాధానార్థమై యిఁకఁ గ్రమముగా ఆయజ్ఞానముయొక్క స్వరూపమును లక్షణమును ప్రమాణమును చెప్పఁబడుచున్నది.

### (21) అజ్ఞానముయొక్క స్వరూపలక్షణప్రమాణముల నిరూపణము.

ఆయజ్ఞానము త్రిగుణాత్మకమై యున్నది. అనఁగా సత్త్వరజస్తమములను త్రిగుణములు ఆత్మగా (స్వరూపముగా) కలిగిన దేదియో అది త్రిగుణాత్మక మగు నజ్ఞానము. అచ్చట ఆయజ్ఞానముయొక్క కార్యభూతజగత్తునందు సుఖదుఃఖమోహరూపత్వము ప్రత్యక్షముగాఁ బ్రతీత మగుచున్నది. ఆసుఖాదిత్రయము క్రమముగా సత్త్వాదిత్రిగుణములయొక్క పరిణామములే యగును. కారణముయొక్క సమానస్వభావముతోఁ గూడినదే కార్యమై యున్నది. అందువలన జగద్రూపకార్యమునందుఁ ద్రిగుణరూపత్వమును జూచి కారణభూతాజ్ఞానమునందును ఆత్రిగుణరూపత్వము కల్పింపఁబడు చున్నది. మఱియు “అజా మేకాం లోహిత శుక్ల కృష్ణామ్” అను శ్రుతియును ఆయజ్ఞానము త్రిగుణరూప మని చెప్పుచున్నది. ఈరీతిగా అజ్ఞానముయొక్కస్వరూపము చెప్పఁబడినది.

ఇఁక ఆయజ్ఞానముయొక్కలక్షణము చెప్పఁబడుచున్నది “సదసద్విలక్షణమజ్ఞానమ్”—భావము॥ సత్యపదార్థముకన్నను అసత్యపదార్థముకన్నను విలక్షణమై

సది యేదియో అని యజ్ఞాన మనంబడును. అనఁగా, సత్య మనియును అసత్య మని యును నిరూపించుటకు సాధ్యము కానిది అజ్ఞాన మనఁబడును అచ్చట అజ్ఞానము సత్య మని అంగీకరించినయెడల సత్యమైన బ్రహ్మమువలె ఆయజ్ఞానమునకు నాశము లేక యుండవలయును. అయితే ఆయజ్ఞానము బ్రహ్మజ్ఞానముచేత నష్ట మగుచున్నది. అందువలన ఆయజ్ఞానము సత్యరూప మని నిరూపించుటకు సాధ్యము గాదు మఱియు ఆయజ్ఞానము అసత్య మని అంగీకరించినయెడల అసత్యమైనవంధ్యాపుత్రునివలె ఆ యజ్ఞానము ప్రత్యక్షము గాకపోవలయును. ఆయజ్ఞానమో నేను బ్రహ్మము నెఱుంగను అను ప్రత్యక్షానుభవమునకు విషయముగానే ప్రతీత మగుచున్నది. అందువలన ఆ యజ్ఞానము అసత్యరూప మనియును నిరూపించుటకు సాధ్యము గాదు. ఈకారణము చేత ఆయజ్ఞానమును అనిర్వచనీయ మందురు. అచ్చట « అసద్విలక్షణ మజ్ఞానమ్ » అను నింతమాత్రమే ఆయజ్ఞానమునకు లక్షణ మనినయెడల వంధ్యాపుత్రా ద్యసత్య పదార్థములకన్న విలక్షణమైన సత్యబ్రహ్మమునందు ఆలక్షణమున కతివ్యాప్తి కలు గును. ఆయతివ్యాప్తి దోషమును నివారించుకొఱకు లక్షణమునందు « సద్విలక్షణ » మనుపదము చెప్పఁబడినది. బ్రహ్మము సత్తుకన్న విలక్షణము కాదు. అందువలన దానియం దతివ్యాప్తి గలుగదు. మఱియు « సద్విలక్షణ మజ్ఞానమ్ » అను నింత మాత్రమే ఆయజ్ఞానమునకు లక్షణ మనినయెడల సత్యబ్రహ్మముకన్న విలక్షణమైన వంధ్యాపుత్రా ద్యసత్యపదార్థములయందు ఆలక్షణమునకు అతివ్యాప్తి కలుగును. ఆయతివ్యాప్తిదోషమును నివారించుటకొఱకు లక్షణమునందు అసద్విలక్షణ మ్మను పదము చెప్పఁబడినది. ఆవంధ్యాపుత్రాదికము అసత్తుకన్న విలక్షణము కాదు. అందు వలన దానియం దతివ్యాప్తి కలుగదు. వాస్తవముగా విచారించిచూచినయెడల « సద్విలక్షణ మజ్ఞానమ్ » అను నింతమాత్రమే అజ్ఞానమునకు లక్షణముగా సంభ వించుచున్నది. అస ద్విలక్షణపదము వ్యర్థమే యగును. ఎట్లన, అసద్వస్తు వొకటి యుం డినయెడల దానికి అసత్త్వమే సంభవించదు. అసద్వస్తువే యేదియు లేకుండునపుడు దేనియందు లక్షణమున కతివ్యాప్తి కలుగును? అందువలన నజ్ఞానముయొక్క లక్ష ణమునందు అసద్విలక్షణ మనుపదము గ్రంథకర్త చెప్పుట కేవలము శిష్యులయొక్క బుద్ధివృద్ధికొఱకని గ్రహింపవలయును.

శంక:—ఎట్లు అజ్ఞానము సద్విలక్షణమో అట్లు ఈకార్య ప్రపంచము గూడ సద్విలక్షణమే యగును. అందువలనఁ గార్యప్రపంచమునందు ఆయజ్ఞానము యొక్క లక్షణమున కతివ్యాప్తి కలుగుచున్నది.

సమాధానము:—ఉక్తలక్షణమునందు అనాది అనుపదమును జెప్పుట వలన నతివ్యాప్తి కలుగదు అనఁగా, "సద్విలక్షణ మనాది అజ్ఞానమ్" అనునది అజ్ఞానముయొక్క లక్షణమై యున్నది. కార్యప్రపంచమునందు అనాదిత్వము లేదు. అందువలనఁ బ్రపంచమునందు ఆలక్షణమున కతివ్యాప్తి కలుగదు.

శంక:—ఈలక్షణమునకును జీవేశ్వరులయం దతివ్యాప్తియే కలుగును. ఎట్లన, జీవేశ్వరులు కల్పితు లగుటవలన సత్తుకన్న విలక్షణులును అనాదులు నగుదురు. "జీవేశా వాభాసేన కరోతి" అను శ్రుతివచనముచేతను "మాయాభాసేన జీవేశౌ కరోతీతి శ్రుతత్వతః। కల్పితావేన జీవేశౌ తాభ్యాం సర్వం ప్రకల్పితమ్" అను విద్యారణ్యస్వాములయొక్క వచనముచేతను ఆజీవేశ్వరులయందుఁ గల్పితత్వమే సిద్ధించుచున్నది మఱియు "జీవేశౌచ విశుద్ధా చిద్విభాగస్తు తయోర్ద్వయోః। అవిద్యా తచ్చితో ర్యోగః షడస్మాక మనాదయః" — భావము॥ జీవుఁడు, ఈశ్వరుఁడు, శుద్ధచైతన్యము, ఈమూఁటియొక్క పరస్పరభేదము, అవిద్య, ఆయవిద్యకు చేతనమునకుఁ గలసంబంధము అను షట్పదార్థములు మామతమునం దనాదులై యున్నవి. అను ఈసాంప్రదాయికవచనముచేత జీవేశ్వరులయం దనాదిత్వము సిద్ధించుచున్నది. అందువలన ఆజీవేశ్వరులయం దుక్తలక్షణముయొక్క యతివ్యాప్తి వజ్రలేపమై యున్నది.

సమాధానము:—ఆయతివ్యాప్తిదోషమును నివారించుటకొఱకు ఆలక్షణమునందు "జ్ఞాననివర్త్యమ్" అనుపదమును మేము చెప్పుచున్నాము "యతో జ్ఞాన మజ్ఞానస్యైవ నివర్తకమ్" అనువచనముచేత శ్రీపంచపాదికాచార్యులు జ్ఞానముచేతఁ గేవల మజ్ఞానమాత్రముయొక్క నివృత్తియే చెప్పియున్నారు. అన్యముయొక్క నివృత్తిని జెప్పలేదు జీవేశ్వరాదిభావములయొక్క నివృత్తియో ఆయజ్ఞానముయొక్క నివృత్తిచేతనే కలుగుచున్నది. అందువలన జీవేశ్వరులయందు జ్ఞానముచేత నివర్త్యత్వము లేదు. అందువలన జీవేశ్వరులయందుఁ బూర్వోక్తలక్షణమున కతివ్యాప్తి కలుగదు. ఇందువలన ఆయజ్ఞానమునకు "సద్విలక్షణ మనాది జ్ఞాననివర్త్య మజ్ఞానమ్" అనులక్షణము సిద్ధించుచున్నది.

లేక "అనాద్యుపాదానం జ్ఞాననివర్త్య మజ్ఞానమ్" అనాదియయ్యును ఉపాదానమయ్యును జ్ఞానమువలన నివర్తనీయముగా నుండునది అజ్ఞానము అను ద్వితీయలక్షణము అజ్ఞానమునకు చెప్పవలయును. ఈలక్షణమునందు అనాది ప్రాగభావమునం దతివ్యాప్తిని నివారించుటకొఱకు "ఉపాదానమ్" అనుపదము చెప్పఁబడినది. ఘటాదికార్యములకు ఉపాదానకారణమైన మృత్తికాదులయం దతివ్యాప్తిని నివా-

రించుటకొఱకు "అనాది" అనుపదము చెప్పఁబడినది. అనాదియును పరిణామ్యుపాదానము నైనబ్రహ్మమునం దతివ్యాప్తిని నివారించుటకొఱకు "జ్ఞాననివర్త్యమ్" అను పదము చెప్పఁబడినది. ఇచ్చట అజ్ఞానమునందు పరిణామ్యుపాదానత్వమే గ్రహింప వలయును. మఱియుఁ గొందఱువాదులు జ్ఞానముయొక్కయభావమునే అజ్ఞానమను చున్నారు. వారిని ఖండించుటకొఱకు సిద్ధాంతమునం దాయజ్ఞానము భావరూపముగా నంగీకరింపఁబడి యున్నది.

ఇఁక అజ్ఞానమునందుఁ బ్రమాణము చెప్పఁబడు చున్నది. "అహం బ్రహ్మ నజానామి" అనఁగా నేను బ్రహ్మము నెఱుఁగను అని అజ్ఞానవిషయకప్రత్యక్షానుభవము సర్వప్రాణులకును గలుగు చున్నది. అందువలన ఆయజ్ఞానమునందు [1] ఒకటి ప్రత్యక్షప్రమాణమై యున్నది. [2] మఱియొకటి, శ్రుతిస్మృతులును ప్రమాణములై యున్నవి. అచ్చట, శ్రుతి — "తే ధ్యానయోగానుగతా అపశ్యన్ దేవాత్మ శక్తిం స్వగుణై ర్నిగూఢామ్" — భావము॥ కాలస్వభావాదికారణములందును నానాప్రకారదోషములను విచారించి జగత్తుయొక్క కారణమును నిశ్చయించుట కొఱకు బ్రహ్మధ్యానపరాయణు లైనబ్రహ్మవేత్తలు దేవాత్మశక్తినే జగత్కారణరూపముగా నెఱుఁగుచున్నారు. ఆయజ్ఞానరూపశక్తి తనసత్త్వాదిగుణములతో నిగూఢమై యున్నది. ఈశ్రుత్యర్థ మాత్మపురాణముయొక్క యష్టమాధ్యాయమునందు విస్తరముగాఁ జెప్పఁబడి యున్నది. స్మృతి— "అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః। జ్ఞానేన తు తదజ్ఞాన మేషాం నాశిత మాత్మనః" —భావము॥ ఏజీవులయొక్క జ్ఞానము అజ్ఞానముచేత ఆవృత మగునో ఆజీవు లాయజ్ఞానకృతావరణమువలన సంసారమునే పొందు చున్నారు. ఏజీవులకు ఆయజ్ఞానము గురుశాస్త్రప్రసాదజన్యజ్ఞానముచేత నివృత్త మగునో ఆపురుషులకు "అహం బ్రహ్మాస్మి" అనుజ్ఞానము ప్రత్యగభిన్నబ్రహ్మమును ప్రకాశింపఁజేయు చున్నది. ఈగీతాస్మృతియును ఆయజ్ఞానమునందుఁ బ్రమాణమై యున్నది.

మఱియును, ఈస్మృతియం దజ్ఞానమునకు బ్రహ్మముయొక్క స్వరూపావరకత్వము చెప్పఁబడి యున్నది. ఆయావరకత్వము భావపదార్థములయందే కలుగును. అభావపదార్థములయందుఁ గలుగదు. అందువలన జ్ఞానాభావ మజ్ఞానరూప మని యంగీకరించు నైయాయికులును ఈస్మృతివచనము విరోధించుటవలన ఆయజ్ఞానమును భావరూపముగానే యంగీకరింపవలయును. అందువలన నాగీతావచన మజ్ఞానముయొక్క భావరూపత్వమునందును ప్రమాణమై యున్నది. మఱియును, ఉక్తగీతావచనమునందు జ్ఞానముచేత నజ్ఞానముయొక్క నాశము చెప్పఁబడి యున్నది.

దానివలనఁ ద్రిగుణాత్మకమును అచేతనమును స్వతంత్రమును బారమార్థికమును బరి ణామియును నిత్యమును నైన యేప్రధాన మంగీకరింపఁబడినదో యజ్ఞానమును సాంఖ్యులమత ముగూడ ఖండింపఁబడినట్లు తెలియవలయును. లోకమున నచేతన శైలసరిద్ఘా దులకుఁ జేతనముయొక్క యధీనముగానే ప్రవృత్తి తెలియఁబడుచున్నది. స్వతంత్ర ముగాఁ బ్రవృత్తి తెలియఁబడుట లేదు. కావునఁ బ్రధానము నచేతన మని యం గీకరించి మరల స్వతంత్ర మని యంగీకరించుటయును అత్యంతవిరుద్ధము. లోకము నందుఁ బరిణామి యగుక్షీరాదులకు సావయవత్వముచేత ననిత్యత్వమే తెలియఁబడు చున్నది. అందువలనఁ బ్రధానమును బరిణామి యని యంగీకరించి మరల నిత్య మని యంగీకరించుట యత్యంతవిరుద్ధము. అందువలన నాసాంఖ్యమతము సమీచీనము కాదు. ఇంతపర్యంతము అజ్ఞానముయొక్క స్వరూపము, లక్షణము, ప్రమాణము చెప్పఁబడినది.

## [ (22) అజ్ఞానవిభాగనిరూపణము. ]

ఇఁక అజ్ఞానముయొక్క విభాగము చెప్పఁబడుచున్నది. పూర్వోక్తాజ్ఞాన ము మాయ యవిద్య యనుభేదముచేత ద్విప్రకారమై యున్నది. శుద్ధసత్త్వగుణ ప్రధానమైన అజ్ఞానము మాయ యనఁబడును. మలినసత్త్వగుణప్రధానమైన అయ జ్ఞానము అవిద్య యనఁబడును. ఏసత్త్వగుణము రజస్తమము లనుద్విగుణముల చేతఁ దిరస్కరింపఁబడదో (కప్పఁబడదో) ఆసత్త్వగుణము శుద్ధ మనఁబడును. ఏ సత్త్వగుణము ఆరజస్తమోగుణములచేతఁ దిరస్కరింపఁబడుచున్నదో ఆసత్త్వగుణ ము మలిన మనఁబడును. ఈప్రకారముగా ఒకటేయజ్ఞానము సత్త్వగుణముయొక్క శుద్ధిచేత మాయారూపమై యున్నది. సత్త్వగుణముయొక్క మలినత్వముచేత నవి ద్యారూపమై యున్నది. శ్రుతి— "మాయాచా ఽవిద్యాచ స్వయమేవ భవతి"— భావము॥ మూలప్రకృతిరూపాజ్ఞానము తానే మాయారూపముగాను అవిద్యారూ పముగాను అగుచున్నది. మాయా ఽవిద్య లనునుపాధిద్వయముచేత ఆ యొకటే చైతన్యము ఈశ్వరజీవు లనుభేదముచేత ద్విప్రకారమై యున్నది. ఆమాయయందుఁ బ్రతిబింబిత మగుచైతన్య మీశ్వరుఁ డనఁబడును. అవిద్యయందుఁ బ్రతిబింబిత మగు చైతన్యము జీవుఁ డనఁబడును. శ్రుతి— "జీవేశా వాభాసేన కరోతి"—భావము॥ ఆ యజ్ఞానము స్వస్వాభాసముచేత జీవేశ్వరులను జేయుచున్నది.

మఱియుఁ గొందఱు గ్రంథకారులు మాయా ఽవిద్యలకీప్రకార మైనభేద ము చెప్పుచున్నారు. ఆయజ్ఞానమునకు ద్వివిధశక్తు లున్నవి. ఒకటి జ్ఞానశక్తి, మఱి

-యొకటి క్రియాశక్తి. కార్యమునకు జనకమైనకారణనిష్ఠసామర్థ్య మేది గలదో అది శక్తి యనఁబడును. దానియందును జ్ఞానమునకు జనకమైనశక్తి జ్ఞానశక్తి యనఁబడును. క్రియకు జనకమైనశక్తి క్రియాశక్తి యనఁబడును. రజస్తమము లను ద్విగుణములచేత నభిభవము (తిరస్కరింపఁబడుటను) పొందనట్టి సత్త్వగుణము జ్ఞానశక్తి యనఁబడును. "సత్త్వాత్సంజాయతే జ్ఞానమ్" అనువచనముచేత గీతయందు శ్రీభగవంతునిచే సత్త్వగుణమునుండి జ్ఞానముయొక్క యుత్పత్తి చెప్పఁబడి యున్నది. అందువలన ఆసత్త్వగుణముయొక్క జ్ఞానశక్తిరూపతయం దాగీతావచనమే ప్రమాణమై యున్నది. మఱియు సత్త్వగుణముచేత నభిభవము పొందనివగు రజస్తమము లను ద్విగుణములు క్రియాశక్తి యనఁబడును. ఆక్రియాశక్తియును ద్వివిధము. ఒకటి ఆవరణశక్తి, మఱియొకటి విక్షేపశక్తి. ఆవరణమునకు జనకమగుశక్తి ఆవరణశక్తి యనియును విక్షేపమునకు జనకమగుశక్తి విక్షేపశక్తి యనియును చెప్పఁబడును. సత్త్వరజస్సులను ద్విగుణములచేత నభిభవమును బొందనట్టి తమోగుణము ఆవరణశక్తి యనఁబడును. ఈయర్థమును భగవద్భాష్యకారులును జెప్పియున్నారు. ఆభాష్యవచన మేమనఁగా "కృష్ణం తమః ఆవరణాత్మకత్వాత్"—భావము॥ "అజామేకాం లోహితశుక్లకృష్ణామ్" అను మంత్రమునందుగల కృష్ణశబ్దము తమోగుణముయొక్క వాచకము, తమోగుణము ఆవరణరూప మగుటవలన. ఇట్లు శ్రీభాష్యకారులచేతఁ దమోగుణమున కావరణత్వము శ్రుతియొక్క వ్యాఖ్యానమునందుఁ జెప్పఁబడి యున్నది. అందువలనఁ దమోగుణమున కావరణశక్తిరూపత సంభవించుచున్నది. ఆవరణశక్తియు ప్రసిద్ధరూపము చెప్పఁబడినది. ఇఁక ఆవరణశక్తియొక్క లక్షణము చెప్పఁబడుచున్నది. "నాస్తి న ప్రకాశతే ఇతి వ్యవహారహేతుః ఆవరణశక్తిః"— భావము॥ బ్రహ్మము లేదు. బ్రహ్మము భాసించుట లేదు అను వ్యవహారమునకుఁ గారణమైనది యావరణశక్తి యనఁబడును. ఈప్రకారముగానే పూర్వోక్తజ్ఞానశక్తికిని "అస్తి ప్రకాశతే ఇతి వ్యవహారకారణం జ్ఞానశక్తిః" అస్తి భాతి అను వ్యవహారమునకుఁ గారణమైనది జ్ఞానశక్తి అనులక్షణము తెలియవలయును. ఈయావరణశక్తియొక్క లక్షణము శ్రీవిద్యారణ్యస్వాములచేతను జెప్పఁబడియున్నది. "న భాతి నాస్తి కూటస్థ ఇత్యాపాదనమావృతిః"—భావము॥ కూటము (కమ్మరిదాగిలి) వలె నిర్వికారముగా నుండునది కూటస్థ మనఁబడును. అట్టి[illegible] చెప్పుచును. అదిమాత్రము లేదు. భాసించుట లేదు అను వ్యవహారమునకుఁ గారణమైనది యావరణశక్తి యనఁబడును.

ఇఁక విక్షేపశక్తియొక్క నిరూపణము చేయఁబడుచున్నది. తమస్సు సత్త్వము అనుద్విగుణములచేత నభిభవము పొందనట్టి రజోగుణము విక్షేపశక్తి యనఁ

బడును. "రజసో లోభ ఏవచ" అను గీతావచనమునందు రజోగుణమువలననుండి లోభాద్యుత్పత్తి చెప్పఁబడి యున్నది. లోభము మదము మత్సరము మొదలగు దానియొక్క కారణత్వము విక్షేపమునందుఁ బ్రసిద్ధమైయే యున్నది. అందువలనఁ బూర్వోక్తవిక్షేపశక్తియం దాగీతావాక్యము ప్రమాణము.

ఇఁక ఆవిక్షేపశక్తియొక్కలక్షణము చెప్పఁబడుచున్నది. "ఆకాశాది ప్రపంచోత్పత్తి హేతుః విక్షేపశక్తిః"— భావము॥ ఆకాశాదిప్రపంచోత్పత్తికి కారణ మైనశక్తి విక్షేపశక్తి యనఁబడును. ఈవిక్షేపశక్తియొక్కలక్షణము ఆచార్యులచేతను జెప్పఁబడి యున్నది. "విక్షేపశక్తిర్లింగాది బ్రహ్మాండాంతం జగత్సృజేత్"— భావము॥ సమష్టివ్యష్టిరూపలింగశరీరము మొదలు చతుర్దశభువనబ్రహ్మాండపర్యంతము గల సర్వజగత్తును విక్షేపశక్తియే సృజించు చున్నది. అందువలన నీయర్థము సిద్ధించు చున్నది. పూర్వోక్తాజ్ఞానమే యావరణశక్తిప్రధానమై యవిద్య యనియు బూర్వోకవిక్షేపాదిశక్తిప్రధానమై మాయ యనియుఁ జెప్పఁబడును.

శంక:—ఆవరణశక్తిప్రధాన మైనయజ్ఞానము మాయ యనియు విక్షేపాదిశక్తిప్రధాన మైనయజ్ఞానము నవిద్య యనియు నేల చెప్పఁగూడదు?

సమాధానము:—శాస్త్రవేత్తలచేత మాయకు నవిద్యకును ఈలక్షణములు చెప్పఁబడి యున్నవి. "స్వాశ్రయా ఽవ్యామోహకరీ మాయా"— భావము॥ తనయాశ్రయమునకు ఏది వ్యామోహమును బ్రాప్తింపఁ జేయదో అది మాయ యనఁబడును. "స్వాశ్రయవ్యామోహకరీ అవిద్యా"— భావము॥ తనయాశ్రయమునకు ఏది వ్యామోహమును బ్రాప్తింపఁజేయు చున్నదో అది యవిద్య యనఁబడును. ఆయావరణశక్తియే మోహప్రాప్తిహేతు వగుటవలన ఆవరణశక్తి ప్రధానాజ్ఞానమవిద్య యనఁబడును. మాయ యని చెప్పఁబడదు. మఱియు విక్షేపాదిశక్తికి మోహప్రాప్తిహేతుత్వము లేదు. అందువలన విక్షేపాదిశక్తిప్రధానాజ్ఞానము మాయ యనఁబడును. అవిద్య యని చెప్పఁబడదు. ఇచ్చట విక్షేపాదియను ఆదిశబ్దముచేతఁ బూర్వోక్తజ్ఞానశక్తినిగూడ గ్రహింపవలయును. ఈప్రకారముగా మాయా ఽవిద్యలయొక్కభేదము స్మృతియందును జెప్పఁబడి యున్నది. స్మృతి—"తరత్యవిద్యాం వితతాం హృది యస్మిన్నివేశితే। యోగీ మాయా మమేయాయ తస్మై విద్యాత్మనే నమః"—భావము॥ హృదయమునందు ఏపరమాత్మయొక్కసాక్షాత్కారము కలుగఁగా బ్రహ్మవేత్త యగుయోగి యావరణశక్తిప్రధానాజ్ఞానరూపావిద్యను విక్షేపశక్తిప్రధానాజ్ఞానరూపమాయనుగూడ నశింపఁజేయుచున్నాఁడో అజ్ఞానస్వరూపమైనయప్రమేయబ్రహ్మమును నేను నమస్కరించుచున్నాను.

[ (23) మాయాఽవిద్యావిభాగనిరూపణఫలము. ]

ఇఁక మాయాఽవిద్యలయొక్క విభాగనిరూపణమునకు ఫలము చెప్పఁబడుచున్నది. పూర్వోక్తమాయచేత నుపహిత మయినయేచైతన్య మున్నదో ఆ మాయోపహితచైతన్య మీశ్వరుఁ డనియును జగత్కారణుఁ డనియు నంతర్యామి యనియును జెప్పఁబడును. ఇచ్చట "ఏష సర్వేశ్వరః" అనుశ్రుతి యామాయోపహితచైతన్యము నీశ్వరుఁ డనియును "ఏషోఽన్తర్యామీ" అనుశ్రుతి యాచైతన్యము నంతర్యామిఁ యనియును "ఏష యోనిః సర్వస్య" అనుశ్రుతి యాచైతన్యమును సర్వకారణుఁ డనియును జెప్పుచున్నది. అందువలన నామాయోపహితచైతన్యముయొక్క యీశ్వరత్వమునందును నంతర్యామిత్వమునందును జగత్కారణత్వమునందును బూర్వోక్తశ్రుతులే ప్రమాణములు. ఆమాయోపహితచైతన్యమే తత్పదముయొక్క వాచ్యార్థము. మఱియుఁ బూర్వోక్తావిద్యచేత నుపహిత మయినయేచైతన్య మున్నదో యాచైతన్యము జీవుఁ డనియును ప్రాజ్ఞుఁ డనియును జెప్పఁబడును. ఆజీవుఁడే త్వంపదముయొక్క వాచ్యార్థము. ఇచ్చట నుపహితశబ్దముచేతఁ బ్రతిబింబమును గ్రహింపవలయును. అనఁగా, ఆమాయయందుఁ బ్రతిబింబితచైతన్య మీశ్వరుఁ డనియు నవిద్యాప్రతిబింబితచైతన్యము జీవుఁ డనియును చెప్పఁబడును. ఈయర్థము శ్రీవిద్యారణ్యస్వాములచేతను బంచదశి యనుగ్రంథమునందుఁ జెప్పఁబడి యున్నది. "శ్లో॥ తమో రజ స్సత్త్వగుణా ప్రకృతి ర్ద్వివిధాచ సా। సత్త్వశుద్ధ్యవిశుద్ధిభ్యాం మాయాఽవిద్యేచ తే మతే॥ మాయాం బింబో వశీకృత్య తాం స్యా త్సర్వజ్ఞ ఈశ్వరః। అవిద్యావశగ స్త్వన్య స్తద్వైచిత్ర్యా దనేకధా" — భావము॥ సచ్చిదానందబ్రహ్మముయొక్క ప్రతిబింబముతోఁ గూడినదియును సత్త్వరజస్తమము లనుత్రిగుణములు గలదియు నగు నేప్రకృతి యున్నదో యాప్రకృతి మాయ యవిద్య యనుభేదముచేత ద్విప్రకారమై యున్నది. ఆప్రకృతి శుద్ధసత్త్వగుణప్రధానతచేత మాయ యనియును మలినసత్త్వగుణప్రధానతచేత నవిద్య యనియును జెప్పఁబడు చున్నది. ఆ మాయయందుఁ బ్రతిబింబితచైతన్య మామాయను స్వవశము చేసికొని సర్వజ్ఞుఁ డగునీశ్వరుఁ డగుచున్నది. అవిద్యయందుఁ బ్రతిబింబితచైతన్యము జీవుఁ డనఁబడును. ఆజీవచైతన్య మవిద్యావశమై యాయవిద్యయొక్క విచిత్రత్వముచేతఁ దానును దేవమనుష్యాదిరూపములచేత ననేకప్రకారములే యగుచున్నది. ఇచ్చటఁ దాత్పర్య మే మనఁగా, పూర్వోక్తశుద్ధసత్త్వగుణప్రధాన మయినమాయ యేకమే యగుచున్నది. అందువలన మాయాప్రతిబింబితేశ్వరచైతన్యము నేకమే యగుచున్నది. పూర్వోక్తమలినసత్త్వప్రధాన మయినయవిద్య యామలినత్వముయొక్క

విచిత్రతచేత ననేకప్రకారములు లగుచున్నది. అందువలన నవిద్యయందుఁ బ్రతిబింబిత మగుజీవచైతన్యము ననేకప్రకారము లగుచున్నది. అందువలన నీపక్షమందు నానాజీవులే యని సిద్ధ మగుచున్నది.

ఇఁక నీయర్థమునందు శ్రుతిప్రమాణముగూడఁ జెప్పఁబడుచున్నది. "అస్మాన్మాయీ సృజతే విశ్వ మేత త్తస్మిం శ్చాన్యో మాయయా సన్నిరుద్ధః, మాయాంతు ప్రకృతిం విద్యా న్మాయినంతు మహేశ్వరమ్" — భావము॥ మాయోపాధికపరమాత్మ సృష్టియొక్కయాదికాలమునం దాకాశాదిబ్రహ్మాండాంతజగత్తును వేదశబ్దములచేత నుత్పన్నము చేసెను. అనఁగా ఆపరమాత్మ "భూః" అను వేదశబ్దము నుచ్చరించి పృథివి నుత్పన్నము చేసెను. ఈప్రకారముగా నాకాశాదిశబ్దముల నుచ్చరించుటచేత నాయాకాశాదికములనుగూడ నుత్పన్నము జేసెను. ఈయర్థము "సభూరి త్యుక్త్వా భువ మసృజత్, వేదశబ్దేభ్య ఏవాదౌ నిర్మమే స మహేశ్వరః" ఇత్యాదికశ్రుతిస్మృతివచనములయం దతిప్రసిద్ధము. ఈప్రకారముగా నుత్పన్నమైనజగత్తునం దవిద్యోపాధికజీవుఁడు పూర్వోక్తమాయచేత దేహాదులయందు "అహం మమ" యను నభిమానమువలన బద్ధుఁ డగుచున్నాఁడు. మాయను జగత్తున కుపాదానకారణముగాను ఆమాయోపాధిసహితచైతన్యమును జగత్కర్త యగు మహేశ్వరుఁడుగాను దెలియవలయును. ఇచ్చట అభిప్రాయ మే మనఁగా, శుద్ధబ్రహ్మమునకు జగత్కారణత్వము లేదు. మఱి యే మనఁగా, మాయోపాధికపరమాత్మకే జగత్కారణత్వ మున్నది. ఆపరమాత్మ మాయోపాధియొక్కప్రధానత్వముచేత జగత్తున కుపాదానకారణుఁడును, దనచైతన్యరూపముయొక్కప్రధానత్వముచేత జగత్తునకుఁ గర్తృరూపనిమిత్తకారణుఁడు నగును. ఇచ్చటఁ బూర్వోక్తద్వివిధమతములయందు నజ్ఞాన మేక మైనను మాయాఽవిద్యలకు భేదము సిద్ధించుటచేత జీవేశ్వరులయొక్కభేదమును జీవులయొక్కనానాత్వమును జూపఁబడినవి.

## [ (24) ఏకజీవవాదనిరూపణము. ]

ఇఁక నేగ్రంథకారు లజ్ఞానము నేకమని యంగీకరించి మాయావిద్యలయొక్కభేదమును నంగీకరింపక బింబప్రతిబింబభావముచేత జీవేశ్వరులకు భేదమును జీవుఁ డొక్కఁడే యనియు నంగీకరించుచున్నారో వారియొక్కమతము నిరూపింపఁబడుచున్నది. ఎట్లొకఁడే దేవదత్తనామపురుషుఁడు పాకపాఠక్రియారూపనిమిత్తములయొక్కభేదముచేత పాచకుఁడు పాఠకుఁ డనుద్వివిధనామములచేతఁ జెప్పఁబడుచున్నాఁడో, అట్లొకటే యజ్ఞానము విక్షేపావరణశక్తిరూపనిమిత్తములయొక్కభేద

ముచేత మాయా౽విద్య లనుద్వివిధనామములచేతఁ జెప్పఁబడుచున్నది. ఇచ్చటఁ దాత్పర్య మిదియై యున్నది. ఎట్లు పాచకుఁడు పాఠకుఁ డనుద్వివిధశబ్దము లొకఁడే యగు దేవదత్తపురుషునియొక్క వాచకములై యుండుటవలన నావాచకశబ్దములయొక్క భేదముచేత నాదేవదత్తునకు భేదము కలుగుటలేదో, అట్లు మాయా౽విద్య లను ద్వివిధశబ్దములు నొకటేయజ్ఞానముయొక్క వాచకము లగుటవలన ఆవాచకశబ్దములయొక్క భేదముచేత నాయజ్ఞానమునకు భేదము సంభవింపదు. అందువలన నామాయా౽విద్యలకు భేదము లేదు. అట్టి యేకా౽జ్ఞానరూపా౽విద్యయం దేచైతన్యముయొక్క ప్రతిబింబ మున్నదో అది జీవుఁ డనియుఁ, దదుపహితబింబచైతన్య మీశ్వరుఁ డనియును జెప్పఁబడును. ఈప్రకారముగా మాయా౽విద్యలయొక్క భేదము నంగీకరింపకయే బింబప్రతిబింబభావముచేత జీవేశ్వరులయొక్క భేదము సంభవించును. ఈ యర్థము శ్రీవ్యాసభగవానులచేతను జెప్పఁబడి యున్నది. సూత్రము.— "ఆభాస ఏవచ"— భావము॥ ఎట్లు జలాద్యుపాధులయందు సూర్యచంద్రులయొక్క ప్రతిబింబ మగునో అట్లు జీవుఁడును చైతన్యముయొక్క ప్రతిబింబరూపుఁడే యగును.

శంక:—ఎట్లు సూర్యాదులయొక్క ప్రతిబింబమునకు జలాదు లుపాధు లగుచున్నవో అట్లు ఈజీవరూపప్రతిబింబమునకును బింబభూతేశ్వరునకు నుపాధు లేవి?

ఈశంకకు సమాధానమునకై యిఁక మతభేదముచేత జీవేశ్వరోపాధులు చెప్పఁబడుచున్నవి.

### (25) కొందఱు గ్రంథకారులమతప్రకారముగా జీవోపాధి యైన యంతఃకరణము నానా యనుట. (ప్రథమపక్షము.)

కొన్ని గ్రంథకారు లైననో యంతఃకరణమునే జీవునికి నుపాధిగా నంగీకరించుచున్నారు. ఏల యన అంతఃకరణవిశిష్టచైతన్యమునందే అహం కర్తా అహం భోక్తా అని యీప్రకారముగాఁ గర్తృత్వభోక్తృత్వాదిసంసార మనుభవింపఁబడుచున్నది. మఱియు "కార్యోపాధి రయం జీవః" అనుశ్రుతియు నంతఃకరణరూపకార్యమునే జీవున కుపాధిగాఁ జెప్పుచున్నది. అందువలన నాప్రతిబింబరూపజీవునకు నంతఃకరణమే యుపాధియై యున్నది. ఆయంతఃకరణము నానాగాను బరిచ్ఛిన్నముగాను నున్నది. అందువలన నాయంతఃకరణములయందుఁ బ్రతిబింబరూపు లగు జీవులును నానాగాను పరిచ్ఛిన్నులుగాను నగుచున్నారు.

### (26) కొందఱు గ్రంథకారులమతప్రకారముగా జీవోపాధిరూపాజ్ఞానము నానా యనుట. (ద్వితీయపక్షము.)

కొన్ని గ్రంథకారులు చెప్పున దేమనఁగా, అంతఃకరణ మజ్ఞానముయొక్క కార్య మగుటవలన నస్వతంత్రమై యున్నది. అందువలన నాయంతఃకరణము నందు బింబప్రతిబింబరూపముచేత జీవపరమాత్మలయొక్క భేదము సంభవింపదు. అందువలన నాయంతఃకరణము జీవున కుపాధి కాదు. మఱి యేమనఁగా, స్వతంత్ర మగుటవలన నజ్ఞానమే జీవున కుపాధియై యున్నది. జీవునియొక్క యుపాధి యగు నజ్ఞాన మేకము కాదు. మఱి యేమనఁగా ననేకమే యగును. ఆయజ్ఞానరూపోపాధియొక్క నానాత్వమువలన నాయజ్ఞానమునందుఁ బ్రతిబింబరూపు లగుజీవులు ననేకులే యగుదురు. బ్రహ్మమునం దారోపిత మగుటవలన నాయజ్ఞానము పరిచ్ఛిన్నమై యున్నది. అందువలన నాయజ్ఞానమునందుఁ బ్రతిబింబరూపు లగుజీవులును బరిచ్ఛిన్నులును బరస్పరభేదసహితులు నగుదురు. అందువలనఁ బుణ్యపాపకర్మములకు సుఖదుఃఖరూపఫలముయొక్క వ్యతికరము గలుగదు. ఒకఁడు సుఖి, లేక, దుఃఖి కాఁగా నెల్లరకు నాసుఖదుఃఖములయొక్క ప్రాప్తి యేదియున్నదో అది కర్మఫలవ్యతికర మనఁబడును. అది యేకజీవపక్షమునందుఁ బ్రాప్త మగుచున్నదో అట్లే నానాజీవపక్షమందుఁ బ్రాప్త మగుట లేదు. అందువలన నానాఽజ్ఞానమే బింబరూపేశ్వరునకును బ్రతిబింబరూపజీవులకును బరస్పరభేదమును గలిగించునుపాధులై యున్నవి. ఈరీతిగా నావ్యాససూత్రమున కర్థము నానాజీవవాదులయొక్క మతమునందును సిద్ధించుచున్నది.

### —[*] (27) కొందఱు గ్రంథకర్తలమతరీతిగా జీవోపాధి యగునజ్ఞాన మేక మనుట. (తృతీయపక్షము.) [*]—

మఱియుఁ గొందఱుగ్రంథకర్త లిట్లు చెప్పుచున్నారు.—జీవేశ్వరులకు భేదమును జేయునట్టియుపాధి స్వతంత్ర మగుటవలన నజ్ఞానమే యగుచున్నది. ఆయజ్ఞానము నానా కాదు. మఱి యేమనఁగా నేకమే యగుచున్నది. ఆయేకాఽజ్ఞానమునందుండు చైతన్యముయొక్క ప్రతిబింబ మగుజీవుఁడును నజ్ఞానరూపోపాధియొక్క యేకత్వముచేత నొకఁడు నపరిచ్ఛిన్నుఁడు నగుచున్నాఁడు. అచ్చట “అజా మేకాం లోహితశుక్లకృష్ణామ్” అనుశ్రుతియే యాయజ్ఞానముయొక్క యేకత్వమునందుఁ బ్రమాణమై యున్నది. మఱియు “ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే” ఈ శ్రుతియందుఁ జెప్పఁబడినమాయలయొక్క యనేకత్వ మేది గలదో యది మాయా

రూపాఽజ్ఞానశక్తులయొక్కయు నేకత్వము, లేక, సత్త్వాదిగుణములయొక్కయు నేకత్వమునెత్తి చెప్పఁబడినది. ఇందువలన నాశ్రుతికి విరోధ మగుట లేదు. "అజో హ్యేకో జుషమాణో ఽనుశేతే" యనుశ్రుతి జీవునియొక్క యేకత్వమునందుఁ బ్రమాణమై యున్నది. అట్లే "ఆభాస ఏవచ" యనుసూత్రమునందు నేకవచనముచేత సూత్రకర్తలచేతను జీవునియొక్క యేకత్వమే చెప్పఁబడి యున్నది. అందువలన జీవుఁ డొక్కఁడేయని యంగీకరింపవలయును.

శంక:—జీవుఁ డొక్కఁడే యని యంగీకరించినయెడల మీమతమునందు బంధమోక్షములయొక్క వ్యవస్థ యెట్లు కలుగును? అనఁగాఁ దత్త్వజ్ఞానముచేతఁ గొందఱుజీవులు ముక్తు లగుచున్నారు. జ్ఞానముయొక్క యప్రాప్తివలనఁ గొందఱుజీవులు బద్ధు లగుచున్నారు. ఈప్రకారముగా బంధమోక్షములయొక్క వ్యవస్థ యెట్లు నానాజీవపక్షమందు సంభవించుచున్నదో అట్లేకజీవపక్షమం దావ్యవస్థ సంభవింపదు.

సమాధానము:—అజ్ఞానమును జీవుఁడును నేకమైనను ఆయేకాజ్ఞానముయొక్క కార్యభూతాంతఃకరణములు నానా యగును. మఱియు నంతఃకరణవిశిష్టచైతన్యమునకుఁ బ్రమాత యని పేరు. ఆయంతఃకరణములు నానా యగుటవలనఁ బ్రమాతలును నానాగానే యగుదురు. అందుఁ దత్త్వజ్ఞానముచేత నొకప్రమాత ముక్తుఁడైనను తత్త్వజ్ఞానరహితు లగునితరప్రమాతలు బద్ధులే యగుదురు. ఈరీతిగాఁ బ్రమాతలయొక్క భేదము నంగీకరించుటవలన నాయేకజీవపక్షమునందును బంధమోక్షములయొక్క వ్యవస్థ సంభవించుచున్నది.

శంక:—ఏకజీవవాదు లైనమీమతమునందు మోక్ష మనునది యెట్టివస్తువు? అవిద్యానివృత్తియే మోక్ష మని చెప్పినయెడల దానియం దీవిచారముఁ జేయవలయును. కార్యాఽవిద్యానివృత్తి మోక్షమా? లేక, మూలాఽవిద్యానివృత్తి మోక్షమా? అందుఁ బ్రథమపక్షమో సంభవింపదు. ఏల యన దేహాదులయందు నాత్మత్వాదిబుద్ధిరూప మగు నేభ్రాంతిజ్ఞాన మున్నదో అది కార్యాఽవిద్య యనఁబడును. ఆసకలభ్రాంతిజ్ఞాననివృత్తియే సంభవింపదు. మఱియు మూలాఽవిద్య యుండుటచే మరల భ్రాంతిజ్ఞానములయొక్క యుత్పత్తి యవశ్య మగుచున్నది. కించిద్భ్రాంతిజ్ఞాననివృత్తికిఁ బురుషార్థరూపత్వమే లేదు. అందువలన నాకార్యాఽవిద్యానివృత్తికి మోక్షరూపత్వము సంభవింపదు.

మఱియు నజ్ఞానముయొక్క యావరణశక్తి యవిద్య యనఁబడును. ఆయావరణశక్తిరూపావిద్య యనేకమై యున్నది. అందువలన నొకప్రమాతకుఁ దత్త్వజ్ఞాన

ముత్పన్నమగుచున్నదో, ఆప్రమాతకుఁ దనసంసారమునకు హేతుభూత మగునవిద్య యేది గలదో దానినివృత్తియే ముక్తి యగును. ఏప్రమాత కాతత్త్వజ్ఞాన ముత్పన్న మగుట లేదో యాప్రమాత కాయవిద్య యుండుటవలన బంధ మున్నది. ఈప్రకారముగా నానేకజీవపక్షమందును బంధమోక్షములయొక్క వ్యవస్థ సంభవించుచున్నదని మీరు చెప్పినను. అదియును సంభవించుట లేదు. ఏల యన నాయవిద్య యనేక మని యంగీకరించి బంధమునకును హేతువుగా నంగీకరించినయెడల నాయవిద్యయొక్క యాశ్రయభూతు లైనజీవులకును భేదమే యంగీకరింపవలయును. అందువలన మీమతమునందును నానాజీవవాదమే ప్రాప్త మగును. అది మీకిష్టము కాదు. లేక, మూలావిద్యానివృత్తి మోక్ష మను ద్వితీయపక్ష మంగీకరించినయెడల అదియును సంభవించుట లేదు. ఏల యన, తత్త్వజ్ఞానముచేత నానేకమూలావిద్య నివృత్త మగుచుండఁగా నెల్లరకును ముక్తి కలుగవలయును. మఱియును జీవుఁ డొక్కఁడే యనుపక్షమునందు నెల్లరకును ముక్తి కలుగవలయు నని చెప్పుటయే విరుద్ధమై యున్న దని మీరు చెప్పినను అదియును సంభవించుట లేదు. ఏల యన మీమతమునందుఁ బూర్వ ముత్పన్ను లైనశుకవామదేవాదులకు ముక్తి యంగీకార్యమా? కాదా? అందుఁ బ్రథమపక్షము నంగీకరించినయెడల నాశుకవామదేవాదులకుఁ దత్త్వజ్ఞానముచేత నానేకమూలాఽవిద్య నివృత్త మగుటవలన నస్మదాదులకు నిపుడు సంసారము ప్రతీతము గాఁగూడదు. మఱియు ద్వితీయపక్ష మంగీకరించినయెడల నాశుకవామదేవాదులయొక్క ముక్తిని బ్రతిపాదించునట్టిశాస్త్ర మప్రమాణమగును. ఆశుకవామదేవాదిమహాత్ములకే ముక్తి కలుగనప్పుడు అస్మదాదులకు ముక్తిని బొందునిచ్ఛ యెట్లు కలుగును?

మఱియు "యావ దధికార మవస్థితి రాధికారికాణామ్" అనుసూత్రముయొక్క వ్యాఖ్యానమునందు భగవద్భాష్యకారులచేత నిట్లు చెప్పఁబడి యున్నది. ఉపాసనచేత నింద్రాదిపదముల నొందినయధికారుల కొకానొకవరముచేతఁ గాని శాపాదినిమిత్తవశముచేత జన్మాంతరప్రాప్తి కలిగినను, అది తత్త్వజ్ఞానమునకుఁ బ్రతిబంధకము గాదు. అందువలన నాయధికారుల కాయింద్రత్వాదిరూపాధికారముయొక్క యంతమునందు మోక్ష మవశ్యము కలుగుచున్నది. ఈచెప్పఁబడినసర్వము నానేకజీవపక్షమునందు మిథ్యయే యగును.

మఱియుఁ బ్రత్యగభిన్నబ్రహ్మసాక్షాత్కారముగల బ్రహ్మవేత్త, తనశిష్యులకు బ్రహ్మము నుపదేశించుచున్నాఁ డనుట శ్రుతిస్మృతులయందుఁ బ్రసిద్ధమై యున్నది.

శ్రుతి — "తద్విజ్ఞానార్థం సగురుమే వాభిగచ్ఛే త్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్" — భావము॥ బ్రహ్మసాక్షాత్కారముకొఱకు నధికారిపురుషులు హస్తమందు కించిత్పూజాయోగ్యద్రవ్యములను గొని శ్రోత్రియబ్రహ్మనిష్ఠగురువుయొక్క సమీపమునకుఁ బోవలయును. స్మృతి— "ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః" — భావము॥ తత్త్వవేత్త లగుజ్ఞానులు నీకు జ్ఞానము నుపదేశింపుదురు. అచ్చట ఏకజీవపక్షమందు సాక్షాత్కారము గలగురువే లేనందువలన, గురుశిష్యులయొక్క వ్యవస్థయే సంభవించుట లేదు. ఆవ్యవస్థ సంభవింపమివలన నొకనికిఁగూడ మోక్షప్రాప్తి లేకపోవలయును. లేక, ఏకజీవపక్షమందు వేదముయొక్క కర్మకాండమునకును జ్ఞానకాండమునకును భిన్నభిన్నాధికారులు సంభవించుట లేదు. అందువలన నాయధికారులయొక్క యభావమువలనఁ గర్మజ్ఞానకాండములకు నప్రమాణత్వమే ప్రాప్త మగును. అందువలన నజ్ఞాన మేకమే. అజ్ఞానోపహితజీవుఁడు నొక్కఁడే. యను నేకజీవపక్షము సమీచీనము కాదు.

సమాధానము:— "అజా మేకాం లోహిత శుక్లకృష్ణామ్" ఇత్యాది శ్రుతులయందును, "అజ్ఞానే నావృతం జ్ఞానమ్, మమ మాయా దురత్యయా" ఇత్యాది స్మృతులయందును అజ్ఞానమున కేకత్వమే నిశ్చిత మగుచున్నది. అందువలన నజ్ఞాన మేక మనియే యంగీకరింపవలయును. ఆయజ్ఞానమున కేకత్వము సిద్ధించుచుండఁగా, నాయజ్ఞానోపహితజీవుఁడు నొక్కఁడనియే యంగీకరింపవలయును. ఆయేకజీవపక్షమునందు స్వప్నదృష్టాంతముచేత బంధమోక్షాదిసకలవ్యవస్థలును సంభవించును. అదెట్లనఁగా, స్వప్నావస్థయందు స్వప్నద్రష్ట యగుపురుషుఁడు తనయొక్క భ్రాంతివలనఁ గల్పింపఁబడినయనేకప్రమాతలయందుఁ గొందఱుప్రమాతలకు బంధమును గొందఱుప్రమాతలకు ముక్తియును జూచుచున్నాఁడు. ఆబంధమోక్షములయొక్క దర్శనముచేత స్వప్నద్రష్టృపురుషున కెట్లు బంధమోక్షములు కలుగుట లేదో అట్లు జాగ్రదవస్థయందును ఆయేకజీవునిచేతఁ గల్పింపఁబడినయనేకప్రమాతలయందుఁ గొందఱు బద్ధులుఁ గొందఱు ముక్తులు నగుచున్నను, వారలయొక్క బంధమోక్షదర్శనమువలన నాయేకజీవునకు బంధమోక్షములు కలుగుట లేదు. అందువలన నాయేకజీవపక్షమునందు బంధమోక్షవ్యవస్థయును సంభవించుచున్నది. ఈప్రకార మయిన స్వప్నదృష్టాంతముచేత గురుశిష్యాదివ్యవస్థలును దెలియవలయును. అందువలన నీయేకజీవపక్షమునందుఁ బూర్వోక్తదోషము ప్రాప్త మగుట లేదు. మఱియు నాయేకజీవునియం దంతఃకరణవిశిష్టానేకప్రమాతలు కల్పితు లగుచున్నారు. వారియందుఁ గొందఱుప్రమాతలు సుఖులై యున్నారు. కొందఱుప్రమాతలు దుఃఖులై

యున్నారు. ఈప్రకారముగా సుఖదుఃఖములయొక్క వ్యవస్థయును సంభవించుచున్నది. అచ్చటఁ బ్రతిబింబత్వధర్మవిశిష్టచైతన్యము జీవుఁడనియును బింబత్వధర్మవిశిష్టచైతన్య మీశ్వరుఁ డనియుఁ జెప్పుపక్షమునం దంతఃకరణాదిరూపోపాధికృతదోషములు ప్రతిబింబరూపజీవునియందే వర్తించుచున్నవి. బింబభూతేశ్వరునియందు వర్తించుట లేదు. ఏలయన నాయుపాధులు ప్రతిబింబపక్షపాతు లయ్యె యున్నవి. బింబపక్షపాతు లగుట లేదు. ఉదా — జలాద్యుపాధులయొక్క చలనాదిధర్మములు ప్రతిబింబమునందే ప్రతీత మగుచున్నవి. బింబమునందు ప్రతీత మగుట లేదు.

శంక:—పూర్వము, అజ్ఞానాదులయం దుండుచైతన్యముయొక్క ప్రతిబింబము జీవుఁ డని చెప్పఁబడినది. అది సంభవించుట లేదు. ఏల యన, రూపవద్వస్తువులకే ప్రతిబింబము కలుగుచున్నది. రూపరహితవస్తువులకుఁ బ్రతిబింబము కలుగుట లేదు. ఉదా—రూపవత్సూర్యచంద్రాదులకు జలాదులయందుఁ బ్రతిబింబము కలుగుచున్నది. మఱియు బ్రహ్మమో రూపాదిగుణములు లేనిది. అందువలన బ్రహ్మమునకజ్ఞానమునందుఁ బ్రతిబింబమే సంభవింపదు. మఱియు నెట్లు రూపరహితాకాశమునకు జలాదులయందుఁ బ్రతిబింబము గలుగుచున్నదో, అట్లు రూపరహితబ్రహ్మమునకును అజ్ఞానమునందుఁ బ్రతిబింబము సంభవించు చున్న దని చెప్పినను, అదియు సంభవించుట లేదు. ఏల యన, రూపరహిత మగుటవలన నాయాకాశమునకు జలాదులయందుఁ బ్రతిబింబము సంభవించుట లేదు. మ రేమనఁగా, ఆకాశము నాశ్రయించి యుండు మేఘప్రభానక్షత్రాదిరూపవత్పదార్థములకే జలాదులయందుఁ బ్రతిబింబము కలుగుచున్నది. జలాదులయం దాకాశముయొక్క ప్రతిబింబ మున్న దని లోకులయొక్క యనుభవ మేది గలదో అది భ్రమరూపమే యగును. అందువలన బ్రహ్మమునకు బింబప్రతిబింబభావముచేత జీవేశ్వరవిభాగము పూర్వ మేది చెప్పఁబడినదో అది సంభవించుట లేదు.

సమాధానము:—రూపవద్వస్తువులకే ప్రతిబింబము కలుగు ననునియమము సర్వత్ర సంభవింపదు. కొన్నిచోటులయందు రూపరహితవస్తువులకుఁగూడఁ బ్రతిబింబము చూడఁబడుచున్నది. ఉదా — రూపాదిగుణములు రూపరహిత మైనను జపాకుసుమాదులయొక్క లోహితాదిరూపములకు స్ఫటికాదులయందుఁ బ్రతిబింబము ప్రత్యక్షముగాఁ జూడఁబడు చున్నది. మఱియు రూపరహితద్రవ్యమునకుఁ బ్రతిబింబము కలుగుట లే దనునియమము మేమును నంగీకరించుచున్నాము, రూపాదిగుణమో ద్రవ్యము గాదు, అందువలన నారూపాదులకుఁ బ్రతిబింబము కలిగినను ఉక్తనియమమునకు భంగము గలుగుట లే దని చెప్పినను అదియు సంభవించుట లేదు.

ష్కారణముచేత ననఁగా, రూపరహితాకాశద్రవ్యమునకును జలాదులయందుఁ బ్రతిబింబము చూడఁబడు చున్నది. అచ్చట ఎట్లు నీలత్వవిశాలత్వసహితముగా బాహ్యాకాశము ప్రతీత మగు చున్నదో అట్లు కూపతటాకాదులయొక్క స్వల్పజలమునందును ఆనీలత్వవిశాలత్వసహితాకాశము ప్రతీత మగు చున్నది. ఆస్వల్పజలమునందు వాస్తవముగా నైననో విశాలత్వాదిసహితాకాశము లేదు. అందువలన జలమునందు భాసమాన మగు నాయాకాశము బాహ్యాకాశముయొక్క ప్రతిబింబరూప మనియే యంగీకరింపవలయును. మఱియు నీజలాదులయం దిది యాకాశముయొక్క ప్రతిబింబమే యను ననుభవము సర్వలోకులకును గలుగుచున్నది. ఆయనుభవమునకు బాధకము లేనందువలన దానికి భ్రమరూపత్వమును సంభవించుట లేదు. విరోధిజ్ఞానరూప బాధక ముండిననే యనుభవమునకు భ్రమరూపత్వము కలుగును. ఎట్లు "నేదం రజతమ్" అను విరోధిజ్ఞానరూపబాధక ముండుటచేతనే శుక్తియందు "ఇదం రజతమ్" అను ననుభవమునకు భ్రమరూపత్వము గలుగు చున్నదో అట్లు. ఇది యాకాశప్రతిబింబము కా దను విరోధిజ్ఞానరూపబాధక మచ్చుట లేదు. అందువలనఁ బూర్వోక్తానుభవము భ్రమరూపము గాదు. ఈరీతిగా రూపరహితాకాశద్రవ్యముయొక్క ప్రతిబింబము సిద్ధించుటచేతనే బ్రహ్మమునకును బింబప్రతిబింబభావమువలన జీవేశ్వరవిభాగము సంభవించుచున్నది.

మఱియు రూపరహితద్రవ్యమునకుఁ బ్రతిబింబము కలుగుట లే దను నర్థము నందు మీ కాగ్రహ ముండినచో సిద్ధాంతి నగు నేను బ్రహ్మమును ద్రవ్య మని యంగీకరించుట లేదు. ఏల యన నైయాయికులచేత గుణాశ్రయమును సమవాయికారణము నగునదియే ద్రవ్య మని యంగీకరింపఁబడి యున్నది. మఱియు "సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ" యనుశ్రుతి బ్రహ్మము నిర్గుణ మని చెప్పి యున్నది. అందువలన బ్రహ్మమునకు గుణాశ్రయత్వము సంభవింపదు. సమవాయికారణముయొక్క యనంగీకారమువలన బ్రహ్మమునకు సమవాయికారణత్వమును సంభవించుట లేదు. అందువలన రూపరహితరూపాదిగుణములవలె బ్రహ్మమునకుఁ బ్రతిబింబ మంగీకరించుటయం దేవిరోధమును లేదు. లేక, అజ్ఞానమునందు బ్రహ్మముయొక్క ప్రతిబింబ మంగీకరింపకపోయినను ఈప్రకార మైనజీవేశ్వరవిభాగము సంభవించును. అజ్ఞానరూపావిద్యచే విశిష్ట మైనచైతన్యము జీవుఁ డనియును, అవిద్యచే నుపహిత మైన చైతన్య మీశ్వరుఁ డనియును జెప్పఁబడును. ఈయర్థము పూర్వాచార్యులచేతను జెప్పఁబడి యున్నది. "శ్లో. బింబత్వం ప్రతిబింబత్వం యథా పూషణి కల్పితమ్ । జీవత్వ మీశ్వరత్వంచ తథా బ్రహ్మణి కల్పితమ్" — భాష్యము॥ ఎట్లు సూర్యునియందు

బింబత్వమును ప్రతిబింబత్వమును గల్పితమో అట్లు బ్రహ్మమందు జీవత్వేశ్వరత్వములు కల్పితములు.

## (28) కొందఱు గ్రంథకర్తలమతరీతిగా నానాఽజ్ఞానముల ననుసారమున జీవేశ్వరవిభాగవర్ణనము. (చతుర్థపక్షము.)

మఱియుఁ గొందఱు గ్రంథకారులైననో నానాఽజ్ఞానముల నంగీకరించుటచేత నిట్లు జీవేశ్వరవిభాగముఁ జెప్పుచున్నారు. అనేకవృక్షములయొక్క సమూహ మేది గలదో అది వన మనియును ఆవనము సమష్టి యనియును, మఱియుఁ బ్రత్యేకవృక్షము వ్యష్టి యనియు నెట్లు చెప్పఁబడునో అట్లు నానాఽజ్ఞానములయొక్కసమూహ మేది యున్నదో అది సమష్టి యనియు మఱియుఁ బ్రత్యేకాఽజ్ఞానము వ్యష్టి యనియు చెప్పఁబడును. అచ్చట నానసమష్ట్యజ్ఞానోపహితచైతన్య మీశ్వరుఁ డనియును, వ్యష్ట్యజ్ఞానోపహితచైతన్యము జీవుఁ డనియును జెప్పుదురు. ఆయజ్ఞానములు నానా యగుటవలన జీవులును నానా యగుదురు. ఈమతస్థులయభిప్రాయ మిదియై యున్నది. శ్రుతిస్మృత్యాదిశాస్త్రములయందు శుకవామదేవాదులకు మోక్షము చెప్పఁబడి యున్నది. మఱియు అస్మదాదిజీవుల కీకాలమందు సంసారము ప్రతీత మగుచున్నది. ప్రత్యేకపురుషునియందు "అహమ్ అజ్ఞః నజానామి" యని భిన్నభిన్నాఽజ్ఞానవిషయకానుభవమును గలుగుచున్నది. మఱియు "ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" అనుశ్రుతియందును ఆమాయారూపాఽజ్ఞానమునకు నానాత్వమే చెప్పఁబడి యున్నది. ఈశ్రుతియందుండు మాయ యనుపదముయొక్కముఖ్యార్థమును బరిత్యజించి మాయయొక్క శక్తులయందైనను సత్త్వాదిగుణములయందైనను ఆమాయాపదమునకు లక్షణ చేయుటయందే ప్రమాణమును లేదు. అందువలన నాయజ్ఞానములు నానాగానే యంగీకరించుట యోగ్యము. మఱియు "అజా మేకామ్" ఇత్యాదిశ్రుతిస్మృతులయం దజ్ఞానమున కేకత్వము చెప్పఁబడి యున్నది. అదియో యాయజ్ఞానసమూహముయొక్కయేకత్వము నెత్తి చెప్పఁబడినది. అందువలన, నాశ్రుతిస్మృతివచనములకును విరోధము కలుగుట లేదు. ఈప్రకార మజ్ఞానముయొక్కనానాత్వమువలన జీవులయొక్కనానాత్వము సిద్ధించుటచేత ఏజీవునకు బ్రహ్మసాక్షాత్కారప్రాప్తి యగుచున్నదో యాజీవునకే తనయజ్ఞానముయొక్కనివృత్తిరూప మగుమోక్షము కలుగుచున్నది. బ్రహ్మసాక్షాత్కారరహితులకుఁ దమతమయజ్ఞానవశముచేత సంసారరూపబంధమే యున్నది. ఈప్రకారమైనబంధమోక్షవ్యవస్థయును ఈనానాజీవపక్షమందు

బలీయముగానే సంభవించు చున్నది. ఆ యేకాఽజ్ఞానైకజీవపక్షమం దాబంధ మోక్షములవ్యవస్థ సంభవింపదు.

శంక:—అజ్ఞానముయొక్క భేదముచేత జీవులకు భేద మంగీకరించినయెడలఁ బ్రతిజీవమును బ్రపంచమునకు భేదము కలుగును. ఒకవేళ నీయర్థమునందు మీకిష్ట ముండినయెడల, ఏఘటము మీచే ననుభవింపఁబడినదో అదేఘటము మా చేతఁగూడ ననుభవింపఁబడిన దని ఘటాదిప్రపంచముయొక్క యేకత్వమును విషయముఁ జేయు ప్రత్యభిజ్ఞకు విరోధము ప్రాప్త మగును. ఏకారణముచేత ననఁగా, ఒకనియొక్కయజ్ఞానమువలనఁ గల్పింపఁబడినప్రపంచము మఱియొకనికిఁ బ్రత్యక్షము కాదు. మఱియు బాధకము లేనందున నాప్రత్యభిజ్ఞకు భ్రమరూపత్వమును సంభవింపదు. మఱియు నొకఁడే పరమేశ్వరుఁడు సర్వజగత్తునకు నుత్పత్తిస్థితిలయకారణుఁడను సకలశాస్త్రములయొక్క సిద్ధాంతమునకును విరోధ మగును. మఱియుఁ బూర్వోక్తదోషములనివృత్తిచేయుటకొఱకు సమష్ట్యజ్ఞానోపహితచైతన్యరూపేశ్వరుని చేతఁ జేయఁబడినయీప్రపంచము సర్వజీవులకును సాధారణ మని యంగీకరించినచో, అనిర్మోక్ష మగును. అనఁగా నొకజీవునకును మోక్షము కలుగదు. అ దెట్లనఁగా నిర్గుణబ్రహ్మభావముయొక్క ప్రాప్తి మోక్ష మనఁబడును. నానాఽజ్ఞానపక్షమం దేకజీవునియొక్క తత్త్వజ్ఞానముచేత నేకాఽజ్ఞానమునకు నివృత్తి కలిగినను సర్వాఽజ్ఞానములయొక్క నివృత్తి కలుగుట లేదు. ఆయజ్ఞానము లుండుటవలన ఈశ్వరునకును జగత్తునకును బాధ కలుగదు. అజ్ఞానము, ఈశ్వరుఁడు, జగత్తు నివి యుండుటవలన బ్రహ్మమునందు నిర్గుణత్వమే సంభవింపదు. అందువలన నిర్గుణబ్రహ్మప్రాప్తిరూపమోక్షమేజీవునకును గలుగక పోవలయును.

మఱియు సిద్ధాంతమునం దద్వితీయబ్రహ్మముయొక్క జ్ఞానముచేతనే మోక్ష మంగీకరింపఁబడి యున్నది. ఆయద్వితీయబ్రహ్మముయొక్క జ్ఞానము నానాజీవపక్షమందు సంభవింపదు. ఏకారణముచేత ననఁగా, జ్ఞానకాలమునందును ముక్తపురుషులకన్న భిన్నులైన యితరజీవులును ఈశ్వరుఁడును అజ్ఞానమును జగత్తును విద్యమానములే యగుచున్నవి. అందువలన బ్రహ్మము సద్వితీయమే యగును. ఈకారణము చేతనే యొకజీవునకును మోక్షము కలుగక పోవలయును.

మఱియు శ్రుతిస్మృతిరూపశాస్త్రప్రమాణముచే నొకచో నేదైననొక ప్రకారముగా జ్ఞానమువలన మోక్షప్రాప్తి చెప్పఁబడినను, అది సగుణబ్రహ్మముయొక్క ప్రాప్తియే మోక్షరూపముగా సిద్ధ మగును. నిర్గుణబ్రహ్మముయొక్క ప్రాప్తికి మోక్షరూపత్వము సిద్ధింపదు. అది యత్యంతాఽసిద్ధమై యున్నది. ఏల యన

"అనంతరో ఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ, అస్థూల మన ణ్వహ్రస్వ మదీర్ఘమ్, యత్ర త్వస్య సర్వ మాత్మై వాభూ త్తత్కేన కం పశ్యేత్" ఇత్యాదిశ్రుతుల యందు నిర్గుణబ్రహ్మమునకే మోక్షరూపత చెప్పఁబడి యున్నది. ఆసర్వశ్రుతుల కును విరోధము కలుగును. అందువలన నానాఽజ్ఞానముల నంగీకరించి నానాజీవుల నంగీకరించుట యయుక్తమై యున్నది.

సమాధానము:—అజ్ఞానముయొక్క భేదముచేత జీవులయొక్క భేదము నవశ్య మంగీకరింపవలయును. అట్లు కానియెడల, బంధమోక్షశాస్త్రముల కప్రమాణత్వమే సిద్ధించును. ఈనానాజీవపక్షమందుఁ బ్రతిజీవమును బ్రపంచముయొక్క భేదము మీచేఁ జెప్పఁబడి యున్నది. అది మాకు నంగీకార్యమై యున్నది. అనఁగా నొక్కొకజీవునకును బ్రపంచము భిన్నభిన్నమే యగు చున్నది. అయినను బ్రపంచ ముయొక్క నానాత్వమందుఁ బ్రత్యభిజ్ఞయొక్క విరోధము మీచేఁ బూర్వము చెప్పఁబడి యున్నది. అది సంభవించుట లేదు. ఏకారణముచేత ననఁగా, ఆప్రత్యభిజ్ఞ భ్రమరూప మే యగును. అదెట్లనఁగా, ఎచ్చట నొకశుక్తియందు దశపురుషులకు రజతభ్రమ గలుగుచున్నదో అచ్చట నేకైకపురుషునియొక్క యజ్ఞానముచేతఁ గల్పింపఁబడిన యా రజతములు కూడ భిన్నభిన్నములే యగుచున్నవి. ఏకరజతము కాదు. ఒకవేళ నాదశ పురుషులయొక్క భ్రమకు నొకటేరజతము విషయ మైనయెడల నొకపురుషునకు శుక్తి రూపాధిష్ఠానముయొక్క జ్ఞానముచేత రజతభ్రమకు నివృత్తి గలుగఁగా నధిష్ఠాన జ్ఞానరహితు లగునితరపురుషులకు నారజతము ప్రతీతము గాకపోవలయును. ఇతర పురుషుల కైననో ఆరజతము ప్రతీత మగుచున్నది. అందువలన నారజత మేకము కాదు. మఱి యే మనఁగా, ఆదశపురుషులయొక్క ప్రత్యేకాఽజ్ఞానముచేతఁ గల్పింపఁ బడినదశరజతము లచ్చట నుత్పన్నము లగుచున్నవి. ఒకపురుషునియొక్క యజ్ఞానము చేతఁ గల్పింపఁబడినరజత మన్యపురుషునకుఁ బ్రత్యక్ష మగుట లేదు. అయినను, ఆ దశపురుషులకు నొకప్రసంగము ననుసరించి యేరజతము మీచే ననుభవింపఁబడిన దో, అదే రజతము మాచేతను ననుభవింపఁబడిన దనుభ్రమరూపప్రత్యభిజ్ఞ యెట్లు కలుగు చున్నదో, అట్లీప్రసంగమునందును ప్రత్యేకజీవులయొక్క యజ్ఞానముచేతఁ గల్పింపఁబడినప్రపంచమునకు భేదము కలిగినను అన్యోన్య యన్యునియొక్క యజ్ఞాన ముచేతఁ గల్పింపఁబడినప్రపంచము మఱియొకని కప్రత్యక్ష మైనను, ఏఘటము మీచే ననుభవింపఁబడినదో అదేఘటము మాచేత ననుభవింపఁబడిన దను భ్రమరూప ప్రత్యభిజ్ఞ సంభవించును. అందువలనఁ బ్రతిజీవమును బ్రపంచభేద మంగీకరించుట యందుఁ బ్రత్యభిజ్ఞకు విరోధము కలుగుట లేదు.

లేక, జీవులు నానామైనను సమష్ట్యజ్ఞానోపహితచైతన్యరూపేశ్వరునిచేత రచియింపఁబడిన యీప్రపంచ మాసర్వజీవులకు నొకటే సాధారణమై యున్నది. అందువలనఁ బూర్వోక్తప్రత్యభిజ్ఞకును విరోధము కలుగుట లేదు. అట్లే యొకఁడే పరమేశ్వరుఁడు సర్వజగత్తుయొక్క యుత్పత్తిస్థితిలయకారణుఁ డనుసర్వశాస్త్రసిద్ధాంతమునకును విరోధము కలుగుట లేదు. అట్లే ప్రతిజీవమును బ్రపంచభేదము నంగీకరించుటయం దేకల్పనాగౌరవరూపదోషము ప్రాప్తమైనదో అదియు నిపుడు ప్రాప్తమగుట లేదు. మఱియు శ్రుత్యాచార్యప్రసాదమువలన నుత్పన్నమైన "అహం బ్రహ్మాస్మి" యనుబ్రహ్మజ్ఞానముచేత నీయధికారిపురుషులకుఁ దమతమయజ్ఞానముయొక్క నివృత్తి కలుగఁగా నాయజ్ఞానముయొక్క కార్యభూత మగులింగశరీరాదులయొక్క నివృత్తివలన నిర్గుణబ్రహ్మభావప్రాప్తిరూపమోక్షమును సంభవించును.

శంక:—నానాజీవపక్షమందు ముక్తపురుషులకంటె భిన్నులగునితరజీవులును ఈశ్వరుఁడును జగత్తును విద్యమానులై యే యుండుటవలన, నేను ముక్తుఁడను, ఈయన్యజీవులు బద్ధులు, ఇది యన్యప్రపంచము, ఇతఁడు మఱియొకయీశ్వరుఁడు ఈప్రకారమైనభేదదృష్టి యాముక్తపురుషున కవశ్యము కలుగును. ఆభేదదృష్టి యుండుటవలన నద్వితీయబ్రహ్మసాక్షాత్కారమే కలుగదు. అట్టిసాక్షాత్కారము కలుగనందువలన నిర్గుణబ్రహ్మభావప్రాప్తిరూపమోక్షమే సంభవించుట లేదు.

సమాధానము.—"ఇదం సర్వం య దయమాత్మా, వాచారంభణం వికారో నామధేయమ్, మాయామాత్ర మిదం ద్వైత మద్వైతం పరమార్థతః" ఇత్యాదిశ్రుతులను విచారించి యధికారులచేత నజ్ఞానాదిసర్వజడప్రపంచమునకు బ్రహ్మమునందుఁ గల్పితత్వ మనునిశ్చయముచేత మిథ్యాత్వమే నిశ్చిత మగుచున్నది. మిథ్యావస్తువు ద్వైతభావముఁ జేయుట లేదు. అందువలన నధికారిపురుషుల కద్వితీయబ్రహ్మసాక్షాత్కారము సంభవించును. ఆసాక్షాత్కారముచేత విద్వాంసునకు బ్రహ్మభావప్రాప్తిరూపమోక్షము సంభవించుచున్నది.

శంక:—ఈ నానాజీవపక్షమం దాత్మజ్ఞానముచేతఁ దనయజ్ఞానము నివృత్తమైనను, అన్యజీవులయొక్క యజ్ఞానము విద్యమాన మగుచుండఁగా బ్రహ్మమం దీశ్వరత్వముయొక్క నివృత్తి సంభవింపదు. అందువలన, ఈపురుషునకు జ్ఞానముచే సగుణబ్రహ్మభావమే ప్రాప్త మగును.

సమాధానము:—లోకమునందును అన్యవస్తువుయొక్క జ్ఞానమువలన నన్యవస్తువు ప్రాప్త మగుట లేదు. ఎట్లు శుక్తిజ్ఞానమువలనఁ బురుషునకు రజతప్రాప్తి కలుగక యాశుక్తియే ప్రాప్త మగుచున్నదో, అట్లు గురుశాస్త్రములయొక్క యుపదేశ

ముచేత నీయధికారిపురుషునకు నిర్గుణబ్రహ్మజ్ఞానమే కలుగుచున్నది, సగుణబ్రహ్మజ్ఞానము కలుగుట లేదు. అందువలన నిర్గుణబ్రహ్మజ్ఞానముచేతఁ దత్త్వవేత్త యగుపురుషునకు నిర్గుణబ్రహ్మమే ప్రాప్తమగును. మాయామయసగుణబ్రహ్మప్రాప్తి యగుట లేదు. ఉదా—శుక్తియం దొకనికి రజతభ్రాంతికాలమందును మఱియొకవిశేషదర్శిపురుషునకా శుక్తిజ్ఞానమువలన నాశుక్తియే ప్రాప్తమగుచున్నది. రజతము ప్రాప్తమగుట లేదు. ఏకారణముచేత ననఁగా, శుక్తియందు రజతము వాస్తవముగా లేదు. మఱియు నన్యపురుషునియొక్క యజ్ఞానకల్పితరజత మన్యపురుషునియొక్క ప్రత్యక్షజ్ఞానమునకు విషయ మగుట లేదు. ఈలాగుననే యన్యాఽజ్ఞానిపురుషులకుఁ దమతమయజ్ఞానవశముచేత బ్రహ్మమునందు జీవేశ్వరజగద్రూపభ్రాంతి విద్యమానమై యున్నకాలమందును శ్రుత్యాచార్యప్రసాదమువలన విశేషదర్శి యగునన్యపురుషునకు "బ్రహ్మాహ" మ్మను నద్వితీయబ్రహ్మముయొక్క సాక్షాత్కారమువలన నానందైకరసాఽద్వితీయనిర్విశేషబ్రహ్మమే ప్రాప్త మగుచున్నది. సగుణేశ్వరప్రాప్తి యగుట లేదు. ఏకారణముచేత ననఁగా, సగుణేశ్వరుఁడు మాయామయుఁ డగుటవలన నిర్గుణబ్రహ్మముకన్న భిన్నుఁడు గాఁడు: భ్రాంతిచేతఁ జూడఁబడినపదార్థములు వాస్తవ మగుట లేదు. ఎట్లు భ్రాంతిచేతఁ జూడఁబడినశుక్తిరజత మాశుక్తియందు వాస్తవముగా లేదో అట్లద్వితీయనిర్గుణబ్రహ్మమునందు భ్రాంతిచేతఁ గల్పింపఁబడిన జీవేశ్వరజగద్భావములును వాస్తవముగా బ్రహ్మమునందు లేవు: అందువలన నీనానాజీవపక్షమందు సర్వజీవులకును బ్రపంచము సాధారణముగాఁ గాని యసాధారణముగాఁ గాని యంగీకరింపఁబడినను నిర్గుణబ్రహ్మభావప్రాప్తిరూపమోక్షము సంభవించుచున్నది.

[*] (29) కొందఱు గ్రంథకారులమతరీతిగా జీవేశ్వరవిభాగ వర్ణనము: (పంచమపక్షము.) [*]

కొందఱు గ్రంథకర్తలైననో జీవేశ్వరులకు విభాగ మిట్లు చెప్పుచున్నారు: పూర్వోక్తసర్వజగత్తునకుఁ గారణభూత మగునజ్ఞానమునం దుపహితమైన చైతన్యము, అనఁగా, నాయజ్ఞానమునందుఁ బ్రతిబింబిత మగుచైతన్య మీశ్వరుఁ డనియును ఆయజ్ఞానముయొక్క కార్యభూత మగునంతఃకరణమునం దుపహితమైనచైతన్యము, అనఁగా నాయంతఃకరణమునందుఁ బ్రతిబింబిత మగుచైతన్యము జీవుఁ డనియును జెప్పఁబడును. అచ్చట శ్రుతి—"కార్యోపాధి రయం జీవః కారణోపాధి రీశ్వరః"—భావము॥ అంతఃకరణరూపకార్యోపాధిసహితచైతన్యము జీవుఁ డనియును అజ్ఞానరూపకారణోపాధిసహితచైతన్య మీశ్వరుఁ డనియును జెప్పఁబడును. మఱియు "స్వామకీతో భవతి"

యను శ్రుతిచేత సుషుప్తియందు జీవునకు బ్రహ్మమునం దౌపాధికలయము అనఁగా నుపాధిలయప్రయుక్తలయము చెప్పఁబడియున్నది. అంతఃకరణము జీవున కుపాధి యని యంగీకరించినయెడల నాయంతఃకరణరూపోపాధియొక్క లయముచేత జీవున కౌపాధికలయము సంభవించును. జీవున కవిద్య యుపాధి యని యంగీకరించినచో సుషుప్తియం దవిద్యకు లయము కలుగుట లేదు. అందువలన సుషుప్తియందు జీవున కౌపాధికలయమును జెప్పునట్టి శ్రుతివచన మసంగత మగును. కావున నాశ్రుతివచనముచేతను నంతఃకరణమే జీవున కుపాధి యని సిద్ధించుచున్నది. ఈపక్షమందును అంతఃకరణ రూపోపాధులయొక్క నానాత్వముచేతను బరిచ్ఛిన్నత్వముచేతను జీవులును నానాగాను బరిచ్ఛిన్నులుగాను నగుదురు.

అచ్చట జీవేశ్వరస్వరూపనిర్ణయమందుఁ బూర్వోక్తపంచవిధపక్షముల లో మాయోపహితచైతన్యము జగత్కారణుఁ డైనయీశ్వరుఁ డనునర్థము సర్వగ్రంథకర్తలకును సమ్మతము. అనఁగా, అజ్ఞానముయొక్క యేకత్వనానాత్వములచేత, లేక, అంతఃకరణములయొక్క నానాత్వములచేత జీవునియొక్క యేకత్వనానాత్వముల యందు గ్రంథకారులకు వివాదము కలిగినను, మాయోపహితచైతన్య మీశ్వరుఁ డనునర్థమునం దేగ్రంథకర్తలకును వివాదము లేదు.

శంక:—ఈశ్వరునియందు వివాదము లేకపోయినను జీవునియొక్క యేకత్వనానాత్వములయందు గ్రంథకర్తలకుఁ బరస్పరము వివాదము చూడఁబడుటవలన ఆపక్షములలో నేపక్షము గ్రహింపఁదగినది? ఏపక్షముఁ పరిత్యజింపఁ దగినది?

సమాధానము:—సర్వవ్యవహారములును మాయామయ మగుటవలన సర్వపక్షములును గ్రహింపఁదగినవియు, అట్లే పరిత్యజింపఁదగినవియు నగును.

శంక:—ఎప్పుడాసర్వపక్షములును బరిత్యజించుటకుఁ దగియున్నవో, అపుడాసర్వపక్షములును బరిత్యజించుటయే యుచితము. ఏపక్షమును గ్రహింపఁ దగినది కాదు.

సమాధానము:—అధ్యారోపము అపవాదము అనురెంటిచేతనే యద్వితీయబ్రహ్మజ్ఞానము కలుగుచున్నది. అధ్యారోపాపవాదములు లేక బ్రహ్మజ్ఞానము కలుగుట లేదు. వాస్తవముగా ద్వైతప్రపంచములేని బ్రహ్మమునందు ద్వైతప్రపంచముయొక్క యారోప మధ్యారోప మనఁబడును. “నేహ నానాస్తి కించన” ఇత్యాది శ్రుతులచేత నారోపితప్రపంచముయొక్క నిషేధ మపవాద మనఁబడును. ఆయధ్యారోపాపవాదములయొక్క సిద్ధికొఱకు సర్వపక్షములును గ్రహించుటకుఁ దగినవియే యగును. అయినను దానియం దీవిశేష మున్నది. పూర్వోక్తజీవునియొక్క యేకత్వ

పక్షమం దైనను నానాత్వపక్షమం దైనను, ఏపక్ష మేముముక్షువుయొక్క మన స్సున కెక్కుచున్నదో యాముముక్షు వాపక్షము నంగీకరించి ప్రత్యగాత్మవివేచనము చేసి, అనఁగా నన్నమయాదిపంచకోశములయందుండి యాత్మను భిన్నము చేసి, యాప్రత్యగాత్మయొక్క బ్రహ్మరూపత్వమును సాక్షాత్కరించుకొనవలయును. అనఁగా "అహం బ్రహ్మాస్మి" యనుసాక్షాత్కారము సంపాదింపవలయును. బ్రహ్మసాక్షాత్కారమును సంపాదింపక జీవునియొక్క యేకత్వనానాత్వములయందుఁ గేవలవివాద మాత్రముఁ జేయుట గూడదు. ఏకారణముచేత ననఁగా, సర్వమతములయందును దూషణభూషణములు సమానములే యగును. ఇచ్చటఁ దాత్పర్య మేమనఁగా, ముముక్షువులకుఁ బ్రత్యగాత్మయొక్క బోధ మేప్రకారముచేతఁ గలుగునో యాప్రకారమే ముముక్షువులు సంపాదింపఁదగినది. అదియే శాస్త్రార్థము. ఈయర్థము వార్తికాచార్యులచేతను జెప్పఁబడి యున్నది. శ్లో॥ "యయా యయా భవే త్పుంసాం వ్యుత్పత్తిః ప్రత్యగాత్మని। సా సైవ ప్రక్రియేహ స్యా త్సాధ్వీసాచా నవస్థితా"—భావము॥ అధికారి పురుషులకు ఏయేప్రక్రియచేతఁ బ్రత్యగాత్మబోధ గలుగునో ఆయాప్రక్రియయే యీ వేదాంతశాస్త్రమునందు నిర్దోష మనియును గుణవంత మనియును దెలియవలయును.

## (30) ఉపాదానత్వకర్తృత్వములచేత నీశ్వరుఁడు జగత్కారణుఁ డనుట.

శంక:—మాయోపహితతత్పదార్థేశ్వరునకు జగత్తుయొక్క జన్మాదికారణత్వము పూర్వము చెప్పఁబడినది. ఆకారణత్వము నుపాదానతారూపముచేతను కర్తృత్వరూపముచేతను ద్విప్రకారమై యున్నది. అందు, ఈశ్వరున కేరూపమున నుపాదానత్వమును ఏరూపమునఁ గర్తృత్వమును నున్నది.

ఇట్లు శంక కలుగఁగా, ఇప్పు డాద్వివిధకారణత్వములు క్రమముగా నిరూపింపఁబడుచున్నవి.

ఈశ్వరుఁడు జ్ఞానశక్తిసహితాజ్ఞానోపహితస్వరూపముచేత నైననో జగత్తునకుఁ గర్త యగుచున్నాఁడు. ఇచ్చట నభిప్రాయ మేమనఁగా, జ్ఞానశక్తి సహితాజ్ఞానరూపోపాధి లేక శుద్ధబ్రహ్మమున కసంగత్వముచేతఁ గర్తృత్వము సంభవించుట లేదు. ఏల యన, కార్యముయొక్క యుపాదానకారణమును విషయము చేయునట్టి యపరోక్షజ్ఞానమును, ఇచ్ఛారూపచికీర్షయును, ప్రయత్నరూపకృతియు నను నీమూఁడును గలవాఁడే కర్త యనఁబడును. ఈవిధముగాఁ గర్తయొక్క లక్షణము పూర్వము చెప్పఁబడి యున్నది. ఇట్టికర్తృత్వము శుద్ధబ్రహ్మమునందు సంభవింపదు. ఏకారణముచేత ననఁగా "అసంగో హ్యాయం పురుషః, అసంగో నహి సజ్జతే" ఇత్యాదిశ్రుతులచేత బ్రహ్మమున కసంగత్వమే తెలియఁబడు చున్నది. అట్టి యసంగబ్రహ్మమునం దాజ్ఞానే

చ్ఛాకృతులు సంభవింపవు. మఱియు నాయజ్ఞానోపహితేశ్వరునియం దైననో జ్ఞానే చ్ఛాప్రయత్నములు సంభవించును. అందువలనఁ బూర్వోక్తేశ్వరునకే జగత్కర్తృత్వము సిద్ధించుచున్నది. ఆయీశ్వరుఁడే విక్షేపాదిశక్తిసహితాజ్ఞానోపహితస్వరూపమువలన జగత్తున కుపాదానకారణుఁ డగుచున్నాఁడు. అజ్ఞానముయొక్క జ్ఞానశక్త్యావరణశక్తి విక్షేపశక్తు లనుత్రివిధస్వరూపములు పూర్వము నిరూపింపఁబడియున్నవి. దాని నచ్చటఁదెలియవలయును. ఈప్రకారముగా నొకటే (మాయావిశిష్ట) బ్రహ్మమునకు జగత్తుయొక్క యుపాదానత్వమును గర్తృత్వమును సంభవించును. అచ్చట దృష్టాంత మే మనఁగా, ఊర్ణనాభి యనుజంతువిశేషము తంతువు నుత్పన్నము చేయుచున్నది. ఆతంతురూపకార్యమును గుఱించి యాయూర్ణనాభి యెట్లు తన శరీరాపేక్షచేత నుపాదానకారణమును దనచైతన్యరూపముచేత కర్తృరూపనిమిత్తకారణము నగుచున్నదో, అట్లే పూర్వోక్తరీతిగా నొకటేబ్రహ్మము జగత్తున కుపాదానకారణమును గర్తృరూపనిమిత్తకారణము నగుచున్నది.

శంక:—ఆ యొకటేబ్రహ్మమునకు జగత్తుయొక్క యుపాదానత్వమును నిమిత్తత్వమును గల దనునర్థమందుఁ బ్రమాణ మేమి?

సమాధానము:—బ్రహ్మమునం దభిన్ననిమిత్తోపాదానత్వము సాక్షాచ్ఛ్రుతిప్రమాణముచేతనే సిద్ధించుచున్నది. శ్రుతి—"యథోర్ణనాభిః సృజతే గృహ్ణాతి చ, యథాపృథివ్యా మోషధయః సంభవంతి, యథాసతః పురుషాత్కేశలోమాని, తథాక్షరా త్సంభవతీహ విశ్వమ్, యథాఽగ్నేః క్షుద్రా విస్ఫులింగా వ్యుచ్చరంతి ఏవ మే వాస్మా దాత్మనః సర్వే ప్రాణాః, య స్సర్వజ్ఞః సవిశ్వకృ త్సహి సర్వస్య కర్తా"— భావము॥ ఎట్లు ఊర్ణనాభిజంతువు తనయందుండి తంతువుల నుత్పన్నము చేయునదియును తనయందే యాతంతువులను లయము చేసికొనునదియు నగుచున్నదో, అట్లు బ్రహ్మముగూడ తనయందుండియే యీజగత్తు నుత్పన్నము చేయునదియును దనయందే లయము చేసికొనునదియు నగుచున్నది. మఱియు నెట్లు పృథివియం దుండి నానావిధ మైనయోషధు లుత్పన్న మగుచున్నవో మఱియు నెట్లు పురుషునియందుండి కేశలోమము లుత్పన్న మగుచున్నవో అట్లక్షరబ్రహ్మమునందుండి యీవిశ్వ ముత్పన్న మగుచున్నది. మఱియు నెట్లు ప్రజ్వలితాగ్నియందుండి క్షుద్రవిస్ఫులింగము లుత్పన్న మగుచున్నవో అట్లీయాత్మయందుండి సర్వప్రాణు లుత్పన్ను లగుచున్నారు. ఏపరమేశ్వరుఁడు సర్వజ్ఞుఁడో యాపరమేశ్వరుఁడే విశ్వమును జేయుచున్నాఁడు, ఆపరమేశ్వరుఁడే సర్వమునకుఁ గర్త. ఇత్యాద్యనేక శ్రుతులు బ్రహ్మము జగత్తున కభిన్ననిమిత్తోపాదానకారణ మని చెప్పుచున్నవి.

మఱియు "అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే" ఇత్యాదిస్మృతులును బూర్వోక్తార్థమునే చెప్పుచున్నవి. అందువలన నొకటే బ్రహ్మమునకు జగత్తునొక్కయుపాదానత్వకర్తృత్వములు సంభవించు చున్నవి. లేక పూర్వోక్తేశ్వరుని సర్వజ్ఞుఁ డని యంగీకరింపనియెడల నాయీశ్వరునకు సర్వజగత్కర్తృత్వమే సంభవింపని దగును. పూర్వోక్తశ్రుతులో యీశ్వరుని సర్వజగత్తునకుఁ గర్త యని చెప్పుచున్నవి. అందువలన నాయీశ్వరుని సర్వజ్ఞుఁ డని యవశ్య మంగీకరింపవలయును. ఆయీశ్వరునకు సర్వజ్ఞత్వము శ్రుతిప్రమాణముచేతను సిద్ధించుచున్నది. అచ్చట శ్రుతి— "యః సర్వజ్ఞః సర్వవిత్, యస్య జ్ఞానమయం తపః" భావము॥ ఏయీశ్వరుఁడు సర్వజ్ఞుఁడో, అనఁగా సామాన్యరూపముచేత సర్వజగత్తును జూచువాఁడో, ఏయీశ్వరుఁడు సర్వవిత్తో అనఁగా విశేషరూపముచేత సర్వజగత్తును జూచువాఁడో, మఱియు ఏయీశ్వరునకు సర్వజగత్తును విషయముఁ జేయు జ్ఞానమే తపమో, అట్టి సర్వజ్ఞేశ్వరునకు సర్వజగత్కర్తృత్వము సంభవించుచున్నది.

## (31) బ్రహ్మవిష్ణుమహేశ్వరుల కభేదనిరూపణము.

శంక:—పురాణాదులయం దైననో బ్రహ్మవిష్ణుమహేశ్వరు లనుమువ్వురయందుండియే జగదుత్పత్తిస్థితిలయములు చెప్పఁబడి యున్నవి. ఇచ్చట మాయోపహితపరమేశ్వరునియందుండి జగదుత్పత్తిస్థితిలయములు మీచేఁ జెప్పఁబడినవి. అందువలన నాపురాణాదివచనములకు విరోధము ప్రాప్తమగును.

సమాధానము:—మాయోపహితపరమేశ్వరుఁడే బ్రహ్మవిష్ణుమహేశ్వరు లనుత్రివిధరూపములను బొందుచున్నాఁడు. అది యెట్లనఁగా, పూర్వోక్తమాయయందు స్థితమైన యేనిరతిశయసత్త్వగుణమున్నదో యాసత్త్వగుణము పరమేశ్వరునియిచ్ఛచేత లోకానుగ్రహముకొఱకు బ్రహ్మవిష్ణుమహేశ్వరు లను త్రిమూర్తులయాకారమునఁ బరిణామమును బొందుచున్నది. అచ్చట దండకమండలధారణుఁ డగుచతుర్ముఖమూర్తిచే నుపహితుఁ డైనయాపరమేశ్వరుఁడు జగత్తును సృష్టించుబ్రహ్మ యగుచున్నాఁడు. మఱియు, శంఖచక్రగదాపద్మములను నాల్గింటిని హస్తమందు ధరించినట్టిచతుర్భుజమూర్తిచే నుపహితుఁ డైనయాపరమేశ్వరుఁడు జగత్తును బాలించువిష్ణువగుచున్నాఁడు. మఱియుఁ ద్రినేత్రము గలిగి త్రిశూలమును హస్తమందు ధరించినట్టిమూర్తిచే నుపహితుఁ డైన యాపరమేశ్వరుఁడు జగత్సంహారకర్త యగుమహేశ్వరుఁ డగుచున్నాఁడు. ఈప్రకారముగా నాయొకఁడే పరమేశ్వరుఁడే బ్రహ్మవిష్ణుమహేశ్వరరూపముల నొందుచున్నాఁడు. శ్రుతి— "స బ్రహ్మా స శివః సేంద్రః సో ఽక్షరః పరమః స్వరాట్ స ఏవ విష్ణుః"—భావము॥ ఆమాయోపహితపరమేశ్వరుఁడే బ్రహ్మశివేంద్ర

విష్ణురూపము లగుచున్నాఁడు. మఱియు నీయర్థము విద్వాంసు లైనపూర్వాచార్యుల చేతను జెప్పఁబడి యున్నది. అచ్చట. "శ్లో. ఏకైవమూర్తి ర్బిభిదే త్రిధా సా సామాన్య మేషాం ప్రథమా వరత్వమ్ । హరే ర్హర స్తస్య హరిః కదాచి ద్వేధా స్తయో స్తావపి ధాతు రాద్యౌ"—భావము॥ ఒకఁడే పరమేశ్వరమూర్తి బ్రహ్మవిష్ణు మహేశ్వరు లను త్రివిధభేదములను బొందుచున్నాఁడు. ఈముగ్గురకును బ్రహ్మత్వా పరత్వములును సమానములే యగును. అచ్చట, ఒకకాలమం దైననో విష్ణువునకు మహేశ్వరుఁ డాది యగును, ఒకకాలమం దామహేశ్వరునకు విష్ణు వాది యగును, ఒక కాలమందు విష్ణుమహేశ్వరు లిర్వురకును బ్రహ్మ యాది యగును, ఒకకాలమం దాయిర్వురును బ్రహ్మ కాది యగుదురు. కావున బ్రహ్మవిష్ణుమహేశ్వరు లనుత్రివిధ దేవతలును నధికారులచేతఁ దమతమభక్తి ననుసరించి యుపాసించుటకు యోగ్యు లగుదురు.

మఱియుఁ గొందఱు గ్రంథకారు లైననో యిట్లు చెప్పుచున్నారు. జగత్స్రష్ట యగుహిరణ్యగర్భరూపబ్రహ్మ యీశ్వరుఁడు కాఁడు. మఱి యే మనఁగా జీవవిశేషుఁడును అంతర్యామిపరమేశ్వరునిచేత నావిష్టుఁడును సమష్టిలింగశరీరాభిమానియును సత్యలోకమందు నివసించువాఁడును నగును. అట్టి హిరణ్యగర్భునకు జీవత్వము "సవై శరీరీ ప్రథమః" ఇత్యాదిశ్రుతిప్రమాణములచేతనే సిద్ధించును. శివవిష్ణువులను ద్వివిధమూర్తు లైననో మాయయొక్క శుద్ధసత్త్వగుణపరిణామ మగుటవలన నీశ్వరరూపు లగుదురు. ఈయర్థము మహాభారతమందును జెప్పఁబడియున్నది. అచ్చట. "శ్లో. రుద్రో నారాయణ శ్చైవ త్వేకం సత్త్వం ద్విధాకృతమ్ । లోకే చరతి కౌంతేయ వ్యక్తిస్థం సర్వకర్మసు"—భావము॥ ఓకౌంతేయా! ఆపరమేశ్వరుని చేఁ దనమాయయొక్క శుద్ధసత్త్వగుణ మొకటియే రుద్రనారాయణు లను ద్వివిధ రూపములుగాఁ జేయఁబడు చున్నది. ఆయిరువురియందును విష్ణుభక్తియో మోక్షమున కంతరంగసాధనమును శివాదులభక్తియో కించిద్వ్యవధానముచేత మోక్షమునకు సాధనము నగుచున్నది. ఏకారణముచేత ననఁగా సత్త్వగుణప్రవర్తకత్వము విష్ణువునకే గలదు. ఈయర్థము పురాణాదులయందును జెప్పఁబడి యున్నది. "శ్లో. ఆరోగ్యం భాస్కరా దిచ్ఛే చ్ఛ్రియ మిచ్ఛే ద్ధుతాశనాత్ । జ్ఞానం మహేశ్వరా దిచ్ఛే న్మోక్ష మిచ్ఛే జ్జనార్దనాత్"—భావము॥ ఈపురుషుఁడు సూర్యదేవతయందుండి ఆరోగ్య మిచ్ఛించుఁ గాక, అనఁగా, ఆరోగ్యప్రాప్తికొఱకు సూర్యదేవత నుపాసింపవలయును, ఈప్రకార మైనయర్థము నుత్తరత్ర దెలియవలయును, అగ్నిదేవునియందుండి సంపత్తు నిచ్ఛించుఁ గాక, మహేశ్వరునియందుండి జ్ఞానము నిచ్ఛించుఁ గాక, విష్ణువునందుండి మోక్షము నిచ్ఛించుఁ గాక.

ఇచ్చటఁ గొందఱు శైవమతస్థు లిట్లు చెప్పుచున్నారు. చంద్రునిశిరోభూషణముగాఁ గలవాఁడును నీలకంఠుఁడును త్రినేత్రుఁడును నుమాసహితుఁడు నైన శుద్ధసత్త్వమూర్తిచే నుపహితుఁ డైనమాయోపహితపరమేశ్వరుఁడు పరమశివుఁ డగుచున్నాఁడు. ఆపరమశివుఁడే ముముక్షుజనులచే నుపాసింప యోగ్యుఁ డగును. శ్రుతి—"ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం త్రిలోచనం నీలకంఠం ప్రశాంతమ్ । ధ్యాత్వా మునిర్గచ్ఛతి భూతయోనిం సమస్తసాక్షిం తమసః పరస్తాత్"—భావము॥ ఏపరమశివుఁడు ఉమాసహితుఁడును పరమేశ్వరుఁడును సమర్థుఁడును త్రిలోచనము గలవాఁడును నీలకంఠుఁడును అతిశాంతస్వభావము గలవాఁడును నగునో అట్టి పరమశివుని ధ్యానముచేసి మాయాసంబంధమువలన సర్వభూతములకుఁ గారణమును సర్వమునకు సాక్షియును వాస్తవమం దజ్ఞానరూపతమస్సుకంటెఁ బర మైనదియు నగు పరబ్రహ్మమును ముముక్షుజనులు పొందు చున్నారు. ఆపరమశివునకే బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముగ్వురును విభూతు లగుదురు. అచ్చట "స బ్రహ్మ స శివః సేంద్రః సోఽక్షరః పరమః స్వరాట్" ఇత్యాదిశ్రుతులు బ్రహ్మవిష్ణుమహేశ్వరుల ముగ్వురను ఆపరమశివునియొక్కవిభూతులుగానే చెప్పియున్నవి. అట్లే పురాణమందును నీయర్థము చెప్పఁబడి యున్నది. "శ్లో. యస్యాజ్ఞయా జగత్స్రష్టా విరించిః పాలకో హరిః । సంహర్తా కాలరుద్రాఖ్యో నమస్తస్మై పినాకినే"—భావము॥ ఏపరమశివునియాజ్ఞచేత బ్రహ్మ జగదుత్పత్తి చేయుచున్నాఁడో విష్ణువు పరిపాలనముఁ జేయుచున్నాఁడో కాలరుద్రుఁడు సంహారముఁ జేయుచున్నాఁడో ఆపరమశివుని నమస్కరించుచున్నాను.

కొందఱు వైష్ణవమతముగలవా రిట్లు చెప్పుచున్నారు. శంఖచక్రగదాపద్మములను నాల్గిటిని హస్తమందుధరించి లక్ష్మీవిరాజమానుఁ డగు నిరతిశయసత్త్వమూర్తిచే నుపహితుఁ డైనమాయోపహితపరమాత్మయే పరమవాసుదేవుఁడు. ఆపరమవాసుదేవుఁడే ముముక్షుజనులచే నుపాసించుటకు యోగ్యుఁ డగును. బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముగ్వురు నాపరమవాసుదేవునియొక్కవిభూతులే యగుదురు. "స బ్రహ్మ సశివ స్సేంద్రః సోఽక్షరః పరమః స్వరాట్" ఇత్యాదిశ్రుతులును బ్రహ్మాదులు ముగ్వురు నాపరమవాసుదేవునియొక్కవిభూతు లనియే చెప్పియున్నవి. మఱియు "తమేవ విద్వా నమృత ఇహ భవతి నాన్యః పంథా విద్యతే ఽయనాయ" ఇత్యాదిశ్రుతులును "మోక్ష మిచ్ఛే జ్జనార్దనాత్" ఇత్యాదిపురాణవచనములును ఆపరమవాసుదేవునియొక్కధ్యానమువలననే మోక్షప్రాప్తి చెప్పుచున్నవి. అందువలన నాపరమవాసుదేవుఁడే ముముక్షుజనులచే నుపాసింప యోగ్యుఁ డగుచున్నాఁడు.

మఱియు, హైరణ్యగర్భులో యిట్లనుచున్నారు. హిరణ్యగర్భుఁడే మాయోపహితపరమేశ్వరుఁడు. ఆహిరణ్యగర్భునియొక్క పరమేశ్వరత్వమం దనేక శ్రుతిస్మృతిప్రమాణము లున్నవి. అందువలన నాహిరణ్యగర్భుఁడే ముముక్షుజనులచే నుపాసించుటకు యోగ్యుఁ డగుచున్నాఁడు.

పూర్వము శైవులచేతను వైష్ణవులచేతను బ్రహ్మవిష్ణుమహేశ్వరు లను త్రిమూర్తులకు భిన్నముగా నొకపరమశివుఁడును బరమవాసుదేవుఁడును గల్పింపఁబడిరి. కాని దానియందే ప్రమాణమును జూడఁబడ లేదు. మఱియు వారివలన నాయర్థము సిద్ధించుటకొఱకు "స బ్రహ్మా స శివః సేన్ద్రః" ఇత్యాది శ్రుతివచనము లేవి ప్రమాణములుగాఁ జెప్పఁబడినవో యాశ్రుతు లామాయోపహితపరమేశ్వరునే చెప్పుచున్నవి. ఆవచనములకుఁ ద్రిమూర్తులకంటె భిన్నుఁ డైనయాపరమశివునియందుఁ గాని పరమవాసుదేవునియందుఁ గాని ప్రమాణరూపత్వము సంభవింపదు. అందువలన నామాయోపహితపరమేశ్వరుఁడే బ్రహ్మవిష్ణుమహేశ్వరు లనుత్రివిధరూపములను బొందుచున్నాఁడు. ఈకారణమువలనఁ ద్రివిధరూపములును సమానము లని పూర్వము చెప్పఁబడినమతమే ముముక్షుజను లాశ్రయించుటకు యోగ్యమై యున్నది.

## (32) మాయోపహితపరమేశ్వరునియందుండి ఆకాశాది జగదుత్పత్తిక్రమనిరూపణము.

అందుఁ బూర్వము మాయోపహితతత్పదార్థరూపబ్రహ్మమునకు జగదుత్పత్తిస్థితిలయకారణత్వరూపతటస్థలక్షణము చెప్పఁబడినది. ఇపు డాలక్షణమును స్పష్టముఁ జేయుటకొఱకు నామాయోపహితపరమేశ్వరునియందుండి యాకాశాదిజగదుత్పత్తిక్రమము చెప్పఁబడుచున్నది. అందు, ఉత్పన్ను లగుటకు యోగ్యులైనప్రాణులయొక్క పుణ్యపాపకర్మములచే సహకృతుఁ డగుపూర్వోక్తవిక్షేపాదిశక్తిప్రధానమాయోపహితేశ్వరుఁడు ప్రథమమం దీజగ త్తిప్పు డుత్పన్న మగుటకు యోగ్యమగు నని సంకల్పించెను. ఆసంకల్పవిశిష్టేశ్వరునియందుండి ప్రథమమున నాకాశ ముత్పన్న మైనది. ఆయాకాశమందుండి వాయు వుత్పన్న మైనది. వాయువునందుండి యగ్ని యుత్పన్న మైనది. అగ్నియందుండి జల ముత్పన్న మైనది. జలమందుండి పృథివి యుత్పన్న మైనది. అందు శ్రుతి—"తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః। ఆకాశాద్వాయుః। వాయో రగ్నిః। అగ్నే రాపః। అద్భ్యః పృథివీ"—భావము॥ ఆ మాయోపహితబ్రహ్మమునందుండి యాకాశమును ఆకాశమందుండి వాయువును నావాయువునందుండి యగ్నియును అగ్నియందుండి జలమును జలమునందుండి పృథివియు నుత్పన్న మైనవి.

శంక:—అచేతనములును గల్పితములు నైన యాకాశాదిభూతములకు వాయ్వాదిభూతములయొక్క యుపాదానకారణత్వ మెట్లు సంభవించును?

సమాధానము:—ఇచ్చట నాకాశాదులకు వాయ్వాదులయొక్క యుపాదానత్వము వివక్షితము గాదు. మఱి యే మనఁగా నాకాశాద్యుపహితచైతన్యములకే వాయ్వాదులయొక్క యుపాదానత్వము వివక్షితమై యున్నది. అనఁగా నాకాశోపహితచైతన్యమందుండి వాయు వుత్పన్న మైనది. ఆవాయూపహితచైతన్యమునందుండి యగ్ని యుత్పన్న మైనది. ఆయగ్న్యుపహితచైతన్యమునందుండి జల ముత్పన్న మైనది. ఆజలోపహితచైతన్యమందుండి పృథివి యుత్పన్న మైనది. ఈప్రకారముగా నాయా యుపాధిసహితచైతన్యమే సర్వత్ర కారణ మగుచున్నది. ఒకవేళఁ గల్పితాకాశాదులే కారణ మని యంగీకరించినయెడలఁ జేతనబ్రహ్మమునకు సర్వజగత్కారణత్వమును జెప్పునట్టి శ్రుతులకు విరోధము ప్రాప్త మగును. ఇచ్చట సారాంశ మే మనఁగా, మాయ కారణబ్రహ్మమున కుపాధి యగుటవలన నెట్లామాయ కాకాశాదిప్రపంచముయొక్క కారణత్వ మున్నదో అట్లాకాశాదులు నాకారణబ్రహ్మమున కుపాధి యగుటవలననే యాయాకాశాదులకును వాయ్వాదులయొక్క కారణత్వ మున్నది, స్వాతంత్రముగా లేదు.

## ( (33) వైశేషికమతరీతిగా జగదుత్పత్తినిరూపణము. )

ఇచ్చట వైశేషికశాస్త్రానుసారు లిట్లు చెప్పుచున్నారు.—ద్రవ్యము 1, గుణము-2, కర్మము-3, సామాన్యము-4, విశేషము-5, సమవాయము-6, అభావము-7, అని పదార్థములు సప్తవిధములే. అచ్చట గుణాదిపదార్థములు ద్రవ్యమునకుఁ బరతంత్రములై యున్నవి. సర్వభావకార్యములును సమవాయికారణము అసమవాయికారణము నిమిత్తకారణము అను త్రివిధకారణములచే జన్య మగుచున్నవి. జన్యద్రవ్యమును జన్యగుణకర్మము లను త్రివిధములును భావకార్యము లనఁబడును. అచ్చట సమవాయికారణత్వ మొకద్రవ్యపదార్థమునందే గలదు. గుణకర్మాదులయందు లేదు. అసమవాయికారణత్వము గుణకర్మము లనుద్వివిధపదార్థములయందే గలదు. అన్యపదార్థములయం దుండుట లేదు. నిమిత్తకారణత్వమో ద్రవ్యాదిసకలపదార్థములయందుఁ గలదు. అచ్చట, పృథివి-1, జలము-2, తేజస్సు-3, వాయువు-4, ఆకాశము-5, కాలము-6, దిక్కు-7, ఆత్మ-8, మనస్సు 9, అని ద్రవ్యములు నవవిధములే యని చెప్పుదురు. పృథివ్యాదిచతుర్విధద్రవ్యములయొక్క పరమాణువులును ఆకాశాదిపంచద్రవ్యములు నను నివి యన్నియు నిత్యద్ర

వ్యము లనియును నిరవయవము లనియును జెప్పుదురు. ఆపరమాణువులయందుండి యుత్పన్నము లైన ద్వ్యణుకాదిబ్రహ్మాండపర్యంతము లగుసర్వకార్యద్రవ్యములును అనిత్యద్రవ్యము లనియును అవయవు లనియును జెప్పుదురు. సృష్ట్యాదికాలమునందుఁ బరమేశ్వరుని యిచ్ఛచేత నాపరమాణువులయందుఁ గ్రియ గలుగుచున్నది. అనంతరము రెండురెండుపరమాణువులకు సంయోగము గలుగుచున్నది. ఆసంయుక్తపరమాణుద్వయమునందుండి ప్రథమము ద్వ్యణుకరూపకార్య ముత్పన్న మగుచున్నది. ఆ ద్వ్యణుకరూపకార్యమునకుఁ బరమాణుద్వయము సమవాయికారణము. ఆపరమాణుద్వయసంయోగ మసమవాయికారణము. ఈశ్వరేచ్ఛాదికము నిమిత్తకారణము. ఈరీతిగా నుత్తరత్ర త్ర్యణుకాదికార్యములకును సమవాయికారణాదికమును దెలియవలయును. ఈప్రకారముగానే యాద్వ్యణుకరూపకార్యోత్పత్త్యనంతరము పునఃక్రియచే సంయుక్తద్వ్యణుకత్రయమునందుండి త్ర్యణుకరూపకార్య ముత్పన్న మగుచున్నది. తదనంతరము పునఃక్రియచే సంయుక్తత్ర్యణుకచతుష్టయమునందుండి చతురణుకరూపకార్య ముత్పన్న మగుచున్నది. ఈప్రకార మైనక్రమముచే మహాపృథివి మహాజలము మహాతేజస్సు మహావాయు వుత్పన్న మగుచున్నవి. అందువలన నాపరమాణువులే సర్వజగత్తున కుపాదానకారణ మగుచున్నవి. మాయోపహితబ్రహ్మము జగత్తున కుపాదానకారణము గాదు. ఇట్లు వైశేషికశాస్త్రానుసారు లంగీకరించుచున్నారు. ఈవైశేషికశాస్త్రకారులమతము న్యాయప్రకాశగ్రంథమునందు మాచే విస్తరముగా నిరూపింపఁబడి యున్నది. దానిం దెలియ నిచ్ఛ గలవారచ్చటఁ దెలియవలయును.

ఈవైశేషికమతము గూడ సమీచీనము గాదు. ఏల యన, శక్తిసాదృశ్యాద్యనేకపదార్థములు విద్యమానములై యుండఁగాఁ బదార్థములు సప్తవిధములే యను వైశేషికులప్రతిజ్ఞ యసంగతమై యున్నది. మణిమంత్రాదులసమీపతవలన వహ్నియందు దాహరూపకార్యము గలుగుట లేదు. ఆమణిమంత్రాదులు దూర మగుటవలన నావహ్నికి దాహము గలుగుచున్నది. దానిచే నావహ్నియందు దాహానుకూల మగుశక్తియొక్క నాశోత్పత్తు లవశ్య మంగీకరింపవలయును. అనఁగా మణిమంత్రాదు లుండుటవలన దాహానుకూలశక్తి నష్ట మగుచున్నది, ఆమణిమంత్రాదులు దూర మగునపు డాశక్తి పునరుత్పన్న మగుచున్నది. అందువలన నావహ్నియందు దాహానుకూలశక్తి నవశ్య మంగీకరింపవలయును. ఇట్లు మృత్తికాదిసర్వకారణములయందును దమతమఘటాదికార్యములకు ననుకూల మైనశక్తి యున్నది. ఆశక్తి ద్రవ్యాదిసప్తపదార్థములకన్న భిన్నపదార్థమే యగును.

అట్లుల వైశేషికు లుక్తస్థలమందు మణిమంత్రాదిప్రతిబంధములయొక్క యభావమునే దాహమునకుఁ గారణముగా నంగీకరించుచున్నారు. వారికథనము శ్రుతిసూత్రములకు విరుద్ధ మగుటవలన నసంగతము. శ్రుతి "కథ మసతః సజ్జాయే త"—భావము॥ అభావరూపాసత్తునుండి సత్కార్యముయొక్కయుత్పత్తి యెట్లు గలుగదు. సూత్రము "నాసతో ఉదృష్టత్వాత్" అభావరూపాసత్తునుండి కార్యోత్పత్తి యుక్తము గాదు. ఏకారణముచేత ననఁగా లోకమునం దసత్తైన నరశృంగాదులయందునుండి యేకార్యోత్పత్తియును జూడఁబడుట లేదు. మఱి యే మనఁగా సత్తైన మృత్తికాదులయం దుండియే ఘటాదికార్యోత్పత్తి చూడఁబడుచున్నది. అందువలనఁ బ్రతిబంధకాభావమును గార్యమునకుఁ గారణ మని యంగీకరించుట యీశ్రుతిసూత్రములకు విరుద్ధ మగుటచే నసంగతము.

ఈప్రకారముగానే "చంద్రవత్ ముఖమ్" ఇత్యాద్యనుభవమువలన ముఖాదులయందుఁ జంద్రాదులయొక్కసాదృశ్యము సిద్ధించుచున్నది. అందువలన నాసాదృశ్యముగూడ శక్తివలె నాద్రవ్యాదిసప్తపదార్థములకన్న భిన్నపదార్థమే. ఈ శక్తి సాదృశ్యములయొక్కవిస్తరనిరూపణము న్యాయప్రకాశముయొక్కచతుర్థ పరిచ్ఛేదమందుఁ జేయఁబడియున్నది. దాని నచ్చటఁ దెలియనగును. ఈరీతిగా శక్తి సాదృశ్యాద్యధికపదార్థములు విద్యమానము లగుచుండఁగాఁ బదార్థములు సప్తవిధములే యను వైశేషికులకథన మసంగతమై యున్నది.

మఱియు, అంధకారరూపదశమద్రవ్యము విద్యమాన మగుచుండఁగా ద్రవ్యములు నవవిధములే యను నావైశేషికకథనము గూడ నసంగతము. "నీలం తమ శ్చలతి" యను ప్రత్యక్షప్రతీతివలన నాయంధకారరూపతమమునందు నీలరూపమును జలనక్రియయును సిద్ధించుచున్నవి. గుణక్రియల కాశ్రయము ద్రవ్యమే యగుటవలన నాయంధకారరూపతమమునకు ద్రవ్యత్వము సంభవించుచున్నది. మఱియు వైశేషికు లాతమ మాలోకముయొక్కయభావరూపముగా నంగీకరించుచున్నారు. వారికథన మసంగతము. ఏల యన, ఏది యేది యభావమో అది యది ప్రతియోగిసాపేక్షప్రతీతికే విషయ మగుచున్నది. ప్రతియోగినిరపేక్షప్రతీతికి విషయ మేయభావము నగుట లేదు. ఉదా—ఘటాభావము పటాభావము ఇత్యాద్యభావములు ఘటపటాదిరూపప్రతియోగిసాపేక్షప్రతీతికే విషయము లగుచున్నవి. ఈయంధకారరూపతమ మాలోకరూపప్రతియోగిసాపేక్షప్రతీతికి విషయ మగుట లేదు. అందువలన నాయంధకారము నాలోకాభావరూపముగా నంగీకరించుటయం దేప్రమాణమును లేదు. మఱి యే మనఁగా, పూర్వోక్తయుక్తివలన నాయంధకార

ము దశమద్రవ్య మనియే యంగీకరింపవలయును. ఆయంధకారరూపతమమునకు ద్రవ్యత్వమును ఆలోకాభావత్వమును గుఱించి న్యాయప్రకాశము ద్వితీయపరిచ్ఛేదాంతమందు విస్తరముగా నిరూపింపఁబడి యున్నది. దాని నచ్చటఁ దెలియనగును.

మఱియు వైశేషికులచే నాత్మకూడ జ్ఞానాదిగుణముల కాశ్రయ మగుటచేతను సమవాయికారణ మగుటచేతను ద్రవ్యముగానే యంగీకరింపఁబడియున్నది. అదియు నసంగతమై యున్నది. ఏల యన, శ్రుతి స్మృతి విద్వాంసులయనుభవ మను నీత్రివిధప్రమాణములచే నాత్మకు నిర్గుణత్వమును సచ్చిదానందరూపత్వమునే నిశ్చయింపఁబడియున్నది. "సాక్షీచేతా కేవలో నిర్గుణశ్చ" అనుశ్రుతియే యాత్మ నిర్గుణమని చెప్పుచున్నది. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, ఆనందో బ్రహ్మ" అనుశ్రుతి యాత్మను సచ్చిదానందరూపముగాఁ జెప్పుచున్నది. అందువలన నాయాత్మ ద్రవ్యరూపము గాదు. ఆత్మ యద్రవ్య మగుటవలన గుణాదులవలెఁ బరతంత్ర మగు నని వైశేషికులు చెప్పినయెడల నదియు నసంగతము. ఏల యన, శ్రుతిస్మృతులయం దాత్మయే సర్వకల్పనల కధిష్ఠాన మనియును సర్వప్రేరక మనియును జెప్పఁబడి యున్నది. అట్టియాత్మ యద్రవ్యరూపత్వముచేతఁ బరతంత్ర మని చెప్పుట యాశ్రుతిస్మృతివాక్యములకు విరుద్ధ మగును. అందువలన నద్రవ్యరూప మైనను ఆయాత్మ సర్వమున కధిష్ఠాన మగుటచేతను సర్వప్రేరక మగుటచేతను స్వతంత్రమే యగును. ఈకారణముచేతను ద్రవ్యము నవవిధములే యనువారిప్రతిజ్ఞ యసంగతము.

మఱియు నావైశేషికులచేత నాకాశాద్యనేకనిత్యపదార్థము లంగీకరింపఁబడి యున్నవి. వారి యాకల్పనగూడ శ్రుతికి విరుద్ధ మగుటవలన నసంగతము. ఎట్లన, శ్రుతి బ్రహ్మముకన్న భిన్న మగు సర్వజగత్తును అనిత్య మనియే చెప్పియున్నది. అచ్చట శ్రుతి—"అతో ఽన్యదార్తమ్, మాయామాత్ర మిదం ద్వైత మద్వైతం పరమార్థతః"— భావము॥ బ్రహ్మముకన్న భిన్న మైనసర్వజగత్తును ఆర్తము అనఁగా మిథ్య యగును. ఈసర్వద్వైతప్రపంచము మాయామాత్రము, అనఁగా మిథ్య, అద్వైతబ్రహ్మమే పారమార్థికసత్యము. మఱియు "ఆత్మన ఆకాశః సంభూతః, తన్మనో కురుత" అను నీశ్రుతియం దాకాశమునకును మనస్సునకును బ్రహ్మమునందుండి యుత్పత్తి చెప్పఁబడి యున్నది. మఱియు "జాతస్య హి ధ్రువో మృత్యుః" అనువచనమువలన శ్రీభగవంతునిచేత నుత్పత్తి గలపదార్థములకు నియమముగా నాశము చెప్పఁబడి యున్నది. ఉత్పత్తినాశములు గల వగుటవలన నాకాశాదు లనిత్యములే యగును. మఱియు వైశేషికులచేఁ బరమాణువుల కేనిరవయవత్వనిత్యత్వము లంగీకరింపఁబడి యున్నవో అవియును నసంగతములు. ఎట్లన, లోకమున దేహా

ఏ పదార్థములు రూపాదిగుణసహితములును బరిచ్ఛిన్నములు నగుచున్నవో యా పదార్థములు సావయవములు ననిత్యములు నగుచున్నవి. ఉదా—ఘటపటాదిపదార్థములవలె. కాఁగాననే నాపరమాణువులును మీమతమునందు రూపాదిగుణసహితములును బరిచ్ఛిన్నములు నగును. అందువలన నాపరమాణువులును ఘటాదులవలె సావయవములు ననిత్యములు నగును.

మఱియు, పరమాణువులను సావయవము లని యంగీకరించుటయందు వైశేషికులచేత ననవస్థాదోషప్రాప్తి చెప్పఁబడి యున్నది. అదియు నసంగతము. ఏ కారణముచేత ననఁగా, ఈశ్వరరూపపరమకారణునియందే యవయవధారయొక్క విశ్రాంతి సంభవించు చున్నది. మఱియు సూక్ష్మభూతములకన్న భిన్నములై పరమాణువులు గలవనుటయందేప్రమాణమును లేదు. మఱి యే మనఁగా సూక్ష్మభూతములే పరమాణువు లనఁబడును. ఆసూక్ష్మభూతములయుత్పత్తి పూర్వోక్తరీతిగా నీశ్వరునివలననే యగుచున్నది. ఈకారణమువలనఁగూడ నాపరమాణువులు సావయవములు ననియు ననిత్యము లనియునే సిద్ధించుచున్నది. మఱియు నావైశేషికులచేత సంయుక్తపరమాణుద్వయము నందుండి ద్వ్యణుకముయొక్క యుత్పత్తి చెప్పఁబడి యున్నది. అదియును సంభవించుట లేదు. ఏల యన, ఆవైశేషికులచేతఁ బరమాణువులు నిరవయవము లని యంగీకరింపఁబడి యున్నది. మఱియు సంయోగమునకు నవ్యాప్యవృత్తిత్వము నంగీకరింపఁబడి యున్నది. ఏద్రవ్యమునందు సంయోగ మున్నదో ఆద్రవ్యమునందే సంయోగాభావము గూడ నున్నది. ఉదా—ఒకవృక్షముయొక్క శాఖాదిదేశమందుఁ బక్షియొక్క సంయోగ మున్నది, మూలాదిదేశమందుఁ దత్సంయోగాభావ మున్నది. ఇదియే సంయోగమం దవ్యాప్యవృత్తిత్వము. ఆసంయోగము సావయవద్రవ్యములకే సంభవించు చున్నది. నిరవయవద్రవ్యముల కా సంయోగము సంభవించుట లేదు. వైశేషికులచేఁ బరమాణువులు నిరవయవము లని యంగీకరింపఁబడి యున్నది. అందువలన నాపరమాణువులసంయోగ మసంభవ మగుటవలన నాపరమాణువులయందుండి ద్వ్యణుకోత్పత్తి చెప్పుట యత్యంత విరుద్ధము.

మఱియు "యేనా ఉశ్రుతం శ్రుతం భవతి" ఇత్యాదిశ్రుతులవలన ఏకకారణరూపబ్రహ్మముయొక్క జ్ఞానముచే సర్వజ్ఞానముయొక్క ప్రతిజ్ఞ చేయఁబడి యున్నది. ఆప్రతిజ్ఞ బ్రహ్మముకంటె భిన్నము లగుపరమాణ్వాదు లనాదు లనియు నిత్యము లనియు నంగీకరించుటయందు బాధిత మగును. ఆప్రతిజ్ఞ బాధిత మైనయెడల నాప్రతిజ్ఞానంతరము మృత్తికాదిదృష్టాంతములచేతఁ గార్యమునకుఁ గారణము

కన్న నవ్యతిరేకత్వసిద్ధిచేత నాప్రతిజ్ఞాతార్థమున కేయుపపాదన చేయఁబడుచున్నదో అది యనర్థ మగును. అందువలన నిది సిద్ధించు చున్నది. బ్రహ్మముకన్న భిన్న మైన సర్వజగత్తును బ్రహ్మమునుండియే యుత్పన్న మగునదియును బ్రహ్మమునందే లయ మగునదియు నగుచున్నది.

## (34) సాంఖ్యమతరీతిగా జగదుత్పత్తి నిరూపణము.

ఇచ్చట సాంఖ్యశాస్త్రానుసారులు త్రిగుణాత్మకప్రధానమందుండియే మహత్తత్త్వాదిక్రమముగా జగదుత్పత్తి నంగీకరించు చున్నారు. ఈసాంఖ్యమత ముత్తరత్ర స్పష్ట మగును. ఈసాంఖ్యమతముగూడ సమీచీనము గాదు. ఏల యన, సాంఖ్యులచేఁ బ్రధానము జడ మనియును నిత్య మనియును స్వతంత్ర మనియు నంగీకరింపఁబడి యున్నది. ఆప్రధానమే జగత్కారణ మనునర్థమం దొకప్రమాణమును లేదు. మఱియు "మాయాంతు ప్రకృతిం విద్యాత్, అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాం సరూపామ్" ఇత్యాదిశ్రుతులు సిద్ధాంతసమ్మత మైన మాయనే జగత్కారణ మని చెప్పుచున్నవి. ఆప్రధానమును జెప్ప లేదు. అందువలన నాప్రధానమునకు జగత్తుయొక్కయుపాదానకారణత్వము సంభవించుట లేదు.

శంక:—ఆప్రధానము కపిలస్మృతిచేత సిద్ధ మగుచున్నది. అందువలన నాప్రధానమున కప్రామాణికత్వముఁ జెప్పుట యుక్తము గాదు.

సమాధానము:—శ్రుతికి విరుద్ధ మైననాకపిలస్మృతికిఁ బ్రమాణరూపత్వము లేదు. శ్రుతిమూలకస్మృతియే ప్రమాణ మగును. శ్రుతికి విరుద్ధ మైనస్మృతి ప్రమాణము గాదు. అందువలన మాయోపహితబ్రహ్మ మందుండియే యాకాశాదిక్రమముచేఁ బ్రపంచోత్పత్తి యగుచున్న దని పూర్వము చెప్పిన సిద్ధాంతమతమే యెల్లరు నంగీకరింపవలయును.

## (35) సూక్ష్మశరీరోత్పత్తియు స్థూలభూతోత్పత్తియు నిరూపించుట.

ఇఁకఁ బూర్వోక్తాకాశాదిపంచభూతములయందుండి సూక్ష్మశరీరముయొక్కయు స్థూలభూతములయొక్కయు నుత్పత్తిక్రమము చెప్పఁబడుచున్నది. అందీశ్వరున కుపాధిరూపముగాఁ జెప్పఁబడినపూర్వోక్తమాయ సత్త్వరజస్తమోరూప త్రిగుణాత్మకము. మఱియుఁ గారణముయొక్కగుణమే కార్యముయొక్కగుణముల నారంభించునదియై యున్నది. అందువలన నామాయయొక్కకార్యరూపము లగు నాకాశాదిపంచభూతములును సత్త్వరజస్తమోరూపత్రిగుణాత్మకములే యగుచున్నవి. ఆయాకాశాదిపంచభూతములు ప్రత్యక్షవ్యవహారమున కయోగ్యము లగుట

వలన సూక్ష్మము లనఁబడును. మఱియుఁ బంచీకరణాభావమువలన నపంచీకృతము లనఁబడును. అట్టి యపంచీకృతసూక్ష్మభూతములయందుండి సప్తదశలింగరూపసూక్ష్మ శరీర ముత్పన్న మైనది. ఆసప్తదశలింగము లివి—పంచజ్ఞానేంద్రియములు పంచకర్మేం ద్రియములు పంచప్రాణములు మనోబుద్ధులు. శ్రోత్రము త్వక్కు చక్షుస్సు రసన ఘ్రాణ మను పంచేంద్రియములు జ్ఞానసాధన మగుటవలన జ్ఞానేంద్రియము లనఁబడును. వాక్కు పాణి పాదము పాయువు ఉపస్థ మనుపంచేంద్రియములు క్రియాసాధన మగుట వలనఁ గర్మేంద్రియము లనఁబడును. అందు శబ్దజ్ఞానమునకు సాధన మైనయింద్రియము శ్రోత్ర మనఁబడును. స్పర్శజ్ఞానమునకు సాధన మైనయింద్రియము త్వక్కనఁబడును. రూపజ్ఞానమునకు సాధన మైనయింద్రియము చక్షు వనఁబడును. రసజ్ఞానమునకు సాధన మైనయింద్రియము రసన మనఁబడును. గంధజ్ఞానమునకు సాధన మైనయిం ద్రియము ఘ్రాణ మనఁబడును. వచనక్రియకు సాధన మైనయింద్రియము వాక్కనఁ బడును. గ్రహణక్రియకు సాధన మైనయింద్రియము పాణి యనఁబడును. గమన క్రియకు సాధన మైనయింద్రియము పాద మనఁబడును. విసర్గక్రియకు సాధన మైన యింద్రియము పాయు వనఁబడును. సుఖక్రియకు సాధన మైనయింద్రియ ముపస్థ మనఁబడును. యద్యపి మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, అనుభేదముచేత నంతఃకరణము చతుర్విధమై యున్నవి. తథాపి, ఇచ్చట మనస్సునందుఁ జిత్తము నకును బుద్ధియం దహంకారమునకు నంతర్భావము నంగీకరించి మనోబుద్ధులు రెండే గ్రహింపఁబడినవి.

ఇఁక నాకాశాదిపంచభూతములయందుండి సప్తదశలింగోత్పత్తి క్రమము చెప్పఁబడుచున్నది. "సత్త్వాత్సంజాయతే జ్ఞానమ్" అను గీతావచనమునందు సత్త్వగుణమునందుండి జ్ఞానోత్పత్తి చెప్పఁబడి యున్నది. శ్రోత్రాదిపంచజ్ఞానేంద్రియ ములయందుఁ బూర్వోక్తక్రమముగా జ్ఞానసాధనత్వము స్పష్టమే యగుచున్నది. అందు వలన నాయాకాశాదిపంచభూతములయొక్కయమిళితసాత్త్వికాంశములందుండి శ్రో త్రాదిపంచజ్ఞానేంద్రియము లుత్పన్నము లగుచున్నవి. ఆకాశముయొక్కసాత్త్వి కాంశమునందుండి శ్రోత్రేంద్రియమును వాయువుయొక్కసాత్త్వికాంశమునందుండి త్వగింద్రియమును తేజముయొక్కసాత్త్వికాంశమునందుండి చక్షురింద్రియమును జలముయొక్కసాత్త్వికాంశమునందుండి రసనేంద్రియమును పృథివియొక్కసాత్త్వి కాంశమునందుండి ఘ్రాణేంద్రియము నుత్పన్నము లగుచున్నవి.

శంక:—శ్రోత్రాదిపంచేంద్రియములు పూర్వోక్తక్రమముగా నాకాశాది పంచభూతములయందుండి యుత్పన్నము లగుచున్న వను నర్థము తెలియుట యెట్లు?

సమాధానము:— శబ్దస్పర్శరూపరసగంధము లనుపంచగుణములయం దేగుణము నేయింద్రియము గ్రహించుచున్నదో యాయింద్రియ మాగుణము గలది యగు నని నియమము. ఎట్లు శ్రోత్రేంద్రియము శబ్దగుణముచు గ్రహించుటచేత నా శ్రోత్రేంద్రియము శబ్దగుణసహితమే యగునో యట్లు త్వగాదీంద్రియములును స్పర్శాదిగుణములను గ్రహించుటచేత నాత్వగాదీంద్రియములును స్పర్శాదిగుణసహితములే యగును. ఆశబ్దాదిగుణసహితద్రవ్యము లాకాశాదు లనియే సిద్ధ మగుచున్నది. ఈప్రకార మైనయుక్తిచేత నాశ్రోత్రాదీంద్రియములు క్రమముగా నాయాకాశాదిభూతములయొక్క కార్యము లనియే సిద్ధించు చున్నది. అట్లు గాక శ్రోత్రాదీంద్రియము లాయాకాశాదిభూతములయొక్క కార్యము లని యంగీకరింపనియెడల నాశ్రోత్రాదీంద్రియములయందు శబ్దాదిగుణగ్రాహకత్వమే గలుగక పోవలయును. మఱియుఁ గేవలయుక్తిచేతనే శ్రోత్రాదీంద్రియములయం దాకాశాదిభూతములయొక్క కార్యత్వము సిద్ధించుటయే గాక శ్రుతిప్రమాణముచేతను సిద్ధించుచున్నది. "శ్రోత్ర మాకాశే, వాయౌ త్వ,గగ్నౌ చక్షు, రప్సు జిహ్వా, పృథివ్యాం ఘ్రాణమ్" అనుశ్రుతియం దాకాశాదిభూతములయొక్క సాత్త్వికాంశమునందుండి క్రమముగా శ్రోత్రాదిపంచజ్ఞానేంద్రియములయుత్పత్తి చెప్పఁబడి యున్నది. అందువలన నాకాశాదిభూతములయొక్క సాత్త్వికాంశములందుండి శ్రోత్రాదిపంచజ్ఞానేంద్రియములయుత్పత్తి యని శ్రుతియుక్తులచేత సిద్ధించుచున్నది.

మఱియు నాకాశాదిపంచభూతములమిళితసాత్త్వికాంశమునందుండి యంతఃకరణ ముత్పన్న మగుచున్నది. ఆయంతఃకరణము శ్రోత్రాదిపంచేంద్రియద్వారమున నాశబ్దాదిపంచగుణములను గ్రహించుచున్నది. అందువలన నంతఃకరణ మాయాకాశాదిపంచభూతములమిళితసాత్త్వికాంశములయొక్క కార్య మని యవశ్య మంగీకరింపవలయును. అట్లు గాక యంతఃకరణ మాపంచభూతములయొక్క కార్య మని యంగీకరింపనియెడల నాయంతఃకరణమునకు శబ్దాదిగుణగ్రహణశక్తియే లేకపోవలయును. ఇచ్చట సాంఖ్యశాస్త్రానుసారు లిట్లు చెప్పుచున్నారు. ఆయంతఃకరణము బుద్ధి, అహంకారము, మనస్సు, అను భేదముచేఁ ద్రివిధ మగుచున్నది. అందు మూలప్రకృతియందుండి బుద్ధి యుత్పన్న మగుచున్నది. ఆబుద్ధి మహత్తత్త్వ మనఁబడును. ఆమహత్తత్త్వ మను బుద్ధియందుండి యహంకార ముత్పన్న మగుచున్నది. ఆయహంకారము సత్త్వరజస్తమము లను త్రిగుణములయొక్క భేదముచేత సాత్త్వికము రాజసము తామస మని త్రివిధ మగుచున్నది, అందు సాత్త్వికాహంకార మందుండి శ్రోత్రాదిపంచజ్ఞానేంద్రియములును వాగాదిపంచకర్మేంద్రియములును మన

స్సొకటియుఁ జేరి యేకాదశేంద్రియము లుత్పన్నము లగుచున్నవి. తామసాహంకారమునందుండి శబ్ద స్పర్శ రూప రస గంధము లనుపంచతన్మాత్ర లుత్పన్నము లగుచున్నవి. రాజసాహంకార మాద్వివిధాహంకారములను బ్రవర్తింపఁజేయుటవలనఁ గేవలసహకారిమాత్ర మగుచున్నది. ఆపంచతన్మాత్రలయందుండి క్రమముగా ఆకాశము వాయువు అగ్ని జలము పృథివి యను పంచమహాభూతము లుత్పన్నము లగుచున్నవి. ఈయర్థము సాంఖ్యతత్త్వకౌముదియందును జెప్పఁబడి యున్నది. ఎట్లన. శ్లో. "మూలప్రకృతి రవికృతి ర్మహదాద్యాః ప్రకృతి వికృతయ స్సప్త। షోడశకస్తు వికారో న ప్రకృతి ర్నవికృతిః పురుషః"—భావము॥ సత్త్వరజస్తమములను త్రిగుణములయొక్క సామ్యావస్థకుఁ బ్రధాన మని పేరు. ఆప్రధానము జగత్తునకు మూలకారణ మగుటవలన మూలప్రకృతి యనఁబడును. ఆమూలప్రకృతి దేనికిని వికృతి యగుట లేదు. ఇట సర్వత్ర ప్రకృతిశబ్దముచేతఁ బరిణామ్యుపాదానకారణమును వికృతిశబ్దముచేతఁ గార్యమును గ్రహింపవలయును. మఱియు మహత్తత్త్వము అహంకారము పంచతన్మాత్రలు—ఈసప్తకము బ్రకృతియు వికృతియు నగుచున్నవి. మూలప్రకృతియొక్క యపేక్షచేత నైననో మహత్తత్త్వము వికృతి యగుచున్నది. అహంకారముయొక్క యపేక్షచేతఁ బ్రకృతి యగుచున్నది. ఇట్లే యహంకారమును మహత్తత్త్వముయొక్క యపేక్షచేత నైననో వికృతి యగుచున్నది. ఇంద్రియతన్మాత్రలయొక్క యపేక్షచేతఁ బ్రకృతి యగుచున్నది. ఈప్రకారముగా నాపంచతన్మాత్రలు నహంకారాపేక్షచేత వికృతులును, బంచమహాభూతములయొక్క యపేక్షచేఁ బ్రకృతులు నగుచున్నవి. పూర్వోక్తైకాదశేంద్రియములును బంచమహాభూతంబులు నగు నీషోడశకము వికృతులే యగుచున్నవి. దేనికిని బ్రకృతి యగుట లేదు. మఱియు నసంగుఁ డగుటవలనఁ బురుషుఁడు ప్రకృతియును గాఁడు, వికృతియును గాఁడు. ఈసాంఖ్యమతముయొక్క విస్తరనిరూపణము న్యాయప్రకాశగ్రంథముయొక్క ద్వితీయపరిచ్ఛేదమున నాత్మనిరూపణమందు మాచేఁ జేయఁబడి యున్నది. దాని నచ్చటఁ దెలియనగును. ఈసాంఖ్యమతముగూడ శ్రుతిసూత్రములకు విరుద్ధమగుటవలన నసంగతము. ఎట్లన, బ్రహ్మసూత్రకారుఁ డగు శ్రీవ్యాసభగవానులచేత "ఈక్షతే ర్నాశబ్దమ్" ఇత్యాదిసూత్రములచేతఁ బ్రధానకారణవాదము ఖండింపఁబడియే యున్నది. ఈసూత్రమున కిది యర్థము, వైదికశబ్దముచే నప్రతిపాదితమగుటవలన నప్రామాణిక మైనట్టిప్రధానము జగత్తునకుఁ గారణము గాదు. ఏకారణముచే ననఁగా. "తదైక్షత బహుస్యామ్" అనుశ్రుతిచే జగత్కారణమునందు జ్ఞానరూపేక్షణము (సంకల్పము) చెప్పఁబడి యున్నది. ఆయీక్షణము చేతనము

నందే సంభవించును, జడప్రధానమందు సంభవింపను. అందువలన నాప్రధానకారణవాద మసంగతము. మఱియు "అన్నమయం హి సౌమ్యమనః, ఆపోమయః ప్రాణః, తేజోమయీ వాక్" అను శ్రుతిచేతను "శ్రోత్ర మాకాశే, వాయౌ త్వక్" అనుపూర్వోక్త శ్రుతిచేతను అంతఃకరణము ప్రాణము ఇంద్రియము లనునీమూటి యందు భూతములయొక్క కార్యత్వమే నిశ్చయింపఁబడుచున్నది. సాంఖ్యు లామూఁటిని భూతకార్య మని యంగీకరించుట లేదు, అందుచేతను ఆసాంఖ్యమతము శ్రుతిప్రమాణమునకు విరుద్ధమై యున్నది.

శంక:—మీవేదాంతమతమందును బ్రహ్మ మసంగము. అట్టి యసంగబ్రహ్మమునం దీక్షణపూర్వకముగా జగత్తుయొక్క యుపాదానకారణత్వ మంగీకరించుట యత్యంతవిరుద్ధము. అట్టివిరుద్ధార్థమును శ్రుతియు నెట్లు ప్రతిపాదించును ?

సమాధానము:—శుద్ధబ్రహ్మ మసంగరూప మగుటవలన యద్యపి దానికి జగ దుపాదానత్వము సంభవించుట లేదు, తథాపి మాయోపహితబ్రహ్మమున కాయుపాదానత్వము సంభవించు చున్నది. మఱియు శ్రుతిచేతఁ గూడ నామాయోపహితబ్రహ్మమునకే జగత్తుయొక్క యుపాదానత్వము చెప్పఁబడినది. ఈ యర్థము పూర్వమే విస్తరముగాఁ బ్రతిపాదింపఁబడి యున్నది. ఇచ్చట నైయాయికులచే మనస్సు నిరవయవ మనియును అణు వనియును నిత్య మనియు నంగీకరింపఁబడి యున్నది. ఈ నైయాయికమతము న్యాయప్రకాశముయొక్క ద్వితీయపరిచ్ఛేదమున మనోనిరూపణమందు విస్తరముగాఁ బ్రతిపాదింపఁబడినది. ఈ నైయాయికమతమును శ్రుతివిరుద్ధ మగుటవలన నసంగతము. ఏల యన, మనస్సును నిత్య మని యంగీకరించిననో "ఏక మే వాద్వితీయం బ్రహ్మ" అను శ్రుతికి విరోధము ప్రాప్త మగుట యొకటి. మఱియొకటి "ఏతస్మా జ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణిచ। తస్మానో ఽకురుత" ఇత్యాదిశ్రుతులయందు మనస్సున కుత్పత్తి చెప్పఁబడి యున్నది. మఱియు ఏది భావకార్య మగునో అది యనిత్యమే యగును. ఎట్లు ఘటపటాదికము భావకార్య మగుటవలన ననిత్యమే యగునో, అట్లు భావకార్య మగుటవలన మనస్సుకూడ ననిత్యమే యగును.

మఱియు నైయాయికులచేత మనస్సు మూర్తద్రవ్య మని యంగీకరింపఁబడి యున్నది. ఏది యేది మూర్తద్రవ్య మగునో అది యది పరిచ్ఛిన్నమే యగును. ఏది యేది పరిచ్ఛిన్న మగునో అది యది సావయవమే యగును. ఏది యేది సావయవ మగునో అది యది యనిత్యమే యగును. ఈప్రకార మైననియమము ఘటపటాదిమూర్తద్రవ్యములయందు చూడఁబడుచున్నది. అందువలన మూర్తద్రవ్య మగు

టవలన మనస్సుకూడ సావయవము ననిత్యమునే యగును. మఱియు నైయాయికులచేత మనస్సు అణు వని యంగీకరించి యీమనస్సంయోగముచేత నాత్మయందు సుఖదుఃఖాదులయుత్పత్తి యంగీకరింపఁబడినది. అదియు నసంగతము. ఏల యన, అణురూప మనస్సంయోగజన్య మగునాసుఖమును ఒక్కయణుప్రదేశమందే యుండును. సర్వాంగవ్యాపులు కాఁజాలవు. మఱియు శీతలగంగాజలమందు నిమగ్నపురుషునకు సర్వాంగవ్యాపిసుఖానుభవము గలుగు చున్నది. అందువలన నామనస్సణువు కాదు. మఱియు, నాకుఁ బాదమందుఁ బీడ యున్నది, శిరమందు సుఖ మున్నది. అని యీప్రకారముగా నేకకాలమందే సుఖదుఃఖములయొక్క యనుభవము కలుగుచున్నది. అదియును నైయాయికులమతమం దసంగత మగును. ఏకారణముచేత ననఁగా, అణుమనస్సునకు నేకకాలమందుఁ బాదశిరోద్వయముతో సంయోగము సంభవించుట లేదు. మఱియు భూతములయొక్క కార్యరూప మగుమనస్సునందు విభుత్వము సంభవించుట లేదు. అట్లే విభుమనస్సునకు విభువగునాత్మతో సంయోగముకూడ సంభవించుట లేదు. ఇట్లు చెప్పఁబడినయుక్తులచేత మనస్సుయొక్కవిభుత్వముగూడ ఖండింపఁబడిన దని దెలియవలయును. మీమాంసకులు మనస్సు విభు వని యంగీకరించు చున్నారు. మనస్సుయొక్కవిభుత్వప్రతిపాదనమును నైయాయికానుసారముగాఁ దత్ఖండనమును న్యాయప్రకాశముయొక్కద్వితీయపరిచ్ఛేదమున మనోనిరూపణమందు విస్తరముగాఁ జేయఁబడి యున్నది. దాని నచ్చటఁ దెలియవలయును. అందువలన, ఆకాశాదిపంచభూతములయొక్కమిళితసాత్త్వికాంశములందుండి యంతఃకరణ ముత్పన్న మగుచున్నది, అట్లే సావయవము నగుచున్నది యని సిద్ధాంతము.

ఆయంతఃకరణము, సంకల్పము నిశ్చయము అభిమానము స్మరణ మను చతుర్విధము లగువృత్తులయొక్క భేదముచేత, మనస్సు బుద్ధి అహంకారము చిత్తము అని చతుర్విధమై యున్నది. అందు, సంకల్పవృత్తిసహితాంతఃకరణము మనస్సనియును, నిశ్చయవృత్తిసహితాంతఃకరణము బుద్ధి యనియును, అభిమానవృత్తిసహితాంతఃకరణ మహంకార మనియును, స్మరణవృత్తిసహితాంతఃకరణము చిత్త మనియును జెప్పఁబడును. ఇఁకఁ గర్మేంద్రియములయుత్పత్తిప్రకారము చెప్పఁబడుచున్నది. పూర్వోక్తాకాశాదిపంచసూక్ష్మభూతములయొక్క పరస్పరామిళితరాజసాంశమునందుండి కర్మేంద్రియము లుత్పన్నము లగుచున్నవి. ఆకాశముయొక్క రాజసాంశమునందుండి వాగింద్రియమును వాయువుయొక్క రాజసాంశమునందుండి పాణీంద్రియమును దేజస్సుయొక్క రాజసాంశమునందుండి పాదేంద్రియమును జలముయొక్క రాజ

సాంశమునందుండి పాయ్వింద్రియమును బృథ్వియొక్క రాజసాంశమునందుండి యుపస్థేంద్రియము నుత్పన్నము లగుచున్నవి. ఇచ్చటఁ గొందఱుగ్రంథకారులు జలముయొక్క రాజసాంశమునందుండి యుపస్థేంద్రియమును బృథ్వియొక్క రాజసాంశమునందుండి పాయ్వింద్రియము నుత్పన్నము లైన వని యంగీకరించు చున్నారు. ఇచ్చట "కస్మిన్నాపః ప్రతిష్ఠితా ఇతి రేతసి" అను శ్రుతియందు జలములకు రేతస్సునందు స్థితి చెప్పఁబడి యున్నది. అందువలన నుపస్థేంద్రియము జలమునందుండియే యుత్పన్న మైన దని యంగీకరించుట యుచితము.

ఇఁకఁ బ్రాణములయొక్క యుత్పత్తి చెప్పఁబడుచున్నది. పూర్వోక్తాకాశాదిసూక్ష్మపంచభూతములయొక్క మిళితరాజసాంశమునందుండి ప్రాణ ముత్పన్న మగుచున్నది. ఆప్రాణము క్రియాభేదముచేతను స్థానభేదముచేతను ప్రాణాపానవ్యానోదానసమానము లని పంచప్రకార మగుచున్నది. అచ్చట సర్వదా యూర్ధ్వగమనసహితవాయువు ప్రాణ మనఁబడును. యద్యపి, ఉదానవాయువుగూడ నూర్ధ్వగమనసహిత మగుచున్నది. తథాపి, ఆయుదానము మరణకాలమందే యూర్ధ్వగమనసహిత మగుచున్నది. సర్వదా యూర్ధ్వగమనసహిత మగుట లేదు. ప్రాణవాయువైననో సర్వదా యూర్ధ్వగమనసహితమై యున్నది. అందువలన నీప్రాణముయొక్క లక్షణమున కుదానమం దతివ్యాప్తి గలుగుట లేదు. ఆప్రాణము నాసిక మొదలు నాభిపర్యంతస్థానమునం దున్నది "వాయుః ప్రాణో భూత్వా నాసికే ప్రావిశత్" అను నైతరేయశ్రుతివాక్యముచేతఁ బ్రాణమునకు నాసికాదిస్థానమునందే స్థితి చెప్పఁబడి యున్నది. అధోగమనసహితవాయు వపాన మనఁబడును. ఆయపానము నాభి మొదలు పాయుపర్యంతస్థానమునం దుండునది. "మృత్యు రపానో భూత్వా నాభిం ప్రావిశత్" అనుశ్రుతిచేత నాయపానమునకు నాభిమొదలగుస్థానములయందే స్థితి చెప్పఁబడి యున్నది. సర్వపురములయందును గమనము గలవాయువు వ్యాన మనఁబడును. ఆవ్యానవాయువు సమగ్రశరీరమం దుండునది. మరణకాలమం దూర్ధ్వగమనముఁ జేయునట్టివాయు వుదాన మనఁబడును. ఆయుదానవాయువు కంఠస్థానమం దుండునది. భోజనము చేయు నన్నమును పానము చేయు జలమును స్థూల మధ్యమ సూక్ష్మము లనుత్రివిధవిభాగముల నాయాస్థానములయందుఁ బ్రాప్తింపఁజేయువాయువు సమాన మనఁబడును. అచ్చట మలమూత్రములకు హేతుభూతమగునన్నజలములయొక్క స్థూలభాగ మేది యున్నదో దానిని శరీరమందుండి బాహ్యమునకు వెడలింపఁజేయుటకొఱకు సమానవాయు వపానమందుఁ బ్రాప్తింపఁజేయుచున్నది. మాంసరుధిరములకు హేతుభూత మైనయన్నజలములయొక్క మధ్యమ

భాగమును నాడీద్వారమున సర్వాంగములయందుఁ బ్రాప్తింపఁజేయుచున్నది. మనః ప్రాణము లనురెంటికి నుపకారక మగుచున్న జలములయొక్క సూక్ష్మభాగము నామనః ప్రాణములయందుఁ బ్రాప్తింపఁజేయు చున్నది. ఈకారణముచేతనే శ్రుతియందు మన స్సన్నమయ మని చెప్పఁబడి యున్నది. ప్రాణము జలమయ మని చెప్పఁబడి యున్నది. ఈసమానవాయువును సమగ్రశరీరమం దున్నది. కొన్నిగ్రంథములయం దీసమానమునకు నాభిస్థానము చెప్పఁబడి యున్నది. అది ముఖ్యత్వముచేఁ జెప్పఁబడినది. అనఁగా నాసమానవాయువునకు ముఖ్యస్థానము నాభియై యున్నది. ఇచ్చటఁ గొన్ని శాస్త్రములవారు నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయము లనుపంచవిధవాయువులుఁ జేరి ప్రాణవాయువు దశవిధము లని చెప్పుచున్నారు.

అందు ఉద్గారము చేయించువాయువు నాగ మనియును నేత్రోన్మీలనముఁ జేయించువాయువు కూర్మ మనియును క్షుతమును జేయించువాయువు కృకర మనియును జృంభణమును జేయించువాయువు దేవదత్త మనియును శరీరపోషణముఁ జేయించువాయువు ధనంజయ మనియును జెప్పఁబడును.

అచ్చట పూర్వోక్తప్రాణాదిపంచవాయువులకన్నను నాగాదిపంచవాయువులను బృథక్కుగా నంగీకరించుటయం దొకటి గౌరవదోషము ప్రాప్త మగుచున్నది. మఱియొకటి ఆనాగాదిపంచవాయువులయందు శ్రుత్యాదిప్రమాణాభావ మగుచున్నది. అందువలన వేదాంతగ్రంథములయం దానాగాదిపంచకమునకుఁ బ్రాణాదిపంచకమునం దంతర్భావ మని యంగీకరించి, ప్రాణము పంచవిధమే యని చెప్పఁబడి యున్నది.

ఇఁకఁ బూర్వోక్తేంద్రియాంతఃకరణములయొక్క యధిదేవతలను జెప్పుచున్నాము. శ్రోత్రము త్వక్కు చక్షువు జిహ్వ ఘ్రాణము అను పంచజ్ఞానేంద్రియములకుఁ గ్రమముగా దిగ్వాయ్వాదిత్యవరుణాశ్వినులు దేవతలు. ఇచ్చటఁ గొన్నిగ్రంథములయందు ఘ్రాణమునకుఁ బృథివి దేవత యనియును జెప్పఁబడి యున్నది. వాక్పాణిపాదపాయూపస్థము లనుపంచకర్మేంద్రియములకుఁ గ్రమముగా వహ్నీంద్రోపేంద్రమృత్యుప్రజాపతులు దేవతలు. మఱియు మనస్సు బుద్ధి అహంకారము చిత్తము అనుచతుర్విధాంతఃకరణమునకుఁ గ్రమముగాఁ జంద్రచతుర్ముఖ శంకరాచ్యుతులు దేవతలు.

శంక:—శ్రోత్రాదీంద్రియములకు దిక్కు మొదలైనవి యధిష్ఠానదేవతలనుటకుఁ బ్రమాణ మేమి?

సమాధానము:—సుబాలోపనిషత్తునందు "శ్రోత్ర మధ్యాత్మం శ్రోతవ్య మధిభూతం దిశ స్తత్రాధిదైవతమ్" ఇత్యాదివచనములచేత జ్ఞానకర్మేంద్రియములకును అంతఃకరణమునకును బూర్వోక్తదేవత లని చెప్పఁబడి యున్నది. దీని వలన నాయింద్రియాంతఃకరణముల కధిష్ఠానదేవతలు శ్రుతిప్రమాణముచేతనే సిద్ధులగుచున్నారు.

మఱియు నాయధిష్ఠానదేవతలు కేవలశ్రుతిప్రమాణముచేతనే సిద్ధించుటయే గాక యనుమానప్రమాణమువలనఁ గూడ సిద్ధు లగుచున్నారు. అది చూపఁబడుచున్నది. ఈలోకమం దెది యెది యచేతనకారణ మగుచున్నదో అది యది చేతనము నాశ్రయించుకొనియే కార్యమునకు జనక మగుచున్నది. ఎట్లు మృత్తిక యచేతనకారణ మగుటవలనఁ జేతనకులాలుని నాశ్రయించుకొనియే ఘటాదికార్యముల యుత్పత్తి చేయుచున్నదో అట్లాయింద్రియములు నచేతనకారణ మగుటవలనఁ జేతనదేవతల నాశ్రయించుకొనియే తమతమకార్యముల యుత్పత్తి చేయుచున్నవి.

శంక:—జీవచేతనమే యాసర్వేంద్రియములకు నధిష్ఠాత యగును. జీవచేతనముకన్న భిన్నమైన యితరాధిష్ఠాతృదేవతల నంగీకరించుట వ్యర్థమై యున్నది.

సమాధానము:—జీవచేతన మింద్రియప్రేరక మని యంగీకరించినయెడల నాజీవచేతనము స్వానుకూలార్థమునందే యాయింద్రియములను బ్రవర్తింపఁజేయునది యగును. ప్రతికూలార్థమందుఁ బ్రవర్తింపఁజేయని దగును. అట్లు చూడఁబడుట లేదు. ఏమనఁగా, జీవచేతనమునకుఁ బ్రతికూల మగుశత్రుదర్శనమును దుర్గంధాదిజ్ఞానమును చక్షుర్ఘ్రాణాదీంద్రియము లుత్పన్నము చేయుచున్నవి. దీనిచేఁ దెలియఁబడున దేమనఁగా జీవచేతన మింద్రియప్రేరకము గాదు. మఱి యేమనఁగా పూర్వోక్తదేవతలే ప్రేరకులు, ఆదేవతలు జీవునియొక్క పాపకర్మవశముచేతఁ బ్రతికూలార్థములయందును నాయింద్రియములను బ్రవర్తింపఁజేయు చున్నారు.

ఇంతపర్యంతము సప్తదశలింగరూపసూక్ష్మశరీరముయొక్క నిరూపణము చేయఁబడినది. ఇపుడు తైత్తిరీయోపనిషత్తునందుఁ జెప్పఁబడియుండు కార్యకారణరూపాన్నమయాదిపంచకోశములకు స్థూలసూక్ష్మకారణము లనుత్రివిధశరీరములయందంతర్భావము చెప్పఁబడుచున్నది.

## (36) అన్నమయాది పంచకోశసంగ్రహనిరూపణము.

అచ్చట అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమ యానందమయము లనునవి యైదును నాత్మ నాచ్ఛాదించునవి యగుటవలనఁ గోశము లనఁబడును.

ఉత్తరత్ర చెప్పఁబోవునట్టి స్థూలశరీర మన్నమయకోశ మనఁబడును. ఆయన్నమయ కోశము కార్యకారణభేదముచేత ద్విప్రకార మగుచున్నది. అస్మదాదిజీవులయొక్క వ్యష్టిస్థూలశరీరము కార్యరూపాన్నమయకోశ మనఁబడును. విరాట్పురుషునియొక్క సమష్టి స్థూలశరీరము కారణరూపాన్నమయకోశ మనఁబడును. ఈప్రకారముగా నుత్తరత్ర ప్రాణమయాదికోశములకును వ్యష్టిసమష్టిరూపములచేతఁ గార్యకారణభావముఁ దెలియవలయును. పూర్వోక్తసప్తదశలింగరూపసూక్ష్మశరీరము ప్రాణమయ మనోమయ విజ్ఞానమయము లను త్రివిధకోశరూపములై యున్నవి. పూర్వోక్తవాగాది పంచకర్మేంద్రియసహితప్రాణము ప్రాణమయకోశ మనఁబడును. పూర్వోక్తశ్రోత్రాదిపంచజ్ఞానేంద్రియసహితమనస్సు మనోమయకోశ మనఁబడును. జ్ఞానేంద్రియములతోఁ గూడినబుద్ధి విజ్ఞానమయకోశ మనఁబడును. ఈవిజ్ఞానమయకోశమే యాత్మయందుఁ గర్తృత్వమున కుపాధి. అనఁగా వాస్తవమునం దాత్మ యకర్తయై యుండియును ఈవిజ్ఞానమయకోశవిశిష్టుఁడై కర్త యనఁబడు చున్నాఁడు. "శ్రుతి—విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి తనుతేపి చ"—భావము॥ ఈవిజ్ఞానమయోపాధిసహితజీవాత్మయే యజ్ఞము చేయుచున్నాఁడు, అట్లే సర్వకర్మములను జేయుచున్నాఁడు.

ఇఁకఁ బంచమ మగు నానందమయకోశమును జెప్పుటకొఱకుఁ బ్రథమమున నంతఃకరణముయొక్క సాత్త్వికవృత్తివిభాగము చెప్పఁబడు చున్నది. అచ్చట, పూర్వోక్తాంతఃకరణముయొక్క సాత్త్వికవృత్తి ద్విప్రకారమై యున్నది. ఒకటి నిశ్చయవృత్తి మఱియొకటి సుఖాకారవృత్తి. నిశ్చయవృత్తిసహితాంతఃకరణము బుద్ధి యనఁబడును. ఆబుద్ధి విజ్ఞానమయకోశరూప మగుటవలన నాబుద్ధ్యుపాధితోఁ గూడినజీవాత్మ, కర్త జ్ఞాత ప్రమాత యనఁబడుచున్నాఁడు. ద్వితీయ మగుసుఖాకార వృత్తిసహితాంతఃకరణ మాత్మయొక్క భోక్తృత్వమున కుపాధియై యున్నది. అనఁగా వాస్తవమునం దాత్మ యభోక్తయైనను ఆసుఖాకారవృత్తిసహితాంతఃకరణముచేత విశిష్టుఁడై భోక్త యనఁబడుచున్నాఁడు. ఆసుఖాకారవృత్తులు తైత్తిరీయోపనిషత్తునందుఁ బ్రియమోదప్రమోదము లనునామములచేఁ జెప్పఁబడుచున్నవి. ఇష్టవస్తుదర్శనజన్యసుఖము ప్రియ మనఁబడును. ఇష్టవస్తుప్రాప్తిజన్యసుఖము మోద మనఁబడును. ఇష్టవస్తుభోగజన్యసుఖము ప్రమోద మనఁబడును. భోక్తృత్వమున కుపాధియయినయంతఃకరణమే యజ్ఞానపర్యంత మానందమయకోశ మనఁబడుచున్నది. ఆనందమయకోశరూపోపాధిసహితచైతన్యాత్మ భోక్త యనఁబడుచున్నాఁడు. కొందఱు గ్రంథకారులు కేవలాజ్ఞానమునే యానందమయకోశ మనుచున్నారు. ఈయానందమయకోశము కారణశరీరమం దంతర్భూతమై యున్నది. ఈపంచకోశము

లాత్మపురాణముయొక్కదశమాధ్యాయమునందు విస్తరముగా మాచే నిరూపింపఁబడి యున్నవి. దాని నచ్చటఁ దెలియనగును.

ఇఁకఁ బూర్వోక్తసూక్ష్మశరీరముయొక్కవిభాగము చెప్పఁబడుచున్నది. ఆసప్తదశలింగరూపసూక్ష్మశరీరము సమష్టివ్యష్టిభేదముచేత ద్విప్రకార మగుచున్నది. పూర్వోక్తాపంచీకృతాకాశాదిపంచభూతములును ఆభూతములయొక్క కార్యము లైన యింద్రియాంతఃకరణప్రాణరూపసప్తదశలింగములును జేరి సమష్టిసూక్ష్మశరీర మనఁబడును. ఆసమష్టిసూక్ష్మశరీరరూపోపాధిసహితచైతన్యము హిరణ్యగర్భప్రాణసూత్రాత్మ లనునామములచే చెప్పఁబడుచున్నది. అచ్చట సమష్టిసూక్ష్మశరీరము జ్ఞానశక్తిసహితాంతఃకరణజ్ఞానేంద్రియములతో ఘటిత మగుటవలన జ్ఞానశక్తిసహితమై యున్నది. ఈకారణముచే నాశరీరోపహితచైతన్యము హిరణ్యగర్భుఁ డనఁబడును. మఱియు నాసమష్టిసూక్ష్మశరీరము క్రియాశక్తిసహితప్రాణకర్మేంద్రియములతో ఘటిత మగుటవలన క్రియాశక్తిసహితమై యున్నది. ఈకారణముచే నాశరీరోపహితచైతన్యము ప్రాణ మనఁబడును. పటమునం దుండుసూత్రమువలె నాసమష్టిసూక్ష్మశరీరము సర్వబ్రహ్మాండమందు వ్యాపకమై యున్నది. ఈకారణముచే నాశరీరోపహితచైతన్యము సూత్రాత్మ యనఁబడును. లేక, పూర్వోక్తాపంచీకృత పంచమహాభూతముల కన్నఁ బృథక్కుగానే యొకసర్వవ్యాపకలింగశరీర ముత్పన్న మగుచున్నది, ఆలింగశరీరమే సమష్టి యనఁబడును. ఆసమష్టి లింగశరీరోపహితచైతన్యము హిరణ్యగర్భుఁ డనఁబడును.

## ( (37) సమష్టివ్యష్టిలక్షణనిరూపణము. )

ఇఁకఁ బ్రసంగానుసారముగా సమష్టివ్యష్టులయొక్కలక్షణములు చెప్పఁబడుచున్నవి. నైయాయికమతమునందు గోత్వజాతి సర్వగోవ్యక్తులయం దెట్లను స్యూతమై యున్నదో అట్లు సర్వవ్యష్టివ్యక్తులయం దెది యనుస్యూతమై యున్నదో అది సమష్టి యనఁబడును. అచ్చటఁ బ్రమాణము. “తేభ్యః సమభవ త్సూత్రం లింగం సర్వాత్మకం మహాత్”—భావము॥ ఆయపంచీకృతపంచభూతములయందుండి యేకసర్వవ్యాపక సూత్రాత్మనామక సమష్టిసూక్ష్మశరీర ముత్పన్న మైనది. ఆసమష్టిసూక్ష్మశరీరము పరమాత్మను బోధించుటవలన లింగ మనఁబడును. ఈసమష్టి సూక్ష్మశరీరమును సాంఖ్యశాస్త్రానుసారులు మహత్తత్త్వ మని చెప్పుచున్నారు. ఇచ్చటఁ గొందఱు గ్రంథకారు లిట్లు చెప్పుచున్నారు. ఎట్లనేకవృక్షములసముదాయము వన మనఁబడుచున్నదో అట్లు సర్వవ్యష్టిలింగశరీరములయొక్కసముదాయము సమష్టి

చెప్పఁబడును. ఏకైకవృక్షమువలెఁ బ్రత్యేకలింగశరీరము వ్యష్టి యనఁబడును. ఏకైక గోవ్యక్తి యితరగోవ్యక్తులయం దనుస్యూతము గాక దానికంటె వ్యావృత్తమే యగుచున్నదో ఆ యేకైకలింగశరీర మితరలింగశరీరములయం దనుస్యూతము గాక దానికంటె వ్యావృత్త మగుచున్నది. ఇట్టి వ్యావృత్తత్వమే యాలింగశరీరమందు వ్యష్టిత్వము. ఆవ్యష్టిలింగశరీరోపహితచైతన్యము తైజసుఁ డనఁబడును. తేజోవికారరూపాంతఃకరణోపహిత మగుటవలన నాచైతన్యము తైజసుఁ డనఁబడును. ఎట్లు ఘటత్వాది జాతికిని ఘటరూపవ్యక్తికిని దాదాత్మ్య మున్నదో అట్లు సమష్టిలింగశరీరమునకును వ్యష్టిలింగశరీరమునకును దాదాత్మ్య మున్నది. ఆసమష్టివ్యష్టిలింగశరీరరూపద్వివిధోపాధులకుఁ దాదాత్మ్య ముండుటవలనఁ దదుపహితసూత్రాత్మతైజసు లనునిరువురకును దాదాత్మ్యమే యున్నది. అచ్చట "భిన్నత్వే సత్యభిన్నసత్తాకత్వం తాదాత్మ్యమ్"—భావము॥ ఏపదార్థములు వ్యవహారదృష్టిచేఁ బరస్పరభిన్నములై యుండియును వాస్తవ మం దేకసత్తాసహితములు నగుచున్నవో ఆపదార్థములకుఁ దాదాత్మ్యసంబంధ మున్నది. ఉదా—తంతుపటములకును గుణగుణ్యాదులకును దాదాత్మ్యసంబంధ మున్నది. అచ్చట హిరణ్యగర్భునియొక్క యభేదోపాసనవలన సత్పురుషునకాహిరణ్యగర్భభావప్రాప్తిరూపఫలము గలుగుచున్నది. ఈకారణముచే నిచ్చట సమష్టివ్యష్టిసూక్ష్మశరీరరూపోపాధులయొక్క తాదాత్మ్యమును జెప్పుటచేత నాహిరణ్యగర్భతైజసు లిరువురకుఁ గూడ తాదాత్మ్యము చెప్పఁబడినది. అందువలన నట్లు చెప్పుట నిష్ఫలము గాదు.

## ( (38) సమవాయమునందు శంకాసమాధానములు. )

శంక:—నైయాయికులచే జాతివ్యక్తులరెంటికిని దాదాత్మ్యసంబంధ మంగీకరింపఁబడ లేదు. మఱి యే మనఁగా సమవాయసంబంధమే యంగీకరింపఁబడి యున్నది. అందువలన జాతివ్యక్తులయొక్క తాదాత్మ్యదృష్టాంతముచేత సమష్టివ్యష్టులకుఁ దాదాత్మ్య మంగీకరించుట యత్యంతవిరుద్ధమై యున్నది.

సమాధానము:—లక్షణప్రమాణము లను రెంటిచేతనే వస్తుసిద్ధి యగుచున్న దనునది శాస్త్రకారులయొక్క నియమము. ఆ సమవాయమున కేలక్షణప్రమాణములును సంభవించుట లేదు. అందువలన నాసమవాయ మంగీకరించుటకు యోగ్యము గాదు.

శంక:—"నిత్యసంబంధః సమవాయః"—భావము॥ నిత్యమైనసంబంధ మేది గలదో అది సమవాయ మనఁబడును. ఇట్టి సమవాయమునకు లక్షణము

విద్యమానమై యున్నది. ఈలాగుననే ఆసమవాయమునందుఁ బ్రత్యక్షాదిప్రమాణము లును విద్యమానములై యున్నవి. అందువలన నాసమవాయమునకు లక్షణప్రమా ణములయొక్కయభావము చెప్పుట యసంగతమై యున్నది.

సమాధానము:—"ఏక మేవా ద్వితీయం బ్రహ్మ" ఇత్యాదిశ్రుతులచేత బ్రహ్మ మద్వితీయ మని చెప్పఁబడినది. ఆబ్రహ్మముయొక్కయద్వితీయత్వము సమవా యము నిత్య మని యంగీకరించుటయందు సంభవించుట లేదు. అందువలన నద్వైత శ్రుతికి విరుద్ధ మగుటవలన నాసమవాయమునకు నిత్యత్వము సంభవించుట లేదు.

శంక:—మీామతమునందును, అజ్ఞానమును ఆయజ్ఞానమునకుఁ జేతన ముతోఁ గలసంబంధమును, ఇత్యాదిపదార్థము లనాదు లనియును భావరూపము లనియు నంగీకరింపఁబడి యున్నది. ఏపదార్థము లనాదిభావరూపము లగునో యా పదార్థములు నిత్యములే యగును. అందువలన నాయజ్ఞానాదినిత్యపదార్థము లుండుట వలన నాబ్రహ్మమున కద్వితీయత్వ మెట్లు సంభవించును?

సమాధానము:—వేదాంతసిద్ధాంతమునం దాయజ్ఞానాదికము బ్రహ్మము నం దధ్యస్త మని యంగీకరింపఁబడి యున్నది. ఈకారణమువలన నాయధిష్ఠానబ్రహ్మ ముకన్న నాయజ్ఞానాదులు భిన్నసత్తాసహితములు గావు. అందువలన నాయజ్ఞానా దులు విద్యమానములై యుండినను బ్రహ్మమున కద్వితీయత్వము సంభవించును. మఱి యు నాయజ్ఞానాదిక మనాదిభావరూపమై యుండినను బ్రహ్మమునం దారోపింపఁ బడిన దగుటవలన బ్రహ్మజ్ఞానముచే నాయజ్ఞానాదికము నివృత్త మగుచున్నది. అనా రోపితానాదిభావపదార్థమే నిత్య మగుచున్నది, అనారోపితానాదిభావరూపత్వ మే కాధిష్ఠానబ్రహ్మమునందే యున్నది, ఆయజ్ఞానాదులయందు లేదు. అందువలన మీా సమవాయమువలె నాయజ్ఞానాదులును అనిత్యములే యగుటవలన నిత్యసంబంధము సమవాయ మనుసమవాయలక్షణము సంభవింపదు.

మఱియు, యుక్తిచే విచారించిచూచినను ఆసమవాయముయొక్కస్వరూ పము సిద్ధించుట లేదు. అందు నైయాయికు లగుమీాచే గుణగుణులకును క్రియా క్రియాసహితములకును అవయవావయవులకును జాతివ్యక్తులకును విశేషనిత్యద్రవ్య ములకును సమవాయసంబంధ మంగీకరింపఁబడి యున్నది. ఆసమవాయము గుణ గుణులు మొదలగుతనసంబంధులకంటె భిన్నమా? లేక, అభిన్నమా? ప్రథమ మగుభిన్నపక్ష మంగీకరించినయెడల దానియందు ని ట్లడుగవలయును. సమవాయ మాసంబంధులయం దేసంబంధముచేత నున్నది? సంయోగసంబంధముచే నున్న దా? లేక సమవాయసంబంధముచే నున్నదా? లేక ఏదైన నొకయన్యసంబంధ

ముచే నున్నదా? అందుఁ బ్రథమసంయోగపక్షమో సంభవింపదు. ఏలయన రెండు ద్రవ్యములకే సంయోగసంబంధ మున్నది. ఆసమవాయము ద్రవ్యముకాదు. జాతి గుణకర్మాదులును ద్రవ్యములు కావు. అందువలన సమవాయ మాసంబంధులయందు సంయోగసంబంధముచే వర్తించుట సంభవింపదు. ఆసమవాయము తనసంబంధులయందు సమవాయసంబంధముచే వర్తించు ననుద్వితీయపక్ష మంగీకరించినయెడల నాత్మాశ్రయము 1 అన్యోన్యాశ్రయము 2 చక్రకము 3 అనవస్థ 4 అనుచతుర్విధదూషణములు ప్రాప్తము లగును. అవి చెప్పఁబడుచున్నవి. ఆసమవాయ మేసమవాయముచేఁ దనసంబంధులయం దున్నదో యాసమవాయ మాసమవాయమున కభిన్నమా? లేక భిన్నమా? అభిన్న మనినయెడల నాత్మాశ్రయదోషప్రాప్తి యగును. ఆసమవాయమునకుఁ దనస్థితియందు తనయపేక్ష కల దనుట యేది గలదో అదియే యాత్మాశ్రయదోషమై యున్నది. మఱియు నాసమవాయము భిన్న మనినయెడల ద్వితీయసమవాయమును బ్రథమసమవాయమువలెఁ దనసంబంధులయం దేసమవాయముచేత నుండును? ఆద్వితీయసమవాయము తనచేతనే తా నుండినయెడలఁ బూర్వమువలె మరల నాత్మాశ్రయదోషము ప్రాప్త మగును. ఆద్వితీయసమవాయము ప్రథమసమవాయముచే నుండినయెడల నన్యోన్యాశ్రయదోషము ప్రాప్త మగును. ప్రథమసమవాయము ద్వితీయసమవాయముచే నుండుటయును ద్వితీయసమవాయము ప్రథమసమవాయముచే నుండుటయు ననునిదియే యన్యోన్యాశ్రయదోషము. ఈయన్యోన్యాశ్రయదోషము నివర్తించుటకొఱకు కాద్వితీయసమవాయము వేఱొకతృతీయసమవాయముచే నున్న దని యంగీకరించినయెడల నాతృతీయసమవాయమును దనచేఁదా నుండినయెడలఁ బూర్వమువలె మరల నాత్మాశ్రయదోషము ప్రాప్త మగును. ద్వితీయసమవాయముచే నుండినయెడలఁ బూర్వమువలె మరల నన్యోన్యాశ్రయదోషము ప్రాప్త మగును. ఆతృతీయసమవాయము ప్రథమసమవాయముచే నుండినయెడలఁ జక్రకదోషము ప్రాప్త మగును. ప్రథమసమవాయమునకుఁ దనస్థితికొఱకు ద్వితీయసమవాయముయొక్కయపేక్షయును ఆద్వితీయసమవాయమునకుఁ దనస్థితికొఱకుఁ దృతీయసమవాయముయొక్కయపేక్షయును ఆతృతీయసమవాయమునకుఁ దనస్థితికొఱకు మరల నాప్రథమసమవాయముయొక్కయపేక్షయు ననుట యేది గలదో అదియే చక్రకదోషమై యున్నది, ఆచక్రకదోషమును నివర్తించుట కాతృతీయసమవాయముయొక్కస్థితికొఱకుఁ జతుర్థసమవాయమును ఆచతుర్థసమవాయముయొక్కస్థితికొఱకుఁ బంచమసమవాయమును ఈప్రకారము విశ్రాంతిరహితసమవాయములధార నంగీకరించినయెడల ననవస్థాదోషము ప్రాప్త మగును. అందువలన

నాసమవాయము తనసంబంధులయందు సమవాయసంబంధముచే నున్న దను ద్వితీయపక్షము సంభవింపదు.

మఱియు నాసమవాయ మేదైన నొకయన్యసంబంధముచే నున్న దను తృతీయపక్ష మంగీకరించినయెడల నదియును సంభవింపదు. ఏల యన, సంయోగము సమవాయము అను ద్వివిధసంబంధములకన్న భిన్న మగు వేఱొకతృతీయ సంబంధము మీచే నిరూపించుటకు సాధ్యము గాదు. ఆసమవాయము స్వరూపసంబంధముచే నున్న దని చెప్పినను అదియును సంభవింపదు. ఏకారణముచే ననఁగా, స్వరూపసంబంధమునం దే ప్రమాణమును లేదు. ఒకవేళ మీ రాస్వరూపసంబంధము నంగీకరించినయెడల గుణగుణులు మొదలగు నేయేపదార్థములకు సమవాయసంబంధము మీచే నంగీకరింపఁబడి యున్నదో వానికిని స్వరూపసంబంధమే సంభవించును. కావున సమవాయమే సిద్ధింపని దగును.

మఱియు నాసమవాయము తనసంబంధుల కభిన్న మను నాద్యద్వితీయ పక్ష మంగీకరించినయెడల నదియును సంభవింపదు. ఎట్లన, నైయాయికు లగు మీచే సమవాయము గుణగుణులు మొదలగుపదార్థములకన్న భిన్నపదార్థముగానే యంగీకరింపఁబడి యుండుటవలన మీమతసిద్ధాంతమునకు హాని కలుగును. అందువలన నే ప్రకారముచేతను నాసమవాయమునకు స్వరూపము సిద్ధింపదు.

మఱియు, ప్రమాణాభావ మగుటచేతను నాసమవాయము సిద్ధింపదు. ఆ సమవాయమునందుఁ బ్రత్యక్షప్రమాణమును సంభవింపదు. ఏకారణముచే ననఁగా, మీచే నాసమవాయ మతీంద్రియ మనియే యంగీకరింపఁబడి యున్నది. అతీంద్రియార్థమందు నింద్రియరూపప్రత్యక్షప్రమాణముయొక్క ప్రవృత్తి గలుగదు. "ఘటే రూపం సమవేతమ్" అను సమవాయవిషయకప్రతీతి కేవలము మీచేతనే కల్పింపఁబడినది. సర్వశాస్త్రకారులకును నాప్రతీతి సమ్మతము గాదు. అందువలన నాప్రతీతికిఁ బ్రమాణరూపత్వమే లేదు. ఈరీతిగానే హేతురూపలింగముయొక్కయభావము చేతను, నాసమవాయమునం దనుమానప్రమాణమును సంభవింపదు.

శంక:—"రూపీ ఘట ఇతి విశిష్టబుద్ధిః, విశేషణవిశేష్యసంబంధవిషయా విశిష్టబుద్ధిత్వాత్, దండీపురుష ఇతి బుద్ధివత్"—భావము॥ రూపసహితము ఘట మను విశిష్టబుద్ధి (విశిష్టజ్ఞానము) రూప మనువిశేషణముయొక్కయు ఘట మను విశేష్యముయొక్కయు సంబంధమును విషయము చేయుచున్నది, విశిష్టబుద్ధి యగుట వలన, లోకమం దేది యేది విశిష్టబుద్ధి యగునో అది యది విశేషణవిశేష్యము లను రెంటియొక్కసంబంధము నవశ్యము విషయము చేయుచున్నది, దండి పురుషుఁ డను

విశిష్టబుద్ధి దండరూపవిశేషణముయొక్కయు పురుషరూపవిశేష్యముయొక్కయు సంయోగసంబంధమును ఎట్లు విషయము చేయుచున్నదో అట్లు "రూపవాన్ ఘటః" అను విశిష్టబుద్ధియును రూపగుణ మైనవిశేషణముయొక్కయు ఘటరూపవిశేష్యముయొక్కయు సమవాయసంబంధమునే విషయము చేయుచున్నది. ఈప్రకార మగు ననుమానప్రమాణము విద్యమాన మగుచుండఁగా నాసమవాయమునం దనుమాన ప్రమాణముయొక్కయభావము చెప్పుట యసంగతము.

సమాధానము:—పూర్వోక్తరీతిగా నాసమవాయముయొక్కస్వరూపమే సిద్ధించుట లేదు. అందువలన నీయనుమానముచేత రూపఘటములకుఁ దాదాత్మ్యసంబంధమే సిద్ధించుచున్నది. సమవాయసంబంధము సిద్ధింపదు. ఈప్రకారముగా లక్షణప్రమాణములను రెంటిని నిరూపించుటకు సాధ్యము గానందున నాసమవాయము సిద్ధింపదు. ఆసమవాయము సిద్ధింపనందున జాతివ్యక్తులకుఁ దాదాత్మ్య సంబంధమే సిద్ధించు చున్నది. అందువలన జాతివ్యక్తులయొక్కతాదాత్మ్యదృష్టాంతముచే సమష్టి వ్యష్టి సూక్ష్మశరీరములయొక్కతాదాత్మ్యము సంభవించుచున్నది.

ఇచ్చటఁ గొందఱు నైయాయికు లాసమవాయ మతీంద్రియ మని యంగీకరించుచున్నారు. కొందఱు నైయాయికు లాసమవాయము ప్రత్యక్ష మని యంగీకరించి యున్నారు. అట్లే కొందఱు నైయాయికు లాసమవాయ మేక మనియును గొందఱు నైయాయికులు నానాయనియు నంగీకరించి యున్నారు. ఆసర్వనైయాయికమతములును న్యాయప్రకాశముయొక్కచతుర్థపరిచ్ఛేదమందు సమవాయనిరూపణమున విస్తరముగాఁ జెప్పఁబడి యున్నవి. తెలియ నిచ్ఛ గలవా రచ్చటఁ దెలియవలయును.

శంక:—పూర్వము మీచే సమష్టిసూక్ష్మశరీరమునకును వ్యష్టిసూక్ష్మశరీరమునకును దాదాత్మ్యము చెప్పఁబడినది. అది సంభవింపదు. ఏల యన, కార్యమునకుఁ దనయుపాదానకారణముతోఁ దాదాత్మ్య మున్నది. ఉదా—పటరూపకార్యమునకుఁ దనతంతురూపోపాదానకారణముతోఁ దాదాత్మ్య మున్నది. మఱియు వ్యష్టిసూక్ష్మశరీరమున కాసమష్టిసూక్ష్మశరీర ముపాదానము గాదు. మఱి యే మనఁగాఁ బూర్వోక్తరీతిగా నాకాశాదిపంచభూతములే యుపాదాన మగుటవలన సమష్టి వ్యష్టి సూక్ష్మశరీరములకుఁ దాదాత్మ్యకథన మసంగతము.

సమాధానము:—వ్యష్టిసూక్ష్మశరీరమున కుపాదాన మైనయపంచీకృత సూక్ష్మభూతములే సమష్టిసూక్ష్మశరీరమునం దంతర్గతములై యున్నవి. అందువలన నాసమష్టిసూక్ష్మశరీరమునందు వ్యష్టిసూక్ష్మశరీరముయొక్కయుపాదానకారణత్వము

సంభవించుచున్నది. ఆయుపాదానోపాదేయభావములు సంభవించుటవలన నారెంటికిని దాదాత్మ్యము సంభవించును.

## (39) సూక్ష్మశరీరమును బుర్యష్టకరూపముగా నిరూపించుట.

ఇఁకఁ బూర్వోక్తసూక్ష్మశరీరము పుర్యష్టకరూపముగాఁ జెప్పఁబడుచున్నది. పూర్వోక్తసూక్ష్మశరీరమే, యవిద్య 1 కామము 2 కర్మము 3 అనుమూటితోఁ గూడినదై పుర్యష్టక మని చెప్పఁబడుచున్నది. అష్టపురులయొక్క సమూహమునకుఁ బుర్యష్టక మని పేరు. ఆపుర్యష్టక మేది యనఁగా—పంచజ్ఞానేంద్రియములు 1 పంచకర్మేంద్రియములు 2 చతుర్విధాంతఃకరణములు 3 పంచప్రాణములు 4 పంచసూక్ష్మభూతములు 5 అవిద్య 6 కామము 7 కర్మము 8. అచ్చట ఇంద్రియాంతఃకరణప్రాణపంచభూతములు పూర్వము నిరూపింపఁబడి యుండుటవలన నిప్పు డవిద్యాకామకర్మములు మూఁడును జెప్పఁబడు చున్నవి. ఇచ్చట, అవిద్యాశబ్దముచేఁ గార్యాఽవిద్యను గ్రహింపవలయును. అన్యమునం దన్యబుద్ధి కార్యావిద్య యనఁబడును. ఆకార్యావిద్యయును జతుర్విధము. అనిత్యమందు నిత్యత్వబుద్ధి 1 అశుచియందు శుచిత్వబుద్ధి 2 అసుఖమందు సుఖత్వబుద్ధి 3 అనాత్మయం దాత్మత్వబుద్ధి 4. అందుఁ గర్మోపాసనలకు ఫలరూప మగుటవలన ననిత్య మైన స్వర్గబ్రహ్మలోకాదికమందుండు నిత్యత్వబుద్ధి ప్రథమ మగునవిద్య యనఁబడును. మలమూత్రాదులచేఁ బూర్ణ మగుటవలన నశుచి యైన తనశరీరమందును స్త్రీపుత్త్రాదులశరీరములందును శుచిత్వబుద్ధి ద్వితీయ మగు నవిద్య యనఁబడును. పీడారూపదుఃఖమందు సుఖత్వబుద్ధియును దద్దుఃఖసాధన మైన బ్రహ్మహత్యాసురాపానాదికమందుండు సుఖసాధనత్వబుద్ధి యేదియో అది తృతీయ మగు నవిద్య యనఁబడును. అనాత్మరూపదేహేంద్రియాదులయందు అహ మ్మను నాత్మబుద్ధి చతుర్థ మగు నవిద్య యనఁబడును. ఈవస్తువు మనకుఁ బ్రాప్తించుఁ గాక యను నంతఃకరణవృత్తివిశేషము రాగ మనంబడును. ఆరాగమే కామ మనఁబడును. మఱియుఁ గర్మ మైననో సంచితము 1 ఆగామి 2 ప్రారబ్ధము 3 అనుభేదముచేఁ ద్రివిధ మగుచున్నది. ఆత్రిప్రకార మగుకర్మమే విహితనిషిద్ధము లనుభేదముచే మరల ద్విప్రకార మగుచున్నది. అచ్చట శ్రుతిస్మృతిరూపశాస్త్రములచే నేకర్మము విధింపఁబడి యున్నదో ఆకర్మము విహిత మనఁబడును. ఉదా—సంధ్యావందనాగ్నిహోత్రాదికర్మములు. మఱియు శ్రుతిస్మృతిరూపశాస్త్రము లేకర్మమును నిషేధించి యున్నవో ఆకర్మము నిషిద్ధ మనఁబడును. ఉదా—బ్రహ్మహత్యాసురాపానాదికర్మములు. అందు విహితకర్మము లనుష్ఠించుటచేఁ బురుషునియందు ధర్మ ముత్పన్న మగుచున్నది. నిషిద్ధకర్మము లనుష్ఠించుటచే నధర్మ ముత్పన్న మగుచున్నది. ధర్మా

ధర్మములే శాస్త్రమందు అదృష్టము అపూర్వము అనఁబడుచున్నవి. అచ్చట ధర్మరూపాదృష్టము పురుషునకు సుఖరూపఫలము నిచ్చుచున్నది. అధర్మరూపాదృష్టము పురుషునకు దుఃఖరూపఫలము నిచ్చుచున్నది.

## [*] (40) కర్మభేదనిరూపణము. [*]

ఇఁక సంచితాగామిప్రారబ్ధము లనుత్రివిధకర్మములయొక్క స్వరూపము చెప్పఁబడుచున్నది. పూర్వజన్మమందు, లేక, ఈజన్మమునందుఁ జేయఁబడిన యే కర్మము తనఫలము నియ్యక కేవల మదృష్టరూపముగానే యున్నదో యాకర్మము సంచిత మనఁబడును. తత్త్వజ్ఞానోత్తరమందుఁ జేయఁబడిన యేకర్మ మున్నదో ఆ కర్మ మాగామి యనఁబడును. సంచితకర్మమందుండి బయల్పడిన యేకర్మ మీావర్తమానశరీరము నారంభించుట కైనదో యాకర్మము ప్రారబ్ధ మనఁబడును.

ఇఁకఁ బ్రసంగానుసారముగా నాకర్మములయొక్క నాశము చెప్పఁబడుచున్నది. సంచితాగాము లనుద్వివిధకర్మములు ఫలభోగముచేత నైనను లేక విరోధికర్మముచేత నైనను లేక బ్రహ్మజ్ఞానముచేత నైనను నాశ మొందుచున్నవి. యద్యపి క్రియారూపకర్మము ఫలభోగాదికము వినా తానే నష్ట మగుచున్నది, తథాపి, ఇచ్చటఁ గర్మశబ్దముచేత దత్కర్మజన్యధర్మాధర్మరూపాదృష్టమును గ్రహింపవలయును. ఆయదృష్టము భోగాదికములచేతనే నాశ మొందుచున్నది. ప్రారబ్ధకర్మ మైననో కేవల ఫలభోగముచేతనే నాశ మొందుచున్నది. తత్త్వజ్ఞానముచేత నైనను విరోధికర్మముచేత నైనను నాశ మొందుట లేదు. "అవశ్య మేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్। నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతై రపి"—భావము॥ పురుషునిచేఁ జేయఁబడినశుభకర్మ మైనను అశుభకర్మ మైనను అవశ్య మనుభవింపవలయును. కల్పకోటిశతములకైనను భోగము వినా ఆకర్మములు నాశ మొందుట లేదు. ఇత్యాదివచనములు భోగముచే నాకర్మనాశముఁ జెప్పియున్నవి. మఱియు "ప్రాయశ్చిత్తై రపైత్యేనో య దజ్ఞానకృతం భవేత్"—భావము॥ అజ్ఞానముచేతఁ జేయఁబడినపాపము ప్రాయశ్చిత్తములచే నివృత్త మగుచున్నది, ఇత్యాదివచనములు ప్రాయశ్చిత్తరూపవిరోధికర్మముచేతను ఆపాపకర్మములకు నాశము చెప్పుచున్నవి. దీనియందు నింత విశేష మున్నది. పాపకర్మములు ప్రాయశ్చిత్తరూపవిరోధికర్మచేత నాశ మొందుచున్నవి, పుణ్యకర్మములును గర్మనాశనదియొక్క జలస్పర్శాదిరూపవిరోధికర్మముచేత నాశ మొందుచున్నవి. మఱియు "క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే। జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా"—భావము॥ అహం బ్ర

హోస్మి యను బ్రహ్మసాక్షాత్కారము గలుగఁగా విద్వాంసులకుఁ బ్రారబ్ధకర్మముకన్న భిన్నమైనసర్వకర్మములును నాశ మొందుచున్నవి. జ్ఞానరూపాగ్ని సర్వకర్మములను భస్మము చేయుచున్నది. ఇత్యాదిశ్రుతిస్మృతివచనములు బ్రహ్మజ్ఞానముచేతను ఆ కర్మములకు నాశముఁ జెప్పి యున్నవి. మఱియు "ప్రారబ్ధం భోగతో నశ్యేత్, భోగేన త్వితరే క్షప యిత్వా సంపద్యతే"—భావము॥ ప్రారబ్ధకర్మము కేవలభోగము చేతనే నివృత్త మగుచున్నది, విద్వాంసుఁడు ఫలభోగముచేతఁ బ్రారబ్ధకర్మముల నాశము చేసి శరీరపతనానంతరము నిర్విశేషబ్రహ్మభావమును బొందుచున్నాఁడు. ఇత్యాదివచనములు బ్రారబ్ధకర్మమునకుఁ గేవలభోగముచేతనే నాశముఁ జెప్పుచున్నవి. అందువలన భోగాదులచేతఁ గర్మములయొక్క నాశము పూర్వోక్తశ్రుతిస్మృత్యాదిప్రమాణములచేతనే సిద్ధించుచున్నది.

శంక:—సంచితకర్మములు ప్రాయశ్చిత్తముచేతనైనను దత్త్వజ్ఞానముచేతనైనను నాశ మొందుఁగాక. అయినను దత్త్వజ్ఞానానంతరము చేయఁబడినయాగామికర్మముల కాతత్త్వజ్ఞానముచేత నాశ మెట్లు సంభవించును?

సమాధానము:—బ్రహ్మజ్ఞానముయొక్క ప్రభావముచేత జ్ఞానవంతుని నాయాగామికర్మము లంటవు. ఈకారణముచేత నాయాగామికర్మములు తత్త్వవేత్తలకు ఫలజనకము లగుట లేదు. ఇదియే యాయాగామికర్మములయొక్క నాశ మని దెలియవలయును. ఈయర్థము వ్యాసభగవంతునిచేతను బ్రహ్మసూత్రమునందుఁ జెప్పఁబడి యున్నది. సూత్రము.—"తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేష వినాశౌ తద్వ్యపదేశాత్"—భావము॥ బ్రహ్మసాక్షాత్కారము గలుగఁగా జ్ఞానవంతునికిఁ బూర్వమం దుండిన సంచితపాపకర్మములు నశించినవి. జ్ఞానోత్తరము చేయఁబడిన యాగామిపాపములు జ్ఞానవంతు నంటుటయే లేదు. ఈద్వివిధార్థములు శ్రుతియందును జెప్పఁబడియున్నవి. శ్రుతి.—"తద్యథేషీకా తూల మగ్నౌ ప్రోతం ప్రదూయే తైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే"—భావము॥ ముంజియొక్క ఇషీకయందుండుతూల మగ్నిని బొందినశీఘ్రమే యెట్లు దగ్ధ మగుచున్నదో అట్లే యీ విద్వాంసునియొక్క పూర్వసర్వసంచితపాపకర్మములు బ్రహ్మజ్ఞానరూపాగ్నిచేత శీఘ్రమే దగ్ధము లగుచున్నది. ఈశ్రుతి తత్త్వవేత్తకుఁ బూర్వసంచితపాపకర్మములయొక్క నాశమును జెప్పుచున్నది "యథా పుష్కరపలాశ ఆపో న శ్లిష్యంత ఏవ మేవంవిది పాపం కర్మ న శ్లిష్యతే"—భావము॥ జలమునందుండు కమలపత్రమును నాజల మెట్లంటుట లేదో అట్లు విద్వాంసునిఁ బాపకర్మము లంటవు. ఈశ్రుతి యా విద్వాంసున కాగామికర్మము లంటుట లే దనుదానిని జెప్పుచున్నది. పూర్వోక్త

సూత్రమందును శ్రుతియందును గల పాపశబ్దము పుణ్యమునకును నుపలక్షణ మని తెలియవలయును. ఏకారణముచేత ననఁగా "సుహృదః సాధుకృత్యాం. ద్విషంతః పాపకృత్యామ్" అను శ్రుతియందుఁ దత్త్వవేత్తయొక్క యాగామిపుణ్యకర్మములను సేవ చేయునట్టి భక్తజనులు పొందుచున్నా రనియును, పాపకర్మములను ద్వేషించు జనులు పొందుచున్నా రనియును జెప్పఁబడుచున్నది. అంగువలనఁ బాపశబ్దముచేతఁ బుణ్యపాపములరెంటిని గ్రహించుట యుక్తము.

మఱియు బ్రహ్మసాక్షాత్కారముచేత విద్వాంసునకుఁ గేవలకర్మములు మాత్రమే నశించుట లేదు. మఱే మనఁగా, అవిద్యాదిపంచక్లేశములు గూడ నశించుచున్నవి. యోగశాస్త్రమునందు అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము అను పంచక్లేశములు చెప్పఁబడియున్నవి. అందుఁ గార్యావిద్యాకారణావిద్య లని యవిద్య ద్వివిధము. ఆ ద్వివిధాఽవిద్యలు పూర్వము నిరూపింపఁబడి యున్నవి. అహంకారమునకుఁ గారణరూపసూక్ష్మావస్థ యస్మిత యనఁబడును. ఈయస్మితనే సాంఖ్యమతస్థులును యోగమతస్థులును మహత్తత్త్వ మని చెప్పుచున్నారు. వేదాంతశాస్త్రమం దాయస్మిత సామాన్యాహంకార మని చెప్పఁబడుచున్నది. ఈ వస్తువు నాకు బ్రాప్తించుఁ గాక యను నంతఃకరణవృత్తివిశేషము రాగ మనఁబడును. క్రోధ మనునది ద్వేష మనఁబడును. అహం మమరూపముచే గ్రహింపఁబడిన దేహాది పదార్థములయొక్క త్యాగమును సహింపమి యభినివేశ మనంబడును. ఈపంచక్లేశములయొక్క విస్తరనిరూపణ మాత్స్యపురాణముయొక్క యష్టమాధ్యాయమునందుఁ జేయఁబడి యున్నది. దాని నచ్చటఁ దెలియవలయును. ఈపంచక్లేశములును బ్రహ్మజ్ఞానముచేతనే నివృత్తము లగుచున్నవి. అచ్చట స్మృతి.—"జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః"—భావము॥ ఈయధికారి స్వయంప్రకాశపరబ్రహ్మమును "అహం బ్రహ్మాస్మి" యని సాక్షాత్కరించి యవిద్యాదిపంచక్లేశరూపపాశములనుండి విముక్తుఁడగుచున్నాఁడు. ఇంతపర్యంతము సూక్ష్మశరీరముయొక్క యుత్పత్తిప్రకారము చెప్పఁబడినది.

## (41) స్థూలభూతములయొక్క యుత్పత్తిప్రకారము.

ఇఁక స్థూలభూతములయొక్క యుత్పత్తిప్రకారము చెప్పఁబడుచున్నది. పంచీకృతము లగుపంచభూతములు స్థూలభూతము లనఁబడుచున్నవి. ఆస్థూలభూతములు పూర్వోక్తాపంచీకృతపంచభూతములయొక్క తామసాంశమునందుండి యుత్పన్నము లగుచున్నవి. ఆపంచభూతములయొక్క పంచీకరణ మె ట్లనఁగా. తామసాంశ

ప్రధానపూర్వోక్తాకాశాదిపంచసూక్ష్మభూతములయం దేకైకభూతమును బ్రథమమున సమానముగా రెండేసిభాగములు చేయవలయును. ఆరెండుభాగములయందు నేకైక భాగమును పృథక్కుగా నుంచి, యారెండవభాగమును మరల నాలుగేసిభాగములు చేయవలయును. ఆనాలుగుభాగములను గ్రమముగాఁ బ్రథమవిభక్తము లగు నాలుగుభూతములయర్ధభాగములతో మిళితము చేయుట పంచీకరణ మనఁబడును. ఎట్లనఁగా. ఆకాశమును సమముగా రెండుభాగములు చేసి యారెంటియం దొకభాగమును బృథక్కుగా నుంచి, రెండవభాగమును మరల నాల్గుభాగములు చేసి యానాలుగుభాగములయందుఁ బ్రథమభాగమును వాయువునందును, ద్వితీయభాగమును దేజస్సునందును దృతీయభాగమును జలమునందును, జతుర్థభాగమును బృథివియందును మిళితముఁ జేయవలయును. ఇట్లే వాయువును సమానముగా రెండుభాగములు చేసి యొకభాగమును బృథక్కుగా నుంచి మఱియొకభాగమును నాలుగు భాగములు చేసి వానియందుఁ బ్రథమభాగము నాకాశమందును, ద్వితీయభాగమును దేజస్సునందును, దృతీయభాగమును జలమందును, జతుర్థభాగమును బృథివియందును జేర్పవలయును. ఈరీతిగాఁ దేజస్సు మొదలగు తక్కినమూఁడుభూతములయందును దెలియవలయును. ఈప్రకారముగా నాకాశాదిపంచభూతములయొక్కయర్ధభాగములు తమ వనియును నితరార్ధభాగములు వాయువు మొదలగు చతుర్విధభూతముల యొక్కయయము లనియును సిద్ధ మగుచున్నది.

కొందఱు గ్రంథకారులో యొక్కొక్కభూతమును విషమముగా రెండేసి భాగములు చేసి, అనఁగా ఒకభాగమును నాలుగంశములుగాను మఱియొకభాగమును నేకాంశముగాను జేసి, ఆయేకాంశరూపాల్పభాగమును మరల నైదుభాగములు చేసి యాయైదుభూతములయందుఁ గ్రమముగా నొక్కొక్కభాగమును జేర్చినయెడలఁ బంచీకరణ మని యంగీకరించు చున్నారు. ఈపంచీకరణప్రకార మాత్మపురాణము యొక్కయేకాదశాధ్యాయమునందు స్పష్టముగా వ్రాయఁబడియున్నది. దాని నచ్చటఁ దెలియ నగును.

ఈస్థానమందు వాచస్పతిమిశ్రులమత మిదియై యున్నది.—ఛాందోగ్యోపనిషత్తునందు, తేజస్సు జలము పృథివి అను త్రివిధభూతములయొక్కయుత్పత్తిని జెప్పి, "తాసాం త్రివృతం త్రివృత మేకైకం కరవాణి" అనుశ్రుతిచేత నా తేజఆది త్రివిధభూతములకుఁ ద్రివృత్కరణ (త్రివిధముగాఁ జేయుట) మే చెప్పంబడియున్నది. అచ్చట తేజస్సును సమముగా రెండుభాగములు చేసి, యారెండుభాగములయం దొకభాగమును బృథక్కుగా నుంచి, మఱియొకభాగమును మరల రెండుభాగములు

చేసి యీరెండుభాగములయం దొకభాగమును జలమునందును మఱియొకభాగమును బృథివియందును మిళితముఁ జేయవలయును. ఈప్రకారముగానే జలపృథివ్యులయం దును దెలియవలయును. దీనికిఁ ద్రివృత్కరణ మని పేరు. ఈత్రివృత్కరణమునందుఁ బూర్వోక్తశ్రుతియును వ్యాసభగవానులసూత్రమును బ్రమాణములై యున్నవి. పూర్వోక్తపంచీకరణమునం దొకశ్రుతిసూత్రప్రమాణమును లేదు. అందువలన నా పంచీకరణమును బ్రతిపాదించుట యసంగతము.

అయినను, ఆచార్యులైననో యిట్లు చెప్పి యున్నారు.— తైత్తిరీయశ్రుతి యం దాకాశాది పంచభూతములయొక్క యుత్పత్తి చెప్పఁబడి యున్నది. ఆ శ్రుతి యొక్క విరోధమును నివర్తించుటకొఱకు ఛాందోగ్యశ్రుతియందును నాకాశవాయు వులయొక్క యుత్పత్త్యనంతరమే తేజఆదిక త్రివిధభూతములయొక్క యుత్పత్తి గ్రహింప వలయును. ఛాందోగ్యశ్రుతియందును వ్యాససూత్రమందును ఏత్రివృత్కరణము చెప్పఁబడినదో, ఆత్రివృత్కరణము పంచీకరణమునకును నుపలక్షణ మగును. ఒక వేళ నాపంచీకరణము నంగీకరింపనియెడల, నాకాశవాయువులయొక్క గుణము లైన శబ్దస్పర్శములు పృథివ్యాదులయందుఁ బ్రతీతములు గాఁగూడదు. పృథివ్యాదుల యందు శబ్దస్పర్శగుణములు ప్రతీతము లగుచున్నవి. అందువలనఁ బ్రామాణిక మగుటవలనఁ బంచీకరణము నవశ్య మంగీకరింపవలయును.

శంక:—పూర్వోక్తపంచీకరణముచేత సర్వభూతములకు నేకీభావ మంగీ కరించుటవలన, ఇది పృథివి ఇది జలము— అను విశేషవ్యవహారము సంభవింపని దగును.

సమాధానము:—పంచీకరణ మైనను ఆపృథివ్యాదిభూతములయందుఁ దమతమయంశము లధికములై యున్నవి. ఇతరభూతములయంశము లల్పము లగు చున్నవి. ఆయధికాంశములను గొనియే యిది పృథివి యిది జలము అను విశేష వ్యవహార మగుచున్నది. అందువలన నాపంచీకరణము నంగీకరించుటయందును విశేష వ్యవహారము సంభవించును. ఈవ్యవస్థయే "వైశేష్యాత్తు తద్వాద, స్తద్వాదః" అనుసూత్రమునందు శ్రీవ్యాసభగవానులచేతను శ్రీభాష్యకారులచేతను జెప్పఁబడి యున్నది.

ఇకఁ బూర్వోక్తపంచీకరణమునకుఁ బ్రయోజనము చెప్పఁబడుచున్నది. ఈప్రకారముగా నాయాకాశాదిపంచభూతములు పంచీకృతము లైనయనంతరము పంచీకృతాకాశమునం దొక్క శబ్దగుణ మభివ్యక్త మైనది. పంచీకృతవాయువునందు శబ్దస్పర్శము లను రెండుగుణము లభివ్యక్తము లైనవి. పంచీకృతతేజమునందు శబ్ద

స్పర్శరూపము లను మూఁడుగుణము లభివ్యక్తము లైనవి. పంచీకృతజలమునందు శబ్దస్పర్శరూపరసము లనునాలుగుగుణము లభివ్యక్తము లైనవి. పంచీకృతపృథివి యందు శబ్దస్పర్శరూపరసగంధము లను నైదుగుణము లభివ్యక్తము లైనవి. యద్యపి శబ్దాదిపంచగుణములు క్రమముగా నపంచీకృతాకాశాదిభూతములయం దున్నవి. తథాపి, ఆయపంచీకృతభూతములయందు శబ్దాదిగుణములు ప్రత్యక్షయోగ్యములుగా లేదు. పంచీకరణ మైనయనంతరము పంచీకృతభూతములయం దాశబ్దాదిగుణములు ప్రత్యక్షయోగ్యము లైనవి. ఇదియే యాశబ్దాదులయం దభివ్యక్తత్వమై యున్నది. ఆయైదుగుణములయందు నొక్కొక్కభూతమునకు నొక్కొక్కగుణమే యసాధారణ మని దెలియవలయును. ఇతరగుణము లైననో కారణములయందుండి ప్రాప్తము లగుచున్న వని తెలియవలయును. ఉదా—పృథివియం దసాధారణగుణము గంధమై యున్నది. శబ్దాదు లగు తక్కిననాలుగుగుణము లాకాశాదికారణములయొక్కగుణ ములై యున్నవి. ఇట్లే జలాదులయందును దెలియవలయును.

మఱియు నాపంచీకృతపృథివ్యాదికభూతములయందుండి బ్రహ్మాండమును దద్బ్రహ్మాండమునం దంతర్గతము లైన సప్తోపరిలోకములును సప్తాధోలోకములు నను నీచతుర్దశలోకములు నుత్పన్నము లైనవి. మఱియు బ్రహ్మాండరూపవిరాట్పురుషుని యందుండి మను శతరూప లను నిరువు రుద్భవించిరి. ఆయిర్వురయందుండి మను ష్యాదికసృష్టి కలిగినది. ఏప్రకారముచేత నావిరాట్పురుషునియందుండి మనుశత రూపలయొక్కయుత్పత్తియును ఆమనుశతరూపలయందుండి మనుష్యాదికసృష్టి యును గలిగిననో. ఆప్రకార మాత్మపురాణముయొక్కచతుర్థాధ్యాయమునందు మాచే విస్తరముగా నిరూపింపఁబడి యున్నది.

## [*] (42) స్థూలశరీరోత్పత్తివిభాగకథనము. [*]

బ్రహ్మాండమునం దంతర్గత మైనపంచీకృతపృథివియందుండి వ్రీహియవా ద్యోషధు లుత్పన్నము లైనవి. ఆయోషధులయందుండి యన్న ముత్పన్న మైనది. ఆయన్నమును స్త్రీపురుషులు భుజంచుటచేతఁ బురుషశరీరమునం దాయన్నము శుక్లరూపపరిణామమును బొందుచున్నది. ఆశుక్లము రేత స్సనియును జెప్పఁబడును. స్త్రీశరీరమునం దాయన్నము శోణితరూపపరిణామమును బొందుచున్నది. పురుషుని యొక్కవీర్యమునకు శుక్ల మనియును స్త్రీయొక్కవీర్యమునకు శోణిత మనియును బేరు. మాతాపితరులయొక్కశోణితశుక్లములయందుండి మనుష్యాదికస్థూలశరీర ము త్పన్న మైనది. ఆస్థూలశరీరమును జరాయుజము 1 అండజము 2 స్వేదజము 3

ఉద్భిజ్జము 4 అను భేదముచేతఁ జతుర్విధము లగును. మాతయొక్క యుదరమందుండు గర్భము నాచ్ఛాదించు చర్మవిశేషము జరాయు వనఁబడును. ఆజరాయువునందుండి యుత్పన్న మగుశరీరము జరాయుజ మనఁబడును. ఉదా—అవి మనుష్యగవాశ్వాజాదికశరీరములై యున్నవి. అండమునందుండి యుత్పన్న మగుశరీరము లండజము లనఁబడును. ఉదా—అవి పక్షిసర్పాదికశరీరములై యున్నవి. ఉష్ణవిశేషరూపస్వేదమునందుండి యుత్పన్న మగుశరీరము స్వేదజ మనఁబడును. ఉదా—అవి యూక మశక మత్కుణ క్రిమ్యాదికశరీరములై యున్నవి. భూమిని భేదించుకొని తమతమబీజములయందుండి యుత్పన్నము లగుశరీరము లుద్భిజ్జము లనఁబడును. ఉదా—అవి వృక్ష లతా తృణాదిశరీరములై యున్నవి. మనుష్యాదిశరీరములవలె వృక్షలతాదికములును జీవాత్మయొక్క శరీరము లగుచున్నవి. ఈయర్థము న్యాయప్రకాశము యొక్క ద్వితీయపరిచ్ఛేదమునఁ బృథివీనిరూపణమందు విస్తరముగాఁ జెప్పఁబడి యున్నది. దాని నచ్చటఁ దెలియవలయును.

ఇఁక స్థూలశరీరమున కన్యప్రకారముగా భేదము చెప్పఁబడుచున్నది. పూర్వోక్తస్థూలశరీరము సమష్టివ్యష్టిభేదముచేత మరల ద్విప్రకార మగుచున్నది. పూర్వోక్తపంచీకృతపంచమహాభూతములును, ఆభూతములయొక్క కార్యమైనబ్రహ్మాండమును, ఆబ్రహ్మాండాంతర్వర్తికార్యములును నగు నీసర్వమును జేరి, సమష్టిస్థూలశరీర మనఁబడును. లేక, అనేకగోవ్యక్తులయందు గోత్వజాతి యెట్లనుస్యూతమై యున్నదో అట్లేశరీరము సర్వవ్యష్టిస్థూలవ్యక్తులయం దనుస్యూత మయ్యును బంచీకృతపంచమహాభూతములయొక్క కార్య మయ్యును సర్వబ్రహ్మాండరూప మయ్యును వ్యాపక మయ్యు నున్నదో, యాశరీరము సమష్టిస్థూలశరీర మనఁబడును. లేక, ఎట్లనేక వృక్షములయొక్క సమూహము వన మనఁబడునో, అట్లు సర్వవ్యష్టిస్థూలశరీరముల యొక్క సముదాయము సమష్టిస్థూలశరీర మనఁబడును. అట్టి సమష్టిస్థూలశరీరముచేత నుపహిత మైనచైతన్యము విరాట్టు వైశ్వానరుఁ డను ద్వివిధనామములచేఁ జెప్పఁబడుచున్నది. వివిధప్రకారములచేఁ బ్రకాశమాన మగుటవలన దానిని విరాట్టని చెప్పుదురు. సర్వనరులయొక్క యభిమాని యగుటవలన దానిని వైశ్వానరుఁ డందురు. ఎట్లేకగోవ్యక్తికన్నను మఱియొకగోవ్యక్తి వ్యావృత్త మగుచున్నదో అట్లు పరస్పరవ్యావృత్త మగు ప్రత్యేకస్థూలశరీరము వ్యష్టిస్థూలశరీర మనఁబడును. ఆవ్యష్టిస్థూలశరీరముచేత నుపహిత మైనచైతన్యము విశ్వుఁ డనునామముచేఁ జెప్పఁబడుచున్నది. ఆచైతన్యము సూక్ష్మశరీరమును బరిత్యజింపకయే స్థూలశరీరమునందుఁ బ్రవేశించుచున్నది. ఈకారణముచే నది విశ్వుఁ డనఁబడును. ఎట్లు ఘటాదివ్యక్తుల

కును ఘటత్వాదిజాతులకును బరస్పరతాదాత్మ్య మున్నదో, అట్లే యీసమష్టిస్థూల శరీరమునకును వ్యష్టిస్థూలశరీరమునకును బరస్పరతాదాత్మ్యమే యున్నది. ఆ ద్వివిధోపాధులకుఁ దాదాత్మ్య ముండుటవలన, నావైశ్వానరవిశ్వు లనుద్వివిధోపహితచైతన్యములకును దాదాత్మ్యమే యున్నది. అచ్చట సమష్టిస్థూలశరీరమందంతర్గతము లైనపంచీకృతపంచమహాభూతములయొక్క కార్యత్వ మీవ్యష్టిస్థూలశరీరమునందుఁ గలదు. ఉపాదానకారణమునకును నుపాదేయకార్యమునకును బరస్పరతాదాత్మ్యము లోకమునందుఁ బ్రసిద్ధమై యున్నది. అందువలన నాద్వివిధస్థూలశరీరములకుఁ దాదాత్మ్యము సంభవించుచున్నది. ఈవిశ్వనామకజీవుఁ డెప్పుడు నేను వైశ్వానరుఁ డని యభేదముగా నుపాసించుచున్నాఁడో, యప్పు డావైశ్వానరునియొక్క సాక్షాత్కారముచేత నీజీవుఁ డావైశ్వానరునియొక్క యానందమును బొందుచున్నాఁడు. అందువలన నావైశ్వానరునియొక్క తాదాత్మ్యవర్ణనము నిష్ఫలము కాదు. మ తే మనఁగా పూర్వోక్తఫలప్రాప్తికి హేతు వగుటవలన సఫలమై యున్నది.

లేక, ఈయధికారిపురుషుఁడు ప్రథమమున శ్రుతియందుఁ జెప్పఁబడినప్రకారము విశ్వవైశ్వానరతైజససూత్రాత్మప్రాజ్ఞేశ్వరు లనునీసర్వులయొక్క స్వరూపమును దెలియవలయును. తదనంతరము ప్రథమము వైశ్వానరుఁడు నే నని విశ్వుని వైశ్వానరరూపమునఁ జింతింపవలయును. తదనంతరము నేను సూత్రాత్మ యని తైజసుని సూత్రాత్మరూపమునఁ జింతింపవలయును. తదనంతరము నే నీశ్వరుఁ డని ప్రాజ్ఞుని నీశ్వరరూపమునఁ జింతింపవలయును. తదనంతరము సమష్టివ్యష్టిరూపస్థూలసూక్ష్మకారణోపాధిసహితమును ఓంకారవాచ్యరూపము నగుపరబ్రహ్మము నే నని యాత్మను సర్వాత్మరూపమునఁ జింతింపవలయును. తదనంతరము మనస్సున కేకాగ్రత గలుగఁగా, నధికారిపురుషుఁడు సర్వజగత్తును స్థూలసూక్ష్మాదిక్రమముగా నఖండైకరసానందరూపనిర్విశేషపరబ్రహ్మమునందు లయము చేయవలయును. అనఁగా, స్థూలమును సూక్ష్మమునందు లయము చేయవలయును. సూక్ష్మమును గారణమునందు లయము చేయవలయును. ఆకారణమును బరబ్రహ్మమునందు లయము చేయవలయును. తదనంతర మేకాగ్రమనస్సుచేత నే నఖండైకరసబ్రహ్మానందరూపుఁడ నని యాత్మను సాక్షాత్కరించుకొనవలయును. ఈప్రకార మైనయభిప్రాయముచేత నే పూర్వము సమష్టివ్యష్ట్యుపాధులయొక్క తాదాత్మ్యమును జెప్పి, తదుపహితచైతన్యములకుఁ దాదాత్మ్యము చెప్పఁబడినది. అందువలన నాతాదాత్మ్యమును జెప్పుట నిష్ఫలము కాదు. మ తే మనఁగా, పూర్వోక్తరీతిచే నాత్మసాక్షాత్కారరూపఫలమునకు హేతు వగుటవలన సఫలమై యున్నది. ఈయర్థ మన్యగ్రంథములయందును

జెప్పఁబడియున్నది. “శ్లో. సమాధికాలాత్ప్రాగేవం విచింత్యాతి ప్రయత్నతః। స్థూలసూక్ష్మక్రమాత్సర్వం చిదాత్మని విలాపయేత్ ”—భావము॥ ఈయధికారిపురుషుఁడు సమాధికిఁ బూర్వకాలమందుఁ బూర్వోక్తక్రమముగా విశ్వవైశ్వానరాదులయొక్క-యభేదచింతనవలన నతిప్రయత్నముతో సర్వజగత్తును స్థూలసూక్ష్మాదిక్రమముగాఁ జేతనాత్మయందు లయము చేయవలయును. మఱియు నీయర్థము కల్పతరుకారాచార్యులచేతను జెప్పఁబడి యున్నది. “శ్లో. నిర్విశేషం పరంబ్రహ్మ సాక్షాత్కర్తుమనీశ్వరాః । యే మందాస్తే ఽనుకంప్యంతే సవిశేషనిరూపణైః॥ వశీకృతే మనస్యేషాం సగుణబ్రహ్మశీలనాత్ । తదేవావిర్భవేత్సాక్షాదపేతోపాధికల్పనమ్ ”—భావము॥ నిర్విశేషపరబ్రహ్మమును సాక్షాత్కరించుటయందసమర్థులైనమందపురుషుల ననుగ్రహించుటకొఱకు సవిశేషబ్రహ్మముయొక్క-నిరూపణములు గురుశాస్త్రములచేఁ జేయఁబడు చున్నవి. ఆసగుణబ్రహ్మోపాసనచేత నాపురుషులయొక్క-యేకాగ్రమైనమనస్సునందు, అదియే (ఆసగుణబ్రహ్మమే) సర్వోపాధిరహితనిర్విశేషబ్రహ్మముగా సాక్షాత్కృత మగుచున్నది. మఱియు నీయర్థమునందు శ్రుతియును బ్రమాణమై యున్నది. శ్రుతి.—“ఏష సర్వేషు భూతేషు గూఢాత్మా న ప్రకాశతే। దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ”—భావము॥ ఈయాత్మ సర్వభూతములయందుండునదైనను గూఢ మగుటవలన అనఁగా నజ్ఞానముచేత నావృత మగుటవలన సర్వప్రాణులకును బ్రతీత మగుట లేదు. మఱే మనఁగా, విచారముచే నతిసూక్ష్మమైనబుద్ధిచేతనే సూక్ష్మదర్శిపురుషులచే నాయాత్మ సాక్షాత్కరింపఁబడు చున్నది.

శంక:—పూర్వము మీఁచే స్థూలసూక్ష్మకారణము లను త్రివిధవ్యష్టిశరీరములకుఁ గ్రమముగా నభిమానులైన విశ్వతైజసప్రాజ్ఞు లను త్రివిధజీవులు చెప్పఁబడిరి. ఆత్రివిధజీవులును స్వతంత్రులా? లేక, ఒకచైతన్యముయొక్క-యవస్థావిశేషములా ? ప్రథమస్వతంత్రపక్ష మంగీకరించినయెడల నది సంభవింపదు. ఏలయన, ఒకవేళ నాత్రివిధజీవులును స్వతంత్రులైనయెడల వారలకుఁ బరస్పరభేదమును నవశ్య మగును. అందువలన సుషుప్త్యవస్థయందుఁ బ్రాజ్ఞనామకజీవునిచే ననుభవింపఁబడిన సుఖాదిపదార్థములయొక్క-యు, స్వప్నావస్థయందుఁ దైజసనామకజీవునిచే ననుభవింపఁబడిన గజరథాదికపదార్థములయొక్క-యు స్మరణము, జాగ్రదవస్థయందు విశ్వనామకజీవునకుఁ గలుగఁ గూడదు. ఏకారణముచేత ననఁగా, ఒకనిచే ననుభవింపఁబడినపదార్థములు మఱియొకనికి స్మరణవిషయ మగుట లేదు. ఒకవేళ నొకనిచే ననుభవింపఁబడినపదార్థములు మఱియొకనికి స్మరణవిషయ మగునెడలఁ

చైత్రనామకపురుషునిచే ననుభవింపఁబడినపదార్థములు మైత్రనామకపురుషునకును స్మరణవిషయము కావలయును.

సమాధానము:—విశ్వతైజసప్రాజ్ఞు లను త్రివిధజీవులు స్వతంత్రులు కారు. మఱి యే మనఁగా, నా త్రివిధజీవులును నొకటే ప్రత్యగాత్మయొక్కయవస్థావిశేషములై యున్నారు. అందువలన నాస్మరణానుపపత్తిరూప దోషప్రాప్తి యగుట లేదు. ఏప్రకారముగా నావిశ్వాదిత్రివిధజీవులును నొకటే జీవాత్మయొక్కయవస్థావిశేషములో ఆప్రకారము చెప్పఁబడుచున్నది. ఆయొకటే జీవాత్మ జాగ్రదవస్థయందు వ్యష్టిస్థూలశరీర సూక్ష్మశరీర కారణా ఽవిద్య లనుత్రివిధముల కభిమానియగుటవలన విశ్వుఁ డనునామముచేఁ జెప్పఁబడుచున్నాఁడు. ఆజీవాత్మయే స్వప్నావస్థయందు సూక్ష్మశరీరకారణావిద్య లను ద్వివిధశరీరముల కభిమాని యగుటవలనఁ దైజసుఁ డనునామముచేఁ జెప్పఁబడుచున్నాఁడు. ఆజీవాత్మయే సుషుప్త్యవస్థయందేకకారణాఽవిద్యకు నభిమాని యగుటవలనఁ బ్రాజ్ఞుఁ డనునామముచేఁ జెప్పఁబడుచున్నాఁడు. ఆజీవాత్మయే సమాధ్యవస్థయందు స్థూలసూక్ష్మకారణాఖ్య త్రివిధశరీరాభిమానరహితుఁడై శుద్ధపరమాత్మరూపుఁ డగుచున్నాఁడు.

యద్యపి, ఈ జీవాత్మ యేకస్థూలశరీరమాత్రముయొక్కయభిమానముచేతనే విశ్వుఁ డనునామమును, ఏకసూక్ష్మశరీరమాత్రముయొక్కయభిమానముచేతనే తైజసుఁ డనునామమును బొందుచున్నాఁడు, తథాపి, ఇచ్చట స్థూలసూక్ష్మకారణములను త్రివిధశరీరములయొక్కయభిమానమువలన జీవాత్మకు విశ్వుఁ డనునామమును సూక్ష్మకారణము లను ద్వివిధశరీరములయొక్కయభిమానమువలనఁ దైజసుఁ డనునామమును గలుగు నని చెప్పుట, త్వంపదార్థశోధనయం దుపయుక్తము లైన యన్వయవ్యతిరేకములను బోధించుటకొఱకై యున్నది. ఆ యన్వయవ్యతిరేకము లివియై యున్నవి. జాగ్రదవస్థయం దైననో స్థూలసూక్ష్మకారణము లను త్రివిధశరీరములకు సాక్షిరూపముచేత నాత్మభాన మగుచున్నది. స్వప్నావస్థయందు సూక్ష్మకారణములను ద్వివిధశరీరములకు సాక్షిరూపముచేత నాత్మభాన మగుచున్నది. సుషుప్త్యవస్థయం దేకావిద్యారూపకారణశరీరమునకు సాక్షిరూపముచేత నాత్మభాన మగుచున్నది. సమాధ్యవస్థయం దైననో శుద్ధస్వప్రకాశచైతన్యరూపముచేత నాత్మభాన మగుచున్నది. ఇదియే ఆయాత్మకు జాగ్రత్స్వప్నసుషుప్తిసమాధు లను చతుర్విధావస్థలయందుఁ గల యన్వయము. స్వప్నావస్థయందు జాగ్రత్తయొక్కస్థూలశరీరము భాన మగుట లేదు. సుషుప్త్యవస్థయందు స్వప్నముయొక్కసూక్ష్మశరీరము భాన మగుట లేదు. సమాధ్యవస్థయందు సుషుప్తియొక్కకారణశరీరము భాసించుట లేదు.

ఇదియే స్థూల సూక్ష్మ కారణము లను త్రివిధశరీరములయందుఁ గల వ్యతిరేకము. సర్వానాత్మాకారవృత్తిరహితమై యుండు చిత్తముయొక్క కేవలాత్మాకారావస్థ సమాధి యనఁబడును. ఆ సమాధ్యవస్థయందుఁ బురుషునకు దేహాదిసర్వపదార్థములయందభిమానము నివృత్త మగుచున్నది. అందువలన నాసమాధ్యవస్థయం దాస్థూలాది త్రివిధశరీరములకును వ్యతిరేకమే యున్నది. సమాధ్యవస్థయం దీజీవుఁడు సర్వాభిమానరహితుఁ డగుటవలన శుద్ధపరమాత్మరూపుఁడే యగుచున్నాఁడు. ఏయే పదార్థము వ్యావృత్తమై యున్నదో యది సర్వము ననాత్మయే యగును. ఏది సర్వత్రాఽన్వితమో (అన్వయసహితమో) యది యాత్మయే యనునిశ్చయము త్వంపదార్థశోధన మనఁబడును. ఆత్వంపదార్థశోధనము పూర్వోక్తాఽన్వయవ్యతిరేకములచేతనే సిద్ధించు చున్నది.

### (43) జీవాత్మయొక్క జాగ్రత్స్వప్నసుషుప్తిమూర్ఛామరణములను పంచావస్థలనిరూపణము.

ఇఁకఁ బూర్వోక్తజీవాత్మయొక్క జాగ్రత్త స్వప్నము సుషుప్తి మూర్ఛ మరణము అను పంచావస్థలు చెప్పఁబడుచున్నవి. పూర్వము చెప్పఁబడి యుండు శ్రోత్రాదీంద్రియములయొక్క యధిష్ఠానదేవత లైన దిగ్వాతాదిదేవతలచేత ననుగ్రహింపఁబడిన శ్రోత్రాదీంద్రియములచే శబ్దాదివిషయములయొక్క యనుభవ మీ పురుషున కేయవస్థయందుఁ గలుగు చున్నదో యాయవస్థ జాగ్రదవస్థ యనఁబడును. జాగ్రదవస్థయందు సుఖదుఃఖరూపభోగము నిచ్చునట్టి పుణ్యాపాపకర్మముల కుపరామము (విరామము)ను శ్రోత్రాదీంద్రియముల కుపరామమును గలుగఁగా, జాగ్రదనుభవజన్యసంస్కారముచేత నీపురుషున కేయవస్థయందు శబ్దాదివిషయములును దాని జ్ఞానము నుత్పన్నము లగుచున్నవో ఆయవస్థ స్వప్నావస్థ యనఁబడును. ఏయవస్థ యందు జాగ్రత్స్వప్నము లను రెంటికిని భోగము నిచ్చునట్టికర్మములయొక్క యుపరామముచేత స్థూలసూక్ష్మశరీరాభిమాననివృత్తిద్వారమున సర్వవిశేషజ్ఞానములయొక్క యుపరామమువలన బుద్ధికిఁ గారణాజ్ఞానరూపమున స్థితి కలుగునో యాయవస్థ సుషుప్త్యవస్థ యనఁబడును. ముద్గరప్రహారాదినిమిత్తమువలన జన్యమైన దుఃఖరూపవిషాదముచే నేయవస్థయం దీపురుషునకు సర్వవిశేషజ్ఞానములయొక్క యుపరామము గలుగుచున్నదో యాయవస్థ మూర్ఛావస్థ యనఁబడును. ఈ మూర్ఛావస్థ జాగ్రదాద్యవస్థలకన్నను భిన్నావస్థయే యగును.

ఈయర్థము శ్రీవ్యాసభగవంతునిచేతను "ముగ్ధే ఽర్ధసంపత్తిః పరిశేషాత్" అనుసూత్రమునందుఁ జెప్పఁబడి యున్నది. ఈసూత్రార్థ మే మనఁగా, ముద్గరప్రహా

రాదినిమిత్తముచేత నీపురుషున కేమూర్ఛ కలుగుచున్నదో యామూర్ఛ జాగ్రదాది చతుర్విధావస్థలలో నొకయవస్థయం దంతర్భూతమా? లేక, ఆచతుర్విధావస్థలకన్న వేఱొకభిన్నావస్థయా? అను సంశయానంతరము ఈప్రకార మైన వాదియొక్క పూర్వపక్షము ప్రాప్త మగుచున్నది. శ్రుతిస్మృత్యాదులయం దీజీవాత్మకు జాగ్రదాదిచతుర్విధావస్థలే చెప్పఁబడి యున్నవి. దానికి భిన్నముగా మూర్ఛావస్థ చెప్పఁబడ లేదు. అందువలన నామూర్ఛ జాగ్రదాద్యవస్థలయందే యంతర్భూతము. దానియందును, విశేషజ్ఞానములయొక్క యుపరామము సుషుప్తియందును మూర్ఛయందును సమానము. అందువలన యామూర్ఛ సుషుప్తియందే యంతర్భూతము. ఆ సుషుప్తికన్నను మూర్ఛ భిన్నావస్థ కాదు. అనువాదియొక్క పూర్వపక్షము ప్రాప్తింపఁగా, పూర్వోక్తసూత్రముచేత శ్రీవ్యాసభగవంతునిచేత నీసిద్ధాంతము చేయఁబడినది. మూర్ఛావస్థ జాగ్రదాదిచతుర్విధావస్థలకన్నను భిన్నావస్థ యగును. జాగ్రత్స్వప్నాద్యవస్థలయందు విశేషజ్ఞానముల కభావము లేదు. మూర్ఛావస్థయం దైననో సర్వవిశేషజ్ఞానములకు నభావ మున్నది. ఈకారణముచేత మూర్ఛావస్థ జాగ్రత్స్వప్నాద్యవస్థలయం దంతర్భూతము కాదు. మరణావస్థానంతర మీపురుషునకుఁ బునరుత్థానము కలుగుట లేదు. మూర్ఛావస్థానంతర మైననో యీపురుషునకుఁ బునరుత్థానము కలుగుచున్నది. ఈకారణముచేత మూర్ఛావస్థ యామరణావస్థయందును అంతర్భూతము కాదు. మఱియు సుషుప్తపురుషునకు ముఖము ప్రసన్న మయ్యును శరీరము నిష్కంప మయ్యు నున్నది. మూర్ఛితపురుషునకు ముఖము వికారసహిత మయ్యును శరీరము కంపసహిత మయ్యు నున్నది. ఈకారణముచేత నామూర్ఛ సుషుప్త్యవస్థయందు నంతర్భూతము కాదు. ఇఁక నే మనఁగా, పరిశేషమువలన మూర్ఛ యాజాగ్రదాదిచతుర్విధావస్థలకన్నను భిన్నావస్థ యనియే సిద్ధించుచున్నది.

పూర్వోక్తరీతిగా సుషుప్తికిని మూర్ఛకును బరస్పరవైలక్షణ్య ముండినను సర్వవిశేషజ్ఞానములయొక్కయభావము రెంటియందును దుల్యమే యగుచున్నది. ఈకారణముచేత మూర్ఛ యర్ధసుషుప్తి యనఁబడుచున్నది. ఈశరీరమునకు భోగము నిచ్చునట్టికర్మములయొక్కనివృత్తిచేత సామాన్యవిశేషరూపద్వివిధదేహాభిమానములయొక్కనివృత్తి కలుగఁగా భావిదేవాదికశరీరప్రాప్తిపర్యంతము గల పూర్వోక్తసప్తదశతత్త్వములయొక్కపిండీభావావస్థ యేది గలదో యాయవస్థ మరణావస్థ యనం బడును. ఇచ్చటఁ దాత్పర్య మే మనఁగా, దేహాభిమానము సామాన్యవిశేషములను భేదముచేత ద్విప్రకారమై యున్నది. సుషుప్తియందు విశేషదేహాభిమానము నివృత్తమైనను బురుషునకు సామాన్యదేహాభిమాన మున్నది. ఆదేహాభిమానముచేత నే పురు

షుఁడు సుషుప్తియందుండి యుత్థానము నొందుచున్నాఁడు. ఒకవేళఁ బురుషునకు సుషుప్తియం దాసామాన్యదేహాభిమానము లేనియెడల మరణావస్థాసహితపురుషునకుఁ బునరుత్థానము లేనట్లు ఈపురుషునకు సుషుప్తియందుండి పునరుత్థానము లేకపోవలయును. పునరుత్థానరూపహేతువువలనఁ బురుషునకు సుషుప్తియం దాసామాన్యదేహాభిమాన మనుమానముచే సిద్ధించుచున్నది. జాగ్రదవస్థయందును స్వప్నావస్థయందును బురుషునకు నేను మనుష్యుఁడను నేను బ్రాహ్మణుఁడను ఇత్యాదిప్రకారమైన విశేషదేహాభిమాన మున్నది. మరణావస్థయందుఁ బురుషున కాద్వివిధదేహాభిమానములును నివృత్తము లగుచున్నవి.

ఇచ్చటఁ గొందఱు గ్రంథకారు లీమరణావస్థను మూర్ఛావస్థకన్న భిన్నావస్థ యని యంగీకరించుట లేదు. ఇఁక నే మనఁగా, మరణావస్థకు మూర్ఛావస్థ యందే యంతర్భావ మని యంగీకరించు చున్నారు. మూర్ఛితపురుషున కొకవేళ యీదేహమునందు భోగము నిచ్చుకర్మములు శేషించి యుండినయెడల నామూర్ఛయం దుండి యీపురుషునకుఁ బునరుత్థానము కలుగుచున్నది. ఒకవేళ నాకర్మములు లేనియెడలఁ బురుషునకు మరణమే గలుగుచున్నది. అందువలన మరణావస్థ మూర్ఛావస్థయం దంతర్భూతమై యున్నది.

మఱియు విశ్వతైజసప్రాజ్ఞ లనుముగ్గురు నెట్లు ఒకటే జీవాత్మయొక్కయవస్థావిశేషములో! అట్లు వైశ్వానరహిరణ్యగర్భేశ్వరు లనుముగ్గురు నొకటే పరమాత్మయొక్కయవస్థావిశేషములై యున్నారు. ఒకఁడే పరమాత్మదేవుఁడు సమష్టిస్థూలశరీర సూక్ష్మశరీరములును ఆరెంటికిని గారణ మైనమాయయు నను నీమూఁటిచే నుపహితుఁడై వైశ్వానరుఁ డనునామముచేఁ జెప్పఁబడు చున్నాఁడు. ఆ పరమాత్మదేవుఁడే సమష్టిసూక్ష్మశరీరమును దానికిఁ గారణ మైనమాయయు నను రెంటిచే నుపహితుఁడై హిరణ్యగర్భుఁ డనునామముచేఁ జెప్పఁబడు చున్నాఁడు. ఆపరమాత్మదేవుఁడే కేవలైకమాయచేత నుపహితుఁడై యీశ్వరుఁ డనునామముచేఁ జెప్పఁబడు చున్నాఁడు.

## ( (44) సగుణబ్రహ్మోపాసనాఫలనిరూపణము. )

ఇఁక వైశ్వానరహిరణ్యగర్భేశ్వరు లను ముగ్గురియొక్కయుపాసనమునకు ఫలము చెప్పఁబడుచున్నది. ఈజీవుఁడు ఎప్పుడు నేనే వైశ్వానరుఁడు అని యీ వైశ్వానరునియొక్కయభేదోపాసన చేయుచున్నాఁడో అప్పు డీజీవున కావైశ్వానరభావప్రాప్తిరూపఫలము ప్రాప్తించుచున్నది. ఎప్పు డీజీవుఁడు నేనే హిరణ్యగర్భుఁడు

అని యాహిరణ్యగర్భునియొక్క యభేదోపాసన చేయుచున్నాఁడో అప్పు డీజీవున కా హిరణ్యగర్భభావప్రాప్తిరూపఫలము ప్రాప్తించుచున్నది. ఎప్పు డీజీవుఁడు నేనే యీశ్వరుఁడు అని యాయీశ్వరునియొక్క యభేదోపాసన చేయుచున్నాఁడో అప్పు డీజీవున కాయీశ్వరభావప్రాప్తిరూపఫలము ప్రాప్తించుచున్నది. ఈ యభేదోపాసన శాస్త్రములయం దహంగ్రహోపాసన యనఁబడును.

శంక:—వైశ్వానరహిరణ్యగర్భేశ్వరు లను మువ్వురు నొకటేపరమాత్మ యొక్క యవస్థావిశేషము లని మీచేఁ జెప్పఁబడుటవలన నామువ్వురయందు నీశ్వరత్వమే సిద్ధించుచున్నది. అది సంభవింపదు. ఏల యన, "యో ఽశనాయా పిపాసే శోకం మోహం జరాం మృత్యు మత్యేతి" అనుశ్రుతి యీశ్వరుని అశనాయాపిపాసా శోకమోహజరామరణాది సర్వధర్మరహితునిఁగాఁ జెప్పుచున్నది. వైశ్వానరహిరణ్యగర్భు లనునిరువురయం దైననో, శ్రుతి క్షుధాభయజన్మమరణబంధమోక్షాదిధర్మములు చెప్పి యున్నది. ఆసర్వధర్మములును జీవునకే ప్రసిద్ధములు. హిరణ్యగర్భుఁడు విరాట్టనుపుత్రునిఁ బుట్టించి క్షుధాతురుఁడై యావిరాట్టనుపుత్రుని భక్షించుట కొఱకుఁ బ్రవర్తించెను. దానిని జూచి భయభీతుఁడై యావిరాట్టు భాణ యనుశబ్దము చేసెను. ఈప్రకారముగా వైశ్వానరహిరణ్యగర్భులయందు క్షుధాభయాదికజీవధర్మము లాత్మపురాణముయొక్క చతుర్థాధ్యాయమునందు స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నవి. అందువలన నావైశ్వానరహిరణ్యగర్భులయం దీశ్వరరూపత్వము సంభవించుట లేదు. ఇఁక నేమనఁగా, జీవరూపత్వమే సంభవించుచున్నది.

సమాధానము:—బహుతరశ్రుతిస్మృత్యాదులయం దావైశ్వానరహిరణ్యగర్భుల కీశ్వరత్వమే చెప్పఁబడి యున్నది. కొన్ని శ్రుతిస్మృత్యాదులయం దావైశ్వానరహిరణ్యగర్భులకు ఏజన్మాదికధర్మప్రతిపాదనము చేయఁబడి యున్నదో, అది యీ యధికారిపురుషున కాహిరణ్యగర్భాదిపదములయం దనిత్యత్వాదిదోషదృష్టివలన వైరాగ్యప్రాప్తికొఱకుఁ జెప్పఁబడి యున్నది. వైశ్వానరహిరణ్యగర్భులయొక్క జీవత్వమునం దావచనములకుఁ దాత్పర్యము లేదు. ఒకవేళ శ్రుతిప్రతిపాదితక్షుధాభయాదిక జీవధర్మములయొక్క సంబంధముచేత నావైశ్వానరహిరణ్యగర్భులను జీవరూపు లని యంగీకరించినయెడల జీవునియందుఁ బ్రసిద్ధ మైన యిచ్ఛాదికధర్మముల నీశ్వరునియందుఁ బ్రతిపాదించునట్టి "సో కామయత, తదైక్షత, తన్మనో కురుత" ఇత్యాదిశ్రుతులచేత నాయీశ్వరుఁడును జీవరూపుఁడే కావలయును. కావున నా వైశ్వానరహిరణ్యగర్భు లీశ్వరరూపులే కాని జీవరూపులు కా రనునది సిద్ధ మైనది.

ఏపురుషుఁ డాయీశ్వరునియొక్కయభేదోపాసన చేయుచున్నాఁడో యా పురుషుఁ డాయీశ్వరభావమునే పొందుచున్నాఁడు. ఇట్లు చెప్పఁబడినయుపాసనా ఫలము శ్రుతిస్మృతులయందును జెప్పఁబడి యున్నది. శ్రుతి.—"తం యథా యథో పాసతే తథైవ భవతి"—భావము॥ ఏయధికారిపురుషుఁ డాపరమాత్మను ఏయే వై శ్వానరాదిరూపముచేత నుపాసన చేయుచున్నాఁడో యాయధికారిపురుషుఁడు తత్త ద్రూపవిశిష్ట పరమేశ్వరభావమునే పొందుచున్నాఁడు. ఈయుపాసనాఫలము శ్రీసదా శివునిచేతను రఘునాధునికొఱకుఁ జెప్పఁబడి యున్నది. అచ్చట "శ్లో. యే నాకారేణ యే మర్త్యా మా మే వైక ముపాసతే। తే నాకారేణ తే భ్యోహం ప్రసన్నో వాంఛి తం దదే"—భావము॥ జీవులు ఒకఁడే పరమేశ్వరుఁ డైననన్ను ఏయేయాకారమున నుపాసన చేయుచున్నారో ఆయాయాకారమునఁ బరమేశ్వరుఁడ నగు నేను ప్రస న్నుఁడనై యాయుపాసకులకు వారివాంఛితార్థము నిచ్చుచున్నాను. ఈయుక్తార్థమే శ్రీకృష్ణభగవానులచేతను గీతయందు "యం యం వాపి స్మర న్భావం త్యజ త్యంతే కళేబరమ్ । తం తమే వైతి కౌంతేయ సదా తద్భావ భావితః" అనుశ్లోకముచేతఁ జెప్పఁబడి యున్నది.

శంక:—పూర్వోక్తరీతిగా భావనయొక్కయుత్కర్షముచేత నీశ్వరసాక్షా త్కారము గలపురుషున కాయీశ్వరభావప్రాప్తిరూపఫలము ప్రాప్త మగుఁ గాక. అయినను మందభావన గల యుపాసకునకు నెట్టిఫలము ప్రాప్త మగును?

సమాధానము:—భావనయొక్కమందత్వముచేత నీపురుషునకుఁ బూర్వో క్తఫలము ప్రాప్తించుట లేదు. మ ఱే మనఁగా, ఆమందభావనయొక్కతారతమ్యము చేత నాయుపాసకునకు సార్ష్ణిసారూప్యసామీప్యసాలోక్యము లను చతుర్విధఫల ములు ప్రాప్తము లగుచున్నవి. అచ్చట, తనమనుష్యభావముయొక్కవిస్మృతితో నాయుపాస్యదేవతాభావప్రాప్తి యేది గలదో అదియే యాభావనయం దుత్కర్షమై యున్నది. తనమనుష్యభావముయొక్కకించిత్స్మరణముతో నాయుపాస్యదేవతాభావ ప్రాప్తి యేది గలదో అదియే యాభావనయందు మందత్వమై యున్నది. జగత్తు యొక్కయుత్పత్త్యాదివ్యాపారములను విడిచి, యీయుపాసకపురుషుఁడు పరమేశ్వరు నకు సమాన మైనయైశ్వర్యమును భోగమును బొందుట సార్ష్ణి యనఁబడును. ఉపా సకపురుషున కాయీశ్వరునితో సమానరూపముయొక్కప్రాప్తి సారూప్య మనఁ బడును. ఆయీశ్వరునియొక్కసమీపవర్తిత్వము సామీప్య మనఁబడును. ఆయీశ్వ రునియొక్కలోకమునందు వసించుట సాలోక్య మనఁబడును. ఈప్రకార మైనచతుర్విధ

ఫలములు ఆయుపాసకపురుషుఁ డామందభావనముయొక్క తారతమ్యముచేతఁ బొందుచున్నాఁడు. శ్రుతి.—"సామ్నః సాయుజ్యం సలోకతాం జయతి"— భావము॥ ఈయుపాసకపురుషుఁ డాభావనయొక్క తారతమ్యముచేత హిరణ్యగర్భునియొక్క సాయుజ్యసాలోక్యాదులను బొందుచున్నాఁడు.

ఇట్లు తత్పదార్థముయొక్క వాచ్యార్థనిరూపణప్రసంగముచేత సగుణబ్రహ్మోపాసకుల కాయాయుపాసనచేత నాయాసగుణబ్రహ్మప్రాప్తిరూపఫలము నిరూపింపఁబడినది.

[*] (45) నిర్గుణబ్రహ్మోపాసనాఫలనిరూపణము. [*]

ఇఁక నిర్గుణబ్రహ్మోపాసకులకు నిర్గుణబ్రహ్మముయొక్క ప్రాప్తిరూపఫలము చెప్పఁబడుచున్నది. ఏపురుషుఁడు వివేకాదిచతుస్సాధనసంపన్నుఁడును మందబుద్ధిగలవాఁడు నగుటవలన వేదాంతశాస్త్రవిచారణ చేయుటయందసమర్థుఁడును నిర్గుణబ్రహ్మమును తెలియుట కిచ్ఛ గలవాఁడు నగుచున్నాఁడో యాపురుషుఁడు శ్రోత్రియబ్రహ్మనిష్ఠగురువుయొక్క ముఖమునుండి నిర్గుణబ్రహ్మముయొక్క స్వరూపనిశ్చయముచేసి సర్వస్థూలసూక్ష్మకారణోపాధిరహితమును సచ్చిదానందస్వరూపము నైన నిర్గుణబ్రహ్మము నేను అని నిర్గుణబ్రహ్మముయొక్క యుపాసన చేయవలయును. ఆనిర్గుణబ్రహ్మముయొక్క యుపాసనచేత నధికారిపురుషున కీశరీరముయొక్క జీవితావస్థయందు, లేక, మరణావస్థయందు, లేక, బ్రహ్మలోకమునం దైనను నిర్గుణబ్రహ్మముయొక్క సాక్షాత్కారము గలిగి యానిర్గుణబ్రహ్మభావప్రాప్తిరూపఫలము కలుగుచున్నది. ఎట్లు, మణిప్రభయందు మణిబుద్ధిచేత ప్రవర్తించినపురుషున కామణిప్రాప్తిరూపఫలము గలుగు చున్నదో, అట్లే నిదిధ్యాసనరూపనిర్గుణబ్రహ్మోపాసనచేత నీయధికారిపురుషున కానిర్గుణబ్రహ్మప్రాప్తిరూపఫలము గలుగుచున్నది. శ్రుతి.—"జ్ఞానప్రసాదేన విశుద్ధ సత్త్వ స్తతస్తు తం పశ్యతి నిష్కళం ధ్యాయమానః"— భావము॥ ఆనిర్గుణబ్రహ్మోపాసనచేత నతిశుద్ధ మైనచిత్తము గలవాఁడు దానిని ధ్యానించువాఁడై యానిర్గుణబ్రహ్మమును సాక్షాత్కరించుకొను చున్నాఁడు. విచారమందసమర్థుఁ డగుపురుషుఁడు బ్రహ్మవేత్త యగు గురువుయొక్క ముఖమున నిర్గుణబ్రహ్మముయొక్క స్వరూపమును బరోక్షముగా నిశ్చయము చేసి నేనే నిర్గుణబ్రహ్మ మని యానిర్గుణబ్రహ్మము నుపాసింపవలయును. ఆయుపాసనచేత నాపురుషునకు నిర్గుణబ్రహ్మసాక్షాత్కార మగుచున్నది. ఈయర్థము శ్రీభగవంతునిచేతను గీతయం దర్జునునకుఁ జెప్పఁబడి యున్నది. అచ్చట "శ్లో॥ అన్యే త్వేవ మజానంతః శ్రుత్వా న్యేభ్య ఉపాసతే। తేపి చాతితరం త్యేవ మృత్యుం శ్రుతి పరాయణాః"—భావము॥ ఏపురుషుఁడు

మందబుద్ధిసహితుఁడగుటవలనఁ దాను వేదాంతశాస్త్రవిచారణ చేయుటయం దసమర్థుఁడగుటవలన బ్రహ్మవేత్త యగుగురువుయొక్క ముఖమున నిర్గుణబ్రహ్మస్వరూపమును శ్రవణము చేసి "అహం బ్రహ్మాస్మి" యని ధ్యానము చేయుచున్నాఁడో ఆయుపాసకపురుషుఁడును ఆనిర్గుణబ్రహ్మముయొక్క సాక్షాత్కారముచేత నజ్ఞానరూపమృత్యువు నవశ్యము నాశము చేయుచున్నాఁడు. "తేపి చాతితరం త్యేవ" యను వచనమునందుండు నపిశబ్దముచేత శ్రీభగవంతునిచే నీకైముతికన్యాయము సూచింపఁబడినది. విచారమునం దసమర్థమందబుద్ధిపురుషుఁడును నిర్గుణబ్రహ్మోపాసనవలన నాయజ్ఞానమును నాశము చేయునపుడు విచారమందు సమర్థత గలపురుషుఁ డాయజ్ఞానమును నాశము చేయు ననుటయం దేమి చెప్పవలయును? దీనిచే సిద్ధించిన యర్థ మేమనఁగా, జ్ఞానకాండమునందుఁ జెప్పఁబడియుండు సగుణోపాసన, లేక, నిర్గుణోపాసన యను నీసర్వోపాసనలకును జిత్తైకాగ్రతాద్వారమున బ్రహ్మసాక్షాత్కారమే ముఖ్యఫలమై యున్నది. బ్రహ్మలోకాదికములో యాయుపాసనల కవాంతరఫలమై యున్నది. ముఖ్యఫలము కాదు. ఈకారణముచేతనే బ్రహ్మసూత్రకర్త యగు శ్రీవ్యాసభగవానులచేతను ఆయుపాసనలు జ్ఞానకాండమునందే విచారింపఁబడి యున్నవి.

పూర్వము మాయోపహితతత్పదార్థబ్రహ్మమునకు జగత్తుయొక్క జన్మాదికారణత్వరూపతటస్థలక్షణము చెప్పఁబడినది. అదియే తటస్థలక్షణమై యున్నది. బ్రహ్మమునందుండి మాయాద్వారమున సూక్ష్మస్థూలప్రపంచోత్పత్తిని నిరూపించి యింతపర్యంతము సిద్ధము చేయఁబడినది. ఇది యధ్యారోప మనఁబడును. తద్భావరహితవస్తువునందుఁ దద్బుద్ధి యధ్యారోప మనఁబడును. ఉదా—ఈప్రసంగమునందు వాస్తవముగా జగద్భావరహితబ్రహ్మమునందు జగద్బుద్ధి యధ్యారోపమై యున్నది. అధ్యారోపాపవాదము లను రెంటిచేతనే యీయధికారిపురుషునికి గురుశాస్త్రము లానిర్గుణబ్రహ్మోపదేశము చేయుచున్నవి. అందువలన నిఁక బ్రహ్మమునం దధ్యారోపితప్రపంచముయొక్క యపవాదము నిరూపణము చేయఁబడు చున్నది.

## (46) బ్రహ్మమునం దారోపితప్రపంచముయొక్క యపవాదనిరూపణము.

ఏ యధిష్ఠానమం దేవస్తువు త్రికాలములయందు లేనిదై యుండియును భ్రాంతిచేతఁ బ్రతీత మగుచున్నదో, యాయధిష్ఠానమం దావస్తువుయొక్క యభావనిశ్చయ మపవాద మనఁబడును. శుక్త్యాదులయందు భ్రాంతిచేఁ బ్రతీతము లగు రజతాదికములకు ఆశుక్త్యాదులయం దిది రజతము కాదు మ టే మనఁగా శుక్తియే

యను నభావనిశ్చయ మెట్లపవాద మగునో యట్లధిష్ఠానబ్రహ్మమునందు భ్రాంతిచేఁ బ్రతీత మైనపూర్వోక్తమాయాదిప్రపంచమునకును ఆయధిష్ఠానబ్రహ్మమునం దీప్రపంచము త్రికాలములయందు లేదను నభావనిశ్చయము ప్రపంచముయొక్కయపవాదము. ఈయపవాదము శాస్త్రమునందు బాధ యనియును విలాపన మనియును జెప్పఁబడి యున్నది. ఏయధిష్ఠానమునం దేవస్తువు ప్రతీత మగుచున్నదో యాయధిష్ఠానమునం దావస్తువునకుఁద్రికాలములయం దత్యంతాభావనిశ్చయము శాస్త్రమందు బాధ యనఁబడును. ఆబాధయు శాస్త్రీయము యౌక్తికము ప్రాత్యక్షికము అనుభేదముచేఁ ద్రిప్రకార మగుచున్నది. "అథాత ఆదేశో నేతి నేతి, నేహ నానాస్తి కించన" ఇత్యాదిశాస్త్రములచే నధిష్ఠానబ్రహ్మమునందు సర్వప్రపంచాఽభావనిశ్చయము శాస్త్రీయబాధ యనఁబడును. ఎట్లు మృత్తికారూపోపాదానకారణముకన్నను భిన్నముగా ఘటరూపకార్యమున కభావమే నిశ్చిత మగుచున్నదో అట్లు సర్వప్రపంచమున కభిన్ననిమిత్తోపాదానకారణ మైనబ్రహ్మముకన్న భిన్న మగు సర్వప్రపంచమున కభావనిశ్చయముచే నాదృశ్యప్రపంచముయొక్కమిథ్యాత్వనిశ్చయమువలన బ్రహ్మాత్మమాత్రనిశ్చయ మేది గలదో యది యౌక్తికబాధ మనఁబడును. "అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి" ఇత్యాదిమహావాక్యజన్యసాక్షాత్కారమువలనఁ గార్యప్రపంచసహితాఽజ్ఞాననివృత్తి యేది గలదో యది ప్రాత్యక్షికబాధ మనఁబడును. పూర్వోక్తయౌక్తికబాధయొక్కక్రమ మిదియై యున్నది. స్థూలశరీరము మొదలు బ్రహ్మాండపర్యంతము గల స్థూలప్రపంచము లన్నియుఁ బంచీకృతస్థూలభూతములయొక్కకార్యములై యున్నవి. అందువలన స్థూలప్రపంచము నాస్థూలభూతములయందు లయము చేయవలయును. అనఁగా స్థూలభూతములకన్న నాస్థూలప్రపంచము భిన్నము కా దను నిశ్చయ మీయధికారిపురుషుఁడు చేయవలయును. తదనంతర మాస్థూలభూతములను సమష్టివ్యష్టిరూపసర్వసూక్ష్మశరీరములను దమకారణరూ పాపంచీకృత పంచసూక్ష్మభూతములయందు లయము చేయవలయును. అనఁగా స్థూలభూతములును సమష్టివ్యష్టిసూక్ష్మశరీరములును ఆసూక్ష్మభూతములయొక్కకార్యము లగుటవలన వానికన్నను భిన్నములు కా వను నిశ్చయము చేయవలయును. పూర్వ మేయేసూక్ష్మభూతములయొక్క యేయేసాత్త్వికాద్యంశములయందుండి యేయే యింద్రియాదికార్యములయొక్కయుత్పత్తి చెప్పఁబడినదో ఆయాకార్యముల నాయాభూతములయొక్క యాయాసాత్త్వికాద్యంశములయందే లయము చేయవలయును.

తాత్పర్య మిదియై యున్నది—స్థూలభూతములను సూక్ష్మభూతములయొక్క తామసాంశమునందు లయము చేయవలయును. జ్ఞానేంద్రియాంతఃకరణములను సూక్ష్మభూతములయొక్క సాత్త్వికాంశమునందు లయము చేయవలయును. కర్మేంద్రియప్రాణముల నాసూక్ష్మభూతములయొక్క రాజసాంశమందు లయము చేయవలయును. ఆసూక్ష్మభూతములను గూడ తమతమకారణములయందు లయము చేయవలయును. అందుఁ బృథివిని జలమునందును జలమును దేజస్సునందును దేజస్సును వాయువునందును వాయువు నాకాశమందును నాకాశము నజ్ఞానమందును నాయజ్ఞానమును జైతన్యమాత్రమందును లయము చేయువలయును. ఇచ్చటఁ దాత్పర్య మేమనఁగా, ఏది కార్య మగుచున్నదో దానికిఁ దనయుపాదానకారణముకన్న భిన్నసత్త లేదు. అందువలన నుపాదానకారణముకన్నను గార్యము భిన్నముకా దనునిశ్చయము చేసి, కార్యమును విస్మరించి కారణమాత్రమును విషయము చేయుస్మరణ యేది గలదో అదియే యాకార్యమునకుఁ గారణమందు విలాపనమై యున్నది. సర్వప్రపంచమునకును బరమకారణము బ్రహ్మము. అందువలన నాసర్వప్రపంచముయొక్క విస్మరణచేత ఏకబ్రహ్మవిషయకస్మరణ యేది గలదో అదియే బ్రహ్మమునందు సర్వప్రపంచముయొక్క విలాపనమై యున్నది. దీనిని వేదాంతశాస్త్రమునందు యౌక్తికబాధ యందురు. ఈయౌక్తికబాధ విష్ణుపురాణమునందును జెప్పఁబడి యున్నది. "శ్లో. జగత్ప్రతిష్ఠా దేవర్షే పృథివ్యప్సు విలీయతే। జ్యోతిష్యాపః ప్రలీయంతే జ్యోతి ర్వాయౌ ప్రలీయతే॥ వాయుశ్చ లీయతే వ్యోమ్ని తచ్చావ్యక్తే ప్రలీయతే। అవ్యక్తం పురుషే బ్రహ్మ న్నిష్కళే సంప్రలీయతే"— భావము॥ ఓ నారదా! జగత్తున కాధారభూతమైనపృథివి జలమందు లయ మగుచున్నది. ఆజలము తేజస్సునందు లయ మగుచున్నది. ఆతేజస్సు వాయువునందు లయ మగుచున్నది. ఆవాయు వాకాశమందు లయ మగుచున్నది. ఆయాకాశ మవ్యక్తమునందు లయ మగుచున్నది. ఆమాయారూపావ్యక్తము పరమాత్మయందు లయ మగుచున్నది. పూర్వోక్తయౌక్తికబాధమే వార్త్తికకారులచేతను "అకారం పురుషం విశ్వ ముకారే ప్రవిలాపయేత్। ఉకారం తైజసం సూక్ష్మం మకారే ప్రవిలాపయేత్॥ మకారం కారణం ప్రాజ్ఞం చిదాత్మని విలాపయేత్" ఇత్యాదికవచనములచేతఁ జెప్పఁబడి యున్నది.

మఱియు, పూర్వోక్తాధ్యారోపాపవాదము లను రెంటిచేతఁ దత్త్వంపదార్థశోధనమును సిద్ధించుచున్నది. ఆశోధనప్రకారము చూపఁబడుచున్నది. సమష్టిస్థూలశరీరమును సమష్టిసూక్ష్మశరీరమును మాయయును 1 క్రమముగా నీమూటిచే

నుపహితు లైన వైశ్వానరసూత్రాత్మేశ్వరులును 2 ఆసర్వమునకు నధిష్ఠానరూపనిరుపాధికాఖండచైతన్యమును 3 అను నీమూఁడును దప్తలోహపిండమువలె నేకరూపముగాఁ బ్రతీత మగునవై తత్పదవాచ్యార్థ మగుచున్నవి. సమష్టిస్థూలశరీరమును సూక్ష్మశరీరమును మాయయు నను నీసర్వముకన్న నన్వయవ్యతిరేకములచేతఁ బృథక్కుగా నిశ్చయింపఁబడిన యేయఖండచైతన్య మున్నదో ఆయఖండచైతన్యము తత్పదలక్ష్యార్థమై యున్నది. తత్పదార్థశోధనమున కుపాయభూతము లైనయన్వయవ్యతిరేకము లీప్రకార మగుచున్నవి. పంచీకృతస్థూలప్రపంచముయొక్క స్థితియవస్థయం దైననో స్థూలప్రపంచమునకు సాక్షిరూపమున నాపరమాత్మ విద్యమాన మగుచున్నది. పంచీకరణమునకుఁ బూర్వమం దైననో సూక్ష్మభూతములకును దానియొక్క కార్యములకును సాక్షిరూపమున నాపరమాత్మ విద్యమాన మగుచున్నది. ఆ యాకాశాది సూక్ష్మభూతములయొక్క యుత్పత్తికిఁ బూర్వము ప్రళయావస్థయం దైననో మాయకు సాక్షిరూపమున నాపరమాత్మ విద్యమాన మగుచున్నది. తత్త్వజ్ఞానముచేత మాయారూపాఽజ్ఞానము నివృత్త మగుటచేతను భోగమువలనఁ బ్రారబ్ధకర్మము నాశ మగుటచేతను ఈజీవునియొక్క వర్తమానశరీరపతనానంతరము విదేహముక్త్యవస్థయం దాపరమాత్మ యఖండస్వప్రకాశచైతన్యరూపమున విద్యమాన మగుచున్నది. ఇదియే యాతత్పదార్థరూపపరమాత్మయొక్క యన్వయము.

సమష్టిస్థూలశరీరమునకుఁ బంచీకరణమునకుఁ బూర్వము భానము లేదు. సమష్టిసూక్ష్మశరీరమున కాకాశాదిభూతములయొక్క యుత్పత్తికిఁ బూర్వము భానము లేదు. మాయకు ముక్త్యవస్థయందు భానము లేదు. ఇదియే యాసమష్టిస్థూలశరీరముయొక్కయు సమష్టిసూక్ష్మశరీరముయొక్కయు మాయయొక్కయు వ్యతిరేకము. ఈప్రకార మైన యన్వయవ్యతిరేకములచేత శోధింపఁబడిన తత్పదార్థ మగు కార్యసహితమాయాసంబంధరహితాఖండసచ్చిదానందస్వరూప పరమాత్మ తత్పదమునకు లక్ష్యార్థమై యున్నది.

## [*] (47) త్వం ప దా ర్థ శో ధ న ము. [*]

ఇఁకఁ ద్వంపదార్థశోధనము చెప్పఁబడుచున్నది. వ్యష్టిస్థూలశరీరమును వ్యష్టిసూక్ష్మశరీరమును ఈరెంటికిని గారణరూపావిద్యయును 1 క్రమముగా నాత్రివిధశరీరములతో నుపహితు లైన విశ్వతైజసప్రాజ్ఞులును 2 ఆసర్వమునకు నాధారరూపాఽనుపహితప్రత్యక్చైతన్యమును 3 అను నీమూఁడును దప్తలోహపిండమువలె నేకరూపముగాఁ బ్రతీత మగునవియై త్వంపదవాచ్యార్థ మగుచున్నవి. అన్వయవ్యతిరేకములచేత స్థూలసూక్ష్మకారణము లను త్రివిధశరీరములకన్నను వేఱుచేయఁబడిన యే

... స్వరూప ప్రత్యక్ చైతన్య మున్నదో అది త్వంపదలక్ష్యార్థమై యున్నది. ... శోధనయం దుపయుక్తము లైన యన్వయవ్యతిరేకములు పూర్వము చెప్పఁ బడియున్నవి. వాని నిచ్చటఁగూడఁ దెలియవలయును. ఇఁక శోధితతత్త్వంపదార్థముల ... మహావాక్యార్థవర్ణన చేయఁబడుచున్నది. అచ్చటఁ బూర్వము చెప్పఁబడిన ... లక్ష్యార్థశుద్ధచైతన్యమును త్వంపదలక్ష్యార్థశుద్ధచైతన్యమును ఈద్వివిధలక్ష్యార్థములను గ్రహించి త్రివిధసంబంధములతోఁ గూడినవై. తత్త్వమస్యాదిమహావాక్యములు లక్షణావృత్తిచేత నఖండార్థబోధకము లగుచున్నవి. అచ్చట సామానాధికరణ్యము విశేషణవిశేష్యభావము లక్ష్యలక్షణభావము అను త్రివిధసంబంధము మహావాక్యములకు సహకారులై యున్నవి. "తత్త్వమసి" యనువాక్యమందు తత్ త్వం అను రెండుపదము లున్నవో యారెంటికిని బరస్పరసామానాధికరణ్యసంబంధ మున్నది. ఆరెండుపదములయొక్క యర్థములకుఁ బరస్పరవిశేషణవిశేష్యభావసంబంధ మున్నది. మఱియు ఆరెండుపదములకు, లేక, ఆరెం డర్థములకు నఖండచైతన్యముతో లక్ష్యలక్షణభావసంబంధ మున్నది.

## (48) సామానాధికరణ్యవిశేషణవిశేష్యభావ లక్ష్యలక్షణభావ సంబంధములను నిరూపించుట.

ఇఁక నీమూఁడుసంబంధములు దృష్టాంతముచేత స్పష్టము చేయఁబడుచున్నవి. "భిన్నప్రవృత్తినిమిత్తానాం శబ్దానా మేకస్మి న్నర్థే వృత్తిః సామానాధికరణ్యమ్"—భావము। భిన్న భిన్న ప్రవృత్తులు నిమిత్తముగాఁ గలశబ్దముల కేకార్థమందు ప్రవృత్తి యున్నదో అదియే యాపదములకుఁ బరస్పరము గల సామానాధికరణ్యసంబంధము. ఉదా—"సోయం దేవదత్తః"—భావము॥ పూర్వము నీచే నేదేవదత్తుఁ డచట ప్రదేశమునందు చూడఁబడెనో వాఁ డీదేవదత్తుఁడు. ఈవాక్యమందు సః అనుశబ్దము తద్దేశకాలవిశిష్ట దేవదత్తునియొక్క వాచకమై యున్నది. అయంశబ్ద మైననో ఏతద్దేశకాలవిశిష్ట దేవదత్తునియొక్క వాచకమై యున్నది. ఆయొకఁడే దేవదత్తునియందు సః అనుశబ్దముయొక్క ప్రవృత్తి కైననో తద్దేశకాలవిశిష్టత్వము నిమిత్తము, అయంశబ్దముయొక్క ప్రవృత్తికి నేతద్దేశకాలవిశిష్టత్వము నిమిత్తము. సోయ మనురెండుశబ్దములు భాగత్యాగలక్షణచేతఁ దద్దేశకాలవిశిష్టత్వాంశమును ఏతద్దేశకాలవిశిష్టత్వాంశమును బరిత్యాగము చేసి యాయొకటే దేవదత్తపిండమును బోధించుచున్నవి. ఇదియే సోఽయ మ్మను రెండుశబ్దములకుఁ బరస్పరసామానాధికరణ్యసంబంధము.

మఱియు "సోఽయం దేవదత్తః" అను నుక్తవాక్యమునందే స శబ్దార్థమైన తద్దేశకాలవిశిష్టత్వమును అయంశబ్దార్థ మైన యేతద్దేశకాలవిశిష్టత్వమును

నైన యాద్వివిధార్థములకుఁ బరస్పరభేదమును నివర్తించునట్టి విశేషణవిశేష్యభావ సంబంధ మున్నది. అచ్చట "సో ఽయ" మ్మనువాక్యప్రయోగమునం దైననో స శబ్దార్థము విశేష్యమై యున్నది. అయంశబ్దార్థము విశేషణమై యున్నది. అయం సః అనువాక్యప్రయోగమందో అయంశబ్దార్థము విశేష్యమై యున్నది. సశబ్దార్థము విశేషణమై యున్నది. సోఽయం దేవదత్తః అనువాక్యమం దుండు సః అయం అను రెండుశబ్దములయొక్క భాగత్యాగలక్షణచేత తద్దేశకాలవిశిష్టత్వైతద్దేశకాలవిశిష్టత్వ ము లను ద్వివిధవిరోధ్యంశములను బరిత్యాగము చేసి యవిరుద్ధ దేవదత్తపిండమాత్ర మైన కావాక్యముచే బోధ యగుచున్నది. అందువలన నాదేవదత్తపిండమాత్రమే సోఽయ మ్మనువాక్యముయొక్క లక్ష్యార్థమై యున్నది. అట్టి వాక్యార్థరూపలక్ష్య దేవ దత్తునితో సోఽయ మ్మను రెండుపదములకును ఆపదములయొక్క యర్థములకును లక్ష్యలక్షణభావసంబంధ మున్నది. అచ్చట తెలియఁజేయునది లక్షణమై యున్నది. తెలియుటకు యోగ్య మైనయర్థము లక్ష్యమై యున్నది. సోఽయ మ్మను రెండుపదముల చేత, లేక, యీరెండుపదములయొక్క యర్థములచేత నాదేవదత్తపిండము తెలియఁ జేయఁబడు చున్నది. అందువలన నాపదములును అర్థములును లక్షణములై యున్నవి. ఆదేవదత్తపిండము లక్ష్యమై యున్నది.

ఇఁక, తత్త్వమస్యాదిమహావాక్యములయం దాత్రివిధసంబంధములు ఘటి ల్లఁజేయఁబడు చున్నవి. "తత్త్వ మసి" యను మహావాక్యమునందుండు తత్పదమో పరోక్షత్వ సర్వజ్ఞత్వాది ధర్మవిశిష్టేశ్వరచైతన్యముయొక్క వాచకము. త్వంపదము అపరోక్షత్వాల్పజ్ఞత్వాది ధర్మవిశిష్టజీవచైతన్యముయొక్క వాచకము. అచ్చటఁ బరో క్షత్వాదిధర్మవిశిష్టత్వ మైననో తత్పదముయొక్క ప్రవృత్తికి నిమిత్తమై యున్నది. అప రోక్షత్వాదిధర్మవిశిష్టత్వము త్వంపదముయొక్క ప్రవృత్తికి నిమిత్తమై యున్నది. అందు వలన తత్ త్వ మ్మనుపదద్వయములయొక్క ప్రవృత్తికి నిమిత్తములు భిన్నభిన్నములే యగుచున్నవి. తత్త్వ మ్మను రెండుపదములు భాగత్యాగలక్షణచేత నేకాఖండచైత న్యముయొక్క బోధక మగుచున్నవి. ఇదియే యాతత్త్వంపదములకుఁ బరస్పరసామా నాధికరణ్యసంబంధము. తత్పదార్థరూపేశ్వరచైతన్యమునకును త్వంపదార్థరూపజీవ చైతన్యమునకును బరస్పరభేదభ్రమను నివర్తించునట్టి విశేషణవిశేష్యభావసంబంధ మున్నది. తత్త్వ మసి అనువాక్యప్రయోగమం దైననో యాతత్పదార్థము విశేష్యమై యున్నది. త్వంపదార్థము విశేషణమై యున్నది. "త్వం తదసి" యనువాక్యప్ర యోగమందో త్వంపదార్థము విశేష్యమై యున్నది. తత్పదార్థము విశేషణమై యు న్నది. ఈప్రకారముగాఁ దత్త్వంపదార్థముల రెంటికిని బరస్పరాభేదముగా విశేషణ

విశేష్యభావన చేయుటవలన నారెంటికిని గల భేదభ్రమ నివర్తిల్లుచున్నది. తత్త్వమ్మను రెండు పదములకును ఆపదద్వయమున కర్థ మైన యీశ్వరజీవులకును వాక్యార్థభూతాఽఖండచైతన్యముతో లక్ష్యలక్షణభావసంబంధ మున్నది. తత్త్వంపదములును ఆపదముల యొక్క యర్థములును పరోక్షత్వాపరోక్షత్వాదివిరుద్ధాంశములను భాగత్యాగము చేసి యవిరుద్ధాఖండచైతన్యమాత్రమునే బోధించుచున్నవి. అందువలన నాపదములయందును ఆపదముల యొక్క యర్థములయందును లక్షణారూపత్వమున్నది. ఆయఖండచైతన్యమందు లక్ష్యరూపత్వ మున్నది. ఉక్తత్రివిధసంబంధములే యన్యగ్రంథములయందు "సామానాధికరణ్యంచ విశేషణవిశేష్యతా । లక్ష్యలక్షణభావశ్చ పదార్థ ప్రత్యగాత్మనామ్" అను శ్లోకముచేతఁ జెప్పఁబడి యున్నవి.

శంక:—అన్య వేదాంతగ్రంథములయందుఁ దత్త్వమస్యాదివాక్యములకు భాగత్యాగలక్షణచేత నఖండచైతన్యము యొక్క బోధకత్వము చెప్పఁబడియున్నది. ఇచ్చట మీచే లక్ష్యలక్షణభావసంబంధముచేత నఖండచైతన్యము యొక్క బోధకత్వము చెప్పఁబడియున్నది. అందువలన నాగ్రంథములతో నీగ్రంథమునకు విరోధమగును.

సమాధానము:—లక్ష్యలక్షణభావము భాగత్యాగలక్షణ అను నీరెంటికిని నామమాత్రముచేత భేదము. అర్థముచేత భేదము లేదు. అందువలన నది విరోధమగుట లేదు. ఈ యభిప్రాయముచేత వాక్యవృత్తి యనుగ్రంథమునం దాచార్యులచేతఁ దత్త్వమస్యాదివాక్యములకు భాగత్యాగలక్షణచేత నఖండార్థము యొక్క బోధకత్వము చెప్పఁబడి యున్నది. "శ్లో. తత్త్వ మస్యాదివాక్యంచ తాదాత్మ్య ప్రతిపాదనే। లక్ష్యౌ తత్త్వం పదార్థౌ ద్వా వుపాదాయ ప్రవర్తతే"—భావము॥ తత్త్వమస్యాదిమహావాక్యములు తత్ త్వ మ్మనుపదముల యొక్క లక్ష్యార్థములను గొనియే యఖండస్వరూపము యొక్క ప్రతిపాదనమందుఁ బ్రవృత్తము లగుచున్నవి.

మఱియు నెట్లు లోకమందు "ఘటమానయ, నీలోత్పలమ్" ఇత్యాదివాక్యములు పదార్థముల యొక్క సంసర్గమునకు లేక విశిష్టార్థమునకు బోధకము లగుచున్నవో, అట్లు తత్త్వమస్యాదివాక్యములు సంబంధరూపసంసర్గమునకుఁ గాని విశిష్టార్థమునకుఁ గాని బోధక మగుట లేదు. మఱి యే మనఁగా, ఏకాఖండబ్రహ్మస్వరూపమునకే బోధక మగుచున్నవి. ఈయర్థము గూడ నావాక్యవృత్తిగ్రంథమునం దాచార్యులచేతఁ జెప్పఁబడియున్నది. అచ్చట, "శ్లో. సంసర్గోవా విశిష్టోవా వాక్యార్థో నాత్రసమ్మతః। అఖండైకరసత్వేన వాక్యార్థో విదుషాం మతః"—భావము॥ వేదాంతశాస్త్రమందుఁ దత్త్వమస్యాదివాక్యములకు సంసర్గవాక్యార్థము గాని విశిష్ట

వాక్యార్థము గాని సమ్మతము గాదు. ఇక నే మనఁగా, అఖండైకరసబ్రహ్మమే వాక్యార్థ మని విద్వాంసులకు సమ్మతమై యున్నది.

శంక:—నే నీశ్వరుఁడు కా నను నెల్లరయొక్క ప్రత్యక్షము జీవేశ్వరుల యొక్క భేదమునే విషయము చేయుచున్నది. అట్లే "ద్వా సుపర్ణా సయుజా సఖాయా" ఇత్యాదిశ్రుతులును ఆజీవేశ్వరులయొక్క భేదమునే ప్రతిపాదించుచున్నవి. అందువలనఁ బ్రత్యక్షమునకును శ్రుతికిని విరుద్ధ మగు నఖండార్థము నామహావాక్యము లెట్లు ప్రతిపాదించును?

సమాధానము:—"తత్త్వ మసి, అహం బ్రహ్మాస్మి, అయ మాత్మా బ్రహ్మ, ప్రజ్ఞానం బ్రహ్మ" ఇత్యాదికబహుతరశ్రుతులయందు జీవేశ్వరులయొక్క యభేదమే చెప్పఁబడి యున్నది. ఆశ్రుతులకు విరుద్ధ మగుటవలనఁ బూర్వోక్తప్రత్యక్షము భ్రమరూపమే యగును. చంద్రుని స్వల్పపరిమాణునిఁగా విషయము చేయు లోకుల ప్రత్యక్ష మెట్లాచంద్రునకు మహాపరిమాణముఁ జెప్పునట్టిజ్యోతిషశాస్త్రమునకు విరుద్ధ మగుటవలన భ్రమరూప మగుచున్నదో; అట్లు భేదవిషయకప్రత్యక్షమును ఆ యభేదబోధకశ్రుతికి విరుద్ధ మగుటవలన భ్రమరూపమే యగును.

మఱియు నావాది జీవాత్మయం దీశ్వరునియొక్క యభేద మంగీకరించి నాఁడో ఆభేదము ధర్మాధర్మములవలెఁ బ్రత్యక్షయోగ్యమే కాదు. ఏల యన. చక్షురాదికబాహ్యేంద్రియములచేత నైననో, బాహ్యరూపాదులయొక్క ప్రత్యక్షమే యగుచున్నది. ఆత్మ గాని యాత్మవృత్తిధర్మములు గాని యాచక్షురాదీంద్రియములచేతఁ బ్రత్యక్ష మగుట లేదు. అందువలన నాభేదము చక్షురాదీంద్రియములచేతఁ బ్రత్యక్ష మనుట సంభవించుట లేదు. మఱియు మనస్సునం దైననో యింద్రియరూపత్వమే సంభవించుట లేదు. అందువలన మనస్సుచేతను నాభేదముయొక్క ప్రత్యక్షము సంభవింపదు. భేదమును సాక్షిభాస్య మని యంగీకరించినయెడల స్వప్నపదార్థములవలె నాభేదము ప్రాతీతికము గావలయును. అట్టిభేదప్రతీతివిషయకప్రత్యక్షముచే నభేద బోధకశ్రుతికి బాధ సంభవించుట లేదు. ఇక నే మనఁగా. దానికి విపరీతముగా నా శ్రుతిచేత నాప్రత్యక్షమునకే బాధ సంభవించును. అందువలన జీవేశ్వరులయొక్క భేదము ప్రత్యక్షముగా సిద్ధించుట లేదు. "ద్వా సుపర్ణా" ఇత్యాదిశ్రుతులకు జీవేశ్వరులయొక్క భేదమునందుఁ దాత్పర్యము లేదు. మఱి యే మనఁగా లోకసిద్ధభేదము యొక్క యనువాదముచేత నాశ్రుతికి నఖండబ్రహ్మమునందే తాత్పర్యము. ఎట్లనఁగా, ఏయర్థముయొక్క జ్ఞాన మిష్టఫలప్రాప్తిని జేయునదియును ఏయర్థము ప్రత్యక్షాది ప్రమాణములచేత నజ్ఞాత మయ్యు నున్నదో యాయర్థమునందే శ్రుతికిఁ దాత్పర్య

ఈప్రకారముగా సర్వానాత్మపదార్థములు నుక్తత్రివిధభేదసహితములే యగును. బ్రహ్మమునం దుక్తత్రివిధభేదములయం దేప్రకారమైనభేదమును సంభవించుట లేదు. అది చూపఁబడుచున్నది. బ్రహ్మమునకు భిన్నముగా నేదైన నొకవస్తువు సత్యముగా నుండినయెడల బ్రహ్మమునందు విజాతీయభేదము సిద్ధించును. బ్రహ్మమునకు భిన్నముగా నొకవస్తువును సత్యము గాదు. మఱి యే మనఁగా నవిద్యాసహిత సర్వకార్యప్రపంచము నధిష్ఠానబ్రహ్మమునందుఁ గల్పిత మగుటవలన మిథ్యయే యగును. అందువలన బ్రహ్మమునందు విజాతీయభేదము సంభవించుట లేదు. బ్రహ్మమునకు సజాతీయముగా నేదైన నొకవస్తు వుండినయెడల బ్రహ్మమునందు సజాతీయభేదము సిద్ధ మగును. బ్రహ్మమునకు సజాతీయముగా నే యొకవస్తువు లేదు. జీవుఁడు బ్రహ్మమునకు సజాతీయుఁ డని చెప్పినయెడల నదియు సంభవించుట లేదు. ఏల యన. తత్త్వ మసి, అహం బ్రహ్మాస్మి, అయ మాత్మా బ్రహ్మ, క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి" ఇత్యాదిశ్రుతిస్మృతులచేత జీవబ్రహ్మములరెంటికిని నత్యంతైకత్వము చెప్పఁబడి యున్నది. సజాతీయత్వ మైననో భిన్నవస్తువునందుఁ గలుగుచున్నది. అభిన్నవస్తువునందు సజాతీయత్వము కలుగుట లేదు. అందువలన బ్రహ్మమునందు సజాతీయభేదమును సంభవించుట లేదు. బ్రహ్మమునందు అవయవ గుణ క్రియా జాతి సంబంధములను నయిదింటియం దేదైన నొకటి యుండినయెడల బ్రహ్మమునందు స్వగతభేదము సిద్ధించును. ఆ యైదింటియం దొకధర్మమును బ్రహ్మమునందు లేదు. ఏకారణముచేత ననఁగా "నిష్కలం నిష్క్రియం శాంతమ్, నిరవద్యం నిరంజనమ్, సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ, అసంగో హ్యాయం పురుషః, నిత్యః సర్వగతః స్థాణు రచలో ఽయం సనాతనః" ఇత్యాదిశ్రుతిస్మృతులచేత బ్రహ్మమునం దయవయవాది పంచకము నిషేధింపఁబడి యున్నది. అందువలన బ్రహ్మమునందు స్వగతభేదమును సంభవించుట లేదు. అట్టి పూర్వోక్తత్రివిధభేదరహితత్వమే బ్రహ్మమునం దఖండత్వమై యున్నది.

అచ్చట, ఏక స్వగతభేదరహితత్వమే యఖండత్వ మనినయెడల సాంఖ్యులయొక్కయాత్మయం దాయఖండత్వముయొక్కలక్షణమున కతివ్యాప్తి యగుచున్నది. ఏకారణముచేత ననఁగా, సాంఖ్యమతానుసారులును ఆయాత్మను నవయవ గుణ క్రియా జాతి సంబంధము లైదును లేనిదానినిగానే యంగీకరించి యున్నారు. ఆ యతివ్యాప్తిదోషమును నివర్తించుటకొఱకు నాలక్షణమునందు సజాతీయభేదరహితత్వము చెప్పఁబడినది. సాంఖ్యమతస్థులు నానాయాత్మల నంగీకరించుచున్నారు. అందువలన వారిమతమునం దాత్మ సజాతీయభేదరహితము కాదు. మఱి యే మనఁ

గా, సజాతీయభేదసహితముగానే యున్నది. కావున నాయాత్మయం దతివ్యాప్తి కలుగుట లేదు. లేక, సజాతీయ స్వగతాఖ్య ద్వివిధభేదరహితత్వమే యఖండత్వ మనినయెడల నాకాశమునం దాలక్షణమున కతివ్యాప్తి యగుచున్నది. ఎట్లనఁగా నాకాశ మేక మైనందువలన సజాతీయభేదరహితమును నిరవయవము నిష్క్రియము నగుటవలన స్వగతభేదరహితము నగుచున్నది. ఆ యతివ్యాప్తిదోషమును నివర్తించుటకొఱకు లక్షణమునందు విజాతీయభేదరహితత్వము చెప్పఁబడినది. ఆయాకాశము విజాతీయభేదరహితము కాదు. ఇఁక నేమనఁగా, పృథివ్యాది విజాతీయపదార్థభేదసహితమే యగును. అందువలన నాయాకాశమునం దాలక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు. లేక, ఏకవిజాతీయభేదరహితత్వమే యఖండత్వ మనినయెడల బ్రహ్మమునందు సజాతీయస్వగతము లను ద్వివిధభేదములు ప్రాప్తము లగును. దానివలన "ఏక మేవా ద్వితీయం బ్రహ్మ" అనుశ్రుతికి విరోధ మగును. ఆశ్రుతివిరోధము నివర్తించుటకొఱకు లక్షణమునందు సజాతీయభేదరహితత్వము చెప్పఁబడినది. బ్రహ్మమునం దేకరసత్వమును సిద్ధింపఁజేయుటకొఱకు స్వగతభేదరహితత్వము చెప్పఁబడినది. లేక, ఆయఖండత్వమున కీలక్షణము చెప్పవలయును. "త్రివిధ పరిచ్ఛేద శూన్యత్వ మఖండత్వమ్" — భావము॥ దేశపరిచ్ఛేదము కాలపరిచ్ఛేదము వస్తుపరిచ్ఛేదము ఏత త్త్రివిధపరిచ్ఛేదరహితత్వము బ్రహ్మమునం దఖండత్వమై యున్నది.

### [*] (50) దేశకాలవస్తుపరిచ్ఛేదకథనము. [*]

ఇఁక, బ్రహ్మమునందుఁ త్రివిధపరిచ్ఛేదరహితత్వము చూపుటకొఱకు మొదట ననాత్మవస్తువులయం దాత్రివిధపరిచ్ఛేదములు చూపఁబడుచున్నవి. అత్యంతాభావమునకుఁ బ్రతియోగిత్వము దేశపరిచ్ఛేద మనఁబడును. ఉదా—ఘటత్వాదిధర్మములకుఁ బటాదులయం దత్యంతాభావ మున్నది. ఆ యత్యంతాభావమునకుఁ బ్రతియోగిత్వ మాఘటత్వాదిధర్మములయం దున్నది. ఇదియే యాఘటత్వాదిధర్మములయందు దేశపరిచ్ఛేదము. ప్రాగభావప్రధ్వంసాభావములకుఁ బ్రతియోగిత్వము కాలపరిచ్ఛేద మనఁబడును. ఉదా—ఘటమునకుఁ దనయుత్పత్తికిఁ బూర్వము తనయుపాదానకారణరూపకపాలమందుఁ బ్రాగభావ మున్నది. అట్లే తననాశమునకనంతర మాకపాలములయందుఁ బ్రధ్వంసాభావ మున్నది. ప్రాగభావప్రధ్వంసాభావములకుఁ బ్రతియోగిత్వ మాఘటమునం దున్నది. ఇదియే ఘటమునందుఁ గాలపరిచ్ఛేదము. అన్యోన్యాభావమునకుఁ బ్రతియోగిత్వము వస్తుపరిచ్ఛేద మనఁబడును. ఉదా—ఘటమునకుఁ బటమునందు భేద మున్నది, పటమున కాఘటమునందు భేద మున్నది. ఆభేదరూపాఽన్యోన్యాభావమునకుఁ బ్రతియోగిత్వ మాఘటపటములయం

యున్నది. ఇదియే యాగుటపటాదులయందు వస్తుపరిచ్ఛేదము. ఈప్రకారముగా సర్వానాత్మపదార్థములు నుక్తత్రివిధపరిచ్ఛేదసహితములై యున్నవి.

బ్రహ్మమునం దుక్తత్రివిధపరిచ్ఛేదములలో నేవిధపరిచ్ఛేదమును లేదు. అది చూపఁబడు చున్నది. అచ్చట "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః, మహాతో మహీయాన్" ఇత్యాదిశ్రుతులు బ్రహ్మమును విభు వని చెప్పుచున్నవి. విభుద్రవ్యమున కొకస్థానమందును అత్యంతాభావము కలుగుట లేదు. అందువలన బ్రహ్మమునందు దేశపరిచ్ఛేదము సంభవింపదు. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, నజాయతే మ్రియతే వా కదా చిత్" ఇత్యాదిశ్రుతులు బ్రహ్మము నుత్పత్తివినాశరహితనిత్య మని చెప్పుచున్నవి. నిత్యవస్తువునకుఁ బ్రాగభావప్రధ్వంసాభావములు గలుగవు. అందువలన బ్రహ్మమునందుఁ గాలపరిచ్ఛేదమును సంభవింపదు. మఱియు స్వప్నపదార్థములవలె సర్వజగత్తును బ్రహ్మమునం దారోపితి మగుటవలన మిథ్య యగును. ఆరోపితమిథ్యావస్తు వధిష్ఠానమునకన్న భిన్నసత్తాసహితము కాదు. అందువలన నధిష్ఠానబ్రహ్మమే సర్వజగత్తునకును ఆత్మరూపమై యున్నది. ఈకారణముచేత బ్రహ్మమునందు వస్తుపరిచ్ఛేదమును సంభవింపదు. శ్రుతి "వేదాహమేత మజరం పురాణం సర్వాత్మానం సర్వగతం విభుత్వాత్"—భావము॥ ఏబ్రహ్మము, అజరమును పురాణమును సర్వాత్మరూపమును విభు వగుటవలన సర్వగతియునై యున్నదో యట్టిబ్రహ్మమును నేను అపరోక్షముగాఁ దెలియుచున్నాను.

మఱియుఁ గల్పతరుగ్రంథమునకుఁ గర్త లగు నాచార్యులైనవో ఆ యఖండత్వమున కీలక్షణము చెప్పి యున్నారు. "అపర్యాయానేకశబ్దప్రకాశ్యత్వే సతి అవిశిష్టత్వ మఖండత్వమ్"—భావము॥ అపర్యాయములును అనేకములు నైన శబ్దములచే నేవస్తువు ప్రకాశితమును విశిష్టభావరహితమును నై యున్నదో, యా వస్తు నఖండ మనఁబడును. అచ్చట, "తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి" ఇత్యాది మహావాక్యములయం దుండు తత్ త్వమ్ మొదలగుశబ్దములు వాచ్యార్థభేదముచేత నపర్యాయములును ననేకములును నగును. అట్టిశబ్దములచేత బ్రహ్మము ప్రకాశితమును విశిష్టభావరహితము నగును. ఇదియే బ్రహ్మమునం దఖండత్వమై యున్నది. అచ్చట ఘటః కలశః అను ననేకశబ్దములచేత యద్యపి ఘటము ప్రకాశిత మగుచున్నది. తథాపి, ఆశబ్దము లపర్యాయములు కావు. ఇఁక నే మనఁగాఁ బర్యాయములే యగును. నీల ముత్పలమ్ అను నపర్యాయానేకశబ్దములచేత యద్యపి యుత్పలము ప్రకాశిత మగుచున్నది. తథాపి, ఆయుత్పలము విశిష్టభావరహితము కాదు. మఱి యే మనఁగా నీలగుణవిశిష్టమే యగును. అందువలన ఘటనీలోత్పలముల కఖండ

...భాగత్యాగలక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు. యద్యపి "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" ఇత్యాదిశ్రుతులు బ్రహ్మమును మనోవాక్కుల కగోచర మని చెప్పి యున్నవి. అందువలన బ్రహ్మమునందు సాక్షాచ్ఛబ్దప్రకాశ్యత్వము సంభవించుట లేదు. తథాపి, వాచ్యార్థభూత మాయాంతఃకరణద్వారమున లక్షణావృత్తిచేత బ్రహ్మమునందు శబ్దప్రకాశ్యత్వము సంభవించు చున్నది. ఒకవేళ లక్షణావృత్తిచేతను బ్రహ్మమునందు శబ్దప్రకాశ్యత్వ మంగీకరింపనియెడల, "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి"—భావము॥ ఉపనిషద్రూపశబ్దప్రమాణముచేతఁ దెలియుటకు యోగ్యమైన యాపరమాత్మయొక్కస్వరూపమును నేను మిమ్ముఁ బ్రశ్నించుచున్నాను. అనుశ్రుతికి విరోధము ప్రాప్త మగును. అందువలనఁ దత్త్వమస్యాదిమహావాక్యములు తత్ త్వం పదములయొక్కలక్ష్యార్థగ్రహణముచేత నాయఖండస్వరూపప్రతిపాదనమునందుఁ బ్రవృత్త మగుచున్న వను నుక్తార్థము సర్వదోషరహితమై యున్నది.

శంక:—ఉక్తరీతిగాఁ దత్త్వమస్యాదివాక్యము లాయఖండార్థముయొక్కబోధక మగుఁ గాక. అయినను ఆయఖండార్థముయొక్కబోధచేత నధికారిపురుషులకు ఫల మేమి?

సమాధానము:—శ్రోత్రియబ్రహ్మనిష్ఠగురువు ఎప్పుడీయధికారిపురుషుని గూర్చి తత్త్వమస్యాదిమహావాక్యముల నుపదేశించు చున్నాఁడో అప్పుడీయధికారి పురుషునకు భాగత్యాగలక్షణచేత మాయాంతఃకరణాది వాచ్యభాగపరిత్యాగపూర్వకముగా నాయఖండబ్రహ్మముయొక్కజ్ఞానము కలుగుచున్నది. అనఁగా, అహం బ్రహ్మాస్మి, బ్రహ్మైవాహ మస్మి అను నీరీతిగాఁ బరస్పరాభేదవిషయకాఽపరోక్షజ్ఞానము కలుగుచున్నది. అప్పుడు, "అహం బ్రహ్మాస్మి" యనువృత్తి యైననో అహంపదార్థప్రత్యగాత్మయందు బ్రహ్మముయొక్కయభేదమును విషయము చేయుచున్నది. "బ్రహ్మైవాహ మస్మి" అనువృత్తి యైననో బ్రహ్మమునందుఁ బ్రత్యగాత్మయొక్కయభేదమును విషయము చేయుచున్నది. అహంపదార్థ మగు ప్రత్యక్చైతనమునందు సర్వులకును అపరోక్షత్వమును ఆత్మత్వమును సిద్ధ మగుచున్నది. అయినను బ్రహ్మమును బరోక్షమనియు ననాత్మ యనియు నంగీకరించు చున్నారు. ఎప్పుడు ప్రత్యగాత్మయందు బ్రహ్మముయొక్కయభేదమును విషయము చేయునట్టి అహం బ్రహ్మాస్మి యను నపరోక్షజ్ఞాన[illegible]జ్ఞానముచేత బ్రహ్మముయొక్కపరోక్షత్వమును అనాత్మత్వమును నివృత్త మగుచున్నది. మఱియు జీవాత్మను లోకులు పరిచ్ఛిన్న మనియు నబ్రహ్మరూప మనియు నంగీకరించు చున్నారు. ఎప్పుడు బ్రహ్మమునందు

జీవాత్మయొక్కయభేదమును విషయము చేయునట్టి "బ్రహ్మైవాహమస్మి" యను నపరోక్షజ్ఞానము కలుగుచున్నదో అప్పు డాజ్ఞానముచేత జీవాత్మయొక్క పరిచ్ఛిన్నత్వమును అబ్రహ్మత్వమును నివృత్త మగుచున్నది. అందువలన నధికారిపురుషుఁడు బ్రహ్మమునందుఁ బరోక్షత్వానాత్మత్వశంకానివృత్తికొఱకును దనయాత్మయందుఁ బరిచ్ఛిన్నత్వాబ్రహ్మత్వశంకానివృత్తికొఱకును "అహం బ్రహ్మాస్మి, బ్రహ్మైవాహమస్మి" అని యీరీతిగా నాత్మబ్రహ్మలకుఁ బరస్పరాభేదనిశ్చయము చేయవలయును.

ఈప్రకారముగాఁ దత్త్వమస్యాది మహావాక్యజన్యాఖండబ్రహ్మాకారాపరోక్షవృత్తి యేది గలదో యాయపరోక్షవృత్తిరూపజ్ఞానముచేతఁ గార్యప్రపంచసహితాజ్ఞానరూపానర్థనివృత్తి కలిగి యీప్రత్యగాత్మ యఖండైకరసబ్రహ్మానందరూపముచేత స్థితము నగుచున్నది. శ్రుతి.—"తరతి శోకమాత్మవిత్, బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి"—భావము॥ ఆత్మసాక్షాత్కారము గలపురుషుఁడు సర్వానర్థరూపశోకమును నాశము చేయుచున్నాఁడు. మఱియు "అహం బ్రహ్మాస్మి" యని బ్రహ్మమును దనయాత్మరూపముగాఁ దెలియువిద్వాంసుఁడు బ్రహ్మరూపుఁడే యగుచున్నాఁడు. ఇత్యాద్యనేకశ్రుతులు బ్రహ్మవేత్త యగుపురుషునకు బ్రహ్మసాక్షాత్కారముచేత నజ్ఞాననివృత్తి బ్రహ్మానందప్రాప్తిరూపఫలమును జెప్పి యున్నవి.

ఇది శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీస్వామ్యుద్ధవానందగిరిపూజ్య
పాదశిష్య స్వామి చిద్ఘనానందగిరి విరచిత ప్రాకృత తత్త్వాను
సంధానముయొక్క ప్రథమపరిచ్ఛేదము సమాప్తము.
శ్రీ కృష్ణార్పణమస్తు.



ఓమ్.

శ్రీగణేశాయ నమః.

శ్రీశంకరాచార్యేభ్యో నమః.

# తత్త్వానుసంధానము

## ద్వితీయపరిచ్ఛేదము.

తత్త్వమస్యాదివాక్యములచే జన్య మైన యఖండబ్రహ్మమును విషయముగా నొనర్చి యపరోక్షవృత్తిచేత నీయధికారిపురుషున కజ్ఞాననివృత్తియును బరమానంద ప్రాప్తియును గలుగుచున్నది. ఈయర్థము పూర్వము ప్రథమపరిచ్ఛేదాంతమునందుఁ జెప్పఁబడినది. దానియం దీజిజ్ఞాస కలుగుచున్నది. ఆవృత్తియొక్క స్వరూప మేది? ఆవృత్తియందుఁ బ్రమాణ మేది? ఆవృత్తి యేప్రకారముగా నుత్పన్న మగుచున్నది? ఆవృత్తివలనఁ బ్రయోజన మేమి సిద్ధించుచున్నది? అను జిజ్ఞాస ప్రాప్తింపఁగా ప్రమ అప్రమ అనుభేదముచేత ద్వివిధము లగువృత్తులను నిరూపించుటకొఱకు మొదట నావృత్తియొక్క సామాన్యలక్షణము చెప్పఁబడుచున్నది.

శంక:—ప్రమాణముచేతనే ప్రమేయము సిద్ధ మగుచున్నది. అందువలన గ్రంథమునందు మొదటఁ బ్రమాణమునే నిరూపించి యనంతరము ప్రమేయనిరూపణ చేయవలయును. ఈకారణముచేతనే న్యాయశాస్త్రమందు మొదటఁ బ్రమాణనిరూపణ చేసి యనంతరము ప్రమేయనిరూపణ చేయఁబడియున్నది. మీచేత నైననో ప్రథమపరిచ్ఛేదమునందు బ్రహ్మాత్మరూపప్రమేయనిరూపణముచేసి యీద్వితీయపరిచ్ఛేదమునందుఁ బ్రమాణనిరూపణ చేయఁబడుచున్నది. అందువలన మీ నిరూపణము సర్వశాస్త్రవిరుద్ధమై యున్నది.

సమాధానము:—న్యాయాద్యన్యశాస్త్రములయందుఁ బ్రమేయము జడ మగుటవలన నాప్రమేయము ప్రమాణముయొక్క యధీనముగానే సిద్ధించుచున్నది. అందువలన నాయన్యశాస్త్రములయం దైననో మొదట ప్రమాణనిరూపణ చేసియే యనంతరము ప్రమేయనిరూపణ చేయుట యుచితము. ఈవేదాంతశాస్త్రమం దైననో సర్వప్రమాణాదివ్యవహారములకు సాధక మైన యద్వితీయాత్మరూపసాక్షిచైతన్యమే ప్రమేయమై యున్నది. అందువలన ఈవేదాంతశాస్త్రమునం దైననో

మొదటఁ జైతన్యరూపప్రమేయనిరూపణ చేసియే యనంతర మాప్రమాణాదుల యొక్కనిరూపణ చేయుట యుచితమై యున్నది.

ఈయర్థము సంక్షేపశారీరక మనుగ్రంథమునందు శ్రీసర్వజ్ఞమహామునుల చేతను జెప్పఁబడి యున్నది. "శ్లో. మానేన మేయావగతిశ్చ యుక్తా ధర్మస్య జాడ్యా ద్విధినిష్ఠకాండే । మేయేన మానావగతిస్తు యుక్తా వేదాంతవాక్యే ష్వజడం హి మేయమ్"—భావము॥ పూర్వమీమాంసయందు ధర్మాదిరూపప్రమేయము జడ మగుటవలన నాప్రమేయముయొక్కసిద్ధి ప్రమాణముచేత యుక్తమై యున్నది. వేదాంతశాస్త్రమందు బ్రహ్మాత్మరూపప్రమేయము చేతన మగుటవలన నాప్రమేయము యొక్కసిద్ధి ప్రమాణముచేత యుక్తము కాదు. మఱే మనఁగా, చేతనప్రమేయము చేతనే జడప్రమాణముయొక్కసిద్ధి యుక్తమై యున్నది.

[*] (1) వృత్తియొక్కసామాన్యలక్షణము. [*]

ఇఁక నావృత్తియొక్కసామాన్యలక్షణము చెప్పఁబడుచున్నది. "విషయ చైతన్యాభివ్యంజకో ఽంతఃకరణాజ్ఞానయోః పరిణామవిశేషః వృత్తిః"—భావము॥ ఘటపటాదిరూపవిషయావచ్ఛిన్న చైతన్య మేది గలదో అది విషయచైతన్య మనఁ బడును. ఆవిషయచైతన్యముయొక్కయభివ్యంజక మైన అంతఃకరణముయొక్క లేక అజ్ఞానముయొక్కపరిణామవిశేషము వృత్తిజ్ఞాన మనఁబడును. యద్యపి క్రోధేచ్ఛా సుఖదుఃఖాదికములును అంతఃకరణముయొక్కపరిణామములై యున్నవి. అట్లే ఆకాశాదులును అజ్ఞానముయొక్కపరిణామములై యున్నవి. తథాపి, ఆక్రోధాదికము లయం దావిషయచైతన్యముయొక్కయభివ్యంజకత్వము లేదు. అందువలన, "విషయ చైతన్యాభివ్యంజకః" అనుపదమును జెప్పుటవలనఁ గ్రోధాదికములయందు వృత్తి యొక్కలక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు. యద్యపి, చక్షురాదీంద్రియములును స్వజన్యవృత్తిద్వారమున నావిషయచైతన్యముయొక్కయభివ్యంజకమే యగుచున్నవి. తథాపి, ఆచక్షురాదీంద్రియము లంతఃకరణముయొక్క, లేక, అజ్ఞానముయొక్కపరిణామములు కావు. ఇఁక నేమనఁగా, తేజఆదిభూతములయొక్కపరిణామములే యగును. అందువలన నంతఃకరణముయొక్క, లేక, అజ్ఞానముయొక్కపరిణామ మనుటవలన ఆచక్షురాదీంద్రియములయం దావృత్తియొక్కలక్షణమున కతివ్యాప్తి కలుగదు. అతివ్యాప్తి అవ్యాప్తి అసంభవము అను త్రివిధదోషములయొక్కస్వరూపము ప్రథమ పరిచ్ఛేదమునందుఁ జెప్పఁబడి యున్నది. దాని నిచ్చటను దెలియవలయును.

పూర్వము వృత్తియందు విషయచైతన్యముయొక్కయభివ్యంజకత్వము చెప్పఁబడియున్నది. ఆయభివ్యంజకత్వ మేది యనుశంక కలుగఁగా, ఇప్పు డాయభి

వ్యంజకత్వముయొక్క లక్షణము చెప్పఁబడుచున్నది. "అపరోక్షవ్యవహారజనకత్వమ్ అభివ్యంజకత్వమ్" — భావము॥ "అయం ఘటః, అయం పటః" అను నపరోక్ష వ్యవహారజనకత్వమే ఆవృత్తులయందు విషయచైతన్యముయొక్క అభివ్యంజకత్వమై యున్నది.

శంక:—చక్షురాదీంద్రియజన్యాపరోక్షవృత్తులయం దైననో ఆయపరోక్షవ్యవహారజనకత్వము సంభవించుచున్నది. అయినను అనుమానాదిప్రమాణజన్యానుమిత్యాదిపరోక్షవృత్తులయం దాయపరోక్షవ్యవహారజనకత్వము లేదు. ఏ కారణముచేత ననఁగా, "పర్వతో వహ్నిమాన్" అను ననుమితి కనంతరము "అయం వహ్నిః" అను నపరోక్షవ్యవహార మొకనికిఁగూడఁ గలుగుట లేదు. అందువలన అనుమిత్యాదిపరోక్షవృత్తులయం దాయభివ్యంజకత్వముయొక్క యభావముచేతఁ బూర్వోక్తవృత్తిలక్షణమున కవ్యాప్తియే కలుగుచున్నది.

సమాధానము:—ఇట్టి యరుచి కలుగఁగా, ఇఁక నభివ్యంజకత్వము అన్యప్రకారముగా నిర్వచింపఁబడుచున్నది. "ఆవరణనివర్తకత్వమ్ అభివ్యంజకత్వమ్"— భావము॥ ఆవృత్తులయం దావరణనివర్తకత్వ మేది గలదో అదియే ఆవిషయచైతన్యముయొక్క అభివ్యంజకత్వమై యున్నది. ఆ యభివ్యంజకత్వ మనుమిత్యాదిపరోక్షవృత్తులయందును గలదు. అందువలన ఆపరోక్షవృత్తులయందుఁ బూర్వోక్తలక్షణమున కవ్యాప్తి కలుగుట లేదు. ఇచ్చట, అభిప్రాయ మే మనఁగా, అజ్ఞానకృతావరణము ద్విప్రకారమై యున్నది. ఒకటి అసత్త్వాపాదక మగు నావరణము, మఱియొకటి అభానాపాదక మగు నావరణము. అచ్చట ఘటాదివిషయములయొక్క నాస్తి యను వ్యవహారమునకు హేతురూపావరణ మైననో అసత్త్వాపాదకావరణ మనఁబడును. నభాతి అను వ్యవహారమునకు హేతురూపావరణ మభానాపాదకావరణ మనఁబడును. అభానాపాదకావరణ మైననో అపరోక్షజ్ఞానముచేతనే నివృత్త మగుచున్నది. పరోక్షజ్ఞానముచేత నివృత్త మగుట లేదు. అసత్త్వాపాదకావరణ మనుమిత్యాదిపరోక్షజ్ఞానములచేతను నివృత్త మగుచున్నది. ఏకారణముచేత ననఁగా, ధూమరూపహేతుజ్ఞానమువలన, "పర్వతో వహ్నిమాన్" ఈప్రకార మైన యనుమితి కలుగుచోటను, శాస్త్రప్రమాణమువలన స్వర్గాదులయొక్క పరోక్షజ్ఞానము కలుగుచోటను, బర్వతమునందు వహ్ని లేదు అట్లే స్వర్గాదికము లేదు ఈప్రకారముగా నాస్తివ్యవహారము కలుగుట లేదు. మఱే మనఁగా, "వహ్నిరస్తి, స్వర్గోఽస్తి" అను అస్తి వ్యవహారమే కలుగుచున్నది. అందువలన ననుమిత్యాదికపరోక్షవృత్తులయందును ఆ యసత్త్వాపాదకావరణముయొక్క నివర్తకత్వము విద్యమానమే యగుచున్నది.

లేక, అజ్ఞానకృతావరణము ద్విప్రకారమై యున్నది. ఒకటి విషయచైతన్యనిష్ఠావరణము, మఱియొకటి ప్రమాతృచైతన్యనిష్ఠావరణము. విషయచైతన్యనిష్ఠావరణ మైననో అపరోక్షజ్ఞానముచేతనే నివృత్త మగుచున్నది. ప్రమాతృచైతన్యనిష్ఠావరణము పరోక్షజ్ఞానముచేతను నివృత్త మగుచున్నది. అందువలన నాయనుమిత్యాదికపరోక్షవృత్తులయం దాయావరణనివర్తకత్వరూపాభివ్యంజకత్వము సిద్ధించుటవలనఁ బూర్వోక్తవృత్తియొక్కలక్షణమున కవ్యాప్తి కలుగుట లేదు.

శంక:—సుఖదుఃఖాదులను విషయము చేయునట్టి వృత్తిజ్ఞానమందును ఈశ్వరునియొక్క మాయావృత్తిరూపజ్ఞానమందును అవిద్యావృత్తిరూపభ్రమజ్ఞానమందును ఆయావరణనివర్తకత్వము లేదు. అందువలన నావృత్తులయందుఁ బూర్వోక్తలక్షణమునకును అవ్యాప్తియే కలుగును. ఇట్టి యరుచి కలుగఁగా.

సమాధానము:—ఇఁక, అన్యప్రకారముగా నాయభివ్యంజకత్వము నిర్వచింపఁబడుచున్నది. "అస్తి వ్యవహారజనకత్వమ్ అభివ్యంజకత్వమ్" — భావము॥ ఘటో౽స్తి, పటో౽స్తి" అను నస్తివ్యవహారజనకత్వమే యావృత్తులయందు విషయచైతన్యముయొక్క యభివ్యంజకత్వము. ఈ యభివ్యంజకత్వ మాయపరోక్షవృత్తులయందును బరోక్షవృత్తులయందును సుఖదుఃఖాదివిషయకవృత్తులయందును మాయావృత్తులయందును భ్రమవృత్తులయందును సర్వత్ర విద్యమానమై యున్నది. అందువలన ఈలక్షణమున కేవృత్తియందును అవ్యాప్తి కలుగుట లేదు.

శంక:—పూర్వము మీరు వృత్తియొక్కలక్షణమునందు, అంతఃకరణముయొక్క లేక అజ్ఞానముయొక్కపరిణామము వృత్తి యని చెప్పితిరి. అది సంభవించుట లేదు. ఏల యన "పూర్వరూపపరిత్యాగేన రూపాంతరాపత్తిః పరిణామః"— భావము॥ ఒకవస్తువు తనపూర్వరూపమును బరిత్యజించి యన్యరూపము పొందుట పరిణామ మనఁబడును. ఇదియే పరిణామముయొక్కలక్షణముగాఁ జెప్పఁబడును. అది సంభవించుట లేదు. ఏకారణముచేత ననఁగా, లోకమునం దొకవస్తువునకును బూర్వరూపము విద్యమాన మగుటవలనను, లేక, పూర్వరూపము నష్ట మగుటవలనను అన్యరూపముయొక్కప్రాప్తి చూడఁబడుట లేదు. మఱియు వేదాంతశాస్త్రమునందు వివర్తవాదమే యంగీకరింపఁబడి యున్నది. పరిణామవాద మంగీకరింపఁబడ లేదు. ఒకవేళ, ఆపరిణామవాదము నంగీకరించిననో సిద్ధాంతమునకు విరోధము ప్రాప్త మగును. ఇట్టిశంక కలుగఁగా.

[*] (2) పరిణామవివర్తములయొక్క లక్షణములు చెప్పుట. [*]

సమాధానము:—ఇకఁ బరిణామవివర్తములయొక్క లక్షణములు చెప్పఁబడుచున్నవి. "ఉపాదానసమసత్తాకాన్యథాభావః పరిణామః, ఉపాదానవిషమసత్తాకాన్యథాభావః వివర్తః" — భావము॥ ఉపాదానకారణమునకు సమానసత్తాసహితమైనట్టి ఆయుపాదానముయొక్క అన్యథాభావము పరిణామ మనఁబడును. ఉదా—దుగ్ధముయొక్క పరిణామము దధియై యున్నది. అచ్చట దుగ్ధము వ్యావహారికసత్తాకమై యున్నది. అట్లే దధియును వ్యావహారికసత్తాకమై యున్నది. అందువలన నాదధి దుగ్ధరూపోపాదానకారణముయొక్క సమానసత్తాసహితమై యున్నది. అయినను, దధియందు దుగ్ధముయొక్క వ్యవహారము కలుగుట లేదు. అందువలన నాదధి దుగ్ధముయొక్క అన్యథాభావమే యగుచున్నది. ఇందుచేత దధియందు దుగ్ధముయొక్క పరిణామత్వము సంభవించుచున్నది.

ఉపాదానకారణముకన్నను విషమసత్తాసహితమైనయాయుపాదానముయొక్క అన్యథాభావము వివర్త మనఁబడును. ఉదా—రజ్జువునందుఁ బ్రతీత మగు సర్పము రజ్జ్వవచ్ఛిన్నచైతన్యముయొక్క వివర్తమై యున్నది. అచ్చట చైతన్యమైననో పారమార్థికసత్తాకమై యున్నది. కల్పితసర్పము ప్రాతిభాసికసత్తాకమై యున్నది. అందువలన సర్పము చైతన్యరూపోపాదానకారణముకన్నను విషమసత్తాసహితమై యున్నది. "అయం సర్పః" అను వ్యవహారమునకు విషయ మగుటవలన నాసర్పము చైతన్యమున కన్యథాభావమును అగును, ఇందువలనఁ గల్పితసర్పమునందు చైతన్యముయొక్క వివర్తత్వము సంభవించు చున్నది.

"అన్యథాభావః పరిణామః" అను నింతమాత్రమే పరిణామమునకు లక్షణ మనినయెడల అన్యథాభావరూపవివర్తమునందుఁ బరిణామముయొక్క లక్షణమున కతివ్యాప్తి యగుచున్నది. ఆ యతివ్యాప్తిదోషముయొక్క నివృత్తికొఱకు పరిణామముయొక్క లక్షణమునందు "ఉపాదానసమసత్తాకః" అనుపదము చెప్పఁబడినది. వివర్త ముపాదానముయొక్క సమసత్తాసహితము కాదు. అందువలన వివర్తమునందుఁ బరిణామముయొక్క లక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు. ఈప్రకారముగా వివర్తముయొక్క లక్షణమందును అన్యథాభావరూపపరిణామమం దతివ్యాప్తిదోషము నివృత్తి చేయుటకొఱకు "ఉపాదానవిషమసత్తాకః" అనుపదము చెప్పఁబడినది. ఈప్రకారముగాఁ బరిణామవివర్తములకుఁ బరస్పరభేద మున్నది. అట్లే యిచ్చటఁ బ్రసంగమునందుఁ బూర్వోక్తవృత్తియును అంతఃకరణాజ్ఞానరూపోపాదానకారణముల

యొక్క యపేక్షచేతఁ బరిణామమును అధిష్ఠానచైతన్యముయొక్క యపేక్షచేత వివర్తము నగుచున్నది. అందువలనఁ బరిణామముయొక్క యప్రసిద్ధియును సిద్ధాంతము నకు విరోధమును గలుగదు.

శంక:—అంతఃకరణము నిరవయవద్రవ్య మగుటవలన నాయంతఃకరణమునకు వృత్తిరూపపరిణామము సంభవించుట లేదు. ఏకారణముచేత ననఁగా, లోకమునందు సావయవదుగ్ధాదులకే దధ్యాదికపరిణామము చూడఁబడు చున్నది. నిరవయవద్రవ్యమున కెచ్చటను బరిణామము చూడఁబడుట లేదు. అట్లు గాక నిరవయవద్రవ్యమునకును బరిణామ మంగీకరించినయెడల, నానిరవయవద్రవ్యముయొక్క స్వరూపమునకే నాశము కలుగును.

సమాధానము:—"తన్మనో ఽకురుత"—భావము॥ పరమాత్మ మనస్సును ఉత్పన్నము చేసెను. ఇత్యాదిశ్రుతులయందు మనోరూపాంతఃకరణమున కుత్పత్తి చెప్పఁబడినది. ఏయేద్రవ్య ముత్పత్తిసహిత మై యున్నదో ఆయాద్రవ్యము దుగ్ధాదికమునవలె సావయవమే యగును. అందువలన నంతఃకరణము సావయవ మగుటవలన దానికిఁ బరిణామము సంభవించి యున్నది. మఱియు నట్టి అంతఃకరణమునకు సావయవత్వము శ్రుతిప్రమాణముచేత సిద్ధించుచున్నట్లో, అట్లు వృత్తిజ్ఞానమునకు అంతఃకరణధర్మత్వమును శ్రుతిప్రమాణముచేతనే సిద్ధించుచున్నది. శ్రుతి:—"కామః సంకల్పో విచికిత్సా శ్రద్ధా ఽశ్రద్ధా ధృతి రధృతి ర్హ్రీ ర్ధీ ర్భీ రిత్యేత త్సర్వం మన ఏవ"—భావము॥ ఇచ్ఛ, సంకల్పము, సంశయము, శ్రద్ధ, అశ్రద్ధ, ధైర్యము, అధైర్యము, లజ్జ, వృత్తిజ్ఞానము, భయము ఈసర్వమును మనస్సుయొక్క ధర్మములే. ఈశ్రుతి యిచ్ఛాదుల నంతఃకరణముయొక్క ధర్మములుగానే చెప్పుచున్నది.

శంక:—"అహం జానామి అహ మిచ్ఛామి" అను ననుభవ మెల్లరకుఁ గలుగుచున్నది. ఆయనుభవముచేత జ్ఞానేచ్ఛాదు లాత్మయొక్క ధర్మములుగానే సిద్ధించుచున్నది. అందువలన ఆజ్ఞానేచ్ఛాదులయం దంతఃకరణధర్మత్వము సంభవించుట లేదు. ఇట్లు జ్ఞానేచ్ఛాదుల నంతఃకరణధర్మములుగా నంగీకరించిననో, పూర్వోక్తానుభవమునకు విరోధము కలుగును. ఈ యనుభవమునకే బాధయుఁ గలుగనందున ఈ యనుభవమునందు భ్రమరూపత్వమును సంభవించుట లేదు. జ్ఞానేచ్ఛాదికము మనోరూపనిమిత్తకారణముచేత జన్యమై యున్నది. అందువలన "ఏత త్సర్వం మనఏవ" అను నుక్తశ్రుతిచేత ఆయిచ్ఛాదికసర్వమును మనస్సుచేతనే జన్య మను నర్థము సంభవించు చున్నది. ఇందువలన నాశ్రుతివచనముచేతను ఇచ్ఛాజ్ఞానాదుల కంతఃకరణధర్మరూపత్వము సిద్ధించుట లేదు.

సమాధానము:—ఎట్లు వాస్తవమందు దాహకత్వరహిత లోహపిండమ౦ దగ్ని యొక్క తాదాత్మ్యసంబంధముచేత నీలోహపిండము దహించుచున్న దను దాహకత్వాధ్యాస [illegible] కలుగుచున్నదో అట్లు అంతఃకరణము ఆత్మయారోపించిన గల తాదాత్మ్యాధ్యాసముచేతనే "అహం జానామి. అహ మిచ్ఛామి" ఇత్యాద్యనుభవము కలుగుచున్నది. ఆయధ్యాసమునం దేప్రమాణమును లేదని చెప్పినయెడల అట్లు చెప్పుట కూడదు. ఏకారణముచేత ననఁగా, ఆయధ్యాసమునందుఁ బురుషునకుఁ దనయనుభవమే ప్రమాణమై యున్నది. అది చూపఁబడుచున్నది. "అహం జానామి" అను ననుభవ మెల్లరకును గలుగుచున్నది. ఆయనుభవముచేతఁ బురుషునియందు జ్ఞాతృత్వము ప్రతీత మగుచున్నది, అజ్ఞాతృత్వము కేవలాంతఃకరణమందైననో సంభవించుట లేదు. ఏకారణముచేత ననఁగా, అంతఃకరణము భూతముల యొక్క [illegible] జడము. జడమునందును జ్ఞాతృత్వము కల దనునెడల ఘటాదులందు [illegible] కలుగవలయును. అట్లే అజ్ఞాతృత్వము కేవలాత్మయందును [illegible]. ఏకారణముచేత ననఁగా, "అసంగో హ్యయం పురుషః, [illegible], అవ్యక్తో ఽయ మచింత్యో ఽయ మవికార్యోఽయ ముచ్యతే" ఇత్యాది శ్రుతిస్మృతులచేత నాయాత్మకసంగత్వమే తెలియవచ్చుచున్నది. అట్టి యసంగాత్మయందు జ్ఞాతృత్వము సంభవించుట లేదు. అందువలన "అహమ్" అను ప్రతీతిచేత నాత్మయం దంతఃకరణముయొక్క యధ్యారోపము చేతను. "అహం చేతనః" అను ప్రతీతిచేత నంతఃకరణమునం దాత్మయొక్క తాదాత్మ్యాధ్యారోపముచేతను ఆత్మయం దంతఃకరణముయొక్క యిచ్ఛాదిధర్మములకును అంతఃకరణమం దాత్మయొక్క సత్యాదిధర్మములకును అధ్యారోపముచేత; నీజీవుఁడు "అహం జానామి" అని తనయందు జ్ఞాతృత్వము ననుభవించుచున్నాఁడు. అందువలన నాయధ్యాసమునందు జీవునియొక్క యనుభవమే ప్రమాణము. ఈప్రకారముగా ననుభవసిద్ధాధ్యాసవశముచేతనే యంతఃకరణముయొక్క జ్ఞానేచ్ఛాదిధర్మములాత్మయందుఁ బ్రతీతము లగుచున్నవి. వాస్తవముచేత నవి యాత్మయొక్క ధర్మములు కావు.

ఇచ్చట నైయాయికులైననో యిట్లు చెప్పుచున్నారు. ఆత్మతో మనస్సుయొక్క సంయోగము కలుగఁగా, జ్ఞానము 1 ఇచ్ఛ 2 ప్రయత్నము 3 సుఖము 4 దుఃఖము 5 ద్వేషము 6 ధర్మము 7 అధర్మము 8 సంస్కారము 9 అను తొమ్మిది గుణము లాత్మయం దుత్పన్నము లగుచున్నవి. అందువలన, అజ్ఞానేచ్ఛాదికము లాత్మధర్మములే యగును. ఈ నైయాయికులమతము న్యాయప్రకాశముయొక్క తృతీయపరిచ్ఛేదమునందు విస్తరముగాఁ జెప్పఁబడియున్నది.

ఆ నైయాయికులయొక్క మతము సమీచీనము కాదు. ఎట్లనఁగా నైయాయికులచేత నాత్మవలె మనస్సుకూడ నిరవయవద్రవ్య మని యంగీకరింపఁబడి యున్నది. అట్టి నిరవయవమనస్సునకు నిరవయవాత్మతో సంయోగమే సంభవించుట లేదు. ఏకారణముచేత ననఁగా, నైయాయికు లాసంయోగము నవ్యాప్యవృత్తి యని యంగీకరించుచున్నారు. అచ్చట ఏరెండుద్రవ్యములకు సంయోగము కలుగుచున్నదో యారెండుద్రవ్యములకుఁ గించిద్దేశమునం దైననో ఆసంయోగ మున్నది. కించిద్దేశమునందు సంయోగాఽభావ మున్నది. ఇదియే యాసంయోగమునం దవ్యాప్యవృత్తిత్వము. ఉదా—వృక్షముయొక్క శాఖయం దైననో మర్కటముయొక్క సంయోగ మున్నది. ఆవృక్షముయొక్క మూలదేశమునం దాసంయోగాఽభావ మున్నది. ఈప్రకారముగా సర్వసంయోగములును అవ్యాప్యవృత్తు లగుచున్నవి. ఇట్టి యవ్యాప్యవృత్తిసంయోగము వృక్షమర్కటాదిసావయవద్రవ్యములకే సంభవించుచున్నది. ఆత్మ మనస్సు మొదలగు నిరవయవద్రవ్యముల కాసంయోగము సంభవించుట లేదు. అందువలన నాత్మమనస్సంయోగముచేత నాత్మయందు జ్ఞానాదిగుణము లుత్పన్నము లగుచున్న వను నైయాయికులకథనము మిథ్యయే యగును.

మఱియు జ్ఞానేచ్ఛాదుల నాత్మయొక్క ధర్మము లని యంగీకరించు నైయాయికు, లాత్మనే యాజ్ఞానేచ్ఛాదిధర్మముల కుపాదానకారణ మని చెప్పవలసి వచ్చును. దానియందు వారి నిట్లడుగవలయును. ఆత్మ కారంభకత్వరూపముచేత నాజ్ఞానాదులయొక్క యుపాదానత్వ మున్నదా? లేక, పరిణామిత్వముచేత నుపాదానత్వ మున్నదా? నైయాయికులు ప్రథమపక్ష మంగీకరించినయెడల, నది సంభవించుట లేదు. ఏల యన, అనేకద్రవ్యములయందే ఆరంభకత్వ మున్నది. ఉదా— అనేకపరమాణువులకు జగత్తుయొక్క యారంభకత్వ మున్నది. మఱియు ఆత్మ యైననో యేక మగుటవలన నాయేకాత్మకు జ్ఞానేచ్ఛాదులయొక్క యారంభకత్వము సంభవించుట లేదు. ఈలాగుననే ద్వితీయపరిణామిత్వపక్షముగూడ సంభవించుట లేదు. ఎట్లనఁగా, సావయవదుగ్ధాదికమే దధ్యాద్యాకారపరిణామము పొందుచున్నది. నిరవయవద్రవ్యమున కెచ్చటను బరిణామము చూడఁబడుట లేదు. ఆత్మయును నిరవయవద్రవ్య మగుటవలన ఆయాత్మకు జ్ఞానేచ్ఛాదులయొక్క పరిణామ్యుపాదానత్వము సంభవించుట లేదు. ఆత్మను సావయవద్రవ్య మని యంగీకరించినయెడల ఘటాదులవలె నాయాత్మ కనిత్యత్వమే ప్రాప్త మగును. అందువలన జ్ఞానేచ్ఛాదికము లాత్మధర్మములై యున్న వను నైయాయికులయొక్క మత మసంగతమై యున్నది.

మఱియు "సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ" అనుశ్రుతి యాత్మను సర్వగుణరహితముగాఁ జెప్పి యున్నది. ఆశ్రుతికి విరోధ మగుటవలనను ఆనైయాయికుల యొక్క మతము నిరాకృతమై యున్నది. అందువలన జ్ఞానేచ్ఛాదికము సర్వము నంతఃకరణముయొక్కధర్మమే యని సిద్ధించుచున్నది.

[*] (3) వృత్తియొక్కవిభాగకథనము. [*]

ఇంతపర్యంతము వృత్తియొక్కస్వరూపము నిరూపింపఁబడినది. ఇఁక వృత్తియొక్కవిభాగము నిరూపింపఁబడుచున్నది. పూర్వోక్తవృత్తి, ప్రమ అప్రమ అనుభేదముచేత ద్విప్రకార మగుచున్నది. ఆద్వివిధవృత్తులయందుఁ బ్రథమ మగు ప్రమావృత్తి చెప్పఁబడుచున్నది. "బోధే ద్ధావృత్తిః, వృత్తౌ ద్ధబోధోవా, ప్రమా"— భావము॥ చైతన్యమునకు బోధ యని పేరు, ఆచైతన్యరూపబోధచేత ఇద్ధము. అనఁగాఁ బ్రకాశిత మగు నేవృత్తి యున్నదో ఆవృత్తి ప్రమ యనఁబడును. లేక, ఆవృత్తియందు ఇద్ధము అనఁగాఁ బ్రతిబింబిత మగు చైతన్యరూపబోధ ప్రమ యనఁబడును. ఆప్రమయును, ఈశ్వరాశ్రయము జీవాశ్రయము అనుభేదముచేత ద్విప్రకార మగుచున్నది. అందు "ఈక్షణా పరపర్యాయ స్రష్టవ్య విషయాకారమాయావృత్తి ప్రతిబింబితా చిత్, ఈశ్వరాశ్రయ ప్రమా"— భావము॥ సృష్ట్యాదికాలమునగు ఆనంతర ముత్పన్నము కాఁబోవు జగత్తును విషయము చేయునట్టి యేమాయావృత్తి యున్నదో ఆవృత్తి శ్రుతియందు ఈక్షణ మనునామముచే చెప్పఁబడును. ఆమాయావృత్తియందు ప్రతిబింబితచైతన్యము ఈశ్వరాశ్రయప్రమ యనఁబడును. అచ్చట శ్రుతి "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ"— భావము॥ మాయోపహితపరమేశ్వరుఁడు సృష్ట్యాదికాలమునందు నేను బహుతరరూపములుగా నుత్పన్నుఁడ నగుదును అని యీక్షణము చేసెను.

ఇఁక జీవాశ్రయప్రమ నిరూపింపఁబడు చున్నది. "అనధిగతా బాధిత విషయాకారాంతఃకరణవృత్తి ప్రతిబింబితా చిత్, జీవాశ్రయప్రమా"— భావము॥ అనధిగతము— అజ్ఞాతము, అనఁగా బోధచే విషయీకరింపఁబడనిదియును, అబాధితము—బాధరహితము నైన విషయ మేది గలదో తదాకారాంతఃకరణవృత్తియందుఁ బ్రతిబింబితచైతన్యము జీవాశ్రయప్రమ యనఁబడును. అచ్చట "విషయాకారాంతఃకరణవృత్తి ప్రతిబింబితాచిత్, జీవాశ్రయప్రమా" అను నింతమాత్రమే యాజీవాశ్రయప్రమకు లక్షణముగాఁ జెప్పినయెడల భ్రాంతిజ్ఞానమునం దాలక్షణమున కతివ్యాప్తి కలుగుచున్నది. ఆయతివ్యాప్తిదోషనివృత్తికొఱకు లక్షణమునందు "అబాధిత" మని విషయమునకు విశేషణము చెప్పఁబడినది. భ్రమజ్ఞానము

యొక్క విషయము అబాధితము కాదు. ఇక నేమనఁగా, శుక్తిరజ్జ్వాద్యధిష్ఠానజ్ఞానముచేత భ్రమకు విషయభూత మగురజతసర్పాదులకు బాధ కలుగుచున్నది. అందువలన భ్రమజ్ఞానమునం దాప్రమయొక్క లక్షణమున కతివ్యాప్తి కలుగదు. యద్యపి, వివరణకారాదిసంప్రదాయులయొక్క మతమునం దాభ్రమజ్ఞాన మవిద్యావృత్తిరూపమగుటవలన, "అంతఃకరణవృత్తి" అనుపదము చెప్పుటచేతనే ఆభ్రమజ్ఞానమునందుఁ బూర్వోక్తలక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు. కావున అబాధితపదము వ్యర్థమై యున్నది, తథాపి, ఉపాధ్యాయులయొక్క మతమునందు భ్రమజ్ఞాన మంతఃకరణవృత్తిరూపమై యున్నది, ఆమతమునందు అబాధితపదము చెప్పుటచేతనే ఆ భ్రమజ్ఞానమునం దతివ్యాప్తి నివారణ మగుచున్నది. అందువలన అబాధితపదము సార్థకమై యున్నది. మఱియుఁ బూర్వోక్తలక్షణమునందు, "అనధిగత" మను పదము చెప్పనియెడల నాలక్షణమునకు స్మృతిజ్ఞానమునం దతివ్యాప్తి కలుగుచున్నది. ఎట్లనఁగా, యథార్థస్మృతికి విషయ మబాధితమే యగుచున్నది. ఆయతివ్యాప్తిదోషనివృత్తికొఱ కాలక్షణమునందు, "అనధిగత" మనుపదము చెప్పఁబడినది. పూర్వ మనుభవింపఁబడినయర్థమునందే స్మృతి కలుగుచున్నది. అందువలన నాస్మృతికి విషయము పూర్వ మజ్ఞాతము కాదు. మ ఱే మనఁగా, జ్ఞాతమే యగును. ఇందువలన, "అనధిగత" మనుపదము చెప్పుటచేత నాస్మృతియందు జీవాశ్రితప్రమయొక్క లక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు.

శంక:—పూర్వోక్తజీవాశ్రితప్రమయొక్క లక్షణ మేప్రమయందును ఘటిల్లదు. అందువలన నీలక్షణ మసంభవదోషసహితమై యున్నది.

సమాధానము:—"అహం బ్రహ్మాస్మి" ఇత్యాది మహావాక్యములచేత నుత్పన్నమైనబ్రహ్మాత్మలయొక్క యేకత్వమును విషయము చేయునట్టి యేయంతఃకరణవృత్తి యున్నదో ఆవృత్తియందుఁ బ్రతిబింబితచైతన్యరూపప్రమయందుఁ బూర్వోక్తలక్షణము సంభవించుచున్నది. ఏకారణముచేత ననఁగా, బ్రహ్మాత్మలయొక్క యేకత్వము అనధిగతమును అబాధితము నగుచున్నది. అందువలనఁ బూర్వోక్తలక్షణ మసంభవదోషసహితము కాదు.

శంక:—ఈలక్షణమునకు "అయం ఘటః, అయం పటః" ఇత్యాది ప్రమయం దవ్యాప్తియే కలుగుచున్నది. ఎట్లనఁగా, ఆఘటపటాదిసర్వప్రపంచమునకు బ్రహ్మజ్ఞానముచేత బాధ యగుచున్నది. అందువలన నాఘటపటాదులయం దబాధితత్వము లేదు.

సమాధానము:—ప్రపంచమునకు యద్యపి బ్రహ్మజ్ఞానముచేత బాధ యగుచున్నది. తథాపి బ్రహ్మజ్ఞానముకన్నను బూర్వము సంసారదశయందుఁ బ్రపంచమునకు బాధ కలుగుట లేదు. అందువలన నాప్రపంచమును సంసారదశయందు నబాధితమే యగుటవలన ఆఘటపటాదిప్రపంచవిషయకప్రమయందుఁ బూర్వోక్త లక్షణమున కవ్యాప్తి కలుగుట లేదు.

శంక:—అబాధితపదమున కీప్రకారముగా నర్థ మంగీకరించినయెడల భ్రాంతిజ్ఞానమందును ఆప్రమయొక్క లక్షణమున కతివ్యాప్తి కలుగును. ఏకారణముచేత ననఁగా, భ్రాంతిజ్ఞానమునకు విషయ మైనశుక్తిరజతాదికమును భ్రాంతికాలము నందబాధితమే యగుచున్నది.

సమాధానము:—ఆశుక్తిరజతాదికము భ్రాంతికాలమునం దబాధిత మైనను అనధిగతము కాదు. అనఁగా, అజ్ఞాతసత్తాసహితము కాదు. మఱి యే మనఁగా, జ్ఞాతసత్తాసహితమే యగుచున్నది. అందువలన భ్రాంతిజ్ఞానమునందుఁ బూర్వోక్త ప్రమయొక్క లక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు.

అచ్చట, జ్ఞానమునకుఁ బూర్వకాలమునందు విషయమున కేసత్త యున్నదో అది యజ్ఞాతసత్త యనఁబడును. జ్ఞానముయొక్క సమకాలమునందు విషయమున కేసత్త యున్నదో అది జ్ఞాతసత్త యనఁబడును.

## [*] (4) ప్రమాణముయొక్క లక్షణకథనము. [*]

ఇఁక, ప్రసంగానుసారముగాఁ బ్రమాణముయొక్క లక్షణము చెప్పఁబడుచున్నది. "ప్రమాకరణం ప్రమాణమ్" — భావము॥ పూర్వోక్తజీవాశ్రితప్రమయొక్క కరణము ప్రమాణ మనఁబడును. ఎట్లనఁగా "అయంఘటః" అనుప్రత్యక్షప్రమకుఁ జక్షురింద్రియము కరణము. అందువలన నాచక్షురింద్రియము ప్రమాణ మనఁబడును. ఈప్రకారముగా ననుమానాదిప్రమాణములయందును ఈలక్షణము తెలియవలయును. అచ్చట "కరణంప్రమాణమ్" అను నింతమాత్రమే ప్రమాణమునకు లక్షణ మనినయెడల ఛేదనరూపక్రియను గూర్చి కరణరూప మగుకుఠారమునం దాప్రమాణలక్షణమున కతివ్యాప్తి కలుగును. ఆయతివ్యాప్తిదోషము నివృత్తి చేయుటకొఱకు ఆలక్షణమునందు "ప్రమా" అనుపదము చెప్పఁబడినది. ఆకుఠారమునందు ప్రమాజ్ఞానముయొక్క కరణరూపత్వము లేదు. అందువలన నాకుఠారమునందుఁ బూర్వోక్తలక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు. లేక "ప్రమా ప్రమాణమ్" అను నింతమాత్రమే ప్రమాణమునకు లక్షణ మని చెప్పి యాలక్షణమునందుఁ గరణ మనుపదము చెప్పనియెడలఁ జక్షురాదులయం దీప్రమాణలక్షణ

మున నవ్యాప్తి కలుగును. ఏకారణముచేత ననఁగా, ఆచక్షురాదులకు ద్రవ్యరూపత్వ ... ప్రమాజ్ఞానరూపత్వము లేదు. ఆ యవ్యాప్తిదోషమును నివర్తింపఁజేయుటకొఱకే కాలఘటితమగు ... గరణ మనుపదము చెప్పఁబడినది. ఏకారణము ప్రవృత్తి ముగుచుండఁగాఁ గార్యోత్పత్తికి విలంబము కలుగుట లేదో ఆకారణము కరణ మనఁబడును.

[*] (5) జీవాశ్రితప్రమయొక్క విభాగవర్ణనము. [*]

ఇఁక జీవాశ్రితప్రమయొక్క విభాగవర్ణనము చేయఁబడుచున్నది. ఆజీవాశ్రితప్రమ, పారమార్థికము 1 వ్యావహారికము 2 అను భేదముచేత ద్విప్రకార మగుచున్నది. అచ్చట అధికారిపురుషునకుఁ దత్త్వమస్యాదిమహావాక్యములచే జన్యమైన అహం బ్రహ్మాస్మి యను నేప్రమ యున్నదో అది పారమార్థికప్రమ యనఁబడును. ఆపారమార్థికప్రమ పూర్వము నిరూపింపఁబడినది. అట్లే యుత్తరత్రయును శాబ్దప్రమయొక్క నిరూపణమందు నిరూపింపఁబడును. ఘటపటాదిరూపప్రపంచమును విషయము చేయునట్టి "అయం ఘటః, అయం పటః" ఇత్యాదికప్రమ వ్యావహారికప్రమ యనఁబడును. ఆవ్యావహారికప్రమయును, ప్రత్యక్షము 1 అనుమితి 2 ఉపమితి 3 శాబ్ది 4 అర్థాపత్తి 5 అభావప్రమ 6 అనుభేదముచేత షడ్విధమై యున్నది. ఆప్రమలయొక్క షడ్విధభేదముచేతఁ బ్రమాకరణరూపప్రమాణములు కూడ ప్రత్యక్షము 1 అనుమానము 2 ఉపమానము 3 శబ్దము 4 అర్థాపత్తి 5 అనుపలబ్ధి 6 అనుభేదముచేత షడ్విధములే యగుచున్నవి.

[*] (6) ప్రత్యక్షప్రమయొక్క ప్రథమలక్షణము. [*]

ఇఁక, ఆషడ్విధప్రమలయందుఁ బ్రథమ మగుప్రత్యక్షప్రమ నిరూపింపఁబడుచున్నది. అచ్చట "విషయచైతన్యాఽభిన్నప్రమాణచైతన్యం ప్రత్యక్షప్రమా"–అర్థము॥ విషయచైతన్యముకన్న నభిన్నమైన యేప్రమాణ చైతన్య మున్నదో అది ప్రత్యక్షప్రమ యనఁబడును. ఇఁక నుక్తార్థమును స్పష్టము చేయుటకొఱకు మొదటఁ జైతన్యముయొక్క యుపాధికృతభేదము నిరూపింపఁబడు చున్నది. వాస్తవముచేత నాచైతన్య మేకము అద్వితీయ మయ్యును, ఉపాధిభేదముచేతఁ బ్రమాతృచైతన్యము 1 ప్రమాణచైతన్యము 2 విషయచైతన్యము 3 ఫలచైతన్యము 4 అనుభేదముచేతఁ జతుర్విధ మగుచున్నది. అందు, అంతఃకరణవిశిష్టచైతన్యము ప్రమాతృచైతన్య మనఁబడును. అంతఃకరణవృత్తిచేత నవచ్ఛిన్నమైన యేచైతన్యమున్నదో అది ప్రమాణచైతన్య మనఁబడును. ఘటాదివిషయములచేత నవచ్ఛిన్న

మైన యేచైతన్య మున్నదో అది విషయచైతన్య మనఁబడును. ఘటాదివిషయముల యొక్క సమానాకారతను బొందినవృత్తిచేత నభివ్యక్త మైన యేచైతన్య మున్నదో అది ఫలచైతన్య మనఁబడును. ఈప్రకారముగా నంతఃకరణాద్యుపాధులయొక్క భేదముచేత నాయొకటేచైతన్యము చతుర్విధ మగుచున్నది. అచ్చట నాయుపాధుల కిది స్వభావమై యున్నది. ఎంతపర్యంత మాయుపాధులు భిన్నభిన్న దేశములయందు స్థితము లగుచున్నవో, అంతపర్యంతమే యాయుపాధులు స్వోపహితములను భిన్నము చేయుచున్నవి. ఎప్పు డాయుపాధు లేకదేశమందు స్థితము లగుచున్నవో, అప్పుడు స్వోపహితములను భిన్నము చేయుట లేదు. ఇఁక నే మనఁగా, ఆకాలమునం దాయుపహితముల కభేదమే యగుచున్నది. ఉదా—మఠమునకు బాహ్యమందు ఘట ముండిన యెడల,ఆమఠోపహితాకాశమునకును ఘటోపహితాకాశమునకును భేదమే యున్నది. ఆమఠమునందు ఘట ముండినయెడల, నామఠాకాశఘటాకాశముల రెంటికిని అభేదమే యున్నది. ఈలాగుననే అంతఃకరణ తద్వృత్తి ఘటాదివిషయము లను నీత్రివిధోపాధులెంతపర్యంతము భిన్నభిన్న దేశములయం దున్నవో అంతపర్యంతమే ప్రమాతృచైతన్యము ప్రమాణచైతన్యము విషయచైతన్యము అను త్రివిధచైతన్యములకు భేదము కలుగుచున్నది. ఎప్పుడు నేత్రాదీంద్రియములద్వారమున నాయంతఃకరణము వృత్తిరూపముచేత బాహ్యమునకు వచ్చి ఘటాదివిషయదేశము పొందుచున్నదో అప్పుడాయంతఃకరణాదిత్రివిధోపాధులును ఏకదేశస్థితము లగుటవలన, నాప్రమాత్రాది త్రివిధచైతన్యములకును అభేదమే కలుగుచున్నది. ఈప్రకారముగా విషయావచ్ఛిన్నచైతన్యముతోఁ బ్రమాణచైతన్యమునకు అభేద మేది కలదో అది ప్రత్యక్షప్రమ యనఁబడును.

## [*] (7) వృత్తియొక్క యుత్పత్తిప్రకారము. [*]

ఇఁక నాయపరోక్షవృత్తియొక్క యుత్పత్తిప్రకారము దృష్టాంతముచేత నిరూపింపఁబడుచున్నది. ఉదా—తటాకజల మొకఛిద్రమువలన బాహ్యమునకు వచ్చి కాలువద్వారమునఁ గేదారమును బొంది కేదారముయొక్క యాకారము త్రికోణముగాఁ గాని చతుష్కోణముగాఁ గాని యెట్లున్నదో ఆ యాకార మైనపరిణామమును బొందుచున్నది. అచ్చటఁ గాలువద్వారమునఁ దటాకజలమునకును గేదారజలమునకును అభేదమే యున్నది. ఈలాగుననే ఘటాద్యర్థములతోఁ జక్షురాదీంద్రియములయొక్క సంబంధానంతర మంతఃకరణము చక్షురాదీంద్రియములద్వారమున బాహ్యవిషయదేశమునకుఁ బోయి యాఘటాదివిషయములయొక్క సమానాకారపరిణామమును బొందుచున్నది. ఇట్టి విషయాకారాంతఃకరణపరిణామము వృత్తి

యనఁబడును. ఆఘటాకారవృత్తియందు ఘటాదివిషయావచ్ఛిన్నచైతన్యము ప్రతిఫలించుచున్నది, అనఁగాఁ బ్రతిబింబించుచున్నది. ఏకాలమునం దాఘటాకారవృత్తియందు ఘటావచ్ఛిన్నచైతన్యము ప్రతిఫలిత మగుచున్నదో ఆకాలమునం దావృత్తివిషయరూపద్వివిధోపాధు లేకదేశమందు స్థితము లగుటవలనఁ బ్రమాణచైతన్యమునకు విషయచైతన్యముతో నభేదము కలుగుచున్నది. ఈప్రకారముగా విషయచైతన్యముకంటె నభిన్న మైన యేప్రమాణచైతన్య మున్నదో అది ప్రత్యక్షప్రమ యనఁబడును. ఇచ్చట "ప్రమాణచైతన్యం ప్రత్యక్షప్రమా" అను నింతమాత్రమే ప్రత్యక్షప్రమకు లక్షణముగాఁ జెప్పినయెడల అనుమిత్యాదికపరోక్షప్రమయం దా లక్షణమున కతివ్యాప్తి కలుగును. ఆ యతివ్యాప్తిదోషము నివర్తించుటకొఱకు కా లక్షణమునందు "విషయచైతన్యాభిన్న" మని ప్రమాణచైతన్యమునకు విశేషణము చెప్పఁబడినది. అనుమిత్యాదిపరోక్షవృత్తులు బాహ్యవిషయదేశములకుఁ బోవుట లేదు. ఇంకే మనఁగా, శరీరమునకు లోపల హృదయదేశమునందే యుత్పన్నము లగుచున్నవి. అందువలన నాపరోక్షస్థలమం దావిషయచైతన్యముతోఁ బ్రమాణచైతన్యమున కభేదము కలుగుట లేదు. అందువలన నాయనుమిత్యాదిపరోక్షజ్ఞానములయం దాప్రత్యక్షప్రమాణలక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు. మఱియు "విషయచైతన్యాభిన్నం వృత్త్యవచ్ఛిన్నచైతన్యం ప్రత్యక్షప్రమా" అను నింతమాత్రమే ప్రత్యక్షప్రమకు లక్షణ మనినయెడల, భ్రమప్రత్యక్షమునం దాలక్షణమున కతివ్యాప్తి కలుగును. ఏకారణముచేత ననఁగా, ఆభ్రమస్థలమునందును విషయావచ్ఛిన్నచైతన్యముతో వృత్త్యవచ్ఛిన్నచైతన్యమున కభేదమే యున్నది. ఆ యతివ్యాప్తిదోషము నివర్తించుటకొఱకు కాలక్షణమునందు "ప్రమాణచైతన్య" మ్మనుపదము చెప్పఁబడినది. ఇచ్చట భ్రమవృత్త్యవచ్ఛిన్నచైతన్యమునందుఁ బ్రమాణచైతన్యరూపత్వము లేదు. అందువలన భ్రమప్రత్యక్షమం దాప్రత్యక్షప్రమయొక్క లక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు.

శంక:—భ్రమజ్ఞానమునకు విషయ మైనరజతాదులను బ్రకాశింపఁజేయు నట్టి యేయిద మాకారాంతఃకరణవృత్త్యవచ్ఛిన్నసాక్షిచైతన్య మున్నదో ఆసాక్షిచైతన్యమే యావిషయచైతన్యముకంటెను అభిన్న మైనప్రమాణచైతన్యరూప మగుచున్నది. అందువలనఁ బూర్వోక్తలక్షణమునకు భ్రమప్రత్యక్షమునం దతివ్యాప్తియే కలుగుచున్నది.

సమాధానము:—ఆ యతివ్యాప్తిదోషముయొక్క నివృత్తికొఱకు కాలక్షణమునందు విషయమునకు "అబాధిత" మనువిశేషణము మాకు వివక్షితమై యు

న్నది. అచ్చట భ్రమప్రత్యక్షమునకు విషయమైన యేరజతాదిక మున్నదో అది యబాధితము కాదు. మఱి యే మనఁగా, శుక్త్యాద్యధిష్ఠానజ్ఞానముచేత రజతాదికము నకు బాధ కలుగుచున్నది. అందువలన భ్రమప్రత్యక్షమునం దాప్రత్యక్షప్రమ యొక్కలక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు.

శంక:—ఘటాదిప్రపంచము బ్రహ్మజ్ఞానముచేత బాధిత మగుచున్న దాని కబాధితత్వము సంభవించుట లేదు. అందువలన "అయం ఘటః, అయం పటః" ఇత్యాదిప్రత్యక్షప్రమయం దాలక్షణమున కవ్యాప్తియే కలుగును.

సమాధానము:—ఆ యబాధితపదముచేత సంసారదశయం దబాధితత్వ మే మాకు వివక్షితము. అచ్చట ఘటపటాదిప్రపంచము బ్రహ్మజ్ఞానమునకంటెఁ బూర్వము సంసారదశయం దబాధితమే యగుచున్నది. అందువలన నాఘటపటాది ప్రపంచవిషయకప్రత్యక్షప్రమయం దాలక్షణమున కవ్యాప్తి కలుగుట లేదు.

శంక:—ఎచ్చటఁ బురుషునకు సుఖదుఃఖరూపహేతుజ్ఞానముచేతఁ దన ధర్మాధర్మములయొక్క యనుమితిజ్ఞానము కలుగుచున్నదో, లేక, నీవు ధర్మవంతుఁ డవు నీ వధర్మవంతుఁడవు అను నొకనియొక్కవచనముచేత నీపురుషునకుఁ దనయొక్క ధర్మాధర్మములయొక్కశాబ్దజ్ఞానము కలుగుచున్నదో, అచ్చట ధర్మాధర్మరూపవిషయ ములకును అనుమితిశాబ్దరూపవృత్తులకును ఏకాంతఃకరణరూపదేశమందు స్థితి యుం డుటవలనఁ దదుపహితచైతన్యములకును అభేదమే యున్నది. మఱియు నాధర్మాధర్మ ములు సంసారదశయం దబాధితములే యగుచున్నవి. అందువలనఁ బ్రత్యక్షప్రమ యొక్కలక్షణమునకు ధర్మాధర్మవిషయ కానుమితిశాబ్దరూపపరోక్షజ్ఞానమునం దతి వ్యాప్తి కలుగును.

సమాధానము:—పూర్వోక్తలక్షణమునందు విషయమునకు "యోగ్య" అను విశేషణముకూడ మాకు వివక్షితమై యున్నది. అచ్చట ధర్మాఽధర్మములు ప్రత్యక్షయోగ్యములు కావు. ఇంకే మనఁగా అయోగ్యములై యున్నవి. అందువలన నాధర్మాధర్మవిషయకానుమితిశాబ్దజ్ఞానములందుఁ బ్రత్యక్షప్రమయొక్కలక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు. ఈప్రకారముగాఁ దనసుఖాదులయొక్కయథార్థస్మృతి జ్ఞానమునం దాప్రత్యక్షప్రమాలక్షణముయొక్కయతివ్యాప్తి నివారించుటకొఱకు నా లక్షణమునందు విషయమునకు "వర్తమాన" అనువిశేషణమును జెప్పవలయును. స్మృతిజ్ఞానముయొక్కవిషయము వర్తమాన మగుట లేదు. అందువలన స్మృతియందుఁ బూర్వోక్తలక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు. ఇంతయుఁ జెప్పుటచేతఁ బ్రత్యక్ష

ప్రత్యక్షప్రమాణము సిద్ధించుచున్నది. "అబాధితవర్తమానయోగ్యవిషయచైతన్యాభిన్నం ప్రమాణచైతన్యం ప్రత్యక్షప్రమా" — భావము॥ సంసారదశయం దబాధితమును వర్తమానమును బ్రత్యక్షయోగ్యము నైన యేవిషయ మున్నదో ఆవిషయముచే నవచ్ఛిన్నచైతన్యముతో నభిన్న మైన ప్రమాణచైతన్యము ప్రత్యక్షప్రమ యనఁబడును.

## [*] (8) ప్రత్యక్షప్రమయొక్కద్వితీయలక్షణము. [*]

లేక, ప్రత్యక్షప్రమ కీద్వితీయలక్షణము చెప్పవలయును. "అబాధితాపరోక్షార్థవిషయజ్ఞానం ప్రత్యక్షప్రమా" — భావము॥ అబాధితమును అపరోక్షము నైన యేయర్థ మున్నదో ఆయర్థమును విషయము చేయునట్టి జ్ఞానము ప్రత్యక్షప్రమ యనఁబడును. ఈలక్షణమందును భ్రమజ్ఞానమునం దతివ్యాప్తిని నివారించుటకొఱకు "అబాధిత" మని యర్థమునకు విశేషణము చెప్పఁబడినది. అనుమిత్యాదికపరోక్షజ్ఞానములయం దతివ్యాప్తిని నివారించుటకొఱకు "అపరోక్ష" మని యర్థమునకు విశేషణము చెప్పఁబడినది. అచ్చట సాక్షిచైతన్యముతో ఘటాద్యర్థముల కేతాదాత్మ్య మున్నదో యదియే యాఘటాద్యర్థములయం దపరోక్షత్వమై యున్నది.

యద్యపి ఘటమునకు స్వావచ్ఛిన్నబ్రహ్మచైతన్యమునందే తాదాత్మ్య మున్నది. అంతఃకరణోపహితసాక్షిచైతన్యమునందుఁ దాదాత్మ్యము లేదు. తథాపి, పూర్వోక్తరీతిగా నంతఃకరణవృత్తిబాహ్యనిర్గమనకాలమునం దాఘటావచ్ఛిన్నచైతన్యమునకు సాక్షిచైతన్యముతో నభేదమే యున్నది. అందువలన నాఘటాదులకు సాక్షిచైతన్యమునందుఁ దాదాత్మ్యము సంభవించుచున్నది.

## [*] (9) ప్రత్యక్షప్రమయొక్కఫలనిరూపణము. [*]

ఇఁకఁ బ్రత్యక్షప్రమయొక్కఫలము చెప్పఁబడుచున్నది. పూర్వోక్తప్రత్యక్షప్రమయందు రెండంశము లున్నవి. ఒకటి యంతఃకరణవృత్తిరూపాంశము, మఱియొకటి చైతన్యరూపాంశము. అచ్చట వృత్త్యంశముచేత నైననో, ఘటాదివిషయములయొక్కయావరణము నివృత్త మగుచున్నది. చైతన్యాంశముచేత నజ్ఞానము నివృత్త మగుచున్నది. ఇది నృసింహాశ్రమస్వాములమతమై యున్నది. ఆచార్యులచేత నైననో యిట్లంగీకరింపఁబడి యున్నది. పూర్వోక్తప్రత్యక్షప్రమచేతనే యావరణశక్తిసహితాజ్ఞానము నివృత్త మగుచున్నది. తదనంతర మంతఃకరణోపహితచైతన్యరూపసాక్షిచేత ఘటాదివిషయములయొక్కస్ఫురణము కలుగుచున్నది.

## [*] (10) సాక్షిస్వరూపనిరూపణము. [*]

ఇఁకఁ బ్రసంగానుసారముగా సాక్షిస్వరూపము నిరూపింపఁబడు చున్నది. “ఉదాసీనత్వే సతి బోద్ధా సాక్షీ” — భావము॥ ఏచైతన్యము నిర్వికారోదాసీనమై యుండి బుద్ధ్యాదులను బ్రకాశింపఁజేయుచున్నదో, అనఁగా, ప్రమాతృప్రమాణప్రమేయము లను నీసర్వమును బ్రకాశింపఁజేయు చున్నదో ఆచైతన్యము సాక్షి యనఁబడును. లోకమునందును ఏపురుషుఁడు పరస్పరవివాదము చేయు నిరువురకంటె భిన్నుఁడై యుండియు నాయిరువురియొక్క వివాదము నపరోక్షముగాఁ జూచియు నుదాసీనుఁడై అనఁగాఁ బక్షపాతరహితుఁడై యున్నాఁడో ఆపురుషుఁడు సాక్షి యనఁబడును. ఈలాగుననే యేచైతన్య ముదాసీనమై యుండియు బుద్ధ్యాదిసర్వమును బ్రకాశింపఁజేయు చున్నదో ఆచైతన్యము సాక్షి యనఁబడును. అచ్చట “బోద్ధా సాక్షీ” అను నింతమాత్రమే యాసాక్షియొక్క లక్షణముగాఁ జెప్పి యాలక్షణమునందు “ఉదాసీనత్వే సతి” అనుపదము చెప్పనియెడలఁ బరస్పరవివాదము చేయు నట్టిపురుషులయందును సాక్షిత్వము కలుగవలయును. ఏల యన, స్వపరవ్యవహారబోద్ధృత్వ మాపురుషులయందు నున్నది. అయినను, ఆపురుషుల నొక్కరును సాక్షి యని చెప్పుట లేదు. అందువలన నాసాక్షికి “ఉదాసీనత్వే సతి” యను విశేషణము చెప్పఁబడినది. ఆవివాదకర్తలయం దుదాసీనత్వము లేదు. అందువలన వారియం దాసాక్షిలక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు. లేక “ఉదాసీనః సాక్షీ” అను నింతమాత్రమే యాసాక్షియొక్క లక్షణముగాఁ జెప్పి యాలక్షణమునందు “బోద్ధా” అనుపదము చెప్పనియెడల, నావివాదస్థలమునం దుండు స్తంభాదులయందును నుదాసీనత్వ ముండుటవలన నాస్తంభాదికము కూడ సాక్షి కావలయును. ఆస్తంభాదికము నొక్కరును సాక్షి యని చెప్పుట లేదు. అందువలన నాసాక్షిలక్షణమునందు “బోద్ధా” అనుపదము చెప్పఁబడినది. ఆజడస్తంభాదికమందు బోద్ధృత్వము లేదు. అందువలన దానియం దాసాక్షిలక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు.

ఈలాగుననే యీప్రసంగమునందుఁ గేవలబోద్ధృత్వ మైనను భోక్త యగు జీవునియందు నున్నది. అయినను ఆజీవునియం దుదాసీనత్వము లేదు. కేవలోదాసీనత్వ మైనను దేహేంద్రియాదిజడపదార్థములయందు నున్నది. దానియందు బోద్ధృత్వము లేదు. అందువలన నాభోక్త యగు జీవునియందును దేహేంద్రియాదివిషయములయందును నాసాక్షిలక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు. ఇదియే సాక్షిలక్షణము. దీనినే “సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ” అను శ్రుతియును జెప్పుచున్నది.

అచ్చట నీశ్రుతియందు "చేతాః" అనుపదముచేత బోద్ధృత్వము చెప్పఁబడినది. మఱియు "కేవలః" అనుపదముచేత నుదాసీనత్వము చెప్పఁబడినది. అందువలన "చేతాః కేవలః సాక్షీ" అను సాక్షియొక్కలక్షణ మాశ్రుతిచేత సిద్ధించుచున్నది. నైయాయికులు లాత్మను జ్ఞానాదిగుణసహితముగా నంగీకరించి యున్నారు. వారి మతము ఖండించుకొఱకు నాశ్రుతిచేత నాత్మకు నిర్గుణత్వము చెప్పఁబడినది. మఱియు నాశ్రుతియందుండు చకారముచేత నాత్మకు నిష్క్రియత్వముకూడఁ జెప్పఁబడినది. దానిచేత నాత్మను మధ్యమపరిమాణసహిత మనియును క్రియాసహిత మనియు నంగీకరించుదిగంబరులయొక్కమతముకూడ ఖండింపఁబడిన దని తెలియవలయును.

మఱియు నుక్తసాక్షిస్వరూపమే పంచదశప్రకరణ మను గ్రంథముయొక్క నాటకదీపమందు శ్రీవిద్యారణ్యస్వాములచేత నృత్యశాలయందుండు దీపదృష్టాంతముచేత నిరూపింపఁబడి యున్నది. అందువలన నాసాక్షిచేత ఘటాదివిషయములయొక్కస్ఫురణము సంభవించుచున్నది.

## [*] (11) ప్రత్యక్షప్రమావిభాగకథనము. [*]

పూర్వము ప్రత్యక్షప్రమ ఫలసహితముగాఁ జెప్పఁబడినది. ఇఁకఁ బ్రత్యక్షప్రమయొక్కవిభాగము చెప్పఁబడుచున్నది. పూర్వోక్తప్రత్యక్షప్రమ బాహ్యప్రత్యక్షప్రమ ఆంతరప్రత్యక్షప్రమ అను భేదముచేత ద్విప్రకార మగుచున్నది. అందు బాహ్యార్థమును విషయముచేయు ప్రత్యక్షప్రమ బాహ్యప్రత్యక్షప్రమ యనఁబడును. ఆంతరార్థమును విషయముచేయు ప్రత్యక్షప్రమ ఆంతరప్రత్యక్షప్రమ యనఁబడును. ఆద్వివిధప్రమలయందుఁ బ్రథమబాహ్యప్రత్యక్షప్రమ శబ్ద స్పర్శ రూప రస గంధము లను పంచవిషయములయొక్కభేదముచేత పంచప్రకార మగుచున్నది. అనఁగా శబ్దప్రమ స్పర్శప్రమ రూపప్రమ రసప్రమ గంధప్రమ అను పంచప్రకారములుగా బాహ్యప్రత్యక్షప్రమ కలుగుచున్నది. మఱియు నాపంచప్రకారబాహ్యప్రత్యక్షప్రమలకుఁ గ్రమముగాఁ గరణములు శ్రోత్ర త్వక్చక్షూ రసన ఘ్రాణము లను పంచజ్ఞానేంద్రియము లగుచున్నవి. అందువలన నాపంచజ్ఞానేంద్రియములు బాహ్యప్రత్యక్షప్రమాణము లనఁబడుచున్నవి.

మఱియు ద్వితీయ మగు నాంతరప్రత్యక్షప్రమయును ఆత్మగోచరము సుఖాదిగోచర మను భేదముచేత ద్విప్రకార మగుచున్నది. అందు ఆత్మను విషయము చేయు నేప్రమ యున్నదో అది యాత్మగోచర మనఁబడును. సుఖదుఃఖాదులను విషయము చేయు నేప్రమ యున్నదో అది సుఖాదిగోచర మనఁబడును. మఱియు, ఆ

యాత్మగోచరప్రమయును విశిష్టాత్మవిషయము శుద్ధాత్మవిషయ మను భేదముచేత ద్విప్రకార మగుచున్నది. అందు "అహం జీవః" అను ప్రమ యైననో విశిష్టాత్మ విషయక మగుచున్నది. "అహం బ్రహ్మాస్మి" యను ప్రమ శుద్ధాత్మవిషయక మగుచున్నది. "అహం సుఖీ, అహం దుఃఖీ" ఇత్యాదిప్రమ సుఖదుఃఖాదివిషయక మగుచున్నది.

ఇఁక నాంతరప్రత్యక్షప్రమయొక్క కరణము నిరూపింపఁబడుచున్నది. వాచస్పతిమిశ్రులయొక్క మత మే మనఁగా, అంతరింద్రియరూపమనస్సే యాంతర ప్రత్యక్షప్రమకుఁ గరణమై యున్నది. ఎట్లనఁగా బాహ్యరూపాదులయొక్క సాక్షాత్కారమునకుఁ గరణరూపముచేత నెట్లు చక్షురాదీంద్రియములు సిద్ధ మగుచున్నవో అట్లాంతరసుఖదుఃఖాదులయొక్క సాక్షాత్కారమునకుఁ గరణరూపముచేత మనోరూపాంతరింద్రియము సిద్ధ మగుచున్నది. మఱియు సుఖదుఃఖాదులకు వ్యావహారికత్వ ముండుటవలన నాసుఖదుఃఖాదులయొక్క జ్ఞానమునకును వ్యావహారికత్వమే సంభవించుచున్నది.

శంక:—ఆమనస్సునకు విశిష్టాత్మగోచరసాక్షాత్కారకరణత్వ ముండినను శుద్ధాత్మగోచరసాక్షాత్కారకరణత్వము సంభవించుట లేదు. ఒకవేళ ఆమనస్సును శుద్ధాత్మయొక్క సాక్షాత్కారమునకుఁ గరణ మని యంగీకరించినయెడల, ఆత్మసాక్షాత్కారమునందు మనస్సుయొక్క కరణత్వమును నిషేధించియుండు "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ యన్మనసా న మనుతే" ఇత్యాదిశ్రుతులకు విరోధము ప్రాప్త మగును.

సమాధానము:—"మనసై వానుద్రష్టవ్యమ్, దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా" ఇత్యాదిశ్రుతులచేత నామనస్సునకే శుద్ధాత్మసాక్షాత్కారమునందుఁ గరణత్వము చెప్పఁబడి యున్నది. అందువలన నాత్మసాక్షాత్కారమునందు మనస్సునకుఁ గరణత్వము నిషేధించియుండు శ్రుతి యశుద్ధమనోవిషయముగాఁ జెప్పవలయును. అనఁగా, అశుద్ధమనస్సుచేత నాత్మసాక్షాత్కారము కలుగుట లేదు. అందువలన "మనసై వానుద్రష్టవ్యమ్, అను శ్రుతిచేత శుద్ధమనస్సునకే యాత్మసాక్షాత్కారకరణత్వము సిద్ధ మగుచున్నది.

శంక:—"తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి" అను శ్రుతియందౌపనిషద మనువచనముచేత నాత్మ యుపనిషద్రూపశబ్దప్రమాణజన్యజ్ఞానమునకు విషయ మని చెప్పఁబడినది. మఱియు ఆత్మను మానసప్రత్యక్షమునకు విషయముగా నంగీకరించినయెడల నుక్తశ్రుతికి విరోధము ప్రాప్త మగును.

సమాధానము:—శాస్త్రాచార్యులచేత సంస్కృత (సంస్కారమును బొందిన) శుద్ధమనస్సునకే మేము బ్రహ్మాత్మసాక్షాత్కారమునందుఁ గరణత్వ మంగీకరించుచున్నాము. అందువలన నామనస్సునకు నుపనిషద్రూపశాస్త్రముయొక్క యపేక్ష యుండుటవలన నాయౌపనిషదశ్రుతికి విరోధము కలుగుట లేదు. ఆయుపనిషద్రూప శబ్దమున కాత్మసాక్షాత్కారమునందుఁ గరణత్వము లేదు. మఱి యే మనఁగా, ఆ శుద్ధమనస్సునకే కరణత్వ మున్నది. మఱియు విశిష్టాత్మయొక్క సాక్షాత్కారమునం దామనస్సునకుఁ గరణత్వము సిద్ధమే యగుచున్నది. అందువలన శుద్ధాత్మసాక్షాత్కారమందును నామనస్సే కరణ మని యంగీకరింపవలయును. ఆమనస్సునకు భిన్నముగా నొకకరణ మంగీకరించుటయందు ఒకటి కల్పనాగౌరవదోషము ప్రాప్త మగుచున్నది. మఱియొకటి తత్సాధకప్రమాణాభావము. అందువలన నాంతరప్రత్యక్షప్రమకు మనస్సే కరణమై యున్నది.

(12) వాచస్పతిమిశ్రమతఖండనపూర్వకముగా నాచార్యమతవర్ణనము.

మనస్సున కింద్రియరూపత్వము సిద్ధ మైనయెడల దాని కాంతరప్రత్యక్షప్రమను గూర్చి కరణత్వము సిద్ధించును. ఆమనస్సునం దింద్రియరూపత్వమే సంభవించుట లేదు. ఏకారణముచేత ననఁగా, "ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః, ఇంద్రియేభ్యః పరంమనః" ఇత్యాదిశ్రుతిస్మృతులయం దామనస్సింద్రియములకన్నను బృథక్కుగాఁ జెప్పఁబడి యున్నది. అట్లు గాక, ఆమన స్సింద్రియ మైనయెడలఁ బూర్వోక్తశ్రుతిస్మృతు లామనస్సు నింద్రియములకంటెఁ బృథక్కుగాఁ జెప్పి యుండవు. అందువలన నామన స్సింద్రియము కా దనునది నిశ్చితమగుచున్నది.

మఱియు సుఖదుఃఖాదులయొక్క సాక్షాత్కారమునం దామనస్సునకుఁ గరణత్వము సిద్ధ మైనయెడల నామనస్సున కింద్రియరూపత్వము సంభవించును. ఆ మనస్సునకుఁ గరణరూపత్వమే సంభవించుట లేదు. ఎట్లనఁగా, సర్వవృత్తులకు నామనస్సే యుపాదానకారణ మను నీయర్థము పూర్వము చెప్పఁబడి యున్నది. మఱియు నేపదార్థ మేకార్యమున కుపాదానకారణ మగుచున్నదో ఆపదార్థ మాకార్యమునకుఁ గరణ మగుట లేదు. ఎట్లు ఘటరూపకార్యముయొక్క యుపాదానకారణ మైనమృత్తిక యాఘటమునకుఁ గరణరూపము గాక దండాదికమే కరణరూపమై యున్నదో, అట్లు సర్వవృత్తులయొక్క యుపాదానకారణరూపమనస్సుకూడ నావృత్తులను గూర్చి కరణరూపము గాఁజాలదు. ఆకరణత్వ మసంభవ మగుచుండఁగా మనస్సు నింద్రియ మని యంగీకరించుట వ్యర్థము.

శంక:—మనస్సు నింద్రియరూపముగా నంగీకరింపనియెడల నాంతర సుఖదుఃఖాదులయొక్క సాక్షాత్కారమునం దప్రమాత్వమే ప్రాప్త మగును.

సమాధానము:—సుఖదుఃఖాదులయొక్క సాక్షాత్కార మొకప్రమాణముచేత జన్యము కాదు. అందువలన నాసాక్షాత్కారమునం దప్రమాత్వము మాకంగీకార్య మయ్యే యున్నది.

శంక:—సుఖాదులయొక్క సాక్షాత్కార మప్రమారూపముగా నంగీకరించినయెడల నాయప్రమాజ్ఞానమునకు విషయ మైనసుఖదుఃఖాదికము శుక్తిరజతాదికమువలెఁ బ్రాతీతికమే యగును, అనఁగా స్వవిషయకప్రతీతిసమకాలవృత్తియే యగును. దానిచేత నాసుఖదుఃఖాదులయందు వ్యావహారికత్వము సిద్ధము కాక పోవలయును.

సమాధానము:—సుఖదుఃఖాదులయొక్క సాక్షాత్కార మప్రమారూపమే యగును. ఈకారణముచేత నంతకరణమును దద్ధర్మము లగుసుఖదుఃఖాదికములును శుక్తిరజతమువలెఁ బ్రాతీతికములే యగును, వ్యావహారికము కాదు.

శంక:—సుఖదుఃఖాదికము ప్రాతీతిక మని యంగీకరించినయెడల దానికి హర్షశోకాదిరూపార్థక్రియాజనకత్వము సంభవింపక పోవును. వ్యావహారికపదార్థమే యర్థక్రియాజనక మగుచున్నది.

సమాధానము:—వ్యావహారికపదార్థమువలెఁ గొన్ని స్థలములయందుఁ బ్రాతీతికపదార్థముకూడ నర్థక్రియకు జనకమై యున్నది. ఉదా—ప్రాతీతికశుక్తిరజతము పురుషునియొక్క ప్రవృత్తిరూపార్థక్రియకు జనకమై యున్నది. అట్లే ప్రాతీతిక రజ్జుసర్పము పురుషునియొక్క భయపలాయనాదిరూపార్థక్రియకు జనకమై యున్నది. ఈలాగుననే ఆప్రాతీతికసుఖదుఃఖాదికమునకుఁగూడ హర్షశోకాదిరూపార్థక్రియయొక్క జనకత్వము సంభవించు చున్నది.

శంక:—ఎట్లాంతరసుఖదుఃఖాదులయొక్క సాక్షాత్కారము ప్రమాణముచేత నజన్య మగుటవలన నప్రమారూపమై యున్నదో, అట్లాంతరాత్మసాక్షాత్కారముకూడ ప్రమాణముచేత నజన్య మగుటవలన దానికి నప్రమారూపత్వమే ప్రాప్త మగును. అది గాక, ఆ యాత్మసాక్షాత్కారమందును మీ రప్రమాత్వమే యంగీకరించినయెడల, అప్రమాజ్ఞానమునకు విషయ మగుటవలన నాత్మకూడ సుఖదుఃఖాదికమువలెఁ బ్రాతీతికమే యగును. మఱియు నాత్మయొక్క ప్రాతీతికత్వం మాస్తికవాది కెవ్వనికి నిష్టము కాదు. అందువలన నాయాత్మసాక్షాత్కారమునందు మనస్సును గరణ మని యవశ్య మంగీకరింపవలయును.

సమాధానము:—సుఖదుఃఖాదుల సాక్షాత్కారమువలె నాత్మసాక్షాత్కారమందు నప్రమాత్వము చెప్పినయెడల, అది విశిష్టాత్మయొక్కసాక్షాత్కారమున కప్రమాత్వము చెప్పుచున్నారా? లేక, శుద్ధాత్మయొక్కసాక్షాత్కారమున కప్రమాత్వము చెప్పుచున్నారా? అందుఁ బ్రథమపక్ష మంగీకరించినయెడల నది మాకు నిష్టము. అనఁగా విశిష్టాత్మయొక్కసాక్షాత్కారమునకు మేము నప్రమాత్వమే యంగీకరించుచున్నాము. ద్వితీయపక్ష మంగీకరించినయెడల నది సంభవించుట లేదు. ఏల యన "అహం బ్రహ్మాస్మి" అను నీప్రకారముగా శుద్ధాత్మయొక్కసాక్షాత్కారము తత్త్వమస్యాదివేదాంతవాక్యములచే జన్య మగుటవలనఁ బ్రత్యక్షప్రమారూపమే యగును. అందువలన నాశుద్ధాత్మయొక్కసాక్షాత్కారమం దప్రమాత్వము సంభవించుట లేదు.

శంక:—వాక్యము నియమముగాఁ బరోక్షజ్ఞానజనకమే యగును, అపరోక్షజ్ఞానజనకము కాదు. అందువలన నావేదాంతవాక్యముచేత నాత్మయొక్కయపరోక్షజ్ఞానము సంభవించుట లేదు.

సమాధానము:—కొన్నిస్థలములయందు శబ్దముచేతను అపరోక్షజ్ఞానమే కలుగుచున్నది. ఎట్లు "దశమ స్త్వ మసి" అనువాక్యముచేత నాదశమపురుషునకుఁ దనయొక్కయపరోక్షజ్ఞానమే కలుగుచున్నదో, అట్లు తత్త్వమస్యాదివాక్యములచేతను ఈయధికారిపురుషున కాత్మయొక్కయపరోక్షజ్ఞానమే కలుగుచున్నది. ఈయర్థము ముందు శాబ్దప్రమానిరూపణమందుఁ జెప్పఁబడును.

ప్రత్యక్షప్రమానిరూపణము సమాప్తము.

## [*] అ ను మి తి ప్ర మ. [*]

ఇఁక ద్వితీయ మగు ననుమితిప్రమ నిరూపింపఁబడుచున్నది. "లింగజ్ఞానజన్యజ్ఞాన మనుమితిః"—భావము॥ లింగజ్ఞానముచేత జన్య మైన యేజ్ఞాన మున్నదో అది యనుమితి యనఁబడును. ఉదా—"అయం పర్వతః వహ్నిమాన్ ధూమవత్త్వాత్, యో యో ధూమవాన్ స వహ్నిమాన్ యథా మహానసః"— భావము॥ ఈపర్వతము వహ్నిమంతము, ధూమవంత మగుటవలన. ఏది యేది ధూమవంతమై యున్నదో అది యది వహ్నిమంతమే యగుచున్నది, మహానసమువలె. అన్నపాకస్థానము మహానస మనఁబడును. ఈప్రసిద్ధానుమానమునందుఁ బర్వతము పక్షమై యున్నది. వహ్ని సాధ్యమై యున్నది. ధూమము లింగమై యున్నది. మహానసము

దృష్టాంతమై యున్నది. ఈపర్వతము ధూమవంత మను లింగజ్ఞానముచేత నీపురుషున కీపర్వతము వహ్నిమంత మను ననుమితిజ్ఞానము కలుగుచున్నది. అందువలనఁ బూర్వోక్తానుమితిలక్షణము సంభవించుచున్నది.

### [*] (13) అనుమితిలక్షణమును సిద్ధాంతమునందు ఘటిల్లఁ జేయుట. [*]

ఇఁక సిద్ధాంతమునం దనుమితిలక్షణము ఘటిల్లఁ జేయఁబడుచున్నది. "జీవః బ్రహ్మోఽభిన్నః, సచ్చిదానందలక్షణత్వాత్, బ్రహ్మవత్"—భావము॥ ఈజీవాత్మ బ్రహ్మోఽభిన్నుఁడు, సచ్చిదానందరూపుఁ డగుటవలన, ఏది యేది సచ్చిదానందరూపమై యున్నదో అది యది బ్రహ్మోఽభిన్నమే యగుచున్నది. ఎట్లు బ్రహ్మము సచ్చిదానంద రూప మగుటవలన బ్రహ్మముకన్న నభిన్నమే యగునో, అట్లే జీవుఁడును సచ్చిదానందరూపుఁ డగుటవలన బ్రహ్మముకన్న నభిన్నుఁడే యగును. ఈ యనుమానమందుఁ జీవుఁడు పక్షము. బ్రహ్మోఽభేదము సాధ్యము. సచ్చిదానందరూపత్వము లింగము. బ్రహ్మము దృష్టాంతము. ఈ జీవుఁడు సచ్చిదానందరూపుఁ డను లింగజ్ఞానానంతర మీయధికారిపురుషునకు జీవుఁడు బ్రహ్మముకన్న నభిన్నుఁ డను ననుమితిజ్ఞానము కలుగుచున్నది. అందువలనఁ బూర్వోక్తానుమితిలక్షణ మిచ్చటను సంభవించుచున్నది.

### [*] (14) పక్షాదులస్వరూపవర్ణనము. [*]

ఇఁకఁ బ్రసంగానుసారముగాఁ బక్షాదులస్వరూపము నిరూపింపఁ బడుచున్నది. అనుమితిజ్ఞానముకన్నఁ బూర్వ మేపురుషున కేపదార్థమునందు సాధ్యముయొక్క సంశయము కలుగుచున్నదో ఆపదార్థము పక్ష మనఁబడును. ఉదా—ప్రసిద్ధానుమానమునందు "పర్వతో వహ్నిమాన్" అను ననుమితికిఁ బూర్వ మీపురుషున కాపర్వతమునందు వహ్నిసంశయ మున్నది. అందువలన నాపర్వతము పూర్వోక్తానుమానమునందుఁ బక్ష మనఁబడును. ఈపురుషున కాపక్షమునందు లింగజ్ఞానముచేత నేపదార్థముయొక్క జ్ఞానము కలుగుచున్నదో ఆపదార్థము సాధ్య మనఁబడును. ఉదా—ఆ ప్రసిద్ధానుమానమునం దీపురుషునకుఁ బర్వతరూపపక్షమునందు ధూమరూపలింగజ్ఞానముచేత వహ్నిజ్ఞానము కలుగుచున్నది. అందువలన నీయనుమానమునందు వహ్ని [illegible] పురుషునకు సాధ్యలింగములు రెండు నేపదార్థమునందు [illegible] ఆపదార్థము దృష్టాంత మనఁబడును. ఉదా—ప్రసిద్ధానుమా[illegible] మహానసమునందు వహ్నిరూపసాధ్యముయొక్కయు ధూమరూప[illegible]యొక్కయు నిశ్చయ మగుచున్నది. అందువలన నామహానసము పూర్వోక్తానుమానమునందు దృష్టాంత మనఁబడును.

శంక:—అనుమితి యేలింగజ్ఞానముచేతఁ గలుగుచున్నదో ఆలింగము యొక్కస్వరూప మేది? అనుశంక కలుగఁగా - నిఁక నాలింగముయొక్కలక్షణము చెప్పఁబడుచున్నది.

సమాధానము:—"వ్యాప్త్యాశ్రయః లింగమ్"—భావము॥ సాధ్యవ్యాప్తి కేది యాశ్రయమై యున్నదో అది లింగ మనఁబడును. ఉదా—ప్రసిద్ధానుమానము నందు వహ్నిరూపసాధ్యముయొక్కవ్యాప్తి కాశ్రయము ధూమమై యున్నది. అందు వలన నాధూమము లింగ మనఁబడును.

శంక:—ఏవ్యాప్తి కాశ్రయ మగుటవలన ధూమాదికము లింగ మనఁబడు చున్నదో ఆవ్యాప్తియొక్కస్వరూప మేది? అనుశంక కలుగగా నిఁక వ్యాప్తియొక్క స్వరూపము చెప్పఁబడుచున్నది.

సమాధానము:—"సాధనసాధ్యయో ర్నియత సామానాధికరణ్యం వ్యాప్తిః"—భావము॥ సాధనసాధ్యములరెంటికిని ఏ యవ్యభిచరితసామానాధికరణ్యా మున్నదో అది వ్యాప్తి యనఁబడును. ఉదా—ప్రసిద్ధానుమానమునందు ధూమరూప సాధనమునకును వహ్నిరూపసాధ్యమునకును అవ్యభిచరితసామానాధికరణ్యా మున్నది. అనఁగా వహ్నిరూపసాధ్యమును విడిచి ధూమరూపసాధన మెకప్పుడును స్వతంత్ర ముగా నుండదు. ఇదియే ఆధూమమునందు వహ్నియొక్కవ్యాప్తియై యున్నది. వహ్ని యైననో యాధూమమును విడిచి తప్తలోహపిండమునం దున్నది. అందువలన నావహ్నియందు ధూమమునకు వ్యాప్తి లేదు. ఉక్తవ్యాప్తి కాశ్రయ మగుటవలన ధూమాదిసాధనము వ్యాప్య మనఁబడును. మఱియు వ్యాప్తినిరూపక మగుటవలన వహ్న్యాదిసాధ్యము వ్యాపక మనఁబడును. లింగము, సాధనము, హేతు వను నీ త్రివిధశబ్దములు నొక్క యర్థముయొక్కవాచకము లగుచున్నవి.

శంక:—పూర్వోక్తవ్యాప్తిజ్ఞానము పురుషున కేయుపాయముచేతఁ గలు గును?

సమాధానము:—ఎచ్చట ధూమ మున్నదో అచ్చట వహ్ని యవశ్య మున్నది అను నీప్రకారముగా మహానసాదులయందు మాటిమాటికి ధూమవహ్నుల యొక్కసహచారదర్శన మగుచున్నది. ఆసహచారదర్శనముచేతనే యీపురుషునకు ధూమము వహ్నియొక్కవ్యాప్య మను వ్యాప్తిజ్ఞానము కలుగుచున్నది. అయినను ఏసాధనమునం దీసాధనము సాధ్యాభావసహితమం దున్న దను వ్యభిచారజ్ఞానము కలుగుచున్నదో ఆసాధనమునందు సహచారదర్శనము కలిగియు నాసాధ్యముయొక్క వ్యాప్తిజ్ఞానము కలుగదు. ఉదా—ఎచ్చటఁ బార్థివత్వమున్నదో అచ్చట లోహలేఖ్యత్వ

మున్న దను సహచారదర్శనము కలిగియు హీరాదులయందు లోహలేఖ్యత్వాభావ ముండినను ఆపార్థివత్వము చూడఁబడుచున్నది. అందువలన నాసహచారదర్శనము వలన నాపార్థివత్వమందాలోహలేఖ్యత్వముయొక్క వ్యాప్తిజ్ఞానము కలుగుట లేదు. అందువలన నావ్యభిచారజ్ఞానము వ్యాప్తిజ్ఞానమునకుఁ బ్రతిబంధకమై యున్నది. ప్రతిబంధకాభావసహితసహచారజ్ఞానమే యావ్యాప్తిజ్ఞానమునకుఁ గారణ మగుచున్నది. అందుఁ గాష్ఠాదిపార్థివపదార్థములయందు లోహశస్త్రమువలన నక్షరాదికములను వ్రాయఁగలుగుట లోహలేఖ్యత్వ మనఁబడును. ఇంతయును జెప్పుటవలన నాయనుమానమున కీక్రిందిరీతి సిద్ధించుచున్నది. మహానసాదులయందు ధూమవహ్నులయొక్క సహచారదర్శనమువలన నీపురుషునకు ధూమము వహ్నివ్యాప్తిసహితము అను నీ ప్రకారముగా వ్యాప్తిజ్ఞానము కలుగుచున్నది. తదనంతర మొకకాలమందుఁ బర్వత సమీపమును బొందిన యాపురుషునకుఁ బర్వతమునందు, ఈపర్వతము ధూమవంత మను ధూమరూపలింగజ్ఞానము కలుగుచున్నది. తదనంతరము పూర్వానుభూత వ్యాప్తియొక్క సంస్కార ముద్బుద్ధ మగుచున్నది. తదనంతర మాపురుషున కీపర్వతము వహ్నిమంత మను ననుమితిజ్ఞానము కలుగుచున్నది. అచ్చట ఆవ్యాప్తిజ్ఞాన మైననో ఆయనుమితిప్రమకుఁ గరణ మగుటవలన ననుమానప్రమాణమై యున్నది. మఱియు నావ్యాప్తియొక్క యుద్బుద్ధసంస్కారము కరణమునకు నవాంతరవ్యాపారమై యున్నది. అనుమితిప్రమ ఫలమై యున్నది. లింగజ్ఞానము సంస్కారోద్బోధక మగుట వలన సహకారికారణమై యున్నది.

## [*] (15) అనుమితిప్రమావిభాగకథనము. [*]

ఇఁకఁ బూర్వోక్తానుమితిప్రమయొక్క విభాగవర్ణనము చేయఁబడుచున్నది. అనుమితిప్రమ స్వార్థానుమితి పరార్థానుమితి యనుభేదముచేత ద్విప్రకార మగుచున్నది. అచ్చటఁ బురుషునకు వేఱొకనియుపదేశము లేకయే వ్యాప్తి లింగజ్ఞానాదికములచేత నేయనుమితి కలుగుచున్నదో అది స్వార్థానుమితి యనఁబడును. ఆస్వార్థానుమితియొక్క రీతి పూర్వము నిరూపింపఁబడి యున్నది. ఇఁక ద్వితీయ మగుపరార్థానుమితియొక్క ప్రకారము చెప్పఁబడు చున్నది. పూర్వోక్తరీతిగాఁ దాను బర్వతమునందు వహ్నినిశ్చయము చేసి, యన్యపురుషునకు వహ్నియొక్క నిశ్చయము కలిగించుట యేది గలదో, అది పరార్థానుమితి యనఁబడును. ఆపరార్థానుమితి న్యాయముచేత సిద్ధ మగుచున్నది. అవయవసముదాయము న్యాయ మనఁబడును. ఆయనుమానవాక్యమందే ప్రతిజ్ఞాదివాక్యము లున్నవో అవి యవయవములై యున్నవి. అందు నైయాయికు లైననో ప్రతిజ్ఞ హేతువు ఉదాహరణము ఉపనయము నిగమన

మను పంచావయవములసముదాయమును న్యాయ మందురు. ఉదా—ప్రసిద్ధాను మానమునందు "పర్వతో వహ్నిమాన్" అనునది ప్రతిజ్ఞావాక్యమై యున్నది. "ధూమవత్త్వాత్" అనునది హేతువాక్యమై యున్నది. "యో యో ధూమవా న్స వహ్నిమా న్యథా మహానసః" అనునది యుదాహరణవాక్యమై యున్నది. "తథాచా 2 యమ్" అనఁగా, ఈపర్వత మామహానసమువలె ధూమవంతము అనునది యుపనయవాక్యమై యున్నది. "తస్మా త్తథా" అనఁగా ధూమవంత మగుట వలన నీపర్వత మామహానసమువలె వహ్నిమంతమే యగును. అనునది నిగమన వాక్యమై యున్నది. ఈప్రతిజ్ఞాదికపంచావయవలక్షణములు న్యాయప్రకాశము యొక్క—షష్ఠపరిచ్ఛేదమునం దనుమాననిరూపణమందుఁ జెప్పఁబడి యున్నవి. దాని నచ్చటఁ దెలియనగును. ఈప్రకారముగా ప్రతిజ్ఞాదిపంచావయవసముదాయరూప న్యాయముచేత నన్యపురుషునకును వ్యాప్తిలింగాదులయొక్క—జ్ఞానము కలిగి వహ్న్య నుమితి కలుగుచున్నది ఇదియే పరార్థానుమితి యనఁబడును.

మఱియు వేదాంతసిద్ధాంతమం దైననో ప్రతిజ్ఞాహేతూదాహరణములను త్రివిధావయవసముదాయమునకు న్యాయ మని పేరు. లేక, ఉదాహరణోపనయ నిగమనము లను త్రివిధావయవసముదాయమునకు న్యాయ మనిపేరు. ఈన్యాయము చేతనే యన్యపురుషునకును అనుమితిజ్ఞానమం దుపయోగి యగు వ్యాప్త్యాదుల యొక్క—జ్ఞానము కలుగుచున్నది. అందువలనఁ బంచావయవము లంగీకరించుట నిష్ఫలమై యున్నది. అచ్చటఁ బూర్వము "పర్వతో వహ్నిమాన్" అను లౌకి కానుమానవాక్యమందుఁ బ్రతిజ్ఞాద్యవయవములు చూపఁబడినవి.

### (16) వైదికానుమానవాక్యమునందుఁ బ్రతిజ్ఞాదులయొక్క—వర్ణనము.

ఇఁక జీవబ్రహ్మాభేదసాధకవైదికానుమానవాక్యమందును, ఆప్రతిజ్ఞాద్యవ యవనిరూపణము చేయఁబడుచున్నది. అచ్చట "జీవః పరస్మాత్ నభిద్యతే, సచ్చి దానందలక్షణత్వాత్, యః సచ్చిదానందలక్షణః స పరస్మా న్నభిద్యతే, యథా పర మాత్మా, తథా చాయమ్, తస్మా త్తథా"— భావము॥ ఈజీవుఁడు బ్రహ్మముకంటె భిన్నుఁడు కాఁడు. అనునది ప్రతిజ్ఞావాక్యము. సచ్చిదానందరూపుఁ డగుటవలన అనునది హేతువాక్యము. ఏది సచ్చిదానందరూపమై యున్నదో అది బ్రహ్మము కంటె భిన్నము కాదు పరమాత్మవలె అనునది యుదాహరణవాక్యము. జీవుఁడు పరమాత్మవలె సచ్చిదానందరూపుఁడు, అనునది యుపనయవాక్యము. సచ్చిదానంద రూపుఁ డగుటవలన నీజీవుఁడు బ్రహ్మముకంటె నభిన్నుఁడే యగును అనునది నిగమన

వాక్యము. ఈప్రకారముగాఁ బ్రతిజ్ఞాది త్రివిధావయవములయొక్క, లేక, ఉదాహరణాది త్రివిధావయవములయొక్క సముదాయరూపన్యాయముచేత నీయధికారిపురుషునకు వ్యాప్తిలింగాదులయొక్క జ్ఞానము కలిగి - జీవబ్రహ్మాభేదవిషయకానుమితిప్రమ కలుగుచున్నది.

శంక:—జీవాత్మయందెప్పు డొకప్రమాణముచేత సచ్చిదానందరూపత్వము సిద్ధమగుచున్నదో అప్పుడా సచ్చిదానందరూపత్వహేతువువలన నాజీవుని యందు బ్రహ్మాభేదము సిద్ధించును. ఆజీవునియొక్క సచ్చిదానందరూపత్వమందొక ప్రమాణమును లేదు. అందువలన నాసచ్చిదానందరూపత్వహేతు వాజీవరూపపక్షమునం దవృత్తి యగుటవలన స్వరూపాఽసిద్ధ మను హేత్వాభాస మగును.

ఇట్లు శంక ప్రాప్తింపఁగా నిఁక శ్రుతిస్మృతియుక్త్యనుభవములచేత జీవాత్మయందు సచ్చిదానందరూపత్వము సిద్ధము చేయఁబడుచున్నది.

[*] (17) జీవాత్మయందు సచ్చిదానందరూపత్వకథనము. [*]

"అవినాశీ వా అరే ఽయ మాత్మా సన్మాత్రో నిత్యః శుద్ధో బుద్ధః"—భావము॥ ఓ మైత్రేయీ! ఈయాత్మ నాశరహితము, ఈయాత్మ సత్తామాత్రము, నిత్యము, శుద్ధము, జ్ఞానస్వరూపము. ఇత్యాదిశ్రుతులచేత నీజీవాత్మయొక్క సత్యరూపత్వము సిద్ధమగుచున్నది. మఱియు "నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః"—భావము॥ ఈయాత్మ నిత్యము, సర్వత్ర వ్యాపకము, కూటస్థము, అచలము, సనాతనము. ఇత్యాది గీతాస్మృతివచనములచేతను ఆజీవాత్మయొక్క సత్యరూపత్వము సిద్ధమగుచున్నది. ఈజీవాత్మ సత్యము కానియెడలఁ, గృతనాశ మకృతాభ్యాగమ మను రెండుదోషములు ప్రాప్తము లగును. అందుఁ జేయఁబడినపుణ్యాపాపకర్మములు ఫలభోగము లేక వినాశ మొందుట కృతనాశ మనఁబడును. పూర్వము చేయఁబడనికర్మములు ఫలభోగమునకు వచ్చుట యకృతాభ్యాగమ మనఁబడును. ఇత్యాదియుక్తిచేతఁగూడ నాజీవాత్మయొక్క సత్యరూపత్వము సిద్ధమగుచున్నది. మఱియు "అహ మస్మి" అను ననుభవముచేతను ఆయాత్మయొక్క సత్యరూపత్వము సిద్ధమగుచున్నది. అందువలన నాజీవాత్మ సత్యరూపమే యగును. "అత్రాయం పురుషః స్వయం జ్యోతి ర్భవతి, ఆత్మై వాస్య జ్యోతి ర్భవతి, యో ఽయం విజ్ఞానమయః, త్రిషు ధామసు య ద్భోగ్యం భోక్తా భోగశ్చ య ద్భవేత్, తేభ్యో విలక్షణ స్సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః"—భావము॥ ఈస్వప్నావస్థయం దీయాత్మయే స్వయంజ్యోతియై యున్నది. అనఁగా ఆస్వప్నావస్థయందు సూర్యచం

ద్రాదిబాహ్యజ్యోతులు లేకపోయినను ఆ యాత్మస్వరూపజ్యోతిచేతనే సర్వవ్యవహారములు కలుగుచున్నవి. మఱియు ఈసంఘాతమున కాత్మయే జ్యోతిర్మై యున్నది. ఈయాత్మ విజ్ఞానరూపమై యున్నది. మఱియు జాగ్రత్స్వప్నసుషుప్తులను త్రివిధావస్థలయందు యథాక్రమముగా విద్యమానులగు విశ్వతైజసప్రాజ్ఞులను త్రివిధభోక్తలును వారియొక్క స్థూలసూక్ష్మాదిభోగ్యపదార్థములును అంతఃకరణముయొక్క లేక అజ్ఞానముయొక్క వృత్తిరూపభోగమును ఏవి కలవో, ఆసర్వముకంటె విలక్షణమైన చైతన్యమాత్రసాక్షి నేనై యున్నాను. ఇత్యాదిశ్రుతులచేత జీవాత్మయొక్క చైతన్యరూపత్వము సిద్ధమగుచున్నది. మఱియు "యథాప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః। క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత"—భావము॥ ఓ యర్జునా! ఒకఁడే సూర్యుఁడు సర్వలోకముల నెట్లు ప్రకాశింపఁజేయుచున్నాఁడో, అట్లు ఈ యాత్మ సర్వసంఘాతమును బ్రకాశింపఁజేయుచున్నది. ఇత్యాదిస్మృతులచేతను నాజీవాత్మయొక్క చైతన్యరూపత్వము సిద్ధమగుచున్నది. మఱియు నొకవేళ నీయాత్మ చైతన్యరూపము కానియెడలఁ బ్రకాశకాభావముచేత జగత్తున కంధత్వము ప్రాప్తమగును. ఇత్యాదియుక్తులచేతఁగూడ నాజీవాత్మయొక్క చైతన్యరూపత్వము సిద్ధమగుచున్నది. "అహమనుభవామి" అను ననుభవముచేతను ఉక్తాత్మయొక్క చైతన్యరూపత్వము సిద్ధమగుచున్నది. అందువలన నాజీవాత్మ చైతన్యరూపమే యగును.

మఱియు "యో వై భూమా తత్సుఖమ్, కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనందో న స్యాత్, ఏష హ్యేవానందయాతి"—భావము॥ దేశకాలవస్తుపరిచ్ఛేదరహితమగు నేయాత్మ యున్నదో అది సుఖరూపము కానియెడల నపానప్రాణదేహేంద్రియాదివ్యాపారముల నెవఁడు చేయును? ఇఁక నేమనఁగా, ఎవఁడును జేయఁడు. ఏల యన లోకులయొక్క జీవన మానందపూర్వకమే యగుచున్నది. అతిదుఃఖము ప్రాప్తించునపుడు ప్రాణులయొక్క వియోగమే చూడఁబడుచున్నది. ఇత్యాదిశ్రుతులచేత నాజీవాత్మయొక్క యానందరూపత్వము సిద్ధమగుచున్నది. "యో ఽన్తః సుఖో ఽన్తరారామ స్తథా ఽన్తర్జ్యోతి రేవ యః" ఇత్యాది గీతాస్మృతివచనములచేతను ఆజీవాత్మయొక్క యానందరూపత్వము సిద్ధమగుచున్నది. ఒకవేళ నీయాత్మ యానందరూపము కానియెడల సర్వలోకులకుఁ దనయాత్మయందుఁ బరమప్రీతి కలుగఁగూడదు. సర్వలోకులకుఁ దనయాత్మయందైననో పరమప్రీతియే చూడఁబడుచున్నది. మఱియు సుషుప్తియందుండి మేల్కొనినపురుషునకు నేను సుఖముగా నిద్రించితి ననుస్మరణ కలుగుచున్నది. ఆస్మరణ యనుభ

వము లేక కలుగదు. అందువలన సుషుప్తియందు సుఖానుభవము కల్పింపఁబడు చున్నది. అచ్చట సుషుప్తియందు విషయజన్యానంద మైననో లేదు. ఇంకే మనఁ గాఁ దనస్వరూపానందమే యున్నది. ఇత్యాదియుక్తులచేతను ఆజీవాత్మయొక్కయా నందరూపత్వము సిద్ధ మగుచున్నది. నాయం దోకప్పుడును అప్రియత్వము లే దను ననుభవముచేతను ఆజీవాత్మయొక్కయానందరూపత్వము సిద్ధ మగుచున్నది. అందు వలన నీజీవాత్మ యానందరూపమే యగును. ఈప్రకారముగా శ్రుతిస్మృతియుక్త్యను భవములచేత నీజీవాత్మయొక్కసచ్చిదానందరూపత్వము సిద్ధ మగుటవలన, నాసచ్చి దానందరూపత్వహేతు వాజీవాత్మరూపపక్షమం దుండుటవలన, స్వరూపాసిద్ధ మను హేత్వాభాసము లేదు.

మఱియుఁ బూర్వోక్తానుమానమునందుఁ బక్షరూపజీవాత్మయొక్కసచ్చి దానందరూపత్వ మెట్లు శ్రుత్యాదిప్రమాణములచేత సిద్ధ మగుచున్నదో, అట్లు దృ ష్టాంతరూపపరమాత్మయొక్కసచ్చిదానందరూపత్వమును శ్రుతిప్రమాణముచేతనే సిద్ధ మగుచున్నది. అచ్చట శ్రుతి “ సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, ఆనందో బ్రహ్మ ”— భావము॥ బ్రహ్మము సత్యరూపము జ్ఞానరూపము అనంతరూపము ఆనందరూపము. దీనిచే నాసచ్చిదానందరూపత్వహేతు వాపరమాత్మరూపదృష్టాంతమందును విద్య మానమే యగుచున్నది. యద్యపి పూర్వోక్తానుమానమునందు జీవాత్మా ఽభిన్న మైనబ్రహ్మమునకు దృష్టాంతరూపత్వము సంభవించుట లేదు. ఏల యన, సర్వత్ర పక్షముకన్న భిన్నముగానే దృష్టాంత మున్నది. తథాపి జీవబ్రహ్మములయొక్కకల్పిత భేద మంగీకరించినపుడు బ్రహ్మమునకు దృష్టాంతరూపత్వము సంభవించును. వాస్త వముచేత నైననో జీవబ్రహ్మముల కభేదమే యున్నది. ఆజీవబ్రహ్మములయొక్కయభే దము ప్రథమపరిచ్ఛేదమునందు భేదవాదఖండనపూర్వకముగా విస్తరముగాఁ జెప్పఁ బడి యున్నది.

శంక:—నేను బ్రహ్మరూపుఁడనై యున్నా నను నుక్తానుమితి సర్వపురుషుల కుత్పన్న మగుచున్నదా ? లేక యొకపురుషున కుత్పన్న మగుచున్నదా ?

సమాధానము:—ఏపురుషుఁడు బ్రహ్మవేత్త యగు గురువుయొక్కముఖ మునందుండి శ్రద్ధాభక్తిపూర్వకముగా వేదాంతశాస్త్రశ్రవణము చేసియుఁ బ్రథమ పరిచ్ఛేదమునందుఁ జెప్పఁబడి యుండు తత్త్వంపదార్థశోధన చేసియు నున్నాఁడో ఆపురుషునకే తనయాత్మయందు సచ్చిదానందరూపత్వహేతుజ్ఞానముచేత “ అహం బ్రహ్మాస్మి” యను జీవబ్రహ్మాభేదవిషయకానుమితి కలుగుచున్నది. వేదాంతశ్రవణాది రహితపురుషున కాయభేదవిషయకానుమితి కలుగుట లేదు.

శంక:—“తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి” అనుశ్రుతిచేత నా బ్రహ్మము కేవలౌపనిషద్రూపశబ్దప్రమాణమునకు విషయముగాఁ జెప్పఁబడియున్నది. ఒకవేళ నాబ్రహ్మమునం దనుమానప్రమాణవిషయత నంగీకరించినయెడలఁ బూర్వోక్తశ్రుతికి విరోధ మగును. అందువలన నాబ్రహ్మమునం దుక్తానుమానవిషయత సంభవించుట లేదు.

సమాధానము:—బ్రహ్మమునం దనుమానమునకు స్వతంత్రముగాఁ బ్రమాణత్వము లేదా? లేక వేదాంతమునకు సహకారిత్వరూపముచేతను బ్రమాణత్వము లేదా? అచ్చటఁ బ్రథమపక్ష మంగీకరించినయెడల నది మాకును ఇష్టమై యున్నది. అనఁగాఁ బురుషునియొక్క కల్పనారూపానుమానప్రమాణ మతీంద్రియ బ్రహ్మమందు స్వతఃప్రమాణరూపముగా మేమును అంగీకరించుట లేదు. మఱియు ద్వితీయపక్ష మంగీకరించినయెడల నది సంభవించుట లేదు. ఏల యన “ఆత్మా వా ఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యః” అనుశ్రుతిచేతను “శ్రోతవ్యః శ్రుతివాక్యేభ్యో మంతవ్య ఉపపత్తిభిః” అనుస్మృతిచేతను, ఆత్మసాక్షాత్కారముకొఱకు మననము విధింపఁబడి యున్నది. అనుమానాదియుక్తులచేత నేయాత్మవిచారము చేయఁబడుచున్నదో అది మనన మనఁబడును. ఈరీతిగా మననమం దుపయోగి యగుటచేత నాయనుమానమునకు వేదాంతశాస్త్రముయొక్క సహకారిత్వముచేతఁ బ్రమాణరూపత్వము మా కంగీకార్య మయ్యే యున్నది. ఒకవేళ సర్వప్రకారములచేతను ఆయనుమాన మప్రమాణరూపమే యనినయెడల శ్రుతిస్మృతులయం దేమననవిధి చెప్పఁబడి యున్నదో అది వ్యర్థమే యగును. అందువలన వేదాంతశాస్త్రమునకు సహకారిత్వరూపముచేత నాయనుమానమునకుఁ బ్రమాణత్వ మవశ్య మంగీకరింపవలయును. ఈకారణముచేతనే “అహం బ్రహ్మ ఽస్మి, అయ మాత్మా బ్రహ్మ” ఇత్యాదిశ్రుతులచేత బోధింపఁబడు జీవబ్రహ్మాఽభేదము పూర్వోక్తానుమానముచేత సిద్ధ మగుచున్నది. అచ్చట ఏయర్థమును వేదాంతశాస్త్రము ప్రతిపాదించుచున్నదో ఆయర్థమునే యేయనుమానము సిద్ధింపఁజేయుచున్నదో. ఆయనుమానము వేదాంతశాస్త్రమునకు సహకారి యనఁబడును.

మఱియు “నేహ నానాస్తి కించన, వాచారంభణం వికారో నామధేయమ్, మాయామాత్ర మిదం ద్వైతమ్” ఇత్యాదిశ్రుతులచేత నెట్లు ప్రపంచమిథ్యాత్వము సిద్ధ మగుచున్నదో అట్లనుమానముచేతను ఆమిథ్యాత్వము సిద్ధ మగుచున్నది. అది ఎట్లనఁగా.

### [*] (18) అనుమానప్రమాణముచేతఁ బ్రపంచమిథ్యాత్వము. [*]

"వ్యావహారికప్రపంచః మిథ్యా, దృశ్యత్వాత్, శుక్తిరజతవత్"— భావము: ఈ యాకాశాదివ్యావహారికప్రపంచము మిథ్యాభూతము, దృశ్యమగుట వలన, ఏయేపదార్థము దృశ్య మగుచున్నదో ఆయాపదార్థము మిథ్యయే యగుచున్నది, ఉదా—శుక్తిరజతము దృశ్య మగుటవలన మిథ్యయే యగుచున్నది. ఈ యనుమానముచేత నధికారిపురుషునకు బ్రహ్మముకన్న భిన్న మైనసర్వప్రపంచమందు మిథ్యాత్వానుమితి కలుగుచున్నది.

శంక:—ఈప్రపంచమునందు మిథ్యాత్వ మనునది యెట్టిది?

సమాధానము:—సదసద్విలక్షణత్వరూప మగు నేయనిర్వచనీయత్వ మున్నదో అదియే యాప్రపంచమునందు మిథ్యాత్వము. ప్రపంచమును సత్య మని యంగీకరించినయెడల బ్రహ్మమువలెఁ బ్రపంచమునకు బాధ లేకపోవలయును. బ్రహ్మ సాక్షాత్కారముచేత నాప్రపంచమునకు బాధ కలుగుచున్నది. అందువలన నాప్ర పంచము సత్తుకన్నను విలక్షణమై యున్నది. ఆప్రపంచమును అసత్య మని యంగీక రించినయెడల నరశృంగవంధ్యాపుత్రులవలెఁ బ్రపంచము ప్రత్యక్షముగాఁ గూడదు. ఆప్రపంచప్రత్యక్షమో సర్వులకును గలుగుచున్నది. అందువలన నాప్రపంచ మస త్తుకన్నను విలక్షణమై యున్నది. మఱియు సదసత్తులరెంటికిని బరస్పరవిరోధ మగుటవలన సదసదుభయరూపత్వమును ఆప్రపంచమునందు సంభవించుట లేదు. ఈప్రకార మైన యనిర్వచనీయత్వమే ప్రపంచమందును శుక్తిరజతమందును మిథ్యా త్వమై యున్నది.

శంక:—ఏదృశ్యత్వరూపహేతువుచేతఁ బ్రపంచమునందు మిథ్యాత్వము సిద్ధము చేయఁబడినదో ఆదృశ్యత్వహేతువు వ్యభిచారి యగుటవలన నసద్ధేతువే యగుచున్నది. ఎట్లనఁగా, దర్శనవిషయత్వము దృశ్యత్వ మనఁబడును. వృత్తి జ్ఞానము దర్శన మనఁబడును. ఆవృత్తిజ్ఞానవిషయత్వరూపదృశ్యత్వము బ్రహ్మమునందు నున్నది. ఆబ్రహ్మమునందుఁ బూర్వోక్తమిథ్యాత్వరూపసాధ్యమో లేదు. అందు వలన మిథ్యాత్వరూపసాధ్యాభావసహితబ్రహ్మమునం దాదృశ్యత్వహేతు వుండుట వలన, నాహేతువు వ్యభిచారియే యగును.

సమాధానము:—పూర్వోక్తానుమానమునందు దృశ్యత్వ శబ్దముచేత వృత్తిజ్ఞానవిషయత్వరూపదృశ్యత్వము వివక్షితము కాదు. ఇంకే మనఁగా, నావృత్తి యందారూఢ మగునేఫలచైతన్య మున్నదో దానికి విషయత్వ మనుదృశ్యత్వమే వివ క్షితమై యున్నది. అచ్చట నాబ్రహ్మమునం దావరణనివృత్తికొఱకు వృత్తియొక్క—

విషయత్వ ముండినను స్వప్రకాశరూప మగుటవలన నాఫలచైతన్యముయొక్క విష యత్వము లేదు. అందువలన నాదృశ్యత్వహేతు వాబ్రహ్మమునం దవృత్తి యగుట వలన వ్యభిచారి గాదు. ఇఁక నే మనఁగా సద్ధేతువై యున్నది.

ఇచ్చట తాత్పర్య మే మనఁగా, ఒకటి సద్ధేతువు, మఱియొకటి అసద్ధేతువు. అందు సద్ధేతువుచేత నైననో ఆయాసాధ్యములయొక్క సిద్ధి యగుచున్నది. అసద్ధేతువుచేత నాసాధ్యముయొక్క సిద్ధి యగుట లేదు. ఆ యసద్ధేతువునే దుష్టహేతు వనియును హేత్వాభాస మనియును జెప్పుదురు. ఆహేత్వాభాసముగూడ సవ్యభిచారము, విరుద్ధము అసిద్ధము సత్ప్రతిపక్షము, బాధిత మనుభేదముచేతఁ బంచప్రకారమై యున్నది. అందుఁ బ్రథమ మగు సవ్యభిచారమును, సాధారణము అసాధారణము అనుపసంహారము అనుభేదముచేతఁ ద్రిప్రకారమై యున్నది. మఱియుఁ దృతీయ మగు నసిద్ధమును, ఆశ్రయాసిద్ధము స్వరూపాసిద్ధము వ్యాప్యత్వాసిద్ధ మనుభేదముచేతఁ ద్రిప్రకారమై యున్నది. ఈపంచహేత్వాభాసములయొక్క లక్షణములును ఉదాహరణములును న్యాయప్రకాశముయొక్క మష్ఠపరిచ్ఛేదమునం దనుమాననిరూపణమందు మాచే విస్తరముగా నిరూపింపఁబడియున్నది. గ్రంథవిస్తరభయముచే నిచ్చట విరమించితిమి. జిజ్ఞాసగలవా రచ్చటఁ దెలియనగును.

ఇచ్చట నైయాయికు లాయనుమానమును, కేవలాన్వయి కేవలవ్యతిరేకి అన్వయవ్యతిరేకి యనుభేదముచేతఁ ద్రివిధముగా నంగీకరించుచున్నారు. అందు ఏ యనుమానముయొక్క సాధ్యమున కెచ్చటను అత్యంతాభావము లేదో, ఆయనుమానము కేవలాన్వయి యనఁబడును. ఉదా—"ఘటో ఽభిధేయః, ప్రమేయత్వాత్" ఇత్యా ద్యనుమానములై యున్నవి. ఇచ్చట అభిధేయత్వరూపసాధ్యమునకు ఎచ్చటను అత్యంతాఽభావము లేదు. ఇం కే మనఁగా, పదముయొక్క వాచ్యత్వరూపాభిధేయత్వమును ప్రమాజ్ఞానవిషయత్వరూపప్రమేయత్వమును, సర్వపదార్థములయందు నున్నది. అందువలనఁ బూర్వోక్తానుమానము కేవలాన్వయి యనఁబడును. మఱియు, ఏయనుమానముయొక్క సాధ్యమునకును హేతువునకును ఎచ్చటను సహచారదర్శనము లేదో, ఆసాధ్యహేతువులయొక్క అభావములకే సహచారదర్శన మున్నదో ఆ యనుమానము కేవలవ్యతిరేకి యనఁబడును. ఉదా—"పృథివీ ఇతరేభ్యో భిద్యతే, గంధవత్త్వాత్, య న్నైవం త న్నైవం, యథా జలాదిః" ఇత్యా ద్యనుమానములై యున్నవి. ఇచ్చట, పృథివి జలాదీతరపదార్థములకన్న భిన్న మను సాధ్యమునకును గంధరూపహేతువునకును ఆపృథివీరూపపక్షమును విడిచి అన్యత్ర మెచ్చటను సహచారము లేదు. ఇఁక నే మనఁగా, ఆసాధ్యహేతువులయొక్క యభావములకే జలా

దలయందు సహచార మున్నది. అందువలన నుక్తానుమానము కేవలవ్యతిరేకి యనఁబడును. మఱియు నేయనుమానముయొక్క సాధ్య హేతువులరెంటికిని యారెంటి యొక్క యభావములకును ఎచ్చటను సహచారదర్శన మున్నదో ఆయనుమాన మన్వయవ్యతిరేకి యనఁబడును. ఉదా—"పర్వతో వహ్నిమాన్ ధూమవత్త్వాత్" అను ప్రసిద్ధానుమానమై యున్నది. ఇచ్చట వహ్నిరూపసాధ్యమునకును ధూమ రూపహేతువునకును మహానసమందు సహచారము చూడఁబడుచున్నది. మఱియు నారెంటియొక్క యభావములకు జలహ్రదమందు సహచారము చూడఁబడుచున్నది. అందువలన నీయనుమాన మన్వయవ్యతిరేకి యనఁబడును. ఈత్రివిధానుమానము లును న్యాయప్రకాశముయొక్క షష్ఠపరిచ్ఛేదమునందు విస్తరముగా నిరూపింపఁ బడి యున్నవి. దాని నచ్చటఁ దెలియవలయును.

ఈనైయాయికులయొక్క మత మసంగతము. ఎట్లనఁగా, "నేహ నానాస్తి కించన" ఇత్యాదిశ్రుతులచేత బ్రహ్మమునందు సర్వప్రపంచముయొక్క యత్యంతాభావము చెప్పఁబడియున్నది. అందువలన బ్రహ్మముకన్నను భిన్నమైనయొక పదార్థ మందుఁగూడ నత్యంతాభావముయొక్క యప్రతియోగిత్వము లేదు. ఇఁక నే మనఁగా సర్వానాత్మపదార్థములును ఆయత్యంతాభావముయొక్క ప్రతియోగులే యగుచున్నవి. అందువలన నాయనుమానమునందుఁ గేవలాన్వయిరూపత్వము సంభవించుట లేదు. ఈప్రకారముగానే యాకేవలవ్యతిరేక్యనుమానముగూడ సంభవించుట లేదు. ఎట్లనఁగా, ఏపదార్థములకుఁ బరస్పరవ్యాప్యవ్యాపకభావము లున్నవో ఆపదార్థములకే పరస్పరసాధనసాధ్యభావము లున్న వనునియమ మున్నది. ఈనియమమున కాకేవలవ్యతిరేక్యనుమానమునందు భంగ మగుచున్నది. ఏకారణముచేత ననఁగా, ఉక్తకేవలవ్యతిరేక్యనుమానమునందు గంధము ఇతరభేదము అను నీరెంటికిని సాధన సాధ్యభావ మంగీకరింపఁబడియున్నది. మఱియు నితరభేదాభావము గంధాభావ మను రెంటికిని వ్యాప్యవ్యాపకభావ మంగీకరింపఁబడియున్నది. ఒకవేళ, అన్యపదార్థముల యొక్క వ్యాప్తిజ్ఞానమువలన నన్యపదార్థములయొక్క యనుమితి కలుగు ననినయెడలఁ బర్వతమునందు వహ్నివ్యాప్యధూమజ్ఞానముచేత జలమునందును అనుమితి కలుగవల యును. అందువలన నాయనుమానమునందుఁ గేవలవ్యతిరేకిరూపత్వమును సంభ వింపదు. కేవలాన్వయియును గేవలవ్యతిరేకియును అసంభవ మగుటవలన నాయను మానమునం దన్వయవ్యతిరేకిరూపత్వమును సంభవించుట లేదు. అందువలన వేదాంతసిద్ధాంతమునం దాయనుమాన మేకాన్వయిరూపమే యగుచున్నది. అందుఁ బూర్వోక్తాన్వయవ్యాప్తిసహితానుమానమున కన్వయి యని పేరు.

శంక:—ఏపురుషునకుం బూర్వోక్తసాధనసాధ్యములరెంటికిని సామానాధికరణ్యరూపాన్వయవ్యాప్తిజ్ఞానము కలుగక సాధ్యాభావసాధనాభావములరెంటికిని సామానాధికరణ్యరూపవ్యతిరేకవ్యాప్తిజ్ఞానము కలుగుచున్నదో; యాపురుషునకును ఆవ్యతిరేకవ్యాప్తిజ్ఞానమువలన సాధ్యానుమితి కలుగుచున్నది. అది కలుగఁగూడదు.

సమాధానము:—ఆ యన్వయవ్యాప్తిజ్ఞానరహితపురుషున కా వ్యతిరేకవ్యాప్తిజ్ఞానముచేత సాధ్యానుమితి కలుగదు. ఇంకే మనఁగా, నచట నర్థాపత్తిప్రమాణముచేతనే యాసాధ్యముయొక్క ప్రమ కలుగుచున్నది. ఉదా—పృథివీమాత్రమందుండు గంధగుణ మాపృథివియందు జలాదీతరపదార్థములయొక్క భేద మున్ననే కాని యనుపపన్నమై యాపృథివియం దితరభేదకల్పన చేయఁబడు చున్నది.

అనుమితిప్రమానిరూపణము సమాప్తము.

## [*] ఉపమితిప్రమానిరూపణము. [*]

ఇఁక, తృతీయ మగు నుపమితిప్రమ నిరూపింపఁబడుచున్నది. “సాదృశ్యప్రమితిః ఉపమితిః”—భావము॥ సాదృశ్యమును విషయము చేయు నేప్రమ యున్నదో అది యుపమితిప్రమ యనఁబడును. ఉదా—ఏపురుషుఁడు నగరమునందు గోపిండమును జూచి గవయపశువును దెలియుట కిచ్ఛ గలిగియు నున్నాఁడో ఆపురుషుఁడొకానొకవనవాసిపురుషునిఁ జూచి గవయపశు వెట్టి దని ప్రశ్న చేయఁగా, నావనవాసిపురుషుఁ డానగరవాసిని జూచి గోసదృశము గవయమై యున్నది యని చెప్పఁగా, నావచనమును విని యానగరవాసిపురుషుం డొకానొకకాలమందు వనమునకుఁ బోయెను. ఆవనమునందు గవయపిండమును జూడఁగానే యీగవయము గోసదృశమై యున్న దనుజ్ఞానము వానికిఁ గలుగుచున్నది. తదనంతరము గవయసదృశము నాదుగోవై యున్నది. అనుజ్ఞాన మాపురుషునకుఁ గలుగుచున్నది. ఈప్రకారమైనజ్ఞాన ముపమితిప్రమ యనఁబడును.

అచ్చట గవయపశునిష్ఠ మగు నేగోసాదృశ్యముయొక్క జ్ఞాన మున్నదో ఆజ్ఞాన ముపమితిప్రమకుఁ గరణ మగుటవలన, నుపమానప్రమాణమై యున్నది. నిజగోనిష్ఠ మగు నేగవయసాదృశ్యముయొక్క జ్ఞాన మున్నదో, ఆజ్ఞాన ముపమానప్రమాణమునకు ఫలమైన యుపమితిప్రమ యనఁబడును. ఇది యుపమితిప్రమకు లౌకికోదాహరణమై యున్నది. ఇఁక నాయుపమితికి వైదికోదాహరణము చెప్పఁబడుచున్నది. ఏపురుషునిచేత నాకాశముయొక్క యసంగత్వమును వ్యాపకత్వమును

నిశ్చయింపఁబడి యున్నదో మఱియు బ్రహ్మముయొక్క యసంగత్వమును వ్యాపకత్వమును దెలియఁబడలేదో అట్టి యధికారిపురుషుఁడు బ్రహ్మవేత్తయగుగురువును జూచి, హేభగవన్ బ్రహ్మముయొక్క స్వరూప మేది యని ప్రశ్న చేయఁగా, తదనంతర మా గురు వాశిష్యునిఁ జూచి యాకాశమువలె నాబ్రహ్మ మసంగమై యున్నది, అట్లే వ్యాపకమయ్యు నున్నది యని యుత్తరము చెప్పెను. తదనంతర మాశిష్యుఁ డేకాంతదేశమందు విచారము చేసి తనబ్రహ్మరూపాత్మయం దసంగత్వవ్యాపకత్వములచేత నాకాశముయొక్క సాదృశ్యము ననుభవించెను. అనఁగా ఆకాశమువలె నసంగమును వ్యాపకము నైనబ్రహ్మము నే నను ననుభవ మాయధికారిపురుషునకుఁ గలిగెను.

శంక:—ఆత్మయం దసంగత్వరూపమును వ్యాపకత్వరూపమును ఆకాశమునకు సదృశమై యున్న దను నీయర్థమందుఁ బ్రమాణ మేమి?

సమాధానము:—శ్రుతిస్మృత్యాచార్యవాక్యము లను మూటిచేత నాయర్థము సిద్ధించుచున్నది. అచ్చట శ్రుతి, "ఆకాశవ త్సర్వగతశ్చ నిత్యః"—భావము॥ ఆత్మ యాకాశమువలె సర్వత్ర వ్యాపకమును నిత్యమునై యున్నది. ఈశ్రుతిచేత నాత్మ యాకాశమువలె వ్యాపక మని చెప్పఁబడినది. మఱియు "యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే। సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే"—భావము॥ ఆకాశము సర్వత్ర యుండున దైనను ఎట్లు తనయసంగస్వభావముచేత నేపదార్థముచేతను సంగము లేని దగునో అట్లీయాత్మ సర్వదేహములయం దుండున దైనను దనయసంగస్వభావమువలన నేపదార్థముచేతను సంగము లేని దగును. అను నీగీతాస్మృతిచేత నాత్మ యాకాశమువలె నసంగ మనఁబడినది. మఱియు "దృశిస్వరూపం గగనోపమం పరమ్" అను నీవచనముచేత నాచార్యులచేతను ఆత్మ యాకాశమువలె వ్యాపక మనఁబడినది. దీనిచే నాత్మయం దాకాశముయొక్క సాదృశ్యమువలనఁ బూర్వోక్తోపమితియొక్క యుదాహరణము సంభవించుచున్నది.

లేక, శుక్తిరజతస్వప్నపదార్థాదికములయందు మిథ్యాత్వనిశ్చయముచేత నాకాశాదిప్రపంచముయొక్క స్వరూపము తెలియుట కిచ్ఛ గల యధికారిపురుషుఁ డీప్రపంచము శుక్తిరజతాదికమువలె మిథ్యయై యున్నది యను గురువచనమును విని యేకాంతదేశమందు విచారము చేసినవాఁడై యాప్రపంచమునందు శుక్తిరజతాదికముతో మిథ్యాత్వరూపసాదృశ్యము ననుభవించుచున్నాఁడు. అనఁగా నీయాకాశాదికప్రపంచము శుక్తిరజతాదికమువలె మిథ్యయే యగు నను ననుభవ మాయధికారిపురుషునకుఁ గలుగుచున్నది. ఈ యుపమితియొక్క యుదాహరణముకూడ వేదాంతసిద్ధాంతమున కనుకూలమై యున్నది.

ఇచ్చట నైయాయికు లైననో గవయనిష్ఠగోసాదృశ్యజ్ఞానానంతరము గవయము గవయపదవాచ్యమై యున్నది యనుజ్ఞానమునే యుపమితిప్రమ యని యంగీకరించుచున్నారు. అట్లే ఆయుపమానమును, సాదృశ్యవిశిష్టపిండజ్ఞానము వైధర్మ్యవిశిష్టపిండజ్ఞానము అసాధారణధర్మవిశిష్టపిండజ్ఞానము అనుభేదముచేతఁ ద్రివిధముగా నంగీకరించుచున్నారు. ఆనైయాయికులయొక్కమతము న్యాయప్రకాశముయొక్క షష్ఠపరిచ్ఛేదమునం దుపమాననిరూపణమున విస్తరముగాఁ బ్రతిపాదింపఁబడియున్నది.

ఉపమితిప్రమానిరూపణము సమాప్తము.

## [*] శాబ్దప్రమానిరూపణము. [*]

ఇఁకఁ జతుర్థ మగు శాబ్దప్రమ నిరూపింపఁబడుచున్నది. "వాక్యకరణకా ప్రమా శాబ్దీ ప్రమా"— భావము॥ వాక్యరూపకరణముచేత జన్య మగు నేప్రమ యున్నదో అది శాబ్దప్రమ యనఁబడును. ఉదా—"తత్త్వమసి" అను వైదికవాక్య శ్రవణముచేత నీయధికారిపురుషునకు "అహం బ్రహ్మాస్మి" యనుప్రమ కలుగుచున్నది. అట్లే "ఘటమానయ గామానయ" ఇత్యాది లౌకికవాక్యశ్రవణముచేత నీపురుషునకు ఘటగవాద్యానయనముయొక్క ప్రమ యేది కలుగుచున్నదో ఆప్రమకు శాబ్దప్రమ యని పేరు. అచ్చట నేవాక్యముచేత శాబ్దప్రమ కలుగుచున్నదో, ఆ వాక్యమునకు లక్షణము చెప్పఁబడుచున్నది. "ఆకాంక్షా యోగ్యతా సన్నిధిమత్పద సముదాయః వాక్యమ్"—భావము॥ ఆకాంక్ష యోగ్యత సన్నిధి అను నీమూఁడును గల యేపదము లున్నవో ఆపదములయొక్క సముదాయము వాక్య మనఁబడును. ఉదా—"తత్త్వమసి" ఇత్యాదివైదికవాక్యములు తత్ త్వమ్ మొదలగుపదములయొక్క సముదాయరూపములై యున్నవి. అట్లే "ఘటమానయ" ఇత్యాదిలౌకిక వాక్యములు "ఘటమ్ ఆనయ" ఇత్యాదిపదములయొక్క సముదాయరూపములై యున్నవి. ఇఁక, ఏపదములయొక్క సముదాయము వాక్య మనఁబడుచున్నదో, ఆ పదములయొక్క లక్షణము చెప్పఁబడుచున్నది. అందు "వర్ణసమూహః పదమ్"— భావము॥ కకారాదివర్ణములసమూహము పద మనఁబడును. ఉదా—కలశాదిపదములు కకారాదివర్ణములసమూహరూపములై యున్నవి. ఆపదఘటకకకారాది వర్ణములయం దేకజ్ఞానవిషయత్వ మేది గలదో అదియే సమూహత్వమై యున్నది.

యద్యపి నైయాయికమతమం దాకకారాదివర్ణములు శబ్దరూపము లగుట వలన క్షణికములు. అనఁగా, తృతీయక్షణమునందు నాశవంతములు. అట్లే యావర్ణములయొక్క సముదాయరూపపదమును ఆపదసముదాయరూపవాక్యమును ఆ

వాక్యసముదాయరూపవేదమును క్షణికములై యున్నవి. తథాపి, వేదాంతసిద్ధాంతమందు వర్ణములు క్షణికములు కావు. ఇది నేమనఁగా, ఆకాశాదులవలె సృష్ట్యాదికాలమందు మాయోపహితేశ్వరునిచేత నావర్ణము లుత్పన్నము లగుచున్నవి. మఱియుఁ బ్రళయకాలమం దావర్ణములు నాశ మొందుచున్నవి. మధ్యకాలమం దావర్ణముల కుత్పత్తివినాశములు కలుగుట లేదు. ఈకారణముచేతనే "సో ఽయం గకారః" ఇత్యాదిప్రత్యభిజ్ఞకును బ్రమాణరూపత్వ మున్నది. మఱియు "ఉత్పన్నో గకారః, వినష్టో గకారః" ఇత్యాదిప్రతీతి యైననో ఆగకారాదివర్ణోచ్చారణముల యొక్క యుత్పత్తివినాశములనే విషయము చేయుచున్నది. గకారాదివర్ణముల యొక్కయుత్పత్తివినాశములను విషయము చేయుట లేదు. అందువలన వర్ణము పదము వాక్యము వేదము అను నీసర్వమును శబ్దరూప మగుటవలన క్షణికమై యున్నది యను నైయాయికులయొక్కమత మసంగతమై యున్నది.

మఱియు మీమాంసకు లైననో వర్ణములను వర్ణసముదాయరూపవేదములను ఉత్పత్తివినాశరహితనిత్యము లని యంగీకరించుచున్నారు. ఈ మీమాంసకులమతముకూడ నసంగతమై యున్నది. ఏల యనఁగా "ఛందాంసి జజ్ఞిరే తస్మాత్ యజు స్తస్మా దజాయత, అస్య మహతో భూతస్య నిశ్శ్వసిత మేవై తద్య దృగ్వేదో యజుర్వేదః" ఇత్యాదికశ్రుతులచేత సృష్ట్యాదికాలమందు మాయోపహితేశ్వరుని యందుండి వేదములయొక్కయుత్పత్తి చెప్పఁబడియున్నది. మఱియు "అత ఏవచ నిత్యత్వమ్" అను సూత్రమందు శ్రీవ్యాసభగవానులచేత వేదములకుఁ బ్రళయపర్యంతస్థాయిత్వరూపనిత్యత్వము చెప్పఁబడి యున్నది. అందువలన నీమీమాంసకులయొక్కమతముకూడ నసంగతమై యున్నది.

### [*] (19) ఆకాంక్షాదులయొక్కస్వరూపనిరూపణము. [*]

పూర్వ మాకాంక్ష యోగ్యత సన్నిధి అను నీమూడును గల పదసముదాయము వాక్య మనఁబడినది. దానియందుఁ బ్రథమ మగు నాకాంక్షస్వరూపము చెప్పఁబడుచున్నది. "అన్వయానుపపత్తిః ఆకాంక్షా" — భావము॥ ఏపదమున కే పదము లేక యన్వయము సంభవించుట లేదో ఆపదమున కాపదముతో సమభివ్యాహార మాకాంక్ష యనఁబడును. ఉదా—ఘటమానయ అనువాక్యముచేత శ్రోతకు ఘటమును ఆనయనము చేయుబోధ కలుగుచున్నది. ఆబోధ కేవల "ఘటమ్" అను కారకపదముచేతను, కేవల "ఆనయ" అను క్రియాపదముచేతను గలుగుట లేదు. ఇది నేమనఁగా, ఆద్వివిధపదము లున్ననే యాబోధ కలుగుచున్నది.

అందువలన నాఘటపదమున కానయపదముతో సమభివ్యాహార మున్నది. అట్లే ఆనయపదమునకు ఘటపదముతో సమభివ్యాహార మున్నది. ఇదియే యాద్వివిధ పదములకుఁ బరస్పరాకాంక్షయై యున్నది. సమభివ్యాహార మనఁగా, సమీపత్వ మనఁబడును. యద్యపి, ఆకాంక్ష కిచ్ఛ యని పేరు, ఆయిచ్ఛ చైతన్యముయొక్క ధర్మమే యగుచున్నది, జడపదార్థములయొక్క ధర్మము కాదు. తథాపి, ఆపదములు స్వవిషయకాకాంక్షను శ్రోతకుఁ గలుగఁజేయుచున్నవి. అందువలన నాపదములు కూడ నాకాంక్షాసహితము లని చెప్పఁబడినది.

ఇఁక యోగ్యతావర్ణనము చేయఁబడుచున్నది. అచ్చట "వాక్యార్థాఽబాధః యోగ్యతా"—భావము॥ వాక్యార్థమునకుఁ బ్రమాణాంతరముచేత నబాధితత్వము యోగ్యత యనఁబడును. ఉదా—"ఘటమానయ" అనువాక్యమున కర్థమైన యేఘటానయన మున్నదో అది ప్రత్యక్షాదిప్రమాణములయందు దేనిచేతను బాధిత మగుట లేదు. ఇదియే యాఘటాదిపదములయందు యోగ్యతయై యున్నది.

ఇఁక, సన్నిధివర్ణనము చేయఁబడు చున్నది. "పదానా మవిలంబోచ్చారణం సన్నిధిః"—భావము॥ పదములయొక్క విలంబరహితోచ్చారణ మేది గలదో అది సన్నిధి యనఁబడును. ఉదా—"ఘటమానయ" అనువాక్యమందు "ఘటమ్" అనుపదోత్తరము విలంబరహితముగా "ఆనయ" యనుపదోచ్చారణ మేది యున్నదో అది సన్నిధియై యున్నది. ఈప్రకారముగా, ఆకాంక్ష యోగ్యత సన్నిధి లను సీమూఁటను గలపదములయొక్క యేసముదాయ మున్నదో అది వాక్య మనఁబడును.

అచ్చట "పదసముదాయః వాక్యమ్" అను నింతమాత్రమే వాక్యము నకు లక్షణ మనిన యెడల, యామమాదికాలవిలంబముచేత నుచ్చరింపఁబడుఘటాదిపద సముదాయమం దావాక్యలక్షణమున కతివ్యాప్తి కలుగును. ఆయతివ్యాప్తిదోషమును నివర్తించుటకొఱకు కాలక్షణమునందు సన్నిధిసహితపదసముదాయము వాక్య మనఁబడినది. యామమున కొకటిగా నుచ్చరింపఁబడిన యాఘటాదిపదములయందవిలంబోచ్చారణరూపసన్నిధి లేదు. అందువలన నాపదసముదాయమునం దా వాక్యలక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు. మఱియు "సన్నిధిమత్పదసముదాయః వాక్యమ్" అను నింతమాత్రమే యావాక్యమునకు లక్షణముగాఁ జెప్పిన యెడల "అగ్నినాసించేత్"—భావము॥ అగ్నిచేత వృక్షములను సేచనము చేయును (తడుపును) అను నప్రమాణవాక్యమునందును ఆవాక్యలక్షణమున కతివ్యాప్తి కలు

గును. ఏల యనఁగా బూర్వోక్తసన్నిధి యీపదములయందు నున్నది. ఆయతివ్యాప్తిదోషము నివర్తించుటకొఱకు కాలతఃణమునం దాపదములకు యోగ్యతా యను విశేషణము చెప్పఁబడినది. అచ్చట నగ్నియందు సేచనకరణత్వము ప్రత్యక్షప్రమాణముచేత బాధితమై యున్నది. అందువలన నాపదములు పూర్వోక్తయోగ్యతా సహితములు కావు. దీనిచే "అగ్నినాసించేత్" అను పదసముదాయమం దా వాక్యలక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు.

మఱియు "యోగ్యతా సన్నిధి మత్పదసముదాయః వాక్యమ్" అను నింతమాత్రమే యీవాక్యమునకు లక్షణముగాఁ జెప్పినయెడల, "గౌరశ్వః పురుషో హస్తీ" అనుపదసముదాయమునం దావాక్యలక్షణమున కతివ్యాప్తి యగును. ఏల యనఁ బూర్వోక్తము లగుసన్నిధియును యోగ్యతయును నీపదములయం దున్నవి. ఆయతివ్యాప్తిదోషము నివర్తించుటకొఱ కాపదముల కాకాంక్షా యను విశేషణము చెప్పఁబడినది. అచ్చట గవాశ్వాదిపదములు పరస్పరాకాంక్షాసహితములు కావు. అందువలన నాపదసమూహమం దావాక్యలక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు.

శంక:—ఈప్రకారముగా నుక్తవాక్యము శాబ్దప్రమకుఁ గరణ మైన యెడల నవ్యుత్పన్నపురుషులకుఁ గూడ నావాక్యముచేత శాబ్దప్రమ కలుగవలయును. ప్రదమున కీయర్థ మనుజ్ఞానము లేనిపురుషుఁ డవ్యుత్పన్నుఁ డనఁబడును.

సమాధానము:—ఎట్లు వాక్యము శాబ్దప్రమకుఁ గారణమై యున్నదో అట్లు వాక్యఘటకపదములయొక్క సంగతిజ్ఞానముకూడ నాశాబ్దప్రమకుఁ గారణమై యున్నది. అవ్యుత్పన్నపురుషున కాసంగతిజ్ఞానము లేదు. అందువలన నావాక్యము శ్రవణము చేసినను అవ్యుత్పన్నపురుషునకు వాక్యార్థప్రమ కలుగుట లేదు. ఇచ్చట శాబ్దప్రమ వాక్యార్థప్రమ శాబ్దబోధ మను త్రివిధశబ్దములును ఏకార్థముయొక్క వాచకములే యగుచున్నవి.

## [*] (20) సంగతియొక్క స్వరూపము. [*]

ఇఁక సంగతియొక్క స్వరూపము వర్ణింపఁబడుచున్నది. "పదపదార్థయోః స్మార్యస్మారకభావసంబంధః సంగతిః" — భావము॥ పదము పదార్థము అనురెంటికిని ఏస్మార్యస్మారకభావసంబంధ మున్నదో అది సంగతి యనఁబడును. ఉదా—ఘటపద శ్రవణముచేతఁ బురుషునకు ఘటరూపార్థముయొక్క స్మృతి కలుగుచున్నది. అచ్చట ఘటపద మైననో ఆస్మృతికి జనక మగుటవలన స్మారక మనఁబడును. మఱియు ఆ ఘటరూపార్థము స్మృతికి విషయ మగుటవలన స్మార్య మనఁబడును. ఈప్రకారము

గా స్మార్యస్మారకభావసంబంధము సంగతి యనఁబడును. శాస్త్రకారు లీసంగతిని వృత్తి యనియును జెప్పుచున్నారు.

మఱియు, ఆవృత్తిరూపసంగతి, శక్తి లక్షణ అను భేదముచేత ద్వివిధమై యున్నది. యద్యపి, అన్యశాస్త్రములయందు శక్తి గౌణి లక్షణ అనుభేదముచేత నావృత్తి త్రివిధముగాఁ జెప్పఁబడియున్నది. తథాపి, ఇచ్చట ఆగౌణీవృత్తికి లక్షణ యం దంతర్భావ మంగీకరించి యావృత్తి ద్వివిధముగాఁ జెప్పఁబడినది.

## [*] (21) శక్తివృత్తినిరూపణము. [*]

ఇఁక, ఆద్వివిధవృత్తులయందుఁ బ్రథమ మగు శక్తివృత్తి నిరూపింపఁబడుచున్నది. "పదపదార్థయో ర్వాచ్య వాచకభావసంబంధః శక్తిః"—భావము॥ పదము పదార్థ మను రెంటికిని ఏవాచ్యవాచకభావసంబంధ మున్నదో అది శక్తి యనఁబడును. ఉదా—ఘటపదము ఘటరూపార్థము ఈరెంటికిని వాచ్యవాచకభావసంబంధ మున్నది. అచ్చట ఘటపద మైననో వాచకమై యున్నది. ఘటరూపార్థము వాచ్యమై యున్నది. అందు, పదజన్యజ్ఞానమున కేది విషయమై యున్నదో అది వాచ్య మనఁబడును. పదార్థస్మృతి కేది జనకమై యున్నదో అది వాచక మనఁబడును. ఈశక్తి శాస్త్రమునందు ముఖ్యవృత్తి యనియును జెప్పఁబడుచున్నది.

మఱియు నాముఖ్యవృత్తి రూపశక్తియును, యోగము రూఢి యనుభేదముచేత ద్వివిధమై యున్నది. అందు "అవయవశక్తిః యోగః"—భావము॥ పదముయొక్క ప్రకృతిప్రత్యయరూపావయవములయం దేయర్థబోధకశక్తి యున్నదో, అది యోగశక్తి యనఁబడును. ఉదా—పాచకాదిపదములకుఁ బాకకర్త్రాదిరూపార్థమందు యోగశక్తి యున్నది. ఇచ్చట, పచ అనుధాతువున కనంతరము అక యనుప్రత్యయము వచ్చి పాచక యనుశబ్దము సిద్ధ మగుచున్నది. పచ అనుధాతువునకుఁ బాక మందు శక్తి యున్నది. అక యనుప్రత్యయమునకుఁ గర్తయందు శక్తి యున్నది. ఈద్వివిధావయవములయొక్క శక్తిచేతఁ బాకకర్త యగుపురుషునియొక్క బోధ కలుగుచున్నది. ఈయోగశక్తిసహితపాచకాదిపదములు శాస్త్రమునందు యౌగికపదములని చెప్పఁబడును. మఱియు "సముదాయశక్తిః రూఢిః"—భావము॥ పదముయొక్క ప్రకృతిప్రత్యయరూపావయవసముదాయమం దేయర్థబోధక మగునేకశక్తి యున్నదో అది రూఢిశక్తి యనఁబడును. ఉదా—ఘటాదిపదములకు కలశాదిరూపార్థములయందు రూఢిశక్తి యున్నది. ఈరూఢిశక్తిసహితపదములు శాస్త్రమునందు రూఢపదము లనఁబడును,

ఇచ్చట నైయాయికు లాశక్తిని, యోగము రూఢి యోగరూఢి యౌగిక రూఢి అను భేదముచేతఁ జతుర్విధముగా నంగీకరించుచున్నారు. మఱియు నాశక్తి చతుర్విధ మగుటచేత నాశక్తిసహితపదములుకూడ, యౌగికము రూఢము యోగరూఢము యౌగికరూఢము అను భేదముచేతఁ జతుర్విధములుగా నంగీకరించు చున్నారు. అచ్చటఁ బంకజాదిపదములకు యోగరూఢియును, ఉద్భిజ్జాదిపదములకు యౌగికరూఢియు నంగీకరించుచున్నారు. ఈ నైయాయికులయొక్క మతము న్యాయ ప్రకాశముయొక్క షష్ఠపరిచ్ఛేదమున శబ్దప్రమాణనిరూపణమందు విస్తరముగా నిరూ పింపఁబడి యున్నది. దాని నచ్చటఁ దెలియవలయును.

## [*] (22) శక్తిజ్ఞాననిరూపణము. [*]

ఇఁకఁ బూర్వోక్తశక్తియొక్క జ్ఞానప్రకారము చెప్పఁబడుచున్నది. ఆశక్తి యొక్క జ్ఞానము పురుషునకు వ్యవహారముచేతఁ గలుగుచున్నది. ఉదా—గురుపిత్రాది రూపు లగు నుత్తమవృద్ధపురుషులచేతఁ జెప్పఁబడిన "ఘటమానయ" అనువాక్య మును విని శిష్యపుత్రాదిరూపమధ్యమవృద్ధపురుషు లాఘటానయనమునకుఁ బ్రవ ర్తించుచున్నారు. మఱియు నాయుత్తమవృద్ధపురుషులయొక్క సమీపమునం దున్న యొకానొకబాలకుఁ డామధ్యమవృద్ధపురుషునియొక్క గమనాగమనరూపప్రవృత్తిని జూచి యామధ్యమవృద్ధపురుషునియొక్క జ్ఞానము ననుమానము చేయుచున్నాఁడు. ఆయనుమాన మెట్లనఁగా "ఇయం ప్రవృత్తిః జ్ఞానసాధ్యా, ప్రవృత్తిత్వాత్, మదీయప్రవృత్తివత్"— భావము॥ ఈ మధ్యమవృద్ధపురుషునియొక్క యేప్రవృత్తి యున్నదో అది జ్ఞానముచేత జన్యమై యున్నది, ప్రవృత్తిరూప మగుటవలన, ఏది యేది ప్రవృత్తి యగుచున్నదో అది యది జ్ఞానముచేత జన్యమే యగుచున్నది, మదీయప్రవృత్తి యిష్టసాధనత్వజ్ఞానముచేత జన్య మగుటవలె. ఈప్రకారముగా నాబాలకుఁ డామధ్యమపురుషునియొక్క ప్రవృత్తికి హేతు వైనజ్ఞానము ననుమానము చేసి, తదనంతర మాజ్ఞానమునం దాయుత్తమవృద్ధపురుషవాక్యజన్యత్వ మనుమానము చేయుచున్నాఁడు. ఆ యనుమాన మెట్లనఁగా "ఇదం జ్ఞాన మేత ద్వాక్యజన్యమ్, ఏత ద్వాక్యాన్వయవ్యతిరేకానువిధాయిత్వాత్, దండజన్యఘటాదివత్"—భావము॥ ఈమధ్యమపురుషునియొక్క ప్రవృత్తికి హేతుభూత మగు నేజ్ఞాన మున్నదో ఆజ్ఞాన మీయుత్తమవృద్ధపురుషునియొక్క "ఘటమానయ" అనువాక్యముచేత జన్య మైనది, ఈవాక్యముయొక్క యన్వయవ్యతిరేకానుసారి యగుటవలన. ఏపదార్థ మే పదార్థముయొక్క యన్వయవ్యతిరేకానుసారి యగుచున్నదో ఆపదార్థ మాపదా ర్థముచేత జన్యమే యగుచున్నది. ఉదా—దండ ముండినయెడల ఘటరూపకార్యో

త్పత్తి యగుచున్నది, ఆదండము లేనియెడల నాఘటరూపకార్యోత్పత్తి యగుట లేదు. ఈరీతిగా దండమున కేయన్వయవ్యతిరేకము లున్నవో తదనుసారిగానే ఘటమున్నది. అందువలన నాఘటము దండజన్యమే యగుచున్నది. ఈలాగుననే యీ యుత్తమవృద్ధపురుషునియొక్క "ఘటమానయ" అనువాక్యముయొక్కయన్వయవ్యతిరేకానుసారి యగుటవలన నామధ్యమపురుషునియొక్కజ్ఞాన మీవాక్యముచేతనే జన్యమై యున్నది. ఈప్రకారముగా నాబాలుఁ డామధ్యమపురుషునియొక్కజ్ఞానమందు "ఘటమానయ" అను వాక్యజన్యత్వానుమానము చేసి, యనంతర మామధ్యమపురుషకృతఘటానయనమును జూచి యాఘటపదమునకు ఘటవ్యక్తియందు శక్తిని నిశ్చయము చేయుచున్నాఁడు. అనఁగా "ఘటమానయ" అనువాక్యమందుండు ఘటపదమున కీఘటవ్యక్తియందు శక్తి యున్న దని యాబాలునకు శక్తిజ్ఞానము కలుగుచున్నది. ఈప్రకారముగా నాబాలునకు మొదట వృద్ధవ్యవహారము చేతనే ఘటాదిపదములయొక్కశక్తిజ్ఞానము కలుగుచున్నది. తదనంతరము వ్యాకరణము ఉపమానము కోశము ఆప్తవాక్యము వాక్యశేషము వివరణము సిద్ధపదసమీపత అను వీనిచేతను బదములయొక్కశక్తిజ్ఞానము కలుగుచున్నది. ఆవ్యాకరణాదులచేత నేప్రకారము పదములయొక్కశక్తిజ్ఞానము కలుగుచున్నదో ఆప్రకారము న్యాయప్రకాశముయొక్కషష్ఠపరిచ్ఛేదమున శబ్దప్రమాణనిరూపణమందు మాచేత విస్తరముగా నిరూపింపఁబడి యున్నది. గ్రంథవిస్తరభీతిచే నిచ్చట విరమించితిమి.

## [*] (23) మతభేదముచేత శక్తివిషయార్థనిరూపణము. [*]

ఇఁక నాశక్తివిషయభూతార్థము మతభేదముచేత నిరూపింపఁబడుచున్నది. అందు నైయాయికు లైననో యిట్లు చెప్పుచున్నారు. ఈపదముచేత శ్రోత కీయర్థముయొక్కబోధ మగుఁగాక యను నేయీశ్వరేచ్ఛ యున్నదో. అది శక్తియై యున్నది. మఱియు నవీననైయాయికు లైననో పూర్వోక్తరీతిగా జీవేచ్ఛకూడ శక్తి యనుచున్నారు. ఘటాదిపదములకు శక్తి ఘటాదిరూపపదార్థములయందే యున్నది. ఘటాదిపదార్థములయొక్కసంబంధరూపసంసర్గమం దాశక్తి లేదు. ఏకారణముచేత ననఁగా, ఘటపదముయొక్కశ్రవణముచేత శ్రోత కాఘటరూపార్థముయొక్కస్మరణయే కలుగుచున్నది. సంసర్గముయొక్కస్మరణ కలుగుట లేదు. మఱియు "ఘటమానయ" ఇత్యాదివాక్యములయం దుండు ఘటాదిపదములయొక్క లేక అర్థములయొక్కపరస్పరసంసర్గరూప మయిన యేవాక్యార్థ మున్నదో, ఆవాక్యార్థముయొక్క బోధ యాఘటాదిపదములయొక్కసమభివ్యాహారముచేతనే కలుగుచున్నది. అందు

వలన నాసంసర్గమందు ఘటాదిపదములయొక్క శక్తి నంగీకరించుట నిష్ఫలమై యున్నది.

మఱియు మీమాంసకు లైననో యిట్లు చెప్పుచున్నారు. ఘటాదిపదములకుఁ గేవలఘటాదిరూపార్థమందే శక్తి యుండుట లేదు. ఇంకే మనఁగా, కార్యాన్వితఘటాదులయందే ఘటాదిపదములకు శక్తి యున్నది. ఇచ్చటఁ బురుషప్రయత్నరూపకృతిచేత సాధ్య మగు నేక్రియ యున్నదో అది కార్య మనఁబడును. ఆకార్యసంబంధసహితము కార్యాన్విత మనఁబడును. ఉదా—ఘటమానయ అనువాక్యమందు ఘటానయనరూపక్రియ యాపురుషప్రయత్నముచేత సాధ్య మగుటవలనఁ గార్యమై యున్నది. ఆయానయనరూపకార్యసంబంధసహితము ఘటమై యున్నది. అందువలన నాఘటము కార్యాన్విత మనఁబడును. ఆకార్యాన్వితఘటమందే ఘటపదమునకు శక్తి యున్నది. ఈరీతిగాఁ బటాదిపదములకును గార్యాన్వితపటాదులయందే శక్తి చూడఁబడుచున్నది. ఒకవేళ ఘటాదిపదములకుఁ గార్యాన్వితఘటాదులయందు శక్తి నంగీకరింపనియెడల, ఆఘటాదిపదార్థములయొక్క సంసర్గరూపవాక్యార్థబోధము కాకపోవలయును. అట్లే పూర్వోక్తరీతిగా బాలునకుఁ బ్రథమమునఁ గార్యాన్వితఘటాదులయందే ఘటాదిపదములయొక్క శక్తిజ్ఞానము కలుగుచున్నది. అదియును గాకపోవలయును. ఏల యన, కృతిసాధ్యత్వరూపకార్యతాజ్ఞానమే పురుషునియొక్క ప్రవృత్తికి హేతువై యున్నది. కేవలేష్టసాధనతాజ్ఞానము పురుషునియొక్క ప్రవృత్తికి హేతు వగుట లేదు. చంద్రమండలాదికమం దిష్టసాధనతాజ్ఞానముండినను ఈపురుషునకుఁ బ్రవృత్తి కలుగుట లేదు. యద్యపి, విషభక్షణరూపపతనాదులయం దాకార్యాన్వితజ్ఞాన ముండినను ఈపురుషునకుఁ బ్రవృత్తి కలుగుట లేదు. తథాపి, ఇష్టసాధనతాజ్ఞానమునకు సమానకాలిక మైన యేకార్యాన్వితజ్ఞానమున్నదో అదియే పురుషప్రవృత్తికి హేతువై యున్నది. ఆవిషభక్షణాదికమందుఁ బురుషున కిష్టసాధనతాజ్ఞానము లేదు. అందువలనఁ బ్రవృత్తి కలుగుట లేదు. దీనిచేత నాకృతిసాధ్యత్వరూపకార్యముయొక్క వాచక మైన లిఙ్ లోట్ తవ్య ఇత్యాదులే పదము లున్నవో తత్పదఘటితవాక్యమే ప్రమాణవాక్యమై యున్నది. ఉదా— "ఘటమానయ" ఇత్యాదిలౌకికవాక్యములును "స్వర్గకామో యజేత" ఇత్యాది వైదికవాక్యములునై యున్నవి. ఆ లిఙాదిపదరహితవాక్యములు ప్రమాణ మగుట లేదు, ఉదా—"భూతలే ఘటః" ఇత్యాది లౌకికవాక్యములును "తత్త్వమసి" ఇత్యాదివైదికవాక్యములునై యున్నవి.

మఱియు వేదాంతసిద్ధాంతమతమే మనఁగా, ఘటాదిపదములకుఁ గేవల ఘటాదిరూపార్థమందుఁ గాని కార్యాన్వితఘటాదులయందుఁ గాని శక్తి లేదు. మఱి యే మనఁగా ఇతరాన్వితఘటాదులయందే యాఘటాదిపదములకు శక్తి యున్నది. యద్యపి, బాలునకుఁ బ్రథమమునఁ గార్యాన్వితఘటాదులయందే ఘటాది పదములయొక్క శక్తిజ్ఞానము కలుగుచున్నది. తథాపి, అనంతరము గౌరవదోషము వలన నాకార్యాంశమును బరిత్యాగము చేసి యితరాన్వితఘటాదికములయందే యాఘటాదిపదములయొక్క శక్తిజ్ఞానము కలుగుచున్నది. ఆయితరపదార్థము కార్య మగుఁగాక. లేక, కార్యముకన్న భిన్న మగుఁగాక. ఎట్లు, ఘటమానయ అను కార్యపరవాక్యముచేతఁ బూర్వోక్తరీతిగా శక్తి గ్రహింపఁబడినదో, అట్లు "పుత్రస్తే జాతః" ఇత్యాదికసిద్ధార్థపరవాక్యములచేతను ఆశక్తి గ్రహణ మగుచున్నది.

ఉదా—ఒకానొకధనికపురుషునకుఁ బుత్రుఁడు జన్మించెను. ఆపుత్రపదాంకిత మగువస్త్రమును గొని వార్తఁ జెప్పునట్టి పురుషుఁ డాధనికపురుషునియొక్క సమీపమునకుఁ బోయి యావస్త్రమును వానిముందుంచి "పుత్రస్తే జాతః" అని చెప్పెను. దానిని విని యాధనికపురుషుఁడు పుత్రునియొక్క జననజ్ఞానముచేత హర్షము పొందెను. ఆహర్షమువలన వానియొక్క ముఖము వికాసయుక్త మైనది. దానిని జూచి పుత్రపదముయొక్క శక్తిజ్ఞానము లేనివాఁ డగు మఱియొకపురుషుఁ డాముఖవికాసరూపహేతువుచేత నాధనికపురుషునియొక్క హర్షము ననుమానము చేయుచున్నాఁడు. తదనంతర మాహర్షమునందు జ్ఞానజన్యత్వము ననుమానము చేయుచున్నాఁడు. తదనంతర మాజ్ఞానమం దన్వయవ్యతిరేకములచేత "పుత్రస్తే జాతః" అనువాక్యజన్యత్వము ననుమానము చేయుచున్నాఁడు. తదనంతర మాయుత్పత్తిసహితబాలకపిండమం దాపుత్రపదముయొక్క శక్తిని నిశ్చయము చేయుచున్నాఁడు. అందువలన నెట్లు "ఘటమానయ, స్వర్గకామో యజేత" ఇత్యాది కార్యపరవాక్యములు ప్రమాణరూపము లై యున్నవో అట్లు "భూతలే ఘటః, తత్త్వ మసి" ఇత్యాది సిద్ధార్థపరవాక్యములు గూడఁ బ్రమాణములే యగుచున్నవి.

మఱియు, పూర్వోక్తఘటాదిపదములకు శక్తి ఘటత్వాదిజాతియందే యున్నది, ఘటాదివ్యక్తులయందు లేదు. ఒకవేళ నాశక్తి ఘటాదివ్యక్తులయం దంగీకరించినయెడల ఆఘటాదివ్యక్తు లనంతము లై యున్నవి. అందువలన నాశక్తులు గూడ ననంతము లని యంగీకరింపవలయును. మఱియు నేఘటవ్యక్తియందు ఘటపదముయొక్క శక్తిజ్ఞానము కలుగుచున్నదో, ఆవ్యక్తికన్న భిన్న మైనఘటమునకుఁగూడ ఆ ఘటపదముచేత బోధ యగుచున్నది. అదియును గాక పోవలయును. ఏల యన ఆ

ఘటవ్యక్తియం దాఘటపదముయొక్క శక్తిజ్ఞానము కలుగుట లేదు. ఆఘటత్వజాతి యా ఘటవ్యక్తులయందు నేకమై యున్నది. అందువలన నాజాతియందు శక్తి సంకేతితములయం దాశక్తి కల్పకత్వమును వ్యభిచారదోషమును బ్రాప్త మగుట లేదు. అందువలన ఘటాదిపదములకు ఘటత్వాదిజాతియందే శక్తి నంగీకరించుట యుచితమై యున్నది.

శంక:—ఘటాదిపదములకు ఘటత్వాదిజాతియందే శక్తి నంగీకరించిన యెడల "ఘటమానయ" అనువాక్యమును వినుటచేత శ్రోత కాఘటపదముచేత ఘటత్వజాతియొక్క బోధయే కావలయును. ఘటవ్యక్తియొక్క బోధ కాఁగూడదు. మఱియు ఆఘటవ్యక్తిబోధ కలుగక ఆఘటవ్యక్తి కానయనముగూడ సంభవించుట లేదు.

సమాధానము:—శ్రోతకు ఘటపదముచేత ఘటత్వజాతియొక్క బోధయే కలుగుచున్నది. అయినను, యాఘటవ్యక్తి లేక ఆఘటత్వజాతికి స్వతంత్రముగా నానయనము సంభవించుట లేదు. అందువలన నాశ్రోత కాక్షేపముచేత నాఘటవ్యక్తియొక్క బోధ యగుచున్నది. లేక, ఆఘటపదముయొక్క లక్షణచేత ఘటవ్యక్తియొక్క బోధ యగుచున్నది. ఇచ్చటఁ గొందఱు గ్రంథకారులు సమానవృత్తివేద్యత్వమునే * వ్యాక్షేప మని చెప్పుచున్నారు. మఱికొంద ఱనుమానము నాక్షేప మని చెప్పుచున్నారు. మఱికొంద ఱర్థాపత్తి నాక్షేప మని చెప్పుచున్నారు. ఈ త్రివిధపక్షములును న్యాయప్రకాశముయొక్క షష్ఠపరిచ్ఛేదమునందు స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నవి.

లేక, ఘటత్వాదిజాతివిశిష్టఘటాదివ్యక్తులయందే ఘటాదిపదములకు శక్తి యున్నది. కేవలజాతియం దైనను, లేక, కేవలవ్యక్తియం దైనను ఆశక్తి లేదు. అయినను, జాతియందు శక్తి జ్ఞాతమయ్యే శాబ్దబోధమున కుపయోగి యగుచున్నది. వ్యక్తియందు శక్తి యైననో, స్వరూపముచేతనే యుపయోగి యగుచున్నది, జ్ఞాతమై యుపయోగి యగుట లేదు. ఈప్రకార మైనశక్తినే శాస్త్రమునందుఁ గుబ్జశక్తి యందురు.

శంక:—పూర్వము ఘటాదిపదముల కితరాన్వితఘటాదులయందు శక్తి చెప్పితిరి. ఇప్పు డాఘటాదిపదములకు ఘటత్వజాతియందు, లేక, ఘటత్వజాతివిశిష్టఘటవ్యక్తియందు శక్తి చెప్పుచున్నారు. అందువలన గ్రంథమునకుఁ బూర్వోత్తర విరోధము ప్రాప్త మగుచున్నది.

* జాతివ్యక్తులు రెండును ఏకజ్ఞానమునకు విషయ మగుట సమానవృత్తివేద్యత్వము.

సమాధానము:—ఆశక్తి యనుభావిక స్మారిక యనుభేదముచేత ద్వివిధమై యున్నది. అందుఁ బూర్వ మితరాన్వితఘటాదులయందు ఘటాదిపదముల కనుభావకశక్తి చెప్పఁబడినది. ఇప్పుడు ఘటత్వజాతియందు, లేక, ఘటత్వజాతి విశిష్టఘటవ్యక్తియందు ఘటపదమునకు స్మారకశక్తి చెప్పఁబడినది. అందువలన గ్రంథమునకుఁ బూర్వోత్తరవిరోధము ప్రాప్త మగుట లేదు. ఈప్రకారమే మీమాంసకమతమందును గార్యాన్వితఘటాదులయందు ఘటాదిపదముల కనుభావక శక్తియును ఘటత్వాదిజాతియందు స్మారకశక్తియు నున్నది. ఇంతపర్యంతము ప్రథమ మగుశక్తివృత్తి నిరూపింపఁబడినది.

## [*] (24) లక్షణావృత్తినిరూపణము. [*]

ఇఁక ద్వితీయ మగు లక్షణావృత్తి నిరూపింపఁబడుచున్నది. "శక్యసంబంధః లక్షణా" — భావము॥ పూర్వోక్తశక్తివృత్తి కేది విషయమై యున్నదో అది శక్యమై యున్నది. ఈశక్యమును వాచ్య మనియును జెప్పుదురు. ఆశక్యపదార్థమునకు లక్ష్యమాణపదార్థముతోఁ గల యేసంబంధ మున్నదో, అది లక్షణ యనఁబడును. ఉదా—ఒకయాప్తుఁ డగువక్త మండపస్థపురుషుని భోజనము చేయించు నభిప్రాయముచేత "మండపం భోజయ" అని యొకపురుషుని జూచి చెప్పెను. ఆ వచనమును శ్రవణము చేసినయాపురుషుఁడు జడ మగుమండపమందు భోజనకర్తృత్వముయొక్కయయోగ్యతను దెలిసి యామండపపదమునకు మండపస్థపురుషుని యందు లక్షణ చేయుచున్నాఁడు. అచ్చట మండపపదమునకు శక్యార్థ మగు నే గృహవిశేష మున్నదో దాని కాపురుషునితో సంయోగసంబంధ మున్నది. ఇది లక్షణ యనఁబడును. ఇఁక ఆలక్షణావృత్తియొక్కవిభాగము వర్ణింపఁబడుచున్నది. అచ్చట ఆలక్షణావృత్తి, కేవలలక్షణ లక్షితలక్షణ యనుభేదముచేత ద్విప్రకార మగుచున్నది.

## [*] (25) కేవలలక్షణానిరూపణము. [*]

"శక్యసాక్షాత్సంబంధః కేవలలక్షణా" — భావము॥ పదముయొక్క శక్యార్థమునకు లక్ష్యమాణార్థముతోఁ గల యేసాక్షాత్సంబంధ మున్నదో అది కేవల లక్షణ యనఁబడును. ఆకేవలలక్షణ, జహల్లక్షణ అజహల్లక్షణ జహదజహల్లక్షణ యనుభేదముచేతఁ ద్రిప్రకార మగుచున్నది.

"శక్యార్థపరిత్యాగేన తత్సంబంధ్యర్థాంతరే వృత్తిః జహల్లక్షణా" — భావము॥ పదముయొక్కశక్యార్థమును బరిత్యజించి, యాశక్యార్థముయొక్కసంబం

ధము గల యన్యపదార్థమం దాపదముయొక్క యేలక్షణావృత్తి యున్నదో అది జహల్లక్షణ యనఁబడును. ఉదా—శ్రోతకు గంగాతీరమునందు ఘోషముయొక్క బోధ కావలయు నను నభిప్రాయముచేత; ఆప్తవక్త యగుపురుషునిచేత నుచ్చరింపఁబడిన "గంగాయాం ఘోషః ప్రతివసతి" అను నేవాక్య మున్నదో ఆవాక్యశ్రవణముచేత శ్రోత గంగాపదముయొక్క శక్యార్థరూపజలప్రవాహమందు ఘోషాధారతానుపపత్తిని జూచి గంగాపదమునకుఁ దీరమునందు లక్షణ చేయుచున్నాఁడు. అచ్చట గంగాపదమునకు శక్యార్థ మైన యేజలప్రవాహ మున్నదో దానిని బరిత్యజించి యాశక్యార్థముయొక్క సంయోగసంబంధము గల యేతీరరూపార్థ మున్నదో ఆతీరమునం దాగంగాపదముయొక్క లక్షణావృత్తి యున్నది. ఇది జహల్లక్షణ యనఁబడును.

ఇఁక, అజహల్లక్షణ చెప్పఁబడుచున్నది. అచ్చట "శక్యార్థా ఉపరిత్యాగేన తత్సంబంధ్యర్థాంతరే వృత్తిః అజహల్లక్షణ" — భావము॥ పదముయొక్క శక్యార్థమునకుఁ బరిత్యాగము లేకయే ఆశక్యార్థముయొక్క సంబంధము గల యన్యపదార్థమం దాపదముయొక్క యేలక్షణావృత్తి యున్నదో అది యజహల్లక్షణ యనఁబడును. * ఉదా—మంచస్థపురుషునియొక్క బోధ కావలయు నను నభిప్రాయముచేత నాప్తవక్త యగుపురుషునిచే నుచ్చరింపఁబడిన "మంచాః క్రోశంతి" అను నేవచన మున్నదో ఆవచనమును శ్రవణము చేసి యాశ్రోత యగుపురుషుఁడు జడ మగుమంచమందు శబ్దకర్తృత్వముయొక్క యనుపపత్తిని జూచి మంచపదమునకు మంచస్థపురుషునియందు లక్షణ చేయుచున్నాఁడు. అచ్చట మంచపదముయొక్క శక్యార్థరూప మంచమునకుఁ బరిత్యాగము లేకయే యామంచపదమునకు మంచస్థపురుషునియం దేలక్షణావృత్తి యున్నదో దాని నజహల్లక్షణ యందురు.

ఇఁక జహదజహల్లక్షణ చెప్పఁబడుచున్నది. అచ్చట "శక్యైకదేశపరిత్యాగే నైకదేశే వృత్తిః జహదజహల్లక్షణా" — భావము॥ పదముయొక్క శక్యార్థముయొక్క యేకదేశము పరిత్యాగము చేసి యేకదేశమందుఁ బదముయొక్క యేలక్షణా

* ఇచ్చట మూలగ్రంథకారులు అజహల్లక్షణోదాహరణము "మంచాః క్రోశంతి" యని చెప్పి యున్నారు విచారసాగరాద్యన్యగ్రంథములయందు ఈరీతిగాఁ జెప్పఁబడి యున్నది. "అశ్వము పరుగెత్తుచున్నది" అనుబోధ కావలయు నను నభిప్రాయముచేత నాప్తవక్త యగుపురుషునిచే నుచ్చరింపఁబడిన "శోణో ధావతి" అను నేవాక్య మున్నదో ఆవాక్యమును శ్రవణము చేసి శ్రోత యగుపురుషుఁడు రక్తవర్ణమందు ధావనానుపపత్తిని జూచి, శోణపదమునకు రక్తవర్ణసహితాశ్వమునందు లక్షణ చేయుచున్నాఁడు. అచ్చట శోణపదశక్యార్థరూపరక్తవర్ణమునకుఁ బరిత్యాగము లేకయే యాశోణపదమునకు రక్తవర్ణసహితాశ్వమునం దేలక్షణావృత్తి యున్నదో దానిని అజహల్లక్షణ యందురు.

వృత్తి యున్నదో అది జహదజహల్లక్షణ యనఁబడును. ఈలక్షణను భాగత్యాగ లక్షణ యనియును జెప్పుదురు. ఉదా—దేవదత్తపురుషునియొక్క యభేదమును బోధించుతాత్పర్యముచేత నాప్తవక్త యగుపురుషునిచే నుచ్చరింపఁబడిన "సో ఽయం దేవదత్తః" అను నేవాక్య మున్నదో ఆవాక్యమును శ్రవణము చేసి శ్రోత యగు పురుషుఁడు సః అయమ్ అను రెండుపదములకు దేవదత్తపిండమాత్రమందు లక్షణ చేయుచున్నాఁడు. అచ్చట, తద్దేశకాలవిశిష్టదేవదత్తపిండము సః అనుపదమునకు శక్యార్థమై యున్నది. మఱియు నేతద్దేశకాలవిశిష్టదేవదత్తపిండము అయమ్ అను పదమునకు శక్యార్థమై యున్నది. అచ్చట నారెండుశక్యార్థముల కభేదము సంభవించుట లేదు. అందువలన సః అనుపదముయొక్క శక్యార్థమందుఁ దద్దేశకాలవిశిష్టత్వరూపైకదేశ మేది గలదో దానిని బరిత్యాగము చేసి ఆదేవదత్తపిండరూపైకదేశమందు సః అనుపదముయొక్క లక్షణావృత్తి యున్నది. అయమ్ అనుపదముయొక్క శక్యార్థమం దేతద్దేశకాలవిశిష్టత్వరూపైకదేశ మేది గలదో దానిని బరిత్యాగము చేసి యాదేవదత్తపిండరూపైకదేశమందు అయంపదముయొక్క లక్షణావృత్తి యున్నది. దీనిని జహదజహల్లక్షణ యందురు.

లేక, జీవబ్రహ్మములయొక్క యభేదబోధనతాత్పర్యముచేత బ్రహ్మవేత్త యగు గురువుచేత నుచ్చరింపఁబడిన "తత్త్వమసి" యను నేమహావాక్య మున్నదో దానిని శ్రవణము చేసి యధికారి యగు శ్రోత తత్ త్వమ్ అను రెండుపదములకు నఖండచైతన్యమునందు లక్షణ చేసెను. అచ్చట మాయోపహితచైతన్యము తత్పద శక్యార్థమై యున్నది. స్థూలసూక్ష్మాదిశరీరోపహితచైతన్యము త్వంపదశక్యార్థమై యున్నది. ఆరెండుశక్యార్థముల కభేదము సంభవించుట లేదు. అయినను ఆవాక్యమందుఁ దత్త్వంపదములయొక్క సామానాధికరణ్యముచేత, తత్ త్వమ్ అను రెండుపదార్థములకు నభేదమే ప్రతీత మగుచున్నది. అందువలనఁ దత్పదశక్యార్థమందు మాయారూపైకదేశమును బరిత్యాగము చేసి చైతన్యరూపైకదేశమునందుఁ దత్పదముయొక్క లక్షణావృత్తియును, త్వంపదశక్యార్థమునందు స్థూలసూక్ష్మాదిశరీరరూపైకదేశమును బరిత్యాగము చేసి చైతన్యరూపైకదేశమునందుఁ ద్వంపదముయొక్క లక్షణావృత్తియు నున్నది. దీనిని సిద్ధాంతమునందు జహదజహల్లక్షణ యనియును భాగత్యాగలక్షణ యనియును జెప్పుదురు. అందువలన, ఆలక్ష్యార్థరూపాఖండచైతన్యమున కభేదము సంభవించు చున్నది.

శంక:—తత్త్వమ్ అను రెండుపదములకు నేకాఖండచైతన్యమునందే లక్షణ యైనయెడల, ఒకటేపదముచేత నాయఖండచైతన్యరూపబ్రహ్మసాక్షాత్కా-

నము సంభవించుచున్నది. అందువలన రెండవపదము వ్యర్థమే యగును. మఱియు నేకార్థబోధకము లగు రెండుపదములు చెప్పుటవలనఁ బునరుక్తిదోషముగూడఁ బ్రాప్త మగును.

సమాధానము:—పద మైననో తనయర్థముయొక్క కేవలస్మరణమాత్రమే చేయుచున్నది. రెండవపదము లేక యాయేకపదము శాబ్దబోధమునకు హేతువు కాదు. అందుచేతఁ బ్రథమమునఁ దత్త్వమ్ అను రెండుపదములయొక్క భాగత్యాగలక్షణచేత నిర్వికల్పకాఖండచైతన్యముయొక్క స్మరణమాత్రము కలుగుచున్నది. తదనంతర మాపదసముదాయరూప మగు తత్త్వ మసి యనువాక్యముచేత బ్రహ్మాత్మైక్యవిషయక మగు "అహం బ్రహ్మాస్మి" యను శబ్దముయొక్క యపరోక్షానుభవ మగుచున్నది. ఆయపరోక్షానుభవ మేకపదముచేత సంభవించుట లేదు. అందువలన రెండవపదము వ్యర్థము కాదు. మఱి యే మనఁగా, ఆరెండుపదములును సార్థకములై యున్నవి. మఱియుఁ బూర్వోక్తప్రకారముగాఁ దత్త్వమ్ అను రెండుపదములయొక్క వాచ్యార్థములకు భేదమే యున్నది. అందువలనఁ బునరుక్తిదోషముగూడఁ బ్రాప్త మగుట లేదు.

అచ్చట, జహల్లక్షణయందు సర్వవాచ్యార్థమునకుఁ బరిత్యాగ మున్నది. తత్త్వంపదములయొక్క సర్వవాచ్యార్థములకుఁ బరిత్యాగము లేదు. మఱి యే మనఁగా, ఏకదేశమునకుఁ బరిత్యాగ మున్నది. అందువలన నాతత్త్వంపదములయందు జహల్లక్షణయును సంభవింపదు. అజహల్లక్షణయం దైననో, వాచ్యార్థముకంటె నధికార్థమునకును గ్రహణ మున్నది. తత్త్వంపదములకు వాచ్యార్థములకంటె నధికార్థగ్రహణము కొంచెమైనను గలుగుట లేదు. అందువలన నాతత్త్వంపదములయందజహల్లక్షణయును సంభవించుట లేదు. మఱి యే మనఁగా, పూర్వోక్తరీతిగా జహదజహల్లక్షణయే సంభవించుచున్నది. ఈకారణమువలన నాచార్యులచేత "తత్త్వ మస్యాదివాక్యేషు లక్షణా భాగలక్షణా" అనువచనముచేతఁ దత్త్వమస్యాదివాక్యములయందు భాగత్యాగలక్షణయే చెప్పఁబడి యున్నది.

ఇచ్చటఁ గొందఱు గ్రంథకారులు తత్త్వమస్యాదివాక్యములయందు భాగత్యాగలక్షణ లేకయే యఖండచైతన్యముయొక్క బోధ యంగీకరించుచున్నారు. వారి యభిప్రాయ మే మనఁగా, "అనిత్యో ఘటః" అనువాక్యమందు ఘటత్వవిశిష్టఘటవ్యక్తి ఘటపదమునకు వాచ్యార్థమై యున్నది. ఆవాచ్యార్థముయొక్క యేకదేశరూప మగు నేఘటత్వజాతి యున్నదో ఆఘటత్వజాతి కనిత్యత్వముతో నన్వయము సంభవించుట లేదు. మఱే మనఁగా, ఆఘటవ్యక్తికే యాయనిత్యత్వముతో నన్వ

యము సంభవించుచున్నది. ఎట్లు ఘటపదమునకు ఘటవ్యక్తియందు భాగత్యాగలక్షణ లేకయే యోగ్యతాబలముచేత నాఘటపదముయొక్క శక్తివృత్తివలన నుపస్థిత మైన ఘటవ్యక్తికే యాయనిత్యత్వముతో నన్వయ మగుచున్నదో, అట్లే తత్త్వంపదములయొక్క వాచ్యార్థములకు నేకదేశరూప పరోక్షత్వాపరోక్షత్వ సర్వజ్ఞత్వాల్పజ్ఞత్వాసంసారిత్వ సంసారిత్వాదు లయిన యేధర్మము లున్నవో వానికిఁ బరస్పరాభేదము సంభవించుట లేదు. మఱి యే మనఁగా, చైతన్యరూపవిశేష్యాంశమునకే యభేదము సంభవించుచున్నది. అందువలన నాతత్త్వంపదములయందు భాగత్యాగలక్షణ లేకయే యోగ్యతాబలమువలనఁ దత్త్వంపదములయొక్క శక్తివృత్తిచేత నుపస్థిత మైన యఖండచైతన్యమునకే యభేదాన్వయబోధ మగుచున్నది. అందువలన, తత్త్వమస్యాదివాక్యములయందు భాగత్యాగలక్షణ యంగీకరించుట వ్యర్థమై యున్నది.

ఈమతము సర్వాచార్యోక్తికి విరుద్ధ మగుటవలన నసంగతమై యున్నది. ఇంతపర్యంతము కేవలలక్షణ నిరూపింపఁబడినది.

## [*] (26) ల క్షి త ల క్ష ణా క థ న ము. [*]

ఇఁక, ద్వితీయ మగు లక్షితలక్షణయొక్క నిరూపణ చేయఁబడుచున్నది. "శక్యపరంపరాసంబంధః లక్షితలక్షణా"—భావము॥ పదముయొక్క శక్యార్థమునకు లక్ష్యమాణార్థముతో నేపరంపరాసంబంధ మున్నదో అది లక్షితలక్షణ యనఁబడును. ఉదా—మధుకరము శబ్దించుచున్న దను నర్థమును బోధించుటకొఱకు వక్త యగు పురుషునిచే నుచ్చరింపఁబడిన "ద్విరేఫో రౌతి" అను నేవాక్య మున్నదో ఆవాక్యశ్రవణముచేత శ్రోత యాద్విరేఫపదముయొక్క శక్యార్థరూప మగు రెండు రేఫములయందు శబ్దకర్తృత్వముయొక్క యనుపపత్తిని జూచి ఆద్విరేఫపదమునకు మధుకరవ్యక్తియందు లక్షణ చేయుచున్నాఁడు. ఆలక్షణ లక్షితలక్షణ యనఁబడును.

ఎట్లనగా, ద్విరేఫపదమునకు శక్యార్థము రెండురేఫములై యున్నది. ఆ రెండు రేఫములకు మధుకరవ్యక్తితో సాక్షాత్సంబంధ మేదియు సంభవించుట లేదు. ఇంక నేమనఁగా, ఆరెండు రేఫములకు భ్రమరపదముతో సంబంధ మున్నది. ఆభ్రమర పదమునకు మధుకరవ్యక్తితో సంబంధ మున్నది. ఈరీతిగా నారెండు రేఫములకు స్వఘటితపదవాచ్యత్వరూప పరంపరాసంబంధ మామధుకరవ్యక్తితో నున్నది. ఇట్లు, స్వసంబద్ధముచేత నాద్విరేఫపదముయొక్క శక్యార్థరూప మగు రెండు రేఫము

లను గ్రహింపవలయును. ఆరెండురేఫములచేత ఘటితమైనది భ్రమరపదము. ఆ భ్రమరపదవాచ్యత్వము మధుకరవ్యక్తియందున్నది. ఇట్లు శక్యార్థముయొక్క పరంపరాసంబంధము లక్షితలక్షణ యనఁబడును.

## [*] (27) గౌణీవృత్తినిరూపణము. [*]

ఇచ్చటఁ గొందఱుశాస్త్రకారులు శక్తిలక్షణలకన్న భిన్నముగాఁ దృతీయమగు గౌణి యనువృత్తినిగూడ నంగీకరించుచున్నారు. ఉదా—"సింహో దేవదత్తః"— భావము॥ ఈదేవదత్తనామపురుషుఁడు సింహము. అనువాక్యమందు సింహపదమునకు దేవదత్తనామపురుషునియందు గౌణీవృత్తి యున్నది. ఈగౌణీవృత్తి లక్షణావృత్తికన్న భిన్నముగా సిద్ధమగుట లేదు. ఇఁక నేమనఁగా, ఉక్తలక్షితలక్షణయందే యంతర్భూతమై యున్నది. అచ్చట సింహపదమునకు సింహమనుపశువు శక్యార్థమై యున్నది. ఆశక్యార్థమునకుఁ గ్రూరత్వశూరత్వములతో సంబంధమున్నది. ఆ క్రూరత్వశూరత్వములకు దేవదత్తనామపురుషునితో సంబంధమున్నది. ఈప్రకారముగా నాసింహపదముయొక్క శక్యార్థమునకు దేవదత్తపురుషునితో స్వవృత్తి క్రూరత్వాదిమత్త్వరూపపరంపరాసంబంధమున్నది. అందువలన గౌణి యనువృత్తి లక్షితలక్షణయం దంతర్భూతమే యగుచున్నది.

ఈప్రకారముగా నేపురుషునకుఁ బదములయొక్క శక్తివృత్తి లక్షణావృత్తులయొక్క జ్ఞానము కలుగుచున్నదో ఆపురుషునకే ఉక్తవాక్యముచేత శాబ్దప్రమ కలుగుచున్నది. ఆవృత్తి జ్ఞానరహితులగు నవ్యుత్పన్నపురుషుల కావాక్యముచేత శాబ్దప్రమ కలుగుట లేదు. మఱియు, ఎట్లు శక్తిలక్షణారూపవృత్తిజ్ఞానము శాబ్దప్రమోత్పత్తియందుఁ గారణమై యున్నదో, అట్లు ఆకాంక్ష యోగ్యత ఆసత్తి తాత్పర్య మను నీచతుర్విధములయొక్క జ్ఞానమును శాబ్దప్రమోత్పత్తియందుఁ గారణమై యున్నది. ఆకాంక్షా యోగ్యత లను రెంటియొక్క స్వరూపము పూర్వము నిరూపింపఁబడినది.

## [*] (28) ఆసత్తినిరూపణము. [*]

ఇఁక, ఆసత్తియొక్క నిరూపణము చేయఁబడుచున్నది. అచ్చట, "శక్తి లక్షణా ఽన్యతరసంబంధేనా ఽవ్యవధానేన పదజన్యపదార్థోపస్థితిః ఆసత్తిః"— భావము॥ పదమునకుఁ దనయర్థమునం దేశక్తిరూపసంబంధమున్నదో, లేక, లక్షణారూపసంబంధమున్నదో, ఆసంబంధముచేత వ్యవధానరహితముగాఁ బదజన్యపదార్థముయొక్క యేస్మృతి యున్నదో అది యాసత్తి యనఁబడును. ఉదా—"ఘటమా

నయ" అను వాక్యశ్రవణముచేత శ్రోతకు ఘటపదమువలన శక్తిరూపసంబంధము చేత ఘటరూపార్థముయొక్క స్మృతి కలుగుచున్నది, మఱియు ఆనయ అనుపదము వలన శక్తిరూపసంబంధముచేత నానయనరూపక్రియయొక్క స్మృతి కలుగుచున్నది. అట్లే "గంగాయాం ఘోషః" అనువాక్యశ్రవణముచేత శ్రోతకు గంగాపదమువలన లక్షణారూపసంబంధముచేతఁ దీరరూపార్థముయొక్క స్మృతి కలుగుచున్నది, మఱియు ఘోషపదమువలన శక్తిరూపసంబంధముచేత ఘోషరూపార్థముయొక్క స్మృతి కలుగు చున్నది. ఇది య్యాసత్తి యనఁబడును.

## [*] (29) తా త్ప ర్య ని రూ ప ణ ము. [*]

ఇఁక, తాత్పర్యముయొక్క నిరూపణము చేయఁబడుచున్నది. ఆ తాత్ప ర్యము, వక్తృతాత్పర్యము శబ్దతాత్పర్య మనుభేదముచేత ద్వివిధమై యున్నది. అందు, "పురుషాభిప్రాయః వక్తృతాత్పర్యమ్"—భావము॥ ఈమదీయవచనమువలన శ్రోత కీయర్థముయొక్క బోధ కావలయు నను వక్తయొక్క యేయిచ్ఛావిశేష మున్నదో అది వక్తృతాత్పర్య మనఁబడును. ఆవక్తృతాత్పర్యజ్ఞానము శాబ్దబోధమునకుఁ గారణము కాదు. ఎట్లనఁగా, ఏపదార్థ ముండుటవలన నేకార్య ముత్పన్న మగు చున్నదో మఱియు నేపదార్థము లేనియెడల నేకార్య ముత్పన్న మగుట లేదో ఆ పదార్థమే యాకార్యమునకుఁ గారణమై యున్నది. ఉదా—కులాలదండచక్రాదికము ఘటమునకుఁ గారణమై యున్నది. ఏపదార్థము లేక పోయినను ఏకార్య ముత్పన్న మగుచున్నదో ఆపదార్థ మాకార్యమునకుఁ గారణ మగుట లేదు. మ ఱేమనఁగా, ఆపదార్థ మాకార్యమున కన్యథాసిద్ధమే యగుచున్నది. ఉదా—రాసభాదికము ఘటమున కన్యథాసిద్ధమై యున్నది. ఈలాగే వక్తృతాత్పర్యజ్ఞానము లేకపోయినను, శాబ్దబోధము చూడఁబడుటవలన, నదియు నన్యథాసిద్ధమే యగుచున్నది. ఎట్లనఁగా ఈవాక్యమువలన శ్రోత కీయర్థముయొక్క బోధ కలుగవలయు నను నిచ్ఛారూప తాత్పర్యము, శుకపక్ష్యాదులకును అవ్యుత్పన్నపురుషులకును లేదు. అయినను వ్యు త్పన్నశ్రోత యగుపురుషున కాశుకపక్ష్యాదికముయొక్క వాక్యమువలన శాబ్దబోధము చూడఁబడుచున్నది. అందువలన వక్తృతాత్పర్యజ్ఞానమునకు శాబ్దబోధముయొక్క కారణత్వము సంభవించుట లేదు.

మఱియు "తదర్థప్రతీతిజననయోగ్యత్వం శబ్దతాత్పర్యమ్"— భావము॥ ఆయాశబ్దము మందాయావాక్యార్థబోధము నుత్పన్నము చేయుయోగ్యత యేది గలదో అది శబ్దతాత్పర్య మనఁబడును. ఈ శబ్దతాత్పర్యజ్ఞానము శాబ్దబోధమునకు నియ

మముగాఁ గారణ మగుచున్నది. అచ్చట లౌకికశబ్దములకుఁ దాత్పర్య మైననో, ప్రకరణాదికములచేత నిశ్చిత మగుచున్నది. ఉదా—“ సైంధవ మానయ ” అను నీవాక్యమునందుండు సైంధవపద మున్నదో అది లవణము అశ్వ మను రెంటియొక్క వాచకమై యున్నది. అచ్చట భోజనకాలమం దావాక్యశ్రవణముచేత శ్రోతకు భోజనప్రకరణవశమువలన సైంధవపదమునకు లవణమునందే తాత్పర్యము నిశ్చిత మగుచున్నది. మఱియు గమనకాలమునం దావాక్యశ్రవణముచేత శ్రోతకు గమనప్రకరణవశమువలన నాసైంధవపదమున కశ్వమునందే తాత్పర్యము నిశ్చిత మగుచున్నది. ఒకవేళ నాతాత్పర్యజ్ఞానమును శాబ్దబోధమునకుఁ గారణముగా నంగీకరింపనియెడల, నొకచో సైంధవపదముచేత నొకప్పుడు లవణబోధమును ఒకప్పు డశ్వబోధమును గాకపోవలయును. అందువలన శబ్దతాత్పర్యజ్ఞానమునకు శాబ్దబోధముయొక్క కారణత్వ మవశ్య మంగీకరింపవలయును.

## [*] (30) షడ్విధలింగనిరూపణము. [*]

మఱియు, వైదికశబ్దతాత్పర్య మైననో, షడ్విధలింగములచేత నిశ్చిత మగుచున్నది. ఆషడ్విధలింగములు శాస్త్రమునం దిట్లు చెప్పఁబడియున్నవి. అందు, “ శ్లో. ఉపక్రమోపసంహారా వభ్యాసో ౽పూర్వతా ఫలమ్ । అర్థవాదోపపత్తీ చ లింగం తాత్పర్యనిర్ణయే ” — భావము॥ ఉపక్రమోపసంహారములు, అభ్యాసము, అపూర్వత, ఫలము, అర్థవాదము, ఉపపత్తి, అను నీషడ్విధలింగములు వైదికశబ్దములయొక్క తాత్పర్యమును నిర్ణయించుచున్నవి.

ఇఁక, క్రమముగా నాషడ్విధలింగములయొక్క లక్షణమును ఉదాహరణమును జెప్పఁబడుచున్నవి. అందు, “ ప్రకరణప్రతిపాద్యస్యాద్వితీయవస్తునః ఆద్యంతయోః ప్రతిపాదన ముపక్రమోపసంహారౌ ”—భావము॥ ప్రకరణముచేతఁ బ్రతిపాదితమగు నేబ్రహ్మరూపాద్వితీయవస్తు వున్నదో ఆయద్వితీయవస్తువును ఆప్రకరణముయొక్క యాదియందును అంతమందును బ్రతిపాదనము చేయుట యుపక్రమోపసంహారము లనఁబడును. అచ్చట ఆదియందుఁ బ్రతిపాదనము చేయుట యుపక్రమ మనఁబడును. అంతమందుఁ బ్రతిపాదనము చేయుట యుపసంహార మనఁబడును. ఉదా—సామవేదీయచ్ఛాందోగ్యోపనిషత్తు షష్ఠాధ్యాయముయొక్క యాదియందు, నుద్దాలకమునిచేత శ్వేతకేతు వను పుత్రునిగూర్చి యీవచనము చెప్పఁబడియున్నది. “ స దేవ సోమ్యే ద మగ్ర ఆసీ దేక మే వాద్వితీయమ్ ”—భావము॥ ఓప్రియదర్శనుఁ డగు శ్వేతకేతూ ! ఈదృశ్యమానసర్వజగత్తు తనయుత్పత్తికిఁ బూర్వము సద్బ్రహ్మరూపముగానే

యుండెను. ఆసద్వస్తువు ఏకమే అద్వితీయరూపమే, అనఁగా సజాతీయ విజాతీయ స్వగతభేదరహితమై యున్నది. ఈప్రకారముగా నాషష్ఠాధ్యాయముయొక్క యాదియం దేయద్వితీయవస్తువుయొక్క ప్రతిపాదన మున్నదో అది యుపక్రమ మనఁబడును. మఱియు నాషష్ఠాధ్యాయముయొక్క యంతమం దిది చెప్పఁబడి యున్నది. "ఐతదాత్మ్య మిదం సర్వమ్"—భావము॥ ఈదృశ్యమానసర్వజగత్తు అద్వితీయబ్రహ్మరూపమే, ఆయద్వితీయబ్రహ్మముకన్న భిన్నము కాదు. ఈప్రకార మాషష్ఠాధ్యాయముయొక్క యంతమం దేయద్వితీయసద్బ్రహ్మముయొక్క ప్రతిపాదన మున్నదో అది యుపసంహార మనఁబడును. ఈ యుపక్రమోపసంహారములు రెండును ఏకలింగముగాఁ జెప్పఁబడుచున్నవి.

మఱియు "ప్రకరణప్రతిపాద్యస్య పునః పునః ప్రతిపాదన మభ్యాసః"—భావము॥ ప్రకరణముయొక్క యాద్యంతములయందుఁ బ్రతిపాదింపఁబడిన యేవస్తువున్నదో ఆవస్తువున కాప్రకరణముయొక్క మధ్యమం దేపునఃపునఃప్రతిపాదన మున్నదో అది యభ్యాస మనఁబడును. ఉదా—అషష్ఠాధ్యాయమందే "తత్త్వ మసి శ్వేతకేతో" అనువాక్యమును నవవారములు పఠించుటచేత నాయద్వితీయసద్వస్తువే పునఃపునఃప్రతిపాదన చేయఁబడి యున్నది.

మఱియు "ప్రకరణప్రతిపాద్యస్య మానాంతరావిషయతా అపూర్వతా"—భావము॥ ప్రకరణముచేతఁ బ్రతిపాదిత మగు నేవస్తు వున్నదో ఆవస్తువునకు శ్రుతిప్రమాణముకంటె భిన్న మైన ప్రత్యక్షాదిప్రమాణముల కవిషయత్వ మేది గలదో అది యపూర్వత యనఁబడును. ఆయద్వితీయవస్తువుయొక్క యపూర్వత యాషష్ఠాధ్యాయమందు "యం వై సో మ్యైతమణిమానం ననిభాలయసే" ఇత్యాదివచనములచేతఁ బ్రతిపాదింపఁబడి యున్నది.

మఱియు "ప్రకరణ ప్రతిపాద్యస్య శ్రూయమాణం తద్జ్ఞానా త్తత్ప్రాప్తిరూపప్రయోజనం ఫలమ్"— భావము॥ ప్రకరణముచేతఁ బ్రతిపాదిత మగు నేవస్తువున్నదో ఆవస్తువుయొక్క జ్ఞానమువలన శ్రుతిచేతఁ జెప్పఁబడిన యావస్తువుయొక్క ప్రాప్తిరూపమగు నేప్రయోజన మున్నదో అది ఫల మనఁబడును. ఉదా—ఆ షష్ఠాధ్యాయమునం దిట్లు చెప్పఁబడి యున్నది. "ఆచార్యవా న్పురుషో వేద, తస్య తావదేవ చిరం యావ న్నవిమోక్ష్యే ఽథ సంపత్స్యే"— భావము॥ ఏయధికారిపురుషునిచేత బ్రహ్మవేత్త యగుగురుముఖమునందుండి వేదాంతశాస్త్రశ్రవణము చేయఁబడినదో ఆయధికారిపురుషుఁడే తత్త్వమస్యాదివాక్యములచేతఁ బ్రత్యగభిన్నబ్రహ్మమును "అహం బ్రహ్మాస్మి" యని సాక్షాత్కరించుకొనుచున్నాఁడు. మఱియు నా

బ్రహ్మవేత్త యగుపురుషునకు ఎంతకాలపర్యంతము ప్రారబ్ధకర్మముయొక్క ఫలభోగము చేత దేహాదిబంధములనుండి విముక్తి కలుగుట లేదో అంతకాలపర్యంతమే వానికి స్థితి యున్నది, మఱియు భోగముచేత నాప్రారబ్ధకర్మనివృత్తి యైనప్పుడు ఆబ్రహ్మవేత్త యగుపురుషుఁడు బ్రహ్మరూపుఁడే యగుచున్నాఁడు. ఈశ్రుతిచేత నద్వితీయబ్రహ్మ జ్ఞానమువలన నద్వితీయబ్రహ్మప్రాప్తిరూపప్రయోజనము చెప్పఁబడి యున్నది. ఇది ఫల మనఁబడును.

మఱియు, "ప్రకరణప్రతిపాద్యస్య ప్రశంసన మర్థవాదః" — భావము॥ ప్రకరణముచేతఁ బ్రతిపాదిత మగు నేవస్తు వున్నదో ఆవస్తువుయొక్క స్తుతిరూప మయిన యేప్రశంస యున్నదో అది యర్థవాద మనఁబడును. ఉదా—ఆ షష్ఠాధ్యాయమునం దిట్లు చెప్పఁబడి యున్నది. "యే నాశ్రుతం శ్రుతం భవ త్యమతం మత మవిజ్ఞాతం విజ్ఞాతమ్" — భావము॥ ఓ శ్వేతకేతూ! ఏ యేకవస్తువును వినుటచేత వినఁబడనివస్తువుకూడ వినఁబడిన దగుచున్నదో, మఱియు నేయేకవస్తువుయొక్క మననముచేత మననము చేయఁబడనివస్తువుకూడ మననము చేయఁబడిన దగుచున్నదో మఱియు నేయేకవస్తువును దెలియుటచేతఁ దెలియఁబడనివస్తువుకూడఁ దెలియఁబడిన దగుచున్నదో, ఆయేకవస్తువును నీవు నీగురువులయొద్దఁ బ్రశ్న చేసితివా? లేదా? ఈవచనముచేత నాయద్వితీయబ్రహ్మవస్తువుయొక్క స్తుతిరూపప్రశంస చెప్పఁబడి యున్నది. ఇది యర్థవాద మనఁబడును.

మఱియు, "ప్రకరణప్రతిపాద్యస్య దృష్టాంతైః ప్రతిపాదన ముపపత్తిః"— భావము॥ ప్రకరణముచేతఁ బ్రతిపాదిత మగు నేవస్తు వున్నదో ఆవస్తువున కనేక దృష్టాంతములచేత నేప్రతిపాదన మున్నదో అది యుపపత్తి యనఁబడును. ఉదా— ఆ షష్ఠాధ్యాయమునందు మృత్తికాసువర్ణాదికదృష్టాంతములచేత కారణముకన్న భిన్నముగాఁ గార్యమునకు సత్తను నిషేధించి యాయద్వితీయబ్రహ్మవస్తువు ప్రతిపాదింపఁబడి యున్నది. ఇది యుపపత్తి యనఁబడును.

ఈ యుద్దాలక శ్వేతకేతువులసంవాద మాత్మపురాణముయొక్క ద్వాదశాధ్యాయమందు మాచే విస్తరముగాఁ జెప్పఁబడి యున్నది. దాని నచ్చటఁ దెలియవలయును. ఎట్లు ఛాందోగ్యోపనిషత్తుయొక్క షష్ఠాధ్యాయమునందుఁ బూర్వోక్తషడ్విధలింగములచేత నద్వితీయబ్రహ్మముయొక్క తాత్పర్యనిశ్చయ మగుచున్నదో, అట్లు సర్వోపనిషత్తులకును ఆయద్వితీయబ్రహ్మమునందే తాత్పర్య మున్నది. ఈరీతిగాఁ బూర్వోక్తషడ్విధలింగములచేత సర్వవేదాంతవాక్యములకు నద్వితీయ బ్రహ్మమునందే తాత్పర్యనిశ్చయ మున్నదో అది శ్రవణ మనఁబడును.

### [*] (31) మననినిదిధ్యాసనస్వరూపనిరూపణము. [*]

ఇఁకఁ బ్రసంగానుసారముగా మనననిదిధ్యాసనములయొక్క స్వరూపము నిరూపింపఁబడుచున్నది. అచ్చట "శ్రుత స్యార్థ స్యోపపత్తిభి శ్చింతనం మననమ్"— భావము॥ శ్రవణము చేయఁబడిన యద్వితీయబ్రహ్మరూపార్థమును శ్రుతి కనుకూలము లగు ననుమానాదియుక్తులచేతఁ జింతన చేయుట మనన మనఁబడును. మఱియు "విజాతీయప్రత్యయ తిరస్కారేణ సజాతీయప్రత్యయ ప్రవాహీకరణం నిదిధ్యాసనమ్" — భావము॥ విజాతీయవృత్తులయొక్క తిరస్కారముచేత సజాతీయవృత్తులను బ్రవాహముగాఁ జేయుట యేది గలదో అది నిదిధ్యాసన మనఁబడును. అచ్చట దేహాద్యనాత్మపదార్థములయం దాత్మబుద్ధియును ద్వైతప్రపంచముయొక్క దర్శనమును విజాతీయవృత్తియై యున్నది. "అహం బ్రహ్మాస్మి" యనువృత్తి సజాతీయవృత్తియై యున్నది.

శ్రవణముచేతఁ బ్రమాణగతాసంభావనయును మననముచేతఁ బ్రమేయగతాసంభావనయును నిదిధ్యాసనముచేత విపరీతభావనయును నివృత్తములగుచున్నవి. దేహాదులయం దేయాత్మబుద్ధి యున్నదో అది విపరీతభావన యనఁబడును. మఱియుఁ బ్రమాణగతాసంభావన ప్రమేయగతాసంభావన యను నీరెండును ముందు తృతీయపరిచ్ఛేదమునందుఁ జెప్పఁబడును. ఈప్రకారముగా శ్రవణ మనన నిదిధ్యాసనములచేత నసంభావనావిపరీతభావనలయొక్క నివృత్త్యనంతర మెవ్వనిచేతఁ దత్త్వంపదార్థశోధన చేయఁబడు చున్నదో, అట్టి యధికారిపురుషునకుఁ దత్త్వమస్యాదిమహావాక్యములవలన "అహం బ్రహ్మాస్మి" యను నపరోక్షజ్ఞానము కలుగుచున్నది. ఆబ్రహ్మసాక్షాత్కారముచేత, నీయధికారి కజ్ఞాననివృత్తిపూర్వకముగాఁ బరమానందప్రాప్తిరూపమోక్షము కలుగుచున్నది. ఈరీతిగా శ్రవణాదులు బ్రహ్మసాక్షాత్కారద్వారమున మోక్షమున కుపయోగులుగా నున్నవి.

### [*] (32) శ్రవణాదులయొక్క యధికారివర్ణనము. [*]

ఇఁకఁ బూర్వోక్తశ్రవణాదులయొక్క యధికారి వర్ణింపఁబడుచున్నాఁడు. వివేకాదిచతుస్సాధనసంపన్నుఁడైన యేసన్న్యాసి యున్నాఁడో, వానికే యీశ్రవణాదిత్రయము బ్రహ్మసాక్షాత్కారమున కంతరంగసాధనమై యున్నది. అందు శ్రుతి.— "ఆత్మావా ఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" — భావము॥ ఓ మైత్రేయీ! ముముక్షుజనులచేత ఈయాత్మ సాక్షాత్కరించుకొనుటకు యోగ్యమైనది. అనఁగా మోక్షరూపేష్టప్రాప్తికి ఈయాత్మసాక్షాత్కారమే సాధనమై

యున్నది. ఆయాత్మసాక్షాత్కారప్రాప్తికొఱకీయధికారిపురుషుఁడు శ్రవణ మనన నిదిధ్యాసనములు చేయవలయును. ఈశ్రుతిచేత నాత్మసాక్షాత్కారప్రాప్తికొఱకు శ్రవణ మనన నిదిధ్యాసనము లను త్రివిధసాధనములు విధింపఁబడి యున్నవి.

మఱియు లౌకికవైదికకర్మములచేత విక్షిప్త మగుచిత్తమునం దాశ్రవణాదికము సంభవింపదు లేదు. మఱియు "సన్న్యస్య శ్రవణం కుర్యాత్" ఇత్యాది వచనములచేతను సన్న్యాసపూర్వకముగానే శ్రవణాదులు కర్తవ్యము లని చెప్పఁబడి యున్నది. అందువలన వివేకాదిచతుష్టయసాధనసంపన్న సన్న్యాసికే యాత్మసాక్షాత్కారప్రాప్తికొఱకు శ్రవణాదులు కర్తవ్యములై యున్నవి.

## [*] (33) వివేకాదిచతుస్సాధనవర్ణనము. [*]

ఇఁక వివేకాదిసాధనచతుష్టయము చెప్పఁబడుచున్నది. వివేకము, వైరాగ్యము, శమాదిషట్కసంపత్తి, ముముక్షుత యను నీచతుష్టయము సాధనము లని చెప్పఁబడును. అందు ఆత్మ యైననో నిత్యమై యున్నది, మఱియు, ఆత్మకన్నను భిన్న మైన బ్రహ్మలోకపర్యంతసర్వానాత్మవస్తువు లనిత్యములై యున్నవి, అను నీ ప్రకారముగా శ్రుతిస్మృతియుక్తులచేత విచారణ చేయుట వివేక మనఁబడును. అచ్చట "ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః, అజో నిత్యః శాశ్వతో உయం పురాణః, అవినాశితు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్। వినాశ మవ్యయ స్యాస్య న కశ్చిత్కర్తు మర్హతి" ఇత్యాది శ్రుతిస్మృతులచేత నాత్మకు నిత్యత్వము సిద్ధ మగుచున్నది. మఱియు "తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవ మేవా உముత్ర పుణ్యచితో లోకః క్షీయతే, అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః" ఇత్యాదిశ్రుతిస్మృతులచేతను, ఏది యేది కార్యమై యున్నదో అది యది యనిత్యమే యగుచున్నది ఘటాదికమువలె ఇత్యాద్యనుమానరూపయుక్తులచేతను, అనాత్మవస్తువుల కనిత్యత్వము సిద్ధ మగుచున్నది. ఈప్రకార మైన వివేకముచేత నీయధికారిపురుషునకు సర్వానాత్మవస్తువులయందు వైరాగ్యము కలుగుచున్నది.

ఈలోకమునందుండు విషయసుఖమునందును,దత్సాధన మైన స్రక్చందన వనితాదికమునందును స్వర్గాదిపరలోకమునందుండు విషయసుఖమునందును దత్సాధన మైన యమృతపానాప్సరఃప్రభృతికమునందును, ఈ సర్వసాధనసహిత సర్వవిషయసుఖములయం దనిత్యత్వాదిదోషబుద్ధిచేత శ్వానవాంతపాయసమందువలె నేత్యాగేచ్ఛ యున్నదో, అది వైరాగ్య మనఁబడును. శ్రుతి.—"పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయా న్నాస్త్యకృతః కృతేన"—భావము॥ కర్మోపాస

నలచేతఁ బొందుటకు యోగ్యము లైన యే బ్రహ్మలోకాదిలోకము లున్నవో వాని యం దనిత్యత్వనిశ్చయముచేతను గర్మములచేత మోక్షము బ్రాప్తింప దను నిశ్చయముచేతను బ్రహ్మజిజ్ఞాసగలపురుషు లాకర్మములనుండియు నాకర్మసాధ్యము లగు లోకములనుండియు వైరాగ్యమును బొందవలయును. ఈప్రకారముగా వైరాగ్యోత్పత్త్యనంతర మీయధికారిపురుషుఁడు, శమము దమము ఉపరతి తితిక్ష శ్రద్ధ సమాధాన మను నీయాఱును బొందవలయును. ఈషట్కముయొక్క స్వరూపము ముందు తృతీయపరిచ్ఛేదమునఁ జెప్పఁబడును. శ్రుతి.— "శాంతో దాంత ఉపరత స్తితిక్షుః సమాహితో భూత్వాత్మన్యే వాత్మానం పశ్యతి" — భావము॥ అధికారి పురుషుఁడు శమాదిసాధనసంపద్యుక్తుఁడై తనమనస్సునందు "అహం బ్రహ్మాస్మి" యని ఆత్మను సాక్షాత్కరించుకొను చున్నాఁడు.

తదనంతర మీయధికారిపురుషుఁడు మోక్షప్రాప్తికొఱకు నుత్కటే (తీవ్ర) చ్ఛారూప మగు ముముక్షుత్వము పొందవలయును. ఇచ్చట, వివేకము వైరాగ్యము శమాదిషట్కసంపత్తి ముముక్షుత్వ మను నీచతుస్సాధనములు సముచ్చితము లయ్యే యధికారికి విశేషణము లగుచున్న వని యాచార్యు లంగీకరించి యున్నారు. మఱియు నన్యగ్రంథకారు లైననో కేవలముముక్షుత్వమే అధికారికి విశేషణ మగుచున్న దనియును ఆవివేకాదులు ముముక్షుత్వమునకు సాధనము లనియు నంగీకరించుచున్నారు.

ఈప్రకారముగా వివేకాదిచతుస్సాధనసంపన్నపురుషుఁడే సన్న్యాసమున కధికారి యగుచున్నాఁడు. అట్టి చతుస్సాధనసంపన్నసన్న్యాసియే బ్రహ్మసాక్షాత్కారప్రాప్తికొఱకు బ్రహ్మవేత్త యగుగురువును శరణు పొంది వేదాంతశాస్త్రశ్రవణాదులను జేయవలయును. అచ్చట, శ్రుతి.—"తద్విజ్ఞానార్థం సగురు మే వాభిగచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్" — భావము॥ చతుస్సాధనసంపన్నాధికారి పురుషుఁడు సర్వకర్మములను సన్న్యసించి, మోక్షప్రాప్తికి సాధన మైన బ్రహ్మసాక్షాత్కారప్రాప్తికొఱకు హస్తమునందుఁ గించిత్పూజాయోగ్యద్రవ్యములను గొని, శ్రోత్రియబ్రహ్మనిష్ఠగురువుయొక్క సమీపమునకుఁ బోవలయును. ఇచ్చట, శిష్యుని యొక్క సంశయనివృత్తి చేయుటయం దుపయోగముగల శాస్త్రజ్ఞానముతోఁ గూడిన గురువు శ్రోత్రియుఁ డనఁబడును. మఱియు, కరతలామలకమువలె సంశయవిపరీతభావనారహితాఖండైకరసానందబ్రహ్మసాక్షాత్కారము గలగురువు బ్రహ్మనిష్ఠుఁ డనఁబడును. ఈ ద్వివిధవిశేషణములతోఁ గూడినగురువుయొక్క యుపదేశమువలననే శిష్యున కాత్మసాక్షాత్కారము కలుగుచున్నది.

## [*] (34) సన్న్యాసస్వరూపనిరూపణము. [*]

ఇఁక సన్న్యాసముయొక్క స్వరూపము నిరూపింపఁబడుచున్నది. అచ్చట "విహితానాం కర్మణాం విధినా పరిత్యాగః సన్న్యాసః"—భావము॥ శ్రుతిస్మృతి రూపశాస్త్రములవలన నీయధికారిపురుషుని గుఱించి కర్తవ్యతారూపముచేత విధింపఁ బడిన యగ్నిహోత్రసంధ్యోపాసనాదికర్మములను విధిపూర్వకముగాఁ బరిత్యజించుట యేది గలదో అది సన్న్యాస మనఁబడును. ఆకర్మసన్న్యాసముయొక్క విధి యాత్మ పురాణముయొక్క యేకాదశాధ్యాయమునం దతివిస్తరముగా నిరూపింపఁబడి యున్నది. అందు "కర్మణాం త్యాగః సన్న్యాసః" అను నింతమాత్రమే సన్న్యాసమునకు లక్షణ మనినయెడల, అవిహితకర్మములను లేక నిషిద్ధకర్మములను బరిత్యజించు పురుషునియందును సన్న్యాసిత్వము ప్రాప్త మగును. దానిని నివర్తించుటకొఱకు కర్మములకు "విహితానా" మ్మను విశేషణము చెప్పఁబడినది. మఱియు నాలక్షణమునందు "విధినా" అనుపదముఁ జెప్పనియెడల నాలస్యాదిదోషములచేత విహితకర్మములను బరిత్యజించుపురుషునియందును ఆసన్న్యాసిత్వము ప్రాప్త మగును. దానిని నివర్తించుటకొఱకు విధిపూర్వకకర్మత్యాగము సన్న్యాస మని చెప్పఁబడినది.

పూర్వోక్తసన్న్యాసమునకు వైరాగ్యమే కారణమై యున్నది. అనఁగా వైరాగ్యవంతుఁ డగుపురుషునకే యాసన్న్యాసము యోగ్యమై యున్నది. శ్రుతి.— "యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్"— భావము॥ ఈ యధికారిపురుషుఁ డేదినమునందు వైరాగ్యమును బొందుచున్నాఁడో ఆదినమునందే సర్వకర్మములను ద్యాగము చేయవలయును. స్మృతి.—"వైరాగ్యం పర మేతస్య మోక్షస్య పరమో ఽవధిః" — భావము॥ ఈసన్న్యాసమునకుఁ బరవైరాగ్యమే పరమావధియై యున్నది. అను నీశ్రుతిస్మృతులచేత వైరాగ్యమే సన్న్యాసమునకు హేతు వని సిద్ధమగుచున్నది. ఆసన్న్యాసముగూడ వైరాగ్యముయొక్క తారతమ్యముచేతఁ గుటీచక బహూదక హంస పరమహంస లను భేదముచేతఁ జతుర్విధమై యున్నది.

## [*] (35) వైరాగ్యవిభాగకథనము. [*]

ఇఁక నావైరాగ్యముయొక్క న్యూనతాధికతలను నిరూపించుటకొఱకు వైరాగ్యముయొక్క విభాగము చెప్పఁబడుచున్నది. ఆవైరాగ్యము, అపరవైరాగ్యము పరవైరాగ్య మను భేదముచేత ద్వివిధమై యున్నది. ఆద్వివిధవైరాగ్యములలోఁ బ్రథమ మగు నపరవైరాగ్యమును, యతమానము వ్యతిరేకము ఏకేంద్రియము వశీకార మను భేదముచేతఁ జతుర్విధమై యున్నవి. అందు సంసారమునం దీవస్తువు

సారము ఈవస్తు వసార మను నేసారాసారవివేక మున్నదో అది యతమానవైరాగ్య మనఁబడును. మఱియుఁ జిత్తమునందు రాగద్వేషాదు లగు నేదోషము లున్నవో ఆదోషములయం దింతమాత్రముదోషము నాయందు నివృత్తమైనది, మఱియు నింతమాత్రముదోషము నాయం దున్నది యనువిచారముచేత నాశేషించినదోషములను నివర్తించుటకొఱ కేప్రయత్న మున్నదో అది వ్యతిరేకవైరాగ్య మనఁబడును. మఱియు మనస్సునందు విషయేచ్ఛ యుండియు నేయింద్రియనిరోధప్రయత్న మున్నదో, అది యేకేంద్రియవైరాగ్య మనఁబడును.

మఱియు నిహపరలోకములయొక్క విషయములు నాశవంతము లని తెలిసి వాని త్యాగము చేయవలయు నను నేయిచ్ఛ యున్నదో అది వశీకారవైరాగ్య మనఁబడును. ఈ వశీకారవైరాగ్యముయొక్క స్వరూపమునే పతంజలిభగవానులచేతను "దృష్టానుశ్రవికవిషయవితృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్యమ్" అను సూత్రముచేతఁ జెప్పఁబడి యున్నది. మఱియు నావశీకారవైరాగ్యమును, మందము తీవ్రము తీవ్రతర మనుభేదముచేతఁ ద్రివిధమై యున్నది. అందుఁ బుత్రస్త్రీధనాదిప్రియపదార్థముల వియోగమునం దీసంసారము దుఃఖద మనుబుద్ధిచేత నావిషయములయొక్క యేత్యాగేచ్ఛ యున్నదో, అది మందవైరాగ్య మనఁబడును. మఱియు నీజన్మమునందు నాకుఁ బుత్రస్త్రీధనాదిపదార్థములు ప్రాప్తింపకపోవుఁ గాక యను స్థిరబుద్ధిచేత నావిషయములయొక్క యేత్యాగేచ్ఛ యున్నదో అది తీవ్రవైరాగ్య మనఁబడును. మఱియుఁ బునరావృత్తియుక్త మగు బ్రహ్మలోకపర్యంతసర్వలోకములు నాకుఁ బ్రాప్తింపక పోవలయు నను స్థిరబుద్ధిచేత నాసర్వవిషయములయొక్క పరిత్యాగేచ్ఛ యేది గలదో అది తీవ్రతరవైరాగ్య మనఁబడును.

అందు మందవైరాగ్యసహితపురుషున కేవిధమైన సన్న్యాసమునందును అధికారము లేదు. అందులకు స్మృతి.—"యధా మనసి వైరాగ్యం జాయతే సర్వవస్తుషు । తదైవ సన్న్యసే ద్విద్వా నన్యథా పతితో భవేత్"— భావము॥ ఏకాలమునం దీపురుషునియొక్క మనస్సునందు సర్వవస్తువిషయకవైరాగ్యము కలుగుచున్నదో ఆకాలమునందే యీవివేకిపురుషుఁడు సర్వకర్మములను సన్న్యసింపవలయును. వైరాగ్యము లేక సన్న్యసించినపురుషుఁడు పతితుఁ డగుచున్నాఁడు. మఱియుఁ దీవ్రవైరాగ్యసహితపురుషునకుఁ గుటీచకబహూదకము లను ద్వివిధసన్న్యాసములయం దధికార మున్నది. అందుఁ దీవ్రవైరాగ్యవంతుఁ డగు నేపురుషునియొక్క శరీరము తీర్థయాత్ర చేయుటయం దశక్తమై యున్నదో వానికిఁ గుటీచకసన్న్యాసము

నం దధికార మున్నది. ఎవనియొక్క శరీరము తీర్థయాత్ర చేయుటయందు శక్తిమంత మై యున్నదో వానికి బహూదకసన్న్యాసమునం దధికార మున్నది. మఱియుఁ దీవ్రతర వైరాగ్యము నొందినపురుషునకు హంససన్న్యాసమునం దధికార మున్నది.

అందుఁ గుటీచక బహూదక హంస లను త్రివిధసన్న్యాసములయొక్క స్వరూపమును సదాచారమును మను పరాశరస్మృత్యాదిధర్మశాస్త్రములయందుఁ బ్రసిద్ధమై యున్నది. అట్లే ఆత్మపురాణమునందును జెప్పఁబడి యున్నది. మఱియుఁ బూర్వోక్తసర్వవైరాగ్యములకన్నను ఉత్కృష్టమైన యేవైరాగ్య మున్నదో, అది పరవైరాగ్య మనఁబడును. ఈపరవైరాగ్యముయొక్క స్వరూపము ముందు చెప్పఁబడును. అట్టి పరవైరాగ్యమును బొందినయధికారిపురుషునకుఁ బరమహంససన్న్యాసమునం దధికార మున్నది.

ఆ పరమహంససన్న్యాసముకూడ, వివిదిషాసన్న్యాస విద్వత్సన్న్యాసము లను భేదముచేత ద్వివిధమై యున్నది. అందు వివేకాదిచతుష్టయసాధనసంపన్నపురుషుఁడు తత్త్వజ్ఞానప్రాప్తికొఱకు గ్రహించునట్టి యేసన్న్యాస మున్నదో అది వివిదిషాసన్న్యాస మనఁబడును. అందులకు శ్రుతి.—"ఏత మేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛంతః ప్రవ్రజంతి"—భావము॥ పరక్తపురుషులు పొందుటకు యోగ్యమైన యే యీయాత్మరూపలోక మున్నదో దానిని బొందుట కిచ్ఛించు నధికారిపురుషులు సన్న్యాసమును గ్రహించుచున్నారు. ఇచ్చటఁ దాత్పర్య మే మనఁగా, ఆత్మలోకానాత్మలోకము లనుభేదముచేత లోకములు ద్వివిధములై యున్నవి. అందు "అథ త్రయోవా వావ లోకా, మనుష్యలోకః పితృలోకో దేవలోకః" ఇత్యాదిశ్రుతులచేత నాయనాత్మలోకము మనుష్యలోక పితృలోక దేవలోకము లనుభేదముచేతఁ ద్రివిధముగాఁ జెప్పఁబడి యున్నది. మఱియు "అథ యో హవా ఉస్మాల్లోకాత్త్వం లోక మదృష్ట్వా ప్రైతి స ఏత మవిదితో న భునక్తి, ఆత్మాన మేవ లోక ముపాసీత, కిం ప్రజయా కరిష్యామో యేషాం నో ఽయ మాత్మా ఽయం లోకః" ఇత్యాదిశ్రుతులచేత నాత్మలోకము చెప్పఁబడి యున్నది. అందువలనఁ బూర్వోక్తశ్రుతియందుండు లోక శబ్దముచేత నాత్మరూపలోకమును గ్రహించుట యుచితమై యున్నది.

## [*] (36) వివిదిషాసన్న్యాసవిభాగము. [*]

పూర్వోక్తవివిదిషాసన్న్యాసముగూడ ద్వివిధమై యున్నది. ఒకటి జన్మములను బ్రాప్తింపఁజేయునట్టికర్మములయొక్క త్యాగరూపమై యున్నది, మఱియొకటి ప్రేషమంత్రోచ్చారణపూర్వకదండధారణాద్యాశ్రమరూపమై యున్నది. అచ్చటఁ

గామ్యకర్మములును ఫలేచ్ఛాపూర్వకముగాఁ జేయు నిత్యకర్మములును ఈపురుషునకు జన్మములను బ్రాప్తింపఁజేయు చున్నవి. ఆకర్మములయొక్క యేత్యాగ మున్నదో అది ప్రథమ మగు వివిదిషాసన్న్యాస మనఁబడును. దానియందును గామ్యకర్మముల కైననో స్వరూపముచేతనే పరిత్యాగము వివక్షితమై యున్నది. నిత్యకర్మములకు స్వరూపముచేతఁ బరిత్యాగము వివక్షితము గాదు. ఇది యేమనఁగా, ఆనిత్యకర్మములయొక్క ఫలేచ్ఛామాత్రమునకుఁ బరిత్యాగము వివక్షితమై యున్నది. ప్రథమ వివిదిషాసన్న్యాసమునందు శ్రుతిప్రమాణ మేమనఁగా "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగే నై కే ఽమృతత్వ మానశుః"—భావము॥ పూర్వమునం దుండినయధికారిపురుషులు కామ్యకర్మములచేతను ఫలేచ్ఛాపూర్వకముగాఁ జేయఁబడిననిత్యకర్మములచేతను మోక్షసాధనరూపబ్రహ్మసాక్షాత్కారమును బొందఁ లేదు. ఈలాగుననే పుత్రపౌత్రాదికప్రజలచేతను గోసువర్ణాదిధనములచేతను ఆబ్రహ్మసాక్షాత్కారమును బొంద లేదు. మఱి యే మనఁగా, ఆపూర్వవిరక్తపురుషులు జన్మప్రాప్తిని జేయునట్టికర్మములయొక్క త్యాగరూపసన్న్యాసముచేతనే బ్రహ్మసాక్షాత్కారమును బొంది యున్నారు. అందువలన నీకాలమందుండు నధికారిపురుషులు గూడ, ఆకర్మత్యాగరూపసన్న్యాసముచేతనే బ్రహ్మసాక్షాత్కారమును సంపాదింపవలయును. ఈ శ్రుతి యీప్రథమ మగు వివిదిషాసన్న్యాసమునే చెప్పియున్నది. అచ్చట, ఏవిరక్తగృహస్థాదులకు నేదైన నొకప్రబలనిమిత్తవశముచేత దండధారణాదిరూపాశ్రమసన్న్యాసమును గ్రహించుటకుఁ బ్రతిబంధక మున్నదో ఆగృహస్థాదుల కీప్రథమవివిదిషాసన్న్యాసమునందే యధికార మున్నది. ఈవివిదిషాసన్న్యాసమునందు స్త్రీలకుఁ, గూడ నధికార మున్నది. ఎట్లనఁగా శ్రుతిస్మృతీతిహాసపురాణాదులయందు జనకుఁడు యాజ్ఞవల్క్యుఁడు అజాతశత్రువు కహోలుఁడు మైత్రేయి గార్గి మొదలగు వారికి బ్రహ్మసాక్షాత్కారప్రాప్తి చెప్పఁబడి యున్నది. ఆసర్వులకును బూర్వోక్త వివిదిషాసన్న్యాసముచేతనే బ్రహ్మసాక్షాత్కారప్రాప్తి యైనది.

శంక:—యజ్ఞోపవీతధారణారూపోపనయనసంస్కారసహితులకే. వేదాధ్యయనము చేయుటయం దధికార మున్నది. స్త్రీల కాయుపనయనసంస్కారము లేనందువలన, నాస్త్రీలకు వేదాధ్యయనము చేయుటయం దధికారమే లేదు. మఱియు "స్త్రీ శూద్రౌ నాధీ యేతామ్" అను శ్రుతియును. స్త్రీశూద్రులకు వేదాధ్యయనమును నిషేధించి యున్నది. మఱియుఁ దత్త్వమస్యాదివైదికవాక్యముల చేతనే బ్రహ్మసాక్షాత్కారప్రాప్తి యగుచున్నది. ఆమహావాక్యశ్రవణమున కాస్త్రీశూద్రు లనధికారు లగుటవలన, వారికి బ్రహ్మజ్ఞానమున కధికారమే లేదు.

సమాధానము:—"స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాంతి పరాంగతిమ్" అనువచనముచేత, శ్రీభగవంతునిచే స్త్రీశూద్రులకును మోక్షప్రాప్తి చెప్పఁబడి యున్నది. మఱియు "య ద్బ్రహ్మ విద్యయా సర్వం భవిష్యంతో మను ష్యా మన్యంతే" అను శ్రుతిచేత, మనుష్యమాత్రునకే బ్రహ్మవిద్యచేత సర్వాత్మభావ ప్రాప్తి చెప్పఁబడి యున్నది. మఱియు నాబ్రహ్మజ్ఞానము వేదాంతశాస్త్రశ్రవణము లేక సంభవించుట లేదు. అందువలన నీవ్యవస్థ సిద్ధ మగుచున్నది. వేదాధ్యయనాధికారు లైన బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యు లను త్రివిధవర్ణస్థుల కైననో, ఉపనిషద్రూపవేదాంతశ్రవణాదికముచేతనే బ్రహ్మజ్ఞానము కలుగుచున్నది. మఱియుఁ బూర్వ మనేకజన్మములయొక్క పుణ్యకర్మములచేత శుద్ధ మైనయంతఃకరణము గలవారును వేదాధ్యయనమునం దనధికారులు నైనట్టి స్త్రీశూద్రుల కైననో వేదాంతార్థప్రతిపాదకపురాణాదులయొక్క శ్రవణముచేతనే యాబ్రహ్మజ్ఞానము కలుగుచున్నది. ఈ కారణముచేతనే యితిహాసపురాణాదులయందు విదురాదిశూద్రులకును బ్రహ్మజ్ఞాన ప్రాప్తి చెప్పఁబడి యున్నది. శూద్రులకును బ్రహ్మజ్ఞానమునం దధికారము సిద్ధించు నపుడు మైత్రేయి గార్గి మొదలగుబ్రాహ్మణస్త్రీల కాబ్రహ్మజ్ఞానమునం దధికార మున్న దని చెప్పవలసినది లేదు.

కొందఱు గ్రంథకారు లైననో, యీవ్యవస్థ చెప్పుచున్నారు. బృహదారణ్యకోపనిషత్తునందు యాజ్ఞవల్క్యముని తనభార్యయైన మైత్రేయిని గూర్చి సాక్షాత్ శ్రుతివచనములచేతనే బ్రహ్మవిద్యోపదేశము చేసి యున్నాఁడు. మఱియు నాబృహదారణ్యకోపనిషత్తునందు గార్గితో యాజ్ఞవల్క్యమునియొక్క సంవాదము ప్రసిద్ధమై యున్నది. అందువలన బ్రాహ్మణక్షత్రియవైశ్యు లను త్రివిధవర్ణస్త్రీలకును ఆత్మజ్ఞానమం దుపయోగు లైన వేదాంతశ్రుతులయొక్క శ్రవణమం దధికారము సిద్ధ మగుచున్నది. ఉపనయనసంస్కారము లేనందువలన, నాస్త్రీలకు వేదాధ్యయనమునం దధికారము లేదు. ప్రథమమందు గురువుచే నుచ్చరింపఁబడిన వేదవాక్యములను అనంతరము శిష్యుఁ డుచ్చరించుట యధ్యయన మనఁబడును. ఒకవేళ స్త్రీలకు వేదాంత శ్రవణమునం దధికారము లేనియెడల, యాజ్ఞవల్క్యముని మైత్రేయి గార్గి యనుస్త్రీలను గూర్చి సాక్షాద్వేదశ్రుతులచేత బ్రహ్మవిద్యోపదేశము చేసి యుండఁడు గదా! ఈయాజ్ఞవల్క్యమైత్రేయీసంవాద మాత్మపురాణమునయొక్క సప్తమాధ్యాయము నందు స్పష్టముగా నిరూపింపఁబడి యున్నది.

ఇఁక ద్వితీయ మగు నాశ్రమరూపవివిదిషాసన్న్యాసమునందు, శ్రుతి స్మృతిప్రమాణములు చెప్పఁబడుచున్నవి. అందు శ్రుతి.—"దండ మాచ్ఛాదనం

కౌపీనం పరిగృహ్య, చ్ఛేషం విసృజేత్"—భావము॥ ఈసన్న్యాసి దండమును శీత నివృత్త్యర్థము శిథిలవస్త్రమును కౌపీనమును కమండలువును గ్రహింపవలయును, తద్భిన్న మగు సర్వవస్తువులను బరిత్యజింపవలయును. స్మృతి.—"సంసార మేవ నిస్సారం దృష్ట్వా సార దిదృక్షయా। ప్రవ్రజ న్త్యకృతోద్వాహాః పరం వైరాగ్య మాశ్రితాః"—భావము॥ బ్రహ్మలోకపర్యంతసర్వసంసారమును నిస్సార మని చూచి పరమాత్మవస్తురూపసారమును జూడవలయు నను నిచ్ఛచేత పరవైరాగ్యమును బొందినవిరక్తపురుషుఁడు గృహస్థాశ్రమమునకుఁ బూర్వమే ఆశ్రమరూపవివిదిషా సన్న్యాసమును ధరించుచున్నాఁడు. ఇత్యాదిక శ్రుతిస్మృతివచనము లాశ్రమరూప వివిదిషాసన్న్యాసమును జెప్పుచున్నవి. ఇంతపర్యంతము ద్వివిధవివిదిషాసన్న్యాసములు నిరూపింపఁబడినవి.

## [*] (37) విద్వత్సన్న్యాసనిరూపణము. [*]

ఇఁక విద్వత్సన్న్యాసము నిరూపింపఁబడుచున్నది. బ్రహ్మచర్యాశ్రమమందుఁ గాని గృహస్థాశ్రమమందుఁ గాని వానప్రస్థాశ్రమమందుఁ గాని వేదాంత శ్రవణాదికముచేత నేపురుషునకు బ్రహ్మసాక్షాత్కారము కలుగుచున్నదో అట్టి తత్త్వవేత్త యగుపురుషునిచేతఁ జిత్తవిక్షేపనివృత్తిరూపజీవన్ముక్తికొఱకు గ్రహింపఁబడిన యేసన్న్యాస మున్నదో అది విద్వత్సన్న్యాస మనఁబడును. ఈవిద్వత్సన్న్యాసము కూడ శ్రుతిస్మృతిప్రమాణములచేత సిద్ధమై యున్నది. అందు శ్రుతి.—"ఏత మేవ విదిత్వా ముని ర్భవతి, ఏతం వైత మాత్మానం విదిత్వా బ్రాహ్మణాః పుత్రైషణాయా శ్చ విత్తైషణాయా శ్చ లోకైషణా యాశ్చ వ్యుత్థా యాథ భిక్షాచర్యం చరంతి, న దండం న శిఖాం న యజ్ఞోపవీతం నాచ్ఛాదనం చరతి పరమహంసః"—భావము॥ ఈపరమాత్మను "అహం బ్రహ్మాస్మి" యని సాక్షాత్కరించుకొనినవిద్వాంసుఁ డగు పురుషుఁడు పరమహంససన్న్యాసి యగుచున్నాఁడు. మఱియు నాత్మసాక్షాత్కారముచేతఁ దత్త్వవేత్త యగుపురుషుఁడు పుత్రైషణ విత్తైషణ లోకైషణ యను నీషణాత్రయమును బరిత్యజించి భిక్షావృత్తిని ధరించుచున్నాఁడు, అనఁగా విద్వత్సన్న్యాసమును బొందుచున్నాఁడు. మఱియు నాతత్త్వవేత్త యగు పరమహంస సన్న్యాసి దండశిఖాయజ్ఞోపవీతవస్త్రములను ధరించుట లేదు. స్మృతి.—"యదా తు విదితం తత్త్వం పరంబ్రహ్మ సనాతనమ్। త దైకదండం సంగృహ్య సోపవీతాం శిఖాం త్యజేత్॥ కంథా కౌపీనవాసాస్తు దండధృ ద్ధ్యానతత్పరః। ఏకాకీ రమతే నిత్యం తం దేవా బ్రాహ్మణం విదుః॥ కపాలం వృక్షమూలాని కుచైల మసహాయతా। సమతా చైవ సర్వస్మి న్నేత న్ముక్తస్య లక్షణమ్"—భావము॥ ఏకాలమునం దీయథ

కాఁపురుషుఁడు పరబ్రహ్మరూపసనాతనతత్త్వమును సాక్షాత్కరించుకొనుచున్నాఁడో ఆకాలమునం దేకదండమును గ్రహించి యజ్ఞోపవీతసహితశిఖను బరిత్యజింపవలయును. ఏవిద్వాంసుఁడు శీతనివృత్తికొఱకుఁ గేవలశిథిలవస్త్రకౌపీనములను ధరించినవాఁడును దండమును ధరించినవాఁడును, సర్వదా అంతరాత్మధ్యానతత్పరుఁడును ఏకాకియునై చరించుచున్నాఁడో ఆవిద్వాంసుని దేవతలు బ్రహ్మవేత్త యగు పరమహంస సన్న్యాసి యందురు. మఱియు భిక్షకొఱకు మృత్తికామయకపాలమును హస్తమందు ధరించుటయును, వృక్షమూలమునందు శయనించుటయును, గుత్సితవస్త్రము ధరించుటయును నొకరియొక్కయుసాహాయ్యము లేక యుండుటయును సర్వభూతములయందు సమబుద్ధియు నను నీసర్వమును, ముక్తపరమహంసయొక్కలక్షణమై యున్నది. అనఁగాఁ బూర్వోక్తలక్షణములచేత నాముక్తపరమహంస తెలియఁబడుచున్నాఁడు. ఇత్యాదిశ్రుతిస్మృతివచనము లావిద్వత్సన్న్యాసముఁ జెప్పుచున్నవి. ఈవిద్వత్సన్న్యాసమునకు జీవన్ముక్తియే ఫలమై యున్నది. ఈవిద్వత్పరమహంస సన్న్యాసులయొక్కచిహ్నములును ఆచారములును అవ్యక్తములై * యున్నవి. ఈ కారణముచేతనే శ్రుతిస్మృతివచనములయందుఁ గొన్నిస్థలములయందు వారికి దండవస్త్రాదులయొక్క యభావమును జెప్పఁబడియున్నది. మఱికొన్నిస్థలములయందు దండవస్త్రాదిధారణ చెప్పఁబడి యున్నది. ఆవిద్వత్సన్న్యాసులయొక్కయవ్యక్తచిహ్నములును అవ్యక్తాచారములును ఆత్మపురాణముయొక్క యేకాదశాధ్యాయమునందుఁ బ్రథమమున స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నవి.

శంక:—పూర్వము వివిదిషాసన్న్యాసమును బ్రహ్మజ్ఞానమునకు హేతువుగాఁ జెప్పితిరి. అది సంభవించుట లేదు. ఏల యన, జనకుఁడు అజాతశత్రువు మొదలగువారికి వివిదిషాసన్న్యాసము లేకపోయినను బ్రహ్మజ్ఞానము శ్రుతిస్మృత్యాదులచేతఁ దెలియవచ్చుచున్నది.

సమాధానము:—కేవల మీజన్మముయొక్కవివిదిషాసన్న్యాసమే బ్రహ్మజ్ఞానమునకుఁ గారణ మగుట లేదు, ఇఁక నేమనఁగా, జన్మాంతరమందు గ్రహింపఁబడిన వివిదిషాసన్న్యాసముకూడ బ్రహ్మజ్ఞానమునకుఁ గారణ మగుచున్నది. అందువలన జనకాదుల కీజన్మమునందు వివిదిషాసన్న్యాసము లేకపోయినను, జన్మాంతరవివిదిషాసన్న్యాసముచేతనే బ్రహ్మజ్ఞానము ప్రాప్త మైనది. ఈప్రకారముగా బ్రహ్మజ్ఞానరూపకార్యమువలన జన్మాంతరసన్న్యాసరూపకారణముయొక్కయనుమానము కలు

* తెలియరానివి.

గుచున్నది. మఱియు "యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్" అను శ్రుతిచేత వైరాగ్యనంతునకు సర్వాంగసహితవివిదిషాసన్న్యాసమును విధించి, మరల నాప్రకరణమునందు "యద్యాతురః స్యాన్మనసా వాచావా సన్న్యసేత్" — భావము॥ ఎప్పు డీపురుషుఁడు వ్యాధి మొదలగుదానిచేత నత్యాతురుఁ డగుచున్నాఁడో అప్పుడు అంగములు లేకయే కేవలమనస్సుచేత లేక వాక్కుచేత సన్న్యసింపవలయును అనుశ్రుతిచేత నాతురసన్న్యాసము విధింపఁబడి యున్నది. అచ్చట మరణము సమీపింపఁగా నాయాతురసన్న్యాసి కాకాలమునందు శ్రవణాదులచేత నాత్మజ్ఞానప్రాప్తి సంభవించుట లేదు. అందువలన నాయాతురసన్న్యాసము వానికి రెండవ జన్మమునం దాత్మజ్ఞానప్రాప్తిని జేయుచున్న దని యావశ్య మంగీకరింపవలయును. లేనియెడ నాయాతురసన్న్యాసమే వ్యర్థ మగును. ఈకారణముచేతనే యీజన్మాంతరవివిదిషాసన్న్యాసమున కాత్మజ్ఞానకారణత్వము సంభవించుచున్నది.

శంక:—ఈ యాతురసన్న్యాసము పూర్వోక్తవివిదిషాసన్న్యాసముకన్నను భిన్నమే యగుచున్నది. "సన్న్యాసా ద్బ్రహ్మణః స్థానమ్" అను స్మృతిచేత నాయాతురసన్న్యాసమునకు బ్రహ్మలోకప్రాప్తిరూపఫలము చెప్పఁబడుచున్నది. అందువలన నాయాతురసన్న్యాసము వ్యర్థము కాదు.

సమాధానము:—ఈ యాతురసన్న్యాసమునందును విరక్తపురుషునకే యధికార మున్నది. మఱియు వివిదిషాసన్న్యాసముయొక్క ప్రకరణమునందే యీ యాతురసన్న్యాసము విధింపఁబడి యున్నది. అందువలన నీయాతురసన్న్యాసము పూర్వోక్తవివిదిషాసన్న్యాసముకన్నను భిన్నసన్న్యాసము కాదు. మఱి యే మనఁగా, నావివిదిషాసన్న్యాసమునందే యంతర్భూతమై యున్నది. మఱియు "సన్న్యాసా ద్బ్రహ్మణః స్థానమ్" అను స్మృతి యైనను, ఆ యాతురసన్న్యాసమునకు బ్రహ్మలోకప్రాప్తిరూపావాంతరఫలమును జెప్పుచున్నది. దానిచేత నాత్మజ్ఞానరూపముఖ్యఫలమునకు నిషేధము కలుగుట లేదు. లేక, ఆస్మృతి కుటీచకాదిరూపస్మార్తసన్న్యాసమునకు బ్రహ్మలోకప్రాప్తిరూపఫలము చెప్పుచున్నది. అందువలన నాయాతురసన్న్యాసమునకు నాత్మజ్ఞానప్రాప్తియే ముఖ్యఫలమై యున్నది. జన్మాంతరసన్న్యాసముచేతను ఆత్మజ్ఞానప్రాప్తి యగుచున్న దను నీయర్థము, శ్రీసర్వజ్ఞమహామునులచేతను సంక్షేపశారీరక మనుగ్రంథమునందుఁ జెప్పఁబడి యున్నది. అందు,

"శ్లో. జన్మాంతరేషు యది సాధనజాత మాసీత్ సన్న్యాసపూర్వక మిదం శ్రవణాదిరూపమ్ । విద్యా మవాప్స్యతి జనః సకలోపి యత్ర తత్రాశ్రమాదిషు వసన్న నివారయామః" — భావము॥ ఒకవేళ నీయధికారిపురుషులకుఁ బూర్వజన్మ

ములయందు సన్న్యాసపూర్వకశ్రవణాదిసాధనములు సిద్ధ మైనయెడల నాయధికారి జను లాయాగృహస్థాద్యాశ్రమములయందు వసించి యుండినను బూర్వసాధనముల యొక్కబలముచేత నచ్చటనే బ్రహ్మవిద్యను బొందుచున్నారు. ఈయర్థము మేము నివారింపఁజాలము. అందువలన నాజనకాదులకుఁ బూర్వజన్మమునందలి వివిదిషా సన్న్యాసముచేత నాత్మజ్ఞానప్రాప్తి సంభవించె ననునది సిద్ధ మైనది.

అచ్చటఁ బూర్వము "ఆత్మావా ఉరే ద్రష్టవ్యః శ్రోతవ్యో, మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అను శ్రుతివచనముచేత, నధికారిపురుషునిగూర్చి నాత్మజ్ఞానప్రాప్తి కొఱకు శ్రవణాదులయొక్కకర్తవ్యత్వము చెప్పఁబడినది. దానియందుఁ గొందఱు గ్రంథకారు లైననో, శ్రవణాదులయందు విధి నంగీకారము చేయుట లేదు. మఱి కొందఱు విధి నంగీకరించుచున్నారు. అచ్చటఁ బ్రథమపక్షము వాచస్పతిమిశ్రులదై యున్నది. ద్వితీయపక్షము వివరణాచార్యులదై యున్నది.

అందు, వాచస్పతిమిశ్రులయొక్కయభిప్రాయ మే మనఁగా, వివేకాది సాధనచతుష్టయసంపన్నజిజ్ఞాసువులచేతఁ జేయఁబడినశ్రవణాదుల కాత్మజ్ఞానకార ణత్వ మన్వయవ్యతిరేకములచేతనే నిశ్చిత మగుచున్నది. అందువలన శ్రవణాదుల యందు విధి సంభవించుట లేదు. అప్రాప్తార్థమునందే విధి యున్నది. ఉదా-యాగమునందు స్వర్గకారణత్వము ప్రత్యక్షాదిప్రమాణములచేత నప్రాప్తమై యున్నది, అందువలనఁ దాదృశకారణత్వబోధక మైన "స్వర్గకామో యజేత" అనువచనము విధిరూపమై యున్నది. యద్యపి శ్రవణాదులయందు బ్రహ్మసాక్షాత్కారముయొక్క కారణత్వము, పూర్వోక్తశ్రుతిప్రమాణముకన్నను భిన్న మైన యేప్రమాణముచేతను బ్రాప్తము కాదు. తథాపి, అతిసూక్ష్మ మగుటచేత దుర్విజ్ఞేయ మైన షడ్జాదు లగు నేస్వరము లున్నవో ఆస్వరములయొక్కసాక్షాత్కారమును గుఱించి గాంధర్వశాస్త్రాభ్యాసమున కన్వయవ్యతిరేకములచేతఁ గారణత్వము ప్రాప్త మగుచున్నది. ఆస్వరములవలె బ్రహ్మము కూడ నతిసూక్ష్మ మగుటవలన దుర్విజ్ఞేయమై యున్నది. అందువలన నాబ్రహ్మసాక్షాత్కారమునుగుఱించియు వేదాంతశాస్త్రశ్రవణమునకుఁ గార ణత్వ మన్వయవ్యతిరేకములచేతనే ప్రాప్త మగుచున్నది. అట్టిప్రాప్తార్థమునందు విధి సంభవించుట లేదు. "శ్రోతవ్యః" అనువచనమునందు తవ్యప్రత్యయ మేది యున్నదో, ఆప్రత్యయమునకు విధి యర్థము కాదు, మఱి యే మనఁగా, యోగ్యత యర్థమై యున్నది. అనఁగా ఆత్మశ్రవణము చేయుటకు యోగ్యమై యున్నది. ఈప్రకారము గానే "మంతవ్యః నిదిధ్యాసితవ్యః" అను ద్వివిధవచనములయందును విధియొక్కయభావము తెలియవలయును.

## [*] (39) శ్రవణరూపాంగికి అంగము నిరూపించుట. [*]

మఱియు నాచార్యులయొక్కయభిప్రాయ మేమనఁగా, "ఆత్మావా ఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అనుశ్రుతియందు వివేకాదిసాధనచతుష్టయసంపన్నసన్న్యాసిని గుఱించి యాత్మసాక్షాత్కారప్రాప్తికొఱకు మనననిదిధ్యాసనరూపము లగు ఫలోపకార్యంగములతోఁ గూడిన శ్రవణ మనునంగి విధింపఁబడి యున్నది. అచ్చట, ఏపదార్థము సాక్షాత్తుగా ఫలమునకు సాధనరూపమున శ్రుత మగుచున్నదో ఆపదార్థ మంగి యని చెప్పఁబడును. దీనినే శేషి యనియును ప్రధాన మనియును జెప్పుదురు. మఱియు నాయంగియొక్కసమీపముగానే యేపదార్థము ఫలము లేక కర్తవ్యతారూపముచేత శ్రుత మగుచున్నదో ఆపదార్థ మంగ మని చెప్పఁబడును. ఇదియే శేష మనియును సహకారి యనియును చెప్పఁబడును.

ఆయంగముకూడ, స్వరూపోపకారి ఫలోపకారి యనుభేదముచేత ద్వివిధమై యున్నది. అచ్చట, ఏయంగ మంగియొక్కస్వరూపోత్పత్తియందుపకారియై యున్నదో ఆయంగము స్వరూపోపకారి యని చెప్పఁబడును. ఈస్వరూపోపకార్యంగమునే మీమాంసకులు సన్నిపత్యోపకార్యంగ మని చెప్పుదురు. మఱియు నేయంగ మంగిచేత జన్యమైన ఫలముయొక్కయుత్పత్తియందుపకారియై యున్నదో ఆయంగము ఫలోపకార్యంగ మని చెప్పఁబడును. ఈఫలోపకార్యంగమునే మీమాంసకులు ఆరాదుపకార్యంగ మని చెప్పుదురు. ఉదా—ఈప్రసంగమందు వేదాంతశాస్త్రశ్రవణము ప్రమాణవిచారరూప మగుటవలన బ్రహ్మజ్ఞానరూపఫలమునకు సాక్షాత్తుగా సాధనరూపమున విధింపఁబడి యున్నది. అందువలన నాశ్రవణ మంగి యని చెప్పఁబడును. ఆశ్రవణరూపాంగియొక్కసమీపమందు విధింపఁబడియుండు నేవివేకాదిచతుస్సాధనము లున్నవో వానికి జ్ఞానముకన్నను వేఱొకఫల మచ్చటఁ జెప్పఁబడ లేదు. అందువలన నావివేకాదిసాధనములు శ్రవణరూపాంగియొక్కస్వరూపోత్పత్తియందుపకారు లగుటవలన నవి స్వరూపోపకార్యంగము లని చెప్పఁబడును. మఱియు నాశ్రవణరూపాంగియొక్కసమీపముగా, ఫలము లేకయే మనననిదిధ్యాసనములు విధింపఁబడి యున్నవి. అందువలన మనననిదిధ్యాసనములు రెండును శ్రవణరూపాంగికి బ్రహ్మసాక్షాత్కారరూపఫలోత్పత్తియందుపకారు లగుటవలన ఫలోపకార్యంగము లని చెప్పఁబడును. అందువలన "శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అనువచనములచేత మనననిదిధ్యాసనరూపఫలోపకార్యంగసహితముగా శ్రవణ మనునంగి విధింపఁబడి యున్నది. అనఁగా సాధనచతుష్టయసంపన్న

సన్న్యాసి బ్రహ్మసాక్షాత్కారప్రాప్తికొఱకు మనననిదిధ్యాసనరూపాంగములతోఁ గూడిన శ్రవణరూపాంగి నవశ్యము సంపాదింపవలయును. అచ్చట శ్రవణమునకు బ్రహ్మసాక్షాత్కారముయొక్క కారణత్వము పూర్వోక్తాన్వయవ్యతిరేకములచేతనే సిద్ధమైనది. అందువలన నాశ్రవణమును విధించియుండు "శ్రోతవ్యః" అను విధి యపూర్వవిధిరూపము కాదు. మఱి యే మనఁగా, నియమవిధిరూపమై యున్నది. లేక, పరిసంఖ్యావిధిరూపమై యున్నది.

## [*] (40) అపూర్వాదిత్రివిధవిధులయొక్క లక్షణము. [*]

ఇఁక, క్రమముగా నపూర్వాదిత్రివిధవిధుల యొక్క లక్షణములు చెప్పఁబడుచున్నవి. అందు "అప్రాప్తార్థబోధకో విధిః అపూర్వవిధిః"—భావము॥ ప్రమాణాంతరముచేత నప్రాప్తమైనయర్థమును [illegible] యే విధి యున్నదో, అది యపూర్వవిధి యనఁబడును. ఉదా—"[illegible]" అను వచన మపూర్వవిధియై యున్నది. ఈవచనము [illegible] నా వ్రీహిప్రోక్షణము ప్రాప్తము కాదు. అందువలన [illegible] నా విధి యపూర్వవిధి యనఁబడును.

మఱియు "పక్షప్రాప్తస్య [illegible]"—భావము॥ పక్షమునందుఁ బ్రాప్త [illegible] చేయునట్టి యేవిధి యున్నదో అది నియమవిధి, [illegible] న్యాత్" అనునది నియమవిధియై యున్నది. [illegible] లైన యేవ్రీహు లున్నవో వానియొక్క [illegible] యము లున్నవి. ఒకటి యనఘాతరూపోపాయము [illegible] పాయము. అందు ముసలముచేత వ్రీహులను [illegible] మఱియు నఖములచేత యుముకలను నివర్తింపఁజేయుట [illegible] నందు నఖవిదళనముయొక్క ప్రాప్తి యున్నదో [illegible] ప్రాప్తి యగుట లేదు. పక్షప్రాప్త [illegible] "వ్రీహీ నవహన్యాత్" అనువాక్యము పూర్తి [illegible] చేతనే యావ్రీహులయొక్క యుముకలను నివర్తింపఁజేయును. [illegible] నఖవిదళనరూపోపాయముయొక్క నివృత్తి [illegible]

మఱియు "ఉభయప్రాప్తౌ ఇతరవ్యావృత్తి [illegible] పరిసంఖ్యా విధిః"—భావము॥ ఒకేకాలమునందు రెండుపదార్థములు ప్రాప్తములగుచుండఁగా

ఏకపదార్థముయొక్క వ్యావృత్తిని బోధించునట్టి యేవిధి యున్నదో అది పరిసంఖ్యా విధియై యున్నది. ఉదా—"ఇమా మగృభ్ణ న్రశనా మృతస్య" అను మంత్రముచేత యజ్ఞమునం దశ్వగార్దభము లనురెంటియొక్క రశనలను * గ్రహించుట ప్రాప్తము కాఁగా, "అశ్వాభిధానీ మాదత్తే" అనువచనము గార్దభరశనాగ్రహణముయొక్క వ్యావృత్తిని విధించుచున్నది. అశ్వరశనయొక్క గ్రహణము విధింప లేదు. అశ్వ రశనయొక్క గ్రహణము పూర్వోక్తమంత్రముచేతనే ప్రాప్త మగుచున్నది. అందు వలన "అశ్వాభిధానీ మాదత్తే" అనువచనము పరిసంఖ్యావిధి యని చెప్పఁబడును. యద్యపి, నియమవిధియందును బరిసంఖ్యావిధియందును ఇతరముయొక్క నివృత్తి సమానమై యున్నది. తథాపి, నియమవిధియం దితరముయొక్క నివృత్తి ఆర్థికమై యున్నది. మఱియుఁ బరిసంఖ్యావిధియం దితరముయొక్క నివృత్తి విధేయమై యున్నది. ఇదియే యారెంటియందు విశేషమై యున్నది. ఈలాగుననే యీప్రసంగము నందుఁగూడ "శ్రోతవ్యః" అనుట నియమవిధియై యున్నది. అనఁగా సాధనసంపన్న జిజ్ఞాసువు వేదాంతశాస్త్రమునే శ్రవణము చేయవలయును. లేక, ఆజిజ్ఞాసువు వేదాంతశాస్త్రముకన్న నన్యశాస్త్రములను శ్రవణము చేయుట కూడదు అను పరిసంఖ్యావిధియునై యున్నది.

శంక:—ఏస్థలమునందు రెండుసాధనములు ప్రాప్తము లగుచున్నవో అచ్చటనే అప్రాప్తాంశమును బూర్తి చేయునట్టి నియమవిధియొక్క యంగీకారము చేయవలయు నని పూర్వము నియమవిధికి లక్షణము చెప్పితిరి. ఆలక్షణ మిచ్చట శ్రవణవిధియందు సంభవించుట లేదు. ఏల యన, బ్రహ్మము వేదాంతశాస్త్రము కన్న భిన్నమైన యేప్రమాణమునకును విషయము కాదు. ఇఁక నేమనఁగా, ఏక వేదాంతశాస్త్రమునకే విషయమై యున్నది.

అట్లు గాక, ఆబ్రహ్మసాక్షాత్కారమునందు వేదాంతశ్రవణముకన్న భిన్న ముగా నేదైన నొకసాధన మున్నయెడల, నాశ్రవణమునందు నియమవిధి సంభ వించును. ఒకపక్షమునందు బ్రహ్మసాక్షాత్కారమునకుఁ బురాణాదులయొక్క శ్రవణ మును సాధనరూపముచేతఁ బ్రాప్త మగుచున్నది. దాని నివారించుటకొఱకు వేదాంతశ్రవణమునం దానియమవిధి సంభవించు నని చెప్పినను, అదియుఁగూడ సంభవించుట లేదు. ఏల యన, అధ్యాత్మపురాణము వేదాంతమూలక మగుటవలన దానియొక్క శ్రవణమును వేదాంతశ్రవణముకన్నను భిన్నసాధన మని చెప్పుట

* యజ్ఞమునందు యూపస్తంభమునకుఁ జుట్టునట్టి త్రాడు.

కూడదు. మఱియేమనఁగా, ఆయధ్యాత్మపురాణముయొక్క శ్రవణముకూడ వేదాంతశ్రవణమే యగుచున్నది.

మఱియు నొకపక్షమునందు రాగజ్ఞానముగలపురుషులకు గీతాదులయొక్క శ్రవణము ప్రాప్తమగుటవలన దానియొక్క నివృత్తికొఱకు వేదాంతశ్రవణమునందు నియమవిధి సంభవించుచున్నదనిన నదియుఁగూడ సంభవించుట లేదు. ఏల యన, ఆశ్రవణవిధికిన్నిను అన్యవచనములచేతనే ముముక్షుజనులగుఱించి యారాగసహిత గీతలయొక్క శ్రవణము నిషేధింపఁబడి యున్నది. మఱియు నొకపక్షమునందు ద్వైతశాస్త్రముయొక్క శ్రవణము ప్రాప్తించుటవలన దాని నివారించుటకొఱకై వేదాంతశ్రవణమునందు నియమవిధి సంభవించు ననిన, నదియుఁగూడ సంభవించుట లేదు. ఏల యన, ఆ ద్వైతశాస్త్ర మద్వైతశాస్త్రమునకు విరోధి యగుటవలన నద్వితీయ బ్రహ్మజ్ఞానమునుగుఱించి సాధనరూప మనుటయే సంభవించుట లేదు.

మఱియు "న చక్షుషా పశ్యతి నాపి వాచా, యతో వాచో నివర్తంతే, యన్మనసా న మనుతే" ఇత్యాదిశ్రుతులచేత, బ్రహ్మమునందు వేదాంతశ్రవణమునకన్న భిన్నమైన చక్షువు, వాక్కు, మనస్సు మొదలగువానియొక్క యవిషయత చెప్పఁబడి యున్నది. అందువలన బ్రహ్మజ్ఞానమునందుఁ బ్రత్యక్షాదులకును సాధనరూపత్వము ప్రాప్త మగుట లేదు. అందుచేత నాప్రత్యక్షాదులను నివారించుకొఱకును, వేదాంతశ్రవణమునందు నియమవిధి సంభవించుట లేదు. అందువలన వేదాంతశ్రవణమునందు నియమవిధి చెప్పుట యసంగతమై యున్నది. పూర్వోక్తరీతిగా అన్యసాధనముల కభావ మగుటవలన, దాని నివారించుటకొఱకై వేదాంతశ్రవణమునందుఁ బరిసంఖ్యావిధియును సంభవించుట లేదు.

సమాధానము:—యద్యపి, వేదాంతశాస్త్రములకన్నను భిన్నమైన పురాణాదికమునకు స్వతంత్రముగా బ్రహ్మసాక్షాత్కారముయొక్క సాధనత్వము లేదు. తథాపి, వేదాంతశాస్త్రశ్రవణమువలెఁ బురాణాదులశ్రవణమును స్వతంత్రముగా బ్రహ్మసాక్షాత్కారమునకు సాధనమై యున్నదను భ్రాంతిచేత నాపురాణాదులయొక్క శ్రవణమునకును బ్రహ్మజ్ఞానమునందు స్వతంత్రసాధనత్వము ప్రాప్త మగునప్పుడు, దాని నివర్తించుటకొఱకై వేదాంతశ్రవణమునందు నియమవిధికిని బరిసంఖ్యావిధికిని అంగీకారము సంభవించుచున్నది. లేక, బ్రహ్మవేత్త యగుగురువు లేక స్వతంత్రముగాఁ దనబుద్ధిచేతఁ జేయు వేదాంతవిచారమును నివారించుటకొఱకై శ్రవణమునందు నియమవిధికిఁ గాని, పరిసంఖ్యావిధికిఁ గాని, యంగీకార మున్నది. అనఁగా, నీయధికారిపురుషుఁడు శ్రోత్రియబ్రహ్మనిష్ఠగురువుయొక్క ముఖమునందుండి

యే వేదాంతశాస్త్రశ్రవణము చేయవలయును, గురువు లేక స్వతంత్రముగాఁ గేవలము తనబుద్ధిచేత వేదాంతశాస్త్రశ్రవణము చేయఁగూడదు. ఈయర్థము పూర్వము వృద్ధపురుషులచేతను జెప్పఁబడి యున్నది. “శ్లో. నియమః పరిసంఖ్యా వా విధ్యర్థో హి భవే ద్యతః । అనాత్మా ఉదర్శనే నైవ పరాత్మాన ముపాస్మహే ”—భావము॥ ఏ కారణముచేత “శ్రోతవ్యః” అను విధివాక్యమునకు నియమ మైనను, లేక, పరిసంఖ్య యైనను అర్థమై యున్నదో ఆకారణమువలన మనము అనాత్మవస్తువులయొక్క చింతనాపరిత్యాగముచేతఁ గేవలపరమాత్మనే చింతన చేయవలయును.

[*] (41) శ్రవణము నిత్యాదికర్మములు కా వనుట. [*]

శంక:—“శ్రోతవ్యః” అనువిధివాక్యమువలన వేదాంతశ్రవణము విధింపఁబడుచున్న దని పూర్వము మీచేఁ జెప్పఁబడినది. శ్రుతిస్మృతిరూపశాస్త్రములయందుఁ గామ్యనిత్యనైమిత్తికప్రాయశ్చిత్తము లను చతుర్విధకర్మములే విధింపఁబడి యున్నవి. వానియం దాశ్రవణము కామ్యకర్మరూపమై యున్నదా? నిత్యకర్మరూపమై యున్నదా? నైమిత్తికకర్మరూపమై యున్నదా? లేక, ప్రాయశ్చిత్తరూపమై యున్నదా? అందుఁ బ్రథమకామ్యపక్ష మంగీకరించినయెడల నది సంభవించుట లేదు. ఏల యన “స్వర్గకామో యజేత” అనువచనమునం దెట్లు స్వర్గరూపఫలోద్దేశముచేత యాగము విధింపఁబడి యున్నదో అట్లొకఫలోద్దేశముచేత నాశ్రవణము విధింపఁబడ లేదు.

మఱియు నెట్లు రాత్రిసత్ర మనుయాగమును విధించువాక్యమునందు ఫలము వినఁబడక పోయినను బ్రహ్మజ్ఞానమునందుఁ బురుషునకుఁ బ్రవృత్తి కలుగుటకొఱకాయాగమునకు ఫలకల్పన చేయఁబడు చున్నదో అట్లు శ్రవణమునకుఁగూడ బ్రహ్మజ్ఞానరూపఫలము మాచేఁ గల్పింపఁబడుచున్నది యని చెప్పినయెడల, నదియుఁగూడ సంభవించుట లేదు. ఏల యన, గృహస్థాదులయందు బ్రహ్మజ్ఞానరూపఫలేచ్ఛయే సంభవించుట లేదు. మఱి యే మనఁగా, ఆగృహస్థాదులయందు బ్రహ్మజ్ఞానముయొక్క ద్వేషమే చూడఁబడుచున్నది. ఈకారణముచేతనే యారాగసహితపురుషులయొక్క యభిప్రాయము బోధించుశ్లోకము చెప్పఁబడుచున్నది. “అపి బృందావనే శూన్యే సృగాలత్వం స ఇచ్ఛతి । నతు నిర్విషయం మోక్షం కదాచి దపి గౌతమ ”—భావము॥ ఓగౌతముఁడా! రాగవంతుఁ డగుపురుషుఁడు శూన్య మగు బృందావనమునందు సృగాలమై యుండుట కిచ్ఛించుచున్నాఁడు గాని, నిర్విషయమోక్షమును రాగవంతుఁ డగుపురుషుఁ డొకప్పుడును ఇచ్ఛించుట లేదు.

మఱియు "వేదా నిమం లోక మముంచ పరిత్య జ్యాత్మాన మన్విచ్ఛేత్" ఇత్యాదిశ్రుతులచేత సాధనచతుష్టయసంపన్న జిజ్ఞాసు వగుసన్న్యాసికే యాత్మజ్ఞాన ప్రాప్తికొఱకు శ్రవణాదులయొక్క కర్తవ్యత్వము నిశ్చిత మగుచున్నది. అందువలన గృహస్థాదుల కాశ్రవణాదులయం దధికారమే లేదు. సన్న్యాసులకే యాశ్రవణము కామ్యకర్మరూప మగు ననినయెడల నదియును సంభవించుట లేదు. ఏల యన నొక వేళ సన్న్యాసులను గూర్చి యాశ్రవణము కామ్యకర్మరూప మైనయెడల ఎట్లు కామ్య కర్మము చేయనందువలనఁ బ్రత్యవాయప్రాప్తి యగుట లేదో అట్లాశ్రవణము చేయ నందువలనను ఆసన్న్యాసికిఁ బ్రత్యవాయము ప్రాప్తింపక పోవలయును. వేదాంత శ్రవణపరిత్యాగమువలన నాసన్న్యాసికిఁ బ్రత్యవాయప్రాప్తి శ్రుతిస్మృతులయందుఁ జెప్పఁబడి యున్నది. అందువలన నాసన్న్యాసికి శ్రవణము కామ్యకర్మరూప మనుట సంభవించుట లేదు.

మఱియు శ్రవణము నిత్యకర్మరూపమై యున్న దను ద్వితీయపక్ష మంగీ కరించినయెడల నదియును సంభవించుట లేదు. ఏల యన "యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్" అనువచనముచేత నెట్లు గృహస్థునకు జీవితకాలపర్యంత మగ్నిహోత్రరూపనిత్యకర్మములు విధింపఁబడి యున్నవో అట్లీయధికారిపురుషునకు జీవితకాలపర్యంత మాశ్రవణ మేవచనముచేతను విధింపఁబడ లేదు. అందువలన నా శ్రవణమునందు నిత్యకర్మరూపత్వమును సంభవించుట లేదు.

మఱియు నాశ్రవణము నైమిత్తికకర్మరూపమై యున్న దను తృతీయపక్ష మంగీకరించినయెడల నదియును సంభవించుట లేదు. ఏల యన, ఎట్లగ్నిహోత్రము చేయు పురుషునియొక్క గృహము దహింపఁబడునపు డానిమిత్తమును గొని వేదముచేత నిష్టి విధింపఁబడి యున్నదో, అట్లిచ్చట నొకనిమిత్తమును చెప్పఁబడ లేదు. ఏనిమిత్తముచేత నాశ్రవణము నైమిత్తికకర్మరూప మగును?

ఆశ్రవణము ప్రాయశ్చిత్తకర్మరూపమై యున్న దను చతుర్థపక్ష మంగీక రించినయెడల నదియును సంభవించుట లేదు. ఏల యన "తరతి బ్రహ్మహత్యాం యో ఽశ్వమేధేన యజతే" అనువచనముచేత నెట్లు బ్రహ్మహత్యారూపపాపమును నివర్తించుటకొఱ కశ్వమేధయజ్ఞరూపప్రాయశ్చిత్తము విధింపఁబడి యున్నదో అట్లొకశ్రుతివచనముచేతను ఏపాపనివృత్తికొఱకును ఆశ్రవణము విధింపఁబడ లేదు. అందువలన నాశ్రవణమునకుఁ బ్రాయశ్చిత్తరూపత్వమును సంభవించుట లేదు. కావున నేప్రకారముచేతను వేదాంతశ్రవణమునందు విధి సంభవించుట లేదు. ఇట్టి శంక ప్రాప్త మగుచుండఁగా.

## (42) సన్న్యాసికి శ్రవణము నిత్యకర్మ మనియును, గృహస్థునకుఁ గామ్యకర్మ మనియును జెప్పుట.

సమాధానము:—ఇఁక వివిదిషాసన్న్యాసి కాశ్రవణము నిత్యకర్మరూప మనియును గృహస్థాదుల కాశ్రవణము కామ్యకర్మరూప మనియును జెప్పఁబడు చున్నది. ఎట్లు గృహస్థున కగ్నిహోత్రసంధ్యోపాసనాదినిత్యకర్మములను జేయనందు వలన శ్రుతిస్మృతులచేతఁ బ్రత్యవాయప్రాప్తి చెప్పఁబడి యున్నదో మఱియు "యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్" ఇత్యాదిశ్రుతులచేత జీవితకాలపర్యంత మాయగ్నిహోత్రాదినిత్యకర్మములు విధింపఁబడియు నున్నవో అట్లు వివిదిషాసన్న్యాసికిని వేదాంతశ్రవణాదికము చేయనందువలనఁ బ్రత్యవాయప్రాప్తియును జీవితకాలపర్యంత మాశ్రవణాదికము కర్తవ్య మనియును శ్రుతిస్మృతులచేతఁ జెప్పఁబడి యున్నది. అందువలన నెట్లు గృహస్థుని కాయగ్నిహోత్రసంధ్యోపాసనాదికములు నిత్యకర్మరూపములై యున్నవో, అట్లు వివిదిషాసన్న్యాసికిని వేదాంతశ్రవణాదికము నిత్యకర్మరూపమై యున్నది. అందు శ్రుతి.—"అరున్ముఖా న్యతీన్సాలావృకేభ్యః ప్రాయచ్ఛమ్"—భావము॥ ఇంద్రుఁడైన నేను వేదాంతవిచారరహితసన్న్యాసులను హననము చేసి శ్వానముల కాహారముగా నిచ్చితిని. అను నీశ్రుత్యర్థ మాత్మపురాణముయొక్క-ద్వితీయాధ్యాయమున నింద్రప్రతర్దనసంవాదమునందు విస్తరముగాఁ జెప్పఁబడి యున్నది. అచ్చట స్మృతి.—"నిత్యం కర్మ పరిత్యజ్య వేదాంతశ్రవణం వినా। వర్తమానస్తు సన్న్యాసీ పత త్యేవ న సంశయః"—భావము॥ అగ్నిహోత్రసంధ్యోపాసనాదినిత్యకర్మములను బరిత్యజించి యేవివిదిషాసన్న్యాసి వేదాంతశాస్త్రశ్రవణాదికమును జేయక వర్తించు చున్నాఁడో, ఆసన్న్యాసి పతితుఁడే యగు చున్నాఁడు, దీనికి సంశయము లేదు. ఇత్యాదిశ్రుతిస్మృతులచేత నావివిదిషాసన్న్యాసికి వేదాంతశ్రవణము చేయనందువలనఁ బ్రత్యవాయప్రాప్తి చెప్పఁబడి యున్నది. మఱియు "ఆసుప్తే రామృతేః కాలం నయే ద్వేదాంతచింతయా। దద్యా న్నావసరం కించి త్కామాదీనాం మనాగపి"— భావము॥ ఈవివిదిషాసన్న్యాసి జాగ్రత్తు మొదలు సుషుప్తిపర్యంతమును బ్రహ్మవేత్త యగుగురునియొక్క-సమీపమునకుఁ బోయినది మొదలు మరణపర్యంతమును వేదాంతశాస్త్రచింతనచేతఁ గాలము గడపవలయును, తనచిత్తమునందుఁ గామక్రోధాదివికారములయొక్క-ప్రాప్తికిఁ గించిన్మాత్రమును అవసర మియ్యఁగూడదు. అను స్మృతిచేతను, ఈస్మృతికి మూలభూత మగుశ్రుతిచేతను ఆవివిదిషాసన్న్యాసికి జీవితకాలపర్యంతము వేదాంతశాస్త్రశ్రవ

కర్తవ్య మని విధింపఁబడి యున్నది. అందువలన నాసన్న్యాసికి శ్రవణాదికము నిత్యకర్మరూపములే యని సిద్ధ మగుచున్నది.

మఱియుఁ బూర్వోక్తశ్రుతిస్మృతులయొక్క బలముచేత నా శ్రవణము సన్న్యాసికి నిత్యకర్మరూప మగునది కేవలము మాచేతనే యంగీకరింపఁబడినది కాదు. ఇంకనే మనఁగా, పూర్వాచార్యులచేతఁగూడ నంగీకరింపఁబడి యున్నది. అచ్చట "శ్లో. త్వంపదార్థవివేకాయ సన్న్యాసః సర్వకర్మణామ్ । శ్రుత్యాభిధీయతే యస్మాత్తత్త్యాగీ పతితో భవేత్" — భావము॥ "తత్త్వమసి" అను మహావాక్యమందుండు త్వంపదమునకు వాచ్యార్థ మంతఃకరణవిశిష్టచైతన్యమై యున్నది. దానియం దంతఃకరణమును బరిత్యజించి లక్ష్యార్థరూప మగు నేప్రత్యక్చైతన్య మున్నదో ఆప్రత్యక్చైతన్యమును బ్రహ్మరూపముగాఁ దెలియునట్టి యేజ్ఞాన మున్నదో అది త్వంపదార్థవివేకమై యున్నది; ఆ త్వంపదార్థవివేకముకొఱకే శ్రుతిచేత నగ్నిహోత్రసంధ్యోపాసనాదిసర్వకర్మములయొక్క సన్న్యాసము విధింపఁబడి యున్నది. మఱియు నేపురుషుండు సన్న్యాసమును ధరించియుఁ ద్వంపదార్థవివేకము చేయకయే యున్నాఁడో ఆసన్న్యాసి పతితుఁ డగుచున్నాఁడు. అనువచనముచేత వార్తికకారు లైన శ్రీసురేశ్వరాచార్యులచేత శ్రవణాదిరహితసన్న్యాసికిఁ బతితత్వము చెప్పఁబడి యున్నది. ఈప్రకారముగానే సర్వజ్ఞమహామునిచేతను సంక్షేపశారీరక మను గ్రంథమునందుఁ జెప్పఁబడి యున్నది. అచ్చట, "శ్లో. కారకస్య కరణాద్యతిర్హాస్యః కేవలం పతితో భవేద్యథా । వ్యంజకస్య పరివర్జనాత్తథా సద్య ఏవ పతితో భవేదసౌ"—భావము॥ ఎట్లీసన్న్యాసి యజ్ఞాదికర్మములను జేయుటచేత శీఘ్రమె పతితుఁ డగుచున్నాఁడో, అట్లు వేదాంతశాస్త్రశ్రవణాదికము చేయనందువలనను శీఘ్రమే పతితుఁ డగుచున్నాఁడు. అందువలన నీయర్థము సిద్ధ మైనది. వివిదిషాసన్న్యాసికి వేదాంతశ్రవణము నిత్యకర్మరూప మగుటవలన, నాశ్రవణమునందు "శ్రోతవ్యః" అను నుక్తనిత్యవిధి సంభవించుచున్నది.

మఱియు గృహస్థాదులకా వేదాంతశాస్త్రశ్రవణాదికము కామ్యకర్మరూపమై యున్నది. ఏకర్మము చేయుటచేత ఫలప్రాప్తి యగునో, మఱియుఁ జేయనందుచేతఁ బ్రత్యవాయము ప్రాప్తించుట లేదో ఆకర్మము కామ్యకర్మ మనఁబడును. ఉదా—ఏపురుషునకు స్వర్గప్రాప్తీచ్ఛ యున్నదో ఆపురుషుఁడు జ్యోతిష్టోమ మను యాగమును జేయుచున్నాఁడు, దానిచేత నాపురుషునకు స్వర్గరూపఫలప్రాప్తి యగుచున్నది. మఱియు నేపురుషునకు స్వర్గప్రాప్తీచ్ఛ కలుగుట లేదో ఆపురుషుఁడు

జ్యోతిష్టోమ మను యాగమును జేయుట లేదు, ఆజ్యోతిష్టోమ మనుయాగమును జేయనందుచేత నాపురుషున కేప్రత్యవాయమును బ్రాప్తించుట లేదు. ఈకారణమువలన నాజ్యోతిష్టోమ మను యాగము కామ్యకర్మ మని చెప్పఁబడుచున్నది. ఈలాగుననే యేగృహస్థునకు బ్రహ్మజ్ఞానేచ్ఛ యున్నదో ఆగృహస్థుఁడు వేదాంతశాస్త్రశ్రవణాదికము చేయుచున్నాఁడు. ఆశ్రవణాదికముచేత నాగృహస్థునకు బ్రహ్మజ్ఞానప్రాప్తి యగుచున్నది. ఏగృహస్థునకు బ్రహ్మజ్ఞానేచ్ఛ కలుగుట లేదో, ఆగృహస్థుఁడు శ్రవణాదికము చేయుట లేదు. ఆశ్రవణాదులు చేయనందువలన నాగృహస్థున కేప్రత్యవాయమును బ్రాప్త మగుట లేదు. అందువలన నాగృహస్థాదులకు శ్రవణాదులు కామ్యకర్మరూపము లనియే సిద్ధ మగుచున్నది.

శంక:—వివేకాదిచతుష్టయసాధనసంపన్నపురుషునకే బ్రహ్మజిజ్ఞాస కలుగుచున్నది. బ్రహ్మమును దెలియవలయు నను నిచ్ఛ బ్రహ్మజిజ్ఞాస యనఁబడును. గృహస్థాదులయం దాచతుస్సాధనములు సంభవింపవు. కావున, బ్రహ్మజిజ్ఞాస లేనందువలన నాగృహస్థాదులకు శ్రవణము కామ్యకర్మరూప మనుటయు సంభవించుట లేదు.

సమాధానము:—అత్యంతబహిర్ముఖగృహస్థాదుల కా సాధనసంపత్త్యభావమువలన బ్రహ్మజిజ్ఞాస కలుగక పోయినను, బరమేశ్వరునిచేత ననుగ్రహింపఁబడినవారును, ఫలేచ్ఛారహితముగా నిత్యనైమిత్తికకర్మములను జేయుటవలన శుద్ధాంతఃకరణము గలవారును, ఈశ్వరగురువులయందు శ్రద్ధాభక్తులు గలవారును, నైనకొంద ఱుత్తమగృహస్థుల కావివేకాదిసాధనసంపత్తిచేత బ్రహ్మజిజ్ఞాస సంభవించుచున్నది. మఱియు నేదైన నొక ప్రతిబంధవశమువలన నాగృహస్థులకు సన్న్యాసాశ్రమము ప్రాప్తింపక పోయినను, వేదాంతశాస్త్రశ్రవణాదులయందు వారికిఁ బ్రవృత్తి సంభవించుచున్నది. అట్టి సాధనసంపన్నగృహస్థాదులకే యాశ్రవణవిధి కామ్యరూపమై యున్నది.

ఒకవేళ నాగృహస్థాదులకు బ్రహ్మజిజ్ఞాసాపూర్వకముగా శ్రవణాదులయందుఁ బ్రవృత్తి నంగీకరింపనియెడల గృహస్థాశ్రమాదులయందు బ్రహ్మసాక్షాత్కారము నొందినట్టి తత్త్వవేత్తలనుగుఱించి జీవన్ముక్తికొఱకు శ్రుతిస్మృతులచేత నేవిద్వత్సన్న్యాసము విధింపఁబడి యున్నదో అది వ్యర్థ మగును. మఱియు వివిదిషాసన్న్యాసముకన్న భిన్నముగా నొకవిద్వత్సన్న్యాసము లే దని చెప్పినయెడల నది సంభవించుట లేదు. ఏలయనఁ, బూర్వము శ్రుతిస్మృతిప్రమాణములయొక్క బలముచేత నావివిదిషాసన్న్యాసముకన్న భిన్నముగా విద్వత్సన్న్యాసము నిరూ

షింపఁబడి యున్నది. మఱియు, నధికారి ఫలము సాధనము అను మూటియొక్క భేదముచేతను ఆవిద్వత్సన్న్యాసము వివిదిషాసన్న్యాసముకన్నను భిన్నమే యని సిద్ధ మగుచున్నది. అచ్చట వివిదిషాసన్న్యాసమునం దైననో జిజ్ఞాసు వధికారి యగుచున్నాఁడు. విద్వత్సన్న్యాసమునందుఁ దత్త్వవేత్త యధికారి యగుచున్నాఁడు. మఱియు వివిదిషాసన్న్యాసమున కైననో తత్త్వజ్ఞానము ఫలమై యున్నది. విద్వత్సన్న్యాసమునకు జీవన్ముక్తి ఫలమై యున్నది. మఱియు వివిదిషాసన్న్యాసిచేత నైననో ఆత్మజ్ఞానరూపఫలముకొఱకు శ్రవణాదిసాధనము లనుష్ఠింపఁబడుచున్నవి. మఱియు విద్వత్సన్న్యాసిచేత జీవన్ముక్తిరూపఫలముకొఱకు, మనోనాశవాసనాక్షయాదిసాధనము లనుష్ఠింపఁబడుచున్నవి. ఈప్రకారముగా, నధికారి ఫలము సాధన మను త్రితయముయొక్క భేదమువలన, నావిద్వత్సన్న్యాసము వివిదిషాసన్న్యాసమునకన్నను భిన్న మనియే యంగీకరింపవలయును. ఎప్పు డాగృహస్థాదులకు వేదాంతశ్రవణమునం దధికారమును శ్రవణాదులచేత బ్రహ్మజ్ఞానప్రాప్తియు నంగీకరింపఁబడుచున్నదో? అప్పు డావిద్వత్సన్న్యాసము సార్థక మగుచున్నది. అందువలన నాగృహస్థాదులకు శ్రవణాదికము కామ్యకర్మరూపమై యున్న దను పూర్వోక్తార్థము సంభవించుచున్నది.

మఱియు నాగృహస్థాదులకు వేదాంతశాస్త్రశ్రవణమువలన మహత్తరమైన పుణ్యోత్పత్తియును శాస్త్రములచేతఁ జెప్పఁబడియున్నది. అచ్చట, "శ్లో. దినే దినేతు వేదాంతశ్రవణా ద్భక్తిసంయుతాత్ । గురుశుశ్రూషయా లబ్ధా త్కృచ్ఛ్రాశీతిఫలం లభేత్" — భావము॥ బ్రహ్మవేత్త యగు గురువుయొక్క సేవచేతఁ బ్రాప్తమైనదియును, గురువునందును ఈశ్వరునియందును భక్తితోఁ బ్రతిదినము చేయఁబడునదియు నగు నేవేదాంతశాస్త్రశ్రవణ మున్నదో ఆవేదాంతశాస్త్రశ్రవణమువలన, నీ యధికారిపురుషుఁ డెనుబదికృచ్ఛ్రములఫలమును బొందుచున్నాఁడు. ఇచ్చటఁ దాత్పర్య మే మనఁగా, యద్యపి వేదాంతశ్రవణాదులు చేయనందువలన గృహస్థాదులకుఁ బ్రత్యవాయము ప్రాప్తించుట లేదు. తథాపి, ఆత్మజ్ఞానరహితపురుషులకు మహాహాని కలుగు నని శ్రుతిస్మృతులచేతఁ జెప్పఁబడి యున్నది. అందువలన గృహస్థులుగూడ వేదాంతశాస్త్రశ్రవణాదికమువలన నాత్మజ్ఞానము నవశ్యము సంపాదింపవలయును. అందు, శ్రుతి.—"న చే దిహా వేదీ న్మహతీ వినష్టిః" — భావము॥ అధికారి మనుష్యశరీరము పొందియు నెపుడు ఆత్మను దెలియుట లేదో అపుడు ఈ పురుషునకు మహాహాని కలుగుచున్నది. అన్యశ్రుతి.—"యోవా ఏత దక్షరం గార్గ్య విదిత్వా ఽస్మా ల్లోకా త్ప్రైతి సకృపణః, అథ ఏత దక్షరం గార్గి విదిత్వా ఽస్మా

ల్లోకా త్ప్రైతి స బ్రాహ్మణః "—భావము॥ ఓగార్గీ! ఏపురుషుఁడు ఈయక్షరపరమాత్మను దెలియక యీలోకమునుండి లోకాంతరగమనము చేయుచున్నాఁడో ఆయజ్ఞానిపురుషునిఁ గృపణుఁ డని తెలియుము. ఇచ్చట తాత్పర్య మే మనఁగా, ఎట్లు లోకమునందుఁ దనకుఁ బ్రాప్త మైనధనమును ననుభవింపనిపురుషుఁడు కృపణుఁ డనఁబడుచున్నాఁడో, అట్లు నిత్యప్రాప్త మయినయాత్మరూపధనముయొక్కసాక్షాత్కారరూపానుభవము లేని యజ్ఞానిపురుషుఁడును గృపణుఁడే యనఁబడు చున్నాఁడు. మఱియు, ఓగార్గీ! ఏపురుషుఁడు ఈయక్షరపరమాత్మయొక్కసాక్షాత్కారము నొంది యీశరీరమునుండి మరణము బొంగుచున్నాఁడో, ఆతత్త్వవేత్త యగుపురుషుని బ్రాహ్మణుఁ డని తెలియుము. అన్యశ్రుతి.—"యో హవా అస్మా ల్లోకా త్స్వం లోక మదృష్ట్వా ప్రైతి స ఏత మవిదితో న భునక్తి "—భావము॥ ఏపురుషుఁడు ఈయాత్మరూపలోకమును "అహం బ్రహ్మాస్మి" యని దెలియక యీస్థూలశరీరరూపలోకమునుండి మరణమును బొందుచున్నాఁడో ఆయజ్ఞానిపురుషుఁడు ఆయాత్మరూపలోకమును దెలియనందువలన శోకమోహాదిదోషములనుండి విముక్తత ననుభవింపఁడు. ఇచ్చట స్మృతి.—"అన్యథా సంతమాత్మానం యో ఽన్యథా ప్రతిపద్యతే । కిం తేన న కృతం పాపం చోరే ణాత్మాపహారిణా "—భావము॥ ఏపురుషుఁడు అకర్తయు నభోక్తయు నగు ఆత్మను కర్తయు భోక్తయు నని దెలియుచున్నాఁడో, ఆయాత్మాపహారి చోరపురుషునిచేత నేపాపకర్మము చేయఁబడినది కాదు? అనఁగా నతఁడు సర్వపాపకర్మములు చేసినవాఁడే యగును. ఇత్యాద్యనేకశ్రుతిస్మృతులచేత నాత్మజ్ఞానరహితపురుషుల నింద చేయఁబడి యున్నది. అందువలన గృహస్థాదులును శ్రవణాదులను జేసి యాత్మజ్ఞానము నవశ్యము సంపాదింపవలయును.

### (43) సన్న్యాసులకే శ్రవణమునం దధికార మను కొందఱియభిప్రాయము.

ఇచ్చటఁ గొంద ఱాచార్యులచేత నైననో యీవక్ష్యమాణరీతిగాఁ జెప్పఁబడుచున్నది. వివేకాదిసాధనచతుష్టయసంపన్న సన్న్యాసులకే వేదాంతశాస్త్రశ్రవణమునం దధికార మున్నది. గృహస్థాదుల కాశ్రవణాదులయం దధికారమే లేదు. మఱియు శ్రుతులయందు యాజ్ఞవల్క్యజనకాదులయొక్క తత్త్వజ్ఞానప్రతిపాదకము లగు నేయుపాఖ్యానము లున్నవో, ఆయుపాఖ్యానములకు బ్రహ్మాత్మబోధన మందే తాత్పర్య మున్నది గాని యితరార్థమునందుఁ దాత్పర్యము లేదు. ఈమతము గల యాచార్యులయొక్కయభిప్రాయ మే మనఁగా, శ్రుతులచేతను ఆచార్యులచేతను సన్న్యాసాశ్రమమే శ్రవణమున కంగరూప మని చెప్పఁబడి యున్నది. అంగము లేక యంగ సిద్ధించుట లేదు. అందువలన సాధనసంపన్న సన్న్యాసులకే శ్రవణమునం

దధికార మున్నది. గృహస్థాదులకు లేదు. అచ్చట "బ్రహ్మసంస్థో ఽమృతత్వమేతి"— భావము॥ లౌకికవైదికసర్వవ్యాపారరహితకేవలబ్రహ్మచింతనపరాయణుఁడైనపురుషుఁడు బ్రహ్మసంస్థుఁ డనఁబడును. అట్టి బ్రహ్మసంస్థసన్న్యాసియే మోక్షమును బొందుచున్నాఁడు. ఈశ్రుతియొక్కవ్యాఖ్యానమునందు శ్రీభాష్యకారులచేత సన్న్యాసులకే బ్రహ్మనిష్ఠయం దధికార మున్న దని నిశ్చయింపఁబడి యున్నది. మఱియు "త్యక్తాశేషక్రియ స్యైవ సంసారం ప్రజిహాసతః । జిజ్ఞాసో రేవ చైకాత్మ్యం త్రయ్యంతే ష్వధికారితా"—భావము॥ సర్వలౌకికవైదికకర్మములను బరిత్యజించినవాఁడును, సర్వసంసారమును దుఃఖరూప మని దెలిసి దానిని బరిత్యజింపఁగోరినవాఁడును నైన జిజ్ఞాసువునకే వేదాంతశాస్త్రశ్రవణమునం దధికారమును, ఆశ్రవణాదులచేత నాత్మజ్ఞానప్రాప్తియును కలుగుచున్నది. అనువచనముచేత, వార్తికకారు లైన శ్రీసురేశ్వరాచార్యులచేతను ఆసన్న్యాసులకే శ్రవణమునం దధికార మున్న దని నిశ్చయము చేయఁబడి యున్నది. మఱియు "అంత స్సన్న్యస్య కర్మాణి సర్వాణ్యాత్మావబోధతః । హిత్వా ఽవిద్యాం ధియై వేయా త్తద్విష్ణోః పరమఃపదమ్॥ వేదా నిమం లోకమముం చ పరిత్యజ్యాత్మాన మన్విచ్ఛ"—భావము॥ సర్వకర్మములను సన్న్యసించి యాత్మజ్ఞానమువలన నవిద్యను బరిత్యజించి, ఈయధికారిపురుషుఁ డాయాత్మజ్ఞానముచేతనే మోక్షరూప మగు విష్ణువుయొక్కపరమపదమును బొందుచున్నాఁడు. మఱియు వేదప్రతిపాదితాగ్నిహోత్రాదికర్మములను ఈలోకపరలోకములను బరిత్యాగము చేసి నీ వాత్మప్రాప్తిచ్ఛను బొందుము, అనఁగా ఆత్మజ్ఞానముకొఱకు శ్రవణాదులను జేయుము. ఇత్యాదిశ్రుతులచేతను, ఆసన్న్యాసులకే శ్రవణమునం దధికారము సిద్ధ మగుచున్నది. అందువలన సన్న్యాసులకాశ్రవణము నిత్యకర్మరూపమై యున్నది. గృహస్థాదులకాశ్రవణము కామ్యకర్మరూపమై యున్న దను పూర్వోక్తవ్యవస్థ సంభవింపదు. మఱి యే మనఁగా, ఎట్లు గృహస్థుల కగ్నిహోత్రాదికము నిత్యకర్మరూప మయ్యును గామ్యకర్మరూప మయ్యు నున్నదో, అట్లు సన్న్యాసులకాశ్రవణాదులు నిత్యకర్మరూపములును గామ్యకర్మరూపములు నగు నని యంగీకరించుటయందుఁ బూర్వోక్తాచార్యులయొక్కవచనములకును శ్రుతివచనములకును విరోధము కలుగుట లేదు.

## [*] (44) పరవైరాగ్యనిరూపణము. [*]

పూర్వము పరాపరభేదముచేత వైరాగ్యము ద్వివిధముగాఁ జెప్పఁబడినది. ఆ వైరాగ్యముయొక్కతారతమ్యముచేత, సన్న్యాసులయొక్కభేదనిరూపణ

ప్రసంగమునందు శ్రవణాదులవిధి విస్తరముగా నిరూపింపఁబడినది. ఇఁకఁ గ్రమముగాఁ బొందఁబడునట్టి పరవైరాగ్యము నిరూపింపఁబడు చున్నది.

"గుణేషు నైతృష్ణ్యం పరవైరాగ్యమ్" — భావము॥ సత్త్వరజస్తమములను త్రిగుణములయొక్క పరిణామరూపము లైన యిహపరలోకములయొక్క యేవిషయము లున్నవో ఆసర్వవిషయములయందును ఆశ లేక యుండుట పరవైరాగ్యమనఁబడును. ఈ పరవైరాగ్యముయొక్క స్వరూపము పతంజలిభగవానులచేతను యోగశాస్త్రమునందుఁ జెప్పఁబడి యున్నది. అందుసూత్రము.—"తతః పరం పురుషఖ్యాతే ర్గుణవైతృష్ణ్యమ్"—భావము॥ ప్రత్యగాత్మయొక్క జ్ఞానమువలన సపురుషునకు గుణములయొక్క పరిణామము లైన సర్వవిషయములయందు నాశ లేక యుండుట పరవైరాగ్య మనఁబడును. ఈపరవైరాగ్యమే నిర్వికల్పక మను నసంప్రజ్ఞాతసమాధి కంతరంగసాధన మగుచున్నది. ఈయర్థముగూడ నాపతంజలిభగవానులచేతఁ జెప్పఁబడి యున్నది. అచ్చట సూత్రము.—"తీవ్ర సంవేగానా మాసన్నః సమాధిలాభః"— భావము॥ పరవైరాగ్యసహితపురుషులకు శీఘ్రమే యసంప్రజ్ఞాతసమాధి ప్రాప్త మగుచున్నది.

పూర్వము తాత్పర్యనిరూపణప్రసంగమునందు శ్రవణాదులయొక్క నిరూపణము చేయంబడినది. ఇఁకఁ బ్రకృతార్థము నిరూపింపఁబడుచున్నది. పూర్వోక్తోపక్రమోపసంహారాదిషడ్విధలింగములచేత నెట్లు వేదాంతవాక్యతాత్పర్యము నిర్ణయింపఁబడు చున్నదో అట్లు కర్మకాండవాక్యములకును ఆషడ్విధలింగములచేతనే తాత్పర్యము నిర్ణయింపఁబడుచున్నది. ఈప్రకారముగాఁ బూర్వోక్తతాత్పర్యముయొక్క యేయనుపపత్తి యున్నదో అదియే పూర్వోక్తలక్షణకు బీజమై యున్నది. ఆ తాత్పర్యానుపపత్తి యాయాలక్షణలయొక్క నిరూపణమునందుఁ బూర్వము చెప్పఁబడి యున్నది.

## [*] (45) లక్షణాబీజనిరూపణము. [*]

శంక:—ఒకపదార్థమునకు మఱియొకపదార్థమునందు సంబంధరూపమయిన యేయన్వయ మున్నదో, ఆయన్వయముయొక్క యనుపపత్తియే లక్షణకు బీజమై యున్నది. ఉదా—"గంగాయాం ఘోషః" అను నుక్తోదాహరణమందుండు గంగాపదముయొక్క శక్యార్థరూపజలప్రవాహమునందు ఘోషముయొక్క యాధారతాసంబంధరూపాన్వయము సంభవించుట లేదు. అందువలన నాయన్వయానుపపత్తివలననే గంగాపదమునకుఁ దీరమునందు లక్షణ చేయఁబడుచున్నది. ఈలాగుననే

సర్వస్థలములందును నాయన్వయానుపపత్తివలననే లక్షణ సంభవించుచున్నది. అందు వలన నన్వయానుపపత్తియే లక్షణకు బీజమై యున్నది.

సమాధానము:—ఒకవేళ సర్వత్ర యన్వయానుపపత్తియే లక్షణకు బీజ మనినయెడల యష్టిధరపురుషుని భోజనము చేయించుటకొఱకు కొకానొకయాప్త వక్త యగుపురుషునిచేత నుచ్చరింపఁబడిన "యష్టీః ప్రవేశయ" అను నేవచన మున్నదో ఆవచనమును శ్రవణము చేసినశ్రోత యగుపురుషుఁ డాయష్టిపదమునకు యష్టిధరపురుషునియందు లక్షణ చేయుచున్నాఁడు. ఆలక్షణ కలుగక పోవలయును. ఏల యన, ఎట్లు పురుషునకుఁ బ్రవేశరూపక్రియయందు సంబంధరూపాన్వయము సంభవించు చున్నదో అట్లు కాష్ఠవిశేషరూపయష్టికిఁగూడ నాప్రవేశక్రియయం దన్వయము సంభవించు చున్నది. అందువలన నాయన్వయానుపపత్తిరూపలక్షణ యొక్క బీజ మచ్చట సంభవించుట లేదు. మఱి యే మనఁగా, తాత్పర్యానుపపత్తి రూపలక్షణాబీజమే యచ్చట సంభవించుచున్నది. మఱియు "గంగాయాం ఘోషః" ఇత్యాదిలక్షణలయొక్క యుదాహరణము పూర్వము చెప్పఁబడినది. అచ్చట సర్వత్ర తాత్పర్యానుపపత్తిరూపబీజమే యున్నది. అందువలన సర్వత్ర యుండుటవలనఁ దాత్పర్యానుపపత్తియే లక్షణకు బీజమై యున్నది. వ్యభిచారి యగుటవలన నాయన్వయానుపపత్తి లక్షణకు బీజము కాదు.

## [*] (46) వాక్యములయందును లక్షణానిరూపణము. [*]

నైయాయికులు శక్తివృత్తివలె లక్షణావృత్తినిగూడఁ గేవలపదమునందే యంగీకరించు చున్నారు. వాక్యమునందు లక్షణావృత్తి నంగీకరించుట లేదు. వారి యొక్క మతము ఖండించుటకొఱకు వాక్యమునందును లక్షణాసిద్ధి చేయఁబడుచున్నది. అచ్చట, పూర్వోక్తలక్షణ కేవలపదమునందే యుండుట లేదు. మఱి యే మనఁగా, వాక్యమునందుఁగూడ నాలక్షణ యున్నది. ఉదా—"గంభీరాయాం నద్యాం ఘోషః" అను పదసమూహరూపవాక్యమునకుఁ దీరమునందు లక్షణాంగీకార మున్నది. ఈ కారణముచేతనే వేదమునం దర్థవాదవాక్యములకు స్తుతియందు లక్షణ యంగీకరింపఁ బడి యున్నది. అచ్చట విధివాక్యముచేతఁ బ్రాప్త మగు నర్థమునకు స్తుతిబోధక మగు నేవాక్య మున్నదో అది యర్థవాద మనఁబడును. మఱియు గుణియందు దేగుణము చెప్పఁ బడి యున్నదో అది స్తుతి యనఁబడును. ఒకవేళ వాక్యమునందు లక్షణ నంగీకరింపక పదమాత్రమునందే లక్షణ నంగీకరించినయెడల, నా యర్థవాదవాక్యమునందుండు నొక్కపదముయొక్క లక్షణచేతనే యాస్తుతిరూపార్థముయొక్క బోధ యగునపుడు

రెండవపదము వ్యర్థ మగును. అందువలనఁ బదసమూహరూపవాక్యమునకే, యాస్తుతి యందు లక్షణ యంగీకరింపవలయును. ఈకారణముచేతనే శాస్త్రకారులచేత నా యర్థవాదవాక్యములకు విధివాక్యములతోఁ బదైకవాక్యత యంగీకరింపఁబడి యున్నది. అచ్చట, ఆకాంక్షావశముచేతఁ బదమునకు విధివాక్యముతో నేయన్వయ మున్నదో అది పదైకవాక్యత యనఁబడును. యద్యపి, ఆయర్థవాదవచనము పదరూపము కాదు. మఱి యే మనఁగా, పదములయొక్క సమూహరూప మగుటవలన వాక్య రూపమే యగుచున్నది. తథాపి, ఆ యర్థవాదవాక్యములు లక్షణావృత్తిచేత స్తుతి రూపైకపదార్థబోధకము లగుటవలన, పదస్థానీయము లని చెప్పఁబడును. అట్టి పద రూపార్థవాదవాక్యములకు విధివాక్యములతో నేయేకవాక్యత్వ మున్నదో అది పదైక వాక్యత యనఁబడును. ఉదా— "వాయవ్యం శ్వేతం పశు మాలభేత" — భావము॥ వాయువు దేవతగాఁ గలిగిన దేదియో దానికి (ఆయాగమునకు) శ్వేతపశువును హన నము చేయవలయును, అను విధివాక్యము వాయుదేవతాసంబంధి యగు యాగమును విధించుచున్నది. మఱియు నాప్రకరణమునందే "వాయు ర్వై క్షేపిష్ఠా దేవతా"— భావము॥ ఆవాయుదేవత శీఘ్రగమనము గలది. అను నర్థవాదవాక్య మావాయు దేవతాస్తుతి చేయుచున్నది. అందువలన శీఘ్రముగా ఫలమును బ్రాప్తింపఁజేయునట్టి వాయుదేవతాసంబంధి యగుయాగము నీపురుషుఁడు చేయవలయును. ఈప్రకారము గాఁ బదరూపార్థవాదవాక్యమునకు విధివాక్యముతో నేయేకవాక్యత యున్నదో అది పదైకవాక్యత యనఁబడును.

మఱియుఁ దమతమయర్థమునందుఁ దాత్పర్యము గల యేవాక్యము లున్న వో ఆవాక్యములకుఁ, బరస్పరాంగాంగిభావాకాంక్షావశమువలన నేయేకవాక్యత్వ మున్నదో అది వాక్యైకవాక్యతయై యున్నది. ఉదా— "దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత" — భావము॥ స్వర్గకామము గలపురుషుఁడు దర్శపూర్ణమాస మనుయాగమును జేయవలయును. అను విధివాక్యమువలన దర్శపూర్ణమాస మను అంగియాగము విధింపఁబడి యున్నది. మఱియు నాప్రకరణమునందే "సమిధో యజతి" అనువచనమువలన, సమిధ మను నంగయాగము విధింపఁబడి యున్నది. మఱియు నంగియాగమున కంగరూపయాగముయొక్క యపేక్ష యవశ్యమై యున్నది. అందువలన స్వర్గకామము గలపురుషుఁడు, సమిధాద్యంగయాగవిశిష్టదర్శపూర్ణమాస రూపాంగియాగమును జేయవలయును. ఈప్రకారముగా నంగబోధకవాక్యమున కంగిబోధకవాక్యముతో నేయేకవాక్యత యున్నదో, అది వాక్యైకవాక్యత యనఁ బడును.

మఱియు నెట్లు పూర్వోక్తతాత్పర్యజ్ఞానము వాక్యార్థజ్ఞానమునందుఁ గారణమై యున్నదో, అట్లవాంతరవాక్యార్థజ్ఞానముగూడ మహావాక్యార్థజ్ఞానమునందుఁ గారణమై యున్నది. ఆ యవాంతరవాక్యార్థజ్ఞానము లేక మహావాక్యార్థజ్ఞానము కలుగుట లేదు. అచ్చట మహావాక్యముయొక్క యంతఃప్రవిష్టము లగు నేవాక్యములున్నవో, అవి యవాంతరవాక్యములై యున్నవి. అందువలన నిది సిద్ధమగుచున్నది. శక్తిలక్షణారూపవృత్తిజ్ఞానమును ఆకాంక్షాజ్ఞానమును యోగ్యతాజ్ఞానమును ఆసత్తియును తాత్పర్యజ్ఞానమును అవాంతరవాక్యార్థజ్ఞానమును, ఈపూర్వోక్త మగు సర్వమును ఆవాక్యార్థజ్ఞానమునకు సహకారియై యున్నది. ఆసర్వసహకారులచేత సంపన్న మైన యావాక్యార్థజ్ఞానము పరోక్షప్రమకును అపరోక్షప్రమకును జనకమై యున్నది. అందు, ఏవాక్యము పరోక్షార్థప్రతిపాదకమై యున్నదో ఆవాక్యము పరోక్షప్రమకు జనకమై యున్నది. ఉదా—"స్వర్గకామో యజేత, స దేవ సౌమ్యేద మగ్ర ఆసీత్, దశ మోఽస్తి" ఇత్యాదివైదికలౌకికవాక్యములు పరోక్షస్వర్గాదిప్రతిపాదకము లగుటవలనఁ, బరోక్షప్రమకు జనకములై యున్నవి.

## [*] (47) పరోక్షలక్షణము. [*]

శంక:—పరోక్షార్థప్రతిపాదకవాక్యము పరోక్షప్రమకు జనకమై యున్నదని పూర్వము మీఁదేఁ జెప్పఁబడినది. ఆయర్థమునందుఁ బరోక్షత్వ మనునది యేది? అనునట్టిజిజ్ఞాస కలుగఁగా.

సమాధానము:—ఇఁక, ఆయర్థనిష్ఠపరోక్షత్వమునకు లక్షణము చెప్పఁబడుచున్నది. "యోగ్యవిషయస్యానావృతసంవిత్తాదాత్మ్యాభావః పరోక్షత్వమ్"—భావము॥ అజ్ఞానకృతావరణరహిత మగు నేసాక్షిచైతన్య మున్నదో అది అనావృతసంవిత్తనఁబడును. అట్టి యనావృతసంవిత్తుతోఁ బ్రత్యక్షయోగ్యవిషయముయొక్క తాదాత్మ్యమున కేయభావ మున్నదో, అదియే యావిషయమునందుఁ బరోక్షత్వమై యున్నది. ఉదా—స్వర్గాదియోగ్యవిషయముల కనావృతసాక్షిచైతన్యముతోఁ దాదాత్మ్యము లేదు. అందువలన స్వర్గాదికము పరోక్ష మని చెప్పఁబడును. మఱియు నేకాలమందు ఘటపటాదివిషయాకారముగా నంతఃకరణవృత్తి యగుట లేదో, ఆ కాలమునందు ఘటపటాదియోగ్యవిషయముల కనావృతసాక్షిచైతన్యముతోఁ దాదాత్మ్యము లేదు. అందువలన నాకాలమునందు ఘటపటాదికముగూడఁ బరోక్షమనఁబడుచున్నది. అచ్చట, ఈలక్షణమునందు విషయమునకు "యోగ్య" అను విశేషణముఁ జెప్పనియెడల, ధర్మాధర్మములయం దాలక్షణమున కవ్యాప్తి యగును.

ఏల యన, ధర్మాధర్మముల కనావృతసాక్షిచైతన్యముతోఁ దాదాత్మ్యమే యున్నది. అయినను, అధర్మాధర్మములు ప్రత్యక్షయోగ్యములు కావు. మఱి యే మనఁగా, అయోగ్యములై యున్నవి. అందువలన యోగ్యపదమును జెప్పుటచేత నాధర్మాధర్మములయందును బరోక్షత్వము సంభవించుచున్నది. అట్టి పరోక్షార్థమును విషయముఁ జేయునట్టి ప్రమాజ్ఞానముగూడఁ బరోక్ష మనఁబడును. అనఁగా, అట్టి పరోక్షార్థమును విషయము చేయుటయే ప్రమాజ్ఞానమునందుఁ బరోక్షత్వమై యున్నది. ఉదా—"స్వర్గోస్తి, అయం ధర్మాధర్మవాన్, దశమో ఽస్తి" ఇత్యాదివాక్యజన్య ప్రమయందు, స్వర్గము ధర్మాధర్మములు దశముఁడు ఇత్యాది పరోక్షార్థములయొక్క యేవిషయత్వ మున్నదో, అదియే పరోక్షత్వమై యున్నది.

లేక, ప్రమాణచైతన్యమందు విషయచైతన్యముకన్న నేభిన్నత్వ మున్నదో, అదియే ప్రమాజ్ఞానమునందుఁ బరోక్షత్వమై యున్నది. ఉదా—"స్వర్గోస్తి" ఇత్యాది వాక్యజన్య వృత్త్యవచ్ఛిన్న ప్రమాణచైతన్యమునందు స్వర్గాదివిషయావచ్ఛిన్నచైతన్యమునకంటె నేభిన్నత్వ మున్నదో అదియే ఆస్వర్గాదివిషయకజ్ఞానమునందుఁ బరోక్షత్వమై యున్నది. ఈప్రకారముగా ననుమిత్యాదిజ్ఞానములయందుఁగూడఁ బరోక్షత్వమును దెలియవలయును. అచ్చట, పరోక్షస్థలమునం దంతఃకరణవృత్తి విషయదేశమందుఁ బోవుట లేదు. ఇఁక నే మనఁగా, శరీరములోపలనే యావృత్తి యుత్పన్న మగుచున్నది. అందువలన విషయవృత్తిరూపోపాధులు భిన్నభిన్నదేశములయం దుండుటవలన, వృత్త్యవచ్ఛిన్నచైతన్యముతో విషయావచ్ఛిన్నచైతన్యమున కేకత్వము కలుగుట లేదు. ఈయర్థము పూర్వము ప్రత్యక్షనిరూపణమందుఁ జెప్పఁబడి యున్నది. అందువలన, నావృత్త్యవచ్ఛిన్నప్రమాణచైతన్యమునందు విషయావచ్ఛిన్నచైతన్యముకంటె భిన్నతారూప మైనజ్ఞాననిష్ఠపరోక్షత్వము సంభవించుచున్నది.

## [*] (48) అపరోక్షలక్షణము. [*]

మఱియు నేవాక్య మపరోక్షార్థప్రతిపాదకమై యున్నదో ఆవాక్య మపరోక్షప్రమకు జనకమై యున్నది. ఉదా—"తత్త్వమసి" అను వైదికవాక్యము బ్రహ్మాత్మరూపాపరోక్షార్థప్రతిపాదక మగుటవలన, "అహం బ్రహ్మాస్మి" యను నపరోక్షప్రమకు జనకమై యున్నది. మఱియు "దశమస్త్వమసి" అను లౌకికవాక్యము దశమపురుషరూపాపరోక్షార్థప్రతిపాదక మగుటవలన, "అహం దశమః" అను నపరోక్షప్రమకు జనకమై యున్నది.

శంక:—అపరోక్షార్థప్రతిపాదక మగుటవలన నావాక్య మపరోక్షప్రమకు జనకమై యున్న దను నర్థమం, దపరోక్షత్వ మనునది యేది? అను జిజ్ఞాస కలుగఁగా,

సమాధానము:—ఇఁక నాయర్థనిష్ఠాపరోక్షత్వముయొక్క లక్షణము చెప్పఁబడు చున్నది. "యోగ్యవిషయ స్యానావృతసంవిత్తాదాత్మ్య మపరోక్షత్వమ్"—భావము॥ ప్రత్యక్షయోగ్యవిషయమున కనావృతసాక్షిచైతన్యముతో నే తాదాత్మ్య మున్నదో అదియే యావిషయమునం దపరోక్షత్వమై యున్నది. ఉదా—ఘటపటాద్యాకారవృత్తికాలమం దాఘటపటాదుల కనావృతసాక్షిచైతన్యముతోఁ దాదాత్మ్య మున్నది. ఇదియే యాఘటపటాదులయం దపరోక్షత్వము.

మఱియు ధర్మాధర్మములకు యద్యపి యనావృతసాక్షిచైతన్యముతోఁ దాదాత్మ్య మున్నది, తథాపి ఆధర్మాధర్మములు ప్రత్యక్షయోగ్యములు కావు. అందువలన నీలక్షణమునందు విషయమునకు "యోగ్య" అనువిశేషణము చెప్పుటవలన నాధర్మాధర్మములయం దపరోక్షత్వలక్షణమున కతివ్యాప్తి కలుగదు.

యద్యపి సిద్ధాంతమునందు నిత్యాపరోక్షరూప మొకటేచైతన్యమై యున్నది. ఆ యేకచైతన్యమునందు సాక్షిచైతన్య మైననో యనావృతమై యున్నది, విషయచైతన్య మావృతమై యున్నది, అని యీప్రకారముగా భేదముఁ జెప్పుట సంభవింపదు. తథాపి, విషయాంతఃకరణ ద్యుపాధులయొక్క భేదముచేత నాచైతన్యమునకు భేదము పూర్వము చెప్పఁబడి యున్నది. మఱియు ఘటాదిపదార్థముల యందు సర్వలోకులకును, సంశయము అనవభాసము విపర్యయము ననునవి కలుగుచున్నవి. అంతఃకరణోపహితసాక్షిచైతన్యమునం దొకప్పుడును ఆసంశయాదికము గలుగుట లేదు. అందువలనఁ గార్యబలముచేత నాఘటాద్యవచ్ఛిన్నచైతన్య మావృత మని చెప్పఁబడు చున్నది. మఱియు నాసాక్షిచైతన్య మనావృత మనియును జెప్పఁబడుచున్నది. ఒకవేళ సాక్షిచైతన్యముగూడ ఆవృత మని యంగీకరించిన యెడలఁ ప్రకాశకాభావ మగుటవలన జగత్తునం దంధత్వము ప్రాప్త మగును, అనఁగా నొకవస్తువును ప్రకాశము లేని దగును. అందువలన నాసాక్షికి సర్వథా యనావృతత్వమే యంగీకరింపవలయును. ఘటాదివిషయావచ్ఛిన్నచైతన్య మైననో, ఘటాద్యాకారవృత్త్యుత్పత్తికిఁ బూర్వ మావృతమై యున్నది. మఱియు నావృత్తికాలమునం దావరణరహితమై యాసాక్షిచైతన్యముతో నభిన్న మగుచున్నది. ఆకాలమునం దాఘటాదివిషయముల కనావృతసాక్షిచైతన్యముతో నేతాదాత్మ్య మున్నదో, అదియే ఘటాదివిషయములయం దపరోక్షత్వమై యున్నది.

శంక:—పూర్వము విషయప్రత్యక్షలక్షణమునందు, ఘటాదివిషయములకు సాక్షిచైతన్యముతోఁ దాదాత్మ్యము చెప్పఁబడినది. ఆ తాదాత్మ్య మేది? అనఁగా, ఏకత్వ మనునది తాదాత్మ్యమా? లేక, భేదసహితాభేద మనునది తాదాత్మ్యమా?

అందుఁ బ్రథమపక్షమైననో సంభవింపదు. ఏల యన, తమఃప్రకాశములకువలె జడ చైతన్యములకు విరోధ మగుటవలన నేకత్వము సంభవింపదు. అట్లే ద్వితీయపక్ష మును సంభవింపదు. ఏల యన, సమానసత్తాసహితభేదాభేదములకుఁ బరస్పర విరోధ మగుటవలన నేకాధికరణమునందు స్థితియే సంభవించుట లేదు.

ఈశంకకు సమాధానార్థమై యిటఁ దాదాత్మ్యలక్షణము చెప్పఁబడు చున్నది. "తద్భిన్నత్వే సతి తదభిన్నసత్తాకత్వం తాదాత్మ్యమ్"—భావము॥ ఏపదా ర్థముకన్న నేవస్తువు భిన్నముగాఁ బ్రతీత మగుచున్నదో, మఱియు నేపదార్థముయొక్క సత్తకన్నను యేవస్తువుయొక్క సత్త భిన్నము గాదో, ఆపదార్థమునం దావస్తువునకే సంబంధ మున్నదో అది తాదాత్మ్య మనఁబడును. ఉదా—ఘటపటాదికార్యములకు మృత్తికాతంత్వాద్యుపాదానకారణములయందుఁ దాదాత్మ్య మున్నది. అచ్చట "అయం ఘటః, అయం పటః" అను ప్రతీతివలన నాఘటపటాదులు తమమృత్తి కాతంత్వాద్యుపాదానకారణములకన్నను భిన్నములుగా భాసించినను, ఆయుపాదాన కారణములయొక్క సత్తకన్నను ఆఘటపటాదికార్యములకు భిన్నసత్త లేదు. అందు వలన నా ఘటపటాదికార్యములకుఁ దమమృత్తికాతంత్వాద్యుపాదానకారణముల యందుఁ దాదాత్మ్యము సంభవించుచున్నది.

ఈప్రకారముగానే కల్పితరజతసర్పాదులకును దమయధిష్ఠానములయం దుఁ దాదాత్మ్యమే యున్నది. ఏకాలమునం దంతఃకరణవృత్తి చక్షురాదీంద్రియ ములద్వారమున బాహ్యమునకుఁ బోయి ఘటాద్యాకార మగుట లేదో, ఆకాలము నందు ఘటాదివిషయములు స్వావచ్ఛిన్నచైతన్యమునం దధ్యస్తములై యుండెను. ఎప్పు డావృత్తి బాహ్యమునకుఁ బోయి ఘటాద్యాకార మగుచున్నదో, అప్పు డా వృత్తివిషయరూపోపాధు లేకదేశమునం దుండుటవలనఁ, దదుపహితచైతన్యముల కును ఏకత్వమే యున్నది. అనఁగా ఘటాద్యవచ్ఛిన్నచైతన్యమును వృత్త్యవచ్ఛిన్న చైతన్యమును అంతఃకరణవిశిష్టప్రమాతృచైతన్యమును, అంతఃకరణోపహితసాక్షి చైతన్యము నను నీసర్వమునకు నాకాలమునం దేకత్వము కలుగుచున్నది. ఆకాలము నం దాఘటాదులు సాక్షిచైతన్యమునం దధ్యస్తములై యున్నవి. అధ్యస్తవస్తువున కధి ష్ఠానమునకన్న భిన్నసత్త యుండుట లేదు. ఉదా—కల్పితరజతసర్పాదులకు శుక్తిరజ్జ్వా ద్యధిష్ఠానములకన్నను భిన్నసత్త లేదు. ఈరీతిగా నాఘటపటాదులయం దాసాక్షి చైతన్యముయొక్క సత్తకన్నను ఏభిన్నసత్తారహితత్వ మున్నదో, అదియే యాఘటా దులకు సాక్షిచైతన్యముతోఁ దాదాత్మ్యము. ఈసాక్షితోఁ దాదాత్మ్యమే యా ఘటాదులయం దపరోక్షత్వమై యున్నది.

అట్టి యపరోక్షార్థప్రతిపాదకవాక్య మపరోక్షప్రమకు జనకమై యున్నది. ఉదా—"దశమ స్త్వ మసి" ఈవాక్యమునందు దశమపురుషుఁడు త్వంపదార్థమున కన్న నభిన్నుఁ డగుటవలన నపరోక్షుఁడే యగుచున్నాఁడు. అందువలన నాయప రోక్షార్థప్రతిపాదకత్వముచేత నావాక్యమువలన శ్రోత యగుపురుషునకు "అహం దశమః" అను నపరోక్షప్రమయే కలుగుచున్నది గాని పరోక్షప్రమ కలుగుట లేదు.

శంక:—"గా మానయ, స్వర్గోస్తి" ఇత్యాదిసకలవాక్యములకుఁ బరోక్షప్రమను గలుగఁజేయుటయే స్వభావమై యున్నది. వస్తువుయొక్క స్వభావమున కన్యథాత్వము కలుగుట లేదు. అందువలన "దశమ స్త్వ మసి" అనువాక్యము చేతను ఆదశమపురుషునకుఁ బ్రథమమునఁ దనపరోక్షజ్ఞానమే కలుగుచున్నది. తదనంతరము మనోరూపేంద్రియముచేతఁ దనదశమత్వముయొక్క సాక్షాత్కారము కలుగుచున్నది. ఎట్లనఁగా, ఏదియేది ప్రత్యక్షజ్ఞానమై యున్నదో అదియాది యింద్రియము చేతనే జన్యమై యున్న దనునియమ మున్నది. అందువలన నాత్మప్రత్యక్షమునందును ఆత్మవృత్తిసుఖదుఃఖాదులయొక్క ప్రత్యక్షమునందును ఇంద్రియరూపకరణముచేత జన్యత్వ మవశ్య మంగీకరింపవలయును. అందు బాహ్యచక్షురాదీంద్రియముల కాంతరప్రత్యక్షమును గలుగఁజేయుసామర్థ్యము లేదు. పరిశేషమువలన మనస్సునకే యన్వయవ్యతిరేకములచేతఁ బ్రత్యక్షజ్ఞానముయొక్క కరణత్వ మంగికరింపవలయును. అట్లుగాక, ఆప్రత్యక్షమునందు మనస్సును గరణ మని యంగీకరింపనియెడల "అహం సుఖీ, అహం దుఃఖీ" అను సుఖదుఃఖాదులయొక్క ప్రత్యక్షజ్ఞానమునం దప్రమాత్వమే ప్రాప్త మగును. కావున నాదశమపురుషునకు మనస్సుచేతనే తనదశమత్వముయొక్క సాక్షాత్కార మగుచున్నది, వాక్యముచేతఁ గాదు.

సమాధానము:—సుఖదుఃఖాదులయొక్క సాక్షాత్కారమునకుఁ గరణరూపముచేత మనస్సునం దింద్రియత్వము సిద్ధించినయెడల, దశమపురుషునియొక్క సాక్షాత్కారమునం దామనస్సునకుఁ గరణత్వము సంభవించును. మనస్సునం దింద్రియత్వమే సంభవించుట లేదు. ఈయర్థము పూర్వము ప్రత్యక్షప్రమానిరూపణమునందుఁ జెప్పఁబడియున్నది. సుఖదుఃఖాదులయొక్క జ్ఞాన మైననో, నిత్యసాక్షిరూప మగుటవలన నొకకరణముచేతను జన్యము కాదు. అందువలన సుఖాదిజ్ఞానమునకుఁ గరణరూపముచేత నామనస్సున కింద్రియరూపత్వము సంభవింపదు.

శంక:—సుఖదుఃఖాదులయొక్క జ్ఞానము నిత్యసాక్షిరూప మని యంగీకరించినయెడల ఆనిత్యసాక్షిరూపజ్ఞానమున కుత్పత్తివినాశములు సంభవించుట లేదు.

అందువలన నాకిపుడు సుఖజ్ఞాన ముత్పన్న మైనది, దుఃఖజ్ఞానము నష్ట మైనది, యను సర్వలోకానుభవమునకు విరోధ మగును. మఱియు నీపురుషునకుఁ గాలాంతరమం దాసుఖదుఃఖాదులయొక్క స్మృతియును గలుగకపోవలయును. ఏల యన, అనుభవ ధ్వంసజన్యసంస్కారమువలననే యాస్మృతి కలుగుచున్నది.

సమాధానము:—సాక్షిచైతన్యమున కుత్పత్తివినాశములు లేక పోయి నను, ఆసాక్షిచైతన్యమునకు విషయమైనసుఖదుఃఖాదుల కుత్పత్తివినాశములు కలుగు చున్నవి. దానిచేత నాసాక్షిరూపానుభవమునందును ఉత్పత్తివినాశవ్యవహారము సంభవించు చున్నది. అట్లే సంస్కారోత్పత్తిచేతఁ గాలాంతరమునం దాసుఖదుఃఖా దులయొక్క స్మృతియును సంభవించుచున్నది. అందువలన సుఖదుఃఖాదులయొక్క జ్ఞానమునం దామనస్సునకుఁ గరణరూపత్వము సంభవించుట లేదు. ఈలాగుననే యాత్మసాక్షాత్కారమందును మనస్సునకుఁ గరణత్వము సంభవించుట లేదు. ఎ ట్లన, శ్రుతిచేత శుద్ధాత్మ మనోవాక్కుల కవిషయమని చెప్పఁబడి యున్నది. అందు వలన శుద్ధాత్మయొక్క సాక్షాత్కారమందో మనస్సునకుఁ గరణత్వము సంభవింపదు. ఈలాగుననే సోపాధికాత్మసాక్షాత్కారమందును మనస్సునకుఁ గరణత్వము సంభ వింపదు. ఏకారణముచేత ననఁగా, "కామస్సంకల్పో విచికిత్సా" ఇత్యాదిశ్రుతుల చేత మనస్సు వృత్తిజ్ఞానమున కుపాదానకారణ మని చెప్పఁబడి యున్నది. మఱియు నుపాదానకారణము కార్యమునకుఁ గరణ మగుట లేదు. మఱి యే మనఁగా నిమిత్తకారణమే కరణ మగుచున్నది. ఉదా—ఘటమున కుపాదానకారణ మైనమృ త్తిక కరణ మగుట లేదు. ఇఁక నే మనఁగా, నిమిత్తకారణ మైనదండాదికమే కరణ మగుచున్నది. ఈలాగుననే వృత్తిజ్ఞానమున కుపాదానకారణ మైనమనస్సు వృత్తి జ్ఞానమునకుఁ గరణ మనుట సంభవించుట లేదు.

మఱియు, ఎట్లు చాక్షుషజ్ఞానోత్పత్తియందు సూర్యాదులయొక్క యాలో కము చక్షురింద్రియమునకు సహకారియై యున్నదో, అట్లు మనస్సుగూడ శబ్దాది ప్రమాణములకు సహకారియై యున్నది. అందువలన, ఎట్లాలోకము పృథక్ప్రమా ణము కాదో, అట్లు మనస్సుగూడఁ బృథక్ప్రమాణము గాదు. మఱియు నెట్లు చక్షు రాదీంద్రియములకు రూపాదిక మసాధారణవిషయమై యున్నదో అట్లు మనస్సున కొకయసాధారణవిషయము లేదు. మఱియు నంతఃకరణమును దద్ధర్మము లైన సుఖదుఃఖాదులును, బూర్వోక్తరీతిగాఁ గేవలసాక్షిభాస్యములే యగుచున్నవి. అందు వలన నసాధారణవిషయము లేనందువలనను ఆమనస్సునందు సాక్షాత్కారకరణ త్వము సంభవింపదు. ఈయర్థ మాచార్యులచేతను జెప్పఁబడి యున్నది. అందు

## తత్త్వానుసంధానము,

“శ్లో. ప్రమాణసహకారిత్వా ద్విషయస్యా ప్యభావతః । న ప్రమాణం మనో ఽస్మాకం ప్రమాదే రాశ్రయత్వతః ”—భావము॥ ప్రమాణమునకు సహకారి యగుట వలనను, అసాధారణవిషయము లేనందువలనను ప్రమాజ్ఞానాదుల కాశ్రయ మగుట వలనను మనస్సునకుఁ బ్రమాణరూపత్వము మేము సిద్ధాంతమునం దంగీకరించుట లేదు.

మఱియుఁ బ్రమాణజన్యాపరోక్షజ్ఞానమే యపరోక్షభ్రమయొక్క నివర్తక మగుచున్నది. అందువలన “అహం దశమః” అను సాక్షాత్కారమందు మనస్సునకుఁ గరణరూపత్వము సంభవింపదు. మఱి యేమనఁగా “దశమ స్త్వ మసి” అనువాక్యమునకే కరణరూపత్వము సంభవించు ననునది సిద్ధమైనది. ఈరీతిగానే “తత్త్వ మసి” అనువాక్యమునందును దత్పదలక్ష్యార్థమైన బ్రహ్మమునకుఁ ద్వంపద లక్ష్యార్థమైనసాక్షితో సర్వదా యభేద మున్నది. అందువలన ననావృతసాక్షితోఁ దాదాత్మ్య ముండుటవలన బ్రహ్మము నిత్యాపరోక్షమై యున్నది. శ్రుతి.—“యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ” — భావము॥ ఏబ్రహ్మము సర్వాత్మరూప మగుటవలన సాక్షా దపరోక్షరూపమై యున్నదో అట్టి యపరోక్షబ్రహ్మమును బ్రతిపాదించునట్టి తత్త్వమస్యాదిమహావాక్యములచేత నీపురుషునకు “అహం బ్రహ్మాస్మి” యను నపరోక్షప్రమయే కలుగుచున్నది. ఇచ్చట అపరోక్షము ప్రత్యక్షము సాక్షాత్కారము నను నీత్రివిధశబ్దము లేకార్థవాచకములై యున్నవి.

శంక:—“తత్త్వ మసి” యను వాక్యమువలన “అహం బ్రహ్మాస్మి” యను నపరోక్షప్రమ కలుగు ననినయెడల సర్వలోకులకును ఆవాక్యశ్రవణముచేత నాయపరోక్షప్రమయే కలుగవలయును.

సమాధానము:—ఏపురుషుఁడు వివేకాదిచతుష్టయసాధనసంపన్నుఁడును దత్త్వంపదార్థశోధన చేసినవాఁడును శ్రవణమనననిదిధ్యాసనములచేత నివర్తితములైన యసంభావనావిపరీతభావనలు గలవాఁడును నగునో, అట్టి సాధనసంపన్నాధికారిపురుషునకే “తత్త్వ మసి” అను వాక్యమువలన “అహం బ్రహ్మాస్మి” యను నపరోక్షప్రమ కలుగుచున్నది. సాధనరహితపురుషునకుఁ గలుగుట లేదు. అట్టి యపరోక్షప్రమోత్పత్తియందు “తత్త్వ మసి” యను వాక్యమే కరణమై యున్నది. మనస్సు కరణము గాదు. శ్రవణాదిసంస్కృతశుద్ధమనస్సు సహకారికారణమై యున్నది.

మఱియు బ్రహ్మాత్మసాక్షాత్కారమందు వేదవాక్యమే కరణమై యున్నద నునర్థము పూర్వోక్తకేవలయుక్తులచే సిద్ధ మగుటయే గాక, శ్రుతిప్రమాణముచేతఁ

గూడ సిద్ధ మగుచున్నది. అందు శ్రుతి "సర్వే వేదా యత్పద మామనంతి, తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి, నావేదవి న్మనుతే తం బృహంతమ్"—భావము॥ సర్వవేదములు ఏపరమాత్మపదమును సాక్షాత్తుగాఁ గాని పరంపరగాఁ గాని చెప్పు చున్నవో అనఁగా ఏపరమాత్మ విషయకసాక్షాత్కారమును గలుగఁజేయు చున్నవో. మఱియుఁ గేవలోపనిషద్రూపశబ్దప్రమాణముచేతఁ దెలియుటకు యోగ్యుఁడైన యే పరమాత్మపురుషుఁ డున్నాఁడో. వానియొక్కస్వరూపమును నేను మిమ్ముఁ బృచ్ఛ చేయుచున్నాను. మఱియు వేదాంతవాక్యజ్ఞానము లేనిపురుషు లాబ్రహ్మము నెఱుంగఁజాలరు. ఇత్యాదిశ్రుతులు బ్రహ్మసాక్షాత్కారమందు వేదాంతవాక్యములకే ప్రమాణరూపత్వము చెప్పి యున్నవి. మఱియు "మన సై వానుద్రష్టవ్యమ్, దృశ్య తే త్వగ్ర్యయా బుద్ధ్యా" ఇత్యాదిశ్రుతులో ఆబ్రహ్మసాక్షాత్కారమునందు శుద్ధమన స్సునకు సహకారిత్వము చెప్పియున్నవి. అందువలన నాశ్రుతులకుఁగూడ విరోధము కలుగదు.

ఒకవేళఁ బూర్వోక్తశ్రుతిప్రకారము మనస్సు నాత్మసాక్షాత్కారమునకుఁ గరణ మని యంగీకరించినయెడల నాత్మసాక్షాత్కారమునందు మనస్సునకుఁ గర ణత్వము నిషేధించి యుండు "య న్మనసా న మనుతే, అప్రాప్య మనసా సహ" ఇత్యాదు లగు నేశ్రుతు లున్నవో వానికి విరోధ మగును. ఆవిరోధము నివారించుట కొఱకుఁ బూర్వోక్తశ్రుతులచేత మనస్సును సహకారికారణమే యని యంగీకరిం చుట యోగ్యమై యున్నది. యద్యపి "యద్వా చా ఽనభ్యుదితమ్, యతో వాచో నివర్తంతే" అను నివి మొదలైనశ్రుతు లాత్మసాక్షాత్కారమునందు వాక్యప్రమా ణమునుగూడ నిషేధించి యున్నవి. తథాపి, ఆశ్రుతులవలన శబ్దమునకు శక్తివృత్తి చేత నిషేధము చేయఁబడినది, అనఁగా నాశబ్దము శక్తివృత్తిచేత బ్రహ్మమును బోధిం పదు. మఱి యే మనఁగా, భాగత్యాగలక్షణచేతఁ దత్త్వమస్యాదివాక్యములు బ్రహ్మ బోధకములే యగుచున్నవి. అందువలన బ్రహ్మసాక్షాత్కారమునందుఁ దత్త్వమ స్యాదిమహావాక్యములకే కరణరూపత్వము సంభవించుచున్నది.

శాబ్దప్రమానిరూపణము సమాప్తము.

## [*] అ ర్థా ప త్తి ప్ర మ. [*]

ఇఁకఁ బంచమ మగు నర్థాపత్తిప్రమ నిరూపింపఁబడుచున్నది. "అనుప పద్యమానార్థదర్శనా త్తదుపపాదకభూతార్థాంతరకల్పన మర్థాపత్తిప్రమా"—భావ ము॥ అనుపపద్యమానార్థజ్ఞానమువలనఁ దదర్థముయొక్కయుపపాదకరూప మైన

యర్థాంతరముయొక్క కల్పన మర్థాపత్తిప్రమ యనఁబడును. ఉదా—దివా ఽభోజి యగు దేవదత్తనామపురుషుని శరీరముయొక్క స్థూలతారూప మైన యేపీనత్వ మున్నదో ఆపీనత్వము రాత్రిభోజనము లేక సంభవించుట లేదు. అందువలనఁ బీనత్వ జ్ఞానముచేత దేవదత్తపురుషునకు రాత్రిభోజనముయొక్క కల్పన చేయఁబడుచున్నది. ఆకల్పన యర్థాపత్తిప్రమ యనఁబడును. ఇచ్చట దివా ఽభోజిపురుషునకుఁ బీనత్వము రాత్రిభోజనము లేక సంభవింప దనుజ్ఞాన మర్థాపత్తిప్రమకుఁ గరణ మగుటవలన నర్థాపత్తిప్రమాణ మనఁబడును. ఈపురుషుఁడు రాత్రియందు భుజించుచున్నాఁ డనుజ్ఞాన మర్థాపత్తిప్రమ యనఁబడును.

ఇచ్చట నైయాయికు లైననో, అర్థాపత్తిప్రమాణము నంగీకరించుట లేదు. మఱి యే మనఁగా, వ్యతిరేక్యనుమానముచేతనే రాత్రిభోజనజ్ఞాన మంగీకరించుచున్నారు. ఆయనుమానస్వరూప మేది యనఁగా “అయం దేవదత్తః రాత్రౌ భుంక్తే, దివా ఽభుంజానత్వే సతి పీనత్వాత్, యన్నైవం తన్నైవమ్, యథా దివా రాత్రౌ వభుంజానః”—భావము॥ ఈ దేవదత్తనామపురుషుఁడు రాత్రియందు భుజించుచున్నాఁడు, దివా ఽభోజియై యుండియు స్థూలించి యుండుటవలన, ఏపురుషుఁడు రాత్రియందు భుజించుట లేదో ఆపురుషుఁడు దివా ఽభోజియై స్థూలించి యుండుట లేదు, ఉదా—దివారాత్రులయందభోజి యగుపురుషునకు స్థూలత్వ ముండుట లేదు. అందువలన నర్థాపత్తిప్రమాణము పృథక్కుగా లేదు.

ఈ నైయాయికులయొక్క మత మసంగతమై యున్నది. ఎట్లనఁగా, పూర్వ మనుమితిప్రమానిరూపణమం దావ్యతిరేక్యనుమానము విస్తరముగా ఖండింపఁబడి యున్నది. కావున వ్యతిరేక్యనుమానముచేత రాత్రిభోజనజ్ఞానము సంభవింపదు. మఱి యే మనఁగా, ఉక్తార్థాపత్తిప్రమాణముచేతనే రాత్రిభోజనజ్ఞానము సంభవించుచున్నది. అందువలన నర్థాపత్తిప్రమాణము పృథక్ప్రమాణ మనియే యంగీకరింపవలయును. మఱియు నైయాయికు లేపదార్థముయొక్క జ్ఞానము వ్యతిరేక్యనుమానముచేత నంగీకరించుచున్నారో, ఆపదార్థముయొక్క జ్ఞాన మర్థాపత్తిప్రమాణముచేతనే సంభవించుచున్నది. అందువలన వ్యతిరేక్యనుమానము నంగీకరించుట వ్యర్థమే యగును.

మఱియుఁ బూర్వోక్తార్థాపత్తిప్రమ, దృష్టార్థాపత్తి శ్రుతార్థాపత్తి యను భేదముచేత ద్వివిధము. అందుఁ జూడఁబడినయర్థము దృష్టార్థ మనఁబడును. ఆదృష్టార్థముయొక్క యనుపపత్తివలన, దానియొక్క యుపపాదకరూప మయిన యర్థాంత

రముయొక్కకల్పన దృష్టార్థాపత్తి యనఁబడును. మఱియు శ్రవణము చేయఁబడిన యర్థము శ్రుతార్థ మనఁబడును. ఆశ్రుతార్థముయొక్కయనుపపత్తివలన దానియొక్కయుపపాదకరూప మయిన యర్థాంతరముయొక్కకల్పన శ్రుతార్థాపత్తి యనఁబడును.

ఆ ద్వివిధార్థాపత్తియందుఁ బ్రథమ మగు దృష్టార్థాపత్తియొక్కయుదాహరణము చెప్పఁబడుచున్నది. ఉదా—దోషసహితపురుషునకుఁ బురోవర్తి శుక్తియందు రజతమును విషయము చేయునట్టి "ఇదం రజతమ్" అను భ్రమరూపవిశిష్టానుభవము కలుగుచున్నది. ఆ యనుభవముయొక్కవిషయరూప మైనరజతమునకు శుక్తిరూపాధిష్ఠానజ్ఞానానంతరము "నేదం రజతమ్" అను బాధ ప్రతీత మగుచున్నది. అందువలన నారజతముయొక్కబాధ్యత్వము దృష్టార్థమై యున్నది. ఆ బాధ్యత్వరూపదృష్టార్థము రజతము సత్య మని యంగీకరించుటయందు సంభవింపదు. మఱి యే మనఁగా, రజతమును మిథ్య యని యంగీకరించుటయందే సంభవించుచున్నది. అందువలన రజతముయొక్కబాధ్యత్వరూపదృష్టార్థము రజతమునకు మిథ్యాత్వము లేక సంభవింపనిదై యారజతమునకు మిథ్యాత్వము కల్పించుచున్నది. ఆకల్పన దృష్టార్థాపత్తిప్రమ యనఁబడును.

ఇఁక, ప్రసంగానుసారముగా భ్రమస్థలమునందు వేదాంతసిద్ధాంతసమ్మత మగు ననిర్వచనీయఖ్యాతిని సాధించుటకొఱకుఁ బ్రథమమునం దన్యశాస్త్రోక్తఖ్యాతులు నిరూపించి ఖండింపఁబడుచున్నవి.

## [*] (49) అఖ్యాతివాదనిరూపణము. [*]

మీమాంసకులు భ్రమస్థలమం దఖ్యాతి నంగీకరించుచున్నారు. ఆ మీమాంసకులయొక్కయభిప్రాయ మే మనఁగా. సర్వజ్ఞానములును యథార్థములే యగుచున్నవి. ఒకజ్ఞానముగూడ నయథార్థ మగుట లేదు. అందువలన భ్రమస్థలమందు "ఇదం రజతమ్" అను విశిష్టభ్రమజ్ఞానమం దొకప్రమాణమును లేదు.

శంక:—ఒకవేళ "ఇదం రజతమ్" అనుజ్ఞానము విశిష్టభ్రమజ్ఞాన మని యంగీకరింపనియెడల నాజ్ఞానాంతరము రజతార్థికిఁ బురోవర్తిశుక్తియందుఁ బ్రవృత్తి కలుగకపోవలయును. రజతార్థికిఁ బురోవర్తిశుక్తియందుఁ బ్రవృత్తియో ప్రత్యక్షముగాఁ జూడఁబడుచున్నది. కావునఁ బ్రవృత్తియొక్కయనుపపత్తివలన "ఇదం రజతమ్" అనుజ్ఞానమునకు విశిష్టభ్రమజ్ఞానరూపత్వమే సిద్ధ మగుచున్నది.

సమాధానము:—"ఇదం రజతమ్" అను జ్ఞానమును విశిష్టభ్రమరూప మని యంగీకరింపకపోయినను రజతార్థికిఁ బురోవర్తిశుక్తియందుఁ బ్రవృత్తి కలుగు

చున్నది. అది యెట్లనఁగా " ఇదం రజతమ్ " అనువిశిష్టభ్రమజ్ఞాన మేకము గాదు. ఇఁక నేమనఁగా, రెండుజ్ఞానములై యున్నవి. అచ్చట " ఇద " మ్మనునది పురోవర్తివిషయకప్రత్యక్షజ్ఞానమై యున్నది. " రజత " మ్మనునది రజతవిషయకస్మృతిజ్ఞానమై యున్నది. ఆరెండుజ్ఞానములు యథార్థములే యగుచున్నవి. అచ్చట నారెండుజ్ఞానములకును బరస్పరభేద మున్నది. అట్లే యారెండుజ్ఞానములకు విషయభూతము లైన పురోవర్తియు రజతము నను రెంటికిని బరస్పరభేద మున్నది. అయినను దోషవశమువలన నీపురుషుఁ డారెండుజ్ఞానములయొక్క భేదమును- ఆరెండువిషయములయొక్క భేదమును గ్రహించుట లేదు. ఆభేదములను గ్రహింపమిచేతనే రజతార్థికిఁ బురోవర్తిశుక్తియందుఁ బ్రవృత్తి కలుగుచున్నది. అందువలన నాప్రవృత్తికొఱకు విశిష్టభ్రమజ్ఞానముయొక్క కల్పన వ్యర్థమై యున్నది.

మఱియు నొకవేళ నేదైన నొకజ్ఞాన మయథార్థ మని యంగీకరించినచో నీపురుషున కొకజ్ఞానమందును యథార్థత్వనిశ్చయము కలుగదు. మఱియు నేమన, సర్వజ్ఞానములయందు యథార్థత్వసంశయమే కలుగును. అందువలన నాయథార్థజ్ఞానసాధ్యము లగు ప్రవృత్తినివృత్త్యాదిసర్వవ్యవహారములకు లోపము కలుగును. ఈకారణముచేతనే " జ్ఞానస్య వ్యభిచారిత్వే విశ్వాసః కిం నిబంధనః " అను వచనము శాస్త్రకారులచేఁ జెప్పఁబడి యున్నది. ఈప్రకారముగానే యారజతత్వవిశిష్టభ్రమరూపానుభవమున కభావ మగుటవలన ననుభూయమానరజతముయొక్క దృష్టబాధ్యత్వ మారజతముయొక్క మిథ్యాత్వమును గల్పించుచున్న దని వేదాంతులు చెప్పుట యసంగతమై యున్నది.

ఈ యఖ్యాతివాది యగు మీమాంసకునియొక్క మతము సమీచీనము గాదు. అచ్చట, అఖ్యాతివాదిచేత విశిష్టభ్రమజ్ఞానమునం దేప్రమాణాభావము చెప్పఁబడినదో, అది యసంగతమై యున్నది. ఎట్లనఁగా, విశిష్టభ్రమజ్ఞాన మనుమానప్రమాణముచేతనే సిద్ధ మగుచున్నది. ఆ యనుమాన మెట్లనఁగా. " పురోవర్తిని రజతార్థిప్రవృత్తిః విశిష్టజ్ఞానసాధ్యా, ప్రవృత్తిత్వాత్, సంవాదిప్రవృత్తివత్ "—భావము॥ పురోవర్తిశుక్తియందు రజతార్థి కేప్రవృత్తి కలుగు చున్నదో, యాప్రవృత్తి " ఇదం రజతమ్ " అను విశిష్టజ్ఞానముచేత సాధ్యమై యున్నది, ప్రవృత్తిరూప మగుటవలన, లోకమునం దేదియేది ప్రవృత్తియై యున్నదో, అదియది విశిష్టజ్ఞానముచేతనే సాధ్యమై యున్నది. ఉదా—సత్యరజతవిషయకప్రవృత్తి, " ఇదం రజతమ్ " అను పురోవర్తి రజతవిశేష్యక రజతత్వవిశేషణ విశిష్టజ్ఞానముచేత సాధ్యమై యున్నది. ఈ యనుమానమే యావిశిష్టభ్రమజ్ఞానమునందుఁ బ్రమాణమై యున్నది.

మఱియు నఖ్యాతివాదిచేత జ్ఞానమాత్రమున కేయథార్థత్వము చెప్పఁబడినదో, అదియు నసంగతమై యున్నది. ఎట్లనఁగా, యద్యపి జ్ఞానమాత్రము స్వరూపముచేత యథార్థమే యగుచున్నది. తథాపి, విషయముయొక్క బాధాఽబాధలవలన నాజ్ఞానమునందు యథార్థత్వాయథార్థత్వములు రెండును సంభవించుచున్నవి. అనఁగా, ఏజ్ఞానముయొక్క విషయ మబాధితమై యున్నదో ఆజ్ఞానము యథార్థ మని చెప్పఁబడును. ఉదా—"అయం ఘటః, అయం పటః" ఇత్యాదిజ్ఞానములై యున్నవి. మఱియు నేజ్ఞానముయొక్క విషయము బాధిత మగుచున్నదో ఆ జ్ఞాన మయథార్థ మని చెప్పఁబడును. ఉదా—శుక్తియందు "ఇదం రజతమ్", రజ్జువునందు "అయం సర్పః" ఇత్యాదిజ్ఞానములై యున్నవి. ఒకవేళ "ఇదం రజతమ్" అనుజ్ఞానము రజతరూపవిషయముయొక్క బాధవలన భ్రమరూప మని యంగీకరింపని యెడల, "నేదం రజతమ్" అను నుత్తరజ్ఞానముచేతఁ బురోవర్తిశుక్తియందు రజతమునకే బాధ ప్రతీత మగుచున్నదో అది కాక పోవలయును. ఏల యన, ప్రాప్తార్థమునకే నిషేధము కలుగుచున్నది, అప్రాప్తార్థమునకు నిషేధము కలుగుట లేదు.

శంక:—"నేదం రజతమ్" అను జ్ఞానముచేత, "ఇదం రజతమ్" అను జ్ఞానమునకు లేక ఆజ్ఞానముయొక్క విషయభూత మగు రజతమునకు బాధ కలుగుట లేదు. మఱి యే మనఁగా, ఆరజతవిషయకప్రవృత్త్యాదివ్యవహారములకే బాధ కలుగుచున్నది.

సమాధానము:—"నేదం రజతమ్" అను జ్ఞానముచేతఁ బురోవర్తియందు రజతముయొక్క నిషేధమే యనుభూత మగుచున్నది. వ్యవహారముయొక్క నిషేధ మనుభూత మగుట లేదు. అట్లు గాక, ఆజ్ఞానమువలన రజతవ్యవహారమునకు నిషేధము కలుగుననిన యెడల "నేదం రజతమ్" అను వ్యవహారమే యాజ్ఞానముయొక్క యాకారము గావలయును. అట్టి జ్ఞానాకారము కలుగుట లేదు. అందువలన "నేదం రజతమ్" అను నిషేధబలముచేతను "ఇదం రజతమ్" అను విశిష్టభ్రమజ్ఞానమే సిద్ధ మగుచున్నది. ఆ విశిష్టభ్రమజ్ఞానమే పురోవర్తిశుక్తియందు రజతార్థియొక్క ప్రవృత్తికిఁ గారణమై యున్నది. అఖ్యాతివాదిచేఁ జెప్పఁబడిన భేదాఽగ్రహము ప్రవృత్తికిఁ గారణము గాదు. ఒకవేళ, భేదజ్ఞానముయొక్క యభావరూప మయిన భేదాగ్రహమునే యాప్రవృత్తికిఁ గారణ మని యంగీకరించినచో ఆభేదాగ్రహము సర్వదా యుండుటవలన నీపురుషున కాప్రవృత్తి సర్వదా కలుగవలయును.

మఱియు నాయఖ్యాతివాది రజతముయొక్క స్మృతిజ్ఞానమువలన నేప్రవృత్తి నంగీకరించినాఁడో, అదియుఁ గూడ సంభవింపదు. ఏల యన, ఆస్మృతిజ్ఞాన

ముచకు విషయభూతమైనరజతము దేశాంతరమునందే యున్నది. పురోవర్తిశుక్తియం దుండుట లేదు. అందువలన స్మృతిజ్ఞానముచేత రజతార్థికి దేశాంతరమందే ప్రవృత్తి యగును. పురోవర్తిశుక్తియందుఁ బ్రవృత్తి కాకపోవలయును. అందువలన నాయఖ్యాతివాదియును స్మర్యమాణరజతమునకుఁ బురోవర్తిశుక్తియం దారోపము చేత రజతవిశేషణక పురోవర్తివిశేష్యక మగు "ఇదం రజతమ్" అను విశిష్టజ్ఞానమే యాప్రవృత్తికిఁ గారణ మని యంగీకరింపవలయును. ఆవిశిష్టభ్రమజ్ఞానము నిర్విష యము గాదు. మఱి యే మనఁగా, సవిషయమే యగుచున్నది. మఱియు "నేదం రజతమ్" అనుజ్ఞానముచేత నారజతరూపవిషయమునకుఁ బురోవర్తిశుక్తియందే బాధ ప్రతీత మగుచున్నది. అందువలన నారజతముయొక్క బాధ్యత్వానుపపత్తిచేత రజతమునందు మిథ్యాత్వము సంభవించు చున్నది.

## [*] (50) అసత్ఖ్యాతివాదము. [*]

మఱియు శూన్యవాదు లగు మాధ్యమికులును గొందఱు తాంత్రికులును భ్రమస్థలమునందు నసత్ఖ్యాతి నంగీకరించుచున్నారు. అందు శూన్యవాదిమతము నందో జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయములను సర్వపదార్థములు నసత్తులై యున్నవి. అందువలన నసచ్ఛుక్తియం దసద్రజతమే "ఇదం రజతమ్" అను జ్ఞానమునకు విషయమై యున్నది.

మఱియుఁ దాంత్రికులమతమునం దైననో శుక్త్యాదివ్యావహారికపదార్థము లసత్తులు గావు. మఱి యే మనఁగా, ఆశుక్తియం దేరజతము ప్రతీత మగుచున్నదో ఆరజతమే యసత్తై యున్నది. అందువలన "ఇదం రజతమ్" అను జ్ఞాన మసద్రజత మునే విషయము చేయుచున్నది. మఱియు శుక్తిజ్ఞానానంతర మీపురుషున కీశుక్తి యందు నా కసద్రజతమే ప్రతీత మైన దని యనుభవ మగుచున్నది. ఆయనుభవము చేత నారజతమున కసత్త్వమే సిద్ధ మగుచున్నది. అందువలన భ్రమజ్ఞానమునకు విషయ మైన రజతాదిక మసత్తనియే యంగీకరింపవలయును.

ఈయసత్ఖ్యాతివాదిమతముగూడ సమీచీనము గాదు. ఏల యన, ఆరజ తము నసత్తని యంగీకరించినయెడల నసద్వస్తువుయొక్క ప్రత్యక్షజ్ఞానమే కలుగదు. అందువలన ఆరజతమును విషయము చేయునట్టి "ఇదం రజతమ్" అను జ్ఞానము ప్రత్యక్షరూపము కాక పోవలయును. ఒకవేళ నసద్వస్తువుగూడఁ బ్రత్యక్షజ్ఞానము నకు విషయ మనినయెడల, శశశృంగవంధ్యాపుత్రాద్యసత్పదార్థములయొక్కయుఁ బ్రత్యక్షజ్ఞాన మెల్లరికిఁ గలుగవలయును. అందువలన నారజతమున కసద్రూపత్వము సంభవింపదు. మఱియు నసత్తనునది యొకవస్తువా? కాదా? అందు, అసత్తొక

వస్తువైనచో దానికి అసత్త్వము సంభవింపదు. మఱియు నాయసత్తో కవస్తువు కాదనినచో ఆయసద్వస్తువుయొక్క జ్ఞానమే సంభవింపక పోవలయును. విషయము లేక జ్ఞానము కలుగుట లేదు. అందువలన భ్రమజ్ఞానమునకు విషయమైనరజతాదుల కసత్త్వము సంభవించుట లేదు.

### [*] (51) సత్ఖ్యాతి వాదము. [*]

మఱియుఁ గొందఱు శాస్త్రకారులు భ్రమస్థలమునందు సత్ఖ్యాతి నంగీకరించుచున్నారు. వారి యభిప్రాయ మేమనఁగా. శుక్త్యారంభకము లగు నవయవములతో రజతారంభకము లగు నవయవములు సర్వదా మిళితములై యున్నవి. ఎట్లు శుక్త్యవయవములు సత్యములై యున్నవో, అట్లు రజతావయవములును సత్యములే యగుచున్నవి. ఎప్పుడు దోషసహితచక్షురింద్రియమున కాయవయవములతో సంయోగసంబంధము కలుగుచున్నదో అప్పు డాయవయవములు సత్యరజతము నుత్పన్నము చేయుచున్నది. ఈకారణముచేతనే యారజతముయొక్క సత్యరూపత్వమును విషయము చేయు "సత్ ఇదం రజతమ్" అను ప్రత్యక్షము లోకులకుఁ గలుగుచున్నది. మఱియు శుక్తిజ్ఞానముచేత నాసత్యరజతమునకుఁ దనయవయవములయందు ధ్వంసము కలుగుచున్నది.

ఈ సత్ఖ్యాతివాదిమతముగూడ సమీచీనము గాదు. ఏల యన, శుక్తియందొకవేళ సత్యరజత ముత్పన్నమైనయెడల "నేదం రజతమ్" అను ననుభవముచేత నాశుక్తియందు రజతమునకు బాధ కలుగక పోవలయును. ఏకారణముచేత ననఁగా, సత్యవస్తువునకు బాధ కలుగుట లేదు. అట్లు గాక, సత్యవస్తువునకును బాధ యున్నదనినయెడల సత్య మగు శుక్తికిఁగూడ బాధ కలుగవలయును. రజతముయొక్క బాధ యైనను యెల్లరకును బ్రత్యక్షసిద్ధమై యున్నది. అందువలన నారజతమునందు సత్యరూపత్వము సంభవించుట లేదు. మఱియు "సత్ ఇదం రజతమ్" అను పూర్వోక్తప్రత్యక్ష మైనను రజతముయొక్క సత్తను విషయము చేయుట లేదు. మఱే మనఁగా, ఆరజతముయొక్క యధిష్ఠానసత్తనే విషయము చేయుచున్నది. అందువలనఁ బ్రత్యక్షబలముచేతను రజతమునకు సత్యరూపత్వము సిద్ధించుట లేదు.

మఱియు శుక్త్యవయవములతో రజతావయవములు సర్వదా మిళితములై యున్న వని చెప్పుటయుఁ గూడ నసంగతమై యున్నది. ఎట్లనఁగా, రజతోత్పత్తికిఁ బూర్వ మెట్లు శుక్త్యవయవములు ప్రత్యక్షముగాఁ బ్రతీతము లగుచున్నవో అట్లు రజతావయవములుగూడ ప్రత్యక్షముగాఁ బ్రతీతములు గావలయును. మఱియు

రజతము తైజసద్రవ్యమై యున్నది. ఆతైజసద్రవ్య మగ్నిసంయోగమువలన నాశ మొందుట లేదు. అందువలన నత్యంతాగ్నిసంయోగముచేత నాశుక్తి భస్మమై నపుడు లౌకికుల కారజతావయవములు ప్రాప్తములు కావలయును. ఎచ్చట గుంజా పుంజమునం దగ్నిభ్రమ కలుగుచున్నదో యచ్చట నానత్యాగ్నిచేత నాగుంజాపుంజ మునకు నాశము కావలయును. ఇత్యాద్యనేకవిధదూషణములు సత్ఖ్యాతివాదమునకుఁ బ్రాప్తము లగుచున్నవి. అందువలన సత్ఖ్యాతివాద మత్యంతాసంగతమై యున్నది.

### [*] (52) ఆత్మఖ్యాతివాదము. [*]

మఱియు క్షణికవిజ్ఞానవాదు లగు యోగాచార్యులైననో, భ్రమస్థలమం దాత్మఖ్యాతి నంగీకరించుచున్నారు. వారియభిప్రాయ మే మనఁగా, శరీరాంతఃస్థిత మగు నేక్షణికవిజ్ఞాన మున్నదో, అదియే యాత్మయై యున్నది. ఆవిజ్ఞానాత్మకన్నను భిన్నముగా నేదైన నొకపదార్థముగూడ అంతర్బాహ్యములయందు లేదు. మఱి యే మనఁగా, సర్వపదార్థములు నావిజ్ఞానముయొక్కయాకారవిశేషములే యగుచున్నవి. అందువలన శుక్తియం దేరజతప్రతీతి యున్నదో అదియును ఆంతరవిజ్ఞానముయొక్క ధర్మమే యగుచున్నది. ఆయాంతరరజతమే దోషబలమువలన బాహ్యమువలెఁ బ్రతీత మగుచున్నది. మఱియు "నేదం రజతమ్" అను జ్ఞానమువలన నారజతము నకు స్వరూపముచేత బాధ కలుగుట లేదు. మఱే మనఁగా, నాంతరరజతమునందు ఇదంతారూపబాహ్యత్వమునకే బాధ కలుగుచున్నది.

ఈయాత్మఖ్యాతివాదిమతముగూడ సమీచీనము గాదు. ఎట్లనఁగా, రజతాదులయొక్కయాంతరత్వమం దొకప్రమాణమును యుక్తియును లేదు. సర్వలౌకికులకును జక్షురాదీంద్రియములచేత నారజతాదిపదార్థములు బాహ్యదేశమందే ప్రతీతము లగుచున్నవి. కేవలసుఖదుఃఖాదికమే యాంతరప్రతీతమై యున్నది. అట్లుగాక సుఖదుఃఖాదులవలె నారజతాదికమును ఆంతర మైనయెడలఁ, జక్షురాదీంద్రియములు లేకున్నను ఆరజతాదులయొక్కప్రత్యక్షము కావలయును. అట్లగుట లేదు. కావున నారజతాదికము బాహ్య మనియే యంగీకరింపవలయును.

మఱియు 'ఇదంత యనునది సన్నిహితత్వమై యున్నది. ఆయిదంతకు "నేదం రజతమ్" అను జ్ఞానముచేత నిషేధ మంగీకరించినయెడల నారజతమునందు దూరతారూపాసన్నిహితత్వమే ప్రాప్త మగును. అత్యంతసన్నిహితవిజ్ఞానరూపత్వము ప్రాప్తము గాదు. అందువలన "నేదం రజతమ్" అను జ్ఞాన మారజతముయొక్క

యిదంతామాత్రము నిషేధించుచున్న దను నీవిజ్ఞానవాదికథనము మిథ్యయే యగుచున్నది. ఈవిజ్ఞానవాదిసుతముయొక్క విస్తరఖండనము న్యాయప్రకాశముయొక్క ద్వితీయపరిచ్ఛేదమునందుఁ జెప్పఁబడియున్నది. దాని నచ్చటఁ దెలియనగును.

## [*] (53) అన్యథాఖ్యాతివాదము. [*]

మఱియు నైయాయికులైననో భ్రమస్థలమునం దన్యథాఖ్యాతి నంగీకరించుచున్నారు. వారియభిప్రాయ మే మనఁగా. "ఇదం రజతమ్" అను భ్రమజ్ఞానమునకు విషయ మగు నేరజత మున్నదో, ఆరజతము పురోవర్తి యగు శుక్తియందు లేదు. మఱి యే మనఁగా, నారజతము కాంతాకరహట్టాదిరూపదేశాంతరమందే యున్నది. ఆసత్యరజతానుభవజన్యసంస్కారసహితపురుషునియొక్క దోషయుక్తచక్షురింద్రియమున కెప్పు డారజతసదృశ మగు పురోవర్తిశుక్తితో సంయోగసంబంధము కలుగుచున్నదో, అప్పుడు ఆసాదృశ్యదర్శనముచేత నుద్బుద్ధ మైనసంస్కారమువలన నాపురుషునకు దేశాంతరవర్తిరజతముయొక్క స్మృతి కలుగుచున్నది. తదనంతరము దోషవశమువలనఁ బురోవర్తిశుక్తియే యాదేశాంతరీయరజతరూపముచేతఁ బ్రత్యక్షమగుచున్నది. అనఁగా నాస్మృతిజ్ఞానమునకు విషయభూత మైన రజతముయొక్క రజతత్వధర్మము పురోవర్తిశుక్తియందు "ఇదం రజతమ్" అని ప్రత్యక్షముగాఁ బ్రతీత మగుచున్నది. దీనినే యన్యథాఖ్యాతి యందురు. అచ్చట, అన్యవస్తువున కన్యరూపప్రతీతి యన్యథాఖ్యాతి యనఁబడును. ఉదా—పురోవర్తిశుక్తి రజతరూపముగాను, బురోవర్తిరజ్జువు సర్పరూపముగాను బ్రతీత మగుచున్నది. ఈప్రకారముగా భ్రాంతిజ్ఞానముచేతఁ బురోవర్తి యగుశుక్త్యాదులయందుఁ బ్రాప్త మైన యేరజతాదిక మున్నదో, దానికి "నేదం రజతమ్" అను జ్ఞానముచేత నిషేధమును సంభవించుచున్నది.

శంక:—దేశాంతరవర్తిరజతమునకుఁ బురోవర్తిశుక్తియందు భాన మంగీకరించినయెడల, "ఇదం రజతమ్" అను భ్రమజ్ఞానముయొక్క రజతాంశమునందుఁ బ్రత్యక్షరూపత్వము సంభవింపకపోవలయును. ఎట్లనఁగా, విశిష్టప్రత్యక్షమునందు విశేషణవిశేష్యములరెంటితో నింద్రియసన్నికర్ష మే (సంబంధమే) కారణమై యున్నది. ఉదా—"దండీపురుషః" అను విశిష్టప్రత్యక్షమునందు, దండరూపవిశేషణముతోను బురుషరూపవిశేష్యముతోను జక్షురింద్రియముయొక్క సంయోగసంబంధము కారణమై యున్నది. ఈలాగుననే పురోవర్తిశుక్తిరూపవిశేష్యముతో నైననో, చక్షురింద్రియమునకు సంయోగసంబంధ మున్నది. అయినను దేశాంతరవర్తిరజతరూప

విశేషణముతో నాచక్షురింద్రియమున కేసంబంధమును లేదు. అందువలన "ఇదం రజతమ్" అను భ్రమజ్ఞానముయొక్క రజతాంశమునందుఁ బ్రత్యక్షరూపత్వము లేక పోవలయును. అయినను నైయాయికు లగు మీచేత "ఇదం రజతమ్" అను భ్రమజ్ఞానమున నారజతాంశమునందుఁ బ్రత్యక్షత్వ మంగీకరింపఁబడి యున్నది.

సమాధానము:—విశిష్టప్రత్యక్షమునందు విశేషణముతో నింద్రియసన్నికర్షము కారణ మని మే మంగీకరించుట లేదు. ఇఁక నే మనఁగా, విశేష్యముతో నింద్రియసన్నికర్షమును విశేషణముయొక్క స్మృతిజ్ఞానమును విశేషణవిశేష్యములరెంటియొక్క యసంబంధాగ్రహణమును ఇత్యాదిసామగ్రులనే మేము విశిష్టప్రత్యక్షమునకుఁ గారణ మని యంగీకరించుచున్నాము. ఆకారణసామగ్రి భ్రమస్థలమునందు విద్యమానమయ్యే యున్నవి. పురోవర్తిశుక్తిరూపవిశేష్యముతోఁ జక్షురింద్రియమునకు సంయోగసంబంధమును రజతరూపవిశేషణముయొక్క స్మృతిరూపజ్ఞానమును దోషవశమువలన నావిశేషణవిశేష్యములరెంటియొక్క యసంబంధాగ్రహణము నున్నవి. ఈకారణసామగ్రు లుండఁగా "ఇదం రజతమ్" అను రజతవిషయకభ్రమజ్ఞానమునందుఁ బ్రత్యక్షరూపత్వము సంభవించుచున్నది. అందువలన నారజతరూపవిశేషణముతోఁ జక్షురింద్రియసన్నికర్షమున కేప్రయోజనమును లేదు. ఒకవేళ నావిశేషణముతో నింద్రియసన్నికర్షము విశిష్టప్రత్యక్షమునందు నియతముగాఁ గారణ మనినయెడల "సోఽయం దేవదత్తః" అను ప్రత్యభిజ్ఞాజ్ఞానమునకుఁ బ్రత్యక్షరూపత్వము లేక పోవలయును. ఏల యన, తద్దేశకాలవిశిష్టత్వరూప మయిన తత్త అనువిశేషణ మతీత మగుటవలన నావిశేషణముతోఁ జక్షురింద్రియమునకు సన్నికర్షమే సంభవించుట లేదు. మఱియు నుక్తరీతిగా నావిశేషణముయొక్క స్మృతిజ్ఞానము విశిష్టప్రత్యక్షమునందుఁ గారణ మని యంగీకరించినయెడల, తత్తారూపవిశేషణముయొక్క స్మరణజ్ఞానమును దేవదత్తపురుషునితోఁ జక్షురింద్రియముయొక్క సంయోగసంబంధము నున్నది. అందువలన నాప్రత్యభిజ్ఞాజ్ఞానమునందుఁ బ్రత్యక్షరూపత్వము సంభవించుచున్నది.

శంక:—"సో ఽయం దేవదత్తః" అనుజ్ఞానముయొక్క దేవదత్తనామపురుషాంశమునందే ప్రత్యక్షరూపత్వ మున్నది. తత్తాంశమునందుఁ బ్రత్యక్షరూపత్వము లేదు. మఱి యే మనఁగా, స్మృతిరూపత్వ మున్నది. మఱియు స్మృతిజ్ఞానమునం దింద్రియార్థములయొక్క సన్నికర్ష మపేక్షింపఁబడుట లేదు.

సమాధానము:—"సో ఽయం దేవదత్తః" అనుజ్ఞానముయొక్క తత్తాంశమందు స్మృతిరూపత్వ మంగీకరించినయెడల నొకయేజ్ఞానమునందుఁ బ్రత్యక్షత్వస్మృతి

త్వము లను రెండుధర్మములకు సాంకర్య మగును. ఆసాంకర్యదోషము జాతికి బాధక మగుచున్నది. అందువలనఁ బ్రత్యక్షత్వస్మృతిత్వము లను రెండుధర్మముల యందు జాతిరూపత్వమే సంభవింపక పోవలయును. అందువలన “ సో ఽయం దేవదత్తః ” అనుజ్ఞానముయొక్క తత్తాంశమునందును బ్రత్యక్షరూపత్వమే యంగీకరింపవలయును. ఈప్రకారముగా నింద్రియసన్నికర్షము లేకయే యెట్లు తత్తాంశము ప్రత్యక్ష మగుచున్నదో అట్లింద్రియసన్నికర్షము లేకయే యాదేశాంతరవర్తి రజతమునకుఁ బురోవర్తిశుక్తియందు “ ఇదం రజతమ్ ” అను విశిష్టభ్రమ ప్రత్యక్ష మనుట సంభవించుచున్నది.

లేక, ఆదేశాంతరవర్తి రజతముతోఁ జక్షురింద్రియమునకు రజతవిషయకస్మృతిజ్ఞానరూపాలౌకికసంబంధ మున్నది. మఱియుఁ బురోవర్తి శుక్తితోఁ జక్షురింద్రియమునకు సంయోగరూపలౌకికసంబంధ మున్నది. అందువలన “ ఇదం రజతమ్ ” అను భ్రమజ్ఞానముయొక్క రజతాంశమునందుఁ బ్రత్యక్షరూపత్వము సంభవించుచున్నది. అచ్చట సంయోగము, సంయుక్తసమవాయము, సంయుక్తసమవేతసమవాయము, సమవాయము, సమవేతసమవాయము, విశేషణత అను నాఱుసన్నికర్షములను నైయాయికులు లౌకికసన్నికర్షము లని చెప్పుచున్నారు. మఱియు సామాన్యలక్షణ, జ్ఞానలక్షణ, యోగజధర్మలక్షణ, అను త్రివిధసన్నికర్షము లలౌకికసన్నికర్షము లని చెప్పుచున్నారు. ఈద్వివిధసన్నికర్షములయొక్కనిరూపణము న్యాయప్రకాశము షష్ఠపరిచ్ఛేదమునఁ బ్రత్యక్షనిరూపణమందు విస్తరముగాఁ జేయఁబడియున్నది. దాని నచ్చటఁ దెలియవలయును. ఈరీతిగా “ ఇదం రజతమ్ ” అను భ్రమజ్ఞాన మన్యథాఖ్యాతిరూపమే యగుచున్నది. అందువలన నాభ్రమజ్ఞానమునకు విషయ మైన రజతమునకు మిథ్యాత్వము సంభవింపదు.

ఈ యన్యథాఖ్యాతివాది నైయాయికమతముగూడ సమీచీనము గాదు. ఏల యన, “ ఇదం రజతమ్ ” అను భ్రమజ్ఞానమునకు విషయమైన రజతమునకు దేశాంతరస్థితి యంగీకరించినయెడల నారజతముతోఁ జక్షురింద్రియమునకు సంయోగరూపసన్నికర్షము సంభవింపదు. మఱియు నింద్రియాసంబద్ధ మగువస్తువు ప్రత్యక్షము గాదు. అందువలన నారజతజ్ఞానమునకుఁ బ్రత్యక్షరూపత్వమే కలుగక పోవలయును. “ ఇదం రజతమ్ ” అను భ్రమజ్ఞానానంతరము “ రజతం సాక్షాత్కరోమి ” అను ననుభవ మెల్లరకును గలుగుచున్నది. ఆయనుభవముచేత రజతజ్ఞానమునకుఁ బ్రత్యక్షరూపత్వమే సిద్ధ మగుచున్నది.

మఱియు నైయాయికులచేత విశేషణముయొక్క స్మృతిజ్ఞానమును విశేష్యముతో నింద్రియముయొక్క సన్నికర్షమును విశిష్టప్రత్యక్షమునకు సామగ్రు లని చెప్పఁబడినవి. అదియును సంభవించుట లేదు. ఏల యన, ఆసామగ్రికిని "దండీపురుషః" ఇత్యాది సర్వవిశిష్టప్రత్యక్షములయందుఁ గారణత్వము చూడఁబడుట లేదు. మఱి యే మనఁగా, విశేషణవిశేష్యముల రెంటితోఁ గల యింద్రియసన్నికర్షమునకే కారణత్వము చూడఁబడుచున్నది. మఱియు "సోయం దేవదత్తః" అను ప్రత్యభిజ్ఞాజ్ఞానము గూడఁ గేవలదేవదత్తాంశమునందే ప్రత్యక్షరూపమై యున్నది. తత్తాంశమునందుఁ బ్రత్యక్షరూప మగుట లేదు. మఱి యే మనఁగా, ఆతత్తాంశమునందు స్మృతిరూపమే యగుచున్నది. "సో உయం దేవదత్తః" అను ప్రత్యభిజ్ఞాప్రత్యక్షమునందుఁ దత్తాంశమునకు స్మృతిరూపత్వ మంగీకరించుటయందు నైయాయికులచేతఁ బ్రత్యక్షత్వస్మృతిత్వము లను రెండుధర్మములయొక్క జాతిత్వమునకు బాధకము సాంకర్యదోష మని చెప్పఁబడియున్నది. అదియు నసంగతము. ఎట్లనఁగా, వేదాంతసిద్ధాంతమునందవిద్యకంటె నతిరిక్తముగా నొకజడ మగుజాతి కంగీకారమే లేదు. మఱే మనఁగా, నాయవిద్యయే ఆయాకార్యములయందనుగతమై ఆయాజాతిరూపములచేతఁ బ్రతీత మగుచున్నది. అందువలన సిద్ధాంతమునందాజాతిసాంకర్యమునకు దోషరూపత్వము సంభవింపదు.

మఱియు నైయాయికులచేత దేశాంతరవర్తి రజతముతోఁ జక్షురింద్రియమునకే జ్ఞానరూపసన్నికర్ష మంగీకరింపఁబడినదో అదియు నసంగతము. ఏల యన, జ్ఞానమునకుఁ గూడఁ జక్షువుయొక్క సన్నికర్ష మున్న దనినయెడల, ఎచ్చట నీపురుషునకుఁ బర్వతమునందు వహ్న్యనుమితిజ్ఞానము కలుగుచున్నదో అచ్చటను ఆవహ్నియొక్క ప్రత్యక్షజ్ఞానమే కలుగవలయును. ఎట్లనఁగా "పర్వతో వహ్నిమాన్" అను జ్ఞానమునందు పర్వతమో విశేష్యమై యున్నది. వహ్ని విశేషణమై యున్నది. అచ్చటఁ బర్వతముతోఁ జక్షురింద్రియమునకు సంయోగసంబంధ మున్నది. మఱియు నావహ్నితో వహ్నియొక్క స్మృతిజ్ఞానరూపసంబంధ మున్నది. ఆయింద్రియార్థములయొక్క సన్నికర్షజన్య మగుటవలన, నావహ్నిజ్ఞానము ప్రత్యక్షరూపమే యగును. దానిచేత ననుమానప్రమాణమునకే లోపము కలుగును. అందువలన నాజ్ఞానమునకింద్రియసన్నికర్షము సంభవింపదు. మఱియు "ఇదం రజతమ్" అను భ్రమజ్ఞానమునకు విషయమైనరజతమునకు దేశాంతరమందు స్థితి నంగీకరించినయెడల నారజతార్థిపురుషునకు దేశాంతరమందే ప్రవృత్తి కావలయును. పురోవర్తియందుఁ బ్రవృత్తి కాఁగూడదు. ఏల యన, జ్ఞాన మెచ్చటఁ దాను విషయ మగుచున్నదో అచ్చ

టనే పురుషునకు నియమముగాఁ బ్రవృత్తి కలుగుచున్నది. అందువలన దేశాంతరస్థిత రజతము పురోవర్తిసుక్తియందుఁ బ్రతీత మగుచున్న దను నీయన్యథాఖ్యాతివాది నైయాయికమత మత్యంతాసంగతమై యున్నది.

## [*] (54) అనిర్వచనీయఖ్యాతివాదము. [*]

ఈప్రకారముగా భ్రమస్థలమందు, అఖ్యాతి అసత్ఖ్యాతి సత్ఖ్యాతి ఆత్మఖ్యాతి అన్యథాఖ్యాతి అను పూర్వోక్తపంచవిధఖ్యాతులు సంభవింప కుండుటవలన నాఱవది యగు ననిర్వచనీయఖ్యాతియే యంగీకరింపవలయును. అనఁగా నాభ్రమకాలమున శుక్తియం దనిర్వచనీయరజత ముత్పన్న మగుచున్న దని యంగీకరింపవలయును.

శంక:—లోకప్రసిద్ధరజతముయొక్క యుత్పత్తి యవయవాదిసామగ్రులచేతఁ గలుగుచున్నది. ఆ యవయవాదిసామగ్రి శుక్తిదేశమందు లేనందువలన నాశుక్తియందు రజతోత్పత్తి సంభవింపదు. పుణ్యపాపరూపాదృష్టమే యారజతోత్పాదకసామగ్రి యని చెప్పినయెడల నదియును సంభవింపదు. ఏల యన, ఆయవయవాదిదృష్టసామగ్రి లేక యాయదృష్ట మొకకార్యోత్పత్తియుఁ జేయుట లేదు. అట్లు గాక దృష్టసామగ్రి లేకయే యాయదృష్ట మొకకార్యోత్పత్తిని జేయు నన్నచో మృత్తికాకులాలాదిదృష్టసామగ్రులు లేకయే యదృష్టమువలన ఘటాద్యుత్పత్తి కావలయును.

సమాధానము:—ప్రసిద్ధరజతోత్పాదక మగు నేయవయవాదిరూపలౌకికసామగ్రు లున్నవో, యాలౌకికసామగ్రులు భ్రమకు విషయ మైన రజతోత్పత్తిని జేయుట లేదు. మఱి యే మనఁగా, నాలౌకికసామగ్రులకన్నను విలక్షణసామగ్రియే యారజతోత్పత్తిని జేయుచున్నది. అది యెట్లనఁగా, సత్యరజతముయొక్క యనుభవజన్యసంస్కారము గల పురుషునియొక్క చక్షురింద్రియమున కెప్పుడు పురోవర్తిశుక్తితో సంయోగసంబంధము కలుగుచున్నదో, అప్పుడు చక్షుర్ద్వారమున బాహ్యమునకుఁ బోయిన యంతఃకరణవృత్తి యాశుక్తియొక్క యిదమాకారముగాను జాకచక్యాకారముగాను ఉత్పన్న మగుచున్నది. ఆచాకచక్యరూపసాదృశ్యదర్శనమువలనఁ బూర్వదృష్టరజతసంస్కార ముద్బుద్ధ మగుచున్నది. ఆయుద్బుద్ధసంస్కారరూపదోషము సహకారిగాఁ గలిగినట్టి యా యిదమంశావచ్ఛిన్న చైతన్యమునం దుండునదియును శుక్తియొక్క శుక్తిత్వనీలపృష్ఠత్వత్రికోణత్వాదివిశేషాంశము నాచ్ఛాదించునదియు నగు నేయవిద్య యున్నదో ఆయవిద్య క్షోభమును బొందినదై రజతాకారపరిణామమును ఆరజతవిషయకజ్ఞానాకారపరిణామమును బొందుచున్నది. ఇదియే

యనిర్వాచనీయఖ్యాతి యనఁబడును. ఈప్రకార మగురీతి రజ్జుసర్పాదిసర్వభ్రమస్థలములయందుఁ దెలియవలయును.

శంక:—ఆభ్రమస్థలమం దాయవిద్య పూర్వోక్తరీతిగా రజతాదిరూపార్థాకారపరిణామ మైననో పొందుచున్నది. అయిన నాయవిద్యకు జ్ఞానాకారపరిణామ మంగీకరించుట యసంగతమై యున్నది. ఎట్లనఁగా నాయవిద్యకు జ్ఞానాకారపరిణామ మంగీకరించుటకు నొకప్రయోజనము లేదు. మఱియుఁ బ్రయోజనము లేక యొకయర్థము నంగీకరించుట వ్యర్థమే యగును. మఱియు "ఇదం రజతమ్" అను వ్యవహారముకొఱ కాయవిద్యకు రజతాకారవృత్తి యవశ్య మంగీకరింపవలయు నని చెప్పినయెడల నదియును సంభవింపదు. ఏల యన, సుఖదుఃఖాదులవలె యాప్రాతిభాసికరజతమును సాక్షిచైతన్యమునందే యధ్యస్తమై యున్నది. అందువలన నారజతాకారవృత్తి లేకయే ఆసాక్షిచైతన్యముచేత రజతవిషయకవ్యవహారము సిద్ధించుచున్నది. ఆవ్యవహారముకొఱకు రజతాకారావిద్యావృత్తి యంగీకరించుట నిష్ఫలమై యున్నది.

మఱియు రజతముయొక్కయపరోక్షత్వసిద్ధికొఱకే యాయవిద్యావృత్తి నంగీకరింపవలయు నని చెప్పినయెడల నదియును సంభవింపదు. ఏల యనఁగా నాయవిద్యావృత్తి లేక పోయినను అనావృతసాక్షిచైతన్యముయొక్కతాదాత్మ్యమువలన సుఖదుఃఖాదులవలె నారజతాపరోక్షత్వము సంభవించుచున్నది. అందువలన రజతాపరోక్షత్వముకొఱకును ఆవృత్తి నంగీకరించుట నిష్ఫలమై యున్నది.

మఱియు, రజతాకారావిద్యావృత్తి నంగీకరింపనియెడల నారజతముయొక్కస్మరణమే కాలాంతరమునందుఁ గాక పోవలయును. ఏల యనఁగా, అనుభవముయొక్కనాశజన్యసంస్కారముచేతనే స్మరణజ్ఞానము కలుగుచున్నది. మఱియు నిత్యమగుటవలన సాక్షిచైతన్యరూపానుభవమునకు నాశము సంభవించుట లేదు. అందువలన నారజతాకారావిద్యావృత్తి నంగీకరించుటచేత నావృత్తి నాశము కాఁగా నావృత్త్యుపహితత్వరూపముచేత సాక్షికిని నాశము కలుగుటవలన, రజతవిషయకసంస్కారోత్పత్తియును ఆసంస్కారముచేత స్మృతిజ్ఞానోత్పత్తియును సంభవించుచున్నది. అందువలన రజతస్మృతికి జనక మగుసంస్కారముయొక్కయుత్పత్తికొఱకు నారజతాకారావిద్యావృత్తి యవశ్య మంగీకరింపవలయును. అని యిట్లు చెప్పుటయుఁ గూడ సంభవించుట లేదు. ఏల యన, ఆరజతభ్రమమునకుఁ బూర్వ ముత్పన్న మైన యేయిదమాకారవృత్తి యున్నదో యాయిదమాకారవృత్తియొక్కనాశముచేతనే ఆవృ

త్త్యుపహితత్వరూపముచేత సాక్షికి నాశము కలుగుటవలన నారజతవిషయకసంస్కారోత్పత్తియును ఆసంస్కారమువలన స్మృత్యుత్పత్తియును సంభవించుచున్నది.

లేక, సుఖదుఃఖాదిరూపవిషయముయొక్క నాశముచేత నాసుఖదుఃఖాద్యుపహితత్వరూపమువలన నాసాక్షికిని నాశ మగుటచేత నెట్లాసుఖదుఃఖాదివిషయకసంస్కారోత్పత్తియును స్మృతిజ్ఞానోత్పత్తియును గలుగుచున్నదో, అట్లు రజతరూపవిషయముయొక్క నాశముచేతనే యారజతోపహితత్వరూపముచేత సాక్షికిని నాశము కలుగుటవలన రజతవిషయకసంస్కారోత్పత్తియును స్మృతిజ్ఞానోత్పత్తియును సంభవించుచున్నది. అందువలన నారజతవిషయకస్మృతికి జనక మగు సంస్కారోత్పత్తికొఱకు కారజతాకారావిద్యావృత్తి నంగీకరించుట నిష్ఫలమై యున్నది.

సమాధానము:—ఆరజతస్మృతికి జనక మగు నేసంస్కార మున్నదో ఆసంస్కారోత్పత్తికొఱకే రజతాకారావిద్యావృత్తి యంగీకార్యమై యున్నది. ఎట్లనఁగా, నారజతానుభవరూప మైన సాక్షిచైతన్యము ఉత్పత్తివినాశరహిత మగుటవలన నిత్యమై యున్నది. అందువలన నాసాక్షిచైతన్యమునకు స్వరూపచేతనో నాశము సంభవింపదు. మఱియు రజతాకారావిద్యావృత్తి నంగీకరించినయెడల వృత్తినాశముచేత నావృత్త్యుపహితత్వరూపమువలన సాక్షికిని నాశము సంభవించును. దానివలన రజతవిషయకసంస్కారోత్పత్తియును సంస్కారముచేత స్మృతిజ్ఞానోత్పత్తియును గలుగుచున్నది. అందువలన నారజతస్మృతికి జనక మగు సంస్కారోత్పత్తికొఱకు కారజతాకారావిద్యావృత్తి నవశ్య మంగీకరింపవలయును. మఱియు నావాదిచేత నిదమాకారవృత్తినాశమువలన రజతస్మృతికి జనక మైన యేసంస్కారోత్పత్తి చెప్పఁబడినదో అదియు నసంగతము. ఏల యనఁగా ననుభవము, సంస్కారము, స్మృతి అను మూటికిని సమానవస్తువిషయకత్వరూపముచేతనే పరస్పరకార్యకారణభావ మున్నది. అన్యవస్తువిషయకానుభవమువలన నన్యవస్తువిషయకసంస్కార మైనను స్మృతి యైనను గలుగదు. ఒకవేళ అట్లు కలిగినయెడల ఘటవిషయకానుభవముచేతఁ బటవిషయకసంస్కారమును స్మృతియును గలుగవలయును. అందువలన నిదమాకారవృత్తినాశముచేత రజతవిషయకసంస్కారోత్పత్తియును స్మృత్యుత్పత్తియును సంభవింపదు.

మఱియు నావాదిచేతఁ బూర్వము రజతరూపవిషయముయొక్క నాశమువలన నేరజతసంస్కారోత్పత్తి చెప్పఁబడినదో అదియుఁగూడ నసంగతము. ఎట్లనఁగా, లోకమునందు ఘటాదివిషయములయొక్క నాశమువలన ఘటాదులయొక్క సం

స్కారోత్పత్తి చూడఁబడుట లేదు. మఱి యే మనఁగా, ఘటాదు లుండునపుడే నా ఘటాదులయొక్కజ్ఞాననాశమువలన సంస్కారోత్పత్తి చూడఁబడుచున్నది. అందు వలన సర్వత్ర జ్ఞాననాశముచేతనే సంస్కారోత్పత్తి యంగీకరింపవలయును. మఱియు సుఖదుఃఖాదులయం దాసుఖదుఃఖాదిగోచరవిషయనాశముచేతనే సంస్కారోత్పత్తి చూడఁబడుచున్న దని చెప్పినను అదియును ఘటిల్లదు. ఏలాగున ననఁగా, అచ్చటను సంస్కారోత్పత్తికొఱకు సుఖదుఃఖాద్యాకారవృత్తి యంగీకరింపఁబడుచున్నది. యద్యపి, అంతఃకరణమును తద్ధర్మము లైన సుఖదుఃఖాదులును వృత్తి లేకయే సాక్షిభాస్యములు కావున నాసుఖాదులకు నాశము గలుగఁగాఁ దదుపహితసాక్షియొక్కనాశమువలన సంస్కారోత్పత్తి యగుచున్నది. తథాపి యవిద్యాకార్య మైన బాహ్యఘటాదిపదార్థములయొక్కసంస్కారోత్పత్తియో ఆఘటాద్యాకారవృత్తినాశముచేతనే చూడఁబడుచున్నది. ఈలాగుననే యాప్రాతిభాసికరజతమును అవిద్యాకార్యమై యున్నది. అందువలన నారజతాకారవృత్తియొక్కనాశముచేతనే రజతసంస్కారోత్పత్తియును అంగీకరింపవలయును. ఒకవేళ నట్లంగీకరింపనియెడల నాచార్యులయొక్కగ్రంథములయందు స్వప్నపదార్థాకారవృత్తియును జాగ్రత్స్వప్నములయం దహమాకారవృత్తియును అంగీకరింపఁబడి యున్నది. ఆసర్వము నసంగతమగును. ఏల యన, వృత్తి లేకయే కేవలసాక్షిచేత నాపదార్థములయొక్కప్రకాశము సంభవించుచున్నది. అందువలన నారజతస్మృతికి హేతుభూత మగు సంస్కారోత్పత్తికొఱ కాయనిర్వచనీయరజతాకారావిద్యావృత్తి నవశ్య మంగీకరింపవలయును. ఇచ్చటఁ గొందఱు గ్రంథకారులు చెప్పున దే మనఁగా, ఘటాకారవృత్త్యుపహితసాక్షిచైతన్యమునం దేఘటతాదాత్మ్య మున్నదో అదియే యెట్లు ఆఘటనిష్ఠాపరోక్షత్వమై యున్నదో, అట్లాప్రాతిభాసికరజతనిష్ఠాపరోక్షత్వసిద్ధికొఱ కారజతాకారావిద్యావృత్తి నవశ్య మంగీకరింపవలయును. ఆవృత్తి లేక రజతమునం దపరోక్షత్వమే సంభవింపదు.

మఱియుఁ గొంద ఱాచార్యులు చెప్పున దే మనఁగా, ఏయేవ్యవహారము కాదాచిత్క (ఒకప్పు డగునది) మగునో ఆయావ్యవహారము కాదాచిత్కజ్ఞానముచేతనే సాధ్యమై యున్నది, ఎట్లు "అయం ఘటః" అను కాదాచిత్కవ్యవహారము కాదాచిత్కఘటజ్ఞానముచేత సాధ్యమై యున్నదో అట్లు. "ఇదం రజతమ్" అను వ్యవహారమును గాదాచిత్క మగుటవలన, నారజతవిషయకకాదాచిత్క మైన జ్ఞానముచేతనే సాధ్య మగును. అచ్చట సాక్షిరూపజ్ఞానమునం దైననో, కాదాచిత్కత్వము సంభవింపదు. మ ఱే మనఁగా. నవిద్యావృత్తిరూపజ్ఞానమునందే కాదాచిత్క

త్వము సంభవించుచున్నది. అందువలన నారజతవ్యవహారముయొక్క కాదాచిత్కత్వ సిద్ధికొఱకు కారజతగోచరావిద్యావృత్తి నవశ్య మంగీకరింపవలయును. అట్లు గాక, సాక్షిరూపనిత్యజ్ఞానముచేతను గాదాచిత్కవ్యవహారము కలుగు నన్నచో, ఘటాది పదార్థవిషయక కాదాచిత్కవ్యవహారమును ఆసాక్షిచైతన్యముచేతనే సిద్ధము కావల యును. అందువలన ఘటాద్యాకారాంతఃకరణవృత్తియును సిద్ధము గాక పోవలయును.

మఱియుఁ గొందఱ ఆచార్యులచేతఁ బ్రాతిభాసికరజతాద్యాకారావిద్యా వృత్తి ఖండన చేయఁబడి యున్నది. అది ప్రౌఢివాదముచేత నని దెలియవలయును. తనబుద్ధియొక్క యుత్కర్షమును దెలియఁబఱచుట ప్రౌఢివాద మనఁబడును. అందు వలనఁ బూర్వోక్తరీతిగా భ్రమస్థలమునం దాయవిద్యయే రజతాదివిషయాకారము గాను తద్జ్ఞానకారముగాను బరిణామమును బొందుచున్న దను నీయర్థము నిర్దోష ముగా సిద్ధించుచున్నది.

శంక:—భ్రమస్థలమున శుక్తియం దవిద్యవలన రజత ముత్పన్న మైనను అగుఁగాక. ఆరజతమునందు మిథ్యాత్వ మెట్లు ?

సమాధానము:—లోకమునందును ఎట్లైంద్రజాలికుని మాయారచిత పదార్థములు మిథ్యగానే చూడఁబడుచున్నవో అట్లవిద్యాకార్య మగుటవలన నా రజతముగూడ మిథ్యయే యగును. అట్టి రజతాదులయొక్క మిథ్యాత్వమునందుఁ బూర్వోక్తదృష్టార్థాపత్తియే ప్రమాణమై యున్నది.

## [*] (55) శ్రు తా ర్థా ప త్తి ని రూ ప ణ ము. [*]

ఇఁక ద్వితీయ మగు శ్రుతార్థాపత్తి నిరూపింపఁబడుచున్నది. "తరతిశోక మాత్మవిత్" — భావము॥ ఆత్మజ్ఞానము గలపురుషుఁడు శోకము నాశము చేయు చున్నాఁడు. ఇచ్చట శోకశబ్దముచేతఁ బ్రమాతృత్వకర్తృత్వాదిసర్వబంధములను గ్రహింపవలయును. ఈశ్రుతివచనముచే బంధమునం దాత్మజ్ఞానముచేత నివర్త్యత్వ మేది శ్రుత మగుచున్నదో అజ్ఞాననివర్త్యత్వము, బంధము సత్య మని యంగీకరించుట యందు సంభవింపదు. ఏల యన, సత్యవస్తువునకు జ్ఞానముచేత నివృత్తి కలుగదు. మఱే మనఁగాఁ గ్రియచేతనే నివృత్తి కలుగుచున్నది. ఉదా—ఘటాదులకు ముద్గర ప్రహారాదిరూపక్రియచేతనే నివృత్తి గలుగుచున్నది. మిథ్యావస్తువుయొక్క నివృత్తి జ్ఞానముచేతనే యగుచున్నది. ఉదా—రజ్జుసర్పముయొక్క నివృత్తి రజ్జుజ్ఞానముచేత నగుచున్నది. అందువలన నాత్మజ్ఞానముచేత నివర్త్యత్వ మాబంధమునకు మిథ్యా

త్వము లేక యనుపపన్నమై బంధముయొక్కమిథ్యాత్వమును గల్పించుచున్నది. దీనినే శ్రుతార్థాపత్తి యందురు.

శంక:—సత్యవస్తువుయొక్కనివృత్తి జ్ఞానముచేత నగుట లేదని మీరు చెప్పినది యయుక్తమై యున్నది. ఏల యన, శ్రీరామకృతసేతుదర్శనముచేత సత్యమగుపాపముయొక్కనివృత్తి శాస్త్రప్రమాణములచేతఁ దెలియఁబడుచున్నది. మఱియు గరుడధ్యానముచేత సత్య మగు విషముయొక్కనివృత్తియును జూడఁబడుచున్నది. ఈలాగుననే సత్యబంధముగూడ నాత్మజ్ఞానముచేత నేల నివృత్తము గాఁగూడదు. అందువలన బంధమునకు మిథ్యాత్వము లేకయు, జ్ఞాననివర్త్యత్వము సంభవించుచున్నది.

సమాధానము:—సత్యబంధము జ్ఞానముచే నివృత్త మగు ననుదానియందు మీచేత సేతుదర్శనరూపమును గరుడధ్యానరూపము నైన నేదృష్టాంతము చెప్పఁబడినదో ఆదృష్టాంతము దార్ష్టాంతికమునకు విషమ మగుటవలనఁ బూర్వోక్తార్థమును సిద్ధింపఁజేయనేరదు. ఆవిషమత యెట్లనఁగా. అచ్చట సేతువుయొక్కకేవలదర్శనమాత్రమువలన బ్రహ్మహత్యాదిపాపనివృత్తి గానేరదు. మఱి యేమనఁగా, ధర్మశాస్త్రమునఁ జెప్పఁబడినబ్రహ్మచర్యశౌచసత్యభాషణాదినియమములతోఁగూడిన సేతుదర్శనముచేతనే యాపాపనివృత్తి యగుచున్నది. ఒకవేళ నానియమములు లేక కేవలసేతుదర్శనమాత్రముచేత నాపాపనివృత్తి యగు ననినయెడల అచ్చట నుండునట్టి మ్లేచ్ఛాదులకుఁ గూడ నాసేతుదర్శనమువలనఁ బాపనివృత్తి గావలయును.

ఆసేతుదర్శనమాత్రమువలన నామ్లేచ్ఛాదులకును బాపకర్మనివృత్తి యగు నన్నచోఁ బాపనివృత్తికొఱకు సేతుదర్శనకర్త యగుపురుషునిగూర్చి నియమములు విధించియుండు ధర్మశాస్త్రములే యప్రమాణము లగును. కావునఁ గ్రియారూప నియమములచే మిశ్రిత మగుటవలన నాసేతుదర్శనమును గ్రియారూపమే యగుచున్నది. జ్ఞానరూపము కాదు. ఆక్రియారూపసేతుదర్శనమువలన సత్యపాపనివృత్తియును గాఁగలదు. ఈలాగుననే గరుడధ్యానముగూడ మానసక్రియారూపమై యున్నందున నాక్రియారూపధ్యానముచేత సత్యవిషముయొక్కనివృత్తియును గాఁగలదు. మఱియు నిచ్చటఁ బ్రసంగమునం దన్యసాధనాపేక్షారహితకేవలాత్మజ్ఞానముచేతనే బంధమునకు నివర్త్యత్వము శ్రుతిచేతఁ జెప్పఁబడి యున్నది. ఆజ్ఞాననివర్త్యత్వము బంధము సత్య మనుటయందు సంభవించుట లేదు. అందువలన జ్ఞాననివర్త్యత్వమూ బంధముయొక్కమిథ్యాత్వమును గల్పించుచున్నది.

## [*] (56) ప్రమాతృవిచారము. [*]

శంక:—పూర్వము జ్ఞాననివర్త్యత్వముచేతఁ బ్రమాతృత్వాదిబంధమునకు మిథ్యాత్వము సాధింపఁబడినది. అందుఁ బ్రమాత యనునది ఏది? అనఁగా, ఆత్మ యనునది ప్రమాతయా? లేక యంతఃకరణ మనునది ప్రమాతయా? అచ్చట "అసంగో హ్యయం పురుషః" ఇత్యాదిశ్రుతులచేత నాత్మ యసంగ మని చెప్పఁబడి యున్నది. మఱియుఁ బ్రమాజ్ఞానమున కాశ్రయము ప్రమాత యనఁ బడును. అందువలన నాయసంగాత్మయందుఁ బ్రమాతృత్వము సంభవింపదు. ఈ లాగుననే యంతఃకరణమునందును బ్రమాతృత్వము సంభవింపదు. ఏల యన నంతఃకరణము భూతకార్య మగుటవలన ఘటాదులవలె జడమై యున్నది. మఱియుఁ బ్రమాతృత్వాదిధర్మములు చేతనమునకే యున్నవి. అందువలన జడ మగు నంతఃకరణమునందుఁ బ్రమాతృత్వము సంభవించుట లేదు.

సమాధానము:—కేవలాత్మకైనను గేవలాంతఃకరణమునకైనను బ్రమాతృత్వము మే మంగీకరించుట లేదు. ఇఁక నే మనఁగా నంతఃకరణవిశిష్టచైతన్యమునే మేము ప్రమాత యని యంగీకరించుచున్నాము. ఆప్రమాతయే కర్త భోక్త యగుచున్నాఁడు. అచ్చటఁ బ్రమాజ్ఞానమున కాశ్రయ మగుటవలన, నంతఃకరణవిశిష్టచైతన్యము ప్రమాత యనఁబడును. మఱియుఁ బ్రయత్నరూపకృతికి నాశ్రయ మగుటవలనఁ, గర్త యనఁబడును. ధర్మాధర్మజన్యసుఖదుఃఖానుభవరూపభోగమున కాశ్రయ మగుటవలన భోక్త యనఁబడును. ప్రమాతృత్వ కర్తృత్వ భోక్తృత్వములను మూఁడును అంతఃకరణవిశిష్టచైతన్యరూపప్రమాతయొక్క-ధర్మములే యగుచున్నవి. కేవలాత్మకైనను గేవలాంతఃకరణమునకైనను బ్రమాతృత్వాదిధర్మములు లేవు.

శంక:—ఆయంతఃకరణవిశిష్టచైతన్యరూపప్రమాత యాయంతఃకరణముకన్నను జైతన్యమునకన్నను బృథక్కు గాదు. మఱియుఁ బ్రమాతృత్వధర్మము కేవలచైతన్యమునం దైనను గేవలాంతఃకరణమునం దైనను ఉండుట లేదు. అందువలన నంతఃకరణవిశిష్టచైతన్యమునందును ఆప్రమాతృత్వధర్మ మెట్లుండ నగును? అనఁగా నుండదు.

సమాధానము:—ఎట్లు కేవలాత్మయందును గేవలాంతఃకరణమందును బ్రమాతృత్వము వాస్తవముగా లేదో, అట్లంతఃకరణవిశిష్టచైతన్యమునందును బ్రమాతృత్వము వాస్తవముగా లేదు. ఇఁక నే మనఁగా, నెట్లు శుక్తియందు రజత మారో

పితమై యున్నదో అట్లంతఃకరణవిశిష్టచైతన్యమందుఁ బ్రమాతృత్వ మారోపితమై యున్నది.

శంక:—ఎట్లు శుక్తియందు రజతారోపమునకుఁ బూర్వ మీపురుషునకు దేశాంతరమునందుండు రజతముయొక్క యథార్థానుభవము కలిగి యాయనుభవజన్య సంస్కారముచేతనే శుక్తియందు రజతారోప మగుచున్నదో, అట్లు ప్రమాతృత్వారోపమునకుఁ బూర్వ మేదైన నొకవస్తువునందు ప్రమాతృత్వముయొక్క యథార్థానుభవము కలిగినయెడల నప్పు డావిశిష్టచైతన్యమునందుఁ బ్రమాతృత్వారోపము సంభవించును. ఆ యథార్థానుభవము లేక ఆయారోపము సంభవింపదు.

సమాధానము:—ఏవస్తు వారోపిత మగుచున్నదో ఆవస్తువుయొక్క పూర్వానుభవముమాత్రము కావలయును. ఆయనుభవము యథార్థ మగుఁగాక. లేక, భ్రమరూప మగుఁగాక. అచ్చట, అనాదిసంసారమునం దీజీవున కాయంతఃకరణవిశిష్టచైతన్యమందుఁ బ్రమాతృత్వముయొక్క భ్రమ యగుచున్నది. పూర్వపూర్వభ్రమరూపానుభవజన్యసంస్కారమువలన నుత్తరోత్తరప్రమాతృత్వముయొక్క యారోపము సంభవించుచున్నది. ఈప్రకారముగానే కర్తృత్వభోక్తృత్వముల యొక్క యారోపములను దెలియవలయును.

ఇచ్చట నైయాయికులు కేవలాత్మకే ప్రమాతృత్వాదిధర్మము లంగీకరించుచున్నారు. వారికథనము శ్రుతిస్మృతిప్రమాణములకు విరుద్ధ మగుటవలన నసంగతము. అచ్చట “సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ, అసంగో హ్యాయం పురుషః, శరీరస్థోపి కౌంతేయ న కరోతి న లిప్యతే” ఇత్యాదిశ్రుతిస్మృతివచనములు నిరుపాధికాత్మను నిర్గుణము అసంగము నిర్లేపము అని చెప్పుచున్నవి. అట్టి యసంగాత్మ యందుఁ బ్రమాతృత్వాదిధర్మములు సంభవించుట లేదు. కావున నంతఃకరణవిశిష్టచైతన్యమునందే ప్రమాతృత్వాదిధర్మము లంగీకరింపవలయును. అట్లు గాక, ప్రమాతృత్వాదిధర్మములు కేవలాత్మయందే యంగీకరించినయెడల తద్ధర్మవిశిష్టాత్మయందసంగనిర్గుణనిర్లేపరూపత్వము సంభవింపదు. అందువలన, ఆత్మను అసంగము నిర్గుణము నిర్లేపము అని చెప్పి యుండునట్టి పూర్వోక్తశ్రుతిస్మృతివచనము లప్రమాణము లగును. మఱియు నైయాయికులు ప్రమాతృత్వాదిబంధము లారోపితము లని యంగీకరించుట లేదు. మ తేమనఁగా, సత్యము లని యంగీకరించుచున్నారు. సత్యము లని యంగీకరించినచో సత్యవస్తువునకు జ్ఞానముచేత నివృత్తి కలుగుట లేదు. కావున నైయాయికమతమునందు బంధనివృత్తిరూపమోక్షమే సంభవింపని దగును. దీనిచేతను ఆబంధము కల్పిత మనియే యంగీకరింపవలయును.

శంక:—అంతఃకరణవిశిష్టచైతన్యమునకుఁ బ్రమాతృత్వాది ధర్మములు పూర్వము మీఁదేఁ జెప్పఁబడినవి. అది సంభవింపదు. ఏల యన, ఆత్మ యసంగమును నిరవయవమునై యున్నది. మఱియు నంతఃకరణము సావయవమును గ్రియాసహితమునై యున్నది. అట్టి యాత్మ కంతఃకరణముతో నేవిధముగాను సంబంధము సంభవించుట లేదు. సంబంధము లేక విశిష్టత్వము సంభవింపదు. ఒకవేళ సంబంధము లేకయు విశిష్టత్వము కల దనినయెడల హిమాచలవిశిష్టము వింధ్యాచలమై యున్న దను వ్యవహారముగూడఁ గావలయును.

మఱియు నంతఃకరణము సత్యమా? లేక మిథ్యయా? అందుఁ బ్రథమ సత్యపక్ష మంగీకరించినయెడల సత్యాంతఃకరణముయొక్క సంబంధమును సత్యరూపమే యగును. ఆసత్యసంబంధము జ్ఞానముచేత నివృత్తము కానేరదు. అందువలన నొకజీవాత్మకును మోక్షము కలుగక పోవలయును. మోక్షమున కభావ మైనచో నామోక్షప్రతిపాదకశాస్త్రములే యప్రమాణము లగును. మఱియు నంతఃకరణము మిథ్య యను ద్వితీయపక్ష మంగీకరించినయెడల నదియును ఘటిల్లదు. ఏల యన, అంతఃకరణముయొక్క మిథ్యాత్వమునం దేప్రమాణమును లేదు. ఒకవేళఁ బ్రమాణము లేకయు నంతఃకరణము మిథ్య యనినయెడల నాత్మయందును ఆమిథ్యాత్వ మేల యుండఁగూడదు. అందువలన నంతఃకరణవిశిష్టచైతన్యమునకుఁ బ్రమాతృత్వాదిధర్మము లున్న వను కథన మసంగతమై యున్నది.

సమాధానము:—ఎట్లు శుక్త్యజ్ఞానమువలన శుక్తియందు రజతము కల్పిత మగుచున్నదో, అట్లాత్మయొక్క యజ్ఞానమువలనఁ బ్రత్యగాత్మయం దీయంతఃకరణాదులు స్వరూపముచేత నధ్యస్తములు అనఁగాఁ గల్పితము లగుచున్నవి. అచ్చట అధ్యస్తము కల్పితము ఆరోపిత మను త్రివిధశబ్దములును ఒక యేయర్థముయొక్క వాచకములై యున్నవి. ఇంతయుఁ జెప్పుటచేత నాయంతఃకరణముయొక్క కల్పితత్వము నీయనుమానము బోధించుచున్నది. "అంతఃకరణ మధ్యస్తమ్, జడత్వాత్, దృశ్యత్వాత్, ఆవిద్యకత్వాచ్చ, శుక్తిరజతవత్"—భావము॥ అంతఃకరణము ప్రత్యగాత్మయం దధ్యస్తమై యున్నది, జడ మగుటవలనను దృశ్య మగుటవలనను ఆవిద్యక మగుటవలనను, ఏయేపదార్థము జడమును దృశ్యమును ఆవిద్యకము నగుచున్నదో ఆయాపదార్థ మధ్యస్తమే యగుచున్నది, ఉదా—శుక్తిరజతము జడము దృశ్యము ఆవిద్యక మగుటవలన నధ్యస్తమై యున్నది. ఈయనుమానప్రమాణముచేత నంతఃకరణమునందుఁ గల్పితత్వమే సిద్ధ మగుచున్నది. అట్లే "అతో న్యదార్తమ్"—భావము॥ చైతన్యాత్మకన్న నన్య మైన సర్వపదార్థములు మిథ్యమై యున్న వను

శ్రుతిప్రమాణముచేతను ఆయంతఃకరణమునందుఁ గల్పితత్వమే సిద్ధమగుచున్నది. అందువలన నాయంతఃకరణము కల్పితమే యగుచున్నది.

మఱియు "జడోఽహమ్, చేతనోఽహమ్" అను ననుభవమువలన జడము లగు నంతఃకరణాదులయొక్క యధ్యాస మాత్మయందును మఱియుఁ జేతన మగు నాత్మయొక్క యధ్యాస మంతఃకరణమునందును బ్రతీత మగుచున్నది. అందువలన సిద్ధాంతమునం దాత్మకును అంతఃకరణాద్యనాత్మకును బరస్పరాధ్యాసము వివక్షిత మై యున్నది. అయినను దానియం దింతభేద మున్నది. ఎట్లంతఃకరణాదులు స్వరూపముచేత నాత్మయం దధ్యస్తమో అట్లాత్మ యంతఃకరణాదులయందు స్వరూపము చేత నధ్యస్తము గాదు. మఱి యే మనఁగా, ఆయంతఃకరణమునం దాత్మ సంసర్గరూపముచేత నధ్యస్తమై యున్నది. అట్లు గాక, అంతఃకరణాదులవలె నాత్మకూడ స్వరూపముచేత నధ్యస్తమైనయెడల నధిష్ఠానజ్ఞానముచేత నెట్లంతఃకరణాదులకు బాధ కలుగుచున్నదో అట్లాయాత్మకును బాధ కలుగవలయును. మఱియు సర్వమునకు సాక్షిరూప మగుటవలన బాధకయోగ్య మగునాత్మ పరమార్థసత్యమై యున్నది. అట్టి యాత్మకు బాధ సంభవించుట లేదు. అందువలన నంతఃకరణమునం దాత్మకు స్వరూపముచేత నధ్యాసము సంభవింపదు. ఇఁక నే మనఁగా, సంసర్గరూపముచేతనే యధ్యాసము సంభవించుచున్నది. ఈప్రకారముగా నాత్మానాత్మలయొక్క యధ్యాసమును శ్రీమద్భగవద్భాష్యకారులు శారీరకమీమాంసయొక్క యాదియందుఁ జెప్పి యున్నారు. ఈరీతిగా నసంగాత్మయం దంతఃకరణాదులకు వాస్తవసంబంధము లేక పోయినను ఆధ్యాసికసంబంధము సంభవించుచున్నది. ఆయాధ్యాసికసంబంధము చేతనే యాత్మ కింతఃకరణవిశిష్టత్వము నున్నది. అందువలన నంతఃకరణవిశిష్టచైతన్యమునందుఁ బ్రమాతృత్వాదిధర్మములు సంభవించుచున్నవి.

## [*] (57) అధ్యాసలక్షణము. [*]

శంక:—అంతఃకరణాదు లాత్మయం దధ్యస్తములై యున్న వను మీకథనము, ఎపు డధ్యాసముయొక్క స్వరూపము నిర్ణీత మగుచున్నదో, అపుడు సంభవించుచున్నది. ఆ యధ్యాసముయొక్క స్వరూపనిర్ణయము లేక యంతఃకరణాదులధ్యస్తము లనుట సంభవింపదు. ఇట్టి శంక ప్రాప్తము కాఁగా.

సమాధానము:—ఇఁక, అధ్యాసలక్షణము చెప్పఁబడుచున్నది. "పరత్ర పరావభాసః అధ్యాసః" — భావము॥ అన్యమునం దన్యముయొక్క యేయవభాస మున్నదో, అది యధ్యాస మనఁబడును. ఆయధ్యాసము, జ్ఞానాధ్యాసము అర్థా

ధ్యాసము అను భేదముచేత ద్వివిధమై యున్నది. అచ్చట జ్ఞానాధ్యాసపక్షమందో ఆ యవభాసపదముచేత భ్రాంతిజ్ఞానమును గ్రహింపవలయును. మఱియు నర్థా ధ్యాసపక్షమం దాయవభాసపదముచేత భ్రమజ్ఞానమునకు విషయభూతరజతాద్యర్థ ములను గ్రహింపవలయును. అందువలనఁ బూర్వోక్తాధ్యాసముయొక్కలక్షణ మా ద్వివిధాధ్యాసములయందును ఘటిల్లును.

## [*] (58) జ్ఞానాధ్యాసార్థాధ్యాసలక్షణములు. [*]

ఇఁక యథాక్రమముగా జ్ఞానాధ్యాసార్థాధ్యాసములయొక్కలక్షణములు చెప్పఁబడుచున్నవి. అందు "అతస్మింస్తద్బుద్ధిః జ్ఞానాధ్యాసః" — భావము॥ ఏ వస్తువుయొక్కయధికరణతకు అయోగ్య మయిన యధికరణమునందు ఆసజాతీయ వస్తువుయొక్కబుద్ధి యేది గలదో అది జ్ఞానాధ్యాస మనఁబడును. ఉదా—వాస్తవము చేత రజతత్వముయొక్కయధికరణత కయోగ్య మైన శుక్తియందు "ఇదం రజతమ్" అను బుద్ధియును, వాస్తవముచేత నంతఃకరణాదిరూపానాత్మత్వముయొక్కయధికరణత కయోగ్య మైన యాత్మయం దనాత్మబుద్ధియును జ్ఞానాధ్యాస మనఁబడును.

మఱియు "ప్రమాణాజన్యజ్ఞానవిషయత్వేసతి పూర్వదృష్టత్వానధికరణ మర్థాధ్యాసః" — భావము॥ ఏపదార్థము ప్రమాణాఽజన్యజ్ఞానమునకు విషయ మయ్యును, పూర్వదృష్టత్వధర్మమున కనధికరణ మయ్యు నున్నదో ఆపదార్థ మర్థా ధ్యాస మనఁబడును. ఉదా—శుక్తియందు రజతమును ఆత్మయం దంతఃకరణాదిక మును అర్థాధ్యాసరూపములై యున్నవి. అచ్చట నాశుక్తిరజతమును విషయముఁ జేయునట్టి "ఇదం రజతమ్" అను నేజ్ఞాన మున్నదో ఆజ్ఞాన మప్రమారూప మగుట వలన నేప్రమాణముచేతను జన్యము గాదు. అందువలన నారజతము ప్రమాణా జన్యజ్ఞానమునకు విషయమై యున్నది. మఱియు నారజతము తనప్రతీతికన్నఁ బూ ర్వము లేనందువలన నారజతము పూర్వదృష్టత్వధర్మమున కనధికరణ మయ్యు నున్నది. కావున నారజతమునం దర్థాధ్యాసరూపత్వము సంభవించుచున్నది. ఈ ప్రకారముగా నర్థాధ్యాసలక్షణము రజ్జుసర్పాదులయందును దెలియవలయును.

అందు "పూర్వదృష్టత్వానధికరణమ్" అను నింతమాత్రమే యాయర్థా ధ్యాసమునకు లక్షణ మనినయెడల ఇప్పుడు నూతనముగా నుత్పన్న మైనఘటమునం దాలక్షణమున కతివ్యాప్తి కలుగును. ఎట్లనఁగా, ఆఘటముకూడఁ బూర్వదృష్టత్వ ధర్మమున కనధికరణమే యగుచున్నది. ఆ యతివ్యాప్తిదోషమును నివారించుటకై లక్షణమునందు "ప్రమాణాఽజన్యజ్ఞానవిషయత్వేసతి" అని చెప్పఁబడినది. అది

యాఘటమునందు లేదు. మఱి యే మనఁగా, నాఘటమునందుఁ బ్రమాణజన్యజ్ఞానముయొక్క విషయత్వమే యున్నది. అందువలన నాఘటమునందాలక్షణమున కతివ్యాప్తి కలుగుట లేదు.

మఱియు "ప్రమాణాఽజన్యజ్ఞానవిషయత్వమ్" అను నింతమాత్రమే యాయర్థాధ్యాసమునకు లక్షణ మనినయెడల స్మరింపఁబడిన శివవిష్ణుగంగాదులయందాలక్షణమున కతివ్యాప్తి గలుగును. ఎట్లనఁగాఁ బ్రమాణాజన్య మైన స్మృతిజ్ఞానముయొక్క విషయత్వము వారియందు నున్నది. ఆ యతివ్యాప్తిదోషమును నివారించుటకై లక్షణమునందు "పూర్వదృష్టత్వా ఽనధికరణమ్" అను పదము చెప్పఁబడినది. అచ్చటఁ బూర్వదృష్టపదార్థముయొక్క స్మృతియే కలుగుచున్నది. స్మర్యమాణపదార్థములయందుఁ బూర్వదృష్టత్వధర్మమున కనధికరణత్వము లేదు. మఱియే మనఁగా, అధికరణత్వమే యున్నది. అందువలన స్మర్యమాణపదార్థములయందాయర్థాధ్యాసలక్షణమున కతివ్యాప్తి కలుగదు.

ఇచ్చటఁ బూర్వోక్తార్థాధ్యాసలక్షణమునందుఁ బ్రమాణశబ్దముచేతఁ బ్రత్యగభిన్నబ్రహ్మబోధక మగు నేతత్త్వమస్యాదిమహావాక్యము లున్నవో వానిని గ్రహింపవలయును. ఆమహావాక్యరూపప్రమాణముచేత నజన్య మైన వృత్త్యభివ్యక్తచైతన్యరూపజ్ఞాన మేది గలదో ఆజ్ఞానమునకు విషయత్వము ఘటాదివ్యావహారికపదార్థములయందును శుక్తిరజతాదిప్రాతిభాసికపదార్థములయందు నున్నది. మఱియుఁ జైతన్యాత్మకన్న భిన్న మైన సర్వానాత్మపదార్థములు క్షణక్షణమునందుఁ బరిణామమును బొందుచుండుటవలన నాఘటపటాదిపదార్థములయందుఁ బూర్వదృష్టత్వధర్మమున కనధికరణత్వము నున్నది. కావునఁ బూర్వోక్తార్థాధ్యాసలక్షణము వ్యావహారికప్రాతిభాసికసర్వపదార్థములకు సాధారణమై యున్నది. ఇచ్చటఁ దాత్పర్యమే మనఁగా, వేదాంతసిద్ధాంతమునందు బ్రహ్మచైతన్యముకన్న భిన్నము లైన ఘటాదివ్యావహారికపదార్థములును శుక్తిరజతాదిప్రాతిభాసికపదార్థములును ఏవి గలవో యాసర్వము బ్రహ్మచైతన్యమునం దధ్యస్త మగుటవలన నర్థాధ్యాసరూపమే యగుచున్నది. అందువలనఁ బూర్వోక్తార్థాధ్యాసలక్షణమునకు వ్యావహారికప్రాతిభాసికసర్వపదార్థములయొక్క సాధారణలక్షణత్వము యుక్తమై యున్నది.

మఱియుఁ గొందఱు గ్రంథకారులో యిట్లు చెప్పుచున్నారు. పూర్వోక్తార్థాధ్యాసలక్షణము కేవలప్రాతిభాసికరజతాదులకే యున్నది, ఘటాదివ్యావహారికపదార్థముల కాలక్షణము కాదు. అందువలన నాలక్షణమునందుండు ప్రమాణ

శబ్దముచేతఁ దత్త్వమస్యాదిప్రమాణములను గ్రహించుట కూడదు. మఱి యే మనఁగా, ఆప్రమాణశబ్దముచేత నజ్ఞాతార్థబోధకప్రత్యక్షాదిప్రమాణములనే గ్రహింపవలయును. ఆప్రత్యక్షాదిప్రమాణాఽజన్యజ్ఞానవిషయత్వము కేవలశుక్తిరజతాది ప్రాతిభాసికపదార్థములయందే యున్నది. ఘటాదివ్యావహారికపదార్థములయందు లేదు. అందువలనఁ బ్రాతిభాసికశుక్తిరజతాదిరూపార్థాధ్యాసమునకే పూర్వోక్త లక్షణ మున్నది.

## [*] (59) అర్థాధ్యాసవిభాగకథనము. [*]

ఇఁకఁ బూర్వోక్తార్థాధ్యాసవిభాగము చెప్పఁబడుచున్నది. ఉక్తార్థాధ్యాసము ప్రాతీతికము వ్యావహారిక మను భేదముచేత ద్విప్రకారమై యున్నది. అందు "ఆగంతుకదోషజన్యః ప్రాతీతికః" — భావము॥ ఏపదార్థ మాగంతుకదోషముచే జన్యమై యున్నదో ఆపదార్థము ప్రాతీతిక మనఁబడును. ఈప్రాతీతికము ప్రాతిభాసిక మనియును జెప్పఁబడును. ఉదా—శుక్తియందు రజతమును రజ్జువునందు సర్పమును మరుభూమియందు జలమును ఇత్యాదిపదార్థము లాగంతుకదోషజన్యము లగుటవలనఁ బ్రాతీతికము లనఁబడుచున్నవి. అచ్చటఁ బ్రాతీతికపదార్థమునకు జనకము లగు దోషములు ప్రమాతృదోషము విషయదోషము కరణదోషము అను భేదముచేతఁ ద్రివిధములై యున్నవి. రాగభయాదికము ప్రమాతృగతదోషము. సాదృశ్యాదికము విషయగతదోషము. కాచకామిలాదికము చక్షురాదికరణగత దోషము. ఈరీతిగాఁ ద్రివిధదోషములచేత జన్య మగుటవలన నాశుక్తిరజతాదికము ప్రాతీతికార్థాధ్యాసరూపమై యున్నది.

మఱియు "ప్రాతీతికభిన్నః వ్యావహారికః"—భావము॥ ఆగంతుకదోషజన్య మగు ప్రాతీతికపదార్థములకన్న భిన్నము లగు నేపదార్థము లున్నవో, అవి వ్యావహారికము లనఁబడును. ఉదా— ఆకాశము మొదలు ఘటపర్యంతపదార్థములు వ్యావహారికార్థాధ్యాసరూపములై యున్నవి. అచ్చట ఆత్మజ్ఞానమునకుఁ బూర్వ మేపదార్థములకు బాధ కలుగుట లేదో ఆపదార్థములు వ్యావహారికము లని చెప్పఁబడును. మఱియు నాత్మజ్ఞానమునకుఁ బూర్వమే యేపదార్థములకు బాధ కలుగుచున్నదో ఆపదార్థములు ప్రాతీతికము లనియును బ్రాతిభాసికము లనియును జెప్పఁబడును.

మఱియుఁ గొందఱు గ్రంథకారు లాప్రాతీతికవ్యావహారికార్థాధ్యాసముల కీవక్ష్యమాణసాధారణలక్షణము చెప్పుచున్నారు. "దోషసంప్రయోగసంస్కారజన్యత్వ మధ్యాసత్వమ్"—భావము॥ పూర్వోక్తదోషములును, శుక్త్యాద్యధిష్ఠానము

లతోఁ జక్షురాదీంద్రియములకు సంయోగరూపసంబంధమును దేశాంతరీయరజతాదులయొక్కయనుభవజన్యసంస్కారము నను నీత్రితయముచేత జన్యత్వ మేది గలదో అదియే యీరజతాదులయం దధ్యస్తత్వమై యున్నది. యద్యపి సిద్ధాంతమునం దవిద్య యనాది యగుటవలన నాదోషములచేత జన్యము గాదు, అందువలన నా యవిద్యాధ్యాసమునం దుక్తలక్షణమున కవ్యాప్తియే కలుగును, తథాపి యీలక్షణ మంతఃకరణాదిరూపకార్యాధ్యాసములకే యున్నది. అనాద్యవిద్య కీలక్షణము కాదు. అంమవలన నాలక్షణమున కలక్ష్యరూప మైన యవిద్యయం దవ్యాప్తి కలుగదు. ఇచ్చట తాత్పర్య మే మనఁగాఁ, గార్యాధ్యాసమే జాగ్రత్స్వప్నములయందు జీవునియొక్కయనర్థమునకు హేతువై యున్నది. ఆ యవిద్యాధ్యాసము సుషుప్తియం దుండున దైనను అనర్థమునకు హేతువు కాదు. అందువలనఁ బూర్వోక్తలక్షణము కార్యాధ్యాసములకే యున్నది.

శంక:—పూర్వోక్తలక్షణమునందు దోషము సంబంధము సంస్కార మను త్రివిధపదములు చెప్పుటకుఁ బ్రయోజన మేమి?

సమాధానము:—ఆలక్షణమునం దాత్రివిధపదములను జెప్పుటచేత నధ్యాసమున కీరెండులక్షణములు సిద్ధ మగుచున్నవి. "దోషజన్యత్వేసతి. సంస్కారజన్యత్వ మధ్యస్తత్వమ్"—లేక, "సంప్రయోగజన్యత్వేసతి సంస్కారజన్యత్వ మధ్యస్తత్వమ్"— భావము॥ ఏపదార్థము దోషముచే జన్యమై సంస్కారముచేతను జన్య మగుచున్నదో ఆపదార్థ మధ్యస్త మనఁబఋను. లేక, ఏపదార్థము సంబంధముచే జన్యమై సంస్కారముచేతను జన్య మగుచున్నదో ఆపదార్థ మధ్యస్త మనఁబడును.

అందుఁ బ్రథమలక్షణమునందు సంస్కారజన్యస్మృతియం దతివ్యాప్తిని నివారించుటకై "దోషజన్య" మనుపదము చెప్పఁబడినది. మఱియు దోషరూపవిషయముచేత జన్య మగు నేదోషప్రత్యక్షప్రమ యున్నదో దానియం దతివ్యాప్తిని నివారించుటకై యాలక్షణమునందు "సంస్కారజన్య" మనుపదము చెప్పఁబడినది. ఈలాగుననే ద్వితీయలక్షణమునందును సంస్కారజన్యస్మృతిజ్ఞానమునం దతివ్యాప్తిని నివారించుటకై "సంప్రయోగజన్య" మనుపదము చెప్పఁబడినది. మఱియు సంప్రయోగజన్యప్రత్యక్షప్రమయం దతివ్యాప్తిని నివారించుటకై "సంస్కారజన్య" మనుపదము చెప్పఁబడినది. యద్యపి, ఈద్వితీయలక్షణమునకు "సోఽయం దేవదత్తః" అను ప్రత్యభిజ్ఞా ప్రత్యక్షమునం దతివ్యాప్తి కలుగుచున్నది, ఎట్లనఁగా, ఆ ప్రత్యభిజ్ఞ సంప్రయోగసంస్కారము లను రెంటిచేతనే జన్యమై యున్నది. తథాపి,

ఆలక్షణమునందు "ప్రత్యభిజ్ఞా భిన్నత్వే సతి" అను విశేషణము చెప్పినయెడల నా ప్రత్యభిజ్ఞయం దతివ్యాప్తి కలుగదు.

శంక:—ఆత్మయం దేయంతఃకరణాద్యధ్యాసము లున్నవో వానియందు సంప్రయోగజన్యత్వము సంభవించుట లేదు. ఏల యన, అధిష్ఠాన మగు నాత్మతోఁ జక్షురాదీంద్రియములకు సంబంధము లేదు. అందువలన నంతఃకరణాద్యధ్యాసము నందుఁ బూర్వోక్తలక్షణమున కవ్యాప్తియే కలుగును.

సమాధానము:—అచ్చట సంప్రయోగశబ్దముచేత నధిష్ఠాన మగు నాత్మయొక్కసత్తాదిసామాన్యాంశజ్ఞానమే వివక్షితమై యున్నది. ఆ సామాన్యజ్ఞాన మంతఃకరణాదులయొక్కయధ్యాసమునకుఁ బూర్వ మున్నదే యగుచున్నది. ఆయధి ష్ఠాన మగు నాత్మయొక్కసామాన్యజ్ఞాన మేయింద్రియముచేతను జన్యము గాదు. మఱి యే మనఁగాఁ దనస్వయంజ్యోతిస్స్వభావముచేతనే యున్నది. అందువలన నంతఃకరణాద్యధ్యాసమునందుఁ బూర్వోక్తలక్షణమున కవ్యాప్తి కలుగుట లేదు.

శంక:—పూర్వము దోషమును సంస్కారమును రజతాదిరూపార్థమునకు జనకము అని చెప్పఁబడినది. అది సంభవింపదు. ఏల యన, ఆదోషసంస్కారములు రజతాదిజ్ఞానమునకే జనకములుగాఁ జూడఁబడుచున్నవి.

సమాధానము:—పూర్వోక్తదోషసంస్కారము లుండినయెడల రజతాది రూపార్థమును దానిజ్ఞానమును ఉత్పన్న మగుచున్నవి. ఆదోషసంస్కారములు లేని యెడల రజతాదిరూపార్థమును దానిజ్ఞానమును ఉత్పన్న మగుట లేదు. ఈరీతిగా నన్వయవ్యతిరేకములచేత దోషసంస్కారముల కర్థాధ్యాసజ్ఞానాధ్యాసము లను రెంటినిగూర్చి కారణత్వము సిద్ధ మగుచున్నది. అందువలన జ్ఞానాధ్యాసమునకువలె నర్థాధ్యాసమునకుఁగూడ దోషసంస్కారములచేత జన్యత్వము సంభవించుచున్నది. ఈపూర్వోక్తాభిప్రాయముచేతనే శ్రీమద్భగవద్భాష్యకారులు "స్మృతిరూపః పరత్ర పూర్వదృష్టావభాసః" అని యధ్యాసమునకు లక్షణముఁ జెప్పి యున్నారు. ఈయ ధ్యాసలక్షణము జ్ఞానాధ్యాసమునకును అర్థాధ్యాసమునకును సాధారణమై యున్నది. అందు జ్ఞానాధ్యాసపక్షమం దైననో ఆభాష్యోక్తలక్షణమున కీవక్ష్యమాణార్థము చేయవలయును. స్మృతిరూపము.—సంస్కారజన్య మగుటవలన, స్మృతికి సదృశ మును, పరత్ర—అన్యస్థలమునందు, పూర్వదృష్టావభాసః—పూర్వదృష్టార్థమునకు సజాతీయము నైన యేయర్థముయొక్కజ్ఞాన మున్నదో, అది జ్ఞానాధ్యాస మనఁ బడును. ఉదా—శుక్తియందు "ఇదం రజతమ్" అను జ్ఞానమై యున్నది. మఱియు నర్థాధ్యాసపక్షమునం దాభాష్యోక్తలక్షణమున కీవక్ష్యమాణార్థ మున్నది. స్మృతి

రూపము—ప్రమాణాఽజన్యజ్ఞానమునకు విషయమును, పూర్వదృష్టార్థమునకు సజాతీయము నైన యేయర్థ మున్నదో ఆయర్థ మర్థాధ్యాస మనఁబడును. ఉదా—శుక్త్యాదులయందు రజతాదికమై యున్నది.

ఈప్రకారముగా నధ్యాసము సిద్ధించు చుండఁగాఁ బ్రమాతృత్వకర్తృత్వభోక్తృత్వాదిబంధము లధ్యస్తము లగుటవలన వానికి మిథ్యాత్వము సంభవించుచున్నది. అందువలన "తరతి శోక మాత్మవిత్" అను శ్రుతివచనముచేత బంధమునం దేజ్ఞాననివర్త్యత్వము వినఁబడుచున్నదో అది బంధమునకు మిథ్యాత్వము లేక యనుపపన్నమై యీబంధమునకు మిథ్యాత్వము కల్పింపఁజేయుచున్న దను పూర్వోక్త శ్రుతార్థాపత్తి సిద్ధ మైనది.

అర్థాపత్తిప్రమానిరూపణము సమాప్తము.

## [*] అభావప్రమ. [*]

ఇఁక షష్ఠ మగు నభావప్రమ నిరూపింపఁబడుచున్నది. "యోగ్యానుపలబ్ధికరణికా ప్రమా అభావప్రమా" — భావము॥ యోగ్యానుపలబ్ధి యేప్రమకుఁ గరణమై యున్నదో ఆప్రమ యభావప్రమ యనఁబడును. అంతే యేయధికరణమునం దేయభావముయొక్క—జ్ఞానము కలుగుచున్నదో, ఆయధికరణమునం దాయభావముయొక్క—ప్రతియోగిజ్ఞాన ముపలబ్ధి యందురు. ఆయుపలబ్ధిని ఉపలంభ మనియును జెప్పుదురు. ఆయుపలబ్ధ్యభావమును అనుపలబ్ధి యనియును అనుపలంభ మనియును జెప్పుదురు. ఆయనుపలబ్ధియే యాయభావప్రమకుఁ గరణమై యున్నది. ఉదా—ఏభూతలమునందు "ఘటో ఽస్తి" యను ఘటజ్ఞానము కలుగుచున్నదో ఆభూతలమునందు "ఘటో నాస్తి" యను ఘటాఽభావజ్ఞానము కలుగుట లేదు. మఱి యేమనఁగా "ఘటో ఽస్తి" యనుజ్ఞానమున కెచ్చట నభావము కలుగుచున్నదో అచ్చటనే "ఘటో నాస్తి" యను ఘటాఽభావజ్ఞానము కలుగుచున్నది. అందువలన ఘటజ్ఞానముయొక్క—యభావరూపాఽనుపలబ్ధియం దా ఘటాఽభావవిషయకప్రమాకరణత యన్వయవ్యతిరేకములచేత సిద్ధ మగుచున్నది. అయినను ఆయనుపలబ్ధియందు యోగ్యతయు నపేక్షితమై యున్నది. ఒకవేళఁ గేవల మనుపలబ్ధిమాత్రముచేతనే యభావప్రమ కలుగు నన్నచో ఆయనుపలబ్ధిచేత నంధకారమునందు ఘటాభావప్రమయును ఆత్మయందు ధర్మాఽధర్మాభావప్రమయును గలుగవలయును. ఏల యన, అంధకారమునందు ఘటోపలబ్ధి కలుగకుండుటచేత, ఘటోపలబ్ధ్యభావరూపానుపలబ్ధి అచ్చటను ఉన్నది. అట్లే ఆత్మయందును ధర్మాధర్మములయొక్క—యుప

లబ్ధియును గలుగుట లేదు. అధర్మాధర్మోపలబ్ధ్యభావరూపానుపలబ్ధి అచ్చటను ఉన్నది. అయినను ఉక్తస్థలములయం దభావవిషయకప్రమ కలుగుట లేదు. అందువలన నభావప్రమోత్పత్తియం దాయనుపలబ్ధికి యోగ్యతాపేక్ష యవశ్య మున్నది. అనుపలబ్ధిచేత నేయభావజ్ఞానము కలుగుచున్నదో ఆయభావముయొక్క ప్రతియోగి నారోపించుటవలన నెచ్చట నాప్రతియోగియొక్క యుపలబ్ధ్యాపాదనము చేయఁబడుచున్నదో అచ్చట నాయుపలబ్ధ్యభావరూప మగు నేయనుపలబ్ధి యున్నదో అది యోగ్యానుపలబ్ధి యనఁబడును. ఉదా—ప్రకాశసహితభూతలమునందు "యద్యత్ర ఘటస్స్యాత్ తర్హి ఉపలభ్యేత" — భావము॥ ఈభూతలమునం దొకవేళ ఘట మున్నయెడల, ఈభూతలమువలె నాఘటముగూడఁ బ్రతీత మగును. అయినను బ్రతీతము గాలేదు. కావున నీభూతలమునందు ఘటము లేదు. అను నీరీతిగా ఘటరూపప్రతియోగిసత్త్వముయొక్క యారోపముచేత నా ఘటోపలబ్ధ్యాపాదనము చేయఁబడుచున్నది. అందువలన నాఘటోపలబ్ధ్యభావరూపఘటానుపలబ్ధి యోగ్య మని చెప్పఁబడును. ఆ యోగ్యానుపలబ్ధిచేతఁ బ్రకాశసహితభూతల మునందు "ఘటో నాస్తి" యను నభావప్రమ కలుగుచున్నది. మఱియు నంధకారమునందు ఘట మున్నను ఆత్మయందు ధర్మాధర్మము లున్నను అవి ప్రతీతములగుట లేదు. ఈయంధకారమందు ఘట మున్నయెడలఁ బ్రతీతము గావలయును, ఆత్మయందు ధర్మాధర్మము లున్నయెడలఁ బ్రతీతములు గావలయును. అను నీరీతిగా ఘటాదిరూపప్రతియోగిసత్త్వముయొక్క యారోపముచేతఁ దదుపలబ్ధ్యాపాదనము చేయఁబడుట లేదు. అందువలన నంధకారమునందు ఘటానుపలబ్ధియును ఆత్మయందు ధర్మాధర్మములయొక్క యనుపలబ్ధియును యోగ్యము గాదు. ఈకారణముచేత నంధకారమునందు ఘటాభావముయొక్కయు ఆత్మయందు ధర్మాధర్మాభావములయొక్కయు జ్ఞాన మనుపలబ్ధిచేతఁ గలుగుట లేదు. మఱి యే మనఁగా అనుమానాదికముచేత నాయభావజ్ఞానము కలుగుచున్నది. అచ్చటఁ బూర్వోక్తయోగ్యానుపలబ్ధియే కరణమై యున్నది. అభావప్రమ ఫలమై యున్నది.

ఇచ్చట నైయాయికులు చెప్పున దే మనఁగా. పూర్వోక్తయోగ్యానుపలబ్ధి సహకృతేంద్రియరూపప్రత్యక్షప్రమాణముచేతనే భూతలాదికమునందు ఘటాద్యభావజ్ఞానము గలుగుచున్నది. ఆ యభావజ్ఞానముకొఱకు యోగ్యానుపలబ్ధిని బృథక్ప్రమాణముగా నంగీకరించుటయందు గౌరవదోషము ప్రాప్తించుచున్నది.

మఱికొంద ఱాఘటాభావముయొక్క యధికరణ మగు భూతలముతోఁ జక్షురింద్రియమునకు సంయోగసంబంధ మున్నది. అయినను, ఆఘటాభావముతోఁ

జక్షురింద్రియమున కేసంబంధమును లేదు. అందువలన నభావజ్ఞానమునం దింద్రియమునకుఁ గరణత్వము సంభవింప దని చెప్పుచున్నారు. అట్లు చెప్పుటయును అసంగతము. ఏల యన, ఆయభావముతో నింద్రియమునకు సంయోగాదిరూపసంబంధము లేక పోయినను విశేషణవిశేష్యభావరూపసంబంధ మున్నది. ఆసంబంధముచేత నాయభావమున కింద్రియముచేతఁ బ్రత్యక్షజ్ఞానము సంభవించుచున్నది.

ఈనైయాయికులమతము సమీచీనము గాదు. ఎట్లన, చక్షురాదీంద్రియములకు భూతలాద్యధికరణములతోనే సంయోగాదిరూపసంబంధ మున్నది. ఆయభావముతో నొకసంబంధమును లేదు. అందువలనఁ జక్షురాదీంద్రియములు భూతలాదిరూపాధికరణజ్ఞానమునందే చరితార్థమై యున్నది. అభావజ్ఞానమునం దాయింద్రియమునకుఁ గరణత్వము లేదు. మఱియు నైయాయికు లింద్రియమున కభావముతో నేవిశేషణవిశేష్యభావసంబంధ మంగీకరించినారో అదియుఁగూడ నసంగతమై యున్నది. ఏల యన, రెండుపదార్థములకుఁ బరస్పరసంబంధము కలుగుచున్నది. ఆసంబంధ మారెండుసంబంధులకన్న భిన్న మయ్యును ఆరెండుసంబంధుల కాశ్రిత మయ్యును ఏకమయ్యు నున్నది. ఉదా—చక్షుర్భూతలసంయోగసంబంధ మాచక్షుర్భూతలరూపము లగు రెండుసంబంధులకన్న భిన్నమును ఆరెండుసంబంధుల కాశ్రితమును ఏకమునై యున్నది. ఈవిధమైనసంబంధలక్షణ మావిశేషణవిశేష్యభావములయందు ఘటిల్లదు. ఏల యన "ఘటాభావవ ద్భూతలమ్" అను ప్రతీతియందు ఘటాభావము విశేషణమై యున్నది. భూతలము విశేష్యమై యున్నది. మఱియు "భూతలే ఘటాభావః" అను ప్రతీతియందు భూతలము విశేషణమై యున్నది. ఘటాభావము విశేష్యమై యున్నది. అచ్చట నాయభావమునం దుండు నేవిశేషణత గలదో అది విశేషణభావమై యున్నది. మఱియు నాయభావమునం దుండు నేవిశేష్యత గలదో అది విశేష్యభావమై యున్నది. అందు విశేషణభావము విశేషణరూపమే యగుచున్నది. మఱియు విశేష్యభావమును విశేష్యరూపమే యగుచున్నది. ఆవిశేషణవిశేష్యములకన్న విశేషణవిశేష్యభావములు భిన్నములు గావు. మఱియు నభేదమునం దాధారాధేయభావములు కలుగుట లేదు. కావున నావిశేషణవిశేష్యభావము లాయభావరూపసంబంధికన్నను భిన్నములును సంబంధియొక్క-ఆశ్రితములును గావు. అట్లే విశేషణతావిశేష్యతారూపములచేత ద్వివిధము లగుటవలన నేకమును గాదు. అందువలన నావిశేషణవిశేష్యభావముల కింద్రియసంబంధరూపత్వము సంభవించుట లేదు.

మఱియు నభావప్రత్యక్షమునందు విశేషణతాసంబంధమును గారణ మని యంగీకరించినయెడల వ్యవహితభూతలమందుండు నభావముగూడఁ జక్షురింద్రియము

చేతఁ బ్రత్యక్షము కావలయును. ఏల యన, ఆభూతలమునం దాయభావము విశేషణరూపముచే నున్నది. మఱియుఁ జక్షురింద్రియమునకును భూతలముతో సంయుక్తసంయోగాదిరూపపరంపరాసంబంధ మున్నది. మఱియు విశేషణతకును ఇంద్రియసంబంధ మంగీకరించినచో భూతలమునందుండు ఘటమును అఘటమునందుండు రూపాదులును ఆవిశేషణతాసంబంధముచేతనే ప్రత్యక్షములు గావలయును. అందువలన నైయాయికు లంగీకరించియుండు నేసమవాయాదిసంబంధము లున్నవో ఆసర్వమునకును లోపము కలుగును. అందువలన ఆవిశేషణవిశేష్యభావములయందు సంబంధరూపత్వము సంభవింపదు. మఱియుఁ జక్షురాదీంద్రియములు స్వాసంబద్ధార్థములను బ్రత్యక్షము చేయుట లేదు. అందువలన నభావజ్ఞానమునం దింద్రియము కరణము కాదు. మఱి యే మనఁగాఁ బూర్వోక్తయోగ్యానుపలబ్ధియే కరణమై యున్నది.

### [*] (60) క ర ణ ల క్ష ణ ము. [*]

ఇఁక, ప్రసంగానుసారముగాఁ గరణలక్షణము చెప్పఁబడుచున్నది. "అసాధారణకారణం కరణమ్" — భావము॥ ఏకార్యమున కేది యసాధారణకారణమై యున్నదో ఆయసాధారణకారణ మాకార్యమునకుఁ గరణ మని చెప్పఁబడును. ఉదా—ప్రత్యక్షప్రమకుఁ జక్షురాదీంద్రియము లసాధారణకారణము లగుటవలనఁ గరణములై యున్నవి. ఈలాగుననే యుక్తాభావప్రమకు యోగ్యానుపలబ్ధి యసాధారణకారణ మగుటవలనఁ గరణమై యున్నది. ఈరీతిగానే యనుమానాదులయందును గరణలక్షణము దెలియవలయును. అందుఁ గార్యమాత్రమునుగుఱించి సాధారణకారణము లగు నదృష్టదేశకాలాదులయం దాలక్షణముయొక్క యతివ్యాప్తి నివారించుటకొఱకు లక్షణమునం దసాధారణ మనుపదము చెప్పఁబడినది.

### [*] (61) కా ర ణ ల క్ష ణ ము. [*]

అచ్చట, పూర్వోక్తకరణలక్షణము కారణముచేత ఘటిల్లుచున్నది. అందువలనఁ గరణలక్షణము సిద్ధించుటకొఱకుఁ గారణలక్షణము చెప్పఁబడుచున్నది. "నియతపూర్వవృత్తి కారణమ్"—భావము॥ ఏపదార్థ మేకార్యోత్పత్తికిఁ బూర్వము నియతముగా వర్తించుచున్నదో ఆపదార్థ మాకార్యమునకుఁ గారణ మని చెప్పఁబడును. ఉదా—ఘటరూపకార్యోత్పత్తికిఁ బూర్వకాలమునందు మృత్తికాకులాలదండచక్రాదికము నియతముగా నున్నది. అందువలన ఆమృత్తికాదులు ఘటరూపకార్యమునకుఁ గారణము లనఁబడుచున్నవి.

## [*] (62) కారణవిభాగనిరూపణము. [*]

ఇఁక, పూర్వోక్తకారణముయొక్క విభాగము చెప్పఁబడుచున్నది. ఉక్త కారణము ఉపాదాననిమిత్తము లను భేదములచే ద్వివిధమై యున్నది. అందు "కార్యాన్వితం కారణ ముపాదానకారణమ్"—భావము॥ కార్యమందు అన్వితము అనఁగా తాదాత్మ్యమును బొందియుండు నేకారణ మున్నదో అది యుపాదానకారణ మనంబడును. ఉదా—ఘటరూపకార్యమునం దన్విత మైనమృత్తిక యాఘటమున కుపాదానకారణమై యున్నది. మఱియుఁ బటరూపకార్యమునం దన్విత మైన తంతు వాపటమున కుపాదానకారణమై యున్నది. అచ్చట ఘటాదికార్యములకు నిమిత్త కారణరూపకులాలాదులయం దీయుపాదానకారణముయొక్క లక్షణమున కతివ్యాప్తి నివారించుటకొఱ కాలక్షణమందు "కార్యాన్వితమ్" అనుపదము చెప్పఁబడినది. ఆకులాలాదినిమిత్తకారణములు ఘటాదిరూపకార్యములయం దన్వితము లగుట లేదు. కావున వానియం దతివ్యాప్తి గలుగదు. మఱియు ఘటాదికార్యములయం దన్విత మగు నేరూపాదిక మున్నదో దానియం దతివ్యాప్తి నివారించుటకొఱకు "కారణమ్" అనుపదము చెప్పఁబడినది. ఆరూపాదికము ఘటమునకుఁ గారణము కాదు. అందువలన దానియం దాలక్షణమున కతివ్యాప్తి కలుగదు.

మఱియు "కార్యానుకూలవ్యాపారవత్కారణం నిమిత్తకారణమ్"—భావము॥ కార్యోత్పత్తి కనుకూల మగు వ్యాపారము గల కారణము నిమిత్తకారణ మనఁబడును. ఉదా—ఘటాదికార్యోత్పత్తి కనుకూల మగు వ్యాపారము గల కులాలాదిక మాఘటాదికార్యములకు నిమిత్తకారణమై యున్నది. మఱియు బ్రహ్మమో యీజగద్రూపకార్యమున కుపాదానకారణమును నిమిత్తకారణము నను రెండు నగుచున్నది. కనుక ఆబ్రహ్మమునందు నిమిత్తకారణలక్షణమునకును ఉపాదానకారణ లక్షణమునకును అతివ్యాప్తి కలుగదు.

శంక:—బ్రహ్మమునకుఁ బ్రపంచముయొక్క యుపాదానకారణత్వము సంభవింపదు. ఏల యన, లోకమునందు సమానస్వభావసహితమృత్తికాఘటాదులకే పరస్పరోపాదానోపాదేయభావములు చూడఁబడుచున్నవి. విలక్షణస్వభావసహిత పదార్థముల కాయుపాదానోపాదేయభావము లెచ్చటను జూడఁబడుట లేదు. మఱియు బ్రహ్మమో చైతన్యరూపమై యున్నది. కార్యప్రపంచము జడరూపమై యున్నది. అందువలన బ్రహ్మప్రపంచములు రెండును బరస్పరవిలక్షణములై యున్నవి. కావున నావిలక్షణబ్రహ్మమునకు విలక్షణప్రపంచముయొక్క యుపాదానకారణత్వము సంభవింపదు.

మఱియు సిద్ధాంతి యిట్లనును. ఎట్లింద్రియాగోచరము లగు ధర్మాధర్మములయందు శ్రుతియే ప్రమాణమై యున్నదో యట్లింద్రియాగోచర మగు బ్రహ్మమునందును శ్రుతియే ప్రమాణమై యున్నది. మఱియు "యతో వా ఇమాని భూతాని జాయంతే" ఇత్యాదిశ్రుతులు బ్రహ్మమువలన జగదుత్పత్తిస్థితిలయములు చెప్పునవై యాబ్రహ్మమునే జగత్తున కుపాదానకారణ మని చెప్పుచున్నవి. అందువలన నాశ్రుతిబలముచేతనే బ్రహ్మమునకు జగత్తుయొక్కయుపాదానకారణత్వము సిద్ధించుచున్నది. మఱియు శ్రుతిసిద్ధార్థమునందు యుక్త్యపేక్ష కలుగుట లేదు.

ఇట్లు చెప్పుటయును సంభవింపదు. ఏల యన, యుక్తికి విరుద్ధ మైన నాశ్రుత్యర్థమునకు నిర్ణయము సంభవింపదు. ఒకవేళ యుక్తికి విరుద్ధ మైన శ్రుత్యర్థమునకును నిర్ణయము కలిగినయెడల ఆవిరోధము నివర్తించుటకొఱ కుత్తరమీమాంసయొక్కయేయారంభ మున్నదో ఆయారంభమే వ్యర్థము కావలయును. అందువలనఁ బూర్వోక్తయుక్తికి విరుద్ధ మగుటవలనఁ జేతనబ్రహ్మమునకు జడజగత్తుయొక్కయుపాదానకారణత్వము సంభవించుట లేదు.

మఱియు బ్రహ్మమునకు జగత్తుయొక్కనిమిత్తకారణత్వమును సంభవింపదు. ఏల యన, లోకమునందు ఘటాదికార్యములకు నిమిత్తకారణరూపకులాలాదులు సంగవంతులుగాను గర్తలుగాను జూడఁబడుచున్నారు. మఱియు బ్రహ్మము అసంగ మనియును అకర్త యనియును శ్రుతి చెప్పుచున్నది. అందువలన నసంగమును నకర్తయు నగు బ్రహ్మమునకు జగత్తుయొక్కనిమిత్తకారణత్వమును సంభవింపదు. కనుక జడప్రపంచమునకు జడప్రధానమే యుపాదానకారణ మని యంగీకరింపవలయును. మఱియు, కపిలస్మృతియును జడప్రధానమునే జగత్తున కుపాదానకారణ మని చెప్పుచున్నది. మఱియుఁ బూర్వోక్తయుక్తికిని గపిలస్మృతికిని విరుద్ధ మగుటవలనఁ బూర్వోక్తశ్రుతియును ఆప్రధానమునే జగత్తున కుపాదానకారణ మని చెప్పిన ట్లగును. అందువలన నాజడప్రధానమే జడప్రపంచమున కుపాదానకారణమై యున్నది.

సమాధానము:—మాయోపహితబ్రహ్మమే యీజగత్తున కుపాదానకారణ మయ్యును, నిమిత్తకారణ మయ్యు నున్నది. మఱియు విలక్షణపదార్థములకుఁ గార్యకారణభావము సంభవింప దని, పూర్వము సాంఖ్యులచేత నేది చెప్పఁబడినదో అదియు నసంగతమై యున్నది. ఎట్లన, లోకమునందుఁ జేతనపురుషునియందుండి యచేతనము లగు కేశనఖాదులయుత్పత్తి చూడఁబడుచున్నది. మఱియు నచేతన మగు గోమయమునందుండి చేతనవృశ్చికాదులయుత్పత్తి చూడఁబడుచున్నది.

అందువలన విలక్షణపదార్థములకును గార్యకారణభావము లోకమునందుఁ బ్రసిద్ధమై యున్నది. కావునఁ జేతనబ్రహ్మమునందుండి యచేతనప్రపంచోత్పత్తి సంభవించు చున్నది.

మఱియు "సో ఽకామయత బహుస్యామ్" ఇత్యాదిశ్రుతులు బ్రహ్మ మునే జగత్తున కుపాదానకారణ మని చెప్పుచున్నవి. ఆశ్రుతికి విరుద్ధ మైన కేవల యుక్తి యప్రమాణ మగుటవలన, నాయుత్తరమీమాంసయొక్క యారంభమును సంభవించుచున్నది. ఏలాగున ననఁగా, శ్రుతికి ననుకూల మగు యుక్తియే ప్రమాణమై యున్నది. శ్రుతివిరుద్ధ మగు కేవలయుక్తిప్రమాణరూపము గానేరదు. అందు వలనఁ బూర్వోక్తశ్రుతులచేత నాబ్రహ్మమే జగదుపాదానకారణ మని సిద్ధ మగు చున్నది. మఱియు సాంఖ్యులచేఁ గల్పింపఁబడిన యేప్రధాన మున్నదో అది జగ త్తున కుపాదానకారణముగా సంభవింపదు. ఏకారణముచేత ననఁగా, ఆప్రధాన మచేతనమై యున్నది. అచేతనవస్తువునకు స్వతఃప్రవృత్తి సంభవించుట లేదు. ఇఁక నే మన, అచేతనము లగు రథాదికములకుఁ జేతనపురుషునియధీనముగానే ప్రవృత్తి చూడఁబడుచున్నది. మఱియు దృష్టార్థముయొక్క యనుసారముగానే యదృష్టార్థము కల్పింపఁబడుచున్నది. అందువలనఁ బ్రధానమునకు జగదుపాదానకారణత్వము సంభవింపదు. ఎట్లు మన్వాదికస్మృతులు శ్రుతిమూలకములై యున్నవో అట్లా కపిలస్మృతి శ్రుతిమూలకము గాదు. ఈకారణముచేతనే యది యప్రమాణరూప మై యున్నది. శ్రుతిమూలకస్మృతియే ప్రమాణరూప మగును. అందువలన నా కపిలస్మృతిచేతను బ్రధానమునకు జగత్కారణత్వము సిద్ధము గానేరదు.

శంక:—మీ మతమునందును అసంగబ్రహ్మమునకు జగత్కారణత్వ మెట్లు సంభవించును?

సమాధానము:—మామతమునం దసంగనిర్వికారశుద్ధబ్రహ్మము జగ త్కారణము గాదు. మఱియు నే మనఁగా, అనిర్వచనీయమాయోపహితబ్రహ్మమే జగత్తున కుపాదానకారణమును నిమిత్తకారణము నగుచున్నది. అందు, ఆవరణశక్తి విశిష్టమాయారూపోపాధియొక్క ప్రధానతచేతనో, ఆబ్రహ్మము జగత్తున కుపాదాన కారణ మగుచున్నది. మఱియు జ్ఞానశక్తి విశిష్టమాయోపహిత మైన తనస్వరూప ముయొక్క ప్రధానతచేత నాబ్రహ్మము జగత్తునకు నిమిత్తకారణ మగుచున్నది. అందు శ్రుతి.—"తదైక్షత బహుస్యాం ప్రజాయేయ"— భావము॥ ఆమాయోప హితబ్రహ్మము సృష్టికిఁ బూర్వము భావిప్రపంచవిషయకజ్ఞానరూపేక్షణమును జేసెను. పరమేశ్వరుఁ డగు నేను బహుతరరూపములుగా నుత్పన్నుఁడ నగుదును గాక. అను

శ్రుతియందుండు "తదైక్షత" అనువచనముచేత బ్రహ్మమునకు జగదుత్పత్తికిఁ బూర్వము జగత్తుయొక్క యీక్షణకర్తృత్వము చెప్పఁబడి యున్నది. దానిచే బ్రహ్మమునకు జగత్తుయొక్క నిమిత్తకారణత్వము సిద్ధ మగుచున్నది. ఉదా—ఘటోత్పత్తికిఁ బూర్వమందు ఘటోత్పత్తి కనుకూల మగు జ్ఞానముగల కులాలాదుల కాఘటమును గూర్చి నిమిత్తకారణత్వము సిద్ధ మగుచున్నది. మఱియు "బహుస్యాం ప్రజాయేయ" ఇత్యాది శ్రుతిచే బ్రహ్మమునకు బహుభవనరూపము లగుట చెప్పఁబడుచున్నది. కనుక బ్రహ్మమునకు జగత్తున కుపాదానకారణత్వము సిద్ధ మగుచున్నది. ఉదా—ఘటశరావాదిబహువిధరూపములు బొందునట్టి మృత్తికకు ఘటశరావాదికార్యములయొక్క యుపాదానకారణత్వము ప్రసిద్ధమే యగుచున్నది. మఱియు శ్రీవ్యాసభగవంతునిచేతను బ్రహ్మసూత్రమునందు మాయోపహితబ్రహ్మమే జగత్తున కుపాదానకారణ మనియు నిమిత్తకారణ మనియుఁ జెప్పఁబడి యున్నది. అందు సూత్రము "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్" — భావము॥ అమాయోపహిత బ్రహ్మమే జగత్తున కుపాదానకారణమును నిమిత్తకారణమును నై యున్న దని యంగీకరించుటయందే, శ్రుత్యుక్తప్రతిజ్ఞయును దృష్టాంతమును సంభవించుచున్నది. అచ్చట శ్రుతియందే కబ్రహ్మముయొక్క జ్ఞానముచేతనే సర్వజగత్తుయొక్క యేజ్ఞానము చెప్పఁబడి యున్నదో అది ప్రతిజ్ఞ యనంబడును. మఱియు ఏకమృత్తికయొక్క జ్ఞానముచేత నామృత్తికయొక్క ఘటశరావాదిసర్వకార్యములయొక్క యేజ్ఞానము చెప్పఁబడి యున్నదో అది దృష్టాంతమై యున్నది. ఎప్పు డాబ్రహ్మము సర్వజగదుపాదానకారణ మని యంగీకరింపఁబడు చున్నదో అప్పు డాప్రతిజ్ఞయును దృష్టాంతమును సంభవించుచున్నది. ఉపాదానకారణజ్ఞానముచేతనే కార్యములయొక్క జ్ఞానము కలుగుచున్నది. అందువలన నాసూత్రముచేతను బ్రహ్మమునకు జగత్తుయొక్క యభిన్ననిమిత్తోపాదానకారణత్వమే సిద్ధ మగుచున్నది. ఈయర్థము ప్రథమపరిచ్ఛేదమునందూర్ణనాభిదృష్టాంతముచేత విస్తరముగా నిరూపింపఁబడి యున్నది.

ఇఁక నాకారణ మన్యప్రకారముగా విభాగింపఁబడుచున్నది. పూర్వోక్తకారణము సాధారణము అసాధారణ మను భేదముచేత మరల ద్వివిధ మగుచున్నది. అందుఁ గార్యమాత్రము నుత్పన్నముఁ జేయు నేకారణమున్నదో అది సాధారణకారణ మనఁబడును. ఉదా—కార్యమాత్రమునకు జనకముగా నదృష్టదేశకాలాదిక మున్నది. మఱియుఁ గార్యవిశేషోత్పాదక మగు నేకారణ మున్నదో, అది యసాధారణకారణ మనఁబడును. ఉదా—చాక్షుషాదిప్రమయందుఁ జక్షురాదిక మసాధారణకారణమై యున్నది. ఈప్రకారముగా ఘటాభావవిషయకప్రమయం

దుక్తఘటానుపలబ్ధి యను ప్రమాణము ... [illegible] ... జ్ఞానికి ఘటాభావజ్ఞానము సంభవింపుచున్నది.

## [*] (63) అభావస్వరూపనిరూపణము [illegible]

ఇఁక, అభావప్రమాణముచే గ్రహింపఁబడు అభావముయొక్క స్వరూపము చెప్పఁబడుచున్నది. అచ్చట "నఞర్థోల్లేఖి తదీయధీ ... [illegible]"— ఆయా నఞ్ శబ్దముయొక్క అర్థమును విషయము చేయునట్టి "నాస్తి" యను ప్రతీతి యెప్పుడో ఆప్రతీతికి విషయము అభావ మని చెప్పఁబడును. ఉదా— "భూతలే ఘటో నాస్తి" అను ప్రతీతికి విషయము భూతలమందు ఘటాభావమై యున్నది. మఱియు నుక్తాభావము ఏకాత్యంతాభావమే యగుచున్నది. ప్రాగభావాది భేదముచేత నాయభావము చతుర్విధ మనుటయందు నేప్రమాణమును లేదు.

ఇచ్చట నైయాయికులైనవారు యిట్లు చెప్పుచున్నారు: ఈ యభావము ప్రాగభావము, ప్రధ్వంసాభావము, అత్యంతాభావము, అన్యోన్యాభావము అను భేదముచేత చతుర్విధమై యున్నది. అందు ఘటోత్పత్తికి పూర్వము మృత్పిండరూపకపాలములయందు "ఘటో భవిష్యతి" అను ప్రతీతి గలుగుచున్నది. ఆ ప్రతీతిచేత నాకపాలములయం దాఘటప్రాగభావము సిద్ధ మగుచున్నది. మఱియు ముద్గరప్రహారాదికముచేత నాఘటము భగ్న మైనయనంతరి మాకపాలముల యందు "ఘటో ధ్వస్తః" అను ప్రతీతి కలుగుచున్నది. ఆప్రతీతిచేత నాకపాలముల యందు ఘటప్రధ్వంసాభావము సిద్ధ మగుచున్నది. మఱియు భూతలమునందు ఘటము లేనప్పుడు "భూతలే ఘటో నాస్తి" యను ప్రతీతి కలుగుచున్నది. ఆ ప్రతీతిచేత నాభూతలమునందు ఘటాత్యంతాభావము సిద్ధ మగుచున్నది. మఱియు భూతలమునందు ఘట ముండునప్పుడును "భూతలం న ఘటః" అను ప్రతీతి కలుగుచున్నది. ఆప్రతీతిచేత భూతలమునందు ఘటముయొక్క భేదరూపాన్యోన్యాభావము సిద్ధ మగుచున్నది. ఈరీతిగా విలక్షణప్రతీతిబలమువలన నొకచేఘటమునకుఁ జతుర్విధాభావములు సిద్ధము లగుచున్నవి. అందుఁ బ్రాగభావ మనాదియును నాశవంతమునై యున్నది. ప్రధ్వంసాభావ ముత్పత్తిసహితమును నాశరహితమునై యున్నది. అత్యంతాభావాన్యోన్యాభావము లను రెండభావము లుత్పత్తివినాశరహితము లగుట వలన నిత్యములై యున్నవి. ఈ చతుర్విధాభావములును న్యాయప్రకాశము చతుర్థ పరిచ్ఛేదమునందు విస్తరముగా నిరూపింపఁబడి యున్నవి. దాని నచ్చటఁ దెలియ నగును.

ఈ నైయాయికులమతము సమీచీనము గాదు. ఏల యన "ఘటో భవిష్యతి" అను నుక్తప్రతీతి యభావవాచక నఞ్ శబ్దరహిత మగుటవలన నాప్రాగ భావమును విషయము చేయుట లేదు. ఇఁక నే మనఁగా, ఉత్తరత్ర భవిష్యత్కాలమునందుఁ గలుగఁబోవునట్టి ఘటముయొక్క సత్తతో సంబంధ మేది గలదో ఆ సత్తాసంబంధమునే యాప్రతీతి విషయము చేయుచున్నది. అందువలన నాప్రతీతిచేత ఘటప్రాగభావము సిద్ధ మగుట లేదు. మఱియు నాఘటోత్పత్తికిఁ బూర్వము ప్రాగ భావ మంగీకరించినయెడల నుత్పత్తికిఁ బూర్వ మస త్తగుటవలన నాఘటోత్పత్తియే లేకపోవలయును. అట్లు గాక యసత్తునకుఁగూడ నుత్పత్తి యంగీకరించినయెడల నస త్తగు శశవిషాణవంధ్యాపుత్రాదికమునకును ఉత్పత్తి కలుగవలయును.

శంక:—ఎట్లసత్తున కుత్పత్తి సంభవించుట లేదో అట్లు సత్తునకుఁ గూడ నుత్పత్తి సంభవించుట లేదు. ఏల యన, ఘటము మీామతమునందు తనయుత్పత్తికి పూర్వమే సిద్ధమై యున్నది. అందువలన నాఘటోత్పత్తికొఱకుఁ గులాలదండచక్రాది కారకములయొక్క వ్యాపారము లేవి గలవో ఆకారకవ్యాపారములు వ్యర్థములే యగును.

సమాధానము:—యద్యపి ఘటము తనయుత్పత్తికన్నఁ బూర్వము మృత్తికాదికారణరూపముగానే యున్నది. తథాపి, ఆకారకవ్యాపారమునకుఁ బూర్వ మాఘటమున కభివ్యక్తి కలుగుట లేదు. ఆకారకవ్యాపారానంతరమే ఆఘట మభివ్యక్త మగుచున్నది. అందువలన ఘటరూపకార్యముయొక్క యభివ్యంజకతామాత్రముచేత నాకారకవ్యాపారములకును సార్థకత్వము సంభవించుచున్నది.

మఱియు నుత్పత్తికిఁ బూర్వము కార్యమునకుఁ గారణరూపముచే సత్త కేవలయుక్తిచేతనే సిద్ధించుటయే గాక శ్రుతిసూత్రములచేతను సిద్ధించుచున్నది. అందు శ్రుతి.—"స దేవ సో మ్యేద మగ్ర ఆసీత్" — భావము॥ ఓప్రియదర్శనుఁడగు శ్వేతకేతూ! ఈదృశ్యమాన కార్యజగత్తు తనయుత్పత్తికిఁ బూర్వము సత్తుగానే యుండినది, అనఁగాఁ బరమకారణపరమాత్మరూపముచే సత్తుగా నుండినది. అందు సూత్రము.—"సత్త్వా చ్చావరస్య" — భావము॥ ఈప్రపంచరూపకార్యమునకుఁ దనయుత్పత్తికిఁ బూర్వము కారణరూపముచేత సత్త్వ ముండుటవలన, నీవర్తమానకాలమందును ఆపరమకారణముకన్న ననన్యత్వమే, అనఁగా నాపరమకారణరూపపరమాత్మకన్న భిన్నరూపముచేత అభావమే యగుచున్నది. ఒకవేళ నా ప్రాగభావము నంగీకరించినయెడలఁ బూర్వోక్తశ్రుతిసూత్రములకు విరోధము ప్రాప్త మగును. కాన శ్రుతిసూత్రములకు విరుద్ధ మగుటచే నాప్రాగభావము నంగీకరించుట యోగ్యము గాదు.

మఱియుఁ బ్రాగభావమువలెఁ బ్రధ్వంసాభావమునందును బ్రమాణమును లేదు. ఎట్లనఁగా, బ్రహ్మసాక్షాత్కారమునకుఁ బూర్వ మీకార్యప్రపంచమున కత్యంతనాశము కలుగుట లేదు. ఇంక నేమనఁగా, బీజాంకురన్యాయమువలె సృష్టిప్రలయములకుఁ బ్రవాహరూపముచే ననాదిత్వమే యున్నది. అనఁగా నెట్లు బీజమునుండి యంకురమును అంకురమునందుండి మరల బీజమును ఆబీజమునుండి మరల నంకురమును గలుగుచున్నదో, యట్లు సృష్ట్యనంతరము ప్రలయమును ప్రలయానంతరము మరల సృష్టియును అస్సృష్ట్యనంతరము మరలఁ బ్రలయమును గలుగుచున్నది. ఈప్రకారముగా నాసృష్టిప్రలయములు ప్రవాహరూపముచే ననాదులై యున్నవి. మఱియుఁ బ్రలయకాలమందును ఆకార్యప్రపంచమున కత్యంతనాశమగుట లేదు. మ ఱే మనఁగా, తనకారణమునందుఁ దిరోభూతమై యున్నది. ఈ ప్రకారమే యీకాలమందు భగ్నమైన ఘటాదికార్యములును దమకపాలాదిరూప కారణములయందుఁ దిరోభూతములై యున్నవి. ఆతిరోభావావస్థ "ఘటోధ్వస్తః" అను నుక్తప్రతీతికి విషయమై యున్నది. అందువలన నుక్తప్రతీతిచేత ఘటప్రధ్వంసాభావమునొక్కసిద్ధి యగుట లేదు. మఱియుఁ బ్రలయాదులయం దొకవేళఁ గార్యమున కత్యంతనాశ మంగీకరించినయెడల "సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్, ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్, నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః" ఇత్యాదిశ్రుతిస్మృతివచనములచేత సృష్టికిఁ బూర్వము లీనమైనకార్యమునకుఁ గారణరూపముచేత నేసత్త్వము చెప్పఁబడినదో, అది యసంగత మగును. అందువలన నాశ్రుతిస్మృతివచనములకు విరుద్ధ మగుటవలన నాప్రధ్వంసాభావముగూడ నంగీకరించుట యోగ్యము గాదు.

మఱియు నైయాయికు లత్యంతాభావాన్యోన్యాభావముల నుత్పత్తివినాశరహితనిత్యము లని యంగీకరించుచున్నారు. అదియును అసంగతము. ఏల యన "ఏక మేవాద్వితీయమ్" అను శ్రుతియొ బ్రహ్మమును సర్వద్వైతప్రపంచరహితమని చెప్పి యున్నది. మఱియు "నేహ నానాస్తి కించన" అను శ్రుతియు బ్రహ్మమునందు సర్వద్వైతప్రపంచమును నిషేధించి యున్నది. మఱియు "అతో ఽన్యదార్తమ్" అను శ్రుతి బ్రహ్మమునకు భిన్నమైన సర్వప్రపంచమును మిథ్య యని చెప్పుచున్నది. ఒకవేళ నాయత్యంతాభావాన్యోన్యాభావములను సత్యము లని యంగీకరించినయెడల, నీసర్వశ్రుతులకును విరోధ మగును. అందువలన నారెండభావములనుగూడ ననిత్యము లనియే యంగీకరింపవలయును. మఱియు నాయాభావములతోఁ జక్షురాదీంద్రియములకు నేప్రకారముగాను సంబంధము సంభవింప దను సిద్ధాంతము పూర్వము చెప్పఁబడి యున్నది. అందువలన "భూతలే ఘటో నాస్తి" అను నుక్త

ప్రత్యక్షప్రతీతిచేత నానిత్యాత్యంతాభావముయొక్క సిద్ధి యగుట లేదు. మఱియు "ఘటః పటో న" ఇత్యాదిప్రతీతి యన్యోన్యాభావమును విషయము చేయుట లేదు. మఱి యే మనఁగా, నాఘటపటములరెంటియొక్క నభేదమున కేయత్యంతాభావ మున్నదో దానినే యాప్రతీతి విషయముఁ జేయుచున్నది. అందువలనఁ బూర్వోక్తప్రతీతిచేత నన్యోన్యాభావముయొక్క సిద్ధి యగుట లేదు. మఱియు, నీభేదరూపాన్యోన్యాభావము ప్రథమపరిచ్ఛేదమునందు విస్తరముగా ఖండింపఁబడి యున్నది. ఈప్రకారముగాఁ బ్రాగభావ ప్రధ్వంసాభా వాన్యోన్యాభావము లను త్రివిధాభావములను నిరూపించుటకు సాధ్యము గానందున నేకాత్యంతాభావమే యంగీకార్యమై యున్నది.

## [*] (64) పారమార్థికాత్యంతాభావనిరూపణము. [*]

ఆ యత్యంతాభావము పారమార్థిక వ్యావహారిక భేదముచేత ద్విప్రకారమై యున్నది. అందు "నేహ నానాస్తి కించన" అను శ్రుతిచేతఁ బ్రత్యగభిన్నబ్రహ్మమునందు బోధింపఁబడిన జీవేశ్వరజగద్రూపద్వైతప్రపంచముయొక్క నేయత్యంతాభావ మున్నదో ఆయత్యంతాభావము పారమార్థిక మని చెప్పఁబడుచున్నది.

శంక:—పూర్వోక్తాత్యంతాభావమునందుఁ బారమార్థికత్వము సంభవింపదు. ఏల యనఁ బ్రతియోగిసత్తయొక్క యధీనముగానే యభావముయొక్క సత్త యున్నది. మఱియుఁ బ్రపంచరూపప్రతియోగి కల్పితమై యున్నది. అందువలన నాప్రపంచముయొక్క యత్యంతాభావముగూడఁ గల్పితమే యగును. మఱియుఁ బ్రపంచముయొక్క యత్యంతాభావమును బారమార్థిక మని యంగీకరించినయెడల, బ్రహ్మమున కద్వితీయత్వమును జెప్పునట్టి "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అనుశ్రుతికి విరోధ మగును.

సమాధానము:—కల్పితవస్తువుయొక్క యభావ మధిష్ఠానరూపమే యగును. అధిష్ఠానముకన్న భిన్నము గాదు. అందువలనఁ గల్పితప్రపంచముయొక్క యత్యంతాభావమును అధిష్ఠానబ్రహ్మరూపమే యగును. ఆయధిష్ఠానముకన్న భిన్నము కాదు. మఱియు నధిష్ఠానబ్రహ్మమునకుఁ బారమార్థికత్వము శ్రుతిస్మృతులచేత సిద్ధమే యగును. అందువలన నాయధిష్ఠానరూపత్వముచేత నాయత్యంతాభావమునకును బారమార్థికత్వమే సంభవించుచున్నది. మఱియు నాయత్యంతాభావ మధిష్ఠానబ్రహ్మముకన్న భిన్నము కాదు. అందువలన నాయద్వైతబోధకశ్రుతులకును విరోధ మగుట లేదు.

శంక:—అత్యంతాభావ మధిష్ఠానరూప మనినయెడల నాయధిష్ఠానజ్ఞాన మనుపలబ్ధిప్రమాణముచేత ఘటిల్లదు. అందువలన మీమతమునం దాయనుపలబ్ధి ప్రమాణాంగీకారమే వ్యర్థ మగును.

సమాధానము:—భూతలాదికమునం దేఘటాద్యత్యంతాభావ మున్నదో ఆయత్యంతాభావమును మే మధిష్ఠానరూప మని యంగీకరించుట లేదు. ఇఁక నే మనఁగా వ్యావహారికఘటాదులయొక్క వ్యావహారికాత్యంతాభావ మధిష్ఠానముకన్న భిన్నమే యగును. ఆవ్యావహారికాత్యంతాభావముయొక్క జ్ఞానముకొఱకే పూర్వ మనుపలబ్ధిప్రమాణము మాచే నంగీకరింపఁబడినది. అందువలన ననుపలబ్ధిప్రమాణాంగీకారము వ్యర్థము గాదు.

ఇచ్చటఁ గొందఱు గ్రంథకారులు చెప్పున దే మనఁగా "నేహ నానాస్తి కించన" అను శ్రుతిచేతఁ బ్రపంచముయొక్క యేపారమార్థికాత్యంతాభావము బ్రహ్మమునందుఁ జెప్పఁబడి యున్నదో ఆయత్యంతాభావ మధిష్ఠానబ్రహ్మముకన్న భిన్నమే యగును. అధిష్ఠానస్వరూపము గాదు. ఏకారణముచేత ననఁగా, భావాభావముల కేకత్వము సంభవింపదు. మఱియు "ఏక మేవా ద్వితీయం బ్రహ్మ" అను శ్రుతి కైననో భావాద్వైతమందుఁ దాత్పర్యము. అనఁగా బ్రహ్మముకన్న భిన్నముగా మఱియొకభావపదార్థము లే దనుట. అందువలన బ్రహ్మముకన్న భిన్నముగా నత్యంతాభావ ముండినను ఆయద్వైతశ్రుతికి విరోధము గలుగనేరదు.

ఈమతము సమీచీనము గాదు. ఏల యన "ఏక మేవా ద్వితీయం బ్రహ్మ" అనుశ్రుతి బ్రహ్మము భావాభావరూపసర్వద్వైతప్రపంచరహిత మని చెప్పుచున్నది. ఆశ్రుత్యర్థమును సంకోచపఱచి కేవలభావాద్వైతపరత్వ మంగీకరించుటయం దే ప్రమాణమును లేదు. మఱియుఁ బ్రపంచముయొక్క యత్యంతాభావ మధిష్ఠానబ్రహ్మముకన్న భిన్న మనినయెడల నాయత్యంతాభావమునందుఁ బారమార్థికత్వమును సంభవింపక పోవును. ఏల యన, అధిష్ఠానముకన్న భిన్న మైన యభావము ప్రతియోగిసత్తా సమానసత్తాసహితమే యని నియమ మున్నది. మఱియుఁ బ్రపంచరూపప్రతియోగి కల్పితమై యున్నది. అందువలనఁ గల్పితప్రపంచముయొక్క యత్యంతాభావమును గల్పితమే యగును. కావునఁ బూర్వోక్తపక్షము సమీచీనము గాదు.

### [*] (65) వ్యావహారికాత్యంతాభావనిరూపణము. [*]

ఇఁక ద్వితీయ మగు వ్యావహారికాత్యంతాభావము చెప్పఁబడుచున్నది. అచ్చట భూతలమునం దేఘటాత్యంతాభావ మున్నదో దానిని "భూతలే ఘటో

నాస్తి ” అను ప్రతీతి విషయము చేయుచున్నది. ఆ యత్యంతాభావము వ్యావహారికాత్యంతాభావ మనఁబడును. ఈ వ్యావహారికాత్యంతాభావమే పూర్వోక్తయోగ్యాఽనుపలబ్ధిచేత గ్రహింపఁబడుచున్నది. మఱియు నాభూతలమునందు ఘటాభేద మున కేయత్యంతాభావ మున్నదో ఆయత్యంతాభావమునే నైయాయికులు “ భూతలం న ఘటః ” అనుప్రతీతికి విషయముగా భేద మనియును అన్యోన్యాభావ మనియును జెప్పుచున్నారు. అందువలన నాభేదరూపాన్యోన్యాభావ మాయత్యంతాభావముకన్న భిన్నము కాదు. మఱియు శ్రుతియథార్థతాత్పర్యజ్ఞానరహితు లగు నైయాయికులు జీవేశ్వరాదులయొక్క భేదమును భూతలాదికమునందు ఘటాద్యత్యంతాభావములు నంగీకరించుచున్నారు. ఆసర్వాభావము లనిత్యములే యగుచున్నవి. ఒక యభావమును నిత్యము గాదు. ఎట్లన బ్రహ్మముకన్న భిన్న మగు నేభావాభావ రూపజగత్తున్నదో ఆసర్వజగత్తును అవిద్యాకార్యమై యున్నది. మఱియుఁ దత్త్వమస్యాది మహావాక్యజన్యబ్రహ్మాత్మసాక్షాత్కారముచేత నాయవిద్య నాశ మగుచున్నది. ఆయవిద్యకు నాశము గలుగఁగా నాయవిద్యాకార్య మగు ప్రపంచమునకును నాశము కలుగుచున్నది. ఈరీతిగా సర్వానాత్మప్రపంచమును ఆత్మజ్ఞానముచే నివృత్త మగుటవలన నాయభావముల కనిత్యత్వమే సిద్ధ మగుచున్నది.

ఇచ్చటఁ గొందఱు గ్రంథకారులో న్యాయశాస్త్రానుసారముగా నుక్తాభావము ప్రాగభావము, ప్రధ్వంసాభావము, అత్యంతాభావము, అన్యోన్యాభావ మను భేదముచేతఁ జతుర్విధముగా నంగీకరించుచున్నారు. ఇఁక నాచతుర్విధాభావములయొక్క లక్షణములు చెప్పఁబడుచున్నవి. అందు, తనయుత్పత్తికిఁ బూర్వము కార్యమునకుఁ దనయుపాదానకారణమునం దేయభావ మున్నదో అది ప్రాగభావ మనంబడును. ఉదా—ఘటాదికార్యములకుఁ దమయుత్పత్తికిఁ బూర్వము మృత్తికాదికారణములయందుఁ బ్రాగభావ మున్నది. అనఁగా నేయభావ మనాది యయ్యును స్వప్రతియోగికి జనక మయ్యు నున్నదో ఆయభావము ప్రాగభావ మనంబడును. లేక, ఏయభావ మనాది యయ్యును నాశవంతము నగుచున్నదో ఆయభావము ప్రాగభావ మనంబడును. మఱియు నుత్పన్న మైనకార్యమునకుఁ దనయుపాదానకారణమునం దేయభావ మున్నదో ఆయభావము ప్రధ్వంసాభావ మనంబడును. ఉదా—ముద్గరాదిప్రహారానంతరము కపాలాదికారణములయం దాఘటాదికార్యములయొక్క ప్రధ్వంసాభావ మున్నది. మఱియుఁ దనప్రతియోగియొక్క యసమానాధికరణమునం దేయభావ మున్నదో ఆయభావ మత్యంతాభావ మనంబడును. ఉదా—భూతలాదికమునం దేఘటాద్యత్యంతాభావ మున్నదో ఆయత్యంతాభావము

తనప్రతియోగియొక్కయధికరణముకంటె భిన్నాధికరణమునందే యున్నది. మఱియు నేయభావము తనప్రతియోగియొక్కసమానాధికరణమునం దున్నదో, లేక, ఏయభావమునకుం దాదాత్మ్యమే ప్రతియోగి యగుచున్నదో ఆయభావ మన్యోన్యాభావ మనంబడును. ఈయన్యోన్యాభావమును భేద మనియును చెప్పుదురు. ఉదా— భూతలాదికమునందు ఘటాన్యోన్యాభావరూపభేద మున్నదో, ఆయన్యోన్యాభావము భూతలమునందు ఘట ముండునప్పుడును ఉన్నది. అందువలన నాయన్యోన్యాభావము ప్రతియోగిసమానాధికరణ మని చెప్పంబడును.

ఆప్రాగభావాదిసర్వాభావములును మాయాకార్యము లగుటవలన ననిత్యములే యగుచున్నవి. అందువలన, అత్యంతాభావాన్యోన్యాభావము లను రెండభావములు నిత్యములై యున్నవి, మఱియుఁ బ్రాగభావప్రధ్వంసాభావము లను రెండభావము లనిత్యములై యున్న వను నీ నైయాయికులకథనము సర్వప్రపంచమును నిషేధించి యుండు శ్రుతులకు విరుద్ధ మగుటవలన నసంగతమై యున్నది.

అభావప్రమానిరూపణము సమాప్తము.

ఈప్రకారముగాఁ బూర్వము నిరూపింపఁబడిన ప్రత్యక్షానుమిత్యుపమితి శాబ్దార్థాపత్త్యభావప్రమ లను నేషడ్విధప్రమ లున్నవో ఆసర్వప్రమలచేత నావరణశక్తిసహితాజ్ఞానముయొక్కనివృత్తియే కలుగుచున్నది. దానియందును అనుమిత్యాదిపరోక్షప్రమలచేతనో అసత్త్వాపాదకావరణశక్తివిశిష్టాజ్ఞానమే నివృత్త మగుచున్నది. మఱియు నపరోక్షప్రమచేతనో యభానాపాదకావరణశక్తి విశిష్టాజ్ఞానమే నివృత్త మగుచున్నది. ఆయావరణశక్తి సహితాజ్ఞాననివృత్త్యనంతరము ఘటాదివిషయములయొక్కభాన మగుచున్నది. ఈరీతిగాఁ దత్త్వమస్యాదిమహావాక్యజన్య మగు "అహం బ్రహ్మాస్మి" యను నపరోక్షప్రమచేత బ్రహ్మావరక మగు మూలాజ్ఞానమునకు నివృత్తి కలుగఁగా నీయధికారిపురుషునకు బ్రహ్మసాక్షాత్కారము కలుగుచున్నది. అందువలన నీపరిచ్ఛేదమునందుఁ బ్రమానిరూపణము సార్థకమై యున్నది.

ఇది శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీస్వామ్యుద్ధవానందగిరిపూజ్యపాదశిష్య స్వామి చిద్ఘనానందగిరి విరచిత ప్రాకృత తత్త్వానుసంధానముయొక్కద్వితీయపరిచ్ఛేదము సమాప్తము.

శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్.

శ్రీగణేశాయ నమః.

శ్రీశంకరాచార్యేభ్యో నమః.

# తత్త్వానుసంధానము

## తృతీయపరిచ్ఛేదము.

పూర్వము ద్వితీయపరిచ్ఛేదముయొక్క ప్రథమమున, ప్రమ అప్రమ అను భేదముచేత ద్వివిధవృత్తులు చెప్పఁబడినవి. దానియందుఁ బ్రథమప్రమావృత్తియో ప్రమాణఫలసహితముగా ద్వితీయపరిచ్ఛేదమునందు విస్తరముగా నిరూపింపఁబడినది. ఇఁక నీతృతీయపరిచ్ఛేదమునందు రెండవది యగు నప్రమావృత్తి విస్తరముగా నిరూపింపఁబడుచున్నది.

### [*] (1) అప్రమావృత్తినిరూపణము. [*]

శంక:—"అహం బ్రహ్మాస్మి" యను ప్రమావృత్తియో అజ్ఞాననివృత్తిఁ జేసి యీయధికారిపురుషునకు బ్రహ్మభావమును బ్రాప్తింపఁజేయుచున్నది. అందువలనఁ బ్రమావృత్తిని గ్రంథమునందు నిరూపించుట యుచితము. అప్రమావృత్తివలన నీయధికారిపురుషునకే ప్రయోజనమును సిద్ధించుట లేదు. అందువలన గ్రంథమునం దప్రమావృత్తి నిరూపించుట నిష్ఫలమై యున్నది.

సమాధానము:—ప్రతిబంధకరహితప్రమకే యజ్ఞాననివర్తకత్వ మున్నది. అందువలన నాప్రతిబంధకమును దన్నివృత్త్యుపాయము నను నీరెంటి నీయధికారి యవశ్యము తెలియవలయును. అందు, అసంభావనావిపరీతభావన లను రెండును బ్రతిబంధకము లనఁబడును. మఱియు శ్రవణ మనన నిదిధ్యాసము లను మూడును, ఆప్రతిబంధనివృత్తి కుపాయములై యున్నవి. అచ్చట, అసంభావనావిపరీతభావనల కాత్మజ్ఞానప్రతిబంధకత్వము పరాశరమునిచేతను జెప్పఁబడి యున్నది. "శ్లో. భావనా విపరీతా యా యాచా ఽసంభావనా శుక। కురుతే ప్రతిబంధం సా తత్త్వజ్ఞానస్య నాపరమ్"—భావము॥ ఓశుకా!- విపరీతభావన అసంభావన అను రెండును ఆత్మజ్ఞానమును బ్రతిబంధించుచున్నవి. మఱి యేదియుఁ బ్రతిబంధించుట లేదు. అందు

వలన నధికారిపురుషుఁడు శ్రవణాదులచేత నా ప్రతిబంధకములను అవశ్యము నివ ర్తించుకొన వలయును.

మఱియు శ్రవణాదుల కాత్మజ్ఞానసాధనత్వ మేది గలదో అదియును అప్రతిబంధకనివృత్తిద్వారముగానే యున్నది. సాక్షాత్తుగా లేదు. మఱియు నా ప్రతిబంధకరూపము లగు నసంభావనావిపరీతభావనలు వక్ష్యమాణరీతిగా నప్రమాజ్ఞానమునం దంతర్భూతములే యగుచున్నవి. అందువలన నాయప్రమావృత్తి యవశ్యము నిరూపించుటకు యోగ్యమై యున్నది. ఈ యభిప్రాయముచేత సీతృతీయపరిచ్ఛేదమునం దప్రమావృత్తి విస్తరముగా నిరూపింపఁబడుచున్నది. "ప్రమాభిన్నం, జ్ఞాన మ్యప్రమా"—భావము॥ పూర్వము ద్వితీయపరిచ్ఛేదమునందుఁ జెప్పఁబడిన యేప్రమ యున్నదో ఆప్రమకు భిన్న మైనజ్ఞాన మప్రమ యని చెప్పఁబడును. ఉదా—శుక్తి యందు "ఇదం రజతమ్" ఇత్యాదిజ్ఞానము ప్రమాజ్ఞానముకన్న భిన్న మగుటవలన అప్రమ యని చెప్పఁబడుచున్నది. అచ్చట "జ్ఞాన మప్రమా" అను నింతమాత్రమే ఆయప్రమకు లక్షణముగాఁ జెప్పి యాలక్షణమునందు "ప్రమాభిన్నమ్" అనుపదముఁ జెప్పనియెడల ప్రమాజ్ఞానమునం దాలక్షణమున కతివ్యాప్తి యగును. ఆ యతివ్యాప్తిదోషము నివారించుటకొఱకు ఆలక్షణమునందు "ప్రమాభిన్నమ్" అనుపదము చెప్పఁబడినది. ప్రమాజ్ఞానమునందుఁ బ్రమకన్న భిన్నత్వ ముండుట లేదు. అందువలనఁ బ్రమాజ్ఞానమునం దుక్తలక్షణమున కతివ్యాప్తి గలుగదు. మఱియు "ప్రమాభిన్నా అప్రమా" అను నింతమాత్రమే యప్రమకు లక్షణముగాఁ జెప్పి యాలక్షణమునందు "జ్ఞానమ్" అనుపదముఁ జెప్పనియెడలఁ బ్రమాజ్ఞానమునకు భిన్న మైన ఘటాదులయం దాలక్షణమున కతివ్యాప్తి యగును. ఆ యతివ్యాప్తిదోషము నివారించుటకొఱకు ఆలక్షణమునందు "జ్ఞానమ్" అనుపదము చెప్పఁబడినది. ఆఘటాదుల యందు జ్ఞానరూపత్వము లేదు. అందువలన నాఘటాదులయం దప్రమయొక్కలక్షణమున కతివ్యాప్తి గలుగదు.

## [*] (2) స్మృతి నిరూపణము. [*]

ఇఁక, అప్రమావృత్తివిభాగము చెప్పఁబడుచున్నది. పూర్వోక్తాప్రమావృత్తి, స్మృతి అనుభవ మను భేదముచేత ద్విప్రకారమై యున్నది. అందు "సంస్కారమాత్రజన్యం జ్ఞానం స్మృతిః" — భావము॥ సంస్కారమాత్రముచేత జన్య మగు నేజ్ఞాన మున్నదో అది స్మృతి యని చెప్పఁబడును. ఉదా—"సా మే మాతా స మే పితా" (అది నాతల్లి అతఁడు నాతండ్రి) ఇత్యాదిజ్ఞానము సంస్కారమాత్ర జన్య మగుటవలన స్మృతి యని చెప్పఁబడుచున్నది. అచ్చట, ఈలక్షణమునందు

"మాత్ర" అనుపదముఁ జెప్పనియెడల "సోయం దేవదత్తః" అను ప్రత్యభిజ్ఞాప్రత్యక్షమునం దాస్స్మృతియొక్క లక్షణమున కతివ్యాప్తి యగును. ఎట్లనఁగా, ఆప్రత్యభిజ్ఞాప్రత్యక్షముగూడ సంస్కారముచేత జన్యమే యగుచున్నది. ఆ యతివ్యాప్తిదోషమును నివారించుటకొఱకు కాలక్షణమునందు "మాత్ర" అనుపదము చెప్పఁబడినది. అచ్చట, ప్రత్యభిజ్ఞాప్రత్యక్షము కేవలసంస్కారజన్యము గాదు. మఱి యేమనఁగా, తత్సంస్కారసహకృతేంద్రియజన్యమై యున్నది. అందువలన "మాత్ర" అనుపదముఁ జెప్పుటవలనఁ బ్రత్యభిజ్ఞాప్రత్యక్షమునం దాలక్షణమున కతివ్యాప్తి గలుగదు.

మఱియు నాలక్షణమునందు "జ్ఞానమ్" అనుపదముఁ జెప్పనియెడల సంస్కారరూపప్రతియోగిచేత జన్య మగు నేసంస్కారధ్వంస మున్నదో దానియం దాలక్షణమున కతివ్యాప్తి గలుగును. ఆయతివ్యాప్తిదోషము నివారించుటకొఱకు కాలక్షణమునందు "జ్ఞానమ్" అనుపదము చెప్పఁబడినది. అచ్చట నాధ్వంసమునందు జ్ఞానరూపత్వము లేదు. అందువలన నాధ్వంసమునందు స్మృతియొక్క లక్షణమున కతివ్యాప్తి గలుగదు. ఇచ్చట అభిప్రాయ మే మనఁగా, ఆసంస్కారము వేగము, భావన, స్థితిస్థాపక మను భేదముచేతఁ ద్రివిధమై యున్నది. అందు, ఏసంస్కారము క్రియాజన్య మయ్యును అన్యక్రియకు జనకమయ్యు నున్నదో ఆసంస్కారము వేగ మని చెప్పఁబడును. ఆవేగ మను సంస్కారము బాణాదులయం దున్నది. మఱియు నేసంస్కార మనుభవజ్ఞానముచేత జన్య మయ్యును స్మృతిజ్ఞానమునకు జనక మయ్యు నున్నదో ఆసంస్కారము భావన యని చెప్పఁబడును. ఆభావనాఖ్యసంస్కారము వేదాంతసిద్ధాంతమందో అంతఃకరణమునందే యున్నది. నైయాయికులమతమునం దాత్మయం దున్నది. ఎట్లనఁగా, వేదాంతుల కభిమత మగు నేయహంకార మున్నదో, దానినే నైయాయికు లాత్మ యని యంగీకరించుచున్నారు. మఱియు అన్యథా చేయఁబడినవస్తువునకుఁ బూర్వమువలె స్థితిని జేయునట్టి యేసంస్కార మున్నదో అది స్థితిస్థాపక మని చెప్పఁబడును. ఆస్థితిస్థాపక మను సంస్కారము ధనుర్దండాదులయం దున్నది. ఈ త్రివిధసంస్కారములును న్యాయప్రకాశము తృతీయపరిచ్ఛేదమునందు విస్తరముగాఁ జెప్పఁబడి యున్నవి. దాని నచ్చటఁ దెలియవలయును. అందు వేగము స్థితిస్థాపక మను ద్వివిధసంస్కారములకు యద్యపి క్రియాజనకత్వమే యున్నది. తథాపి, భావనాఖ్యసంస్కారమునకు జ్ఞానజనకత్వ ముండుటవలన, నాస్మృతియొక్క లక్షణమునందు సంస్కారశబ్దముచేత భావనాఖ్యసంస్కారమే వివక్షితమై యున్నది. అందువలనఁ బూర్వోక్తస్మృతియొక్క లక్షణము సంభవించుచున్నది.

## [*] (3) స్మృతివిభాగనిరూపణము. [*]

ఇఁక నాస్మృతియొక్కవిభాగము చెప్పఁబడుచున్నది. పూర్వోక్తస్మృతి, యథార్థాయథార్థభేదముచేత ద్వివిధమై యున్నది. అందు యథార్థానుభవజన్యసంస్కారమువలన జన్య మైన యేస్మృతి యున్నదో అది యథార్థస్మృతి యనఁబడును. అయథార్థానుభవజన్యసంస్కారమువలన జన్య మైన యేస్మృతి యున్నదో అది యయథార్థస్మృతి యనఁబడును. ఆయథార్థస్మృతియును అనాత్మస్మృతి, ఆత్మస్మృతి అను భేదముచేత ద్విప్రకారమై యున్నది. అందు "వ్యావహారికః ప్రపంచః మిథ్యా, దృశ్యత్వాత్, శుక్తిరూప్యవత్" అను నీయనుమానముచేత జన్య మగు ప్రపంచమిథ్యాత్వముయొక్క యేయనుభవ మున్నదో తదనుభవజన్యసంస్కారమువలన నీయధికారిపురుషున కుత్పన్న మైన ప్రపంచమిథ్యాత్వస్మృతి యేది గలదో ఆ స్మృతి యథార్థానాత్మస్మృతి యనఁబడును. మఱియు, తత్త్వమస్యాదిమహావాక్యజన్య మగు "అహం బ్రహ్మాస్మి" యను నేయనుభవ మున్నదో ఆయనుభవముచే జన్యమగుసంస్కారమువలన నీయధికారిపురుషున కుత్పన్న మైన ప్రత్యగభిన్నబ్రహ్మముయొక్కస్మృతి యేది గలదో ఆస్మృతి యథార్థాత్మస్మృతి యనఁబడును. ఈప్రకారముగానే ద్వితీయ మగు నయథార్థస్మృతియును అనాత్మస్మృతి ఆత్మస్మృతి యను భేదముచేత ద్వివిధమై యున్నది. అందు "వాచారంభణం వికారో నామధేయమ్, అతో న్యదార్తమ్, మాయామాత్ర మిదం ద్వైతమ్" ఇత్యాదిశ్రుతులచేతను బూర్వోక్తానుమానముచేతను ఈప్రపంచమునకు మిథ్యాత్వమే సిద్ధ మగుచున్నది. అట్టి మిథ్యాప్రపంచమునం దేసత్యత్వానుభవ మున్నదో అది భ్రమరూపమే యగును. అయథార్థానుభవజన్యసంస్కారమువలన నుత్పన్న మైన ప్రపంచముయొక్కసత్యత్వస్మృతి యేది గలదో ఆస్మృతి అయథార్థానాత్మస్మృతి యనఁబడును. మఱియు నహంకారముమొదలు స్థూలదేహపర్యంతము గల సర్వానాత్మపదార్థములాత్మభావరహితము లైనందున ఆయహంకారాదులయం దేయాత్మత్వబుద్ధి యున్నదో అది అయథార్థానుభవమే యగుచున్నది. తదయథార్థానుభవజన్యసంస్కారమువలన నుత్పన్న మైన యాయహంకారాదులయం దాత్మభావస్మృతి యేది గలదో ఆస్మృతి అయథార్థాత్మస్మృతి యనఁబడును. లేక, వాస్తవముచేతఁ గర్తృత్వరహితాత్మయందుఁ గర్తృత్వబుద్ధిరూపాయథార్థానుభవజన్యసంస్కారమువలన నుత్పన్న మైన కర్తృత్వస్మృతి యేది గలదో ఆస్మృతి అయథార్థాత్మస్మృతి యనఁబడును.

శంక:—స్వప్నమునం దేపదార్థములయొక్క జ్ఞానము గలుగుచున్నదో అదియును అయథార్థస్మృతి యైనందువలన నాస్వప్నముయొక్క జ్ఞానము నిచ్చట నేల విడువవలయును ?

సమాధానము:—స్వప్నజ్ఞానము స్మృతిరూపము కాదు. ఇఁక నే మనఁగా, అనుభవరూపమే యగుచున్నది. ఎట్లన, స్వప్నజ్ఞానము ఒకవేళ స్మృతిరూపమైనయెడల నాస్వప్నమునందు లోకులకు "స రథః" (ఆరథము) అనియే రథాది పదార్థములయొక్క జ్ఞానము కలుగవలయును. అట్టిజ్ఞానము కలుగుట లేదు. ఇంకే మనఁగా, నేను రథమును జూచుచున్నా నను ననుభవమే యాస్వప్నమునందుఁ గలుగుచున్నది. ఇందువలన నాస్వప్నజ్ఞాన మనుభవరూపమే యగుచున్నది. స్మృతి రూపము గాదు. ఈయర్థ ముత్తరత్రయును నిరూపింపఁబడును. ఇంతపర్యంతము స్మృతినిరూపణము చేయఁబడినది.

## [*] (4) అ ను భ వ ని రూ ప ణ ము. [*]

ఇఁక, అనుభూతియొక్క నిరూపణము చేయఁబడుచున్నది. "స్మృతిభిన్నం జ్ఞాన మనుభూతిః" — భావము॥ పూర్వోక్తస్మృతిజ్ఞానమునకు భిన్నమైన యేజ్ఞాన మున్నదో అది యనుభూతి యనఁబడును. ఈ యనుభూతిని అనుభవ మనియును జెప్పుదురు. ఉదా—"అయం ఘటః, ఇదం రజతమ్" ఇత్యాదిజ్ఞానము లాస్మృతి జ్ఞానమునకు భిన్నము లగుటవలన ననుభవరూపములై యున్నవి. అచ్చట "జ్ఞాన మనుభూతిః" అను నింతమాత్రమే యాయనుభవమునకు లక్షణ మనినయెడల స్మృతిజ్ఞానమునం దాయనుభవలక్షణమున కతివ్యాప్తి యగును. ఆయతివ్యాప్తిదోషము నివారించుటకొఱకు కాలక్షణమునందు "స్మృతిభిన్నమ్" అనుపదము చెప్పఁబడినది. మఱియు "స్మృతిభిన్నా అనుభూతిః" అను నింతమాత్రమే యాయనుభవమునకు లక్షణ మనినయెడల స్మృతిజ్ఞానమునకు భిన్నములైన ఘటాదులయం దాలక్షణమున కతివ్యాప్తి యగును. ఆయతివ్యాప్తిదోషము నివారించుటకొఱకు కాలక్షణమునందు "జ్ఞానమ్" అనుపదము చెప్పఁబడినది.

## [*] (5) అ ను భ వ వి భా గ క థ న ము. [*]

ఇఁక, అనుభవముయొక్క విభాగము చెప్పఁబడుచున్నది. పూర్వోక్తానుభవమును యథార్థాయథార్థము లను భేదముచేత ద్వివిధమై యున్నది. అందు, అబాధితార్థమును విషయము చేయు నేప్రమ యున్నదో అది యథార్థానుభవమై యున్నది. ఈప్రమారూపయథార్థానుభవము ద్వితీయపరిచ్ఛేదమునందు విస్తరముగా నిరూపింపఁబడియున్నది. అందువలన నిచ్చట మరల నిరూపింపక విరమించితిమి.

ఇఁక, అయథార్థానుభవము నిరూపింపఁబడుచున్నది "బాధితార్థవిషయానుభూతిః అయథార్థానుభూతిః" — భావము॥ విషయముయొక్కయభావప్రమ యేది గలదో అది బాధ యనఁబడును. ఆబాధ కేది విషయమై యున్నదో అది బాధిత మనఁబడును. ఆబాధితార్థవిషయకానుభవ మేది గలదో ఆయనుభవ మయథార్థానుభవ మనంబడును. ఉదా—"నేదం రజతమ్" ఇత్యాది బాధజ్ఞానమునకు విషయ మగుటవలన, బాధితము లగుశుక్తిరజతాదులను విషయము చేయు "ఇదం రజతమ్" ఇత్యా ద్యనుభవ మయథార్థానుభవ మని చెప్పఁబడును. అచ్చటఁ బ్రమాజ్ఞానమునం దీయయథార్థానుభవముయొక్కలక్షణమున కతివ్యాప్తి నివారించుటకొఱకీలక్షణమునందు "బాధితార్థవిషయా" అనుపదము చెప్పఁబడినది. మఱియు బాధితార్థమును విషయము చేయునట్టి యయథార్థస్మృతియం దీలక్షణమున కతివ్యాప్తి నివారించుటకొఱకీలక్షణమునందు "అనుభూతిః" అనుపదము చెప్పఁబడినది.

మఱియు ఆయయథార్థానుభవమును సంశయము నిశ్చయ మను భేదముచేత ద్వివిధమై యున్నది. అందు "ఏకస్మిన్ ధర్మిణి భాసమానవిరుద్ధ నానాకోటిక జ్ఞానం సంశయః"—భావము॥ ఒకటే ధర్మియందు భాసమానము లగు పరస్పరవిరుద్ధ నానాకోటులను విషయము చేయునట్టిజ్ఞానము సంశయ మనఁబడును. ఉదా— "స్థాణు ర్వా పురుషో వా" అనుజ్ఞానము ఒకటే స్థాణురూపధర్మియందు, లేక, పురుషరూపధర్మియందు, స్థాణుత్వపురుషత్వరూపవిరుద్ధనానాకోటులను విషయము చేయుచున్నది. అందువలన నాజ్ఞానము సంశయ మనఁబడును. మఱియు నుక్తసంశయము గూడ, ప్రమాణసంశయము ప్రమేయసంశయ మను భేదముచేత ద్వివిధమై యున్నది. అందు, ప్రమాణమునం దేయసంభావన యున్నదో అది ప్రమాణసంశయము. మఱియుఁ బ్రమేయమునం దేయసంభావన యున్నదో అది ప్రమేయసంశయ మనఁబడును.

ఆప్రమాణసంశయము కూడ, ప్రమాసంశయము కరణసంశయ మను భేదముచేత ద్వివిధ మగుచున్నది. అందు, ప్రమాణజన్యప్రమాజ్ఞానమునం దేసంశయ మున్నదో అది ప్రమాసంశయ మనంబడును. మఱియుఁ బ్రమాణముయొక్క స్వరూపమునం దేసంశయ మున్నదో, అది కరణసంశయ మనఁబడును. అందుఁ బూర్వ మెప్పుడును జూడనిస్థలమునం దుండు జలముతోఁ జక్షురింద్రియముయొక్క సంబంధానంతర మీపురుషునకు "ఇదం జలమ్" అను ప్రమాజ్ఞానము కలుగుచున్నది. అయినను, ఈపురుషునిచేత నాస్థలమందుఁ బూర్వ మెప్పుడును జలము

చూడఁబడినది కాదు. అందువలన నాపురుషునకు జలజ్ఞానమునం దీజ్ఞానము ప్రమ యగునా? కాదా? అని ఆజలజ్ఞానముయొక్క ప్రమాత్వమును అప్రమాత్వాభావ మును విషయము చేయునట్టిసంశయ ముత్పన్న మగుచున్నది. ఆసంశయము ప్రమా సంశయ మనఁబడును. ఆప్రమాసంశయము ప్రమాజ్ఞానముయొక్క ప్రమాత్వనిశ్చ యముచేతనే నివృత్త మగుచున్నది. ఇచ్చట "తద్వతి తత్ప్రకారకత్వం ప్రమా త్వమ్"— భావము॥ తద్ధర్మసహితవస్తువునందు తద్ధర్మవిషయకత్వబుద్ధి యేది గలదో అదియే ఆజ్ఞాననిష్ఠ ప్రమాత్వమై యున్నది. ఉదా—ఘటత్వధర్మసహితఘటమునం దాఘటత్వధర్మవిషయకత్వ మేది గలదో అదియే "అయం ఘటః" అనుజ్ఞానమునం దుండు ప్రమాత్వమై యున్నది. ఈప్రమాత్వమును ప్రామాణ్య మనియును జెప్పు దురు. ఆప్రమాజ్ఞాననిష్ఠప్రమాత్వము నైయాయికమతమునందుఁ బరతో గ్రాహ్యమై యున్నది. మఱియు మీమాంసకమతమునందును వేదాంతసిద్ధాంతమందును ఆ ప్రమాత్వము స్వతో గ్రాహ్యమై యున్నది. మఱియు నాప్రమాత్వముయొక్క స్వతో గ్రాహ్యత్వమందును మీమాంసకులయందు నానామతము లున్నవి. ఈ మీమాంసక నైయాయికమతముల నిచ్చట గ్రంథవిస్తరభీతిచే వ్రాయ లేదు. న్యాయప్రకాశముయొక్క షష్ఠపరిచ్ఛేదమునం దాసర్వమతములును స్పష్టముగా వ్రాయంబడి యున్నవి. తెలియ నిచ్ఛ గలవా రచ్చటఁ దెలియవలయును.

## [*] (6) స్వతోగ్రాహ్యత్వనిరూపణము. [*]

ఇఁక వేదాంతసిద్ధాంతసమ్మత మగు ప్రమాత్వముయొక్క స్వతోగ్రాహ్య త్వము నిరూపింపఁబడు చున్నది. "యావ త్స్వాశ్రయగ్రాహక గ్రాహ్యత్వం స్వతో గ్రాహ్యత్వమ్"—భావము॥ ప్రమాత్వధర్మమున కాశ్రయ మైన ప్రమాజ్ఞాన ముయొక్క గ్రాహకము లేవి యున్నవో వానిచేత నాప్రమాత్వమునందు గ్రాహ్యత్వ మేది గలదో అదియే ప్రమాత్వమునందు స్వతోగ్రాహ్యత్వమై యున్నది. ఉదా— ప్రమాత్వధర్మమున కాశ్రయరూపము "అయం ఘటః" అనువృత్తిజ్ఞానమై యు న్నది. ఆవృత్తిజ్ఞానమును గ్రహించునది సాక్షిచైతన్యమై యున్నది. ఆసాక్షిచైతన్యము చేత నావృత్తిజ్ఞానమువలె దానియొక్క ప్రమాత్వముగూడ గ్రహింపఁబడుచున్నది. ఇదియే ఆప్రమాత్వమునందు స్వతోగ్రాహ్యత్వమై యున్నది.

శంక:—ఎట్లు ప్రమాజ్ఞానముయొక్క ప్రమాత్వము స్వతోగ్రాహ్యమై యున్నదో అట్లు "ఇదం రజతమ్" ఇత్యాద్యప్రమాజ్ఞానముయొక్క యప్రమాత్వ ముగూడ స్వతోగ్రాహ్యమే యగును.

సమాధానము:—ఆ యప్రమాత్వధర్మమో పరతోగ్రాహ్యమే యగును గాని స్వతోగ్రాహ్యము కాదు. అచ్చట "తదభావవతి తత్ప్రకారకత్వ మప్రమాత్వమ్"—భావము॥ తద్ధర్మాభావసహితవస్తువునందు తద్ధర్మవిషయకత్వ మేది గలదో అదియే జ్ఞానమునం దప్రమాత్వమై యున్నది. ఉదా—వాస్తవరజతత్వాభావసహితశుక్తియందు రజతత్వవిషయకత్వ మేది గలదో అదియే "ఇదం రజతమ్" అను జ్ఞానమునం దప్రమాత్వమై యున్నది. అప్రమాత్వఘటితశుక్తియం దేరజతత్వాభావమున్నదో ఆయభావమును వృత్తిజ్ఞానము విషయముఁ జేయుట లేదు. అందువలన నారజతత్వాభావఘటితాప్రమాత్వమును సాక్షిచైతన్యముగూడ గ్రహించుట లేదు. మఱియే మనఁగా, ఆసాక్షిచైతన్యము కేవల మప్రమాత్వధర్మమున కాశ్రయభూతమైనజ్ఞానమాత్రమునే గ్రహించుచున్నది. అట్లు గాక వృత్తిజ్ఞానముయొక్కయవిషయభూతార్థమునుగూడ నాసాక్షి ప్రకాశింపఁజేయు నన్న యెడల ఘటాద్యాకారవృత్తికాలమునందుఁ బటాదులును ఆసాక్షిచైతన్యముచేతఁ బ్రకాశింపఁజేయఁబడవలయును. అందువలనఁ బ్రమాత్వమువలె నప్రమాత్వము స్వతోగ్రాహ్యము కాదు. మఱియే మనఁగాఁ బరతోగ్రాహ్యమై యున్నది.

## [*] (7) పరతోగ్రాహ్యత్వనిరూపణము. [*]

అచ్చట, "స్వాశ్రయగ్రాహకాతిరిక్తసామగ్రీ గ్రాహ్యత్వం పరతోగ్రాహ్యత్వమ్"—భావము॥ అప్రమాత్వధర్మమున కాశ్రయ మైన యేయప్రమాజ్ఞాన మున్నదో, ఆజ్ఞానమును గ్రహించుసామగ్రికన్న భిన్నసామగ్రిచేత గ్రాహ్యత్వ మేది గలదో, అదియే ఆయప్రమాత్వమునందుఁ బరతోగ్రాహ్యత్వమై యున్నది. ఉదా—ఉక్త మగు నప్రమాత్వధర్మమున కాశ్రయ మైన "ఇదం రజతమ్" అను నే యప్రమాజ్ఞాన మున్నదో ఆయప్రమాజ్ఞానముయొక్కగ్రాహకమో సాక్షిచైతన్యమై యున్నది. ఆసాక్షిచైతన్య మాయప్రమాత్వధర్మమును గ్రహించుట లేదు. మ తే మనఁగా, ఆసాక్షిచైతన్యముకన్న భిన్న మైన యనుమానరూపసామగ్రిచేతనే యా యప్రమాత్వధర్మము గ్రహింపఁబడుచున్నది. ఇదియే యాయప్రమాత్వమునందుఁ బరతోగ్రాహ్యత్వమై యున్నది.

ఇఁక నాయనుమానస్వరూపము చూపఁబడుచున్నది. అచ్చటఁ బురుషున కిష్టసాధనతాజ్ఞానానంతరమే ప్రవృత్తి కలుగుచున్నది. ఆప్రవృత్తియును సంవాదిప్రవృత్తి, విసంవాదిప్రవృత్తి యను భేదముచేత ద్వివిధమై యున్నది. అందు సఫలప్రవృత్తి సంవాదిప్రవృత్తియై యున్నది. నిష్ఫలప్రవృత్తి విసంవాదిప్రవృత్తియై యున్నది. ఆ విసంవాదిప్రవృత్తిచేతనే యప్రమాత్వముయొక్క యనుమానము

కలుగుచున్నది. ఆయనుమాన మెట్లనఁగా, "శుక్తౌ రజతజ్ఞాన మప్రమా, విసంవాది ప్రవృత్తి జనకత్వాత్, య న్నైవం త న్నైవమ్, యథా ప్రమా" — భావము॥ శుక్తియందు "ఇదం రజతమ్" అనుజ్ఞాన మప్రమారూపమై యున్నది, నిష్ఫల ప్రవృత్తి జనక మగుటవలన, ఏయేజ్ఞాన మప్రమారూపము కాదో ఆయాజ్ఞానము నిష్ఫలప్రవృత్తికి జనకమును గాదు, ప్రమాజ్ఞానమువలె. ఈప్రకార మైన యనుమానముచేత నాపురుషుఁడు రజతజ్ఞానమునం దప్రమాత్వమ్మును నిశ్చయించుచున్నాఁడు. ఇదియే యాయప్రమాత్వమునందుఁ బరతోగ్రాహ్యత్వమై యున్నది.

మఱియు, ఎట్లు ప్రమాత్వజ్ఞానమునందు స్వతస్త్వ మున్నదో అట్లు ప్రమాత్వముయొక్కయుత్పత్తియందును స్వతస్త్వమే యున్నది. అచ్చట జ్ఞానోత్పత్తియొక్క యేసామాన్యసామగ్రి యున్నదో ఆసామగ్రీమాత్రముచేత జన్యత్వ మేది గలదో అదియే యాప్రమాత్వోత్పత్తియందు స్వతస్త్వమై యున్నది. ఈరీతిగానే యప్రమాత్వజ్ఞానమునం దెట్లు పరతస్త్వ మున్నదో అట్లాయప్రమాత్వముయొక్కయుత్పత్తియందును బరతస్త్వమే యున్నది. అచ్చట జ్ఞానోత్పత్తియొక్క సామాన్యసామగ్రికన్న భిన్న మైన దోషముచేత జన్యత్వ మేది గలదో అదియే యాయప్రమాత్వోత్పత్తియందుఁ బరతస్త్వమై యున్నది.

శంక:—పూర్వోక్తరీతిగాఁ బ్రమాత్వముయొక్కయుత్పత్తియందును జ్ఞానమందును స్వతస్త్వ మంగీకరించినయెడలఁ బూర్వము చూడఁబడని యొకస్థలమునందు "ఇదం జలమ్" అను జ్ఞానానంతర మీపురుషున కీజలజ్ఞానము ప్రమ యగునా? లేక, కాదా? అను సంశయము కలుగుచున్నది. అది కాక పోవలయును. ఏల యన మీమతమునందు జ్ఞానముయొక్కప్రమాత్వము సాక్షిచైతన్యముచేత నిశ్చితమే యగుచున్నది. మఱియు నిశ్చితార్థమునందు సంశయము కలుగఁగూడదు.

సమాధానము:—ఆస్థలమునందు సంశయోత్పాదక మగు నేదోషమున్నదో తద్దోషఘటితసంశయసామగ్రి, ప్రమాత్వగ్రాహకసామగ్రికన్నఁ బ్రబలమై యున్నది. అందువలన నాజలజ్ఞానమునందుఁ బ్రమాత్వనిశ్చయము కలుగుట లేదు. అందువలనఁ బ్రమాత్వసంశయము సంభవించుచున్నది. ఈప్రకారముగా స్వతోగ్రాహ్యప్రమాత్వనిశ్చయముచేతఁ బూర్వోక్తప్రమాసంశయముయొక్కనివృత్తి కలుగుచున్నది.

### (8) ప్రమాణగతప్రమేయగతము లగు నసంభావనలును తన్నివృత్తియును నిరూపించుట.

ఇఁకఁ గరణసంశయమ్మును దానియొక్కనివృత్త్యుపాయమును జెప్పఁబడు

చున్నది. అచ్చటఁ దత్త్వమస్యాదివేదాంతవాక్యము లద్వితీయబ్రహ్మమునందుఁ బ్రమాణములై యున్నవా? లేక, కావా? అను వేదాంతవాక్యరూపప్రమాణమునందుండు నసంభావన కరణసంశయ మనఁబడును. ఆకరణగతసంశయము బ్రహ్మవేత్త యగు గురుముఖముచే వేదాంతశాస్త్రశ్రవణము చేయుటవలన నివృత్త మగుచున్నది. ఆశ్రవణముయొక్క స్వరూపము ద్వితీయపరిచ్ఛేదమునందు నిరూపింపఁబడియుండుటవలన మరల నిచ్చట నిరూపింపఁబడ లేదు. పూర్వోక్తశ్రవణము శారీరకమీమాంసాప్రథమాధ్యాయపఠనముచేత సిద్ధించుచున్నది. ఇంతపర్యంతము ప్రమాణగతసంశయము నిరూపింపఁబడినది.

ఇఁక ద్వితీయ మగు ప్రమేయగతసంశయమును దన్నివృత్త్యుపాయమును నిరూపింపఁబడుచున్నది. ప్రమాణజన్యజ్ఞానమున కేది విషయమై యున్నదో అది ప్రమేయమై యున్నది. ఆప్రమేయమునం దేసంశయ మున్నదో అది ప్రమేయసంశయమై యున్నది. ఆప్రమేయగతసంశయమును అనాత్మగతసంశయము, ఆత్మగతసంశయ మను భేదముచేత ద్విప్రకార మగుచున్నది. అందు, అనాత్మరూప మగు నస్థాణ్వాదిక మున్నదో దానియం దీపురుషునకు "స్థాణుర్వా పురుషో వా" ఇత్యాది సంశయ మేది గలదో ఆసంశయ మనాత్మగతసంశయ మనఁబడును. ఆ యనాత్మగతసంశయము సాధారణధర్మముయొక్క దర్శనమువలన జన్య మగుచున్నది. ఉదా— స్థాణువుయొక్కయు పురుషునియొక్కయు సాధారణధర్మ మైన మూఁడున్నరమూరల పరిమాణోన్నతియొక్క దర్శనమువలనఁ బూర్వోక్తసంశయ ముత్పన్న మగుచున్నది. మఱియు నాస్థాణ్వాదులయొక్క యసాధారణధర్మముయొక్క జ్ఞాన మగు నేవిశేషదర్శన మున్నదో, దానిచేతఁ బూర్వోక్తసంశయము నివృత్త మగుచున్నది. అచ్చట స్థాణుత్వముయొక్క నిశ్చయము చేయు వక్రత్వకోటరాదిక మైననో ఆస్థాణువుయొక్క యసాధారణధర్మమై యున్నది. మఱియుఁ బురుషత్వముయొక్క నిశ్చయము చేయు హస్తపాదమస్తకాద్యవయవములు పురుషునియొక్క యసాధారణధర్మములై యున్నవి. ఆ యసాధారణధర్మములయొక్క జ్ఞానముచేత, పూర్వోక్తసంశయము నివృత్త మగుచున్నది.

మఱియుఁ బురుషునకుఁ దనయాత్మయం దేసంశయము కలుగుచున్నదో ఆసంశయ మాత్మగతసంశయ మనఁబడును. ఆయాత్మగతసంశయము విప్రతిపత్తిచేత జన్య మగుటవలన అనేకప్రకార మగుచున్నది. పరస్పరవిరుద్ధార్థప్రతిపాదకవాదులయొక్క యనేకవచనము లేవి గలవో అవి విప్రతిపత్తు లనఁబడును. ఆవిప్రతిపత్తి శ్రీభగవద్భాష్యకారులచేతఁ జెప్పఁబడి యున్నది. అది యెట్లనఁగా, చైతన్య

చున్నది. అచ్చటఁ దత్త్వమస్యాదివేదాంతవాక్యము లద్వితీయబ్రహ్మమునందుఁ బ్రమాణములై యున్నవా? లేక, కావా? అను వేదాంతవాక్యరూపప్రమాణము నం దుండు నసంభావన కరణసంశయ మనఁబడును. ఆకరణగతసంశయము బ్రహ్మవేత్త యగు గురుముఖముచే వేదాంతశాస్త్రశ్రవణము చేయుటవలన నివృత్త మగుచున్నది. ఆశ్రవణముయొక్క స్వరూపము ద్వితీయపరిచ్ఛేదమునందు నిరూపింపఁబడియుండుటవలన మరల నిచ్చట నిరూపింపఁబడ లేదు. పూర్వోక్తశ్రవణము శారీరకమీమాంసాప్రథమాధ్యాయపఠనముచేత సిద్ధించుచున్నది. ఇంతపర్యంతము ప్రమాణగతసంశయము నిరూపింపఁబడినది.

ఇఁక ద్వితీయ మగు ప్రమేయగతసంశయమును దన్నివృత్త్యుపాయమును నిరూపింపఁబడుచున్నది. ప్రమాణజన్యజ్ఞానమున కేది విషయమై యున్నదో అది ప్రమేయమై యున్నది. ఆప్రమేయమునం దేసంశయ మున్నదో అది ప్రమేయసంశయమై యున్నది. ఆప్రమేయగతసంశయమును అనాత్మగతసంశయము, ఆత్మగతసంశయ మను భేదముచేత ద్విప్రకార మగుచున్నది. అందు, అనాత్మరూప మగు నేస్థాణ్వాదిక మున్నదో దానియం దీపురుషునకు "స్థాణు ర్వా పురుషో వా" ఇత్యాది సంశయ మేది గలదో ఆసంశయ మనాత్మగతసంశయ మనఁబడును. ఆ యనాత్మగతసంశయము సాధారణధర్మముయొక్క దర్శనమువలన జన్య మగుచున్నది. ఉదా—స్థాణువుయొక్కయు పురుషునియొక్కయు సాధారణధర్మ మైన మూఁడున్నరమూరపరిమాణోన్నతియొక్క దర్శనమువలనఁ బూర్వోక్తసంశయ ముత్పన్న మగుచున్నది. మఱియు నాస్థాణ్వాదులయొక్క యసాధారణధర్మముయొక్క జ్ఞాన మగు నేవిశేషదర్శన మున్నదో, దానిచేతఁ బూర్వోక్తసంశయము నివృత్త మగుచున్నది. అచ్చట స్థాణుత్వముయొక్క నిశ్చయము చేయు వక్రత్వకోటరాదిక మైననో ఆస్థాణువుయొక్క యసాధారణధర్మమై యున్నది. మఱియుఁ బురుషత్వముయొక్క నిశ్చయము చేయు హస్తపాదమస్తకాద్యవయవములు పురుషునియొక్క యసాధారణధర్మములై యున్నవి. ఆ యసాధారణధర్మములయొక్క జ్ఞానముచేత, పూర్వోక్తసంశయము నివృత్త మగుచున్నది.

మఱియుఁ బురుషునకుఁ దనయాత్మయం దేసంశయము కలుగుచున్నదో ఆసంశయ మాత్మగతసంశయ మనఁబడును. ఆయాత్మగతసంశయము విప్రతిపత్తిచేత జన్య మగుటవలన అనేకప్రకార మగుచున్నది. పరస్పరవిరుద్ధార్థప్రతిపాదకవాదులయొక్క యనేకవచనము లేవి గలవో అవి విప్రతిపత్తు లనఁబడును. ఆవిప్రతిపత్తి శ్రీభగవద్భాష్యకారులచేతఁ జెప్పఁబడి యున్నది. అది యెట్లనఁగా, చైతన్య

విశిష్ట మగు నేస్థూలదేహ మున్నదో అదియే యాత్మ యని ప్రాకృతజీవులును లోకాయతులును అంగీకరించుచున్నారు. మఱియుఁ జక్షురాదింద్రియములే ఆత్మ యని కొందఱు అంగీకరించుచున్నారు. మనస్సే యాత్మ యని మఱికొందఱు అంగీకరించుచున్నారు. మఱియు, క్షణికవిజ్ఞానమే యాత్మ యని కొందఱు అంగీకరించుచున్నారు. మఱియు శూన్యమే యాత్మ యని మఱికొందఱు అంగీకరించుచున్నారు. మఱియుఁ గొందఱు దేహేంద్రియాదులకు భిన్నుఁడైన సంసారి కర్త భోక్త ఆత్మ యని యంగీకరించుచున్నారు. మఱియు, ఆత్మ కేవలభోక్తయే కర్త కాఁడని మఱికొందఱు అంగీకరించుచున్నారు. మఱియు, కర్తకన్నను భోక్తకన్నను భిన్నుఁడైన సర్వజ్ఞ సర్వశక్తిమంతుఁడగు నీశ్వరుఁడే యాత్మ యని మఱికొందఱు అంగీకరించుచున్నారు. మఱియు, నాత్మ యుపాధిసంబంధమువలనఁ గర్తయు భోక్తయు నైనను, వాస్తవముచేత శుద్ధుఁడే యగు నని కొందఱు అంగీకరించుచున్నారు. పూర్వోక్తవాదు లాయా దేహాదిరూపాత్మలయొక్క సిద్ధికొఱకుఁ దగినయుక్తిప్రమాణాదులును జెప్పియున్నారు. ఈప్రకారము పరస్పరవిరుద్ధార్థప్రతిపాదకవాదులయొక్క వచనరూప మయిన విప్రతిపత్తివలనఁ, బురుషున కాత్మసంశయ మనేకప్రకారములుగాఁ గలుగుచున్నది. అచ్చట, ఆయాత్మ యద్యపి వాస్తవముగా నేకాద్వితీయరూపమై యున్నది, తథాపి, ఉపాధిభేదముచేత నాయాత్మ పరమాత్మ జీవాత్మ అను భేదముచేత ద్వివిధముగాఁ జెప్పఁబడుచున్నది. “తత్త్వమసి” అను మహావాక్యమునందుండు తత్పదముయొక్క యర్థ మైన ఏమాయోపహితబ్రహ్మ మున్నదో అది పరమాత్మయై యున్నది. మఱియు, త్వంపదముయొక్క యర్థ మైన యేశరీరోపహితచైతన్య మున్నదో అది జీవాత్మయై యున్నది. ఆరెంటియందుఁ బ్రథమమునఁ దత్పదార్థ మగు పరమాత్మయందు నాయనేకవిధసంశయములు చూపఁబడుచున్నవి. అచ్చట, బ్రహ్మము అద్వితీయమా? లేక, సద్వితీయమా? అద్వితీయరూప మైనను, ఆబ్రహ్మము ఆనందగుణసహితమా? లేక, ఆనందస్వరూపమా? మఱియు బ్రహ్మము, జ్ఞానగుణసహితమా? లేక, జ్ఞానస్వరూపమా? మఱియు నాబ్రహ్మము సత్తాజాతిసహితమా? లేక, సత్తాస్వరూపమా? మఱియు నాబ్రహ్మము సగుణమా? లేక, నిర్గుణమా? ఇత్యాద్యనేకప్రకారసంశయములు పురుషున కాతత్పదార్థబ్రహ్మమునందుఁ గలుగుచున్నవి.

ఇఁక, త్వంపదార్థ మగు జీవాత్మయందును ఆయనేకవిధసంశయములు చూపఁబడుచున్నవి. అచ్చట, ఈయాత్మ దేహేంద్రియాదులకు భిన్నమా? లేక, కాదా? మఱియు దేహేంద్రియాదులకు భిన్న మైనను, ఆయాత్మ కర్త యగునా? లేక, కర్త కాదా? మఱియు, అకర్త యైనను ఆయాత్మ చిద్రూపమా? లేక,

అచిద్రూపమా? మఱియు, చిద్రూప మైనను ఆయాత్మ ఆనందరూపమా? లేక, కాదా? మఱియు, ఆనందరూప మైనను ఆయాత్మ పరిణామియా? లేక, కూటస్థుఁడా? మఱియు, కూటస్థుఁ డైనను ఆయాత్మ సత్తాజాతిసహితమా? లేక, సద్రూపమా? ఇత్యాద్యనేకప్రకారసంశయములు పురుషున కాత్వంపదార్థ మగు జీవాత్మయందుఁ గలుగుచున్నవి. ఇఁక, తత్త్వంపదార్థములయొక్క యేకత్వరూపవాక్యార్థమందుఁ గల సంశయము చూపఁబడుచున్నది. ఈ జీవాత్మకు సచ్చిదానందరూపత్వ ముండినను బరమాత్మతో జీవాత్మ కేకత్వము సంభవించు చున్నదా? లేక, లేదా?

ఇఁక మోక్షసాధనమునందు సంశయములు చూపఁబడుచున్నవి. జీవబ్రహ్మముల కేకత్వ ముండినను ఆయేకత్వజ్ఞానము మోక్షసాధనమా? లేక, కాదా? మఱియు నాజ్ఞానమునకు మోక్షసాధనత్వ ముండినను, ఆజ్ఞానము కర్మసహితమై మోక్షమునకు సాధనమా? లేక, కేవలజ్ఞానము మోక్షమునకు సాధనమా? ఇత్యాదిసంశయము లాత్మగతసంశయము లనఁబడును. ఆసర్వాత్మగతసంశయములు తర్కరూపమననముచేత నివృత్తము లగుచున్నవి. అచ్చట, "అనిష్టప్రసంజకః తర్కః"—భావము॥ ఏయుక్తి ప్రతివాదియొక్క యనిష్టమును సిద్ధింపఁజేయు చున్నదో ఆయుక్తి తర్క మనఁబడును. అనఁగా వ్యాప్యముయొక్క యారోపముచేత వ్యాపకముయొక్క యేయాపాదన మున్నదో అది తర్క మనఁబడును. అందు వ్యాప్తియొక్క యాశ్రయము వ్యాప్యమై యున్నది. వ్యాప్తియొక్క నిరూపకము వ్యాపకమై యున్నది. వ్యాప్తియొక్క స్వరూపము పూర్వము ద్వితీయపరిచ్ఛేదమునందు నిరూపింపఁబడి యున్నది. ఉదా—పర్వతమునందు ధూమమును జూచియు నేప్రతివాది యాపర్వతమునం దగ్ని నంగీకరించుట లేదో ఆప్రతివాదినిగుఱించి చెప్పునట్టితర్కమే మనఁగా. ధూమవహ్నులకుఁ గార్యకారణభావము సర్వలోకమందుఁ బ్రసిద్ధమై యున్నది. కారణము లేక కార్య ముండుట లేదు, అనువార్తయును సర్వలోకమునందును బ్రసిద్ధమై యున్నది. అందువలనఁ బర్వతమునందు వహ్ని లేనియెడలఁ దత్కార్య మగు ధూమముగూడ లేకపోవలయును. పర్వతమునందు ధూమముయొక్క యభావము ప్రతివాది కనిష్టమై యున్నది. ఆప్రతివాదియొక్క యనిష్టసిద్ధి యీ తర్కమువలనఁ గలుగుచున్నది. మఱియు, ఈతర్కమునందు వహ్న్యభావరూపవ్యాప్యారోపముచేత, ధూమాభావరూపవ్యాపకాపాదనము చేయఁబడుచున్నది. అందువలనఁ బూర్వోక్తతర్కలక్షణ మీప్రసిద్ధతర్కమునందు సంభవించు చున్నది. ఈరీతిగా నుత్తరత్ర వక్ష్యమాణతర్కములయందుఁ గూడ నుక్తలక్షణముయొక్క సమన్వయము తెలియవలయును.

ఇఁక, ఆత్మసంశయమును నివర్తించుతర్కము నిరూపింపఁబడు చున్నది. ఆతర్కములయందుఁ గూడఁ బ్రథమము తత్పదార్థరూపపరమాత్మయొక్కయద్వితీయత్వసాధకతర్కము చెప్పఁబడుచున్నది. ఒకవేళ, ఈ యాకాశాదిప్రపంచము సత్యమైనయెడల బ్రహ్మమున కద్వితీయరూపత్వముఁ జెప్పునట్టి "ఏక మే వాద్వితీయం బ్రహ్మ" అను శ్రుతికి విరోధ మగును. అనఁగా సద్వితీయబ్రహ్మము నద్వితీయరూపముగాఁ జెప్పునట్టి యాశ్రుతి మిథ్యావాది యగుటవలన నప్రమాణరూప మగును. మఱియు నాశ్రుతియొక్కయప్రమాణత్వ మాస్తికవాదుల కనిష్టమే యగుచున్నది. అందువలన నాప్రపంచము మిథ్యయే యని యంగీకరింపవలయును. ప్రపంచము మిథ్య యగుటవలన నాయద్వైతశ్రుతికి విరోధము కలుగదు.

శంక:—బ్రహ్మము నద్వితీయ మని యంగీకరించినయెడల భేదమును బ్రతిపాదించునట్టిశ్రుతులకు విరోధ మగును. ఆశ్రుతులకు విరోధముగా నాయద్వైతశ్రుతి యద్వైతమును బ్రతిపాదించునది కాదు. మఱి యే మనఁగా, అన్యార్థమునే ప్రతిపాదించుచున్నది. అందువలన నాప్రపంచమునకు సత్యత్వ మంగీకరించుటయందును ఆయద్వైతశ్రుతికి విరోధము కలుగదు.

సమాధానము:—ఈయధికారిపురుషున కేయర్థ మిష్టఫలహేతు వయ్యును బ్రత్యక్షాదిప్రమాణములచే నజ్ఞాత మయ్యు నున్నదో ఆయర్థమునందే శ్రుతికిఁ దాత్పర్య మున్నది. అచ్చట నాయద్వైతమో ప్రత్యక్షాదిప్రమాణములచే నజ్ఞాతమై యున్నది. అట్లే ఆ యద్వైతబ్రహ్మముయొక్కజ్ఞానమువలన నీయధికారిపురుషునకు "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి, తరతి శోక మాత్మవిత్" ఇత్యాదిశ్రుతులచే మోక్షరూపనిరతిశయపురుషార్థప్రాప్తి చెప్పఁబడి యున్నది. అందువలన నాశ్రుతి కద్వైతమునందే తాత్పర్యము సంభవించుచున్నది. అన్యార్థమునందుఁ దాత్పర్యము సంభవింపదు. మఱియు ద్వైతరూపభేద మైననో ప్రత్యక్షాదిప్రమాణములచే జ్ఞాతమై యున్నది. భేదజ్ఞానముచేత నిష్టఫలప్రాప్తి యేదియుఁ గలుగుట లేదు. మఱి యే మనఁగా, "ఉదర మంతరం కురుతే అథ తస్య భయం భవతి, మృత్యోః సమృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" ఇత్యాదిశ్రుతులవలన నాభేదదర్శిపురుషున కనర్థప్రాప్తి చెప్పఁబడి యున్నది. మఱియు "అథ యో ఽన్యాం దేవతా ముపాస్తే ఽన్యో సా వ న్యోఽహ మస్మీతి । న స వేద యథా పశుః" అను నీశ్రుతిచేత నాభేదదర్శిపురుషునకుఁ బశుతుల్యత్వము చెప్పి యాభేదముయొక్కనిందయే చేయఁబడి యున్నది. అందువలన నాశ్రుతికి భేదమునందుఁ దాత్పర్యము సంభవింపదు. ఒకవేళ నాశ్రుతి భేదమునే చెప్పినయెడలఁ బ్రత్యక్షసిద్ధభేదముయొక్కయనువాదకత్వము

చేత నా శ్రుతి కప్రమాణత్వమే ప్రాప్త మగును. ఇందువలన సిద్ధించిన దే మనఁగా,
ఫలవంత మగు నజ్ఞాతార్థమును బోధించుటవలన నాయద్వైతశ్రుతియే ప్రబలమై
యున్నది. మఱియు ఫలశూన్యజ్ఞాతార్థమును బోధించుటవలన నాభేదశ్రుతి దుర్బల
మై యున్నది. మఱియు లోకమునందును ప్రబలముచేతనే దుర్బలమునకు బాధ
కలుగుచున్నది. ఏదుర్బలముచేతను ప్రబలమునకు బాధ కలుగుట లేదు. అందు
వలన నాభేదశ్రుతియొక్క విరోధముచేత నాయద్వైతశ్రుతి కన్యపరత్వము సంభవిం
పదు. మఱియు నే మనఁగా, ఆయద్వైతశ్రుతియొక్క విరోధముచేత నాభేదశ్రుతి కే
యన్యపరత్వము సంభవించుచున్నది. అందువలన నాయద్వైతశ్రుతియొక్క విరో
ధమువలన, నాప్రపంచమునందు సత్యత్వము సంభవింపదు. ఈప్రకారముగా బ్రహ్మ
ముయొక్క యద్వితీయత్వమునకు సాధక మైన తర్కముచేత, ఆబ్రహ్మము అద్వితీ
యమా? లేక, సద్వితీయమా? అను సంశయము నివృత్త మగుచున్నది.

ఇఁక నాపరమాత్మయొక్క యానందరూపత్వమునకు సాధక మైన తర్క
ము చెప్పఁబడుచున్నది. ఆపరమాత్మ యొకవేళ నానందరూపము కానియెడల నా
పరమాత్మయొక్క ప్రాప్తికిఁ బురుషార్థరూపత్వము సంభవింపని దగును. ఏకారణము
చేత ననఁగా, ఆనందప్రాప్తియే పురుషార్థరూపమై యున్నది. మఱియు నాపర
మాత్మయొక్క ప్రాప్తికపురుషార్థరూపత్వ మంగీకరించినయెడల నాపరమాత్మయొక్క
ప్రాప్తికిఁ బురుషార్థరూపత్వముఁ జెప్పునట్టి "ఆత్మలాభా న్నపరం విద్యతే, పురుషా
న్నపరం కించి త్సా కాష్ఠా సా పరాగతిః" ఇత్యాది శ్రుతిస్మృతివచనములకు
విరోధ మగును. ఆశ్రుతిస్మృతులయొక్క విరోధము సర్వులకు ననిష్టమే యగు
చున్నది. అందువలనఁ బరమాత్మను ఆనందరూప మనియే యంగీకరింపవలయును.
ఈప్రకార మైన తర్కమువలన, నాపరమాత్మ యానందరూపమా? లేక, కాదా?
అను సంశయము నివృత్త మగుచున్నది.

ఇఁక నాపరమాత్మయొక్క చైతన్యరూపత్వమునకు సాధక మైన తర్కము
చెప్పఁబడుచున్నది. ఆపరమాత్మ యొకవేళఁ జైతన్యరూపము కానియెడల ఘటా
దులవలె సూర్యచంద్రాదికజగత్తును బ్రకాశింపఁజేయని దగును. మఱియు నాపర
మాత్మకు జగత్ప్రకాశకత్వ మంగీకరింపనియెడల, నాపరమాత్మ సూర్యచంద్రాదిక
సర్వజగత్తును ప్రకాశింపఁజేయుచున్న దని చెప్పునట్టి "తస్య భాసా సర్వ మిదం
విభాతి, త చ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతిః, జ్యోతిషా మపి త జ్జ్యోతి స్తమసః పర
ముచ్యతే" ఇత్యాది శ్రుతిస్మృతివచనములకు విరోధము ప్రాప్త మగును. ఆశ్రుతి
స్మృతివచనములకు విరోధము సర్వులకు ననిష్టమే యగుచున్నది. అందువలన నా

పరమాత్మను జైతన్యరూప మనియే యంగీకరింపవలయును. ఈప్రకార మైన తర్కముచేత నాపరమాత్మ చైతన్యరూపమా? కాదా? అను సంశయము నివృత్త మగుచున్నది.

ఇక నాపరమాత్మయొక్కనిర్గుణభావమునకు సాధక మైన తర్కము చెప్పఁబడుచున్నది. ఆపరమాత్మ యొకవేళ సగుణ మనినయెడల నాపరమాత్మను నిర్విశేషస్వరూప మని చెప్పునట్టి "అస్థూల మన ణ్వహ్రస్వ మదీర్ఘమ్" ఇత్యాది శ్రుతిస్మృతిసర్వవచనములకు విరోధము ప్రాప్త మగును. ఆ శ్రుతిస్మృతులయొక్క విరోధము సర్వులకు ననిష్టమై యున్నది. అందువలన నాపరమాత్మను నిర్గుణ మనియే యంగీకరింపవలయును. ఈప్రకార మైన తర్కమువలన నాపరమాత్మ సగుణమా? లేక, నిర్గుణమా? అను సంశయము నివృత్త మగుచున్నది.

ఇఁక, త్వంపదార్థరూపాత్మయొక్కయానందరూపత్వమునకు సాధక మైన తర్కము చెప్పఁబడుచున్నది. ఈయాత్మ యొకవేళ నానందరూపము కా దనిన యెడల, నొకజీవునకును స్వార్థముకొఱకుఁ బ్రవృత్తి లేక పోవలయును. సర్వప్రాణులును స్వార్థముకొఱకే ప్రవర్తించుటయో చూచుచున్నాము. లోకప్రసిద్ధమునకు విరోధము ప్రాప్త మగుటయే గాక, యాజ్ఞవల్క్యముని మైత్రేయి యను స్త్రీని గుఱించి "నవా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి, ఆత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి" ఇత్యాది శ్రుతివచనములచేఁ, బతిజాయాదికసర్వులకుఁ బరస్పరము గల ప్రియత్వ మేది గలదో అది తనయాత్మకొఱకే గల దని చెప్పియున్నారు, ఆశ్రుతివచనములకును విరోధము ప్రాప్త మగును. అందువలన నాయాత్మను ఆనందరూప మనియే యంగీకరింపవలయును. ఈప్రకార మైన తర్కముచేత నాత్మ యానందరూపమా? కాదా? అను సంశయము నివృత్త మగుచున్నది.

ఇఁక, ఆత్మయొక్కచైతన్యరూపత్వమునకు సాధక మైన తర్కము చెప్పఁబడుచున్నది. ఈయాత్మ యొకవేళఁ జైతన్యరూపము కానియెడల, ఘటాదులవలె జడత్వముచే సావయవ మగుటవలన ననాత్మయే యగును. అందువలనఁ బ్రకాశకచైతన్యముయొక్కయభావమువలన, జగత్తున కంధత్వమే ప్రాప్త మగును. మఱియు నాత్మకుఁ జైతన్యరూపత్వముఁ జెప్పునట్టి "యో ఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృ ద్యంతర్జ్యోతిః పురుషః, అ త్రాయం పురుషః స్వయం జ్యోతి ర్భవతి, క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత" ఇత్యాది శ్రుతిస్మృతివచనముల కన్నిటికిని విరోధము ప్రాప్త మగును. ఆ శ్రుతిస్మృతివిరోధము సర్వులకు ననిష్టమే

యగుచున్నది. అందువలన నాయాత్మను చైతన్యరూప మనియే యంగీకరింపవల యును. ఈప్రకార మైన తర్కముచేత నాత్మ చైతన్యరూపమా? కాదా? అను సంశయము నివృత్త మగుచున్నది.

ఇఁక, ఆత్మయొక్కయకర్తృత్వమునకు సాధక మైన తర్కము చెప్పఁబడు చున్నది. ఈయాత్మ నొకవేళఁ గర్త యైనయెడల వికారిత్వముచేఁ బరిణామి యగుటవలన ననిత్యమే యగును. ఆత్మను అనిత్య మని యంగీకరించినయెడల ఆత్మను నిత్య మని చెప్పునట్టి "అవినాశీ వా అరే ఽయ మాత్మా, నిత్యః సర్వగతః స్థాణుః" ఇత్యాది శ్రుతిస్మృతివచనముల కన్నిటికిని విరోధము ప్రాప్త మగును. ఆ శ్రుతిస్మృతులయొక్కవిరోధము సర్వులకు ననిష్టమే యగుచున్నది. అందువలన నాత్మను అకర్త యనియే యంగీకరింపవలయును. ఈప్రకార మైన తర్కమువలన నీయాత్మ కర్తయై యున్నదా? లేక, అకర్తయై యున్నదా? అను సంశయము నివృత్త మగుచున్నది.

ఇఁక, తత్త్వంపదార్థములయొక్కయభేదమునకు సాధక మైన తర్కము చెప్పఁబడుచున్నది. ఆ తత్పదార్థరూపపరమాత్మ యొకవేళ నీ త్వంపదార్థరూప జీవాత్మకన్న భిన్న మైనయెడల, ఘటాదులవలె ననాత్మభావముచే ననిత్యమే యగును. మఱియు నాపరమాత్మను అనిత్య మని యంగీకరించినయెడల, ఆపరమా త్మను నిత్యరూప మని చెప్పునట్టి శ్రుతిస్మృతీతిహాసపురాణాదిసర్వవచనములకు విరోధము ప్రాప్త మగును. మఱియు జీవబ్రహ్మములకు భేద మంగీకరించినయెడల జీవబ్రహ్మముల కభేదమును జెప్పునట్టి "తత్త్వ మసి, అహం బ్రహ్మాస్మి, అయ మాత్మా బ్రహ్మ, క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" ఇత్యాది శ్రుతిస్మృతి వచనములకు విరోధము ప్రాప్త మగును. ఆ శ్రుతిస్మృత్యాదులయొక్కవిరోధము సర్వులకు ననిష్టమే యగుచున్నది. అందువలన నాపరమాత్మ యీజీవాత్మకన్న నభిన్నమే యని యంగీకరింపవలయును. ఈప్రకార మైన తర్కముచేత నాపర మాత్మ యీజీవాత్మకన్న భిన్నమా? లేక, అభిన్నమా? అనుసంశయము నివృత్త మగుచున్నది.

ఇఁక, కేవలజ్ఞానమునందు మోక్షసాధనత్వమునకు సాధక మైన తర్కము చెప్పఁబడుచున్నది. ఒకవేళ కర్మమిశ్రితజ్ఞానము మోక్షమునకు సాధన మనినయెడల, స్వర్గాదులవలెఁ గర్మజన్య మగుటవలన నామోక్షమునకుఁగూడ ననిత్యత్వమే ప్రాప్త మగును. మఱియు నామోక్షమును అనిత్య మని యంగీకరించినయెడల, ముక్తపురు

ఫలకుఁగూడ మరల సంసారము ప్రాప్తము కావలయును. దానిచేత ముక్తపురుషునకుఁ బునస్సంసారప్రాప్తిని నిషేధించునట్టి "నస పునరావర్తతే, యద్గత్వా ననివర్తంతే తద్ధామ పరమం మమ" ఇత్యాది శ్రుతిస్మృతివచనములకు విరోధము ప్రాప్తమగును: మఱియుఁ గేవలజ్ఞానమువలన మోక్షప్రాప్తిని జెప్పునట్టి "జ్ఞానాదేవతు కైవల్యమ్, నాన్యః పంథా విద్యతేఽయనాయ, జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః" ఇత్యాది శ్రుతిస్మృతివచనములకును విరోధము ప్రాప్తమగును. ఆ శ్రుతిస్మృతివచనములయొక్క విరోధము సర్వాస్తికులకు ననిష్టమే యగుచున్నది. అందువలనఁ గర్మమిశ్రితజ్ఞానము మోక్షమునకు సాధనము కాదు. ఇఁక నేమనఁగా "అహం బ్రహ్మాస్మి" యను నభేదజ్ఞానమే మోక్షమునకు సాధనమని యంగీకరింపవలయును. ఈప్రకారమైన తర్కమువలనఁ గర్మమిశ్రితజ్ఞానము మోక్షమునకు సాధనమా? లేక, కేవలజ్ఞానము మోక్షమునకు సాధనమా? అను సంశయము నివృత్తమగుచున్నది.

ఈప్రకారమైన శ్రుత్యుక్తతర్కరూపమననముచేతనే పూర్వోక్తాత్మగత సంశయము నివృత్తమగుచున్నది. ఈతర్కరూపమననముయొక్క లక్షణము పూర్వము ద్వితీయపరిచ్ఛేదమునందు నిరూపింపఁబడి యున్నది. దాని నిచ్చటను దెలియవలయును. ఈమననము శారీరకమీమాంసాద్వితీయాధ్యాయపఠనముచేత సిద్ధించుచున్నది. పూర్వము సంశయము నిశ్చయ మను భేదముచేత ద్వివిధాఽయథార్థానుభవములు చెప్పఁబడినవి. వానియందుఁ బ్రథమ మగు సంశయ మింతపర్యంతము నిరూపింపఁబడినది.

## [*] (9) నిశ్చయనిరూపణము. [*]

ఇఁక ద్వితీయ మగు నిశ్చయము నిరూపింపఁబడుచున్నది. "సంశయవిరోధి జ్ఞానం నిశ్చయః"— భావము॥ పూర్వోక్తసంశయమునకు విరోధి యైన యే జ్ఞాన మున్నదో అది నిశ్చయ మనఁబడును. ఏపురుషున కేపదార్థముయొక్క నిశ్చయము కలుగుచున్నదో ఆపదార్థమునందు సంశయము కలుగుట లేదు. అందువలన నిశ్చయమునందు సంశయముయొక్క విరోధిత్వము స్పష్టమే. మఱియు నుక్త నిశ్చయముగూడ యథార్థము అయథార్థ మను భేదముచేత ద్వివిధ మగుచున్నది. అందు "అవిసంవాది జ్ఞానం యథార్థనిశ్చయః" — భావము॥ ఫలమునందుఁ బర్యవసానము గల యేజ్ఞాన మున్నదో అది యథార్థనిశ్చయము. అనఁగా, ఏవస్తువుయొక్క నిశ్చయానంతరము ప్రవర్తించినపురుషున కావస్తువుయొక్క ప్రాప్తి యగుచున్నదో

ఆనిశ్చయము యథార్థనిశ్చయ మనఁబడును. ఆయథార్థనిశ్చయము పూర్వము ద్వితీయపరిచ్ఛేదమునందుఁ బ్రమారూపముగాఁ జెప్పఁబడియున్నది. ఈ తృతీయపరిచ్ఛేదమునందుఁ బూర్వము యథార్థస్మృతిరూపముగాఁ జెప్పఁబడియున్నది. అనఁగా యథార్థానుభవమునకును యథార్థస్మృతికిని యథార్థనిశ్చయ మని పేరు.

మఱియు "విసంవాదిజ్ఞాన మయథార్థనిశ్చయః"—భావము॥ ఫలరహిత జ్ఞాన మయథార్థనిశ్చయ మనఁబడును. అనఁగా, ఏవస్తువుయొక్క నిశ్చయానంతరము ప్రవర్తించినపురుషున కావస్తువుయొక్క ప్రాప్తి యగుట లేదో ఆనిశ్చయ మయథార్థ నిశ్చయ మనఁబడును. ఆయయథార్థనిశ్చయముగూడ తర్కము విపర్యయము అను భేదముచేత ద్విప్రకార మగుచున్నది. తర్కముయొక్క లక్షణము నుదాహరణమును ఈపరిచ్ఛేదమునందుఁ బూర్వము నిరూపింపఁబడినది. అందువలన మరల నిచ్చట నిరూపింప లేదు. వహ్నిసహితమును ధూమసహితమును నైన పర్వతమునందు వహ్న్యభావమును ధూమాభావమును విషయముఁ జేయునట్టి "ఈపర్వతమునందు వహ్ని లేనియెడల ధూమముగూడ లేని దగును" అను తర్క మేది గలదో దాని యం దయథార్థనిశ్చయత్వము స్పష్టముగానే యున్నది.

ఇఁక విపర్యయనిరూపణము చేయఁబడుచున్నది. "మిథ్యాజ్ఞానం విపర్యయః"— భావము॥ ఏజ్ఞానము మిథ్య యగుచున్నదో ఆజ్ఞానము విపర్యయ మనఁబడును. ఉదా—శుక్తియందు "ఇదం రజతమ్" అను జ్ఞానమును, రజ్జువునందు "అయం సర్పః" అనుజ్ఞానమును మిథ్యాజ్ఞానము లగుటవలన, విపర్యయము లని చెప్పఁబడుచున్నవి.

శంక:—ఆజ్ఞానమునందు మిథ్యాత్వ మనునది యేది? అనఁగా, బాధ్యత్వ మనునది మిథ్యాత్వమా? లేక, నిర్విషయత్వ మనునది మిథ్యాత్వమా? అందు, ఏజ్ఞానమునకును దనస్వరూపముచేత బాధ కలుగుట లేదు. అందువలన బాధ్యత్వ మనునది మిథ్యాత్వ మను ప్రథమపక్షమో సంభవింపదు. మఱియు నేజ్ఞానమును నిర్విషయ మగుట లేదు, అందువలన ద్వితీయపక్షము గూడ సంభవింప దను శంక ప్రాప్తము కాఁగా.

సమాధానము:—ఇఁక నామిథ్యాజ్ఞానముయొక్క లక్షణము చెప్పఁబడుచున్నది. "అతస్మింస్తద్బుద్ధిః మిథ్యాజ్ఞానమ్"—భావము॥ తదర్థము కాని వస్తువునందు తదర్థబుద్ధి యేది గలదో, అది మిథ్యాజ్ఞాన మనఁబడును. ఉదా—రజతము కాని శుక్తియందు "ఇదం రజతమ్" అను నేరజతబుద్ధి యున్నదో అది మిథ్యాజ్ఞా

నమై యున్నది. యద్యపి, జ్ఞానమునకు స్వరూపముచేత బాధ కలుగుట లేదు. తథాపి, విషయముయొక్క బాధవలన నాజ్ఞానమునకు బాధ చెప్పఁబడినది. ఆబాధ్యత్వమే జ్ఞానమునందు మిథ్యాత్వమై యున్నది. మఱియుఁ బూర్వోక్తవిపర్యయరూపభ్రమకూడ నిరుపాధికభ్రమ, సోపాధికభ్రమ, అను భేదముచేత ద్విప్రకార మగుచున్నది. అందు, ఏభ్రమ యధిష్ఠానజ్ఞానమువలన నివృత్త మగుచున్నదో ఆభ్రమ నిరుపాధికభ్రమ యనఁబడును. మఱియు నేభ్రమ యధిష్ఠానజ్ఞాన ముండినను నివృత్త మగుట లేదో ఆభ్రమ సోపాధికభ్రమ యనఁబడును. అందు నిరుపాధికభ్రమకూడ బాహ్యాంతరభేదముచేత ద్వివిధ మగుచున్నది. అచ్చట శుక్తిరజ్జ్వాదులయందు "ఇదం రజతమ్, అయం సర్పః" అను నేభ్రమజ్ఞాన మున్నదో ఆభ్రమజ్ఞానము బాహ్య మగు నిరుపాధికభ్రమ యనఁబడును. మఱియు, "నేను అజ్ఞాని, బ్రహ్మము నెఱుఁగను" అను నేభ్రమ యున్నదో ఆభ్రమ ఆంతరనిరుపాధికభ్రమ యనఁబడును. అచ్చట, శుక్తిరజ్జ్వా ద్యధిష్ఠానజ్ఞానమువలన "ఇదం రజతమ్, అయం సర్పః" ఇత్యాదిభ్రమ నివృత్త మగుచున్నది. ఈలాగుననే ఆత్మరూపాధిష్ఠానజ్ఞానమువలన "అహ మజ్ఞః" అనుభ్రమ నివృత్త మగుచున్నది. అందువలనఁ బూర్వోక్తభ్రమయందు నిరుపాధికభ్రమరూపత్వము సంభవించుచున్నది.

ఈప్రకారముగానే ద్వితీయ మగు సోపాధికభ్రమకూడ బాహ్యాంతరభేదముచేత ద్విప్రకార మగుచున్నది. అందు రక్తగుణరహిత శుక్లస్ఫటికమునందు రక్తవర్ణసహిత జపాకుసుమాదిద్రవ్యములయొక్క సమీపతవలన "లోహితః స్ఫటికః" అను నేభ్రమ కలుగుచున్నదో ఆభ్రమ బాహ్య మగు సోపాధికభ్రమ యనఁబడును. "ఈస్ఫటికము శుక్లమై యున్నది రక్తము కాదు" అను ఆస్ఫటికరూపాధిష్ఠానజ్ఞాన ముండినను ఎంతపర్యంత మాజపాకుసుమాద్యుపాధులయొక్క నివృత్తి యగుట లేదో అంతపర్యంతము "లోహితః స్ఫటికః" అనుభ్రమ నివృత్త మగుట లేదు. అందువలన "లోహితః స్ఫటికః" అను భ్రమయందు సోపాధికభ్రమరూపత్వము సంభవించు చున్నది. ఈప్రకారముగాఁ దత్త్వవేత్త యగుపురుషున కేయాకాశాదిప్రపంచముయొక్క యనుభవ మున్నదో అదియును బాహ్యసోపాధికభ్రమ యనఁబడును.

శంక:—"లోహితః స్ఫటికః" అనుభ్రమయం దైననో జపాకుసుమాద్యుపాధు లున్నవి. అందువలన ఆభ్రమ కైననో, సోపాధికత్వము సంభవించుచున్నది. ప్రపంచభ్రమయం దేయుపాధియుఁ దెలియఁబడ లేదు. అందువలనఁ బ్రపంచభ్రమమునకు సోపాధికత్వము సంభవింపదు.

సమాధానము:—ఆప్రపంచభ్రమయందును ప్రారబ్ధకర్మసహితవిక్షేప శక్తితోఁ గూడిన యజ్ఞానమే యుపాధిరూపమై యున్నది. ఎట్లనఁగా "అహం బ్రహ్మాస్మి" యను నధిష్ఠానబ్రహ్మముయొక్క జ్ఞానముచేత నావరణశక్తిసహితాజ్ఞానము నివృత్తమైనను విక్షేపశక్తిసహితాజ్ఞానశేషమువలనఁ బ్రారబ్ధకర్మనాశపర్యంతము తత్త్వవేత్త యగుపురుషునకును ఆయాకాశాదిప్రపంచముయొక్క యనుభవము కలుగుచున్నది. అందువలన "లోహితః స్ఫటికః" అను భ్రమకువలెఁ బ్రపంచభ్రమకును సోపాధికత్వము సంభవించు చున్నది.

మఱియు "అహం కర్తా, అహం భోక్తా" అని యాత్మయం దేకర్తృత్వబుద్ధి యున్నదో ఆబుద్ధి యాంతరసోపాధికభ్రమ యనఁబడును. ఆభ్రమయం దంతఃకరణమే యుపాధి యని తెలియవలయును. ఎట్లనఁగా, ఈయాత్మ వాస్తవమునం దైననో అసంగనిర్వికారమై యున్నది. అట్టి యాత్మయందు స్వరూపముచేత నైననో కర్తృత్వభోక్తృత్వములు సంభవింపవు. మఱియు నేమనఁగా, ఆయంతఃకరణమునం దుండు కర్తృత్వభోక్తృత్వాదిధర్మము లవివేకమువలన నాత్మయం దారోపింపఁబడుచున్నవి. అందువలన "అహం కర్తా, అహం భోక్తా" ఇత్యాదిబుద్ధియందు సోపాధికభ్రమరూపత్వము సంభవించుచున్నది.

## [*] (10) స్వప్నవిచారము. [*]

ఈరీతిగానే స్వప్నమునందు రథాదిపదార్థములయొక్క యేజ్ఞాన మున్నదో ఆజ్ఞానముకూడ యాంతరసోపాధికభ్రమయే యగుచున్నది. స్మృతిరూపము గాదు. ఎట్లనఁగా, ఆస్వప్నజ్ఞాన మొకవేళ స్మృతిరూప మైనయెడల "స రథః" అనియే యాజ్ఞానముయొక్క యాకారము కావలయును. స్వప్నమునందు "స రథః" అనుజ్ఞానము కలుగుట లేదు, ఇఁక నేమనఁగా "అయం రథః, రథం పశ్యామి" అనియే జ్ఞానము కలుగుచున్నది. అందువలన నాస్వప్నజ్ఞానము సోపాధికభ్రమరూపాయాథార్థ్యానుభవమే యగుచున్నది, స్మృతిరూపము గాదు. అందువలన నాస్వప్నము నయథార్థస్మృతిరూప మని యంగీకరించు తార్కికులయొక్క మత మసంగతమై యున్నది.

శంక:—ఆ స్వప్నజ్ఞానమును స్మృతిరూప మని యంగీకరింపక యనుభవరూప మని యంగీకరించినయెడల, నాయనుభవమునకు విషయ మైన రథాదిపదార్థములకును అచ్చట నుత్పత్తి యంగీకరింపవలయును. మఱియు స్వప్నమునం దారథాదులయొక్క యుత్పత్తి సంభవింపదు. ఏల యన జాగ్రదవస్థయం దెంతదేశమందును ఎంతకాలమందును ఆరథాదులయొక్క యుత్పత్తి యగుచున్నదో అంతదేశకాల

ములు స్వప్నమునందు లేవు. మఱియుఁ బ్రసిద్ధరథాదులయొక్క యుత్పత్తికి కాష్ఠ తక్షాదికసామగ్రి యున్నవో ఆసామగ్రులును స్వప్నమునందు లేవు. కారణసామగ్రి లేక కార్యోత్పత్తి గాదు. అందువలన స్వప్నమునం దారథాదులయొక్క యుత్పత్తి సంభవింపదు. కావున స్వప్నమునం దారథాదులయొక్క జ్ఞానము స్మృతిరూప మని యే యంగీకరింపవలయును. మఱియు నాస్వప్నజ్ఞానము నిద్రాదోషముచేత జన్యమై యుండుటవలన "స రథః" అను జ్ఞానముయొక్క స్థానమునందు "అయం రథః" అను భ్రమ కలుగుచున్నది.

సమాధానము:—ఎట్లు హట్టాదికములయం దేవ్యావహారికరజత మున్నదో, ఆరజతముయొక్క యుత్పాదకసామగ్రికన్న ప్రాతిభాసికరజతోత్పత్తియొక్క సామగ్రి విలక్షణమే యగుచున్నదో అట్లు జాగ్రదవస్థయొక్క రథాదుల యుత్పత్తి చేయు సామగ్రికన్న స్వప్నరథాదులయొక్క యుత్పాదకసామగ్రియును విలక్షణమే యగుచున్నది. ఆవిలక్షణసామగ్రి యేవి యనఁగా, జాగ్రదవస్థయందు సుఖదుఃఖాదిరూపభోగము నిచ్చునట్టి పుణ్యపాపకర్మము లేవి గలవో, ఆకర్మముల కుపరామము కలుగుటచేతను స్వప్నభోగము నిచ్చునట్టి యేకర్మము లున్నవో ఆకర్మములయొక్క యుద్భవముచేతను, చక్షురాదీంద్రియములయొక్క లయముచేతను జాగ్రద్రథాదిసర్వవిషయములయొక్క సంస్కారరూపవాసనకును ఇంద్రియాదులయొక్క సంస్కారరూపవాసనకును ఈసర్వవాసనలకు నాశ్రయభూతమును నిద్రాదోషముతోఁ గూడినదియు నైన యేయంతఃకరణ మున్నదో ఆయంతఃకరణమే స్వప్నావస్థయం దారథాదివిషయాకారపరిణామమును ఆరథాదిగ్రాహక చక్షురాదీంద్రియాకారపరిణామమును ఆరథాదివిషయాకారవృత్తిరూపపరిణామమును బొందుచున్నది. ఈప్రకారముగా జాగ్రద్రథాదులయొక్క సామగ్రికన్న స్వప్నప్రాతిభాసికరథాదులయొక్క సామగ్రి విలక్షణమే యగుచున్నది.

శంక:—ఎట్లు జాగ్రదవస్థయందుఁ బ్రమాతృప్రమాణప్రమేయవ్యవహారములు కలుగుచున్నవో, అట్లు స్వప్నావస్థయందును ఆప్రమాతృప్రమాణప్రమేయవ్యవహారములు కలుగుచున్నవి. అందువలన స్వప్నపదార్థములకుఁ బ్రాతిభాసికత్వకథనము సంభవించుట లేదు.

సమాధానము:—జాగ్రత్పదార్థములు భూతములయొక్క కార్యము లగుటవలనఁ జిరకాలపర్యంతస్థాయులై యున్నవి. మఱియు స్వప్నముయొక్క రథాదిపదార్థములు వాసనావిశిష్టాంతఃకరణముయొక్క పరిణామము లగుటవలన వాసనామయములై యున్నవి. ఈకారణముచేతనే స్వప్నపదార్థము లల్పకాలపర్యంతస్థాయులై

యున్నవి. ఈరీతిగా స్వప్నపదార్థములయందు జాగ్రత్పదార్థములకన్న విలక్షణత యుండుటవలనఁ బ్రాతిభాసికత్వము సంభవించుచున్నది. మఱియు, ఎట్లు శుక్తియందు రజతజ్ఞానము దోషముచే జన్యమై యున్నదో, అట్లు స్వప్నపదార్థముల యొక్క జ్ఞానముగూడ నిద్రారూపదోషముచే జన్యమై యున్నది. అందువలన నాజ్ఞానమునందు భ్రమరూపత్వమును సంభవించుచున్నది.

శంక:—జాగ్రదవస్థయందు సూర్యాదిజ్యోతులయొక్క ప్రకాశముతోఁ గూడిన చక్షురాదీంద్రియములు విద్యమానములై యున్నవి. అందువలన నాయింద్రియములచే రూపాదిపదార్థములయొక్క జ్ఞానము సంభవించుచున్నది. మఱియు స్వప్నావస్థయందైననో ఆచక్షురాదీంద్రియములయొక్క యభావ మున్నది. అందువలన స్వప్నమునందు రూపాదిపదార్థములయొక్క యనుభవ మెట్లు సంభవించును?

సమాధానము:—ఆస్వప్నమందు వాసనావిశిష్ట మగు నేయంతఃకరణము విషయేంద్రియాదిరూపపరిణామమును బొందుచున్నదో తదంతఃకరణోపహిత సాక్షిచైతన్యమే స్వప్నరథాదిపదార్థములను బ్రకాశింపఁజేయుచున్నది.

శంక:—స్వప్నమునం దాసాక్షి తాను మఱియొకసాక్షిచేతఁ బ్రకాశితమై యారథాదులను బ్రకాశింపఁజేయుచున్నదా? లేక, అప్రకాశితమై ప్రకాశింపఁ జేయుచున్నదా? అందుఁ బ్రథమపక్ష మంగీకరించినయెడల, అనవస్థాదోషము ప్రాప్తించును. ఏల యన, ఆప్రథమసాక్షివలె ద్వితీయసాక్షిగూడ వేఱొక తృతీయ సాక్షిచేతఁ బ్రకాశిత మయ్యే ప్రకాశింపఁజేయువలయును. ఈలాగుననే యాతృతీయ సాక్షియును మఱియొక చతుర్థసాక్షిచేతఁ బ్రకాశిత మయ్యే ప్రకాశింపఁజేయవల యును. ఈరీతిగా పూర్వపూర్వసాక్షులయొక్క ప్రకాశముకొఱ కుత్తరోత్తరసాక్షుల యొక్క యంగీకారమువలన ననవస్థాదోషప్రాప్తి యగును. మఱియు ద్వితీయపక్ష మంగీకరించినయెడల, నప్రకాశిత మగుటవలన జడమైన యాసాక్షి స్వప్నపదార్థ ముల నెట్లు ప్రకాశింపఁజేయును?

సమాధానము:—ఆసాక్షిచైతన్యము స్వయంప్రకాశమానమై యున్నది. అనఁగా తనచేతనే తాను బ్రకాశమానమై యున్నది. అందువలన నాసాక్షియందుఁ బూర్వోక్తానవస్థయును జడత్వమును బ్రాప్తము కాదు. అట్టి స్వప్రకాశసాక్షియే యాస్వప్నపదార్థములను బ్రకాశింపఁజేయుచున్నది. ఈకారణముచేతనే స్వప్నా వస్థయం దాసాక్షిచైతన్యముయొక్క స్వప్రకాశత్వము తెలిసికొనుట సుగమమై యున్నది.

శంక:—"యేన సూర్య స్తపతి తేజసేద్ధః, త మేవ భాంత మనుభాతి సర్వమ్। తస్య భాసా సర్వ మిదం విభాతి, న తత్ర సూర్యో భాతి న చంద్రతారకమ్" ఇత్యాదిశ్రుతులవలన, నాసాక్షిచైతన్యమునకు సూర్యచంద్రాది సర్వజగత్తుయొక్క ప్రకాశకత్వము చెప్పఁబడి యున్నది. అట్లే యాసూర్యచంద్రాదిజ్యోతులచేత అప్రకాశ్యత్వముగూడ చెప్పఁబడి యున్నది. ఇదియే యాసాక్షిచైతన్యమునకు స్వప్రకాశ్యత్వమై యున్నది. అందువలన నాసాక్షిచైతన్యముయొక్క స్వప్రకాశ్యత్వము జాగ్రదవస్థయందును నిర్ణీతమే యగుచున్నది. జాగ్రదవస్థను విడిచి స్వప్నావస్థయందా సాక్షిచైతన్యముయొక్క స్వప్రకాశ్యత్వమునకు సువిజ్ఞేయత్వకథన మనుచితమై యున్నది.

సమాధానము:—యద్యపి వివేకిపురుషులకు జాగ్రదవస్థయందును ఆ సాక్షియొక్క స్వప్రకాశ్యత్వము సువిజ్ఞేయమై యున్నది. తథాపి, అవివేకిపురుషులకు జాగ్రదవస్థయందా సాక్షియొక్క స్వప్రకాశ్యత్వము దుర్విజ్ఞేయమే యగుచున్నది. ఎట్లనఁగా, జాగ్రదవస్థయందీపురుషునకు గమనాగమనాదివ్యవహారము సూర్యరూపజ్యోతిచేత నగుచున్నది. మఱియు నాసూర్యజ్యోతి లేనియెడలఁ జంద్రజ్యోతివలన నావ్యవహార మగుచున్నది. మఱియు నాచంద్రజ్యోతియును లేనప్పు డగ్నిజ్యోతిచే నావ్యవహార మగుచున్నది. మఱియు నాయగ్నిజ్యోతిగూడ లేనప్పుడు గాఢాంధకారమందు శబ్దరూపజ్యోతిచే నావ్యవహార మగుచున్నది. ఈప్రకారముగా జాగ్రదవస్థయందు వ్యవహారమునకు సాధకము లైన సూర్యాద్యనేకజ్యోతులతోఁ గూడినదై యాసాక్షిచైతన్యరూపజ్యోతి యున్నది. అందువలన జాగ్రదవస్థయం దవివేకిపురుషుల కాసాక్షిచైతన్యముయొక్క స్వప్రకాశ్యత్వము నిర్ణీత మగుట లేదు. మఱియు స్వప్నావస్థయం దైననో, ఆజాగ్రదవస్థయొక్క సూర్యచంద్రాదిసర్వజ్యోతులును లయ మొందుచున్నవి. స్వప్నావస్థయందును జాగ్రదవస్థవలె నాసర్వవ్యవహారములు కలుగుచున్నవి. ఏది యేది వ్యవహార మగుచున్నదో, అది యది యొక జ్యోతిచేతనే సాధ్య మగుచున్నది. అందువలన ఆస్వప్నవ్యవహారములయొక్క సిద్ధికిన్ని ఒకజ్యోతి నవశ్య మంగీకరింపవలయును. యద్యపి, స్వప్నమునం దంతఃకరణమును అజ్ఞానమును విద్యమానములై యున్నవి, తథాపి, ఆయంతఃకరణ మచ్చట విషయాద్యాకారపరిణామమును బొందుచున్నది. అందువలన నాయంతఃకరణమునకుఁ గూడ జ్యోతిస్త్వము సంభవించుట లేదు. మఱియు అజ్ఞానమో తమస్సువలెఁ బ్రకాశమునకు విరోధియే యగుచున్నది. అందువలన నాయజ్ఞానమునకును జ్యోతిస్త్వము సంభవించుట లేదు. పరిశేషమువలన, నాసాక్షిచైతన్యరూపజ్యోతియే

యాస్వప్నవ్యవహారములకు సాధనముగా సిద్ధ మగుచున్నది. ఈప్రకారముగా నవి
వేకిపురుషులకును స్వప్నావస్థయందు సాక్షిచైతన్యముయొక్క స్వప్రకాశ్యత్వము
నిర్ణీత మగుచున్నది. అందువలన స్వప్నావస్థయందు సాక్షిచైతన్యముయొక్క స్వప్ర
కాశ్యత్వము సువిజ్ఞేయమై యున్న దనుకథనము సంభవించుచున్నది. ఈ యభిప్రా
యముచేతనే "అత్రాయం పురుషః స్వయం జ్యోతి ర్భవతి" అను బృహదారణ్యక
శ్రుతి స్వప్నావస్థయందే యాసాక్షి యగు నాత్మను స్వయంజ్యోతి యని చెప్పుచు
న్నది. ఇచ్చట స్వయంజ్యోతి, స్వప్రకాశ్యము, స్వయంప్రకాశమానము, అను నీ
త్రివిధశబ్దములకు నొకటే యర్థ మని దెలియవలయును. అందు సాక్షియొక్క లక్ష
ణము పూర్వము ద్వితీయపరిచ్ఛేదమందుఁ జెప్పఁబడి యున్నది.

ఇఁక ప్రసంగానుసారముగా నాసాక్షిచైతన్యమునకు స్వప్రకాశ్యత్వము
యొక్క లక్షణము జెప్పఁబడుచున్నది. అచ్చట "చైతన్యావిషయత్వం స్వప్రకాశ్య
త్వమ్"—భావము॥ ఇంద్రియజన్యవృత్తియందుఁ బ్రతిబింబిత మగు నేచైతన్య మున్న
దో అది ఫలచైతన్యమై యున్నది. ఆఫలచైతన్యమునకు అవిషయత్వ మేది గలదో
అదియే ఆసాక్షిచైతన్యమునందు స్వప్రకాశ్యత్వమై యున్నది. లేక "అవేద్యత్వే సతి
అపరోక్ష వ్యవహార యోగ్యత్వం స్వప్రకాశ్యత్వమ్" — భావము॥ ఉక్తఫల చైతన్య
మునకు అవిషయ మైన యేయపరోక్షవ్యవహార యోగ్యత్వ మున్నదో అదియే యా
సాక్షిచైతన్యమునందు స్వప్రకాశ్యత్వమై యున్నది. ఇచ్చట, అపరోక్షవ్యవహార
శబ్దముచేతఁ బ్రమాణజన్యవృత్తిని గ్రహింపవలయును. అపరోక్షవ్యవహారమునకు
యోగ్య మైన ఘటాదులయందు ఈలక్షణముయొక్క యతివ్యాప్తిని నివర్తించుట
కొఱకు "అవేద్యత్వే సతి" అను పదము చెప్పఁబడినది. ఆఘటాదులయందు ఫల
చైతన్యముయొక్క యవిషయత్వరూప మైన యవేద్యత్వము లేదు. మఱియు అవేద్య
ము లైన ధర్మాధర్మములయం దీలక్షణముయొక్క యతివ్యాప్తిని నివర్తించుటకొఱకు
"అపరోక్షవ్యవహార యోగ్యత్వమ్" అనుపదము చెప్పఁబడినది. ఆ యపరోక్షవ్యవ
హార యోగ్యత్వ మాధర్మాధర్మములయందు లేదు. అందువలన నచ్చట నతివ్యాప్తి
కలుగదు.

శంక:—ఆ స్వప్రకాశ్యసాక్షిచేత స్వప్నపదార్థములు ప్రకాశించున
వైనను, ఆరథాదిపదార్థములు స్వప్నమునందు నూతనముగానే యుత్పన్నము లగు
చున్న వనుదానియందుఁ బ్రమాణ మేమి ?

సమాధానము:—సాక్షా ద్వేదశ్రుతియే యాయర్థమందుఁ బ్రమాణమై
యున్నది. అందు శ్రుతి "న తత్ర రథా న రథయోగా న పంథానో భవంతి, అథ

రథా న్రథయోగా న్పథః సృజతి ”—భావము॥ జాగ్రదవస్థయందు ఏవ్యావహారిక రథము లున్నవో మఱియు నారథములయందుఁ బూన్చినట్టి యేయశ్వము లున్నవో మఱియు నాయశ్వములు పోవుటకు యోగ్యము లైన యేమార్గము లున్నవో ఆసర్వమునకు స్వప్నమునం దభావ మయ్యును స్వప్నమునందు రథములును అశ్వములును మార్గములును ఉత్పన్నము లగుచున్నవి. ఈశ్రుతి స్వప్నమునందు జాగ్రద్రథాదుల యొక్కయభావమును ప్రాతిభాసికరథాదులయొక్కయుత్పత్తియును జెప్పుచున్నది. అందువలన నారథాదులను విషయము చేయునట్టి యాస్వప్నజ్ఞాన మనుభవరూపమే యగుచున్నది. స్మృతిరూపము గాదు.

శంక:—ఈప్రకారముగా నాస్వప్నజ్ఞానము ననుభవరూప మని యంగీకరించినయెడల ఆస్వప్నరథాదిపదార్థములకు జాగ్రత్తయందును అనువృత్తి కావల యును. ఏల యన, ఏపదార్థ మేయధిష్ఠానమునందుఁ గల్పిత మగుచున్నదో ఆయధిష్ఠానజ్ఞానమువలననే యాపదార్థముయొక్కనాశము కలుగుచున్నది. మఱియు నాస్వప్నపదార్థములు బ్రహ్మచైతన్యమునందే కల్పితములై యున్నవి. అందువలన నాబ్రహ్మచైతన్యముయొక్కసాక్షాత్కారముచేతనే యాస్వప్నపదార్థములకు నాశము కలుగవలయును. అధిష్ఠానబ్రహ్మముయొక్కసాక్షాత్కార మీపురుషునకు లేదు. ఆయధిష్ఠానసాక్షాత్కారమునకు భిన్న మైన మఱియొకదానిచే నాస్వప్నపదార్థముల యొక్కనివృత్తి కలుగదు. అందువలన జాగ్రదవస్థయం దాస్వప్నపదార్థముల యొక్కయనువృత్తి యవశ్యము కావలయును. ఒకవేళ నీయర్థమం దిష్టముండిన యెడల, సర్వలోకులయొక్కయనుభవమునకు విరోధ మగును. అనఁగా సర్వలోకులు స్వప్నపదార్థములకు జాగ్రత్తయం దభావమే యంగీకరించుచున్నారు. అందువలన నాస్వప్నజ్ఞానమునం దనుభవరూపత్వము సంభవింపదు.

సమాధానము:—కార్యముయొక్కనాశము ద్వివిధము. ఒకటి బాధమై యున్నది, మఱియొకటి లయమై యున్నది. అందు, అధిష్ఠానవాస్తవస్వరూపసాక్షాత్కారముచేతఁ గార్యమునకుఁ దనయుపాదానకారణరూప మైనయజ్ఞానముతోఁ గూడ ఏనాశ మున్నదో, అది బాధ యనఁబడును. ఉదా—శుక్తిరూపాధిష్ఠానము యొక్కసాక్షాత్కారముచేత, రజతరూపకార్యమునకుఁ దనయుపాదానకారణరూప మైన యజ్ఞానముతోఁ గూడ ఏనాశ మున్నదో అది బాధమై యున్నది. మఱియు నాయుపాదానకారణ ముండినను గార్యమున కేతిరోభావమాత్ర మున్నదో అది లయ మనఁబడును. అచ్చట స్వప్నముయొక్కరథాదిపదార్థము లంతఃకరణమాయా ద్వావఛిన్న శుద్ధచైతన్యమునం దధ్యస్తములై యున్నవి. మఱియు నాశుద్ధచైతన్య

రూపాధిష్ఠానముయొక్క సాక్షాత్కార మీపురుషునకు జాగ్రత్కాలమునందు లేదు. అందువలన శుక్తిరజతమువలె నాస్వప్నపదార్థములకు బాధరూపనాశ మైననో కలుగుట లేదు. ఆస్వప్నము పూర్వోక్తరీతిగా సోపాధికభ్రమమై యున్నది. అందువలన నెట్లు జపాకుసుమాదిరూపోపాధులయొక్క నివృత్తిచే స్ఫటికమునందు లోహితత్వము నివృత్త మగుచున్నదో అట్లే యుపాధులయొక్క నివృత్తివలన స్వప్నపదార్థములకును నివృత్తి సంభవించుచున్నది. అందువలన జాగ్రదవస్థయందు దాస్వప్నపదార్థములయొక్క యనువృత్తి సంభవింపదు. అచ్చట జాగ్రత్తయొక్క సంస్కారమును స్వప్నమునందు భోగము నిచ్చునట్టి కర్మమును నిద్రాదోషము నను నీమూటితోఁ గూడిన యేయంతఃకరణ మున్నదో ఆయంతఃకరణమే స్వప్నభ్రమయం దుపాధియై యున్నది. ఆయంతఃకరణరూపోపాధియొక్క నివృత్తివలన జాగ్రదవస్థయం దాస్వప్నపదార్థములు నివృత్తము లగుచున్నవి. యద్యపి, జాగ్రదవస్థయం దాయంతఃకరణము స్వరూపముచే విద్యమానమే యగుచున్నది, తథాపి జాగ్రదవస్థయం దాయంతఃకరణము స్వప్నభోగప్రదకర్మనిద్రాదోషవిశిష్టము గాదు. అచ్చట, ఏపదార్థము తన యందుండు ధర్మములను దనసంబంధియం దారోపించుచున్నదో ఆపదార్థ ముపాధి యనఁబడును. ఎట్లు జపాకుసుమము తనయందుండు రక్తవర్ణమును దనసంబంధి యగు స్ఫటికమునం దారోపించుటవలన నాజపాకుసుమ ముపాధి యనఁబడు చున్నదో, అట్లాయంతఃకరణమును దనకర్తృత్వభోక్తృత్వాదిధర్మములను దనసంబంధి యగు నాత్మయం దారోపించుటవలన నాయంతఃకరణమును ఉపాధి యనఁబడుచున్నది. ఈప్రకారముగా స్వప్నజ్ఞానము సోపాధికభ్రమరూప మగుటవలన, దాని కనుభవరూపత్వమే సంభవించుచున్నది.

[*] (11) కొందఱు గ్రంథకారులు స్వప్నము నిరుపాధిక మనుట. [*]

ఇచ్చటఁ గొందఱు గ్రంథకారు లైననో ఇట్లు చెప్పుచున్నారు. ఆస్వప్నాధ్యాసము సోపాధికభ్రమ కాదు, ఇఁక నే మనఁగా, శుక్తి రజతభ్రమవలె నిరుపాధికభ్రమమే యగుచున్నది.

శంక:—స్వప్నాధ్యాసమును నిరుపాధికభ్రమ యని యంగీకరించినయెడల నాస్వప్నపదార్థములకు జాగ్రత్తయందును అనువృత్తి కావలయును. ఏల యన, నిరుపాధికభ్రమముయొక్క నివృత్తి యధిష్ఠానజ్ఞానమువలననే యగుచున్నది. మఱియు నాస్వప్నభ్రమ కధిష్ఠానము బ్రహ్మచైతన్యమై యున్నది. ఆ బ్రహ్మచైతన్య మీపురుషునకు జాగ్రదవస్థయందు సాక్షాత్కార మగుట లేదు. అందువలన నాస్వప్నపదార్థములకు జాగ్రదవస్థయందు బాధ కలుగఁగూడదు.

సమాధానము:—రజతభ్రమ కధిష్ఠాన మైన యేశుక్తి యున్నదో ఆశుక్తి యొక్క సాక్షాత్కారము లేక పోయినను ఆరజతభ్రమ కుపాదానకారణ మైన యజ్ఞానము విద్యమానమై యుండినను ఆరజతభ్రమ తనవిరోధు లైన దండాదిపదార్థములయొక్క జ్ఞానముచేత నెట్లు నివృత్త మగుచున్నదో అట్లు స్వప్నభ్రమ కధిష్ఠాన మైన బ్రహ్మచైతన్యముయొక్క సాక్షాత్కారము లేకపోయినను విరోధి యైన జాగ్రదవస్థయొక్క జ్ఞానముచేత నాస్వప్నపదార్థములయొక్క నివృత్తి సంభవించుచున్నది. అందువలన నాస్వప్నపదార్థములకు జాగ్రత్తయం దనువృత్తి యగుట లేదు. కావున రజతభ్రమవలె స్వప్నభ్రమయును నిరుపాధికభ్రమయే యగుచున్నది.

శంక:—స్వప్నభ్రమను నిరుపాధికభ్రమ యని యంగీకరించినయెడల బ్రహ్మవేత్త లగు జ్ఞానుల కాస్వప్నభ్రమ కలుగక పోవలయును. ఏల యన, ఆస్వప్న పదార్థముల కధిష్ఠాన మైన యేబ్రహ్మచైతన్య మున్నదో ఆబ్రహ్మచైతన్యముయొక్క సాక్షాత్కారముచేత, బ్రహ్మవేత్త లగు పురుషులకు స్వప్నభ్రమ కుపాదానకారణ మైన యజ్ఞానము నివృత్త మైనది.

సమాధానము:—బ్రహ్మసాక్షాత్కారముచేత నజ్ఞానము నివృత్త మైనను ఆయజ్ఞానముయొక్క కార్యభూతము లైన యంతఃకరణాదులకుఁ బ్రారబ్ధకర్మనాశపర్యంతము నివృత్తి కలుగుట లేదు. మఱియుఁ బూర్వోక్తరీతిగా నాస్వప్నపదార్థముల కంతఃకరణమే సాక్షాదుపాదానకారణమై యున్నది. అందువలనఁ బ్రారబ్ధనాశపర్యంతము బ్రహ్మవేత్త లగు పురుషులకును స్వప్నభ్రమ సంభవించుచున్నది. ఒకవేళ బ్రహ్మసాక్షాత్కారముచేత నజ్ఞాననివృత్త్యనంతరము తత్త్వవేత్త లగు పురుషులకు స్వప్నభ్రమ నంగీకరింపనియెడల నాతత్త్వవేత్త లగు పురుషులకు జాగ్రదవస్థయందును శబ్దాదివిషయములయొక్క యనుభవము గాక పోవలయును. జాగ్రదవస్థయం దాతత్త్వవేత్త లగు పురుషులయొక్క వ్యవహారమో ప్రత్యక్షముగాఁ బ్రతీత మగుచున్నది. అందువలన నాతత్త్వవేత్తలకు స్వప్నభ్రమయును అంగీకరింపవలయును. ఆతత్త్వవేత్త లగుపురుషులో యజ్ఞానిపురుషునివలెఁ దమస్వరూపమునం దేవ్యవహారమును అంగీకరించుట లేదు.

## [*] (12) విపర్యయమున కన్యవిభాగనిరూపణము. [*]

పూర్వము నిరుపాధికము, సోపాధిక మను భేదముచేత ద్విప్రకార మైన విపర్యయము చెప్పఁబడినది. అది యింతపర్యంతము నిరూపింపఁబడినది. ఇఁకఁ బూర్వోక్తవిపర్యయమునకే యన్యప్రకారముగా విభాగము చెప్పఁబడుచున్నది.

పూర్వోక్తభ్రమరూపవిపర్యయము మరల ద్విప్రకార మగుచున్నది. ఒకటి అంతః కరణవృత్తిరూపమై యున్నది. మఱియొకటి అవిద్యావృత్తిరూపమై యున్నది. అందు స్వప్నపదార్థములయొక్క జ్ఞానమును, మనోరాజ్యమును, నష్టపుత్రాదులయొక్క ప్రత్యక్షమును—ఇత్యాదిభ్రమ మైననో యంతఃకరణవృత్తిరూపమై యున్నది. శుక్తి యందు రజతజ్ఞానమును, రజ్జువునందు సర్పజ్ఞానమును—ఇత్యాదిభ్రమ యవిద్యావృత్తి రూపమై యున్నది. ఈప్రకారముగాఁ బూర్వోక్తసంశయమును అవిద్యావృత్తిరూ పమే యగుచున్నది.

ఇంతపర్యంతము విపర్యయముయొక్క నిరూపణ చేయఁబడినది. ఇఁక నా విపర్యయముయొక్క నివృత్త్యుపాయము చెప్పఁబడుచున్నది. అచ్చట పూర్వము చెప్పఁబడిన "అహ మజ్ఞః" ఇత్యాది నిరుపాధికవిపర్యయ మైననో నిదిధ్యాసనము చేత నివృత్త మగుచున్నది. సోపాధికవిపర్యయమో ఆయాయుపాధులయొక్క నివృత్తి చేత నివృత్త మగుచున్నది. పూర్వోక్తవిపరీతభావనారూపవిపర్యయముయొక్క నివర్తక మైన యేనిదిధ్యాసన మున్నదో దానియొక్క స్వరూపము పూర్వము ద్వితీయపరిచ్ఛేదమున నిరూపింపఁబడి యున్నది. దాని నిచ్చటను దెలియవలయును. ఆ నిదిధ్యాసనము శారీరకమీమాంసాతృతీయాధ్యాయపఠనముచేత సిద్ధ మగు చున్నది. ఈప్రకారముగా శ్రవణమువలనఁ బ్రమాణగతాసంభావనయును, మన నముచేతఁ బ్రమేయగతాసంభావనయును, నిదిధ్యాసనముచేత విపరీతభావనయును నివృత్తములు కాఁగా, నీయధికారిపురుషునకుఁ దత్త్వమస్యాదివాక్యములవలన "అహం బ్రహ్మాస్మి" యను నపరోక్షజ్ఞానము కలుగుచున్నది. ఆయపరోక్షజ్ఞానము వలన నజ్ఞాననివృత్తిపూర్వకముగాఁ, బరమానందప్రాప్తి యగుచున్నది.

శంక:—శ్రవణమనననిదిధ్యాసనములు చేసినను గొందఱు పురుషుల కాబ్రహ్మసాక్షాత్కారము కలుగుట లేదు. దీనియందుఁ గారణ మేమి?

సమాధానము:—ఆత్మజ్ఞానోత్పత్తియం దెట్లు పూర్వోక్తాసంభావనావిప రీతభావనలు ప్రతిబంధకము లగుచున్నవో, అట్లు భూతభవిష్యద్వర్తమానము లను త్రివిధము లగు నన్యప్రతిబంధకములు గూడఁ గలవు. ఆప్రతిబంధకము లేపురుషుని యందు విద్యమానములై యున్నవో ఆపురుషుఁడు శ్రవణాదులు చేసినను వాని కాత్మజ్ఞానము కలుగుట లేదు. మఱియు నేపురుషున కాప్రతిబంధకములు లేవో ఆ పురుషునకు, విచారము చేయఁబడిన తత్త్వమస్యాదివాక్యములవలన బ్రహ్మసాక్షా త్కార మవశ్యము కలుగుచున్నది. ఈవిషయము శ్రీవ్యాసభగవానులచే బ్రహ్మ

సూత్రమునందుఁ జెప్పఁబడి యున్నది. అందు సూత్రము.—"ఐహిక మ ప్యప్రస్తుత ప్రతిబంధే తద్దర్శనాత్ "—భావము॥ ఫలము నిచ్చుటకొఱకు సమ్ముఖ మైన యేకర్మ విశేష మున్నదో అది ప్రస్తుత ప్రతిబంధక మనఁబడును. లేక, బ్రహ్మసాక్షాత్కారో త్పత్తికి విరోధి యైన యేవాసనావిశేష మున్నదో అది ప్రస్తుతప్రతిబంధక మనఁ బడును. అట్టి ప్రస్తుతప్రతిబంధకము లేనియెడల నీపురుషునకు శ్రవణమననాదులచే నీజన్మమందే బ్రహ్మసాక్షాత్కార మగుచున్నది. ఆప్రస్తుతప్రతిబంధక ముండినయెడల నీపురుషునకు జన్మాంతరమునందు బ్రహ్మసాక్షాత్కారము కలుగుచున్నది. ఉదా— వామదేవాదులకుఁ గలిగి యున్నది.

అచ్చట, ప్రతిబంధకముతోఁ గూడిన పురుషున కాత్మయొక్క దుర్విజ్ఞేయత శ్రుతిస్మృతులచేతను జెప్పఁబడి యున్నది. అందు శ్రుతి.—"శ్రవణా యాపి బహుభి ర్యో న లభ్యః, శృణ్వంతోఽపి బహ వోయం నవిద్యుః" — భావము॥ ఈయాత్మ యనేకపురుషులకు శ్రవణముకొఱకును బ్రాప్త మగుట లేదు, మఱియు ననేకపురుషు లీయాత్మను శ్రవణము చేసినను ఏదైన నొకప్రతిబంధకవశమువలన సాక్షాత్కరించు కొనుటకు శక్తిహీను లగుచున్నారు. ఈయర్థమునే "ఆశ్చర్యవ చ్చైన మన్యః శృణోతి। శ్రుత్వా ప్యేనం వేద న చైవ కశ్చిత్" ఇత్యాదిస్మృతివచనములు చెప్పు చున్నవి.

## (13) భూతభవిష్యద్వర్తమానప్రతిబంధకములయొక్క స్వరూపమును తన్నివృత్త్యుపాయమును నిరూపించుట.

ఇఁక భూతభవిష్యద్వర్తమానము లనుత్రివిధప్రతిబంధకములయొక్క స్వరూపమును, వానియొక్క నివృత్త్యుపాయమును, జెప్పఁబడుచున్నవి. అందుఁ బూర్వ మనుభవింపఁబడిన యొకప్రియవిషయముయొక్క దృఢసంస్కారవశమువలన, బ్రహ్మ చింతనాకాలమునం దావిషయముయొక్క పునఃపునఃస్మరణ యేది గలదో, అది భూత ప్రతిబంధక మనఁబడును. ఆభూతప్రతిబంధకము తద్విషయోపహితబ్రహ్మముయొక్క చింతనచేత నివృత్త మగుచున్నది. ఉదా—ఒకసన్న్యాసికిఁ బూర్వము గృహస్థా శ్రమమునం దనుభవింపఁబడిన మహిషాదిపదార్థములయొక్క పునఃపునఃస్మరణచేత ఎప్పుడు శ్రవణము చేసినను దత్త్వజ్ఞానము గలుగుట లేదో, అప్పుడు గురునిచేత నా భూతప్రతిబంధకనివృత్తి చేయుటకొఱకు నాసన్న్యాసిని గుఱించి తన్మహిషోపహిత బ్రహ్మముయొక్క చింతన యుపదేశింపఁబడినది. ఆచింతనచేత నాసన్న్యాసి కాభూత ప్రతిబంధకనివృత్తి యైనది. తదనంతర మాసన్న్యాసికి శ్రవణాదులవలన నాత్మజ్ఞా నము కలిగినది. ఈప్రకార మైన గాథ లోకపరంపరవలన సిద్ధ మగుచున్నది.

మఱియు ద్వితీయ మగు భావిప్రతిబంధక మైననో ప్రారబ్ధకర్మశేషమును బ్రహ్మలోకేచ్ఛయు నను భేదముచేత ద్వివిధ మగుచున్నది. ఆభావిప్రతిబంధక ముండినయెడల నీపురుషునకు శ్రవణాదులు చేసినను ఆత్మజ్ఞానము కలుగుట లేదు.

శంక:—ప్రారబ్ధకర్మము జ్ఞానమునకుం బ్రతిబంధక మని యంగీకరించిన యెడల నేపురుషునకును బ్రహ్మసాక్షాత్కారము కలుగఁగూడదు. ఏకారణముచేత ననఁగా శరీరస్థితిపర్యంత మాప్రారబ్ధకర్మము నశించు ననుట లేదు. మఱియు నా ప్రారబ్ధకర్మరూపప్రతిబంధకవశమువలన నొకనికిని బ్రహ్మసాక్షాత్కారము కలుగ నప్పుడు బ్రహ్మసాక్షాత్కారముకొఱకు శ్రవణాదిసాధనములను విధించి యుండు "ఆత్మా వా అరే శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" ఇత్యాది శ్రుతివచనము లప్రమాణము లగును.

సమాధానము:—ఆప్రారబ్ధకర్మము ద్వివిధమై యున్నది. ఒకటి ఫలాభిసంధికృతప్రారబ్ధకర్మము, మఱియొకటి కేవలప్రారబ్ధకర్మము. అచ్చట, ఈకర్మముచేత నాకు స్వర్గరూపఫలము ప్రాప్త మగుఁగాక యను నేఫలేచ్ఛ యున్నదో అది ఫలాభిసంధి యనఁబడును. ఆఫలాభిసంధిచేఁ జేయఁబడిన యేకర్మ మున్నదో అది ఫలాభిసంధికృత మనఁబడును. మఱియు నాఫలాభిసంధి లేక చేయఁబడిన యేకర్మ మున్నదో, అది కేవలప్రారబ్ధ మనఁబడును. అందు ఫలాభిసంధికృతప్రారబ్ధకర్మ మైననో ఫలభోగముచేతనే నాశ మొందుచున్నది, అన్య మగు నేయుపాయముచేతను నాశ మొంగుట లేదు. ఫలాభిసంధికృతకర్మ ముండినయెడల నీపురుషునకు శ్రవణాదులు చేసినను బ్రహ్మసాక్షాత్కారము కలుగుట లేదు. ఏల యనఁగా, ఇచ్ఛాఘటితసామగ్రి సర్వత్ర ప్రబలమే యగుచున్నది. ఉదా—లోకమునందు రెండువస్తువులయొక్క జ్ఞానసామగ్రు లుండినను ఈపురుషున కేవస్తువుయొక్క జ్ఞానేచ్ఛ కలుగుచున్నదో, ఆ వస్తువుయొక్క జ్ఞానమే ప్రథమము కలుగుచున్నది, అన్యవస్తువుయొక్క జ్ఞానము కలుగుట లేదు. అందువలన, ఆఫలేచ్ఛాసహితప్రారబ్ధకర్మము ప్రబల మగుటవలన, నది యుండఁగా నీపురుషునకు శ్రవణాదులు చేసినను బ్రహ్మసాక్షాత్కారము కలుగుట లేదు. మఱియు నే మనఁగా, ఆఫలాభిసంధికృతప్రారబ్ధకర్మముయొక్క ఫలభోగానంతరమే యీపురుషునకు బ్రహ్మసాక్షాత్కారము కలుగుచున్నది.

ఇఁక నాఫలాభిసంధికృతకర్మముయొక్క ప్రబలత్వమునందు శ్రుతిప్రమాణము గూడఁ జెప్పఁబడుచున్నది. "స యథా కామో భవతి తత్క్రతు ర్భవతి, యత్క్రతు ర్భవతి తత్కర్మ కురుతే, యత్కర్మ కురుతే తదభిసంపద్యతే"—

భావము॥ ఈపురుషుఁ డేయేఫలము కామించుచున్నాఁడో ఆయాఫలమున కనుకూలము లైనకర్మములయొక్క సంకల్పము గలవాఁ డగుచున్నాఁడు, మఱియు నేయేకర్మములయొక్క సంకల్పము గలవాఁ డగుచున్నాఁడో ఆయాకర్మములను జేయుచున్నాఁడు, ఏయేకర్మములఁ జేయుచున్నాఁడో తత్తత్కర్మానుసారముగా నాయాస్వర్గాదిరూపఫలమును బొందుచున్నాఁడు.

ఈప్రకారముగా ఫలాభిసంధికృతప్రారబ్ధకర్మమే భావిప్రతిబంధక మని చెప్పఁబడును. మఱియు ద్వితీయ మగు ఫలేచ్ఛారహితకేవలప్రారబ్ధకర్మ మేది గలదో అదియును బుణ్యము పాపము అను భేదముచేత ద్విప్రకార మగుచున్నది. ఆరెంటియందుఁ గేవలపుణ్యప్రారబ్ధ మైననో పాపనివృత్తిద్వారమున నీపురుషునకుఁ దత్త్వజ్ఞానమునకే హేతు వగుచున్నది. అందు శ్రుతి స్మృతి.—"ధర్మేణ పాప మపనుదతి, జ్ఞాన ముత్పద్యతే పుంసాం క్షయా త్పాపస్య కర్మణః । కషాయే కర్మభిః పక్వే తతో జ్ఞానం ప్రవర్తతే" — భావము॥ ఈపురుషుఁడు ధర్మముచేఁ బాపనివృత్తి చేయుచున్నాఁడు. మఱియు నీయధికారిపురుషులకుఁ బాపకర్మనాశమువలననే యాత్మజ్ఞానము కలుగుచున్నది. మఱియుఁ బుణ్యకర్మములచేతఁ బాపాదులయొక్క నివృత్త్యనంతర మీపురుషునియొక్క శుద్ధాంతఃకరణమం దాత్మజ్ఞాన ముత్పన్న మగుచున్నది. ఇత్యాది శ్రుతిస్మృతివచనములచేతఁ గేవలపుణ్యప్రారబ్ధమునకుఁ బాపనివృత్తిద్వారమున నాత్మజ్ఞానముయొక్క కారణత్వము సిద్ధ మగుచున్నది. మఱియు ద్వితీయ మగు పాపప్రారబ్ధ మైననో, ఫలాభిసంధికృత మగుఁగాక, లేక, ఫలాభిసంధిరహితకేవల మగుఁగాక. ఆ ద్విప్రకార మైన పాపప్రారబ్ధ మాత్మజ్ఞానమునకుఁ బ్రతిబంధకమే యగుచున్నది. అచ్చట నాపాపప్రారబ్ధ మొకానొక ప్రబల మగు పుణ్యకర్మముచేతఁ దిరోభావమును బొందినదై నివృత్త మగుచున్నది. అట్లు గానియెడ జ్ఞానోత్పత్తికిఁ బ్రతిబంధక మగుచున్నది. అందువలన నిది సిద్ధ మగుచున్నది. ఆప్రారబ్ధశేషరూప భావిప్రతిబంధక మెంతపర్యంతము ఫలభోగముచే నివృత్త మగుట లేదో అంతపర్యంతము శ్రవణాదులు చేసినను ఈపురుషున కాత్మజ్ఞానము కలుగుట లేదు. మఱియు నెప్పుడు ఫలభోగముచే నాభావిప్రతిబంధకము నివృత్త మగుచున్నదో, అప్పు డీపురుషున కాశ్రవణాదిసాధనములచేత నాత్మజ్ఞానము కలుగుచున్నది. అందువలన నాత్మసాక్షాత్కారముకొఱకు శ్రవణాదిసాధనములను విధించి యుండు శ్రుతులకును అప్రమాణత్వము కలుగదు.

శంక:—ఉక్తభావిప్రతిబంధక మెంతకాలమునకు వెనుక నివృత్త మగును?

సమాధానము:—ఈ భావిప్రతిబంధకనివృత్తియందుఁ గాలనియమము లేదు. ఇఁక నేమనఁగా, కొందఱకైననో ఒకజన్మముచేతను ఆప్రతిబంధకము నివృత్త మగుచున్నది. మఱికొందఱకు రెండుమూఁడుజన్మములచేతను నివృత్త మగుచున్నది. ఈవిషయ మన్యగ్రంథములయందుఁ గూడఁ జెప్పఁబడి యున్నది. అచ్చట, "శ్లో. ఆగామి ప్రతిబంధో హి వామదేవే సమీరితః । ఏకేన జన్మనా క్షీణో భరతస్య త్రిజన్మభిః"—భావము॥ పూర్వోక్తప్రారబ్ధశేషరూపభావిప్రతిబంధకము వామదేవుని యందును భరతునియందును ఉండినది. అందు వామదేవునికైననో నాప్రతిబంధక మొకజన్మముచేత నివృత్త మైనది. భరతునకు మూఁడుజన్మములచేత నివృత్త మైనది. అందువలన నాభావిప్రతిబంధకముయొక్క నివృత్తియం దొకకాలనియమము లేదు. ఆవామదేవునియొక్క వృత్తాంత మాత్మపురాణముయొక్క ప్రథమాధ్యాయమునందు విస్తరముగాఁ జెప్పఁబడి యున్నది.

పూర్వము, ప్రారబ్ధశేషము బ్రహ్మలోకేచ్ఛ అని ద్విప్రకార మైన భావి ప్రతిబంధకము చెప్పఁబడినది. దానియందుఁ బ్రారబ్ధశేషరూపప్రథమప్రతిబంధక మింతపర్యంతము నిరూపింపఁబడినది. ఇఁక ద్వితీయ మగు బ్రహ్మలోకేచ్ఛారూప భావిప్రతిబంధకము నిరూపింపఁబడుచున్నది. ఏపురుషునియొక్క మనస్సునందు బ్రహ్మ లోకప్రాప్తీచ్ఛ యున్నదో, ఆపురుషుఁడు శ్రవణాదులు చేసినను ఆత్మజ్ఞానము పొందుట లేదు. అందువలన నాబ్రహ్మలోకేచ్ఛయుఁ గూడ నాయాత్మజ్ఞానోత్పత్తియందు భావిప్రతిబంధకమై యున్నది. ఈవిషయము శ్రీవిద్యారణ్యస్వాములచేతను జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. బ్రహ్మలోకాభివాంఛాయాం సమ్యక్సత్యాం నిరుధ్య తామ్ । విచారయేద్య ఆత్మానం నతు సాక్షాత్కరోత్యయమ్"—భావము॥ ఏ పురుషునకు బ్రహ్మలోకమును బొందుట కత్యంతోత్కటేచ్ఛ యున్నదో ఆపురుషుఁడా యిచ్ఛ నడఁచి శ్రవణాదులు చేసినను వాని కాత్మసాక్షాత్కారము కలుగుట లేదు.

శంక:—ఉపాసకు లేబ్రహ్మలోకమునకుఁ బోవుచున్నారో, ఆబ్రహ్మలోక ప్రాప్తికి సాధనరూప మైన యేయుపాసన యున్నదో ఆయుపాసనయును ఆపురుషుని చేతఁ జేయఁబడ లేదు. మఱియు నిచ్ఛారూపప్రతిబంధకవశమువలన నాపురుషుని చేఁ జేయఁబడిన యాశ్రవణాదులవలనను ఆపురుషున కాత్మజ్ఞానప్రాప్తియును గలుగుట లేదు. అందువలన నాపురుషుఁడు ద్వివిధఫలభ్రష్టుఁడై యధఃపతనమునే పొందుచున్నాఁడు.

సమాధానము:—ఆపురుషుఁడు మరణానంతర మాశ్రవణాదులయొక్క ప్రభావమువలన బ్రహ్మలోకమునకుఁ బోయి యచ్చట నిర్గుణబ్రహ్మమును "అహం

బ్రహ్మాస్మి" యని సాక్షాత్కరించుకొనుచున్నాఁడు. ఆసాక్షాత్కారమువలన నచ్చట విదేహకైవల్యరూపమోక్షమును బొందుచున్నాఁడు. ఈయర్థము శ్రుతియందుఁగూడఁ జెప్పఁబడి యున్నది. అచ్చట శ్రుతి.—"వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాః సన్న్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్త్వాః । తే బ్రహ్మలోకేషు పరాంతకాలే పరామృతా త్పరి ముచ్యంతి సర్వే"—భావము॥ వేదాంతశ్రవణజన్యజ్ఞానముచేత నద్వితీయబ్రహ్మరూపార్థమును దృఢముగా నిశ్చయించుకొన్నవారును శ్రుతిస్మృతివిహితసర్వకర్మములయొక్క త్యాగపూర్వకముగా జ్ఞానాభ్యాసరూపయోగమువలన శుద్ధమైన యంతఃకరణము గలవారును నైన సన్న్యాసుల కేదైన నొకప్రతిబంధకవశమువలన నిచ్చట బ్రహ్మసాక్షాత్కారము కలుగక పోయినను ఆశ్రవణాదులయొక్క ప్రభావమువలన వారు బ్రహ్మలోకమునకుఁ బోయి యచ్చట నిర్గుణబ్రహ్మమును సాక్షాత్కరించుకొనుచున్నారు. మఱియు బ్రహ్మలోకాధిపతి యగు హిరణ్యగర్భునియొక్క యంత్యకాలమునం దాసన్న్యాసులు తమకుఁ గలిగిన బ్రహ్మసాక్షాత్కారమువలన విదేహకైవల్యరూపమోక్షమును బొందుచున్నారు.

ఉక్తార్థమే "బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే। పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరంపదమ్" అను స్మృతియందును జెప్పఁబడి యున్నది. అట్లే యీయర్థమే "నహి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి" ఇత్యాది వచనములచేత శ్రీభగవంతునిచే గీతయందును జెప్పఁబడి యున్నది. అందువలన నాపురుషులయొక్క శ్రవణాదికము నిష్ఫలము గాదు. మఱియు నే మనఁగా, బ్రహ్మలోకప్రాప్తిద్వారమున నాత్మజ్ఞానోత్పత్తిచే మోక్షమునకే సాధన మగుచున్నది.

ఇఁకఁ దృతీయ మగు వర్తమానప్రతిబంధకము నిరూపింపఁబడుచున్నది. ఆవర్తమానప్రతిబంధకము, విషయాసక్తి బుద్ధిమాంద్యము కుతర్కము విపర్యయదురాగ్రహము అను భేదముచేతఁ జతుర్విధ మగుచున్నది. అందు శబ్దస్పర్శాదివిషయములయం దేరాగ మున్నదో అది విషయాసక్తి యనఁబడును. శ్రుత మైన యర్థమును గ్రహించుటయందును ధారణ చేయుటయందును బుద్ధియొక్క యకుశలత్వ మేది గలదో అది బుద్ధిమాంద్య మనఁబడును. శ్రుతికి విరుద్ధ మైన యేతర్క మున్నదో అది కుతర్క మనఁబడును. మఱియు వాస్తవమున నకర్త యభోక్త యగు నాత్మయందుఁ గర్తృత్వభోక్తృత్వములయొక్క యేదురాగ్రహ మున్నదో, అనఁగా, నాత్మ కర్త భోక్త యను నభిమాన మేది గలదో అది విపర్యయదురాగ్రహ మనఁబడును. ఈ చతుర్విధప్రతిబంధకములయం దేదైన నొకప్రతిబంధక ముండునపు డీపురుషునకు శ్రవణాదులు చేసినను ఆత్మసాక్షాత్కారము గలుగనేరదు. అందువలన నానాల్గును

ఆత్మజ్ఞానమునకు వర్తమానప్రతిబంధకము లని చెప్పఁబడును. ఈప్రతిబంధకము లెప్పుడు నివృత్తము లగుచున్నవో అప్పుడే యీపురుషునకు శ్రవణాదులచేత నాత్మజ్ఞానము కలుగుచున్నది. అందువలన, ఇఁక నాచతుర్విధప్రతిబంధములయొక్క నివృత్త్యుపాయములు చెప్పఁబడుచున్నవి. అందు శమదమాదులచేత నైననో విషయాసక్తిరూపప్రతిబంధకము నివృత్త మగుచున్నది. వేదాంతశ్రవణముచేత బుద్ధిమాంద్యరూపప్రతిబంధకము నివృత్త మగుచున్నది. మఱియు మననముచేతఁ గుతర్కరూపప్రతిబంధకము నివృత్త మగుచున్నది. మఱియు నిదిధ్యాసనముచేత విపర్యయదురాగ్రహరూపప్రతిబంధకము నివృత్త మగుచున్నది. ఈయర్థము సర్వమును శ్రీవిద్యారణ్యస్వాములచే "ప్రతిబంధో వర్తమానో విషయాసక్తి లక్షణః। ప్రజ్ఞామాంద్యం కుతర్కశ్చ విపర్యయ దురాగ్రహః॥ శమాద్యైః శ్రవణా ద్యైర్వా తత్ర తత్రోచితైః క్షయమ్। నీతే ఽస్మి న్ప్రతిబంధేతు స్వస్య బ్రహ్మత్వ మశ్నుతే" అను రెండు శ్లోకములచేతఁ జెప్పఁబడి యున్నది. అందు శ్రవణమనననిదిధ్యాసనముల మూఁటియొక్క స్వరూపము పూర్వము ద్వితీయపరిచ్ఛేదమునందు నిరూపింపఁబడి యున్నది. దాని నచ్చటను దెలియవలయును.

### [*] (14) శమదమాదులయొక్క స్వరూపనిరూపణము. [*]

ఇఁక శమదమాదులయొక్క స్వరూపము నిరూపింపఁబడు చున్నది. అచ్చట, శమము దమము ఉపరతి తితిక్ష శ్రద్ధ సమాధానము అను నివి శమాదిషట్క మనఁబడును. ఎట్లు శ్రవణమనననిదిధ్యాసనము లను మూఁడును ఉక్తప్రతిబంధకములయొక్క నివృత్తిద్వారమున నాత్మజ్ఞానోత్పత్తియం దంతరంగసాధనములై యున్నవో అట్లే యీశమాదిషట్కమును బూర్వోక్తప్రతిబంధకములయొక్క నివృత్తిద్వారమున నంతరంగసాధనములే యగుచున్నవి. అందు, ఆంతరమనస్సుయొక్క విషయచింతనానిగ్రహ మేది గలదో అవి శమ మనఁబడును. మఱియు శ్రోత్రాది బాహ్యేంద్రియములను శబ్దాదివిషయములనుండి నిగ్రహించుట యేది గలదో అది దమ మనఁబడును. విధిపూర్వకముగా సర్వకర్మములయొక్క సన్న్యాస మేది గలదో అది యుపరతి యనఁబడును. మఱియు శీతోష్ణ సుఖదుఃఖ మానావమాన నిందాస్తుతులు మొదలగు ద్వంద్వధర్మములయొక్క సహన మేది గలదో అది తితిక్ష యనఁబడును. గురువేదాంతవచనములయందు విశ్వాస మేది గలదో అది శ్రద్ధ యనఁబడును. శ్రవణాదులఁ జేయుటయందుఁ జిత్తైకాగ్రత యేది గలదో అది సమాధాన మనఁబడును. అచ్చట, విజాతీయవృత్తులయొక్క తిరస్కారముచేత, లక్ష్యవస్తుగోచర సజాతీయవృత్తులయొక్క యేప్రవాహ మున్నదో అదియే చిత్తైకాగ్రత యని తెలియ

వలయును. మఱియు నీశమాదిషట్కమునం దాత్మజ్ఞానముయొక్కయంతరంగసాధనత్వము శ్రుతులచేతం గూడం జెప్పంబడి యున్నది. అందు శ్రుతి.—"శాంతో దాంత ఉపరతి స్తితిక్షుః సమాహితో భూత్వా ఽఽత్మ న్యే వాత్మానం పశ్యతి"—భావము॥ శమము దమము ఉపరతి తితిక్ష శ్రద్ధ సమాధానము అను నీషట్కము గల పురుషుఁడు తనయంతఃకరణమునం దాత్మను సాక్షాత్కరించుకొను చున్నాఁడు. ఈ యర్థము వ్యాసభగవంతునిచేతను "శమదమా ద్యుపేతః స్యాత్" ఇత్యాదిసూత్రములచేతఁ జెప్పంబడి యున్నది. అందువలన శ్రవణాదులయందువలె నాశమాదిషట్కమునం దాత్మజ్ఞానముయొక్కయంతరంగసాధనత్వము సంభవించుచున్నది.

ఇఁక నాయాత్మజ్ఞానముయొక్కబహిరంగసాధనములు నిరూపింపఁబడుచున్నవి. స్వర్గాదిఫలేచ్ఛారహితముగాఁ జేయఁబడిన యేయజ్ఞదానాదికర్మము లున్నవో ఆయజ్ఞదానాదికర్మము లాత్మజ్ఞానమునకు బహిరంగసాధనములై యున్నవి. ఎట్లనఁగా, నిష్కామయజ్ఞదానాదికర్మములచేత నీపురుషున కంతఃకరణశుద్ధి యగుచున్నది. ఆశుద్ధాంతఃకరణమునం దాత్మజ్ఞానేచ్ఛారూపవివిదిష కలుగుచున్నది. ఆ వివిదిషానంతరము శ్రవణాదులచేత నీపురుషున కాత్మసాక్షాత్కారము కలుగుచున్నది. ఈప్రకారముగాఁ బరంపరచేత నాయజ్ఞదానాదికర్మములకును ఆయాత్మజ్ఞానసాధనత్వ మున్నది. అందువలన నాయజ్ఞదానాదికర్మములయం దాత్మజ్ఞానముయొక్కబహిరంగసాధనత్వము సంభవించుచున్నది. అందు శ్రుతి.—"త మేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసా నాశకేన"—భావము॥ అధికారు లైన బ్రాహ్మణు లీయాత్మను వేదానువచనముచేతను యజ్ఞముచేతను దానముచేతను అనాశకత్వముచేతను తెలియుట కిచ్ఛించుచున్నారు. అచ్చట ఈశ్రుతియందుండు "వేదానువచనేన" అనుశబ్దముచేత వేదాధ్యయనమును గ్రహింపవలయును. యజ్ఞశబ్దముచేత నగ్నిహోత్రాదియజ్ఞములను గ్రహింపవలయును. దానశబ్దముచేత యజ్ఞమునకు బాహ్యమైనదానమును గ్రహింపవలయును. మఱియు హితకారియును బరిమితమును బవిత్రము నైన యన్నము భుజించుట యేది గలదో, అది తపస్సనఁబడును. ఈకారణమువలన శ్రుతియందుఁ బూర్వోక్తతపస్సునకు అనాశకమను విశేషణము చెప్పఁబడినది. అందు, ఏతపస్సు శరీరముయొక్కనాశమునకు హేతు వగుట లేదో, యాతపస్సు అనాశక మని చెప్పఁబడును.

ఇచ్చటఁ గొందఱు గ్రంథకారు లైనవో "తపసా నాశకేన" అను నుక్తశ్రుతివచనమునందు "అనాశకేన" అని యీప్రకారము పదచ్ఛేదము చేయక "నాశకేన" అని పదచ్ఛేదముఁ జేసి యావచనమున కీయర్థము చెప్పుచున్నారు.

శరీరముయొక్క నాశమునకు హేతు వైన యనశనవ్రతమును శ్రీగంగాయమునల యొక్క సంగమరూపప్రయాగయందు బుద్ధిపూర్వక మైన శరీరత్యాగమును, శరీరమును క్షీణింపఁజేయునట్టి కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతములును - దప స్సనఁబడును. ఈకారణముచేతనే "తపోనా ఽనశనాత్పరమ్" అను శ్రుతి యనశనవ్రతమును సర్వ తపస్సులకన్న నుత్కృష్టతప స్సని చెప్పుచున్నది. మఱియుఁ బ్రయాగయందు బుద్ధి పూర్వకముగా శరీరత్యాగము చేయునట్టి పురుషునకు, వివిదిషాద్వారమున బ్రహ్మ సాక్షాత్కారప్రాప్తి శ్రుతిస్మృతీతిహాసపురాణములయందుఁ జెప్పఁబడి యున్నది. అందువలన నాశ్రుతియం దుండు తపసా అను శబ్దముచేత అనశనాదిరూపతపస్సునే గ్రహింపవలయును.

ఇచ్చట మఱికొందఱు గ్రంథకారు లిట్లు చెప్పుచున్నారు. ప్రయాగా దులయందు బుద్ధిపూర్వకమరణము శాస్త్రములయందుఁ జెప్పఁబడిన దనుట యథా ర్థమై యున్నది. అయినను ఈకలియుగమునకు భిన్నము లైన త్రేతాదియుగముల యం దామరణము చెప్పఁబడినది. ఈకలియుగమునం దైననో యాబుద్ధిపూర్వకమర ణము సర్వప్రకారములచేతను నిషిద్ధమే యగుచున్నది. మఱియు నామరణవిధా యకవచనముల కాయుగభేదవ్యవస్థ చెప్పక పోయినను, ఆవచనములు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యు లను త్రివిధవర్ణస్థులకంటె భిన్ను లైన శూద్రాదులయొక్క మర ణము విధించుచున్నది. త్రైవర్ణికపురుషులయొక్క మరణము విధింపఁబడ లేదు. ఈ కారణమువలననే ధర్మశాస్త్రమునందు బ్రాహ్మణాదులకు మరణాంతికప్రాయశ్చిత్తము నిషేధింపఁబడి యున్నది. పూర్వోక్తశ్రుతియందుఁ జెప్పఁబడిన వేదాధ్యయనయజ్ఞ దానతపోరూపకర్మము లన్నియుఁ గూడి యీవివిదిషకు సాధన మగుచున్న దని కొందఱుగ్రంథకారు లంగీకరించుచున్నారు. మఱియుఁ గొందఱు గ్రంథకారులో ఆ యజ్ఞాదికర్మములు వికల్పముచేత నావివిదిషకు హేతు వని యంగీకరించుచున్నారు. అనఁగా వేదాధ్యయనరూపకర్మముచేతను యజ్ఞదానాదిరూపకర్మములచేతను ఈవివి దిష కలుగుచున్నది.

శంక:—పూర్వోక్తయజ్ఞదానాదికర్మములకు సాక్షాత్తుగానే ముక్తియొక్క సాధనత్వము సంభవించుచున్నది. అందువలన నాకర్మములకు వివిదిషాహేతుత్వ కథన మసంగతమై యున్నది.

సమాధానము:—అవిద్యానివృత్తి, లేక, బ్రహ్మభావప్రాప్తి, ముక్తి యనఁ బడును. ఆముక్తి కేవలాత్మజ్ఞానముచేతనే సంభవించుచున్నది. కర్మముచేత నాముక్తి సంభవించుట లేదు. ఏల యన, రజతభ్రమమునకుఁ గారణ మైన శుక్త్యజ్ఞాన మేది గల

దో ఆయజ్ఞానముయొక్క నివృత్తి యాశుక్తిరూపాధిష్ఠానముయొక్క సాక్షాత్కారము చేతనే యగుచున్నది. అన్యోపాయమువలన నగుట లేదు. మఱియు బ్రహ్మాత్మభావ రూపమోక్షమో అనాదియై యున్నది. అందువలన నామోక్షమునకును గర్మము చేత సాధ్యత్వము సంభవించుట లేదు. ఈవిషయ మన్యశాస్త్రములయందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. భ్రాంత్యా ప్రతీతః సంసారో వివేకా న్నతు కర్మభిః । న రజ్జ్వారోపిత స్సర్పో ఘంటాఘోషా న్నివర్తతే" — భావము॥ ఎట్లు భ్రాంతిచే రజ్జువునం దారోపింపఁబడినసర్ప మారజ్జురూపాధిష్ఠానజ్ఞానముచేతనే నివృత్త మగుచున్నదో ఘంటాఘోషమంత్రాదులచేత నివృత్త మగుట లేదో అట్లు ఆత్మయందు భ్రాంతిచేత నారోపిత మైన సంసార మాయధిష్ఠానాత్మసాక్షాత్కార రూపవివేకమువలననే నివృత్త మగుచున్నది. కర్మముచేత నాసంసారము నివృత్త మగుట లేదు.

మఱియు "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగే నైకే ఽమృతత్వ మానశుః, నా స్త్యకృతః కృతేన" ఇత్యాదిశ్రుతులచేతఁ గర్మములకు సాక్షాత్తుగా మోక్షముయొక్క సాధనత్వము నిషేధింపఁబడి యున్నది. మఱియు "జ్ఞానాదేవతు కైవల్యమ్, నాన్యః పంథా విద్యతే ఽయనాయ" ఇత్యాదిశ్రుతులచేత నాత్మజ్ఞానమే సాక్షాత్తుగా మోక్షమునకు సాధన మని చెప్పఁబడి యున్నది. ఈకారణముచేతను ఆకర్మములకు సాక్షాత్తుగా మోక్షసాధనత్వము సంభవించుట లేదు. మఱి యే మనఁగాఁ బూర్వోక్తరీతిగా నాకర్మము లంతఃకరణశుద్ధిద్వారమున వివిదిషకే హేతువులుగా సంభవించుచున్నది.

శంక:—పూర్వోక్తశ్రుతియందుఁ జెప్పఁబడిన యజ్ఞాదికర్మములకు వివిదిషయొక్క హేతుత్వ ముండినను ఆయజ్ఞాదికర్మములు నిత్యనైమిత్తికకామ్యప్రాయశ్చిత్తము లను భేదములచేతఁ జతుర్విధములై యున్నవి. ఆచతుర్విధయజ్ఞాదికర్మము లావివిదిషకు హేతువు లగుచున్నవా? లేక, కేవలనిత్యకర్మమే యావివిదిషకు హేతు వగుచున్నదా?

సమాధానము:—కొందఱు గ్రంథకారు లైననో యిట్లు చెప్పుచున్నారు. పూర్వోక్తశ్రుతియందు వివిదిషకు హేతువులుగాఁ గేవలయజ్ఞదానాదికర్మములు మాత్రము చెప్పఁబడినవే గాని యాకర్మములయందు నిత్యరూపత్వము గాని నైమిత్తికాదిరూపత్వము గాని యాశ్రుతులచేతఁ జెప్పఁబడ లేదు. అందువలన ఫలేచ్ఛారహితముగాఁ జేయఁబడిన నిత్యనైమిత్తికకామ్యప్రాయశ్చిత్తరూప సర్వయజ్ఞాదికర్మ

లంతఃకరణశుద్ధిద్వారమున నావివిదిషకు హేతువు లగుచున్నవి. మఱియు సగుణ బ్రహ్మోపాసన మైననో చిత్తైకాగ్రతకు హేతు వగుచున్నది.

మఱియు, ఆచార్యు లైననో యిట్లు చెప్పుచున్నారు. "కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః" ఇత్యాదిస్మృతులు కామ్యకర్మాను ష్ఠానములను నిషేధించి ఫలేచ్ఛారహితాగ్నిహోత్రాదినిత్యకర్మానుష్ఠానమును విధించి యున్నవి. అందువలనఁ బూర్వోక్తశ్రుతిచేతను నిష్కామము లైన యగ్నిహోత్రాది నిత్యకర్మములే యావివిదిషకు హేతురూపములుగా విధింపఁబడి యున్నవి. నైమిత్తిక కామ్యప్రాయశ్చిత్తరూపకర్మములు విధింపఁబడ లేదు.

అచ్చట, ఆయజ్ఞాదికర్మములయం దాత్మజ్ఞానముయొక్క బహిరంగసాధనత్వము శ్రీవ్యాసభగవానులచేతను బ్రహ్మసూత్రమందుఁ జెప్పఁబడి యున్నది. అందు సూత్రము.—"సర్వాపేక్షా చ యజ్ఞాది శ్రుతే రశ్వవత్"—భావము॥ బ్రహ్మవిద్యకుఁ దనయుత్పత్తియందు యజ్ఞాదికర్మములయొక్కయపేక్ష యున్నది. ఏకారణముచేత ననఁగా, పూర్వోక్తశ్రుతిచేత బ్రహ్మవిద్యోత్పత్తియం దాయజ్ఞాదికర్మములకు సాధనత్వము చెప్పఁబడి యున్నది. అయినను, ఆబ్రహ్మవిద్య మోక్షరూపఫలోత్పత్తియం దాయజ్ఞాదికర్మముల నపేక్షించుట లేదు. ఏల యన, ఆమోక్షరూపఫలమునం దా కర్మములకు యోగ్యత్వమే లేదు. ఏపదార్థమున కెచ్చట యోగ్యత యున్నదో ఆ పదార్థమునకే అచ్చట యపేక్ష యున్నది. ఉదా—అశ్వమునకుఁ బ్రాదు నాకర్షించుటయందు యోగ్యత లేదు. మఱి యే మనఁగా, రథము నాకర్షించుటయందే యోగ్యత యున్నది. అందువలన నాయశ్వము రథమునందుఁ బూన్పఁబడుచున్నదే గాని బ్రాటియందుఁ బూన్పఁబడుట లేదు. ఈలాగుననే ఆయజ్ఞాదికర్మములకు మోక్షోత్పత్తి చేయుటకు యోగ్యత లేదు. మఱియు నే మనఁగా, చిత్తశుద్ధిద్వారమున వివిదిషోత్పత్తిఁ జేసి బ్రహ్మవిద్య నుత్పన్నము చేయుటకే యోగ్యత యున్నది. అందువలన నాయజ్ఞదానాదికర్మముల కాత్మజ్ఞానముయొక్కబహిరంగసాధనత్వము సంభవించుచున్నది.

ఈప్రకారముగా నంతరంగబహిరంగసాధనములచేత సర్వప్రతిబంధకరహితుఁ డైన పురుషునియొక్కమనననిదిధ్యాసనములచేత సంస్కృతదర్పణరూపచిత్తమేది గలదో, ఆశుద్ధచిత్తముతోఁ గూడి విచారింపఁబడిన తత్త్వమస్యాదిమహావాక్యములచేత నుత్పన్న మైన "అహం బ్రహ్మాస్మి" యను నప్రతిబద్ధాత్మసాక్షాత్కారముచేత నీయధికారిపురుషున కజ్ఞానము నశించుచున్నది. మఱియుఁ బూర్వ మనేకజన్మ

ములయందు సంపాదింపఁబడినపుణ్యాపాపరూపసంచితకర్మములును ఆయాత్మజ్ఞానము చేత నశించుచున్నవి. మఱియు నాత్మజ్ఞానానంతరము చేయఁబడినయాగామికర్మము లీవిద్వాంసుఁ డగు పురుషుని ఆత్మజ్ఞానముయొక్క ప్రభావమువలన నంటుటయే లేదు. మఱియు, ప్రారబ్ధకర్మమువలనఁ బ్రాప్తము లైన యన్నపానాదివిషయముల ననుభవించినవాఁడై యీవిద్వాంసుఁ డగుపురుషు డఖండైకరససచ్చిదానందబ్రహ్మాత్మరూపముచే స్థితుఁ డగుచున్నాఁడు. ఇదియే ఆత్మజ్ఞానమునకు మోక్షరూపఫలమై యున్నది.

## (15) జ్ఞానియొక్క విషయానుభవమునందు శంకాసమాధానములు.

శంక:—ఆత్మజ్ఞానముచేత నజ్ఞాననివృత్త్యనంతరము విద్వాంసుఁ డగుపురుషునకు విషయానుభవము మీచేఁ జెప్పఁబడినది. అది ఘటిల్లదు. ఏల యన, ఆవిషయానుభవమునకుఁ గారణ మైన దేహాభిమాన మావిద్వాంసునియందు లేదు. మఱియు నాదేహాభిమానము లేకయే ప్రారబ్ధకర్మవశమువలన విద్వాంసున కావిషయానుభవము సంభవించు నని మీరు చెప్పినయెడల నదియును ఘటిల్లదు. ఏల యన, లోకమునందు దేహాభిమానమునకే యన్వయవ్యతిరేకములచేత విషయానుభవముయొక్క కారణత్వము సిద్ధ మగుచున్నది. జాగ్రత్స్వప్నములయందు దేహాభిమానముండుటవలన నావిషయానుభవము కలుగుచున్నది. మఱియు సుషుప్త్యవస్థయందా దేహాభిమానము లేనందువలన నావిషయానుభవము గలుగుట లేదు. ఈప్రకారముగా నన్వయవ్యతిరేకములచేత నాదేహాభిమానమునకే యావిషయానుభవమును గుఱించి కారణత్వము సిద్ధ మగుచున్నది. ఆదేహాభిమానము లేనప్పుడు కేవలప్రారబ్ధకర్మవశమువలన జ్ఞానవంతుం డగుపురుషున కావిషయానుభవము సంభవింపదు. ఇచ్చటఁ దాత్పర్య మే మనఁగా, ప్రారబ్ధకర్మము విషయానుభవమున కదృష్టకారణమై యున్నది. దేహాభిమాన మావిషయానుభవమునకు దృష్టకారణమై యున్నది. మఱియు నదృష్టకారణసామగ్రి దృష్టకారణసామగ్రి లేక యొకకార్యోత్పత్తిని జేయుటకు శక్తిమంతము కాదు. అట్లు గాక యుత్పత్తిని చేయు ననినయెడల మృత్తికాకులాలాదిదృష్టసామగ్రులు లేకయే యాయదృష్టసామగ్రిచేత ఘటాదికార్యోత్పత్తి గావలయును. అందువలన నాదేహాభిమానము లేనప్పుడు జ్ఞానవంతుఁ డగుపురుషునకుఁ గేవలప్రారబ్ధకర్మముచేత నావిషయానుభవము సంభవింపదు.

మఱియు నాదేహాభిమానము లేకయే జ్ఞానవంతుఁ డగు పురుషునకు విషయానుభవాదివ్యవహార మంగీకరించినయెడల శ్రీభాష్యకారులచేత "త మేత మవిద్యాఖ్య మాత్మానాత్మనో రితరేతరాధ్యాసం పురస్కృత్య సర్వే ప్రమాణప్రమే

య వ్యవహారా లౌకికా వైదికాశ్చ ప్రవృత్తాః” అను వచనముచేత సర్వలౌకిక వైదికవ్యవహారములయొక్క ప్రవృత్తి యధ్యాసపూర్వక మని చెప్పఁబడి యున్నది. ఆభాష్యవచనమునకును విరోధ మగును. మఱియు “వ్యవహారః అధ్యాసపూర్వకః, వ్యవహారత్వాత్” అను నీయనుమానముచేత సర్వవ్యవహారములయం దధ్యాస పూర్వకత్వము సిద్ధ మగుచున్నది. ఆ యనుమానమును వ్యభిచారి యగును. ఏల యన, జ్ఞానవంతుఁ డగుపురుషునియొక్క వ్యవహారమం దావ్యవహారత్వరూపహేతు వుండినను అధ్యాసపూర్వకత్వరూపసాధ్యము లేదు.

మఱియు జ్ఞానవంతుఁ డగుపురుషునియందును బాధితానువృత్తిచేత నా దేహాభిమాన మున్నది, అందువలన జ్ఞానవంతుని వ్యవహారమం దధ్యాసపూర్వకత్వ రూపసాధ్య ముండుటచేత నావ్యవహారత్వరూపహేతు వచ్చట వ్యభిచారి యగుట లేదు, మఱియు భాష్యవచనమునకును విరోధ మగుట లేదని యిట్లు మీరు చెప్పిన యెడల అదియుఁ గూడ సంభవింపదు. ఏల యన, శుక్తిసాక్షాత్కారముచేత నాశు క్త్యజ్ఞాననివృత్తితోఁ గూడ రజతభ్రమ నివృత్తి కాఁగా మరల నారజతభ్రమయొక్క యనువృత్తి యెట్లు చూడఁబడుట లేదో అట్లాత్మసాక్షాత్కారముచేత నజ్ఞాననివృత్తి తోఁ గూడ దేహాభిమాననివృత్తి కాఁగా మరల నాదేహాభిమానముయొక్క యను వృత్తికథన మత్యంతవిరుద్ధమై యున్నది. అట్లు గాక యాత్మజ్ఞానముచేత బాధిత మగు దేహాభిమానమునకుఁగూడ మరల ననువృత్తి యంగీకరించినయెడల శుక్తిజ్ఞానముచే బాధిత మైన రజతభ్రమకును మరల ననువృత్తి కలుగవలయును.

మఱియు, ఎట్లు సోపాధికభ్రమస్థలమునందు “శుక్లః స్ఫటికః” అను నధి ష్ఠానముయొక్క సాక్షాత్కార ముండినను జపాకుసుమాదిరూపోపాధులయొక్క సమీప స్థితివలన “లోహితః స్ఫటికః” అను ననుభవము సర్వజనులకును ప్రసిద్ధమై యున్న దో అట్లిచ్చటను అధిష్ఠానాత్మసాక్షాత్కారముచేత నజ్ఞాననివృత్తి యైనను ఉపాధు లుండునంతదాఁక జ్ఞానవంతుఁ డగుపురుషునకు దేహాభిమానమును దద్దేహాభిమాన పూర్వకవిషయానుభవమును సంభవించుచున్న దని మీరు చెప్పినయెడల అది యును అసంగతమై యున్నది. ఏల యన జపాకుసుమమువలె నిచ్చట నేయుపాధియు నిరూపించుటకు సాధ్యము గాదు. ఇచ్చటఁ దాత్పర్య మే మనఁగా, అజ్ఞానమును, లేక అజ్ఞానముయొక్క కార్యమునే ఉపాధి యని చెప్పవలయును. ఆరెండును ఆత్మ జ్ఞానముచే నివృత్తము లైనవి. అందువలన నాత్మజ్ఞానముచేత నజ్ఞాననివృత్తి కాఁగా నాయజ్ఞానకార్యమును నివృత్త మగుటవలన, జ్ఞానవంతుఁ డగుపురుషునకుఁ బ్రారబ్ధ కర్మవశముచేత విషయానుభవముఁ జెప్పుట సర్వథా యసంగతమై యున్నది.

సమాధానము:—“అహం బ్రహ్మాస్మి” యను నాత్మజ్ఞానముచేత నెవని కజ్ఞానము నివృత్త మైనదో అట్టి జ్ఞానవంతుఁ డగుపురుషునకుఁ బ్రారబ్ధకర్మవశము వలన నావిషయానుభవము సంభవించు చున్నది. మఱియు నావిషయానుభవము నకుఁ గారణ మైన దేహాభిమానమును అజ్ఞానవంతునియందు బాధితానువృత్తిచేత నున్నది.

శంక:—దేహాభిమానమునకుఁ గారణ మైన యేయజ్ఞాన మున్నదో అది యాత్మజ్ఞానముచేత నివృత్త మైనది. ఉపాదానకారణనాశానంతరము కార్యానువృత్తి నెచ్చటను జూచుట లేదు. అందువలన జ్ఞానవంతుఁ డగుపురుషునియందు దేహాభి మానముయొక్కయనువృత్తిని జెప్పుట యసంగతము.

సమాధానము:—ఉపాదానకారణము నష్ట మైనను గార్యముయొక్క యనువృత్తిని జూచుచున్నాము. ఎట్లు నైయాయికులయొక్కమతమునందుఁ దంత్వా దికోపాదానకారణములయొక్కనాశానంతర మేకక్షణపర్యంతము పటాదికార్యముల యొక్కయనువృత్తి యంగీకరింపఁబడియున్నదో అట్లు సిద్ధాంతమందును అజ్ఞానరూపో పాదానకారణనాశానంతరము దేహాభిమానాదిరూపకార్యానువృత్తి సంభవించు చున్నది.

శంక:—నైయాయికులసిద్ధాంత మైననో, శ్రుతిస్మృత్యాదిప్రమాణరహి తమై యున్నది. ఆ సిద్ధాంతమును మీ రంగీకరించినయెడల మీసిద్ధాంతమందును అప్రమాణత్వము ప్రాప్త మగును.

సమాధానము:—అజ్ఞాననివృత్త్యనంతరముకూడ జ్ఞానవంతునియందు బాధితానువృత్తిచేత దేహాభిమానాదిక మున్నది. ఈయర్థమును మేము కేవలనై యాయికసిద్ధాంతమాత్రముచేతనే సాధించుట లేదు. ఇఁక నేమనఁగా, మాసిద్ధాంత మునకు సాధక మైన శ్రుతి స్మృతి యుక్త్యనుభవా ద్యనేకప్రమాణములు విద్య మానములై యున్నవి. అందువలన నైయాయికమతమువలె మాసిద్ధాంతమునం దప్రమాణత్వము ప్రాప్తము కాదు.

శంక:—ఏపదార్థ ముపాదానకారణమునకు నివర్తక మగుచున్నదో, ఆ పదార్థము తత్కార్యమునకును నివర్తక మగుచున్నది. ఎట్లగ్ని తంతురూపోపా దానకారణముయొక్కనివృత్తి చేయునదై దానియొక్కపటరూపకార్యమునకును నివృత్తి చేయు చున్నదో, అట్లాత్మజ్ఞానమును అజ్ఞానరూపోపాదానకారణముయొక్క నివృత్తి చేయునదై ఆయజ్ఞానముయొక్కకార్యమునకును గూడ నవశ్యము నివృత్తి

చేయునది యగును. మఱియు దేహాభిమానమును ఆయజ్ఞానముయొక్క కార్య మగుటవలన నాదేహాభిమానముయొక్క నివృత్తి కాఁగా జ్ఞానవంతున కావిషయానుభవము సంభవింపదు.

సమాధానము:—యద్యపి, ఆత్మజ్ఞాన మజ్ఞానమునకును దత్కార్యమునకును నివర్తకమై యున్నది. తథాపి, ధనుస్సునుండి విడువఁబడినబాణమువలెఁ దన ఫలము నిచ్చుటయందుఁ బ్రవృత్తమైనదై యాప్రారబ్ధకర్మము జ్ఞానముకంటెఁ బ్రబలమై యున్నది. అందువలన నాప్రారబ్ధ మజ్ఞానతత్కార్యములయొక్క నివృత్తియందుఁ బ్రతిబంధక మగుచున్నది.

శంక:—ఆప్రారబ్ధకర్మ మాత్మజ్ఞానముకంటెఁ బ్రబల మని యంగీకరించిన యెడల నాప్రబలప్రారబ్ధకర్మరూపప్రతిబంధ ముండునపు డాత్మజ్ఞానమువలన నజ్ఞానమునకును నివృత్తి కాకపోవలయును.

సమాధానము:—ఆయాత్మజ్ఞానమునందు, ఒకటి యజ్ఞాననివర్తకత్వాంశము, మఱియొకటి యజ్ఞానకార్యముయొక్క నివర్తకత్వాంశము. అందు, అజ్ఞానము లేకున్నను జ్ఞానికిఁ బ్రారబ్ధకర్మముయొక్క ఫలభోగము సంభవించును. అందువలన నాత్మజ్ఞానమునం దేయజ్ఞాననివర్తకత్వాంశ మున్నదో దానికిఁ బ్రారబ్ధకర్మము ప్రతిబంధక మగుట లేదు. ఆయజ్ఞానకార్యము లైన దేహేంద్రియాదులు లేక యీపురుషునకుఁ బ్రారబ్ధకర్మముయొక్క ఫలభోగము సంభవింపదు. అందువలన నాత్మజ్ఞానమునం దుండు నజ్ఞానకార్య నివర్తకత్వాంశమున కాప్రారబ్ధకర్మము ప్రతిబంధక మగుచున్నది. అనఁగా, ఆప్రారబ్ధకర్మము తనఫలభోగము నిచ్చుటకొఱకు కాదేహేంద్రియాదిరూపకార్యములను నివర్తించుట లేదు. అందువలన నాత్మజ్ఞానముచేత నజ్ఞానము నివృత్తమైనను జ్ఞానవంతుఁ డగుపురుషునకు బాధితానువృత్తిచేత దేహాభిమాన ముండుటవలనఁ బ్రారబ్ధకర్మముచేఁ బ్రాప్తమైన విషయానుభవము సంభవించుచున్నది.

ఈ యర్థము శ్రీవ్యాసభగవంతునిచేతను బ్రహ్మసూత్రమందుఁ జెప్పఁబడి యున్నది. అందు సూత్రము.—"భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే" — భావము॥ ఆత్మజ్ఞానముచేత సంచితకర్మములు నష్టము లగుటచేతను, ఆత్మజ్ఞానానంతరము చేయఁబడిన యాగామికర్మములు స్పృశింపమిచేతను శేషించి యుండు ప్రారబ్ధకర్మము భోగమువలన నివృత్త మగుటచేతను, ఈజ్ఞానవంతుఁ డగుపురుషుఁడు నిర్విశేషబ్రహ్మమును బొందుచున్నాఁడు. అనఁగా విదేహకైవల్యరూపమోక్షమును బొందుచున్నాఁడు.

మఱియు నీయర్థమునే వార్తికకారులు గూడఁ జెప్పియున్నారు. అందు "శ్లో. శాస్త్రార్థస్య సమాప్తత్వా న్ముక్తి స్స్యా త్తావతాపి తే। రాగాదయః సంతు కామం న తద్భావో உపరాధ్యతే"—భావము॥ వేదాంతశాస్త్రార్థమైన జీవబ్రహ్మైకత్వముయొక్క-సాక్షాత్కారముచేతనే యీపురుషునకు ముక్తి ప్రాప్తించుచున్నది. అట్టి జ్ఞానవంతుఁ డగు పురుషునియందు రాగద్వేషాదులు బాధితానువృత్తిచేత నుండినను ఉండనీ. ఆరాగద్వేషాదు లుండినను జ్ఞానవంతునకు ముక్తియందుఁ గించిన్మాత్రమును హాని లేదు. మఱియు నీ యుక్తార్థము సర్వవేదాంతరహస్యములను దెలిసినట్టి శ్రీవిద్యారణ్యస్వాములచేతను జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. అపేక్ష్యచ చిదాత్మానం పృథ క్పశ్యే న్నహంకృతిమ్। ఇచ్ఛం స్తు కోటివస్తూని న బాధో గ్రంథిభేదతః॥ గ్రంథిభేదేపి సంభావ్యా ఇచ్ఛాః ప్రారబ్ధదోషతః। బుద్ధ్వాపి పాపబాహుళ్యా దసంతోషో యథా తవ"— భావము॥ ఏపురుషుఁడు చైతన్యాత్మ నహంకారాదులకంటెఁ బృథక్కు-గాను ఆయహంకారాదులను జైతన్యాత్మకంటెఁ బృథక్కు-గాను దెలియుచున్నాఁడో అజ్ఞానవంతుఁ డగుపురుషుఁ డొకప్పుడు కోటివస్తువుల నిచ్ఛించినను అధ్యాసరూపగ్రంథిభేదనమువలన నాజ్ఞానవంతునకుఁ గించిన్మాత్రమును హాని కలుగుట లేదు. మఱియు నధ్యాసరూపగ్రంథి నివృత్తమైనను అజ్ఞానవంతుఁ డగు పురుషునియందుఁ బ్రారబ్ధదోషమువలన నిచ్ఛ సంభవించుచున్నది. ఉదా—అహంకారాదులకంటె నాత్మను బృథక్కు-గాఁ దెలిసియును బాపకర్మములయొక్క-బాహుళ్యమువలన మీా కసంతోషము కలుగుచున్నది. అందువలన జ్ఞానవంతుఁ డగుపురుషునకు నాప్రారబ్ధకర్మముయొక్క-ఫలభోగముకొఱకు బాధితానువృత్తిచేత నాదేహాభిమానమును రాగద్వేషాదికమును సంభవించుచున్నవి.

శంక:—ఆవిద్యారణ్యస్వాములు మొదలగు నాచార్యులవలననే యీస్థానమందు జ్ఞానవంతుఁ డగుపురుషునియందు రాగాదులయొక్క-నిషేధము గూడఁ జేయఁబడి యున్నది. అందు "శ్లో. రాగో లింగ మబోధస్య చిత్తవ్యాయామ భూమిషు। కు చాధ్యా త్మాభిమానోపి విదుషో உస్త్యా సురత్వతః॥ విదుషో ప్యాసురత్వం చే న్నిష్ఫలం బ్రహ్మదర్శనమ్"— భావము॥ ఈపురుషునియొక్క-చిత్తమందు విషయములయెడ నేరాగ మున్నదో ఆరాగమే యీపురుషునియొక్క-యజ్ఞానమును దెలియఁజేయునట్టి చిహ్నము. అనఁగా నారాగరూపలింగముచేతనే యీపురుషునియొక్క-యజ్ఞాన మనుమానింపఁబడుచున్నది. మఱియు నీపురుషునియం దభిమానమే యాసురభావమును బ్రాప్తింపఁజేయుచున్నది. అందువలన విద్వాంసున కధ్యాత్మాభిమానమును గలుగుట లేదు. ఒకవేళ నాయభిమానమువలన విద్వాంసునియందు

నాసురభావ మున్నయెడల బ్రహ్మసాక్షాత్కారము నిష్ఫలము కావలయును. ఇత్యాది వచనములచేత జ్ఞానవంతుం డగుపురుషునియం దారాగాదులును దేహాభిమానమును నిషేధింపఁబడి యున్నవి. అందువలన జ్ఞానవంతునియం దారాగాదికము సంభవింపదు.

సమాధానము:—ఉక్తవచనములచేత నాచార్యులచేత జ్ఞానవంతునియం దేరాగాదికము నిషేధింపఁబడి యున్నదో అది దృఢాధ్యాసపూర్వక మైనరాగాదులను విషయము చేయుచున్నది. అనఁగా, ఎట్లజ్ఞానియం దాత్మాహంకారాదుల యొక్క దృఢాధ్యాసపూర్వక మయిన రాగాదిక మున్నదో, అట్లు జ్ఞానియందు దృఢాధ్యాసపూర్వక మైన రాగాదిక ముండుట లేదు. ఒకవేళ నీవచనముల కట్టి యభిప్రాయ మంగీకరింపనియెడల జ్ఞానవంతునియం దారాగాదులను జెప్పునట్టి పూర్వోక్త వచనములతో నీవచనములకు విరోధ మగును. మఱియు "సర్వథా వర్తమానోపి న స భూయో ఽభిజాయతే" అను వచనముచేత శ్రీభగవంతునిచే సర్వప్రకారముల వర్తించువాఁ డైనను జ్ఞానవంతునకు జన్మాభావము చెప్పఁబడి యున్నది. ఆ భగవంతునియొక్క వచనమునకును విరోధము ప్రాప్త మగును. ఆవిరోధము నివర్తించుటకొఱకు రాగనిషేధవచనములకు దృఢాధ్యాసపూర్వక మైన రాగాదుల యొక్క నిషేధమునందే తాత్పర్య మున్న దని యంగీకరింపవలయును.

శంక:—ఎప్పుడు జ్ఞానవంతుఁ డగుపురుషునియం దారాగాదికము మీచే నంగీకరింపఁబడు చున్నదో అప్పు డాజ్ఞానవంతునియందు యథేష్టాచరణమును మీచే నంగీకరింపఁబడవలయును. శాస్త్రమర్యాద నుల్లంఘించి నిషిద్ధవిషయములయం దేప్రవృత్తి యున్నదో అది యథేష్టాచరణ మనఁబడును.

సమాధానము:—జ్ఞానవంతుఁ డగుపురుషునకు యథేష్టాచరణము మే మంగీకరింపము. మఱి యే మనఁగా, ప్రారబ్ధకర్మముయొక్క ఫలభోగమునం దనుకూల మైన యాభాసమాత్రరాగద్వేషాదులయొక్క యనువృత్తి జ్ఞానవంతునియందు మే మంగీకరించు చున్నాము. ఆ యాభాసమాత్రరాగద్వేషానువృత్తి యాత్మజ్ఞానమునకు విరోధి యగుట లేదు. ఒకవేళ నాయాభాసమాత్రరాగద్వేషానువృత్తి యును ఆత్మజ్ఞానమునకు విరోధి యనినయెడల నేపురుషునకును ఆత్మజ్ఞానము లేక పోవలయును. ఈయర్థ మన్యశాస్త్రములయందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. కాదాచిత్కం రాగలేశం చికిత్సేతు మశక్నువన్ । యో బ్రహ్మనిష్ఠాం సంద్వేష్టి కదా స్యా త్తత్త్వనిశ్చయః" — భావము॥ చిత్తమునం దొకవేళ నుత్పన్న మైన లేశమాత్ర మగు నేరాగ మున్నదో ఆరాగమును నివర్తించుటయం దసమర్థుఁ

డగు నేపురుషుఁడు బ్రహ్మనిష్ఠయందు ద్వేషించు చున్నాఁడో ఆపురుషున కేకాల మందును ఆత్మనిశ్చయము కలుగనేరదు. అందువలనఁ బ్రారబ్ధకర్మముయొక్క సమాప్తిపర్యంతము జ్ఞానవంతుఁ డగు పురుషునియం దాదేహాభిమానమును రాగ ద్వేషాదికమును బాధితానువృత్తిచేత నున్న వను నర్థము సిద్ధ మైనది.

శంక:—జ్ఞానవంతుఁ డగుపురుషునకు బాధితదేహాభిమానముయొక్క యనువృత్తి నంగీకరించినయెడల శుక్తి సాక్షాత్కారవంతుఁ డగు పురుషునకు బాధిత రజతభ్రమయొక్కయనువృత్తియును మరలఁ గలుగవలయును.

సమాధానము:—శుక్తియం దేరజతభ్రమ యున్నదో అది నిరుపాధిక భ్రమమై యున్నది. అందువలన శుక్తిజ్ఞానమునకు రజతభ్రమయొక్క నివృత్తి చేయుట యం దేప్రతిబంధకమును లేదు. కావున శుక్తిజ్ఞానముచే నివృత్త మైన రజతభ్రమ యొక్కయనువృత్తి మరలఁ గలుగుట లేదు. ఈ దేహాభిమానాదికమో సోపాధిక భ్రమమై యున్నవి. అచ్చటఁ బ్రారబ్ధకర్మమే యుపాధిరూపమై యున్నది. అందు వలన నాత్మజ్ఞానముచేత నజ్ఞానము నివృత్త మైనను బ్రారబ్ధకర్మరూపోపాధి యుండు పర్యంతము జ్ఞానవంతునియందు బాధితానువృత్తిరూపమున నాదేహాభిమానాదుల యొక్కస్థితి సంభవించుచున్నది.

లేక, ఇట్లంగీకరింపవలయును. ఆత్మజ్ఞానముచేత నజ్ఞాననివృత్తి యైనను ఆ యజ్ఞానముయొక్క లేశమాత్రము శేషించి యున్నది. ఆ యజ్ఞానలేశము లేశావిద్య యని చెప్పఁబడును. ఆ యజ్ఞానలేశముయొక్కయనువృత్తిచేతనే జ్ఞానవంతుఁ డగు పురుషున కాప్రారబ్ధకర్మభోగము కలుగుచున్నది. ఈయర్థ మన్యశాస్త్రములయం దును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. ద్వైత చ్ఛాయా రక్షణా యాస్తి లేశ శ్చాస్మి న్నర్థే స్వానుభూతిః ప్రమాణమ్" — భావము॥ ఆత్మజ్ఞానముచేత నజ్ఞానము నివృత్త మైనను ఆభాసమాత్రద్వైతమును రక్షించుటకొఱకు నజ్ఞానలేశము శేషించి యున్నది. ఈయర్థమందుఁ దనయనుభవమే ప్రమాణమై యున్నది.

శంక:—ఆత్మజ్ఞానముచే నివృత్త మైన యేయజ్ఞాన మున్నదో ఆయజ్ఞా నముయొక్క లేశము శేషించి యున్న దని పూర్వము మీచేతఁ జెప్పఁబడినది. అందు, ఆయజ్ఞానలేశ మనునది యేది? అనఁగా, అజ్ఞానముయొక్క యొకయవయవమునకు లేశ మని నామమా? లేక అజ్ఞానముయొక్క శక్తికి లేశ మని నామమా? అందుఁ బ్రథమపక్ష మంగీకరించినచో అది ఘటిల్లదు, ఏల యన సిద్ధాంతమునం దజ్ఞానము నిరవయవ మనియును సావయవ మనియును అంగీకరింపఁబడ లేదు. ఇఁక నే మనఁ

గా, ఆరెంటికన్న విలక్షణముగా ననిర్వచనీయ మని యంగీకరింపఁబడి యున్నది. మఱియు నాయజ్ఞానమును సావయవ మని యంగీకరించి యాయజ్ఞానముయొక్క యవయవము లేశ మని యంగీకరించినయెడలను ఆత్మజ్ఞానముచేత నజ్ఞానరూపావయవి నివృత్తమైన యనంతర మాయవయవముయొక్క యనువృత్తి ఘటిల్లదు. మఱియు నజ్ఞానముయొక్క శక్తి లేశ మను ద్వితీయపక్ష మంగీకరించినయెడల నది యును సంభవింపదు. ఏల యన, ఆత్మజ్ఞానముచేత శక్తిసహితాజ్ఞానము నష్టమైన యనంతర మజ్ఞానరూపాశ్రయము లేక యాశక్తికి స్థితియే సంభవింపదు. అందువలన నజ్ఞానలేశముయొక్క యనువృత్తిచేత జ్ఞానవంతుఁ డగుపురుషునకుఁ బ్రారబ్ధకర్మభోగము సంభవించుట లేదు.

సమాధానము:—ఆత్మజ్ఞానముచేత నావరణశక్తియును దాదాత్మ్యాధ్యాసము నను నీరెండును నివృత్తము లైనవి. అయినను విక్షేపశక్తిసహితాజ్ఞాన మాత్మజ్ఞానానంతరము గూడ నున్నది. ఆవిక్షేపశక్తిసహితాజ్ఞానమే లేశ మని చెప్పఁబడును. మఱియు నెట్లావరణశక్తి కాత్మజ్ఞానముతో విరోధ మున్నదో అట్లా విక్షేపశక్తికి నాత్మజ్ఞానముతో విరోధము లేదు. అందువలన నావిక్షేపశక్తిసహితాజ్ఞానముయొక్క యనువృత్తివలన జ్ఞానవంతున కాప్రారబ్ధకర్మముయొక్క భోగము సంభవించుచున్నది.

శంక:—ఆవిక్షేపశక్తిసహితాజ్ఞానముచేత జ్ఞానవంతుఁ డగుపురుషున కెట్లు ప్రారబ్ధభోగప్రాప్తి యగుచున్నదో అట్లు జన్మాంతరప్రాప్తియుఁ గలుగును గదా!

సమాధానము:—జ్ఞానవంతునియొక్క జన్మాంతరప్రాప్తి కేనిమిత్తమును లేదు. ఎట్లనఁగా, ఆయజ్ఞానము తనస్వరూపముచేత నైననో జన్మమునకు హేతువగుట లేదు. మఱే మనఁగా, ధర్మాధర్మము లను నీరెండే పురుషునకు జన్మహేతువు లగుచున్నవి. ఆధర్మాధర్మములును సంచితరూపముచేతనే జన్మమునకు హేతువగుచున్నవి. ఆసంచితధర్మాధర్మములయొక్క స్థితికి హేతు వావరణశక్తిసహితాజ్ఞానమై యున్నది. ఆయజ్ఞాన మాత్మజ్ఞానమువలన నివృత్తము కాఁగా నాసంచితకర్మమును నష్ట మగుచున్నది. మఱియు నాత్మజ్ఞానానంతరము చేయఁబడిన యాగామికర్మములు జ్ఞానవంతుని నంటుట లేదు. ప్రారబ్ధకర్మము భోగముచేత నష్ట మగుచున్నది. ఈప్రకారముగా శరీరము నారంభించుకారణములు లేనందువలన జ్ఞానికి జన్మాంతరప్రాప్తి సంభవింపదు. మఱియు నెట్లగ్నిచే దగ్ధము లైన వ్రీహియవాది బీజములు తృప్తికి హేతువు లైనను అంకురమునకు హేతువు లగుట లేదో. అట్లా విక్షేపశక్తిసహితాజ్ఞాన మీజ్ఞానవంతునికిఁ బ్రారబ్ధకర్మఫలభోగమునం దుపయోగి

యగు విషయదర్శనమునకు హేతు వైనను జన్మాంతరమునకు హేతు వగుట లేదు. మఱియు నాత్మజ్ఞానముచేత నావరణశక్తిసహితాజ్ఞానముయొక్క నివృత్తికాలమునం దేప్రారబ్ధకర్మము తనఫలభోగము నిచ్చుటకొఱకు విక్షేపశక్తిసహితాజ్ఞానలేశమును రక్షించుచున్నదో ఆప్రారబ్ధకర్మరూపప్రతిబంధకముయొక్క నివృత్త్యనంతర మా యజ్ఞానలేశము తానే నివృత్త మగుచున్నది. ఆయజ్ఞానలేశముయొక్క నివృత్తికొఱకు మరల నాత్మజ్ఞానముయొక్క యపేక్ష కలుగుట లేదు. ఏకారణముచేత ననఁగా, అజ్ఞానలేశముయొక్క స్థితికిఁ బ్రయోజక మైన యావరణశక్తిసహితాజ్ఞానము పూర్వమే యాత్మజ్ఞానముచేత నివృత్త మైనది. అందువలన నాత్మజ్ఞానముచే నజ్ఞానము నివృత్త మైనను ఉక్తాజ్ఞానలేశముయొక్క యనువృత్తిచేత జ్ఞానవంతుఁ డగుపురుషున కాప్రారబ్ధకర్మభోగము సంభవించుచున్నది.

లేక, ఇచ్చట నీవ్యవస్థ యంగీకరింపవలయును. ఆత్మ కావరణమును అహంకారాదులతో నాత్మకుఁ దాదాత్మ్యాధ్యాసము నను నీరెండును కేవలాజ్ఞానముచేతనే యగుచున్నవి. ఈకారణమువలననే యాత్మజ్ఞానోత్పత్తిచే నారెండును నాశ మొందుచున్నవి. అనఁగా నారెండును నిరుపాధికభ్రమరూపములై యున్నవి, అందువలన నధిష్ఠానాత్మయొక్క సాక్షాత్కారముచేత నారెంటియొక్క నివృత్తి సంభవించుచున్నది. మఱియు విక్షేప మైననో కర్మసహితావిద్యచేఁ జేయఁబడినది. అందువలన బ్రహ్మవిద్యచే నాయవిద్య నివృత్త మైనను బ్రారబ్ధకర్మనాశపర్యంతము నావిక్షేపము నాశ మొందుట లేదు. ఆవిక్షేపమునకు సోపాధికభ్రమరూపత్వ ముండుటవలన. అచ్చటఁ గర్మసహితవిక్షేపశక్తితోఁ గూడిన యజ్ఞానమే యుపాధియై యున్నది. మఱియు నేకాలమందు ఫలభోగముచేత నాప్రారబ్ధకర్మము నాశ మొందుచున్నదో ఆకాలమునం దావిక్షేపశక్తిసహితాజ్ఞానము తానే నాశ మొందుచున్నది. దానియొక్క నివృత్తికొఱకు జ్ఞానముయొక్క, లేక, యోగముయొక్క యపేక్ష కలుగుట లేదు. ఎట్లు తైలవర్తియొక్క నాశానంతరము దీపము తానే నాశ మొందుచున్నదో అట్లాత్మజ్ఞానముచేత నావరణశక్తిసహితాజ్ఞానమును సంచితకర్మమును ఫలభోగముచేఁ బ్రారబ్ధకర్మమును నివృత్తములు కాఁగా ఆవిక్షేపశక్తిసహితాజ్ఞానము తానే నివృత్త మగుచున్నది. ఈయర్థ మన్యగ్రంథములయందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. అవిద్యావృత్తి తాదాత్మ్యే విద్యయైవ వినశ్యతః । విక్షేపస్య స్వరూపంతు ప్రారబ్ధక్షయ మీక్షతే"—భావము॥ అవిద్యాకృతావరణమును అహంకారాదులతో నాత్మకుఁ దాదాత్మ్యాధ్యాసము నను నీరెండును "అహం బ్రహ్మాస్మి" యను విద్యచేతనే నాశ మొందుచున్నవి. విక్షేపముయొక్క స్వరూప మైననో ప్రారబ్ధ

కర్మముయొక్క నాశమును జూచుచున్నది, అనఁగాఁ బ్రారబ్ధకర్మముయొక్క నాశమునకుఁ బూర్వ మావిక్షేపముయొక్క స్వరూపము నాశ మొందుట లేదు. మఱి యే మనఁగా, ప్రారబ్ధకర్మముయొక్క నాశానంతరమే నాశ మొందుచున్నది. అందువలన నిది సిద్ధ మగుచున్నది. జ్ఞానవంతుఁ డగుపురుషున కేవిషయానుభవము కలుగుచున్నదో అది స్ఫటికమునందు లోహితభ్రమవలె సోపాధికభ్రమమై యున్నది. కావున నావిషయానుభవ మాత్మసాక్షాత్కారమునకు విరోధి కాదు. అందువలన నాత్మజ్ఞానముచేత నజ్ఞాననివృత్త్యనంతరము ప్రారబ్ధకర్మమువలనఁ బ్రాప్తించిన యన్నపానాదివిషయముల ననుభవించుచున్నను జ్ఞానవంతుఁ డగుపురుషుఁ డఖండైకరస సచ్చిదానందబ్రహ్మరూపమున స్థితుఁ డగుచున్నాఁడు. కావునఁ బూర్వోక్తాత్మజ్ఞానముయొక్క ఫలము సంభవించు చున్నది.

పూర్వోక్తఫలము శారీరకమీమాంసాశాస్త్రచతుర్థాధ్యాయపఠనముచేత సిద్ధ మగుచున్నది. అందు శారీరకమీమాంసాశాస్త్రప్రథమాధ్యాయపఠనమువలన శ్రవణమును ద్వితీయాధ్యాయపఠనమువలన మననమును దృతీయాధ్యాయపఠనమువలన నిదిధ్యాసనమును జతుర్థాధ్యాయపఠనమువలన నాత్మసాక్షాత్కారరూపఫలమును సిద్ధించుచున్న వని సాంప్రదాయికాచార్యు లంగీకరించుచున్నారు.

మఱియుఁ గొందఱు గ్రంథకారు లైననో యి ట్లంగీకరించుచున్నారు. శ్రోత్రియబ్రహ్మనిష్ఠగురువుయొక్క ముఖమునందుండి చతురధ్యాయీరూప మగు శారీరకమీమాంసాశాస్త్రమును సంపూర్ణముగాఁ బఠించుట శ్రవణ మనఁబడును. పఠించినశాస్త్రార్థములను యుక్తులచేఁ జింతించుట మనన మనఁబడును. మననము చేయఁబడిన శాస్త్రార్థములను మాటిమాటికిఁ జిత్తమునం దావర్తించుట యేది గలదో అది నిదిధ్యాసన మనఁబడును. ఆ శ్రవణ మనన నిదిధ్యాసనానంతర మీపురుషునకు “అహం బ్రహ్మాస్మి” యను సాక్షాత్కారము కలుగుచున్నది.

శంక:—ఉపనయనరూపసంస్కారరహితు లగుటవలన వేదాంతశాస్త్రాధ్యయనమునం దనధికారు లగు మైత్రేయి మొదలగు స్త్రీలకును విదురాదిశూద్రులకును శ్రుతిస్మృతీతిహాసపురాణాదులయం దాత్మజ్ఞానోత్పత్తి చెప్పఁబడి యున్నది. మఱియు వేదాంతశాస్త్రమునం దధికారు లగు జనక జడభరతాదులకును ఆశారీరకమీమాంసాశాస్త్రముయొక్క శ్రవణాదికము లేకయే కేవలసిద్ధగీతాదులయొక్క శ్రవణమాత్రముచేత నాత్మజ్ఞానోత్పత్తి చెప్పఁబడి యున్నది. అందువలన శారీరకమీమాంసాశాస్త్రముయొక్క సంపూర్ణపఠనమువలన నాత్మశ్రవణము సిద్ధ మగుచున్న దను పూర్వోక్తనియమము ఘటిల్లదు.

సమాధానము:—శుద్ధాంతఃకరణము గలిగినట్టి వ్యుత్పన్నులు, లేక, అవ్యుత్పన్ను లగు ముఖ్యాధికారుల కైననో జీవబ్రహ్మములయేకత్వమును ప్రతిపాదించునట్టి యేకశ్లోకమాత్రముచేత, లేక, అర్ధశ్లోకమాత్రముచేత నే ఆబ్రహ్మసాక్షాత్కార ముత్పన్న మగుచున్నది. ఈపదమున కీయర్థమందు శక్తి యున్నది, ఈపదమున కీయర్థమందు లక్షణ యున్నది అని యీప్రకారముగా నేపురుషులకుఁ బదపదార్థములయొక్క శక్తిలక్షణారూపసంగతిజ్ఞాన మున్నదో ఆపురుషులు వ్యుత్పన్ను లని చెప్పఁబడుదురు. మఱియు నేపురుషుల కాపదపదార్థములయొక్క సంగతిజ్ఞానము లేదో ఆపురుషు లవ్యుత్పన్ను లనఁబడుదురు. మఱియు నేపురుషులు సగుణబ్రహ్మసాక్షాత్కారపర్యంత ముపాసన చేయుచున్నారో అట్టి కృతోపాసనపురుషులు ముఖ్యాధికారు లనఁబడుదురు. లేక, పూర్వజన్మమందు శ్రవణమననాదిసామగ్రులచే సంపన్ను లైనను ఏపురుషుల కొకానొకప్రతిబంధవశమువలన మరల మనుష్యశరీరము ప్రాప్త మగుచున్నదో ఆపురుషులు ముఖ్యాధికారు లనఁబడుదురు. అట్టి వ్యుత్పన్నముఖ్యాధికారులకును అవ్యుత్పన్నముఖ్యాధికారులకును ఆత్మజ్ఞానోత్పత్తియందు సంపూర్ణశాస్త్రశ్రవణాదులయొక్క యపేక్ష లేదు. ఇఁక నే మనఁగా వాక్యమాత్రశ్రవణమువలననే వారల కాత్మసాక్షాత్కారము కలుగుచున్నది.

శంక:—పూర్వోక్తరీతిగా వ్యుత్పన్నముఖ్యాధికారుల కైననో వాక్యమాత్రమువలన బ్రహ్మసాక్షాత్కారోత్పత్తి యైనను నగుఁగాక. అవ్యుత్పన్నముఖ్యాధికారుల కావాక్యమాత్రమువలన బ్రహ్మసాక్షాత్కారోత్పత్తి సంభవింపదు.

సమాధానము:—శబ్దమున కచింత్యశక్తి యున్నది. అందువలన, అవ్యుత్పన్నముఖ్యాధికారులకును వాక్యమాత్రశ్రవణమువలన బ్రహ్మసాక్షాత్కారోత్పత్తి సంభవించును. ఎట్లు నిద్రయందు లయము నొందినపురుషున కచ్చట సంగతిజ్ఞానము లేక పోయినను, అన్యపురుషునియొక్క వాక్యమాత్రశ్రవణమువలన జాగ్రత్త కలుగుచున్నదో, అట్లవ్యుత్పన్నముఖ్యాధికారులకు వాక్యమాత్రశ్రవణమువలన బ్రహ్మసాక్షాత్కారోత్పత్తియందే ప్రతిబంధకమును లేదు. ఇచ్చట సారాంశ మే మనఁగా, ఎట్లు నిద్రనుండి మేల్కాంచినపురుషునకు ఘటాదికముతోఁ జక్షురాదీంద్రియముల యొక్క సన్నికర్షానంతరము “అయం ఘటః” అను చాక్షుషసాక్షాత్కార ముత్పన్న మగుచున్నదో, అట్లు పూర్వ మనేకజన్మపుణ్యకర్మపరిపాకవశమువలనఁ బరమేశ్వరానుగృహీతులై శుద్ధాంతఃకరణము గల పురుషులకు, ఏకశ్లోకమాత్రశ్రవణముచేత, లేక, అర్ధశ్లోకమాత్రశ్రవణముచేత, లేక, వాక్యమాత్రశ్రవణముచేత నాబ్రహ్మసాక్షాత్కార మవశ్య ముత్పన్న మగుచున్నది. మఱియు నెట్లు విక్షిప్తచిత్తము గల

యున్నత్తపురుషులకు ఘటాదిపదార్థములతోఁ జక్షురాదీంద్రియములకు సంబంధము కలిగినను ఆఘటాదికమునందు విపరీతవ్యవహారమే చూడఁబడుచున్నదో అట్లు స్వస్థచిత్తము గల పురుషులకును ఆయింద్రియార్థములయొక్క సన్నికర్షానంతర మావిపరీతవ్యవహారమే కలుగవలయు నని కల్పన చేయఁగూడదు. ఈప్రకారముగా విషయప్రాప్తీచ్ఛ గలవారును రాజసతామసవృత్తులచే స్థూలచిత్తము గలవారును నైన కొందఱు పండితులకు బ్రహ్మసాక్షాత్కారోత్పత్త్యభావమును జూచి యాముఖ్యాధికారులకు వాక్యమాత్రశ్రవణమువలన బ్రహ్మసాక్షాత్కారోత్పత్తియం దసంభావన చెప్పఁగూడదు. అందువలనఁ బూర్వోక్తముఖ్యాధికారులకు వాక్యమాత్రశ్రవణమువలన బ్రహ్మసాక్షాత్కారోత్పత్తియం దేబాధకమును లేదు.

శంక:—ఎప్పుడు పూర్వోక్తరీతిగా ముఖ్యాధికారులకు వాక్యమాత్రశ్రవణమువలననే బ్రహ్మసాక్షాత్కార ముత్పన్న మైనదో అప్పు డాశారీరకమీమాంసాదిశాస్త్రము లనుపయోగు లగుటవలన వానియొక్క యారంభమే నిష్ఫల మగును.

సమాధానము:—పూర్వోక్తముఖ్యాధికారులకంటె భిన్ను లైన యముఖ్యాధికారులయొక్క బోధకొఱకే యా శారీరకమీమాంసాదికశాస్త్రము లారంభింపఁబడుచున్నవి. అనఁగా ఆయముఖ్యాధికారులకు వాక్యమాత్రశ్రవణమువలన బ్రహ్మసాక్షాత్కారము కలుగుట లేదు. ఇఁక నే మనఁగా శారీరకమీమాంసాదిశాస్త్రములయొక్క పఠనముచేతనే బ్రహ్మసాక్షాత్కారము కలుగుచున్నది. అందువలన నముఖ్యాధికారులకొఱ కాశారీరకమీమాంసాదిశాస్త్రములయొక్క యారంభమును సఫలమే యగుచున్నది. అచ్చట ముఖ్యాధికారు లగు పురుషుల కేకశ్లోకముచేత లేక యర్ధశ్లోకముచేత బ్రహ్మసాక్షాత్కార మగుచున్న దను నీయర్థము మహాభారతమందు శ్రీవ్యాసభగవంతునిచేతను జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. ఆత్మానం విందతే యస్తు సర్వభూతగుహాశయమ్ । శ్లోకేన యది వార్ధేన క్షీణం తస్య ప్రయోజనమ్"—భావము॥ దేశకాలవస్తుపరిచ్ఛేదరహితమును సర్వభూతములయొక్క బుద్ధులకు సాక్షియు నైన సచ్చిదానందస్వరూపాత్మ నేయధికారిపురుషు లేకశ్లోకముచేతఁ గాని యర్ధశ్లోకముచేతఁ గాని "అహం బ్రహ్మాస్మి" యని సాక్షాత్కరించుకొను చున్నారో ఆజ్ఞానవంతు లగుపురుషులకు సర్వప్రయోజనములు క్షీణ మగుచున్నవి. అనఁగా మనుష్యలోకము మొదలు బ్రహ్మలోకపర్యంతము గల యేయేయానందములు లోకులకుఁ బ్రయోజనరూపములుగాఁ బ్రసిద్ధమై యున్నవో ఆసర్వానందములును బ్రహ్మానందమందే యంతర్భూతములై యున్నవి. ఆబ్రహ్మ

నందము ప్రాప్తము కాఁగా నీజ్ఞానవంతున కేలోకానందములందును ఇచ్ఛ కలుగుట లేదు.

మఱియు నుక్తార్థమే నైష్కర్మ్యసిద్ధి యను గ్రంథమునం దాచార్యులచే "వాక్యశ్రవణమాత్రేణ పిశాచ వ దవాప్నుయాత్" ఇత్యాదివచనములచేతఁ జెప్పఁబడి యున్నది. అందువలన నాముఖ్యాధికారులకు వాక్యమాత్రశ్రవణమువలన బ్రహ్మసాక్షాత్కారోత్పత్తి సంభవించుచున్నది.

శంక:—పూర్వము చెప్పఁబడిన వ్యుత్పన్నావ్యుత్పన్ను లను ద్వివిధముఖ్యాధికారులకు వాక్యమాత్రశ్రవణమువలన నుత్పన్న మైన బ్రహ్మసాక్షాత్కారానంతరము కొంచెమేని కర్తవ్య మున్నదా? లేక, లేదా?

సమాధానము:—ఆద్వివిధముఖ్యాధికారులలో నవ్యుత్పన్నముఖ్యాధికారుల కైననో బ్రహ్మసాక్షాత్కారానంతరము బ్రహ్మాకారవృత్తులయొక్కప్రవాహరూపధ్యాననిష్ఠ యపేక్షితమై యున్నది. ఏల యన, ఆ యవ్యుత్పన్నాధికారులయొక్క బుద్ధికి శాస్త్రమునందు స్వయంకుశలత కలుగుట లేదు. ఇఁక నే మనఁగా, అన్యపురుషులయొక్కయుపదేశాధీనమై యున్నది. అందువలన నాయవ్యుత్పన్నపురుషులకు వాక్యమాత్రశ్రవణమువలన బ్రహ్మసాక్షాత్కారము కలిగినను అది భేదవాదులయొక్కసంగదోషమువలన నుత్పన్నము లగు నసంభావనావిపరీతభావనలచేతఁ బ్రతిబద్ధ మగుచున్నది. మఱియుఁ బ్రతిబద్ధజ్ఞానమువలన నజ్ఞాననివృత్తియును బరమపురుషార్థప్రాప్తియును గలుగుట లేదు. ఆ యవ్యుత్పన్నముఖ్యాధికారు లెప్పు డాధ్యాననిష్ఠయం దున్నారో అప్పుడు వారలకు భేదవాదులతో సంగము కలుగుట లేదు. ఆసంగము లేక పోఁగా నాయసంభావనావిపరీతభావనలును వారలకుఁ గలుగవు. అందువలన నాప్రతిబంధరహితబ్రహ్మసాక్షాత్కారముచేత నాయవ్యుత్పన్నముఖ్యాధికారుల కజ్ఞాననివృత్తియును బరమపురుషార్థప్రాప్తియును అవశ్య మగుచున్నది. అందువలన నాయవ్యుత్పన్నముఖ్యాధికారులకు బ్రహ్మసాక్షాత్కారానంతరము నాధ్యాననిష్ఠ యవశ్య మపేక్షితమై యున్నది.

ఈ యర్థము గీతయందు శ్రీభగవంతునిచేతను జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. అన్యే త్వేవ మజానంతః శ్రుత్వా న్యేభ్య ఉపాసతే। తేపి చాతి తరం త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః" — భావము॥ ఏపురుషులు తాము శాస్త్రవిచారణ చేయుటయం దసమర్థులై యున్నారో ఆపురుషు లెప్పుడు మఱి యొకశ్రోత్రియబ్రహ్మనిష్ఠగురుముఖమువలన బ్రహ్మస్వరూపమును శ్రవణము చేసి యాబ్రహ్మమును నిరంత

రము ధ్యానము చేయుచున్నారో అప్పు డాశ్రవణపరాయణపురుషులును బ్రహ్మ సాక్షాత్కారముచే నజ్ఞానమును నశింపఁజేయు చున్నారు.

మఱియు నుక్తార్థమునే శ్రీవిద్యారణ్యస్వాములును ధ్యానదీపమందుఁ జెప్పియున్నారు. అందు "శ్లో. అత్యంతబుద్ధిమాంద్యా ద్వా సామగ్ర్యావా ప్య సంభవాత్ । యో విచారం న లభతే బ్రహ్మోపాసీత సో ఽనిశమ్॥ మరణే బ్రహ్మ లోకే వా తత్త్వం జ్ఞాత్వా విముచ్యతే" — భావము॥ బుద్ధియొక్కయత్యంతమంద త్వమువలన, లేక, విచారసామగ్ర్యభావమువలన నేపురుషులు బ్రహ్మవిచారమును బొందుట లేదో ఆపురుషులు నిరంతరము నిర్గుణబ్రహ్మధ్యానము చేయవలయును. ఆవిధముగా ధ్యానించుపురుషులు మరణకాలమం దైనను బ్రహ్మలోకమం దైనను ఆ నిర్గుణబ్రహ్మస్వరూపసాక్షాత్కారముచే మోక్షము పొందుచున్నారు.

మఱియు నీయర్థము పతంజలిభగవానులచేతను యోగసూత్రములయందుఁ జెప్పఁబడి యున్నది. అందు సూత్రము.—"తతః ప్రత్య క్చేతనాధిగమో ఽంత రాయా భావశ్చ" — భావము॥ ఆపరమాత్మయొక్క ధ్యానమువలన నీపురుషునకుఁ బ్రత్యగాత్మయొక్క సాక్షాత్కారము కలుగుచున్నది. మఱియు నాయాత్మసాక్షా త్కారోత్పత్తియం దెన్నిప్రతిబంధకము లున్నవో ఆసర్వప్రతిబంధకములును ఆ ధ్యానముచేతనే నివృత్తము లగుచున్నవి. అందువలన నాయవ్యుత్పన్నముఖ్యాధి కారులకు బ్రహ్మసాక్షాత్కారానంతర మాధ్యాననిష్ఠయొక్కయపేక్ష యవశ్యమై యున్న దనునది సిద్ధ మైనది.

శంక:—పూర్వోక్తరీతిగా నవ్యుత్పన్నముఖ్యాధికారులకు బ్రహ్మసాక్షా త్కారానంతర మాధ్యాననిష్ఠ యవశ్య మైనను అగుఁగాక. ఏయధికారులు శాస్త్ర మునందు వ్యుత్పన్నులో వారల కాధ్యాననిష్ఠయొక్కయపేక్ష కలుగదా యేమి ?

సమాధానము:—సర్వవ్యుత్పన్నాధికారుల కాధ్యాననిష్ఠయొక్కయపేక్ష లే దనుచున్నావా ? లేక, ఎవఁడైన నొకవ్యుత్పన్నాధికారి కాధ్యాననిష్ఠయొక్క యపేక్ష లే దనుచున్నావా ? అందు ద్వితీయపక్ష మంగీకరించినయెడల నది మా కును ఇష్టమై యున్నది. ప్రథమపక్ష మంగీకరించినయెడల నది సంభవింపదు. ఏల యన. న్యాయమీమాంసా ద్యనేకశాస్త్రములయొక్కవిచారణవలనను, పూర్వజన్మ ములయొక్కపాపకర్మవశమువలనను ఏపండితజనులు సంశయవిపరీతభావనలచే గ్రస్తు లగుచున్నారో యావ్యుత్పన్నపండితులకు వేదాంతవిచారణవలన నాబ్రహ్మసాక్షా త్కారము కలిగినను, అది యప్రామాణ్యాశంకచే దూషితమే యగుచున్నది. ఈ

కారణమువలన నాత్రబ్రహ్మసాక్షాత్కార మజ్ఞానమును నివర్తించుటయందు సామర్థ్యము కలది గాదు. అట్టి వ్యుత్పన్నపండితుల కైననో అసంశయవిపరీతభావనారూపప్రతిబంధముల నివృత్తిచేయుటకొఱకు ధ్యాననిష్ఠ యవశ్య మపేక్షిత మగుచున్నది. ఆధ్యాననిష్ఠచే సంశయవిపరీతభావనారూపప్రతిబంధములనివృత్తి కాఁగా నప్రతిబద్ధబ్రహ్మసాక్షాత్కారముచేత నావ్యుత్పన్నపండితులకు మోక్షరూపపరమపురుషార్థప్రాప్తి యగుచున్నది. ఏవ్యుత్పన్నాధికారులు పరమేశ్వరునియొక్కయనుగ్రహముచే నసంభావనావిపరీతభావనారహితులై యున్నారో ఆవ్యుత్పన్నాధికారులకు బ్రహ్మసాక్షాత్కారానంతర మాధ్యాననిష్ఠ యపేక్షిత మగుట లేదు.

మఱియు ధ్యానమునకు బ్రహ్మసాక్షాత్కారహేతుత్వము శ్రీవ్యాసభగవానులచేతను బ్రహ్మసూత్రమందుఁ జెప్పఁబడి యున్నది. అందు సూత్రము.—“ అపి సంరాధనే ప్రత్యక్షానుమానాభ్యామ్ ”—భావము॥ ఈ యధికారిపురుషుఁడు ధ్యానకాలమందు దేకాగ్రచిత్తముచేతఁ దనయాత్మరూపముగా బ్రహ్మమును సాక్షాత్కరించుకొనుచున్నాఁడు. శ్రుతిస్మృతు లాధ్యానమువలననే బ్రహ్మసాక్షాత్కారప్రాప్తిఁ జెప్పియుండుటవలన నని దెలియవలయును. అందు శ్రుతి.—“ జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వ స్తతస్తు తం పశ్యతి నిష్కలం ధ్యాయమానః । కశ్చి ద్ధీరః ప్రత్యగాత్మానమైక్ష దావృత్త చక్షు రమృతత్వ మిచ్ఛన్ ”— భావము॥ శుద్ధాంతఃకరణము గల పురుషుఁడు నిర్గుణబ్రహ్మమును ధ్యానించువాఁడై యానిర్గుణబ్రహ్మమును సాక్షాత్కరించుకొను చున్నాఁడు. మఱియు బాహ్యరూపాదివిషయములనుండి నివర్తింపఁబడిన చక్షురాదీంద్రియములు గలవాఁ డైన ధ్యాననిష్ఠుఁ డొకఁడు మోక్షేచ్ఛ గలవాఁడై ప్రత్యగాత్మను సాక్షాత్కరించుకొనుచున్నాఁడు. అందు స్మృతి “ యం వినిద్రా జితశ్వాసాః సంతుష్టాః సం జితేంద్రియాః । జ్యోతిః పశ్యంతి యుంజానా స్తస్మై యోగాత్మనే నమః ” — భావము॥ నిద్రారహితుఁడును ప్రాణాయామముచే శ్వాసము నణఁచినవాఁడును యథాలాభసంతుష్టుఁడును జయింపఁబడిన చక్షురాదీంద్రియములు గలవాఁడును నైనట్టిపురుషుఁడు ధ్యానయోగముఁ జేసి యేపరమాత్మజ్యోతిని సాక్షాత్కరించుకొను చున్నాఁడో ఆయోగరూపపరమాత్మను మేము నమస్కరించుచున్నాము.

మఱియు నుక్తార్థమే యన్యగ్రంథములయందును జెప్పఁబడి యున్నది. అందు “ శ్లో. బహువ్యాకులచిత్తానాం విచారా త్తత్త్వధీ ర్న చేత్ । యోగో ముఖ్య స్తత స్తేషాం ధీ దర్ప స్తేన నశ్యతి ”—భావము॥ బహుతరవ్యాకులచిత్తము గల పురుషుల కొకవేళ విచారణ చేయుటవలన నాత్మజ్ఞానము కలుగనియెడల అట్టి పురుషుల

కాధ్యానరూపయోగమే ముఖ్యసాధనమై యున్నది, ఏకారణముచేత ననఁగా నా పురుషులయొక్కబుద్ధియం దుండు సంశయవిపరీతభావనాదిదోషము లాధ్యానము చేతనే నివృత్తము లగుచున్నవి.

శంక:—పూర్వోక్తరీతిగా సంశయవిపరీతభావనాసహితపురుషు లైననో ఆసంశయవిపరీతభావనలయొక్కనివృత్తికొఱ కాధ్యానమును జేసినను జేయనీ. ఏ జ్ఞానవంతు లగు పండితు లాసంశయవిపరీతభావనారహితులై యున్నారో వారును ధ్యానము చేయుట చూడఁబడు చున్నది. ఆజ్ఞానవంతు లగు పండితులు దేనికొఱకు ధ్యానముఁ జేయుచున్నారు?

సమాధానము:—సంశయవిపరీతభావనారహితు లైన జ్ఞానవంతు లగు పండితు లెప్పుడు "అహం బ్రహ్మాస్మి" యను వృత్తులయొక్కప్రవాహరూపధ్యానముఁ జేయుచున్నారో అప్పుడు వారలకు బాహ్యవిక్షేపములయొక్కనివృత్తిచే బ్రహ్మానంద రూపదృష్టసుఖము విశేషముగాఁ గలుగుచున్నది. ఆదృష్టసుఖముకొఱకే యాజ్ఞాన వంతు లగుపురుషులు ధ్యానముఁ జేయుచున్నారు. ఆధ్యానమునకు వేఱొకప్రయోజనము లేదు. ఏల యన, సంశయవిపరీతభావనారూపప్రతిబంధకములయొక్కనివృత్తియును ఆత్మసాక్షాత్కారము నను నీరెండును ఆవిద్వాంసులకుఁ బూర్వమే ప్రాప్తములై యున్నవి. పరిశేషమువలన నాధ్యానమున కాదృష్టసుఖమే ఫలమై యున్నది. ఈవిషయము శ్రీభగవంతునిచేతను గీతయందుఁ జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే। తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్"—భావము॥ పరమేశ్వరుఁడ నగు నాకంటె భిన్నమైన మాయికపదార్థములయందు రాగము లేనివార లెవ్వరో వారలు అనన్యు లనఁబడుదురు. అట్టి యనన్యులై ప్రత్యగభిన్నపరమాత్మ నగు నన్ను చింతించువారలై యేసాధనచతుష్టయసంపన్నాధికారిపురుషులు నిర్గుణపరమాత్మ నగు నన్ను నిరంతరము ధ్యానించుచున్నారో, అనఁగా విజాతీయవృత్తులయొక్కపరిత్యాగముచేత సజాతీయవృత్తులయొక్కప్రవాహరూపధ్యానము చేయుచున్నారో, అట్టి మద్ధ్యానపరాయణు లగు తత్త్వవేత్తలయొక్కయోగక్షేమములను బరమేశ్వరుఁడ నగు నేను వహించుచున్నాను. అచ్చట అప్రాప్తార్థముయొక్కప్రాప్తి యేది గలదో అది యోగ మనఁబడును, ప్రాప్తార్థముయొక్కపరిరక్షణ మేది గలదో అది క్షేమ మనఁబడును.

శంక:—అఖండైకరసానందరూపబ్రహ్మాత్మయందు నిష్ఠాసహితు లైన జ్ఞానవంతు లగు పురుషుల కప్రాప్తానంద మేదియును లేదు. ఎట్లనఁగా, మనుష్యలోకవ

మొదలుకొని బ్రహ్మలోకపర్యంతము గల సర్వానందములును ఏబ్రహ్మానందమం దంత ర్భూతము లగుచున్నవో ఆబ్రహ్మానంద మాజ్ఞానవంతు లగు పురుషులకు స్వాత్మరూ పముచేత నిత్యప్రాప్త మయ్యే యున్నది. మఱియు నుత్పత్తివినాశరహిత మగుట వలన నాబ్రహ్మానందమునకు రక్షణమును సంభవించుట లేదు. అనిత్యవస్తువున కే రక్షణ మున్నది. అందువలన జ్ఞానవంతు లగు పురుషులయొక్క యోగక్షేమములను బరమేశ్వరుఁడ నగు నేను వహించుచున్నా నను భగవంతునివచన మసంగతమై యున్నది.

సమాధానము:—యద్యపి జ్ఞానవంతు లగు పురుషుల కప్రాప్తాంశ మేది యు లేదు. బ్రహ్మానందము వారలకు నిత్యప్రాప్త మయ్యే యున్నది. అందువలన జ్ఞానవంతుల కేయోగక్షేమములును లేవు. తథాపి, ఇచ్చట యోగక్షేమములను శబ్దములచేత నీయర్థము గ్రహింపవలయును. దేహాదిసర్వానాత్మపదార్థములయం దాత్మత్వబుద్ధిని బరిత్యజించి యీజ్ఞానవంతు లగు పురుషులకు బ్రహ్మానందరూపముచే నేస్థితి యున్నదో అది యోగ మనఁబడును. మఱియుఁ బ్రబలప్రారబ్ధముయొక్క యోగము (సంమేళనము) చేతఁగూడ బ్రహ్మనిష్ఠనుండి యేయప్రచ్యుతి (జాఱమి) యున్నదో అది క్షేమ మనఁబడును. ఈప్రకార మైన యోగక్షేమములు జ్ఞాన వంతుఁ డగు పురుషునియందును సంభవించు చున్నవి. అందువలన "యోగక్షేమం వహా మ్యహం" మ్మను నుక్తవాక్యముచేత శ్రీభగవంతుఁ డీప్రకార మైన యోగక్షేమ ములనే చెప్పి యున్నాఁడు. అందువలన ధ్యాననిష్ఠు లైన జ్ఞానవంతు లగు పురుషు లకు నిరంతరము దృష్టసుఖమే ప్రాప్త మగుచున్న దను నర్థము పూర్వోక్త గీతా వచనముచేత సిద్ధ మగుచున్నది. ఈయర్థమునే శ్రీభగవంతుఁడు "మచ్చిత్తా మద్గత ప్రాణా బోధయంతః పరస్పరమ్ । కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతిచ రమం తిచ" అను నీశ్లోకమునందును జెప్పి యున్నాఁడు. ఈ గీతాశ్లోకములయొక్క యర్థ ము మాచేత గీతాగూఢార్థదీపికానామటీకయందు విస్తరముగాఁ జెప్పఁబడి యున్నది. జిజ్ఞాస గలవారు దాని నచ్చటఁ దెలియవలయును.

## (16) జ్ఞానికి ధ్యానమునందుఁ గర్తవ్యత లే దనుటయందు శంకాసమాధానములు.

శంక:—ఎట్లు ముముక్షుజనులను గుఱించి శ్రవణాదులయొక్క యవశ్య కర్తవ్యతను బోధించువిధి యున్నదో అట్లు సంశయవిపరీతభావనారహితజ్ఞానవంతు లగు పురుషులకును ఆధ్యానముయొక్క అవశ్యకర్తవ్యతను బోధించువిధి యేల కలు

గదు? అనఁగా జ్ఞానవంతు లగు పురుషులచేతను ఆధ్యాన మవశ్యము చేయఁబడ వలయు నని వేదముయొక్కయాజ్ఞ యేల కలుగదు? మఱియు నాజ్ఞానవంతు లగు పురుషులకు ధ్యానము విధించునట్టి యేవేదవాక్యమును లేదు, అందువలన నాజ్ఞాన వంతు లగు పురుషులకు ధ్యానము విధింపఁబడ లే దని మీరు చెప్పినయెడల అది యుఁ గూడ సంభవింపదు. ఏల యన "త మేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః"—భావము॥ ధైర్యవంతుఁ డగు బ్రాహ్మణుఁ డాపరమాత్మను సాక్షాత్క రించుకొనిన వెనుక ఆపరమాత్మను ధ్యానము చేయవలయును. ఈశ్రుతిచేత జ్ఞాన వంతుఁ డగు పురుషునకును ధ్యానము విధింపఁబడి యున్నది. మఱియు నాత్మసాక్షా త్కారము కలుగుటచేతనే యీజ్ఞానవంతుఁ డగుపురుషునకు మోక్షరూపపరమ పురుషార్థప్రాప్తి కలుగుచున్నది, అందువలన నాత్మజ్ఞానానంతర మాధ్యానము చేయుట నిష్ఫలమే యగుచున్న దని మీరు చెప్పినయెడల నదియును ఘటిల్లదు. ఏల యన, ఈకాలమునందు బ్రహ్మసాక్షాత్కార మున్నను ఆధ్యానరహితపురుషు లకుఁ బూర్వ మజ్ఞానావస్థయందువలె సుఖదుఃఖాదిరూపసంసారప్రతీతి యున్నది. కాఁబట్టి యాబ్రహ్మసాక్షాత్కారమాత్రముచేత నీపురుషున కామోక్షరూపపురు షార్థప్రాప్తి కలుగనేరదు. మఱియు నే మనఁగా, బ్రహ్మవేత్త యగు గురువుయొక్క సమీపమునకుఁ బోయి శ్రవణాదులవలన బ్రహ్మమును సాక్షాత్కరించుకొని యీ పురుషుఁడు జీవితకాలపర్యంతము బ్రహ్మధ్యానముయొక్కయభ్యాసము నెప్పుడు చేయుచున్నాఁడో అప్పుడే యాపురుషున కామోక్షప్రాప్తి కలుగుచున్నది. అందు వలన మోక్షప్రాప్తికొఱకు జ్ఞానవంతుఁ డగు పురుషునకుఁగూడ జీవితకాలపర్యంత మాధ్యాన మవశ్యకర్తవ్యమై యున్నది. అట్లు గాక జ్ఞానవంతుఁ డగు పురుషుఁడు ధ్యానపరాయణుఁడు గాక పోయినయెడల యథేష్టాచరణప్రాప్తిచే నరకమే ప్రాప్తిం చును. ఈయర్థ మన్యగ్రంథములయందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. నిస్సంగతా ముక్తిపదం యతీనాం సంగా దశేషాః ప్రభవంతి దోషాః। ఆరూఢ యోగోపి నిపాత్యతే ఒధః సంగేన యోగీ కిము తాల్పసిద్ధిః"— భావము॥ విషయా సక్తబహిర్ముఖజనులయొక్కసంగమును బరిత్యజించుట నిస్సంగత యనఁబడును, ఆ నిస్సంగత్వమే సన్న్యాసులకు ముక్తిని బొందుటకు మార్గమై యున్నది. ఎట్లనఁగా నాసంగమువలన నీపురుషునకుఁ గామాద్యనేకదోషము లుత్పన్నము లగుచున్నవి. ఆదోషప్రాప్తివలన జ్ఞానవంతు లగు పురుషులకును అధఃపతనము కలుగును. ఇఁక ముముక్షుజనులనుగుఱించి చెప్పవలసిన దేమి యున్నది? అందువలన నాయథేష్టా చరణముయొక్కనివృత్తికొఱకు, సంశయవిపరీతభావనారహితజ్ఞానవంతు లగు పురు

షులకును జీవితకాలపర్యంతము బ్రహ్మధ్యాన మవశ్యము చేయుటకు యోగ్యమై యున్నది.

సమాధానము:—సంశయవిపరీతభావనారహితజ్ఞానవంతు లగు పురుషుల కాధ్యానము చేయవలయు నను విధి లేదు. ఎట్లన, ఏపురుషునకు దృఢాధ్యాసపూర్వకదేహాభిమాన మున్నదో, ఆపురుషునకే తనయాత్మయందుఁ గర్తృత్వబుద్ధి కలుగుచున్నది. మఱియు నాయాత్మయందుఁ గర్తృత్వబుద్ధి గల పురుషుఁడే యజ్ఞానిపురుషునివలె శాస్త్రముయొక్క విధినిషేధముల కధికారి యగుచున్నాఁడు. మఱియు జ్ఞానవంతు లగు పురుషుల కాదేహాభిమానము లేనందువలనఁ గర్తృత్వబుద్ధి లేదు. కావున జ్ఞానవంతు లగుపురుషు లాశాస్త్రముయొక్క విధినిషేధముల కధికారులు కారు. ఇచ్చటఁ దాత్పర్య మే మన, ఆదేహాభిమానము ద్వివిధమై యున్నది, ఒకటి కర్మజన్యము, మఱియొకటి భ్రాంతిజన్యము. అందుఁ గర్మజన్యదేహాభిమాన మైననో యాకర్మములయొక్క నాశానంతరమే నివృత్త మగుచున్నది. మఱియు ద్వితీయ మగు భ్రాంతిజన్యదేహాభిమాన మజ్ఞానకాలమునం దున్నది. ఎప్పు డాత్మజ్ఞానమువలన నజ్ఞాననివృత్తి కాఁగా భ్రాంతినివృత్తి యగుచున్నదో అప్పు డాభ్రాంతిజన్యదేహాభిమానముగూడ నివృత్త మగుచున్నది. అట్టి దేహాభిమానము లేనందువలనఁ గర్తృత్వబుద్ధిరహితజ్ఞానవంతుఁ డగుపురుషునకు శాస్త్రప్రతిపాదితసర్వాధికారములు నివృత్తము లగుచున్నవి. అట్టి జ్ఞానవంతుఁ డగుపురుషున కాధ్యానవిధి యెట్లు సంభవించును? అనఁగా సంభవింప దనుట. ఈయభిప్రాయముచేతనే శ్రీవిద్యారణ్యస్వాములు పంచదశి యనుగ్రంథమునం దాజ్ఞానవంతు లగు పురుషులయొక్క యనుభవమును జెప్పియున్నారు. అందు “శ్లో. వ్యాచక్షతాం తే శాస్త్రాణి వేదా నధ్యాపయంతు వా। యే ఽత్రాధికారిణో మర్త్యా,నాధికారో ఽక్రియత్వతః॥ శృణ్వంత్వజ్ఞాతతత్త్వాస్తే జానన్ కస్మా చ్ఛృణో మ్యహమ్। మన్యంతాం సంశయాపన్నా న మన్యేఽహ మసంశయః॥ విపర్యస్తో నిదిధ్యాసే త్కిం ధ్యాన మవిపర్యయే ”—భావము॥ ఏపురుషులు కర్తృత్వబుద్ధి గలవా రగుటవలన నధికారులై యున్నారో ఆపురుషులే శాస్త్రములకు వ్యాఖ్యానములు చేయుటకును వేదములను బఠింపఁజేయుటకును దగుదురు. నే నైననో అక్రియుండను, అందువలన నా కేయధికారమును లేదు. మఱియు నేపురుషులు ప్రత్యగభిన్నబ్రహ్మమును దెలియరో ఆపురుషులు వేదాంతశాస్త్రశ్రవణముఁ జేయవలయును. నేనో ఆప్రత్యగభిన్నబ్రహ్మమును అపరోక్షముగాఁ దెలియుచున్నాను, కావున నేను దేనికొఱకు శ్రవణముఁ జేయుదును? మఱియు నేపురుషులాత్మయందు సంశయము గలవారలో, ఆపురుషు లాసంశయముయొక్క నివృత్తి

కొఱకు మననము చేయవలయును, నేనో సర్వసంశయరహితుండను, అందుచేత నేను దేనికొఱకు మననముఁ జేయుదును ? మఱియు నేపురుషులు విపరీతభావన గల వారో ఆపురుషు లావిపరీతభావనానివృత్తికొఱకు నిదిధ్యాసనముఁ జేయవలయును. నేనో యావిపరీతభావనారహితుఁడ నగుటవలన నాధ్యానము చేయుటవలన నా కేమి ప్రయోజన మున్నది ?

శంక:—జ్ఞానవంతు లగు పురుషుల కాధ్యానముయొక్క కర్తవ్యత యంగీకరింపనియెడల నాత్మజ్ఞానానంతర మాధ్యానమును విధించి యుండు "త మేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః" అను పూర్వోక్తశ్రుతి యప్రమాణ మగును.

సమాధానము:—ఆశ్రుతి యాత్మయొక్క యపరోక్షజ్ఞానానంతర మాధ్యానమును విధించినది కాదు. మఱి యే మనఁగా, వేదాంతశ్రవణమాత్రజన్యమైన బ్రహ్మముయొక్క పరోక్షజ్ఞానానంతరమే యాబ్రహ్మముయొక్క యపరోక్షజ్ఞానప్రాప్తికొఱ కానిదిధ్యాసనరూపధ్యానమును విధించి యున్నది. అందువలన నాశ్రుతికిని అప్రమాణత్వము ప్రాప్తము కాదు.

శంక:—బ్రహ్మసాక్షాత్కారానంతరము జ్ఞానవంతు లగు పురుషుల కాధ్యానముయొక్క కర్తవ్యత నంగీకరింపనియెడల నాజ్ఞానవంతు లగు పురుషులకుఁ జిత్తముయొక్క బహిర్ముఖత్వముచేత యథేష్టాచరణప్రాప్తి యగును.

సమాధానము:—ఆజ్ఞానవంతు లగు పురుషులు భ్రాంతిజన్యదేహాభిమానరహితు లగుటవలన యథేష్టాచరణమునందుఁ బ్రవర్తింపరు. దేహాభిమానము గల పురుషులే యథేష్టాచరణమునందుఁ బ్రవర్తింతురు. ఇందు సారాంశ మే మనఁగా, ఏపురుషులు ముముక్షుదశయందును శమదమాదులచేత యథేష్టాచరణమునుండి నివర్తింపఁబడినవారలో ఆపురుషులు జ్ఞానదశయందు యథేష్టాచరణమునం దెట్లు ప్రవర్తింతురు ? మ ఱే మనఁగాఁ బ్రవర్తింపరు. మఱియు "నిస్సంగతా ముక్తిపదం యతీనామ్" అను పూర్వోక్తవచనమో, ఆత్మజ్ఞానరహితసాధకపురుషులవిషయమై యున్నది. తత్త్వవేత్త లగు సిద్ధపురుషులవిషయము గాదు. అందువలన నావచనముచేత ధ్యానరహితజ్ఞానవంతు లగు పురుషుల కధఃపతనము సిద్ధమగుట లేదు.

మఱియు జ్ఞానవంతు లగు పురుషులకు ధ్యానవిధి లే దనునర్థమును శ్రీవ్యాసభగవంతునిచేతను బ్రహ్మసూత్రమునందుఁ జెప్పఁబడి యున్నది. అందు సూత్రము.—"అనుజ్ఞా పరిహారౌ దేహసంబంధా జ్జ్యోతి రాదివత్"—భావము॥ ఈ

కార్య మవశ్యము చేయుటకు యోగ్య మైన దను నేశాస్త్రప్రకృతవిధి యున్నదో అది యనుజ్ఞ యనఁబడును, మఱియు నీకార్యము చేయుటకు యోగ్యము కాని దను నే శాస్త్రప్రకృతనిషేధ మున్నదో అది పరిహార మనఁబడును. ఆయనుజ్ఞాపరిహారరూప విధినిషేధము లీపురుషున కాత్మజ్ఞానమునకుఁ బూర్వము దేహాభిమానమువలనఁ బ్రాప్తము లగుచున్నవి. ఆత్మజ్ఞానకాలమందు దాదేహాభిమానము నివృత్తము కాఁగా జ్ఞానవంతు లగు పురుషుల కాశాస్త్రప్రకృతవిధినిషేధములు ప్రాప్తము లగుట లేదు. ఎట్లు శ్మశానాగ్ని పరిత్యజింపఁబడి వే అగ్ని గ్రహింపఁబడుచున్నదో ఎట్లు మనుష్యశరీరముయొక్క మలమూత్రములు పరిత్యజింపఁబడి గోశరీరముయొక్క మల మూత్రములు గ్రహింపఁబడుచున్నవో అట్లే దేహాభిమానము గల యజ్ఞానిపురుషుల కాశాస్త్రప్రకృతవిధినిషేధము లున్నవి. ఆదేహాభిమానరహితజ్ఞానవంతు లగు పురుషుల కావిధినిషేధములు కలుగనేరవు.

మఱియు జ్ఞానవంతు లగు పురుషులకుఁ గించిన్మాత్రమును గర్తవ్యము లే దను నుక్తార్థము శ్రీభగవంతునిచేతను గీతయందు "యస్త్వాత్మరతి రేవ స్యా దాత్మ తృప్తశ్చ మానవః । ఆత్మన్యేవచ సంతుష్ట స్తస్య కార్యం నవిద్యతే॥ నైవ తస్య కృతే నార్థో నాకృతే నేహ కశ్చన । న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థ వ్యపాశ్రయః" అను రెండుశ్లోకములచేఁ జెప్పఁబడి యున్నది.

మఱియు నీయర్థము పురాణమందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః । నై వాస్తి కించి త్కర్తవ్య మస్తి చే న్న స తత్త్వవిత్"—భావము॥ ఏపురుషుఁడు "అహం బ్రహ్మాస్మి" యను నాత్మ జ్ఞానరూపామృతపానముచేతఁ దృప్తిని బొందిన కారణమువలననే కృతకృత్యుఁడో అనఁగా సంపాదింపఁదగినదానిని సంపాదించి యుండువాఁడో అట్టి జ్ఞానవంతుఁ డగు పురుషునకుఁ గించిన్మాత్రమును గర్తవ్యము లేదు, మఱియు నేపురుషునకుఁ గించి న్మాత్రము కర్తవ్య మున్నదో ఆపురుషుఁడు జ్ఞానవంతుఁడు కానేరఁడు.

మఱియు నీయర్థము శ్రీభగవద్భాష్యకారులచేతను "అహం బ్రహ్మాస్మీత్యే తదవసానా ఏవ సర్వే విధయః సర్వాణిచ శాస్త్రాణి విధిప్రతిషేధమోక్షపరాణి" ఇత్యాదివచనములచేఁ జెప్పఁబడి యున్నది. ఈభాష్యవచనమున కర్థ మే మనఁగా, ఈపురుషున కెంతపర్యంతము "అహం బ్రహ్మాస్మి" యను సాక్షాత్కారము కలుగుట లేదో అంతపర్యంతమే యీపురుషునిపై సర్వవిధు లున్నవి. మఱియు విధినిషేధమోక్షము లను మూటిని బ్రతిపాదించుశాస్త్రములును అంతపర్యంత

తమే గలవు. మఱియు బ్రహ్మసాక్షాత్కారోత్పత్త్యనంతరము జ్ఞానవంతుఁ డగుపురుషునిపై విధియును లేదు శాస్త్రమును లేదు. ఎట్లనఁగా దేహేంద్రియాదులయం దహంమమాభిమానరహితుఁ డగు నేజ్ఞానవంతుఁ డగుపురుషుఁ డున్నాఁడో ఆపురుషునకుఁ బ్రమాతృత్వము సంభవించుట లేదు. ప్రమాత లేక ప్రమాణమునందుఁ బ్రవృత్తి కలుగదు. అందువలన జ్ఞానవంతుఁ డగుపురుషునకుఁ గించిన్మాత్రమును గర్తవ్యము లేదు.

మఱియు నీయర్థమును బ్రహ్మవేత్త లగు విద్వాంసులచేతను జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. గౌణ మిథ్యాత్మనో ఽసత్త్వే పుత్రదేహాదిబాధనాత్ । తత్సద్బ్రహ్మాహ మస్మీతి బోధే కార్యం కథం భవేత్" — భావము॥ ఆత్మ త్రివిధ మగుచున్నది, ఒకటి గౌణాత్మ, రెండవది మిథ్యాత్మ, మూడవది ముఖ్యాత్మ. అందుఁ బుత్రభార్యాదిక మైననో గౌణాత్మ యనఁబడును, అన్నమయాదిపంచకోశములు మిథ్యాత్మ యనఁబడును, ఆపంచకోశముల కధిష్ఠానరూపసచ్చిదానందైకరససాక్ష్యాత్మ యేది గలదో అది ముఖ్యాత్మ యనఁబడును. గౌణాత్మ మిథ్యాత్మ యను రెంటియొక్క మిథ్యాత్వము నిశ్చితము కాఁగా నీపురుషున కాపుత్రభార్యాదికమందును అన్నమయాదిపంచకోశములయందును ఆత్మత్వబుద్ధి నివృత్త మగుచున్నది. తదనంతరము సర్వమున కధిష్ఠాన మైన సచ్చిదానందైకరసబ్రహ్మము నే నను సాక్షాత్కారము కలుగుచున్నది. ఆ సాక్షాత్కారము కలుగఁగా నీజ్ఞానవంతుఁ డగు పురుషునకుఁ గించిన్మాత్రమును గర్తవ్య ముండుట లేదు.

మఱియు నీయర్థమును "ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య నకర్మణా వర్ధతే నోకనీయాన్, ఏత ద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యా త్కృతకృత్యశ్చ భారత" ఇత్యా ద్యనేకశ్రుతిస్మృతులయందుఁ జెప్పఁబడి యున్నది. అందువలన సంశయవిపరీతభావనారహితజ్ఞానవంతుఁ డగుపురుషునకుఁ గించిన్మాత్రమును ధ్యానాదులయొక్క కర్తవ్యత లేదు. అయినను, అజ్ఞానవంతుఁ డగుపురుషుఁడును ఎప్పుడు ధ్యానపరాయణుఁ డగుచున్నాఁడో అప్పుడు వానికి బ్రహ్మానందరూపదృష్టసుఖ మధిక మగుచున్నది. అజ్ఞానవంతుఁ డగుపురుషుఁ డెప్పుడు ధ్యానపరాయణుఁ డగుట లేదో అప్పుడు వానికి బాహ్యవ్యవహారబాహుళ్యముచేఁ గేవలదృష్టదుఃఖముమాత్రమే కలుగుచున్నది. సంశయవిపరీతభావన లేదైనఁ గలుగుటచేతను మోక్షమునకుఁ బ్రతిబంధము కలుగుట లేదు. ఎట్లనఁగా, బహుకాలశ్రవణమనననిదిధ్యాసనములచే బ్రహ్మాత్మతత్త్వమును నిశ్చయించి కరతలామలకమువలెఁ దన యద్వయానందస్వరూపము ననుభవించునట్టి జ్ఞానికిఁ బ్రారబ్ధకర్మవశమువలనఁ గించిన్మాత్రబాహ్యవ్యవహార

ముచే సంశయవిపరీతభావనాదికము సంభవించుట లేదు. అందువలనఁ బ్రారబ్ధకర్మవశముచే నన్నపానాదివ్యవహారములు కలిగినను జ్ఞానికి మోక్ష మవశ్యము ప్రాప్త మగుచున్నది. ఆమోక్షమున కేప్రతిబంధమును గలుగదు.

ఈయర్థము శ్రీవ్యాసభగవంతునిచేతను బ్రహ్మసూత్రమునందుఁ జెప్పఁబడి యున్నది. అందు సూత్రము.—"తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్"—భావము॥ బ్రహ్మాత్మయందు నిష్ఠ గలిగినట్టి జ్ఞానవంతుఁ డగు పురుషునకే శ్రుతిస్మృతులచే మోక్షప్రాప్తి చెప్పఁబడియున్నది. శ్రుతి.—"తస్య తావ దేవ చిరం యావ న్న విమోక్ష్యే అథ సంపత్స్యే"—భావము॥ ఎంతపర్యంతము భోగముచేతఁ బ్రారబ్ధకర్మము నాశ మొందుట లేదో అంతపర్యంతమే యాజ్ఞానవంతుఁ డగు పురుషునకు విదేహమోక్షమునందు విలంబ మున్నది. ప్రారబ్ధకర్మముయొక్క నివృత్త్యనంతర మాజ్ఞానవంతుఁ డగు పురుషుఁడు నిర్విశేషబ్రహ్మభావరూపవిదేహమోక్ష మవశ్యము పొందుచున్నాఁడు. స్మృతి.—"య ఏవం వేత్తి పురుషం ప్రకృతించ గుణైః సహ । సర్వథా వర్తమానోపి న స భూయో ఽభిజాయతే"—భావము॥ ఓయర్జునా! ఏపురుషుఁడు దేశకాలవస్తుపరిచ్ఛేదరహితానందరూపపరమాత్మను "అహం బ్రహ్మాస్మి" యని తనయాత్మరూపముగాఁ దెలియుచున్నాఁడో, మఱియు సత్త్వరజస్తమస్సులను త్రిగుణములతోఁ గూడిన మాయారూపప్రకృతిని మిథ్యగాఁ దెలియుచు నున్నాఁడో ఆవిద్వాంసుఁ డగు పురుషుఁడు సర్వప్రకారములచే వర్తించువాఁ డైనను, అనఁగాఁ బ్రబలప్రారబ్ధకర్మవశమువలన నొకప్పుడు యథేష్టాచరణుఁ డైనను, మరల జన్మము నొందఁడు. తనయొక్క యీయభిప్రాయమునే శ్రీభగవంతుఁ డష్టాదశాధ్యాయమునందుఁ బ్రకటించి యున్నాఁడు. అందు "శ్లో. యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య నలిప్యతే । హత్వాపి స ఇమాఀల్లోకా న్న హంతి న నిబధ్యతే"—భావము॥ ఓయర్జునా! ఏజ్ఞానవంతుఁ డగు పురుషునకు నేను కర్మమునకుఁ గర్త నను భావన లేదో, మఱియు నేజ్ఞానవంతుఁ డగుపురుషునియొక్క బుద్ధి నే నీకర్మఫలము ననుభవింపుదు నని యాకర్మఫలమునందు బద్ధ మగుట లేదో ఆజ్ఞానవంతుఁ డగు పురుషుఁ డొకవేళ నీసర్వులను వధించినను హననక్రియకుఁ గర్త యగుట లేదు, మఱియు నాహననక్రియాజన్యానిష్టఫలముతోడను సంబంధము గలవాఁడును గాఁడు.

మఱియు నీయర్థమే శేషభగవంతునిచేతను జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. హయమేధ శతసహస్రా ణ్యథ కురుతే బ్రహ్మఘాతలక్షాణి । పరమార్థవి న్న పుణ్యై ర్నచ పాపైః స్పృశ్యతే విమలః"—భావము॥ "అహం బ్రహ్మాస్మి" యను సాక్షాత్కారము గల తత్త్వవేత్త యగు పురుషుఁ డొకప్పుడు శతసహస్రాశ్వమేధ

యజ్ఞములు చేసినను, లేక, లక్షబ్రహ్మహత్యలు చేసినను ఆతత్త్వవేత్త యగుపురుషుఁ డశ్వమేధజన్యపుణ్యములచేతను బ్రహ్మహత్యాజన్యపాపములచేతను బద్ధుఁడు గానేరఁడు, ఏకారణముచేత ననఁగా, ఆతత్త్వవేత్త యగుపురుషుఁడు విమలుఁడు, అనఁగా అవిద్యాదిమలరహితుఁ డగుచున్నాఁడు.

మఱియు నుక్తార్థమే శ్రీవిద్యారణ్యస్వాములచేతను జెప్పఁబడి యున్నది. అందులకు “ శ్లో. పూర్ణే బోధే తదన్యౌ ద్వౌ ప్రతిబద్ధౌ యదా తదా। మోక్షో వినిశ్చితః కింతు దృష్టదుఃఖం న నశ్యతి ” — భావము॥ వైరాగ్యబోధోపరతు లను మూటియం దీపురుషున కెప్పు డాత్మసాక్షాత్కారరూపబోధ పూర్ణమై యుండియు నొకానొకపాపప్రారబ్ధకర్మవశమువలన వైరాగ్యోపరతు లనురెండును బ్రతిబద్ధము లగుచున్నవో అప్పు డీపురుషునకు మోక్షము నిశ్చయముగాఁ గలుగుచున్నది. అయినను, ఆ వైరాగ్యోపరతులు లేనందువలన నీపురుషునకు దృష్టదుఃఖము నివృత్తమగుట లేదు. ఇచ్చటఁ దాత్పర్య మే మనఁగా, వైరాగ్యబోధోపరతు లను మూఁడును బరస్పరసహాయము లగుటవలన విశేషముగా నొకటిగానే యుండును. అయినను గొన్నిస్థలములయం దీమూటికిని బరస్పరవియోగము కలుగుచున్నది. అందు మహాతపస్సుచేఁ గూడినవాఁడును బరమేశ్వరానుగ్రహము గలవాఁడును నైన నుత్తమాధికారియం దైనను ఆమూఁడును ఒకటిగానే యున్నది. మధ్యమాధికారియం దొకానొకపాపప్రారబ్ధవశమువలన దానియొక్కవియోగముకూడఁ గలుగుచున్నది. ఆ వియోగమందు నిట్టిభేద మున్నది. ఏపురుషునకు వైరాగ్యోపరతు లను రెండును బూర్ణమై యుండియు, ఆత్మసాక్షాత్కారరూపబోధము ప్రతిబద్ధ మగుచున్నదో ఆపురుషునకు మోక్షప్రాప్తి గలుగుట లేదు. ఇఁక నే మనఁగా, ఆతపోబలమువలన నుత్తమలోకప్రాప్తి గలుగుచున్నది. ఏపురుషున కాబోధము పూర్ణమై యుండియు నొకానొకపాపప్రారబ్ధవశమువలన వైరాగ్యోపరతు లను రెండును బ్రతిబద్ధము లగుచున్నవో ఆపురుషునకు మోక్ష మవశ్యము కలుగుచున్నది. అయినను దృష్ట దుఃఖము నివృత్తి మగుట లేదు.

[*] (17) వైరాగ్యబోధోపరతులయొక్కస్వరూపాదినిరూపణము. [*]

ఇఁక ప్రసంగానుసారముగా వైరాగ్యము బోధ ఉపరతి యను నీమూటియొక్కసాధనమును, స్వరూపమును, ఫలమును, బూర్ణతయొక్కయవధియు ననునీ నాల్గును నిరూపింపఁబడుచున్నవి. అందు, ఇహపరలోకములయొక్కవిషయముల యందు సాతిశయత్వానిత్యత్వాదిరూపదోషదృష్టి యేది యున్నదో, ఆదోషదృష్టి

వైరాగ్యమునకు సాధనమై యున్నది. ఇహపరలోకవిషయములయొక్క త్యాగేచ్ఛ యేది గలదో అది వైరాగ్యముయొక్క స్వరూపమై యున్నది. ప్రయత్నము లేకయే ప్రాప్తమైన భోగములయందును జితముయొక్క యనఘనతి యేది గలదో అది వైరాగ్యముయొక్క ఫలమై యున్నది. సర్వోత్కృష్టమైన యేబ్రహ్మలోక మున్నదో దానిని తృణమువలెఁ దుచ్ఛముగాఁ దెలియుట వైరాగ్యముయొక్క పూర్ణత్వమున కవధియై యున్నది. మఱియు శ్రవణమననిదిధ్యాసనము లను మూఁడును ఆ బోధకు సాధనములై యున్నవి. మిథ్య యగు దేహాదికమునం దుండి ప్రత్యగాత్మయొక్క యేవివేచన మున్నదో అది బోధయొక్క స్వరూపమై యున్నది. అహంకారాదులతో నాత్మయొక్క తాదాత్మ్యాధ్యాసరూపగ్రంథికి మరల నేయనుదయ మున్నదో అది బోధయొక్క ఫలమై యున్నది. ఎట్లజ్ఞానులకు దేహమునందు దృఢాత్మత్వబుద్ధి యున్నదో అట్లు పరమాత్మయందు దృఢాత్మత్వబుద్ధి యేది యున్నదో అది బోధయొక్క పూర్ణత్వమున కవధియై యున్నది. మఱియు యమనియమాదు లుపరతికి సాధనములై యున్నవి. మనస్సుయొక్క సర్వవృత్తుల కేనిరోధ మున్నదో అది యుపరతియొక్క స్వరూపమై యున్నది. లౌకికవైదికసర్వవ్యవహారములయొక్క యేయభావ మున్నదో అది యుపరతికి ఫలమై యున్నది. సుషుప్తివలె సర్వపదార్థములయొక్క విస్మృతి యేది యున్నదో అది యుపరతియొక్క పూర్ణత్వమున కవధియై యున్నది.

అచ్చట, అసంభావనావిపరీతభావనారహితత్వ మేది గలదో అదియే బ్రహ్మసాక్షాత్కారరూపబోధయొక్క పూర్ణత్వమున కవధియై యున్నది. ఆబోధయొక్క పూర్ణత్వమున కవధి విష్ణుపురాణమందుఁ బరాశరమునులచేతను జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. అహం హరిః సర్వ మిదం జనార్దనో నాన్య త్తతః కారణకార్యజాతమ్ । ఇదం మనో యస్య న తస్య భూయో భవోద్భవా ద్వంద్వగదా భవంతి "—భావము॥ నేనును ఈసర్వజగత్తును బరమాత్మరూపమే, ఆపరమాత్మకు భిన్నముగాఁ గారణము గాని కార్యము గాని యేదియును లేదు, ఈప్రకారముగా సర్వాత్మబుద్ధి యేపురుషునకుఁ బ్రాప్త మగుచున్నదో ఆపురుషునకు మరల సంసారమువలన నుత్పన్నమైన శీతోష్ణమానావమానాదిద్వంద్వరూపరోగములు ప్రాప్తములగుట లేదు. మఱియు నీబోధయొక్క పూర్ణత్వమున కవధి స్కాందపురాణమందుండు బ్రహ్మగీతయందు బ్రహ్మనుగూర్చి మహాదేవునిచేతను జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. అహం హి సర్వం నచ కించి దన్య న్నిరూపణాయా మనిరూపణాయామ్ । ఇయం హి వేదస్య పరాహి నిష్ఠా మమానుభూతిశ్చ న సంశయశ్చ"—

భావము॥ నేనే సర్వజగద్రూపుఁడను, నాకంటెను భిన్నముగా నొకవస్తువును లేదు, ఈప్రకారమైన యేసర్వాత్మభావ మున్నదో యదియే సర్వవేదములయొక్క పరమ తాత్పర్యమై యున్నది, మేమును దీనినే యనుభవించుచున్నాము, ఈ సర్వాత్మ భావమందు నీ వొకప్పుడును సంశయింప వలదు. మఱియు నీబోధయొక్క పూర్ణత్వ మున కవధి యుపదేశసాహస్రి యను గ్రంథమునం దాచార్యులచేతను జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. దేహాత్మజ్ఞానవత్ జ్ఞానం దేహాత్మజ్ఞానబాధకమ్ । ఆత్మన్యేవ భవేద్యస్య స నేచ్ఛన్నపి ముచ్యతే"—భావము॥ అజ్ఞానిపురుషుల కెట్లు తమదేహ మందు "అహం మనుష్యః" అను దృఢజ్ఞానము కలుగుచున్నదో అట్లేపురుషునకుఁ బ్రత్యగాత్మయందు "అహం బ్రహ్మాస్మి" యను సంశయవిపరీతభావనారహితదృఢ జ్ఞానము కలుగుచున్నదో ఏజ్ఞానము దేహాత్మజ్ఞానమును నాశము చేయు చున్నదో అట్టిజ్ఞానము గల పురుషుఁడు మోక్షము నిచ్ఛింపకపోయినను అవశ్యము మోక్షము పొందుచున్నాఁడు. మఱియు నీబోధయొక్క పూర్ణత్వమున కవధి శ్రీవిద్యారణ్య స్వాములును దృప్తిదీపమునందుఁ జెప్పి యున్నారు. అందు "శ్లో. అసందిగ్ధాఽవిప ర్యస్తబోధో దేహాత్మనీక్ష్యతే । తద్వదత్రేతి నిర్ణేతు మయ మిత్యభిధీయతే"— భావము॥ లౌకికపురుషులకుఁ దమదేహరూపాత్మయం దెట్లు సంశయవిపరీతభావనా రహితముగా నేను మనుష్యుఁడను నేను బ్రాహ్మణుఁడను అను జ్ఞానము చూడఁబడు చున్నదో అట్లీయధికారిచేత ముక్తి సిద్ధించుటకొఱకుఁ బ్రత్యగాత్మయందు సంశయ విపరీతభావనారహితముగా "అహం బ్రహ్మాస్మి" యను బోధయే సంపాదించుటకు యోగ్యమై యున్నది. ఈరీతిగా నిర్ణయించుటకొఱకే శ్రుతియందు "అయమ్" అను పదము చెప్పఁబడి యున్నది. ఆశ్రుతి ముందు చెప్పఁబడును. ఇత్యాద్యనేకశ్రుతిస్మృ త్యాచార్యవాక్యరూపప్రమాణములచేత నాబోధయొక్క పూర్ణత్వమున కవధి సిద్ధ మగుచున్నది. అందువలన నీయర్థము సిద్ధించు చున్నది. పూర్వము చెప్పఁబడిన వివేకాదిచతుష్టయ సాధన సంపన్నపురుషునకు శ్రవణమనననిదిధ్యాసనములచే "అహం బ్రహ్మాస్మి" యను బ్రహ్మసాక్షాత్కారము కలుగుచున్నది. ఆబ్రహ్మసాక్షా త్కారమువలన నవిద్యానివృత్తియును బ్రహ్మభావరూపముక్తియును గలుగుచున్నవి.

శంక:—బ్రహ్మసాక్షాత్కారమువలన నీపురుషున కవిద్యానివృత్తియును బ్రహ్మభావరూపముక్తియును గలుగుచున్న వను నీయర్థమునందుఁ బ్రమాణ మేమి?

సమాధానము:—ఈయర్థమును సాక్షాద్వేదశ్రుతియును స్మృతియును జెప్పుచున్నవి. అందు శ్రుతి.—"త మేవ విదిత్వాఽతిమృత్యు మేతి, తరతి శోక

మాత్మవిత్, బ్రహ్మవిద్బ్రహ్మైన భవతి, ఏవ మే వైష సంప్రసాదో ఽస్మా చ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేనరూపే ణాభినిష్పద్యతే, స ఉత్తమః పురుషః, ఆత్మానంచే ద్విజానీ యాదయ మస్మీతి పూరుషః। కిమిచ్ఛ న్కస్య కామా య శరీర మనుసంజ్వరేత్, యస్యానువిత్తః ప్రతిబుద్ధ ఆత్మా తత్ర్పాణ్ణా నందైకబోధ స్తద్బ్రహ్మాహ మస్మీతి కృత కృత్యో భవతి "—భావము॥ ఈ యధికారి పురుషుఁడా పరమాత్మను "అహం బ్రహ్మాస్మి" యని సాక్షాత్కరించుకొని సంసారమునకుఁ గారణ మైన యజ్ఞానరూపమృత్యువును నశింపఁజేయు చున్నాఁడు. మఱియు నాత్మసాక్షాత్కారము గల పురుషుఁడు శోకమును దరించుచున్నాఁడు. అనఁగా సంసారమునకుఁ గారణ మైన యజ్ఞానమును నశింపఁజేయు చున్నాఁడు. మఱియు బ్రహ్మసాక్షాత్కారము గల పురుషుఁడు బ్రహ్మరూపుఁడే యగుచున్నాఁడు. మఱియు నిసంప్రసాదనామజీవుఁడు విచారము వలన స్థూలసూక్ష్మశరీరాభిమానములను బరిత్యజించి "అహం బ్రహ్మాస్మి" యని పరబ్రహ్మమును దనయాత్మరూపముగాఁ దెలిసి యాపరబ్రహ్మరూపుఁడే యగుచున్నాఁడు. మఱియు నేయధికారి బ్రహ్మసాక్షాత్కారముచే బ్రహ్మరూపుఁ డగుచున్నాఁడో ఆయధికారి యుత్తముఁ డనియును బురుషుఁ డనియును జెప్పఁబడు చున్నాఁడు. అందు బ్రహ్మసాక్షాత్కారముచే నజ్ఞానరూపతమస్సును నివర్తించుకొనినవాఁ డుత్తముఁ డనఁబడును. మఱియు సర్వత్ర పూర్ణుఁ డగువాఁడు పురుషుఁ డనఁబడును. మఱియు నిత్యాపరోక్షరూపమును సర్వసాక్షిరూపము నైన పరమాత్మ నే నని యెప్పు డొకానొకపురుషుఁడు ప్రత్యగాత్మను సాక్షాత్కరించుకొనుచున్నాఁడో అప్పుడే యాజ్ఞానవంతుఁ డగుపురుషుఁడు దేనిని ఇచ్ఛించువాఁడై దేనికొఱకు శరీరాశ్రయముచేతఁ దాపము నొందును? అనఁగా, తాపము నొందఁడు. మఱియు నేబ్రహ్మము అపరిచ్ఛిన్నానందరూపమును ఏకమును బోధరూపము నై యున్నదో ఆబ్రహ్మము నేనను జ్ఞానము గలపురుషుఁడు కృతకృత్యుఁడే యగుచున్నాఁడు.

మఱియు నీయర్థము గీతయందు శ్రీకృష్ణభగవంతునిచేతను జెప్పఁబడి యున్నది. "ఏత ద్బుద్ధ్వా బుద్ధిమా న్స్యాత్ కృతకృత్యశ్చ భారత, జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ "—భావము॥ ఓయర్జునా! ఈబ్రహ్మాత్మతత్త్వమును "అహం బ్రహ్మాస్మి" యని సాక్షాత్కరించుటచే నీపురుషుఁడు బుద్ధిమంతుఁడును గృతకృత్యుఁడు నగుచున్నాఁడు. మఱియు జ్ఞానవంతుఁ డగుపురుషుఁడు పరమేశ్వరుఁ డగు నాయొక్క యాత్మరూపుఁడుగానే యున్నాఁడు.

మఱియు నుక్తార్థము శేషభగవంతునిచేతను జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. వృక్షాగ్రా చ్చ్యుతపాదో య ద్వద నిచ్ఛ న్నపి క్షితౌ పతతి। త ద్వద్గుణ పురు

షజ్ఞో ఽనిచ్ఛన్నపి కేవలీ భవతి "— భావము॥ ఎట్లు వృక్షముయొక్కయుపరిభాగ మునందుండి కాలుజాఱినపురుషుఁడు భూమియందుఁ బడుట కిచ్ఛింపక పోయినను భూమియం దవశ్యము పడుచున్నాఁడో అట్లాత్మసాక్షాత్కారము గలపురుషుఁడు మోక్షము నిచ్ఛింపక పోయినను అవశ్యము మోక్షమును బొందుచున్నాఁడు. ఇత్యాద్యనేకశ్రుతిస్మృతివచనములు బ్రహ్మసాక్షాత్కారమువలన నవిద్యానివృత్తియు బ్రహ్మభావరూపముక్తియొక్క ప్రాప్తియును జెప్పి యున్నవి. అందువలనఁ దత్త్వమస్యాది మహావాక్యవిచారమువలన నుత్పన్నమైన " అహం బ్రహ్మాస్మి " యను సాక్షాత్కారముచేత నీతత్త్వవేత్త యగు పురుషునకు నిత్యనిరతిశయాఖండైకరసానందబ్రహ్మభావరూపముక్తి ప్రాప్తమగుచున్న దనునది సిద్ధమైనది.

ఇది శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీస్వామ్యుద్ధవానందగిరిపూజ్య పాదశిష్య స్వామి చిద్ఘనానందగిరి విరచిత ప్రాకృత తత్త్వానుసంధానముయొక్కతృతీయపరిచ్ఛేదము సమాప్తము.

శ్రీకృష్ణార్పణమస్తు.



ఓమ్.

శ్రీగణేశాయ నమః.

శ్రీశంకరాచార్యేభ్యో నమః.

# తత్త్వానుసంధానము

## చతుర్థపరిచ్ఛేదము.

పూర్వము తృతీయపరిచ్ఛేదాంతమందు బ్రహ్మసాక్షాత్కారమువలన ముక్తియొక్కప్రాప్తి చెప్పఁబడినది. ఆముక్తి జీవన్ముక్తి విదేహముక్తి యను భేదముచేత ద్వివిధము. అందుఁ గొందఱు గ్రంథకారులు జీవన్ముక్తి నంగీకరించుట లేదు. మ ఱే మనఁగా, ఏకవిదేహముక్తినే యంగీకరించుచున్నారు. వారలయొక్కమతములను ఖండించుటకొఱకుఁ బ్రథమమున వారలయొక్కమతములు నిరూపింపఁబడుచున్నవి.

బ్రహ్మసాక్షాత్కారమువలన నీవిద్వాంసుఁడగుపురుషునకు నొకవిదేహముక్తియే కలుగుచున్నది. జీవన్ముక్తి కలుగుట లేదు. ఏల యన, జీవన్ముక్తియందుఁ బ్రమాణమును లక్షణమును సాధనమును అధికారియును ఫలరూపప్రయోజనము ననునివి యేవియు సంభవించుట లేదు. మఱియు లక్షణప్రమాణాదికములచేతనే వస్తుసిద్ధి యగుచున్నది. ఆలక్షణప్రమాణములు లేనందువలన, జీవన్ముక్తి నంగీకరించుట యోగ్యము గాదు.

### (1) జీవన్ముక్తియందు లక్షణప్రమాణాధికారిఫలాభావనిరూపణము.

ఇఁకఁ బ్రమాణాభావమువలన జీవన్ముక్త్యభావముయొక్కసిద్ధి చేయఁబడుచున్నది. ఆజీవన్ముక్తియందు శ్రుతిస్మృతివచనము లేవియుఁ బ్రమాణముగా లేవు.

శంక:—"విముక్తశ్చ విముచ్యతే, స జీవన్ముక్త ఉచ్యతే, స్థితప్రజ్ఞస్తదోచ్యతే" ఇత్యాది శ్రుతిస్మృతివచనములే యాజీవన్ముక్తియందుఁ బ్రమాణములై యున్నవి. అందువలన జీవన్ముక్తియందుఁ బ్రమాణాభావకథన మసంగతమై యున్నది.

సమాధానము:—ఆశ్రుతిస్మృతివచనములకు బ్రహ్మవిద్యయొక్కస్తుతిచేత బ్రహ్మమందే తాత్పర్య మున్నది. జీవన్ముక్తియందుఁ దాత్పర్యము లేదు. అందువలన నావచనములచేత జీవన్ముక్తియొక్కసిద్ధి గానేరదు.

ఇఁక లక్షణాభావమువలన జీవన్ముక్త్యభావముయొక్కసిద్ధి చేయఁబడుచున్నది. అచ్చట, అజ్ఞాననివృత్తి జీవన్ముక్తి యనుచున్నారా? లేక బ్రహ్మాభావము జీవన్ముక్తి యనుచున్నారా? లేక జీవితావస్థయందుఁ గర్తృత్వభోక్తృత్వాదిరూపబంధనివృత్తి జీవన్ముక్తి యనుచున్నారా? అందుఁ బ్రథమద్వితీయలక్షణము లంగీకరించినచో నవి సంభవింపవు. ఏల యన, విదేహముక్తియందును అజ్ఞాననివృత్తియు బ్రహ్మాభావమును విద్యమానములై యున్నవి. అందువలన నావిదేహముక్తియం దా ద్వివిధలక్షణముల కతివ్యాప్తి యగును. అతివ్యాప్తిదోషసహితలక్షణము స్వలక్ష్యముయొక్కసిద్ధిఁ జేయనేరదు. కావునఁ బ్రథమద్వితీయలక్షణములచేత నాజీవన్ముక్తియొక్కసిద్ధి గానేరదు. మఱియుఁ దృతీయలక్షణ మంగీకరించినచో నదియును సంభవింపదు. ఏల యన జీవితావస్థయందు భోగము నిచ్చునట్టి ప్రారబ్ధకర్మము విద్యమానమై యుండఁగా గర్తృత్వాదిబంధనివృత్తి సంభవించుట లేదు. కావున నాతృతీయలక్షణముగూడ నసంభవదోషయుక్త మగుటవలన జీవన్ముక్తియొక్కసిద్ధిని జేయనేరదు.

లేక, జీవితావస్థయం దాకర్తృత్వాదిబంధములు సాక్షిచైతన్యమునందుండి నివృత్తము లగుచున్నవా? లేక, అహంకారమునందుండి నివృత్తము లగుచున్నవా? అందుఁ బ్రథమపక్ష మంగీకరించినయెడల నది సంభవింపదు. ఏల యన సాక్షిచైతన్యమునందు వాస్తవముగా నైననో బంధము లేదు. మ ఱే మనఁగా, అంతఃకరణముయొక్కతాదాత్మ్యాధ్యాసమువలన బంధము ప్రతీత మగుచున్నది. ఎప్పుడాత్మసాక్షాత్కారముచేత నాతాదాత్మ్యాధ్యాసము నివృత్త మగుచున్నదో అప్పుడారోపితబంధమును నివృత్త మగుచున్నది. అందువలన నాసాక్షియం దుండి బంధనివృత్తి చేయుటకొఱకు జీవన్ముక్తిసంపాదనము వ్యర్థమే యగును. మఱియు ద్వితీయపక్ష మంగీకరించినయెడల నదియును సంభవింపదు. ఏల యన, భోగము నిచ్చునట్టి ప్రారబ్ధకర్మము విద్యమానమై యుండఁగా నహంకారమునందు స్వాభావికముగా నుండు బంధముయొక్కనివృత్తి సంభవింపదు. ఇచ్చట సారాంశ మే మనఁగా, ఏ ధర్మి కేది స్వాభావికధర్మమై యున్నదో ఆస్వాభావికధర్మ మాధర్మి యుండఁగా నివృత్త మగుట లేదు. ఎట్లగ్ని కుష్ణత్వధర్మమును జలమునకు ద్రవత్వధర్మమును ఆయగ్నిజలరూపధర్ము లుండఁగా నివృత్తము లగుట లేదో అట్లహంకారముయొక్కస్వాభావికధర్మము లైన కర్తృత్వాదిబంధములును అహంకారరూపధర్మి యుండఁగా నివృత్తము లగుట లేదు.

శంక:—అహంకారగతకర్తృత్వాదిబంధమునకు యద్యపి స్వరూపము.

చేత నాశము కలుగుట లేదు. తథాపి యోగాభ్యాసముచేత నాబంధమున కభిభవము కలుగుచున్నది.

సమాధానము:—ఎట్లాత్మజ్ఞానముకంటె నాప్రారబ్ధకర్మము ప్రబల మగుచున్నదో అట్లు యోగాభ్యాసముకంటెను ఆప్రారబ్ధకర్మము ప్రబల మగుచున్నది. మఱియుఁ బ్రారబ్ధకర్మముయొక్క భోగము కర్తృత్వాద్యభిమానము లేక సంభవింపదు. అందువలన నాప్రబలప్రారబ్ధకర్మ ముండఁగా నాయోగాభ్యాసము కర్తృత్వాదిబంధముల యభిభవముఁ జేయుట లేదు. అందువలన జీవితావస్థయందుఁ గర్తృత్వాదిబంధనివృత్తి జీవన్ముక్తియై యున్న దను జీవన్ముక్తియొక్క లక్షణము సంభవింపదు.

ఇఁక సాధనాభావమువలన జీవన్ముక్త్యభావముయొక్క సిద్ధి చేయఁబడుచున్నది. అందు జీవన్ముక్తి నంగీకరించువాది నడుగవలసిన దే మనఁగా, జీవన్ముక్తి కాత్మజ్ఞానము సాధనమై యున్నదా? లేక యోగము సాధనమై యున్నదా? అందుఁ బ్రథమపక్ష మంగీకరించినచో నది సంభవించుట లేదు. ఏల యన నాయాత్మజ్ఞానము విదేహముక్తికే సాధనమై యున్నది గాని జీవన్ముక్తికి సాధనము గాదు. మఱియు "జ్ఞానా దేవతు కైవల్యమ్" ఇత్యాదిశ్రుతు లాత్మజ్ఞానముచేత ముక్తియొక్క ప్రాప్తి చెప్పుచున్నవి. జీవన్ముక్తియొక్క ప్రాప్తి నేదియుఁ జెప్పియుండ లేదు. కావున నాత్మజ్ఞానము విదేహముక్తికే సాధనమై యున్నది. ఈలాగుననే ద్వితీయపక్షము గూడ సంభవించుట లేదు. ఏల యన, ఎట్లు శ్రవణాదిక మాత్మజ్ఞానమునకు సాధనమై యున్నదో అట్లు యోగముగూడ నాత్మజ్ఞానమునకే సాధనమై యున్నది. అందువలన యోగమునకును జీవన్ముక్తియొక్క సాధనత్వము సంభవింపదు.

ఇఁక నధికార్యభావమువలన జీవన్ముక్త్యభావముయొక్క సిద్ధి చేయఁబడుచున్నది. అచ్చట జీవన్ముక్తియందు ముముక్షువుల కైననో నధికారిత్వము సంభవింపదు. ఇఁక నే మనఁగా జ్ఞానవంతులకే యాజీవన్ముక్తియం దధికారము చెప్పవలయును. అదియును సంభవింపదు. ఏల యన "జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః। నైవాస్తి కించిత్కర్తవ్య మస్తి చేన్న స తత్త్వవిత్॥ తస్య కార్యం నవిద్యతే" ఇత్యాది వచనములచేత జ్ఞానవంతునకుఁ గర్తవ్యనిషేధము చేయఁబడి యున్నది. జ్ఞానవంతుని జీవన్ముక్తి కధికారి యని యంగీకరించినయెడల నాజ్ఞానవంతునకు జీవన్ముక్తిసాధనము లవశ్యము కర్తవ్యములుగా నేర్పడును. దానిచేత నుక్తవచనములకు విరోధము కలుగును. మఱియు దేహాభిమానము గలవాఁడే కర్త యగుచున్నాఁడు. జ్ఞానవంతుఁ డగు పురుషుఁడు దేహాభిమానరహితుఁ డగుటవలనఁ గర్త

వ్వరహితుఁ డగుచున్నాఁడు. కర్తృత్వము లేనందుచే జ్ఞానవంతునకు జీవన్ముక్తి సాధనములయందుఁ బ్రవృత్తి సంభవించుట లేదు. అందువలన జ్ఞానవంతుం డగు పురుషున కాజీవన్ముక్తియం దధికారము సంభవింపదు. మఱియు నధికారము లేక జీవన్ముక్తిసాధనములయొక్క యభ్యాసముగూడ సంభవింపదు.

ఇఁక ఫలరూపప్రయోజనాభావమువలన జీవన్ముక్త్యభావముయొక్క సిద్ధి చేయఁబడుచున్నది. అచ్చట జీవన్ముక్తి నంగీకరించువాది నడుగవలసిన దేమనఁగా, జీవన్ముక్తికిఁ బ్రయోజన మేమి? అనఁగాఁ బ్రయోజనము లేక మందపురుషులకును బ్రవృత్తి కలుగ దనునప్పుడు బుద్ధిమంతు లగు పురుషులకుఁ బ్రయోజనము లేక యెట్లు ప్రవృత్తి కలుగును? అందువలన జీవన్ముక్తిసంపాదనమునందుఁ బురుషునియొక్క ప్రవృత్తి కొఱకు జీవన్ముక్తి కొకప్రయోజన మవశ్యము చెప్పవలయును. అందు, ఉత్పన్నమైన యాత్మజ్ఞానముయొక్క రక్షణ మాజీవన్ముక్తికిఁ బ్రయోజనమై యున్నదా? లేక, దుఃఖనాశము ప్రయోజనమై యున్నదా? లేక, స్వరూపసుఖావిర్భావము ప్రయోజనమై యున్నదా? అందుఁ బ్రథమపక్ష మంగీకరించినయెడల నది సంభవింపదు. ఏల యన, తత్త్వమస్యాదిప్రమాణములచేత జన్యమైనదియు అజ్ఞాననివృత్తి చేయుట యందు సామర్థ్యము గలదియు నైన యేయాత్మజ్ఞాన మున్నదో ఆయాత్మజ్ఞానమున కేదియు బాధక మగుట లేదు. బాధక ముండిననే గదా రక్షణము కావలయును. అందువలన జ్ఞానముయొక్క రక్షణమే నిరూపించుటకు సాధ్యము గాదు. ఈరీతిగానే దుఃఖనాశమును సుఖావిర్భావము ననునీరెండును ఆజీవన్ముక్తికిఁ బ్రయోజనములు గావు. ఏకారణముచేత ననఁగా, ఆరెండును ఆత్మజ్ఞానముచేతనే ప్రాప్తము లగుచున్నవి. మఱియు నేవస్తు వేసాధనముచేతఁ బ్రాప్త మగుచున్నదో ఆవస్తు వాసాధనముయొక్క ఫలమే యగుచున్నది. అన్యసాధనముయొక్క ఫల మగుట లేదు. కావున దుఃఖనాశమును సుఖావిర్భావము నను నీరెండును ఆత్మజ్ఞానమునకే ఫలములై యున్నవి, జీవన్ముక్తియొక్క ఫలములు గావు.

ఈప్రకారముగాఁ బ్రమాణము స్వరూపలక్షణము సాధనము అధికారి ప్రయోజనము నను నీదైదును లేనందువలన జీవన్ముక్త్యంగీకారము నిరర్థకమే యగుచున్నది. కావున నాత్మజ్ఞానముచేత విదేహముక్తి యొకటియే కలుగుచున్నది. జీవన్ముక్తి కలుగుట లేదు.

ఈరీతిగాఁ గొంద ఱాచార్యులు జీవన్ముక్తిని ఖండించి విదేహముక్తి నొకటినే యంగీకరించుచున్నారు. వారియొక్క మతములను ఖండించుటకొఱ కిఁక నాముక్తియొక్క విభాగము చెప్పఁబడుచున్నది.

[*] (2) ముక్తియొక్క విభాగము. [*]

పూర్వోక్తముక్తి ద్విప్రకారమగుచున్నది. ఒకటి విదేహముక్తి, మఱియొకటి జీవన్ముక్తి. యద్యపి జీవన్ముక్త్యనంతరము విదేహముక్తి కలుగుచున్నది. అందువలనఁ బ్రథమమున జీవన్ముక్తియే నిరూపించుట యుచితమై యున్నది. తథాపి, ఆజీవన్ముక్తి వివాదములచే గ్రస్తమై యున్నందున దానియొక్కనిరూపణ మతివిస్తరమై యున్నది. విదేహముక్తియం దేవివాదమును లేదు. అందువలన దానియొక్కనిరూపణము కొంచెమైనందున సూచీకటాహన్యాయముచేతఁ బ్రథమమున విదేహముక్తియొక్కనిరూపణము చేయఁబడుచున్నది.

[*] (3) విదేహముక్తినిరూపణము. [*]

“అహం బ్రహ్మాస్మి” యను తత్త్వజ్ఞానము గల పురుషునకు భోగముచేఁ బ్రారబ్ధకర్మము నశింపఁగా వర్తమానశరీరముయొక్కనాశ మేది గలదో అది విదేహముక్తి యనఁబడును. ఈవిదేహముక్తి శ్రీవ్యాసభగవంతునిచేతను బ్రహ్మసూత్రమందుఁ జెప్పఁబడి యున్నది. అందు సూత్రము.— “భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే” — భావము॥ జ్ఞానవంతుఁ డగుపురుషుఁడు సుఖదుఃఖానుభవరూపభోగము వలనఁ బుణ్యపాపరూపప్రారబ్ధకర్మము నష్టము కాఁగా శరీరనాశానంతర మఖండైకరసానందబ్రహ్మాత్మరూపముచే స్థితుఁ డగుచున్నాఁడు. మరల వానికి జన్మము ప్రాప్తమగుట లేదు. ఏల యన, ఆజ్ఞానవంతుఁ డగుపురుషున కాత్మజ్ఞానముచే నజ్ఞానమును సంచితకర్మమును నష్టము లైనవి. మఱియు నాత్మజ్ఞానముయొక్కప్రభావముచే నాజ్ఞానవంతుఁ డగుపురుషుని ఆగామిపుణ్యపాపకర్మములు స్పృశించుటయే లేదు. మఱియుఁ బ్రతిబంధకరూపప్రారబ్ధకర్మము భోగముచే నష్టమైనయనంతరము వాసనాసహితవిక్షేపశక్తితోఁ గూడిన యజ్ఞానముగూడ నష్టమగుచున్నది. అందువలన జన్మమును బ్రాప్తింపఁజేయునట్టి సంచితకర్మాదికారణములు లేనందున నాజ్ఞానవంతుఁ డగుపురుషునకు మరల జన్మము ప్రాప్తమగుట లేదు. ఇఁక నే మనఁగా నీవర్తమానశరీరనాశానంతర మాపురుషుఁడు నిర్విశేషబ్రహ్మరూపుఁడే యగుచున్నాఁడు.

ఉక్తవిదేహముక్తియొక్కస్వరూపము. “తస్య తావ దేవ చిరం యావన్న విమోక్ష్యే ఽథ సంపత్స్యే” అను శ్రుతిచేతను జెప్పఁబడి యున్నది. అందువలన నావిదేహముక్తి శ్రుతిసూత్రప్రమాణములచేత సిద్ధమగుచున్నది.

శంక:—ఏపురుషున కనేకజన్మములను బ్రాప్తింపఁజేయునట్టి ప్రారబ్ధకర్మము విద్యమానమై యున్నదో ఆపురుషునకుఁ బ్రథమజన్మమునం దాత్మజ్ఞాన

ముత్పన్నము కాఁగా రెండవజన్మము కలుగుచున్నదా? లేక లేదా? అందుఁ బ్రథమపక్ష మంగీకరించినచో జ్ఞానమునకుఁ బాక్షికత్వము కలుగును. అనఁగా ఆత్మ జ్ఞానమునకు నియమముగా జన్మనివృత్తిహేతుత్వము లేకపోవును. ద్వితీయపక్ష మంగీకరించినయెడల "నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి" అను వచనమునకు విరోధము ప్రాప్త మగును.

సమాధానము:—ఈశంకకుఁ గొందఱు గ్రంథకారులసమాధాన మేమన, "యావ దధికార మవస్థితి రాధికారికాణామ్" అను సూత్రమునందు శ్రీ వ్యాసభగవంతునిచేతను శ్రీభాష్యకారులచేతను ఈయర్థము నిరూపింపఁబడి యున్నది. సృష్ట్యాదికాలమునందు జగద్వ్యవహారము నడచుటకొఱకుఁ బరమేశ్వరునిచే స్థాపింపఁబడిన దేవతాదు లగు నేయధికారిపురుషు లున్నారో ఆయధికారిపురుషుల కెంత కాలపర్యంత మాయధికార మున్నదో అంతకాలపర్యంతము వారలకు స్థితి యున్నది. మధ్యమం దేదైన నొకశాపానుగ్రహవశమువలన నాయధికారిపురుషులకు జన్మాంతర ప్రాప్తి యైనను ఆత్మజ్ఞానమునకు బాధ కలుగుట లేదు. అట్లే యధికారముయొక్క సమాప్తికాలమందు వారలకు మోక్షమును అవశ్యము కలుగుచున్నది. ఈప్రకారముగా నేపురుషునకుఁ బ్రారబ్ధకర్మ మనేకజన్మముల నిచ్చుచున్నదో ఆపురుషునకుఁ బ్రథమజన్మమునందుఁ దత్త్వమస్యాది మహావాక్యప్రమాణబలమువలన నాత్మసాక్షాత్కార ముత్పన్న మైన యనంతరము ప్రబల మగు ప్రారబ్ధకర్మవశమువలన జన్మాంతరప్రాప్తి యైనను జ్ఞానమునకు బాధ కలుగుట లేదు. ఏకారణముచేత ననఁగా, నా ప్రారబ్ధకర్మముయొక్క ఫల మాత్మజ్ఞానమునకు విరోధి యగుట లేదు. ఒకవేళ నా ప్రారబ్ధకర్మముయొక్క ఫల మాత్మజ్ఞానమునకు విరోధి యైనయెడల, దేవతాద్యధికారి పురుషులయొక్క యాత్మజ్ఞానమునకును ఆప్రారబ్ధకర్మముయొక్క ఫలముచేత బాధ కావలయును. మఱియు నాపురుషున కాత్మసాక్షాత్కారమువలన బ్రహ్మభావరూప మోక్షమును అవశ్యము ప్రాప్త మగుచున్నది. అందువలన నాత్మజ్ఞానమునకుఁ బాక్షికత్వమును గలుగుట లేదు. అట్లే "నాభుక్తం క్షీయతే కర్మ" అనువచనమునకును విరోధము కలుగదు.

మఱియుఁ గొందఱు గ్రంథకారు లైననో యుక్తశంక కీసమాధానము చెప్పుచున్నారు. "యస్తు విజ్ఞానవాన్ భవ త్యమనస్కః సదా శుచిః। స తు తత్పద మాప్నోతి యస్మాద్భూయో నజాయతే, యఏవం వేత్తి పురుషం ప్రకృతించ గుణైః సహ। సర్వథా వర్తమానోఽపి న స భూయో ఽభిజాయతే" ఇత్యాదిశ్రుతి స్మృతులచేత జ్ఞానవంతు లగు పురుషులకు జన్మము నిషేధింపఁబడి యున్నది. అందు

వలన నేపురుషున కాప్రారబ్ధకర్మ మనేకజన్మములకు హేతు వగుచున్నదో ఆపురుషు నకుఁ బ్రథమజన్మమందు శ్రవణాదికమువలన నాత్మజ్ఞానము కలుగుట లేదు. ఇఁక నే మనఁగా, అంత్యజన్మమునందే యాయాత్మజ్ఞానము కలుగుచున్నది. ఈయర్థము శ్రీవసిష్ఠభగవానులచేతను జెప్పఁబడి యున్నది. అందు శ్లోకము "యస్యేదం జన్మ పాశ్చాత్యం తమాశ్వేవ మహామతే। విశంతి విద్యా విమలా ముక్తా వేణు మివో త్తమమ్"—భావము॥ మహామతిమంతుఁడ వగు నో రామా! ఏపురుషున కిది యంత్య జన్మమై యున్నదో ఆపురుషునియందే యీనిర్మల మగు బ్రహ్మవిద్య ప్రవేశించు చున్నది. ఉదా—ఉత్తమజాతి గల వేణువునందు మౌక్తికములు ప్రవేశించుచున్నవి. అందువలనఁ బూర్వోక్తద్వివిధపక్షములందు భోగముచేతఁ బ్రారబ్ధకర్మము నష్టము కాఁగా దేహము పడుటచేత నాజ్ఞానవంతుఁ డగుపురుషుఁడు బ్రహ్మాత్మరూపముచే స్థితుఁ డగుచున్నాఁ డను నర్థము సిద్ధ మైనది.

మఱియుఁ గొందఱు గ్రంథకారు లైననో యీవిదేహముక్తి కీస్వరూ పము చెప్పుచున్నారు. భావిశరీరముయొక్క యనారంభకత్వ మేది గలదో అది విదేహముక్తి యనఁబడును. ఆవిదేహముక్తి జ్ఞానోత్పత్తికి సమకాలమే యగుచున్నది. అనఁగా, ఈపురుషున కేకాలమునం దాత్మజ్ఞానము కలుగుచున్నదో ఆకాలమునందే యీవిదేహముక్తి కలుగుచున్నది. ఎట్లన, ఆత్మజ్ఞానముచేత నజ్ఞానమునకు నివృత్తి కలుగఁగా సంచితకర్మమునకును నాశము కలుగుచున్నది. మఱియు నాసంచితకర్మమే భావిశరీరమున కారంభక మగుచున్నది. అందువలన నీపురుషున కాత్మజ్ఞానోత్పత్తి కాలమునందు భావిశరీరముయొక్క యనారంభకత్వరూప మగు విదేహముక్తి సంభ వించుచున్నది.

ఈయర్థ మన్యగ్రంథములయందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. తీర్థే శ్వపచగృహే వా నష్టస్మృతి రపి త్యజ న్దేహమ్। జ్ఞానసమకాలముక్తః కైవ ల్యం యాతి హతశోకః"—భావము॥ శ్రీకాశి మొదలగు తీర్థములయందుఁ గాని చండాలగృహమునందుఁ గాని శరీరమును బరిత్యజించినను సన్నిపాతాదిదోషముల యొక్క వశమువలన బ్రహ్మాత్మస్మృతిరహితుఁ డైనను జ్ఞానవంతుఁ డగుపురుషుఁడు కైవల్యమోక్షమునే పొందుచున్నాఁడు. ఏకారణముచేత ననఁగా, ఆతత్త్వవేత్త యగుపురుషుఁ డాత్మజ్ఞానముయొక్క సమకాలమునందే ముక్తుఁడును సర్వశోకరహి తుఁడు నగుచున్నాఁడు. ఇంతపర్యంతము విదేహముక్తి నిరూపింపఁబడినది.

[*] (4) జీవన్ముక్తినిరూపణము. [*]

ఇఁక జీవన్ముక్తి నిరూపింపఁబడుచున్నది. అందుఁ బ్రథమమున జీవన్ముక్తి

యొక్క లక్షణము చెప్పఁబడుచున్నది. శ్రవణాదులచే నుత్పన్నమైన బ్రహ్మసాక్షాత్కారము గల విద్వత్సన్న్యాసికి జీవితావస్థయందుఁ గర్తృత్వభోక్తృత్వాదిరూప సర్వబంధప్రతీతియొక్క నివృత్తి యేది గలదో యది జీవన్ముక్తి యనఁబడును.

శంక:—ఈజీవన్ముక్తిలక్షణము ఘటిల్లదు. ఏల యన, భోగము నిచ్చునట్టి ప్రారబ్ధకర్మము విద్యమాన మగుచుండఁగా జ్ఞానవంతుఁ డగుపురుషునకును గర్తృత్వాదిబంధప్రతీతి యవశ్యముగాఁ గలుగును. ఏకారణముచేత ననఁగా, కర్తృత్వభోక్తృత్వబుద్ధి లేక ప్రారబ్ధకర్మముయొక్క ఫలభోగము సంభవించుట లేదు. యద్యపి కర్తృత్వాదిబంధనివృత్తి సాక్షాత్కారముయొక్క జ్ఞానముచేతనే యగుచున్నది. తథాపి జలగతద్రవత్వధర్మమువలెను అగ్నిగతోష్ణత్వధర్మమువలెను అంతఃకరణముయొక్క స్వాభావికధర్మము లైన యాకర్తృత్వాదిబంధము లంతఃకరణమునుండి నివృత్తము లగుట కశక్యమై యున్నది. అందువలనఁ గర్తృత్వాదిసర్వబంధప్రతీతియొక్క నివృత్తి జీవన్ముక్తియై యున్న దను నీలక్షణము సంభవించుట లేదు.

సమాధానము:—ఎట్లు తత్త్వజ్ఞానముకంటెఁ బ్రారబ్ధకర్మము ప్రబలమై యున్నదో అట్లు ప్రారబ్ధకర్మముకంటెను యోగాభ్యాసము ప్రబలమై యున్నది. అందువలన యోగాభ్యాసముచేత యద్యపి ప్రారబ్ధభోగమున కనుకూల మైన కర్తృత్వాదిబంధప్రతీతి కాత్యంతికనివృత్తి కలుగుట లేదు. తథాపి యోగాభ్యాసముచేతఁ గర్తృత్వాదిబంధప్రతీతి కభిభవ మవశ్యము కలుగుచున్నది. అందువలనఁ బూర్వోక్తజీవన్ముక్తిలక్షణము సంభవించుచున్నది. ఒకవేళఁ బ్రారబ్ధకర్మముకంటె యోగాభ్యాసము ప్రబలము కా దనినయెడలఁ బురుషప్రయత్నమే వ్యర్థ మగును. పురుషప్రయత్నము వ్యర్థ మైనయెడలఁ జికిత్సాశాస్త్రము మొదలు మోక్షశాస్త్రపర్యంతము గల సర్వశాస్త్రములయొక్క యారంభము నిష్ఫల మగును.

శంక:— యోగాభ్యాసముచేతఁ బ్రారబ్ధకర్మమునకుఁ బ్రతిబంధము కలుగు నని యంగీకరించినయెడల "నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి" అనువచనమునకు విరోధ మగును.

సమాధానము:—ప్రారబ్ధకర్మమునకు విరోధి యైన యోగాభ్యాసాదికము లేనప్పుడే పూర్వోక్తవచనము సార్థక మగును. అనఁగా, ఏప్రారబ్ధకర్మమునకు యోగాభ్యాసాదిప్రతిబంధము లేవియును లేవో ఆప్రారబ్ధకర్మము భోగము లేక [illegible] మగుట లేదు. ఒకవేళ నేయుపాయముచేతను ఆప్రారబ్ధకర్మమునకుఁ బ్రతిబం[illegible] కలుగ [illegible]నినయెడలఁ బ్రారబ్ధకర్మమునం దత్యంతభక్తి గలవాదులకును శాస్త్రవచనములకును విరోధము కలుగును. ఆవచనము లేవి యనఁగా "శ్లో. జన్మాం

తరకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే। తచ్ఛాంతి రౌషధై ర్దానై ర్జపహోమార్చనాదిభిః”—భావము॥ ఈపురుషునిచేతఁ బూర్వజన్మమునందుఁ జేయఁబడిన యేపాపకర్మము లున్నవో ఆపాపకర్మము లీపురుషున కీజన్మమందు జ్వరాదివ్యాధిరూపముచేత దుఃఖమును బ్రాప్తింపఁజేయుచున్నవి. వానియొక్క శాంతి యౌషధములచేతను దానములచేతను జపహోమార్చనాదులచేతను నగుచున్నది. ఇత్యాదివచనములచేతఁ బ్రారబ్ధపాపకర్మములయొక్క శాంతికొఱకు నౌషధాద్యుపాయములు చెప్పఁబడియున్నవి. ఆసర్వవచనములకు విరోధ మగును. అందువలన యోగాభ్యాసముచేతఁ బ్రారబ్ధకర్మమున కభిభవము సంభవించుచున్నది.

మఱియుఁ బ్రారబ్ధకర్మాపేక్షచేత యోగాభ్యాసాదిశాస్త్రీయప్రయత్నములకుఁ బ్రబలత వసిష్ఠభగవానులును వక్కాణించి యున్నారు. అందు “శ్లో. ఆ బాల్యా దల మభ్యస్తైః శాస్త్రసత్సంగమాదిభిః। గుణైః పురుషయత్నేన సో ఽర్థః సంప్రాప్యతే హితః”—భావము॥ పురుషప్రయత్నము ద్వివిధము, ఒకటి అశాస్త్రీయము మఱియొకటి శాస్త్రీయము, అందు శ్రుతిస్మృతిరూపశాస్త్రములచేత నిషేధింపఁబడిన యేప్రయత్న మున్నదో అది యశాస్త్రీయప్రయత్న మనఁబడును. ఉదా—చౌర్యహింసాదికప్రయత్నములై యున్నవి. మఱియు శ్రుతిస్మృతిరూపశాస్త్రములచేత విధింపఁబడిన యేప్రయత్న మున్నదో అది శాస్త్రీయప్రయత్న మనఁబడును. ఉదా—యజ్ఞదానాదికప్రయత్నములై యున్నవి. అం దీపురుషుఁ డశాస్త్రీయపురుషప్రయత్నముచేత నరకమునే పొందుచున్నాఁడు. మఱియు బాల్యావస్థమొదలు లభ్యసింపఁబడిన యధ్యాత్మశాస్త్రసత్సమాగమశాంతిదాంత్యాదు లగు నేగుణము లున్నవో ఆగుణములతోఁ గూడిన ద్వితీయ మగు శాస్త్రీయపురుషప్రయత్నముచేత నీపురుషుఁడు మోక్షరూపపరమపురుషార్థమును బొందుచున్నాఁడు.

ఈయర్థమునే “ఉచ్ఛాస్త్రం శాస్త్రితం చేతి పౌరుషం ద్వివిధం స్మృతమ్। తత్రోచ్ఛాస్త్ర మనర్థాయ పరమార్థాయ శాస్త్రితమ్” అను శ్లోకముచేతను జెప్పఁబడి యున్నది. అందువలన యోగాభ్యాసరూపశాస్త్రీయప్రయత్నముచేత నాప్రారబ్ధకర్మమున కభిభవము సంభవించుచున్నది. కావునఁ బూర్వోక్తకర్తృత్వాదిబంధప్రతీతినివృత్తిరూపజీవన్ముక్తిలక్షణము నిర్దోషమై యున్నది.

[*] (5) జీవన్ముక్తియొక్కయధికారినిరూపణము. [*]

ఇఁక జీవన్ముక్త్యధికారినిరూపణము చేయఁబడుచున్నది. అంగు శ్రవణాదులచే నుత్పన్న మైన బ్రహ్మసాక్షాత్కారము గలవాఁడును జిత్తవిశ్రాంతియందుఁ

గోరిక గలవాఁడు నైనట్టి యేవిద్వత్సన్న్యాసి యున్నాఁడో వాఁడే జీవన్ముక్తి కధికారి యగుచున్నాఁడు. అనఁగా జీవన్ముక్తిని బొందుటకొఱకుఁ దత్సాధన మైన మనోనాశ వాసనాక్షయములను జేయువాఁ డని తెలియవలయును.

శంక:—బ్రహ్మసాక్షాత్కారముచేత నివర్తింపఁబడినయజ్ఞానమును దేహాభిమానమును గలవాఁ డగునేవిద్వత్సన్న్యాసి యున్నాఁడో వాని కేకార్యమునందును గర్తృత్వమే సంభవింపదు. కర్తృత్వము లేక యావిద్వత్సన్న్యాసికి జీవన్ముక్తి యొక్కయధికారిత్వ మెట్లు సంభవించును? అనఁగా సంభవింపదు.

సమాధానము:—ఆత్మజ్ఞానముచేత నావరణశక్తిసహితాజ్ఞానము నష్ట మైనను బ్రారబ్ధకర్మవశమువలన విక్షేపశక్తిసహితాజ్ఞానలేశమునకు స్థితి సర్వగ్రంథకారులచే నంగీకరింపఁబడి యున్నది. ఈవిషయము తృతీయపరిచ్ఛేదమునందు విస్తరముగాఁ జెప్పఁబడి యున్నది. అందువలన నావిద్వాంసునకును బాధితానువృత్తిచేత దేహాభిమానమును గర్తృత్వమును సంభవించుచున్నది. దానిచేత నావిద్వాంసునకు జీవన్ముక్త్యధికారిత్వము సంభవించుచున్నది.

శంక:—“జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః । నైవాస్తి కించిత్కర్తవ్య మస్తి చే న్న స తత్త్వవిత్, తస్య కార్యం న విద్యతే” ఇత్యాది పూర్వోక్తస్మృతివచనములవలనఁ గృతకృత్యుఁ డగు జ్ఞానవంతునకు సర్వకర్తవ్యతానిషేధము చేయఁబడి యున్నది. ఎప్పుడు జ్ఞానవంతునకును జీవన్ముక్తికొఱకు మనోనాశవాసనాక్షయరూపసాధనములయొక్క కర్తవ్యత్వ మంగీకరింపఁబడు చున్నదో, అప్పుడావచనములకు విరోధము ప్రాప్త మగును.

సమాధానము:—జ్ఞానవంతులు ద్విప్రకారు లగుచున్నారు. ఒకఁడు కృతోపాస్తి, మఱియొకఁ డకృతోపాస్తి. అం దేపురుషునిచేత నాత్మసాక్షాత్కారమునకుఁ బూర్వము సగుణబ్రహ్మసాక్షాత్కారపర్యంత ముపాసన చేయఁబడినదో అట్టి జ్ఞానవంతుఁ డగుపురుషుఁడు కృతోపాస్తి యనఁబడుచున్నాఁడు. ఎవనిచేత నాయుపాసన చేయఁబడలేదో, ఆజ్ఞానవంతుఁ డకృతోపాస్తి యనఁబడుచున్నాఁడు. అందుఁ గృతోపాస్తి జ్ఞానవంతున కైనను జ్ఞానోత్తరము జీవన్ముక్తికొఱకుఁ గించిన్మాత్రమును గర్తవ్యము కలుగుట లేదు. ఏకారణముచేత ననఁగాఁ గృతోపాస్తి యగు జ్ఞానికి మనోనాశమును వాసనాక్షయమును బూర్వమే సిద్ధించి యున్నది. అందువలన నాత్మజ్ఞానప్రాప్తికాలమునందే యాకృతోపాస్తిపురుషుఁడు జీవన్ముక్తిని బొందుచున్నాఁడు. మఱియు జ్ఞానవంతునిగుఱించి కర్తవ్యమును నిషేధించి యుండు శ్రుతి

స్మృతివచనములు పూర్వము చెప్పఁబడి యున్నవి. ఆవచనములును ఈకృతోపాస్తి జ్ఞానవంతునిగుఱించియే సర్వకర్తవ్యములు నిషేధించి యున్నవి. మఱియు లౌకిక వైదికవ్యాపారములచేతఁ జిత్తవిశ్రాంతిరహితు లగు నేయకృతోపాస్తిజ్ఞానవంతు లున్నారో వారికి జ్ఞానోత్తరము జీవన్ముక్తికొఱకు మనోనాశవాసనాక్షయములయొక్క కర్తవ్యత్వ ముండుటవలన నిరంకుశకృతకృత్యత్వము లేదు. అందువలన నకృతోపాస్తిజ్ఞానవంతునకు జీవన్ముక్తికొఱకు మనోనాశవాసనాక్షయము లవశ్యకర్తవ్యము లై యున్నవి.

శంక:—అట్టి చిత్తవిశ్రాంతిరహితు లగు నకృతోపాస్తిపురుషుల కాత్మజ్ఞానమే కలుగక పోవలయును.

సమాధానము:—జ్ఞానమో ప్రమాణము వస్తువు అను నీరెంటియొక్క యధీనమై యున్నది. అందువలన సర్వులకు సాధారణమై యున్నది. ఎట్లు ఘటాది వస్తువులతోఁ జక్షురాదిప్రమాణములకు సంబంధము కలుగఁగా సర్వలోకులకు "అయం ఘటః" అను జ్ఞానము సమానముగాఁ గలుగుచున్నదో అట్లు తత్త్వమస్యాది మహావాక్యశ్రవణమువలన "అహం బ్రహ్మాస్మి" యను జ్ఞానము కృతోపాస్తులు గాని యకృతోపాస్తులు గాని సర్వాధికారులకును సమానమే యగుచున్నది. ఒకవేళ నట్లంగీకరింపనియెడల యాజ్ఞవల్క్యకహోలజనకాజాతశత్రువులు మొదలగు గృహస్థుల కాత్మజ్ఞానము లేక పోవలయును. ఈయర్థమం దిష్ట ముండినయెడల నా యాజ్ఞవల్క్యాదులయొక్క దృష్టాంతముచేత నస్మదాదిపురుషులయం దొకపురుషునకును శ్రవణాదిజ్ఞానసాధనములయందుఁ బ్రవృత్తి కలుగక పోవలయును. అనఁగా యాజ్ఞవల్క్యాదిమహాత్ము లగు పురుషులకే శ్రవణాదులచేత నాత్మజ్ఞానము కలుగదనునప్పు డస్మదాదులకు జ్ఞానోత్పత్తి యెట్లు గలుగును? అను నసంభావనచేత నే పురుషునకును శ్రవణాదులయందుఁ బ్రవృత్తి కలుగని దగును. ఇందువలన సిద్ధించిన దేమనఁగా, శ్రవణాదులచేత నుత్పన్న మైన బ్రహ్మసాక్షాత్కారమును జిత్తవిశ్రాంతీచ్ఛయును గలిగినట్టి యేవిద్వత్సన్న్యాసి యున్నాఁడో వాఁడే జీవన్ముక్తి కధికారియై యున్నాఁడు. అందువలన నధికార్యభావమువలన జీవన్ముక్త్యభావము చెప్పుట మిథ్యయై యున్నది.

## [*] (6) జీవన్ముక్తియందుఁ బ్రమాణము నిరూపించుట. [*]

ఇఁక జీవన్ముక్తియందుఁ బ్రమాణము నిరూపింపఁబడు చున్నది. జీవన్ముక్తియందు శ్రుతిస్మృతీతిహాసపురాణము లనునీనాల్గును బ్రమాణములై యున్నవి. అవి

త్రేపంగుగాఁ జూపఁబడుచున్నవి. అందు శ్రుతి "విముక్తశ్చ విముచ్యతే"—భావము॥ యద్యపి యీపురుషుఁ డాత్మజ్ఞానమునకుఁ బూర్వమే ముముక్షుదశయందు రాగద్వేషాదులనుండి విముక్తుఁ డగుచున్నాఁడు, ఏకారణముచేత ననఁగా "శాంతో దాంతః" ఇత్యాదిశ్రుతులచేత శమదమాదిసాధనయుక్తపురుషునకే శ్రవణాదులయం దధికారము చెప్పఁబడి యున్నది. తథాపి, ఆత్మజ్ఞానమునకుఁ బూర్వ మారాగద్వేషాదుల నుండి విముక్తుఁ డగుట ప్రయత్నముచేత నగుచున్నది. మఱియు నాత్మజ్ఞానానంతర మైనను యోగాభ్యాసముచేత వాసనాక్షయమనోనాశము లను రెండును అతిదృఢము లగుచున్నవి. కావున జ్ఞానవంతుఁ డగుపురుషునియం దాభాసరూపరాగద్వేషాదికమును సంభవించుట లేదు. అందువలన జ్ఞానకాలమం దారాగద్వేషాదులనుండి విముక్తి స్వతస్సిద్ధమై యున్నది. ఈయభిప్రాయముచేత జీవన్ముక్తపురుషుని శ్రుతి విముక్తుఁ డని చెప్పుచున్నది. అట్టి విముక్తుఁ డగు జీవన్ముక్తపురుషుఁడు భోగముచేతఁ బ్రారబ్ధకర్మము నష్టము కాఁగా నీశరీరనాశానంతరము భావిబంధమునుండి విశేషముగా విముక్తుఁ డగుచున్నాఁడు. ఈశ్రుతి తత్త్వజ్ఞానానంతరము విదేహముక్తికన్న విలక్షణ మైన జీవన్ముక్తిని జెప్పుచున్నది.

మఱియు "తద్యథా ఒహి నిర్వ్లయనీ వల్మీకే మృతా ప్రత్యస్తాశయీత ఏవ మే వేదం శరీరం శేతే, అథాయ మశరీరో ఒమృతః ప్రాణో బ్రహ్మైవ తేజః" ఇత్యాదిశ్రుతులును ఆజీవన్ముక్తిని జెప్పుచున్నవి. అందువలన నాజీవన్ముక్తి యీశ్రుతి ప్రమాణముచేత సిద్ధమై యున్నది.

మఱియు వసిష్ఠభగవానులచేతను ఆజీవన్ముక్తి చెప్పఁబడి యున్నది. అందు "శ్లో. యో జాగర్తి సుషుప్తిస్థో యస్య జాగ్ర న్నవిద్యతే । యస్య నిర్వాసనో బోధః స జీవ న్ముక్త ఉచ్యతే" — భావము॥ బ్రహ్మవేత్త యగు పురుషుఁడు సుషుప్తియం దింద్రియములు లయ మొందకయే జాగ్రత్తను బొందుచున్నాఁడు. అనఁగా జాగ్రదవస్థ ననుభవించుచున్నాఁడు. మఱియు జాగ్రదవస్థయందును జక్షురాదీంద్రియములచేత రూపాదివిషయములను గ్రహించుట లేదు. అందువలన బ్రహ్మవేత్త యగు పురుషుఁడు జాగ్రదవస్థయం దుండువాఁ డైనను సుషుప్తియం దుండువాఁ డని చెప్పఁబడును. ఈకారణముచేతనే యింద్రియములచేత నర్థమును దెలియునట్టి జాగ్రత్త యేబ్రహ్మవేత్తకు లేదో, మఱియు నేబ్రహ్మవేత్త తన యఖండైకరసానందానుభవము గలవాఁడును శుభాశుభసర్వవాసనారహితుఁడు నై యున్నాఁడో ఆబ్రహ్మవేత్త యగు పురుషుఁడు జీవన్ముక్తుఁ డనఁబడుచున్నాఁడు. మఱియు గీతయొక్క ద్వితీయాధ్యాయమునందు శ్రీభగవంతునిచేతను ఆజీవన్ముక్తుఁడు స్థితప్రజ్ఞుఁ డని చెప్పఁబడెను.

అందు "శ్లో. ప్రజహాతి యదా కామా న్సర్వా న్పార్థ మనోగతాన్ । ఆత్మ న్యేవా త్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే" — భావము॥ ఓయర్జునా! ఏకాలమందు నీ విద్వాంసుఁడు మనస్సునం దుండు సర్వకామములను బరిత్యజించినవాఁడును అఖండైక రసానందరూపప్రత్యగాత్మయందు యోగాభ్యాసమువలన వశీకరింపఁబడిన మనస్సు చేతఁ దనస్వరూపానందము ననుభవించినవాఁడై సంతుష్టుఁడు నగుచున్నాఁడో ఆ కాలమునం దావిద్వాంసుఁడు స్థితప్రజ్ఞుఁ డనఁబడుచున్నాఁడు. అందు, అచంచల మయిన "అహం బ్రహ్మాస్మి" యను ప్రజ్ఞ గలవాఁడు స్థితప్రజ్ఞుఁ డనఁబడును.

ఇచ్చటఁ దాత్పర్య మే మనఁగా, ప్రజ్ఞ ద్విప్రకారమై యున్నది, ఒకటి స్థితప్రజ్ఞ మఱియొకటి అస్థితప్రజ్ఞ. అందు జన్మాంతరపుణ్యసమూహపరిపాకమువలన నాకాశమునుండి పడినఫలమువలెఁ దత్త్వమస్యాది మహావాక్యశ్రవణమాత్రముచేత నీపురుషునకు జీవబ్రహ్మైకత్వమును విషయము చేయునట్టి "అహం బ్రహ్మాస్మి" యను నేజ్ఞాన ముత్పన్న మగుచున్నదో ఆజ్ఞానము వ్యవహారబాహుళ్యముచేతను విషయాసక్తిచేతను విస్మృత మగుచున్నది. అందువలన నాజ్ఞాన మస్థితప్రజ్ఞ యనఁబడును. మఱియు యోగాభ్యాసముచేత వశీకరింపఁబడినచిత్తము గల పురుషుని యొక్కబుద్ధి యెప్పుడు పరపురుషునియం దాసక్తి గల స్త్రీయొక్కబుద్ధివలె, నిరంతరము బ్రహ్మాత్మతత్త్వమునే చింతించునదియు నన్యవస్తువును జింతింపనదియు నగుచున్నదో అప్పు డాబుద్ధి స్థితప్రజ్ఞ యనఁబడును.

ఈయభిప్రాయముచేతనే శ్రీవసిష్ఠభగవానులును వక్కాణించి యున్నారు. అందు "శ్లో. పరవ్యసనినీ నారీ వ్యగ్రాపి గృహకర్మణి । త దేవా స్వాదయ త్యంతః పరసంగ రసాయనమ్॥ ఏవం తత్త్వే పరే శుద్ధే ధీరో విశ్రాంతి మాగతః। త దే వా స్వాదయ త్యంత ర్బహి ర్వ్యవహర న్నపి" — భావము॥ పరపురుషునియం దాసక్తి గల స్త్రీ బాహ్యమున గృహకార్యము సర్వమును జేయుచుండినను, ఆంతరచిత్తమునం దాపరపురుషునియొక్కసంగజన్యసుఖమును జింతించుచున్నది. ఈప్రకారముగా నేజ్ఞానవంతుఁ డగు పురుషుఁడు శుద్ధపరమాత్మతత్త్వమునందు విశ్రాంతిని బొందినవాఁడో ఆజ్ఞానవంతుఁ డగుపురుషుఁడు బాహ్యమునందు లౌకికవైదికవ్యవహారములను జేసినను, ఆంతరచిత్తమునం దాపరమాత్మతత్త్వమునే నిరంతరము చింతించుచున్నాఁడు.

మఱియు ముక్తజీవన్ముక్తపురుషుఁడే గీతయొక్కద్వాదశాధ్యాయమునందు శ్రీభగవంతునిచేత భగవద్భక్తుఁ డని చెప్పఁబడియున్నాఁడు. అందు "శ్లో. అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ । నిర్మమో నిరహంకారః సమదుఃఖః సుఖః

క్షమీ॥ సంతుష్టః సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః । మయ్యర్పిత మనో బుద్ధి ర్యోమద్భక్తః సమే ప్రియః "—భావము॥ ఏపురుషుఁడు సర్వభూతములయందు ద్వేషరహితుఁడును మైత్రి కరుణ గలవాఁడును అహంమమాభిమానరహితుఁడును సుఖదుఃఖములయందు సమానస్థితి గలవాఁడును క్షమావంతుఁడును సర్వదా సంతుష్టుఁడును మనోనిగ్రహము గలవాఁడును దృఢనిశ్చయము గలవాఁడును బరమాత్మ నగు నాయం దర్పింపఁబడినమనోబుద్ధులు గలవాఁడు నగుచున్నాఁడో అట్టి నాభక్తుఁ డైనవాఁడు పరమేశ్వరుఁడ నగు నా కత్యంతప్రియుఁడై యున్నాఁడు.

శంక:—ఈ గీతావచనమునందు శ్రీభగవంతునిచేతఁ జెప్పఁబడిన యద్వేష్టృత్వాదిగుణము లేవి గలవో ఆగుణములు సాధకముముక్షువునందును "శాంతో దాంతః" ఇత్యాదిశ్రుతిప్రమాణములవలన సిద్ధములై యున్నవి. అందువలన సాధకముముక్షువుకంటె నాజీవన్ముక్తపురుషునియం దేవిశేషము సిద్ధించుట లేదు.

సమాధానము:—సాధకముముక్షువునం దాయద్వేష్టృత్వాదిగుణములు ప్రయత్నసాధ్యములై యున్నవి. మఱియు జీవన్ముక్తపురుషునియం దాయద్వేష్టృత్వాది గుణములు స్వభావసిద్ధములై యున్నవి. అందువలన సాధకముముక్షువుకన్నను ఆ జీవన్ముక్తపురుషునియందు విశేషము సంభవించు చున్నది. ఈవిషయ మన్యగ్రంథ ములయందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. ఉత్పన్నాత్మైక్యబోధస్య హ్యాద్వేష్టృత్వాదయో గుణాః । అయత్నతో భవం త్యస్య న తు సాధనరూపిణః "—భావము॥ "అహం బ్రహ్మాస్మి" యను బోధ యేపురుషునకుఁ గలిగి యున్నదో. ఆవిద్వాంసుఁ డగు పురుషున కద్వేష్టృత్వాదిగుణములు ప్రయత్నము లేకయే కలుగుచున్నవి. ముముక్షువులకువలె సాధనరూపము లగుట లేదు.

మఱియు, ఉక్త జీవన్ముక్తపురుషునినే శ్రీభగవంతుఁడు గీతయొక్క చతుర్దశాధ్యాయమునందు "ప్రకాశంచ ప్రవృత్తించ మోహ మేవచ పాండవ। నద్వేష్టి సంప్రవృత్తాని ననివృత్తాని కాంక్షతి॥ (1) ఉదాసీన వదాసీనో గుణై ర్యో నవిచాల్యతే । గుణావర్తంత ఇత్యేవం యోవతిష్ఠతి నేంగతే॥ (2) సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాంచనః । తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిందాత్మసంస్తుతిః॥ (3) మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః । సర్వారంభపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే॥ (4)" అను నీనాల్గుశ్లోకములచేత గుణాతీతుఁ డని చెప్పి యున్నాఁడు. ఈగీతాశ్లోకములయర్థము గీతాగూఢార్థదీపికయందు మాచే విస్తరముగా నిరూపింపఁబడి యున్నది. దాని నచ్చటఁ దెలియ నగును.

మఱియు, ఉక్తజీవన్ముక్తపురుషుఁడే మహాభారతమందు శ్రీవ్యాసభగవంతునిచే బ్రాహ్మణుఁ డని చెప్పఁబడి యున్నాఁడు. అందు "శ్లో. నిరాశిష మనారంభం నిర్నమస్కార మస్తుతిమ్ । అక్షీణం క్షీణకర్మాణం తం దేవా బ్రాహ్మణం విదుః"— భావము॥ ఏపురుషుఁ డిష్టవస్తుప్రార్థనారహితుఁడును సర్వారంభరహితుఁడును నమస్కారరహితుఁడును స్వపరస్తుతినిందారహితుఁడును ప్రయత్నము లేక ప్రాప్తమైన వస్తువునందును దీనతారహితుఁడును సర్వలౌకికవైదికకర్మముల నివృత్తిఁ జేసినవాఁడు నగుచున్నాఁడో అట్టి తత్త్వవేత్త యగుపురుషుని దేవతలు బ్రాహ్మణుఁ డని చెప్పుదురు.

మఱియు, ఉక్తజీవన్ముక్తుఁడే స్కందపురాణమునం దతివర్ణాశ్రమి యని చెప్పఁబడి యున్నాఁడు. అందు "శ్లో. యథా స్వప్నప్రపంచో ఽయం మయి మాయా విజృంభితః । ఏవం జాగ్రత్ప్రపంచోఽపి మయి మాయా విజృంభితః॥ ఇతి యో వేద వేదాంతైః సో ఽతివర్ణాశ్రమీ భవేత్"—భావము॥ ఎట్లు ప్రత్యగాత్మ యగు నాయం దీస్వప్నప్రపంచము మాయచేఁ గల్పితమై యున్నదో అట్లే జాగ్రత్ప్రపంచము గూడ నాయందు మాయచేఁ గల్పితమై యున్నది. ఈప్రకారముగా నేపురుషుఁడు వేదాంతవచనములచేత సర్వప్రపంచకల్పనాధిష్ఠానరూపాత్మను సాక్షాత్కరించుకొను చున్నాఁడో ఆతత్త్వవేత్త యగు పురుషుఁ డతివర్ణాశ్రమి యని చెప్పఁబడుచున్నాఁడు. ఈప్రకారముగా నాజీవన్ముక్తియందు శ్రుతిస్మృతీతిహాస పురాణము లను నాల్గిటియొక్కయనేకవచనములు ప్రమాణములై యున్నవి. కావున విదేహముక్తివలె జీవన్ముక్తియును అవశ్య మంగీకరింపవలయును.

[*] (7) జీవన్ముక్తియొక్కసాధననిరూపణము. [*]

ఇఁక జీవన్ముక్తియొక్కసాధనములు నిరూపింపఁబడుచున్నవి. పూర్వోక్త జీవన్ముక్తి తత్త్వజ్ఞానము వాసనాక్షయము మనోనాశము అను నీమూఁటియొక్కయభ్యాసమువలన సిద్ధ మగుచున్నది. అందువలన నామూఁడును జీవన్ముక్తికి సాధనములై యున్నవి. అచ్చట నాతత్త్వజ్ఞానాదిత్రయమును అతిప్రయత్నముతో మాటిమాటి కావర్తించుట యేది గలదో, అదియే యామూఁటియొక్కయభ్యాసమై యున్నది. ఆతత్త్వజ్ఞానాదిత్రితయముయొక్కయభ్యాసముకూడ నొకటేకాలమునందుఁ జేయుట యేది గలదో అది జీవన్ముక్తిహేతువై యున్నది. ఏకారణముచేత ననఁగా, అన్వయవ్యతిరేకములచేత నామూఁటికిని బరస్పరకార్యకారణభావము సిద్ధ మగుచున్నది.

దానియందుఁ బ్రథమమునఁ దత్త్వజ్ఞానము వాసనాక్షయము అను రెంటికిని బరస్పరకార్యకారణభావము చూపఁబడుచున్నది. అచ్చట, ఈదృశ్యమాన

సర్వప్రపంచము మిథ్యయై యున్నది, అద్వితీయాత్మ పారమార్థికమై యున్నది, అందువలన నీయాత్మయే సర్వరూపమై యున్నది, ఆత్మకన్న భిన్నముగా నొకవస్తువును లేదు, ఈప్రకారమైన తత్త్వజ్ఞానము కలుగఁగా విషయాభావమువలన రాగద్వేషాదిరూపవాసనలు క్షయించుచున్నవి. మఱియు తత్త్వజ్ఞానము లేనియెడల విషయములయందు సత్యత్వము ప్రవృత్తి గలుగుట లేదు. అందువలన నుత్తరోత్తర రాగద్వేషాదిరూపవాసనలయొక్క ప్రవాహము కలుగుచున్నది. ఈవిధమైన యన్వయవ్యతిరేకములచేతఁ దత్త్వజ్ఞానమునకు వాసనాక్షయమునుగుఱించి కారణత్వము సిద్ధ మగుచున్నది.

ఈప్రకారముగానే వాసనాక్షయమునకును దత్త్వజ్ఞానమునుగుఱించి కారణత్వ మున్నది. వివేకముచేతను దోషదర్శనముచేతను మైత్రీకరుణాదివిరోధి వాసనలచేతను ఎప్పుడీపురుషునకు రాగద్వేషాదిరూపవాసనలు క్షీణము లగుచున్నవో, అప్పుడే ఆ పురుషునకు శ్రుత్యాచార్యప్రసాదమువలన నిర్మల మగు మనస్సునందు తత్త్వజ్ఞాన ముత్పన్న మగుచున్నది. వాసనాక్షయము లేనియెడల, మనస్సు రాగద్వేషాదులచే దూషిత మగుచున్నది. ఆ దూషితమనస్సహితపురుషునకు శమదమాదిసాధనసంపత్తి లేనందున శ్రవణాదికము సంభవింపని దగును. దానిచేతఁ దత్త్వజ్ఞాన ముత్పన్నము గాదు. ఈరీతిగా నన్వయవ్యతిరేకములచేత వాసనాక్షయమునకుఁ దత్త్వజ్ఞానమును గుఱించి కారణత్వము సిద్ధ మగుచున్నది.

ఇఁక, తత్త్వజ్ఞానము మనోనాశము అను నీరెంటికిని బరస్పర కార్యకారణ భావము చూపఁబడుచున్నది. తత్త్వజ్ఞానముచేత నీపురుషునకుఁ బ్రపంచముయొక్క మిథ్యాత్వము నిశ్చిత మగుచున్నది. ఆమిథ్యాత్వనిశ్చయముచేత శుక్తిరజతమునకువలెఁ బ్రపంచమునకు బాధ కలుగుచున్నది. అట్టి బాధితప్రపంచమునందు మనస్సునకుఁ బ్రవృత్తి కలుగుట లేదు. మఱియు సత్యరూపముగా నిశ్చయింపఁబడిన యే యాత్మ యున్నదో! ఆయాత్మ మనస్సునకు విషయము కాదు. అందువలన నాయాత్మయందును మనస్సునకుఁ బ్రవృత్తి కలుగుట లేదు. ఈప్రకారముగా నాంతరబాహ్యప్రవృత్తులు లేనందున, నామనస్సు కాష్ఠరహితవహ్నివలె తానే లయ మగుచున్నది. అందు శ్రుతి.—"యథా నిరింధనో వహ్నిః స్వయ మేవోపశామ్యతి। తద్వద్వృత్తిక్షయా చ్చిత్తం స్వయ మేవోపశామ్యతి" — భావము॥ ఎట్లు కాష్ఠాదిరూపేంధనములు లేని వహ్ని తానే సామాన్యతేజోరూపకారణమునందు లయ మగుచున్నదో, అట్లే యాంతరబాహ్యసర్వవృత్తులయొక్క నాశమువలనఁ జిత్తమును దనయధిష్ఠానరూపకారణమునందు లయ మగుచున్నది. ఇదియే మనస్సుయొక్క

నాశమై యున్నది. మఱియుఁ దత్త్వజ్ఞానము లేనిచోఁ బ్రపంచమునందు సత్యత్వము నివృత్త మగుట లేదు. అందువలనఁ బదార్థాకారవృత్తులచే వృద్ధి పొందినదై యా మన స్సత్యంతస్థూల మగుచున్నది. అట్టి స్థూలత్వమును బొందినమనస్సునకు నాశము గలుగుట లేదు. ఈప్రకార మైన యన్వయవ్యతిరేకములచేఁ దత్త్వజ్ఞానమునకు మనోనాశమును గుఱించి కారణత్వము సిద్ధ మగుచున్నది.

ఈవిధముగానే మనోనాశమునకును దత్త్వజ్ఞానమునుగుఱించి కారణత్వ మున్నది. ఎచ్చట మనస్సు నాశము నొందఁగా సర్వద్వైతవృత్తులును నివృత్తము లగుటవలన సర్వోపాధిరహితుఁ డైన యీపురుషునకు శ్రుత్యాచార్యప్రసాదమువలన బ్రహ్మసాక్షాత్కారము కలుగుచున్నది. మఱియు నామనోనాశము లేనియెడల విక్షిప్తచిత్తము గల పురుషునకు బ్రహ్మసాక్షాత్కారము కలుగుట లేదు. ఈప్రకార మైన యన్వయవ్యతిరేకములచేత మనోనాశమునకుఁ దత్త్వజ్ఞానముయొక్క కారణత్వము సిద్ధ మగుచున్నది.

ఇఁక వాసనాక్షయమనోనాశము లను రెంటికిని బరస్పరకార్యకారణ భావము చూపఁబడు చున్నది. ఎచ్చట వాసనాక్షయము లేనియెడల రాగద్వేషా దులచేత స్థూలభావమును బొందినచిత్తము విషయములయొక్క సమ్ముఖమునకుఁ బోయి యాయావిషయాకారపరిణామమును బొందుచున్నది. ఆవిషయాకార మైన మనస్సున కొకప్పుడును నాశము కలుగుట లేదు. మఱియు వాసనలు క్షీణములు కాఁగా, వృత్తులయొక్క యుత్పత్తి యగుట లేదు. ఏకారణముచేత ననఁగా, ఆవాసన లే వృత్తులయొక్క యుత్పత్తికి బీజములై యున్నవి. బీజము నాశము నొందఁగా నంకుర ముత్పన్న మగుట లేదు. అందువలన మనస్సు నాశ మొందుచున్నది. ఈప్రకార మైన యన్వయవ్యతిరేకములచేత వాసనాక్షయమునకు మనోనాశముయొక్క కారణత్వము సిద్ధ మగుచున్నది.

ఈప్రకారముగానే మనోనాశమునకును వాసనాక్షయమును గుఱించి కారణత్వ మున్నది. ఎచ్చట మనస్సు నాశము నొందఁగా నేవిధ మైనవృత్తియుఁ గలుగుట లేదు. అందువలన సర్వవాసనలు క్షయ మొందుచున్నవి. మఱియు మనోనాశము లేనియెడలఁ బ్రారబ్ధకర్మవశమువలన విషయభోగములయందుఁ బ్రవృత్త మైనచిత్తమునందు రాగాద్యనేకవాసన లుత్పన్నము లగుచున్నవి. అనఁగా ఘృతాది హవిస్సులచేత నగ్ని వృద్ధి పొందుచున్నదో, అట్లు విషయభోగములచేత రాగాది వాసనలును వృద్ధిని బొందుచున్నవి. ఈవిధ మైన యన్వయవ్యతిరేకములచేత, మనోనాశమునకు వాసనాక్షయముయొక్క కారణత్వము సిద్ధ మగుచున్నది.

ఈరీతిగాఁ దత్త్వజ్ఞానము వాసనాక్షయము మనోనాశము అను మూఁటి కిని బరస్పరకార్యకారణభావ ముంకుటవలన నామూఁటిని ఏకకాలమునందే యభ్య సించుట యుచితమై యున్నది. ఆయభ్యాసమువలన నీపురుషునకు జీవన్ముక్తి ప్రాప్త మగుచున్నది. ఈయర్థము వసిష్ఠభగవంతుని చేతను జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. వాసనాక్షయవిజ్ఞాన మనోనాశా మహామతే। సమకాలం చిరాభ్యస్తా భవంతి ఫలదాయినః"—భావము॥ ఓ మహామతిమంతుఁడ వగు రామా! వాసనాక్షయము తత్త్వజ్ఞానము మనోనాశ మను మూఁటిని ఏకముగా బహుకాలపర్యంత మభ్యాసము చేసినయెడల నీపురుషుఁడు జీవన్ముక్తిరూపఫలమును బొందుచున్నాఁడు.

శంక:—వివేకాదిసాధనచతుష్టయప్రాప్త్యనంతరము తత్త్వజ్ఞానప్రాప్తి కొఱకు వివిదిషాసన్న్యాసముచేత శ్రవణమనననిదిధ్యాసనములను జేయునట్టి పురు షునకుఁ దత్త్వజ్ఞాన ముత్పన్న మగుచున్నది. తత్త్వజ్ఞానోత్పత్త్యనంతరము జీవ న్ముక్తిప్రాప్తికొఱకు విద్వత్సన్న్యాసముచేతఁ దత్త్వజ్ఞానము వాసనాక్షయము మనో నాశము అను మూఁటియొక్కయభ్యాసము చేయునట్టి పురుషున కాజీవన్ముక్తి ప్రాప్త మగుచున్న దను నర్థము పూర్వము చెప్పినందువలన సిద్ధ మగుచున్నది. అచ్చట శ్రవణమననాదుల కనంతరము తత్త్వమస్యాదిప్రమాణజన్యతత్త్వజ్ఞానముయొక్క యభ్యాస మేప్రకారముగాఁ గలుగును? ప్రథమమున జ్ఞానవంతుఁ డగుపురుషున కాతత్త్వజ్ఞానముయొక్క కర్తవ్యత్వమే సంభవించుట లేదు. ఏల యన, ఆతత్త్వ జ్ఞానము మహావాక్యరూపప్రమాణముయొక్క ఫలరూప మగుటవలనఁ బూర్వసిద్ధమే యగుచున్నది. అసిద్ధవస్తువే కర్తవ్య మగుచున్నది. సిద్ధవస్తువు కర్తవ్య మగుట లేదు. మఱియు నాజ్ఞానము విషయరూపవస్తువుయొక్క యధీనమై యున్నది. కావున నా జ్ఞానమును జేయుటకుఁ గాని చేయకుండుటకుఁ గాని అన్యథా చేయుటకుఁ గాని శక్యము కాదు. అందువలన నాజ్ఞానముయొక్క కర్తవ్యత్వము సంభవించుట లేదు. ఈప్రకారముగా జ్ఞానవంతుఁ డగుపురుషునకు జ్ఞానసాధన మైన శ్రవణాదులయొక్క యును గర్తవ్యత్వము యుక్తము గాదు. ఏకారణముచేత ననఁగా, ఫలరూపజ్ఞాన ముత్పన్నము కాఁగా నాశ్రవణాదులయొక్క యనుష్ఠానము వ్యర్థమే యగును. అందు వలన నుత్పన్న మైన తత్త్వజ్ఞానముయొక్క యభ్యాసము నిరూపించుట శక్యము కాదు.

సమాధానము:—శ్రవణాదులవలన నుత్పన్న మైన "అహం బ్రహ్మాస్మి" యను నేతత్త్వజ్ఞాన మున్నదో, ఆతత్త్వజ్ఞానముయొక్క యభ్యాస మేది యనఁగా, ఏప్రకారముగా నైనను ఆబ్రహ్మాత్మతత్త్వముయొక్క పునఃపునశ్చింతన చేయవల యును. అనఁగా వేదాంతశాస్త్రశ్రవణముచేత నైనను, జెప్పుటచేత నైనను, గ్రంథావ

లోకనముచేత నైనను బఠనపాఠనములచేత నైనను ఆబ్రహ్మాత్మతత్త్వము నాటిమాటికి ననుసంధింపవలయును. ఇదియే యాత్మతత్త్వజ్ఞానముయొక్కయభ్యాస మని తెలియవలయును. ఈ తత్త్వజ్ఞానాభ్యాసముయొక్కస్వరూప మన్యగ్రంథములయందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. తచ్చింతనం తత్కథన మన్యోన్యం తత్ప్రబోధనమ్ । ఏత దేక పరత్వంచ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః"—భావము॥ జీవబ్రహ్మైక్యరూప మగు నేతత్త్వ మున్నదో ఆతత్త్వముయొక్కపునఃపునశ్చింతనమును, అధికారులగు ముముక్షుజనుల కాతత్త్వమును జెప్పుటయును, దనకు సమాను లైన విద్వాంసులతోఁ గూడి పరస్పర మాతత్త్వమును బోధించుకొనుటయు ననునివి మొదలైన యేప్రకారములచేత నైనను యేకబ్రహ్మాత్మతత్త్వముయొక్కచింతనపరాయణత్వమేది యున్నదో దానిని విద్వాంసు లగు పురుషులు బ్రహ్మాభ్యాస మని చెప్పుచున్నారు.

శంక:—ఏప్రకారముచేత నైనను బ్రహ్మాత్మతత్త్వముయొక్కచింతనమును బ్రహ్మాభ్యాస మని చెప్పినయెడల ననధికారిపురుషులను గూర్చి చేయు బ్రహ్మాత్మతత్త్వముయొక్కయుపదేశముకూడ బ్రహ్మాభ్యాసరూపము కావలయును.

[*] (8) బ్రహ్మవిద్యకు అధికారులను అనధికారులను నిరూపించుట. [*]

సమాధానము:—ఇకఁ బ్రసంగానుసారముగా నాబ్రహ్మవిద్య కధికారులును అనధికారులును నిరూపింపఁబడు చున్నారు. అందు, ఏపురుషుఁడు వివేకాది చతుస్సాధనసంపన్నుఁడును నమ్రత గలవాఁడును శిష్యభావముతోఁ గూడినవాఁడును గుర్వీశ్వరులయందు భక్తి గలవాఁడును గురువేదాంతవాక్యములయందు విశ్వాసము గలవాఁడు నగుచున్నాఁడో ఆపురుషుఁడే బ్రహ్మవిద్య కధికారి యగుచున్నాఁడు. అట్టి యధికారిపురుషునకే తత్త్వవేత్తలు బ్రహ్మవిద్య నుపదేశింపవలయును. మఱియు నట్టి యధికారిపురుషుఁడే ఆబ్రహ్మవిద్యయొక్కశ్రవణాదులవలన నాత్మజ్ఞానమును మోక్షమును బొందుచున్నాఁడు. ఈయర్థమును "తస్మై స విద్వా నుపసన్నాయ ప్రాహేతి, సమ్యక్ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ, యే నాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్, తస్మై మృదితకషాయాయ తమసః పారం దర్శయతి భగవా న్సనత్కుమారః" ఇత్యాదిశ్రుతులు చెప్పుచున్నవి. అట్లే ఈయర్థమును "య ఇదం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి । భక్తిం మయి పరాం కృత్వా మామే వైష్య త్యసంశయః॥ నచ తస్మా న్మనుష్యేషు కశ్చి న్మే ప్రియకృత్తమః । భవితా నచ మే తస్మా దన్యః ప్రియతరో భువి" ఇత్యాది గీతా వచనములును జెప్పుచున్నవి.

మఱియు నేపురుషుఁడు పూర్వోక్తాధికారిలక్షణములు లేనివాఁ డగుచున్నాఁడో ఆపురుషుఁ డనధికారి యనఁబడు చున్నాఁడు. అట్టి యనధికారికిఁ దత్త్వవేత్తలు బ్రహ్మవిద్య నుపదేశింపఁగూడదు. మఱియు నట్టి యనధికారిపురుషుఁడు బ్రహ్మవిద్యను శ్రవణము చేసినను ఆత్మజ్ఞానమును మోక్షమును బొందుట లేదు. ఈ యర్థము కూడ "వేదాంతే పరమం గుహ్యం పురా కల్పే ప్రచోదితమ్ । నా ప్రశాంతాయ దాతవ్యం నా పుత్రాయా శిష్యాయ వై పునః" ఇత్యాది శ్రుతివచనములచేత సిద్ధ మగుచున్నది.

అట్లే "ఇదం తే నాతపస్కాయ నా భక్తాయ కదాచన । నచా శుశ్రూషవే వాచ్యం నచ మాం యో ఽభ్యసూయతి" ఇత్యాది గీతావచనములచేతను సిద్ధ మగుచున్నది.

ఇట్లే యన్యస్మృతియందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. అశిష్యాయా విరక్తాయ యత్కించి దుపదిశ్యతే । తత్ప్రియా త్యపవిత్రత్వం గోక్షీరం శ్వదృతౌ యథా"—భావము॥ ఏపురుషుఁడు శిష్యభావము లేనివాఁడును వైరాగ్యము లేనివాఁడు నగుచున్నాఁడో అట్టి యనధికారిపురుషునకుఁ జేయఁబడిన కించి దుపదేశమును శ్వానచర్మమునందుఁ బోయఁబడిన గోక్షీర మపవిత్రభావమును బొందునట్లపవిత్రభావమునే పొందుచున్నది.

మఱియు నుక్తార్థ మన్యస్మృతియందును జెప్పఁబడి యున్నది. అచ్చట "శ్లో. నా పృష్టః కస్యచి ద్బ్రూయా న్న చాన్యాయేన పృచ్ఛతః । జాన న్నపిచ మేధావీ జడవ ల్లోక మాచరేత్" — భావము॥ ఈవిద్వాంసుఁ డగుపురుషుఁడు ప్రశ్న చేయుట లేక యెవ్వరికి నుపదేశము చేయఁడు, అట్లే న్యాయరహితముగాఁ బ్రశ్న చేయు పురుషునకును ఉపదేశము చేయుట లేదు, మ తే మనఁగా సర్వార్థములు దెలిసినవాఁ డైనను ఈవిద్వాంసుఁడగు పురుషుఁడు లోకమునందు జడునివలెఁ జరించుచున్నాఁడు. అందువలన నధికారులను గుఱించి చేయు బ్రహ్మాత్మతత్త్వముయొక్కయుపదేశ మేది గలదో ఆ యుపదేశము బ్రహ్మాభ్యాస మని చెప్పఁబడును. అనధికారిపురుషులను గుఱించి చేయు బ్రహ్మాత్మతత్త్వముయొక్కయుపదేశము బ్రహ్మాభ్యాస మని చెప్పఁబడుట లే దనునది సిద్ధ మైనది.

శంక:—తత్త్వజ్ఞానమునకన్నఁ బూర్వముగూడ ముముక్షుజనులకు వాసనాక్షయమనోనాశములయొక్కయభ్యాస మపేక్షితమే యగుచున్నది. ఏల యన్న, ఏపురుషునియొక్కచిత్తము విషయాసక్త మయ్యును శమదమాదిరహిత మయ్యును

ఏకాగ్రతారహిత మయ్యు నున్నదో ఆపురుషునకుఁ దత్త్వజ్ఞానము కలుగుట లేదు. అందువలనఁ దత్త్వజ్ఞానమునకుఁ బూర్వము గూడ వాసనాక్షయమనోనాశముల యొక్కయభ్యాస మవశ్యము చేయవలయును. ఎప్పు డాత్మజ్ఞానమునకుఁ బూర్వమే వాసనాక్షయమనోనాశములు సిద్ధము లగుచున్నవో అప్పు డాత్మజ్ఞానానంతరము జీవన్ముక్తికొఱకై వాసనాక్షయమనోనాశములయొక్కయభ్యాసము చేయుటయందుఁ గొంచె మైనను బ్రయోజనము లేదు. పూర్వసిద్ధము లైన వాసనాక్షయమనోనాశ ములయొక్కయభ్యాసమువలననే యీతత్త్వవేత్త యగు పురుషునకు జీవన్ముక్తి ప్రాప్త మగుచున్నది.

సమాధానము:—యద్యపి తత్త్వజ్ఞానమునకుఁ బూర్వముకూడ నా తత్త్వజ్ఞానప్రాప్తికొఱకు వాసనాక్షయమనోనాశములయొక్కయభ్యాస మపేక్షిత మై యున్నది. తథాపి తత్త్వజ్ఞానమునకుఁ బూర్వము వివిదిషుసన్న్యాసి కావాసనా క్షయమనోనాశములయొక్కయభ్యాసమో గౌణ మగుచున్నది. మఱియు శ్రవణ మననా ద్యభ్యాసము ప్రధాన మగుచున్నది. ఎట్లనఁగా శ్రవణమననిదిధ్యాసనము లను నీమూడును తత్త్వమస్యాదివేదాంతవాక్యములయొక్కవిచారరూప మగుట వలన నాత్మజ్ఞానమునుగూర్చి యంతరంగసాధనమై యున్నది. మఱియు వాసనా క్షయమనోనాశము లైననో అంతఃకరణశోధక మగుటవలన నాశ్రవణాదులకు సహ కారు లై యున్నవి. అందువలనఁ దత్త్వజ్ఞానమునకుఁ బూర్వము కించి ద్వాసనా క్షయమనోనాశాభ్యాసముచేత నిరంతరము శ్రవణమననాదులను జేయునట్టి వివిదిషు సన్న్యాసి కాత్మజ్ఞాన ముత్పన్న మగుచున్నది. మఱియు విద్వత్సన్న్యాసి కైననో ఆతత్త్వజ్ఞానముయొక్కయభ్యాసము గౌణ మగుచున్నది. వాసనాక్షయమనోనాశ ములయొక్కయభ్యాసము ప్రధాన మగుచున్నది. ఏల యన, తత్త్వజ్ఞానోత్పత్తి కన్నఁ బూర్వమే వేదాంతశ్రవణాదులయొక్కయభ్యాసమునకుఁ బ్రయోజన మున్నది. తత్త్వజ్ఞానోత్పత్త్యనంతర మాశ్రవణాదులయొక్కయభ్యాసమున కేప్రయోజనమును లేదు. మఱి యే మనఁగాఁ బ్రారబ్ధకర్మమువలనఁ బ్రాప్తము లైన విషయముల ననుభ వించుకాలమునందే వాసనలయభిభవము చేయుటకొఱకుఁ గించిన్మాత్ర శ్రవణాదుల యొక్కయభ్యాస మపేక్షితమై యున్నది. అందువలన విద్వత్సన్న్యాసి కాతత్త్వ జ్ఞానాభ్యాసము గౌణ మగుచున్నది. మఱియు నావిద్వత్సన్న్యాసి తత్త్వజ్ఞానము నకుఁ బూర్వము వాసనాక్షయమనోనాశములను దృఢముగా నభ్యసింపనందున వానియొక్కచిత్తమునకు విశ్రాంతి కలుగుట లేదు. మఱియుఁ జిత్తవిశ్రాంతి లేక దృష్టదుఃఖము నివృత్తము కానేరదు. అందువలనఁ జిత్తవిశ్రాంతికొఱకై కావిద్వ

త్సన్న్యాసి కాత్మజ్ఞానానంతరము వాసనాక్షయమనోనాశములయొక్కయభ్యాస మవశ్య మపేక్షితమై యున్నది. కావున విద్వత్సన్న్యాసికి వాసనాక్షయమనోనాశములయొక్కయభ్యాసము ప్రధానమై యున్నది. ఆయభ్యాసముచేతనే విద్వత్సన్న్యాసికి జీవన్ముక్తి ప్రాప్త మగుచున్నది.

శంక:—సాధనచతుష్టయసంపన్నాధికారిపురుషునకు శ్రవణమననాదులచేత నసంభావనావిపరీతభావనారూపప్రతిబంధములు నివృత్తములు కాఁగాఁ దత్త్వమస్యాదిమహావాక్యములవలన "అహం బ్రహ్మాస్మి" యను నపరోక్షజ్ఞానము కలుగుచున్నది. ఆయపరోక్షజ్ఞానమువలన నజ్ఞానకృతావరణము నివృత్తమై బ్రహ్మానందరూపపరమపురుషార్థము ప్రాప్త మగుచున్నది. ఆ పరమపురుషార్థప్రాప్తికన్న మఱియొకకర్తవ్యము శేషించి యుండుట లేదు. మఱియు "తస్య కార్యం న విద్యతే" ఇత్యాది శ్రుతిస్మృతివచనములును జ్ఞానవంతునకుఁ గర్తవ్యమును నిషేధించి యున్నవి.

మఱియుఁ జిత్తవిశ్రాంతికొఱకు కాత్మతత్త్వవేత్త యగుపురుషునకును వాసనాక్షయమనోనాశములయొక్కయభ్యాసశేషము కర్తవ్యమై యున్న దని చెప్పినయెడల నదియును సంభవింపదు. ఏల యన మహావాక్యజన్యాపరోక్షజ్ఞానమునకు విషయమైన నిత్యనిరతిశయబ్రహ్మానంద మేది గలదో ఆబ్రహ్మానందమందు మగ్న మైనమనస్సున కన్యము లైన తుచ్ఛవిషయములయందుఁ బ్రవృత్తి సంభవింపదు. అందువలన జ్ఞానవంతున కాచిత్తవిశ్రాంతి స్వభావసిద్ధమే యగుచున్నది. ఇచ్చట సారాంశ మేమనఁగా, సార్వభౌమరాజ్యానంద మనుభవించునట్టి చక్రవర్తి యైనరాజేకగ్రామాధిపత్యతుచ్ఛసుఖము నెట్లిచ్ఛించుట లేదో అట్లఖండైకరసబ్రహ్మానంద మనుభవించునట్టి జ్ఞానవంతుఁ డగుపురుషునియొక్కచిత్తము తుచ్ఛము లగు విషయసుఖముల నిచ్ఛించుట లేదు. అందువలన జ్ఞానవంతుఁ డగుపురుషున కాచిత్తవిశ్రాంతి స్వభావసిద్ధమే యగుచున్నది. ఆచిత్తవిశ్రాంతికొఱకు జ్ఞానవంతునకుఁ గొంచెమైనను గర్తవ్యము లేదు. అందువలనఁ దత్త్వజ్ఞానానంతరము వాసనాక్షయమనోనాశాభ్యాసములయొక్కకర్తవ్యత్వము నియమించుట వ్యర్థమై యున్నది.

సమాధానము:—వేదాంతశాస్త్రాధికారులు ద్వివిధు లగుచున్నారు. ఒకఁడు ముఖ్యాధికారి, మఱియొకఁ డముఖ్యాధికారి. అందు, ఏపురుషుఁడు సగుణబ్రహ్మసాక్షాత్కారపర్యంత ముపాసనఁ జేసి పరమేశ్వరునిప్రసాదమువలన విషయములయందు దోషదృష్టిచే వివేకవైరాగ్యాదిసాధనసంపన్నుఁడై శ్రవణాదులయందుఁ బ్రవర్తించు చున్నాఁడో ఆపురుషుఁడు ముఖ్యాధికారి యనఁబడును. అట్టి ముఖ్యాధి

కారుల కైననో యొకపర్యాయము చేయఁబడిన శ్రవణాదులచేత జీవన్ముక్తియందుఁ బర్యవసానము గల తత్త్వజ్ఞాన ముత్పన్న మగుచున్నది. అనఁగా నాముఖ్యాధికారులకుఁ దత్త్వజ్ఞానమునకు సమానకాలమునందే జీవన్ముక్తి కలుగుచున్నది. ఏకారణముచేత ననఁగా, అముఖ్యాధికారులకుఁ దత్త్వజ్ఞానమునకుఁ బూర్వమే యుపాసనచేతఁ జిత్తైకాగ్రతారూపచిత్తవిశ్రాంతి సిద్ధమై యున్నది. అట్టి కృతోపాస్తి ముఖ్యాధికారులకుఁ దత్త్వజ్ఞానానంతరము వాసనాక్షయమనోనాశముల యొక్క యభ్యాస మపేక్షిత మగుట లేదు. మఱియుఁ బూర్వోక్తశ్రుతిస్మృతివచనములును అట్టి ముఖ్యాధికారులకే తత్త్వజ్ఞానానంతరము కర్తవ్యము నిషేధించి యున్నవి. ఆ సగుణబ్రహ్మోపాసనారహితులైన యీకాలమునం దుండునట్టి యేపురుషులు వివేకాదిసాధనసంపన్నులై బ్రహ్మజిజ్ఞాసవలన శ్రవణాదులయందుఁ బ్రవర్తించుచున్నారో ఆ యకృతోపాస్తిపురుషు లముఖ్యాధికారు లనఁబడుచున్నారు. అట్టి యముఖ్యాధికారుల కాశ్రవణాదులచేతఁ దత్త్వసాక్షాత్కారమో యవశ్యము కలుగుచున్నది. అయినను జ్ఞానమునకుఁ బూర్వము వారలచే వాసనాక్షయమనోనాశములయొక్క యభ్యాస మధికముగాఁ జేయఁబడ లేదు. అందువలన నాపురుషులకుఁ జిత్తవిశ్రాంతి కలుగుట లేదు.

మఱియు నాయముఖ్యాధిపురుషుల కాశ్రవణాదులచే నుత్పన్న మైన యే బ్రహ్మసాక్షాత్కార మున్నదో ఆసాక్షాత్కారము మహావాక్యరూపప్రమాణజన్య మగుటవలనను బ్రహ్మాత్మరూపవిషయ మబాధిత మగుటవలన బ్రమారూప మయ్యును అజ్ఞాననివృత్తి చేయుటయందు యోగ్య మయ్యు నున్నది. అయినను వాయుసహితదేశస్థితదీపమువలెఁ బ్రారబ్ధకర్మసంపాదితభోగవాసనలచేఁ జలింపఁజేయఁబడుటవలన నాసాక్షాత్కారమున కొకప్పు డసంభావనావిపరీతభావనారూపప్రతిబంధములు సంభవించుటవలన దాని కజ్ఞాననివృత్తి చేయుటయందు సామర్థ్యము లేదు. అందువలన నాయకృతోపాస్తు లగు నముఖ్యాధికారులకు సంభవించుప్రతిబంధములను నివర్తించుటకొఱకుఁ దత్త్వజ్ఞానానంతర మావాసనాక్షయమనోనాశములయొక్క యభ్యాస మవశ్యము చేయుటకు యోగ్యమై యున్నది.

ఈ యభిప్రాయముచేత శ్రీవ్యాసభగవంతుఁడు బ్రహ్మసూత్రమునందు "ఆవృత్తి రసకృ దుపదేశాత్, ఆప్రాయణాత్తత్రాపి హి దృష్టమ్" అను సూత్రములచే నముఖ్యాధికారులను గూర్చి యభ్యాసముయొక్క యావృత్తిఁ జెప్పి యున్నాఁడు. ఇందువలన సిద్ధించున దేమనఁగా, పూర్వోక్త ముఖ్యాధికారులకుఁ దత్త్వజ్ఞానానంతరము వాసనాక్షయమనోనాశములయొక్క యభ్యాసాపేక్ష లేక పోయి

నను అముఖ్యాధికారులకుఁ దత్త్వజ్ఞానానంతరము చిత్తవిశ్రాంతికొఱకు వాసనాక్షయమనోనాశములయొక్క యభ్యాస మవశ్య మపేక్షితమై యున్నది.

శంక:—ఈపురుషునకు వాసనయొక్క స్వరూపజ్ఞాన మిట్టిదని దెలిసినప్పుడు గదా యావాసనాక్షయము చేయుటయందుఁ బ్రవృత్తి గలుగును. ఆవాసనయొక్క జ్ఞానము లేక వాసనానివృత్తియందు ప్రవృత్తి సంభవింపదు.

## (౨) వాసనయొక్క సాధారణవిశేషలక్షణాదికముల నిరూపణము.

సమాధానము:—వాసనయొక్క సాధారణలక్షణమును దద్విభాగమును దత్ఫలమును ఆయావాసనలయొక్క విశేషలక్షణములును శ్రీవసిష్ఠభగవానులచేఁ జెప్పఁబడి యున్నవి. ఆసర్వము వసిష్ఠభగవంతునివచనములచేతనే యిచ్చటఁ జూపఁబడు చున్నది. దానియందుఁ బ్రథమమున వాసనయొక్క సాధారణలక్షణము చెప్పఁబడుచున్నది. అందు, "శ్లో. దృఢభావనయా త్యక్త పూర్వాపరవిచారణమ్। యదాదానం పదార్థస్య వాసనా సా ప్రకీర్తితా"—భావము॥ ఏదృఢభావనచేఁ బూర్వాపరవిచారము లేకయే పదార్థములు గ్రహింపఁబడు చున్నవో, అనఁగా, మనభాష సర్వభాషలకన్న సమీచీన మైనది, మనదేశము సర్వదేశములకన్న శ్రేష్ఠ మైనది, మనకులము సర్వకులములకన్న నుత్తమ మైనది, మనపుత్రాదికము సర్వులకన్న శ్రేష్ఠము, ఇత్యాద్యభినివేశ మేభావనచేఁ గలుగుచున్నదో ఆభావనను విద్వాంసు లగుపురుషులు వాసన యని చెప్పెదరు.

ఇఁక వాసనయొక్క విభాగమును ఫలమును జెప్పఁబడు చున్నవి. అందు "శ్లో. వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధాచ మలినా తథా। మలినా జన్మనో హేతుః శుద్ధా జన్మవినాశినీ"—భావము॥ పూర్వోక్తవాసన ద్విప్రకార మగుచున్నది. ఒకటి శుద్ధవాసన, మఱియొకటి మలినవాసన, అందు మలినవాసన యైననో ఈపురుషునకు జన్మహేతు వగుచున్నది, శుద్ధవాసన జన్మనివృత్తికి హేతు వగుచున్నది.

ఇఁక మలినవాసనయొక్క స్వరూపలక్షణము చెప్పఁబడుచున్నవి. అందు "శ్లో. అజ్ఞాన సుఘనాకార ఘనాహంకారశాలినీ। పునర్జన్మకరీ ప్రోక్తా మలినా వాసనా బుధైః"—భావము॥ బ్రహ్మస్వరూపావరక మగు నేయజ్ఞాన మున్నదో ఆయజ్ఞానముచే ఘనీభూత మైన యాకారము గలిగినట్టి ఘనాహంకార మేది గలదో ఆయహంకారసహితవాసన విద్వాంసులచే మలినవాసన యని చెప్పఁబడు చున్నది. ఆమలినవాసనయే యీపురుషునకుఁ బునర్జన్మమును బ్రాప్తింపఁజేయు చున్నది. అచ్చట భ్రాంతిజ్ఞానముయొక్క పరంపర యేది గలదో అదియే ఆయహం

కారముయొక్క యసురాకారమై యున్నది. ఆయహంకారముయొక్క యసురాకారత్వము శ్రీభగవంతునిచే గీతయొక్క షోడశాధ్యాయమున నాసురసంపన్నిరూపణప్రసంగము నందు, "ఇద మద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్ । ఇద మస్తీద మపి మే భవిష్యతి పునర్ధనమ్॥ (1) అసౌ మయా హత శ్శత్రు ర్హనిష్యే చాపరా నపి । ఈశ్వ రోహ మహం భోగీ సి ద్ధోహం బలవా న్సుఖీ॥ (2) ఆఢ్యో భిజనవా నస్మి కో న్యోస్తి సదృశో మయా । యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞాన విమోహితాః॥ (3)" అను నీమూఁడుశ్లోకములచేఁ జెప్పఁబడి యున్నది.

ఇఁక శుద్ధవాసనయొక్క స్వరూపలక్షణము చెప్పఁబడుచున్నది. అందు "శ్లో. పునర్జన్మాంకురం త్యక్త్వా స్థితం సంభృష్టబీజవత్ । దేహార్థం ధ్రియతే జ్ఞాతజ్ఞేయా శుద్ధేతి చోచ్యతే" — భావము॥ ఏవాసనజన్మములయొక్క మూలమును నశింపఁజేసి దగ్ధబీజమువలె దేహస్థితికొఱకు స్థిత మగుచున్నదో మఱియు నేవాసన చేత నఖండైకరసానందవస్తువు తెలియఁబడు చున్నదో ఆవాసన శుద్ధవాసన యనఁబడును.

ఇఁకఁ బూర్వోక్తమలినవాసనయొక్క విభాగము చెప్పఁబడుచున్నది. అచ్చట, జన్మములను బ్రాప్తింపఁజేయునట్టి యామలినవాసన యద్యపి యనంతమై యున్నది, తథాపి, స్మృతియం దామలినవాసన సంక్షేపముగాఁ ద్రివిధముగా జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. లోకవాసనయా జంతో ర్దేహవాసన యాపిచ । శాస్త్రవాసనయా జ్ఞానం యథావ న్నైవ జాయతే"— భావము॥ పూర్వోక్తమలిన వాసన, లోకవాసన శాస్త్రవాసన దేహవాసన యను భేదముచేతఁ ద్రివిధ మగుచున్నది. ఆ త్రివిధవాసనలయం దేదైన నొకవాసన యేపురుషున కున్నదో ఆపురుషున కావాసనారూపప్రతిబంధవశమువలన నాత్మయొక్క యథార్థజ్ఞానము కలుగుట లేదు.

## [*] (10) లోకవాసనానిరూపణము. [*]

ఇఁక లోకవాసన నిరూపింపఁబడు చున్నది. అందు, ఏ యా[illegible] ధరించుటవలన సర్వలోకులు నన్ను స్తుతింతురో ఎవ్వరును నన్ను నిందింపరో అట్టి యాచరణమును నేను ధరింతు నను నేయభినివేశ మున్నదో అది లోకవాసన యనఁబడును. ఆలోకవాసన శతకోటిజన్మములచేతను సంపాదించుట కశక్యము. ఏలయన సర్వదోషరహితులును సర్వశుభగుణములచే సంపన్నులును నమస్కారస్మరణాదులచే సర్వపురుషార్థముల నిచ్చువారు నగు శ్రీరామకృష్ణాదీశ్వరు లున్నారో వారలనుగూడ సర్వలోకులు స్తుతించుట లేదు. ఇక నే మనఁగాఁ గొందఱు శ్రేష్ఠ

పురుషులే స్తుతించుచున్నారు. మఱియుఁ గొందఱు నీచపురుషులు నిందగూడ చేయుచున్నారు. రామకృష్ణాదీశ్వరులనే సర్వలోకులును స్తుతింపనప్పు డస్మదాదిజీవులను సర్వలోకు లెట్లు స్తుతింతురు? ఇఁక నే మనఁగా, స్తుతింపరు. అందువలన నాలోకవాసన సంపాదించుట కశక్యము గనుక నీయధికారిపురుషుఁ డాలోకవాసన పరిత్యజించి తనహితమునే సంపాదింపవలయును.

ఈయర్థ మన్యగ్రంథములయందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. విద్యతే నఖలు కశ్చి దుపాయః సర్వలోకపరితోషకరోయః । సర్వథా స్వహిత మాచరణీయం కింకరిష్యతి జనో బహుజల్పః"— భావము॥ ఏయుపాయముచే సర్వలోకులు స్తుతి చేయుదురో ఆయుపాయము లోకమునందును శాస్త్రమునందును లేదు. అందువలన నీయధికారిపురుషులు లోకవాసనను బరిత్యజించి సర్వప్రకారములచేతను దమహితమునే సంపాదింపవలయును. లోకులయొక్క నిందాస్తుతులను జూడఁగూడదు. ఏకారణముచేత ననఁగా లోకులయొక్క నిందాస్తుతులచే నేహాని లాభములును గలుగుట లేదు. మఱియు నీయర్థము భర్తృహరిచేతను జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. నిందంతు నీతినిపుణా యదివా స్తువంతు లక్ష్మీః సమావిశతు గచ్ఛతు వా యథేష్టమ్ । అద్యైవవా మరణ మస్తు యుగాంతరేవా న్యాయ్యాత్పథః ప్రవిచలంతి పదం న ధీరాః"—భావము॥ నీతియందుఁ గుశలత గల పురుషులు నింద చేసినను లేక స్తుతి చేసినను మఱియుఁ దమకు లక్ష్మి ప్రాప్తించినను లేక పోయినను మఱియు నీదినమునందే మరణము కలిగినను లేక యుగాంతరమందుఁ గలిగినను ధైర్యవంతు లగు వివేకిపురుషులు శాస్త్రవిహితమార్గము నుండి యొక యడుగుగూడ దాఁటుట లేదు. అనఁగా లోకులచేఁ జేయఁబడిన నిందాస్తుత్యాదుల నుపేక్షించి వివేకిపురుషులు తమహితమునే సంపాదించుచున్నారు.

మఱియు లోకవాసనయం దభినివేశము గల పురుషుల కాత్మజ్ఞానము కలుగుట లే దను నీయర్థ మన్యశాస్త్రములయందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. న లోక చిత్తగ్రహణే రతస్య న భోజనాచ్ఛాదన తత్పరస్య । న శబ్దశాస్త్రాభిరతస్య మోక్షో న చాతిరమ్యావసథ ప్రియస్య" — భావము॥ ఏపురుషుఁడు సర్వప్రకారములచేతను లోకులయొక్క చిత్తము రంజిల్లఁజేయుటయందుఁ బ్రీతి గలవాఁడును భోజనాచ్ఛాదనములయందే తత్పరుఁడును వ్యాకరణాద్యనాత్మశాస్త్రములయం దభినివేశము గలవాఁడును, అత్యంతరమణీయగృహములయందుఁ బ్రీతి గలవాఁడు నగుచున్నాఁడో అట్టిపురుషుఁడు మోక్షమును బొందుట లేదు. అందువలన మోక్షేచ్ఛ గలపురుషుఁడు లోకవాసనను సర్వవిధములచేతను బరిత్యజింపవలయును.

### [*] (11) శాస్త్రవాసనానిరూపణము. [*]

ఇఁక శాస్త్రవాసన నిరూపింపఁబడుచున్నది. శాస్త్రములయొక్క తాత్పర్యములను గ్రహింపక యాశాస్త్రాధ్యయనాదులయం దేవాసన యున్నదో అది శాస్త్రవాసన యనఁబడును. ఆ శాస్త్రవాసనయును పాఠవాసన, అర్థవాసన, అనుష్ఠానవాసన యను భేదముచేతఁ ద్రివిధ మగుచున్నది. అందు సమగ్రాయుష్య పర్యంతము వేదశాస్త్రములను దాత్పర్యము దెలియక యధ్యయనము చేయుట యేది గలదో అది పాఠవాసన యనఁబడును. ఆపాఠవాసన భరద్వాజునకుఁ గలిగి యుండెను.

అచ్చట భరద్వాజుం డను నొకానొకఋషి తనయాయుష్యముయొక్క మూఁడుభాగములపర్యంతము, అనఁగా (75) పంచసప్తతివర్షపర్యంతము వేదముల నధ్యయనము చేసి యతిజీర్ణ మగు వృద్ధావస్థ పొంది యుండెను. ఆసమయమున నాభరద్వాజుని జూచి దేవరా జగు నింద్రుఁడు తత్సమీపమునకుఁ బోయి, ఓభరద్వాజుఁడా ఒకవేళ నేను నీ కాయుష్యముయొక్క చతుర్థభాగ మిచ్చినయెడల నా చతుర్థభాగాయుష్యముచేత నీ వేమి సంపాదింపఁగలవు? ఈ యింద్రవచనము విని యాభరద్వాజఋషి యాచతుర్థాయుష్యభాగమందును నేను వేదములనే యధ్యయనము చేయుదు నని చెప్పెను. తదనంతర మాయింద్రుఁడు భరద్వాజునియొక్క పాఠవాసనను నివర్తించుటకొఱ కాభరద్వాజునకు వేదములను బర్వతరూపముగాఁ జూపి యావేదరూపపర్వతములనుండి యేకైకముష్టిని గొని యాభరద్వాజుని గూర్చి యిట్లు చెప్పెను. ఓభరద్వాజుఁడా! ఇంతపర్యంతము నీ వీముష్టిమాత్రవేదములనే యధ్యయనము చేసితివి. ఇంకను ఈపర్వతరూపవేదము లధ్యయనము చేయుటకు శేషించి యున్నవి. ఈ యింద్రవచనము విని యాభరద్వాజుఁ డాపాఠవాసననుండి నివృత్తుఁడాయెను. తదనంతర మాయింద్రుఁ డాభరద్వాజుని గూర్చి బ్రహ్మవిద్యోపదేశముఁ జేసెను. ఈ గాథ తైత్తిరీయకశ్రుతియందు భరద్వాజోపాఖ్యానమునఁ బ్రసిద్ధమై యున్నది.

మఱియు వేదశాస్త్రములయొక్క తాత్పర్యము దెలియక సమగ్రాయుష్య పర్యంత మావేదశాస్త్రములయొక్క యర్థముల నధ్యయనము చేయుట యర్థవాసన యనఁబడును. ఈ యర్థవాసనయును పాఠవాసనవలె దుస్సంపాద మగుటవలన మలినవాసనయే యగుచున్నది. ఈకారణమువలననే విద్వాంసు లగు పురుషులచేత నిట్లు చెప్పఁబడి యున్నది. "శ్లో. అనంతశాస్త్రం బహువేదితవ్య మల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః । య త్సారభూతం త దుపాసితవ్యం హంసో యథా క్షీర మి

హాంబుమిశ్రమ్॥ (1) అధీత్యచతురోవేదాన్ ధర్మశాస్త్రాణ్యనేకశః । యస్తు బ్రహ్మ నజానాతి దర్వీపాకరసం యథా॥ (2) "— భావము॥ శాస్త్రములును శాస్త్రప్రతిపాదితపదార్థములును అనంతములై యున్నవి. ఆపదార్థముల నల్పకాలముచేఁ దెలిసికొనుటకు సాధ్యము గానేరదు. మఱియు నీపురుషునియొక్క యాయుష్య మత్యంతాల్పమై యున్నది. ఆ యల్పాయుష్యమందును రోగాద్యనేకవిఘ్నములు ప్రాప్తములగుచున్నవి. అట్టి విఘ్నయుక్తాల్పాయుష్యముచే నాశాస్త్రార్థములఁ దెలియుట కశక్యము. అందువలన నెట్లు హంసపక్షి జలమిశ్రితక్షీరమునుండి క్షీరమాత్రమునే గ్రహించు చున్నదో అట్లీయధికారిపురుషునిచేతను సర్వశాస్త్రములయొక్క సారమైన యేబ్రహ్మాత్మరూపార్థ మున్నదో అదియే గ్రహించుటకు యోగ్యమై యున్నది. మఱియు నేపురుషులు చతుర్వేదార్థముల నధ్యయనము చేసియు ననేకధర్మశాస్త్రార్థముల నధ్యయనము చేసియు "అహం బ్రహ్మాస్మి" యని బ్రహ్మమును దెలియరో ఆపురుషులు దర్వీసమానులై యున్నారు. అనఁగా, దర్వి యనేకవిధవ్యంజనముల యందుండియు నావ్యంజనములయొక్క రసమును దెలియనియట్లు. అబకకు దర్వి యని పేరు.

మఱియు శ్రుతిస్మృతిరూపశాస్త్రములయందు విధించియుండు కర్మములేవి గలవో ఆకర్మానుష్ఠానములయందే సమగ్రాయుష్యమును గడపుట యనుష్ఠానవాసన యనఁబడును. ఆయనుష్ఠానవాసన నిదాఘునకుఁ గలిగి యుండెను. అచ్చట ఋభు వను ఋషి రెండుమార్లుపదేశముఁ జేసినను నానిదాఘుఁ డనుష్ఠానవాసనచే బ్రహ్మాత్మతత్త్వమును దెలిసికొనక పోయెను. మూఁడవసారి యాఋభువుయొక్క యుపదేశమువలన నతిక్లేశరూపము లైన సర్వానుష్ఠానములను బరిత్యజించి బ్రహ్మాత్మతత్త్వమును సాక్షాత్కరించుకొనెను. ఈయర్థము విష్ణుపురాణమునందు విస్తరముగాఁ జెప్పఁబడి యున్నది. కావునఁ బూర్వోక్త త్రివిధశాస్త్రవాసనలును ఆత్మజ్ఞానమునకుఁ బ్రతిబంధకములే యగుచున్నవి.

## [*] (12) దేహవాసనానిరూపణము. [*]

ఇఁక దేహవాసన నిరూపింపఁబడు చున్నది. ఈ భౌతికస్థూలశరీరమునందేయభినివేశ మున్నదో అది దేహవాసన యనఁబడును. ఆదేహవాసనయును ద్వివిధమై యున్నది, ఒకటి దేహవిషయకమై యున్నది, మఱియొకటి దేహసంబంధిగుణవిషయకమై యున్నది. అందు "మనుష్యో ఽహం బ్రాహ్మణో ఽహమ్" అను నేవాసన యున్నదో అది దేహవిషయకవాసన యనఁబడును. మఱియు ద్వితీయ మగు

దేహసంబంధివాసనయును శాస్త్రీయము లౌకిక మను భేదముచేత ద్విప్రకార మగు చున్నది. అందుఁ బ్రథమ మగు శాస్త్రీయవాసనయును ద్వివిధము. ఒకటి గుణాధానప్రయుక్తము, మఱియొకటి దోషనివృత్తిప్రయుక్తము. అందు శాస్త్రవిహితముగా గంగాస్నానాదులచే దేహమునందు సద్గుణములను ధరింపవలయు ననునేవాసన యున్నదో, ఆవాసన గుణాధానప్రయుక్తవాసన యనఁబడును. మఱియు శౌచాచమనాదులచేత దేహముయొక్క దోషముల నివృత్తిఁ జేయవలయు ననునేవాసన యున్నదో ఆవాసన దోషనివృత్తిప్రయుక్త మనఁబడును.

ఈప్రకారముగానే యాలౌకికవాసనగూడ ద్విప్రకార మగుచున్నది. అందుఁ దైలపానమరీచి (మిరియములు) భక్షణాదులచే దేహమునందు సౌందర్యాదిగుణముల ధరింపవలయు ననునేవాసన యున్నదో అది ప్రథమ మగు లౌకికవాసన యనఁబడును. మఱియు మలనివర్తకౌషధజలాదులచేత దేహమునం దుండు మలము నివృత్తి చేయవలయు ననునేవాసన యున్నదో అది ద్వితీయ మగు లౌకికవాసన యనఁబడును. ఈ సర్వదేహవాసనలును జ్ఞానమునకుఁ బ్రతిబంధకము లగుటవలనను జన్మాంతరహేతువు లగుటవలనను మలినవాసనలే యగుచున్నవి.

మఱియు, లోకవాసన శాస్త్రవాసన దేహవాసన అను నీత్రివిధవాసనల కన్నను అన్యముగా జ్ఞానమునకుఁ బ్రతిబంధక మగు మలినవాసన గీతయొక్క షోడశాధ్యాయమునందు శ్రీభగవంతునిచేత "దంభో దర్పో ఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవచ" ఇత్యాది వచనములచే దంభదర్పాద్యసురసంపద్రూపముగాఁ జెప్పఁబడి యున్నది. ఈప్రకారముగా స్త్రీపుత్రాదివిషయములయొక్క యభిలాష యేది గలదో, అదియును మలినవాసనయే యగుచున్నది. ఆ సర్వమలినవాసనలు జ్ఞానమునకుఁ బ్రతిబంధకము లగుటవలన ముముక్షుజనులచే నివర్తించుటకు యోగ్యములై యున్నవి.

శంక:—ఆమలినవాసనలయొక్క నివృత్తి యేయుపాయమువలన నగును?

## [*] (13) మలినవాసనానివృత్త్యుపాయనిరూపణము. [*]

సమాధానము:—ఆమలినవాసన పూర్వోక్తరీతిగా ననేకప్రకారమై యుండుటవలన వసిష్ఠాదిమునులచే నావాసనలయొక్క నివృత్త్యుపాయములు గూడ ననేకప్రకారములుగాఁ జెప్పఁబడి యున్నవి. అందు నిత్యానిత్యవస్తువివేకమును, విషయములయందు దోషదృష్టియును, మహాత్ములయొక్క సత్సంగమును, విషయిజనులయొక్క సంగత్యాగమును, మైత్రీకరుణాదివిరోధివాసనలయొక్క యుత్పత్తియు నిత్యాద్యుపాయములచేత నామలినవాసనలయొక్క నివృత్తి యగుచున్నది. అందువలన

నావివేకాద్యుపాయములచేతఁ దనయంతఃకరణమునం దామలినవాసనలయొక్క యుత్పత్తి కలుగనియక చేయుట యేది గలదో అదియే యావాసనాక్షయాభ్యాసమై యున్నది. అందు "శ్లో. దృశ్యాసంభవబోధేన రాగద్వేషాదితానవే । రతిర్నవోదితా యాతు బోధాభ్యాసం విదుః పరమ్"—భావము॥ ఈ దృశ్యమానసర్వప్రపంచమును అధిష్ఠానాత్మకన్న భిన్నముగా వాస్తవముచే లేదను దృశ్యప్రపంచముయొక్క యసంభవజ్ఞాన మేది గలదో ఆజ్ఞానముచేత ప్రపంచరూపవిషయాభావమువలన రాగద్వేషాదిరూపవాసనలనివృత్తి కాఁగా నీపురుషునకుఁ దనస్వరూపానందానుభవమునం దేదృఢప్రీతి కలుగుచున్నదో దానిని విద్వాంసులు వాసనాక్షయాభ్యాస మని చెప్పుదురు.

ఇఁక, అన్యప్రకారముగా నామలినవాసనానివృత్త్యుపాయమును బ్రతిపాదించునట్టివాక్యములు చెప్పఁబడుచున్నవి. అందు "శ్లో. అసంగవ్యవహారిత్వాద్భవభావనవర్జనాత్ । శరీరనాశదర్శిత్వాద్వాసనా న ప్రవర్తతే"—భావము॥ నేను అసంగుఁడను అను వృత్తియొక్క ప్రవాహరూపవ్యవహార మేది గలదో ఆవ్యవహారమును నిరంతరము చేయుటవలనను బ్రపంచస్మరణముయొక్క పరిత్యాగ మేది గలదో దానిచేతను, నిరంతరము తనశరీరమరణముయొక్క దర్శన మేది గలదో దానిచేతను రాగాదిరూపము లగు నన్యవాసనలయొక్క ప్రవృత్తి కలుగదు. అచ్చట, తనమరణదర్శనమువలన రాగాదిరూపవాసనలు కలుగవను నీయర్థ మన్యగ్రంథములయందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. మస్తకస్థాయినం మృత్యుం యది పశ్యేదయం జనః । ఆహారోపి నరోచేత కిము తాన్యా విభూతయః"—భావము॥ తనమస్తకముపై నుండు మృత్యు వేది గలదో ఆమృత్యువును నీపురుషుఁడు చూచిన యెడల ఈపురుషునకు భోజనమునందును బ్రియము కలుగ దనునప్పుడు అన్యవిభూతులయం దెట్లు ప్రియము కలుగును? ఇఁక నే మనఁగా, కలుగదు.

ఇఁక సంసారమునందు దోషప్రతిపాదకవచనములు చెప్పఁబడుచున్నవి. "శ్లో. దుఃఖం జన్మ జరాదుఃఖం దుఃఖం మృత్యుః పునఃపునః । సంసారమండలం దుఃఖం పచ్యంతే యత్ర జంతవః"—భావము॥ జన్మము దుఃఖరూపము, జరయు దుఃఖరూపము, పునఃపునర్మరణమును దుఃఖరూపము, ఇచ్చట విశేషము చెప్ప నేల? ఏసంసారమండలమునం దీసర్వాజ్ఞానిజీవులు మాటిమాటికి జన్మమరణాదులను బొందుచున్నారో, ఆసర్వసంసారమండలము దుఃఖరూపమే యగుచున్నది. ఈప్రకారముగా నాత్మకన్న భిన్నమైన సర్వజగత్తును దుఃఖరూప మని చింతనఁ జేయు పురుషునకు రాగద్వేషాదిరూపసర్వమలినవాసనలును నివృత్తము లగుచున్నవి.

మఱియు విషయలంపటపురుషులసంగముయొక్క పరిత్యాగ మేది గలదో అదియును మలినవాసనానివృత్తిద్వారమున నీపురుషునకు మోక్షసాధన మగుచున్నది. ఈయర్థము విష్ణుపురాణమందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. నిస్సంగతా ముక్తిపదం యతీనాం సంగా దశేషాః ప్రభవంతి దోషాః । ఆరూఢయోగోపి నిపాత్యతే ఽధః సంగేన యోగీ కిము తాల్పసిద్ధిః" — భావము॥ విషయాసక్తపురుషసంగపరిత్యాగరూపనిస్సంగత యేది గలదో ఆనిస్సంగతయే సన్న్యాసులకు ముక్తిని బొందుటకు మార్గమై యున్నది. ఏకారణముచేత ననఁగా, ఆవిషయాసక్తపురుషులయొక్క సంగమువలన నీపురుషునియందు రాగద్వేషమోహాదిసర్వదోషములు ప్రాప్తము లగుచున్నవి. ఆమలినవాసనారూపదోషములు యోగారూఢపురుషునిగూడ నధఃపతనము నొందించుచున్న దనునప్పుడు యోగారోహేచ్ఛ గల పురుషుని నధఃపతన మేల పొందింపదు?

మఱియు నీతత్త్వవేత్త యగు పురుషుఁడు సర్వవిధములచేతను విషయలంపటపురుషులయొక్క సంగమునుండి విముక్తుఁడు కావలయు ననునీయర్థ మన్యగ్రంథములయందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. తస్మాచ్చరేత వై యోగీ సతాం ధర్మ మగర్హయన్ । జనా యథావమన్యేర న్గచ్ఛేయు ర్నైవ సంగతిమ్" — భావము॥ ఈతత్త్వవేత్త యగుపురుషుఁడు శ్రేష్ఠపురుషులయొక్క ధర్మములను దూషింపనివాఁడై, లోకమునందుఁ దన్ను విషయాసక్తపురుషు లవమానించి తనయొద్దకుఁ జేర కుండునట్లు చరింపవలయును.

మఱియు నీయర్థము మహాభారతమందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. అహే రివ గణా ద్భీతః సమ్మానా న్నరకా దివ । కుణపాదివచ స్త్రీభ్య స్తం దేవా బ్రాహ్మణం విదుః" — భావము॥ దేహాభిమానిపురుషులు సర్పమును జూచి భయమును బొందున ట్లేవిద్వాంసుఁ డగుపురుషుఁడు లోకసమూహమును జూచి భయమును బొందుచున్నాఁడో, మఱియు లోకులు నరకమునకు భయమును బొందున ట్లేవిద్వాంసుఁ డగు పురుషుఁడు సమ్మానమునకు భయమును బొందుచున్నాఁడో, మఱియు లోకులు మృతశరీరమును జూచి భయమును బొందున ట్లేవిద్వాంసుఁ డగు పురుషుఁడు స్త్రీజనులను జూచి భయమును బొందుచున్నాఁడో, ఆవిద్వాంసుఁ డగు పురుషుని దేవతలు బ్రాహ్మణుఁ డని చెప్పుదురు. అనఁగా జీవన్ముక్తుఁ డని చెప్పుదురు. మఱియు నుక్తార్థము శ్రీభాగవతమునందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. సంగం త్యజేత మిథున వ్రతినాం ముముక్షుః సర్వాత్మనా న విసృజే ద్బహిరింద్రియాణి । ఏక శ్చర న్రహసి చిత్త మనంత ఈశే యుంజీత తద్వ్రతిషు సాధుషు చే

త్యక్తసంగః॥ స్త్రీణాం తత్సంగినాం సంగం త్యక్త్వా దూరత ఆత్మవాన్ । క్షేమే వివిక్త ఆసీన శ్చింతయేన్మా మతంద్రితః ” — భావము॥ ముముక్షుజనులు విషయాసక్తస్త్రీపురుషులసంగమును సర్వప్రకారములచేతఁ బరిత్యజింపవలయును. అట్లే చక్షురాద్యేకాదశేంద్రియములను బాహ్యరూపాదివిషయములయందుఁ బ్రవర్తింపఁ జేయఁ గూడదు. ఏకారణముచేత ననఁగా, ఇంద్రియములను విషయములయందుఁ బ్రవర్తింపఁజేయుటవలన మనుభగవంతునిచేతను “ అకుర్వ న్విహితం కర్మ నిందితంచ సమాచరన్ । ప్రసజ న్నింద్రియార్థేషు నరః పతన మృచ్ఛతి ” అను వచనముచే నరకప్రాప్తి చెప్పఁబడి యున్నది. మఱే మనఁగా, ఈ ముముక్షు వేకాంతదేశమునం దేకాకియై యుండి యపరిచ్ఛిన్నుఁడైన యీశ్వరునియందుఁ జిత్తమును జేర్పవలయును. అనఁగా, నిరంతరము బ్రహ్మధ్యానముఁ జేయవలయును. ఒకవేళ నాచిత్తము తనచంచలస్వభావముచేఁ బరబ్రహ్మమునందు స్థితము కానియెడల నాపరబ్రహ్మమునందుఁ బ్రీతి గల యేమహాత్ము లున్నారో వారలయొక్క సంగముఁ జేయవలయును. మఱియు నీముముక్షుజనులు స్త్రీలయొక్కయు స్త్రీలయం దాసక్తు లగు పురుషులయొక్కయు సంగమును దూరముగాఁ బరిత్యజించి యేకాంతదేశమునందు స్థితులై పరమేశ్వరుఁడ నగు నన్ను “ అహం బ్రహ్మాస్మి ” యని ధ్యానింపవలయును.

ఆధ్యానముయొక్క ఫలము స్మృతియందును జెప్పఁబడి యున్నది. అందు “ శ్లో. అహ మస్మి పరం బ్రహ్మ వాసుదేవాఖ్య మవ్యయమ్ । ఇతి యస్య స్థిరా బుద్ధిః సముక్తో నాత్ర సంశయః ” — భావము॥ వాసుదేవనామము గల యుత్పత్తివినాశరహితపరబ్రహ్మ మేది గలదో ఆపరబ్రహ్మము నేనై యున్నా నను స్థిరబుద్ధి గల పురుషుఁడు ముక్తుఁడే యగుచున్నాఁడు. ఈయర్థమునందుఁ గించిన్మాత్రమును సంశయము లేదు.

మఱియు, ఈబ్రహ్మధ్యానముయొక్క ఫలము విష్ణుపురాణమునందు యమునిచేతను మృత్యువును గూర్చి చెప్పఁబడి యున్నది. అందు “ శ్లో. సకల మిద మహంచ వాసుదేవః పరమపుమా న్పరమేశ్వరః స యేకః । ఇతి మతి రచలా భవ త్యనంతే హృదయగతే వ్రజ తా న్విహాయదూరాత్ ” — భావము॥ ఈ సర్వజగత్తును నేనును వాసుదేవస్వరూపములే, ఆవాసుదేవుఁడు పరమపురుషుఁడును బరమేశ్వరుఁడును ఏకాద్వితీయుఁడు నని యీప్రకారముగా నేపురుషునకు హృదయదేశమునందుండు పరమాత్మయం దచలబుద్ధి కలుగుచున్నదో వారలను విడిచి, ఓమృత్యూ ! నీవు దూరముగాఁ బొమ్ము. అనఁగా పరబ్రహ్మధ్యానపరాయణులైన పురుషులకు మరల మత్యువు ప్రాప్త మగుట లేదు. అందువలన నిది సిద్ధ మగుచున్నది. ఏపురు

షుఁడు విషయాసక్తస్త్రీపురుషులయొక్క సంగము పరిత్యజించి బ్రహ్మచింతన చేయు చున్నాఁడో ఆపురుషునకు సర్వమలినవాసనలు నివృత్తము లగుచున్నవి.

ఇఁక సత్సంగమునకు వాసనానివృత్తిద్వారమున మోక్షసాధనత్వప్రతిపాదకవచనములు చెప్పఁబడుచున్నవి. “శ్లో. మహత్సేవాం ద్వారమాహు ర్విముక్తే స్తమోద్వారం యోషితాం సంగిసంగమ్। మహాంత స్తే సమచిత్తాః ప్రశాంతా విమన్యవః సుహృదః సాధవో యే”—భావము॥ విద్వాంసు లగు పురుషులు మహాపురుషులయొక్క సేవ ముక్తికి సాధన మనియును స్త్రీసంగము గల పురుషులయొక్క సంగము నరకప్రాప్తికి సాధన మనియును జెప్పుదురు. ఇచ్చట మహాపురుషు లనఁగా, సమచిత్తులు అనఁగా సమ మనఁబడు బ్రహ్మమునందు చిత్తము గలవారును, లేక, శత్రుమిత్రులయందు సమచిత్తము గలవారును, అధిక మగు శాంతస్వభావము గలవారును క్రోధరహితులును సుహృదులును అనఁగా అనుపకారులకును ఉపకారముఁ జేయువారును సాధువులును అనఁగా శమదమసంపన్నులును ఇట్టి గుణములతోఁ గూడిన పురుషులే మహాపురుషు లని చెప్పఁబడుదురు. అట్టి మహాపురుషులతో శ్రద్ధాభక్తిపూర్వక మైన సంగ మేది గలదో ఆసంగముగూడ మలినవాసనానివృత్తిద్వారమున మోక్షమునకే సాధన మగుచున్నది.

మఱియు స్త్రీతత్సంగులయొక్క సంగము నరకహేతు వని శాస్త్రమునందుఁ జెప్పఁబడి యున్నది. అందు “శ్లో. యోషి ద్ధిరణ్యాభరణాంబరాది ద్రవ్యేషు మాయారచితేషు మూఢః। ప్రలోభితాత్మా హ్యుపభోగబుద్ధ్యా పతంగవ న్నశ్యతి నష్టదృష్టిః”—భావము॥ స్త్రీ సువర్ణము భూషణము వస్త్రము ఇత్యాది మాయారచితపదార్థములయందు నాసక్తిని బొందిన మనస్సు గల యవివేకిపురుషుఁడు వివేకదృష్టి లేనికారణముచే నాపదార్థములయం దుపభోగబుద్ధిచేతఁ బతంగమువలె నాశముఁ బొందుచున్నాఁడు.

## [*] (14) మైత్ర్యాదిశుభవాసనానిరూపణము. [*]

ఇఁక మైత్రీకరుణాదివిరోధివాసనలచే మలినవాసనానివృత్తి చెప్పఁబడుచున్నది. ఆ మైత్ర్యాదివిరోధివాసనలు పతంజలిభగవానులచే యోగసూత్రమునందుఁ జెప్పఁబడి యున్నవి. అందు సూత్రము.—“మైత్రీ కరుణా ముది తోపేక్షాణాం సుఖదుఃఖపుణ్యాపుణ్యవిషయాణాం భావనాత శ్చిత్తప్రసాదనమ్”—భావము॥ మైత్రి కరుణ ముదిత ఉపేక్ష అను నీనాల్గింటిచే శుభవాసనలు గలుగుచున్నవి. అందు సుఖప్రాణులయం దీసర్వులును మనవారలే యను భావన యేది గలదో అది మైత్రి

యనఁబడును. మఱియు దుఃఖప్రాణులయందు మనకు దుఃఖము కలుగఁగూడ దనున ట్లే ప్రాణులకును దుఃఖము కలుగఁగూడ దనుభావన యేది గలదో అది కరుణ యనఁబడును. మఱియుఁ బుణ్యవంతు లగుపురుషులను జూచి కలుగు ప్రసన్నత యేది గలదో అది ముదిత యనఁబడును. పాపవంతు లగు పురుషులయందుఁ గలుగు నుదాసీనత్వ మేది గలదో అది యుపేక్ష యనఁబడును. ఈవిధ మైన మైత్ర్యాదిచతుర్విధ భావనలు గల పురుషునకు రాగద్వేషాసూయామదమాత్సర్యాది సర్వమలినవాసనలు నివృత్తము లగుచున్నవి. దానివలన నీపురుషునకుఁ జిత్తశుద్ధి కలుగుచున్నది. ఈప్రకారముగా గీతయొక్క షోడశాధ్యాయమునందు శ్రీభగవంతునిచే "అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగ వ్యవస్థితిః। దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్॥ (1) అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాంతి రపైశునమ్ । దయాభూతే ష్వలోలత్వం మార్దవం హ్రీ రచాపలమ్॥ (2) తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా । భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత॥ (3)" అను నీ మూఁడుశ్లోకములచేఁ జెప్పఁబడి యుండు దైవసంపద యేది గలదో ఆదైవసంపద్రూపవిరోధివాసనలయొక్క యభ్యాసముచేత దంభదర్పాద్యాసురసంపద్రూపమలిన వాసనలు నివృత్తము లగుచున్నవి.

ఈప్రకారముగానే గీతయొక్క త్రయోదశాధ్యాయమునందు శ్రీభగవంతునిచే "అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్ । ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః॥ (1) ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవచ। జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్॥ (2) అసక్తి రనభిష్వంగః పుత్ర దార గృహాదిషు । నిత్యంచ సమచిత్తత్వ మిష్టా నిష్టోపపత్తిషు॥ (3) మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ । వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది॥ (4) అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్ । ఏత జ్జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం యదతోన్యథా॥ (5)" అను నీయైదుశ్లోకములచేఁ జెప్పఁబడిన యమానిత్వాదంభిత్వాదిజ్ఞానసాధనము లేవి గలవో ఆసాధనాభ్యాసములచేత, దానికి విపరీతము లైన భ్రాంతిజ్ఞానసాధనము లగు మానదంభాదికముల నివృత్తి యగుచున్నది. ఈ గీతాశ్లోకార్థములు గూఢార్థదీపికయందు మాచే విస్తరముగా నిరూపింపఁబడి యున్నవి. దాని నచ్చటఁ దెలియవలయును. గ్రంథవిస్తరభీతిచే నిచ్చట విరమించితిమి.

ఈరీతిగా నావిద్వత్సన్న్యాసి యెప్పుడు సంకల్పపూర్వకముగా మైత్ర్యాది శుభవాసనలను దైవసంపత్తును అమానిత్వాదిధర్మములను అభ్యాసముచేత సంపా

దించుచున్నాఁడో, అప్పుడే వానికి సూర్యోదయముచే నంధకారము నివృత్తమగు నట్లు పూర్వోక్తసర్వమలినవాసనలు నివృత్తము లగుచున్నవి.

## [*] (15) అజిహ్వాత్వాదినిరూపణము. [*]

తదనంతరము మావిద్వత్సన్న్యాసి యజిహ్వాత్వాదిషడ్ధర్మములను అభ్యాసముచేత సంపాదింపవలయును. ఆ యజిహ్వాత్వాదిధర్మములు స్మృతియందుఁ జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. అజిహ్వ ష్షండకః పంగు రంధో బధిర ఏవచ । ముగ్ధశ్చ ముచ్యతే భిక్షు ష్షడ్భి రేతై ర్న సంశయః"— భావము॥ అజిహ్వాత షండత పంగుత అంధత బధిరత ముగ్ధత అను నీషడ్ధర్మములను సేవించుటవలన సన్న్యాసి జీవన్ముక్తిని బొందుచున్నాఁడు. అందువలన సన్న్యాసి యీషడ్ధర్మముల నవశ్యము సంపాదింపవలయును.

ఇఁక, అజిహ్వాత్వాదిషడ్ధర్మములయొక్క లక్షణములు క్రమముగా శాస్త్రప్రమాణముచేత నిరూపింపఁబడు చున్నవి.

అజిహ్వాలక్షణము.—"శ్లో. ఇద మిష్ట మిదం నేతి యో ఽశ్న న్నపి న సజ్జతే । హితం సత్యం మితం వక్తి తమజిహ్వం ప్రచక్షతే"—భావము॥ ఏసన్న్యాసి యన్నాదులను భక్షించినను ఈయన్నము స్వాదువు ఈయన్న మస్వాదు వని తలంపఁడో హితము సత్యము మితము నగు వచనము నుచ్చరించుచున్నాఁడో ఆసన్న్యాసి యజిహ్వుఁ డనఁబడును.

షండలక్షణము.—"శ్లో. అద్య జాతాం యథా నారీం తథా షోడశవార్షికీమ్ । శతవర్షాంచ యో దృష్ట్వా నిర్వికార స్స షండకః"— భావము॥ ఈదినమందు జన్మించిన యతిబాలిక యగు స్త్రీని జూచినను, శతవర్షములు గల యతివృద్ధస్త్రీని జూచినను ఎట్లు కామవికారము కలుగుట లేదో, అట్లేసన్న్యాసి షోడశవర్షములు గల యౌవనస్త్రీని జూచినను గామవికారరహితుఁ డగుచున్నాఁడో ఆసన్న్యాసి షండుఁ డనఁబడును. నపుంసకునకు షండుఁ డని నామము.

పంగులక్షణము.—"శ్లో. భిక్షార్థమటనం యస్య విణ్మూత్రకరణాయ చ । యోజనా న్న పరం యాతి సర్వథా పంగు రేవ సః"—భావము॥ ఏసన్న్యాసి భిక్షకొఱకును మలమూత్రములను విసర్జించుటకొఱకును బోవువాఁడును వేఱొకప్రయోజనముకొఱకుఁ బోవనివాఁడును, మఱియు నేసన్న్యాసి యొకయోజనదూరమున కధికముగాఁ బోవనివాఁడును నగుచున్నాఁడో ఆసన్న్యాసి పంగు వనఁబడును.

అంధలక్షణము.—"శ్లో. తిష్ఠతో వ్రజతో వాపి యస్య చక్షు ర్న దూరగమ్ । చతుర్యుగాం భువం త్యక్త్వా పరివ్రాట్సో ఽంధ ఉచ్యతే"— భావము॥ ఏ

సన్న్యాసియొక్క-చతురింద్రియ మతఁడు నిలిచి యున్నను లేక నడచుచున్నను జతుర్హ్యాగ్రప్రమాణము గల భూమిని విడిచి దూరముగాఁ బోవుట లేదో యాసన్న్యాసి యంధుఁ డనఁబడును. ఇచ్చట నాలుగుమూరలు యుగ మనఁబడును. పదియాఱు మూరలు గల పరిమాణము చతుర్యుగ మనఁబడును.

బధిరలక్షణము.—"శ్లో. హితాహితం మనోరామం వచ శ్శోకవహం చ యత్ । శ్రుత్వాపి న శృణో తీవ బధిర స్స ప్రకీర్తితః "— భావము॥ ఏసన్న్యాసి హర్షమును గలిగించునట్టియనుకూలవచనములును శోకమును గలిగించునట్టిప్రతికూల వచనములును వినియును విననియ ట్లుండునో అనఁగా హర్షశోకములను బొందని వాఁడో ఆసన్న్యాసి బధిరుఁ డనఁబడును.

ముగ్ధలక్షణము.—"శ్లో. సాన్నిధ్యే విషయాణాంచ సమర్థో ఽవికలేంద్రియః । సుప్తవ ద్వర్తతే నిత్యం సభిక్షు ర్ముగ్ధఉచ్యతే "— భావము॥ విషయములను సమీపించినప్పు డేసన్న్యాసి వాని ననుభవించుటకు సమర్థుఁ డయ్యును సర్వేంద్రియములచే సంపన్నుఁ డయ్యును ఆవిషయములయందుఁ బ్రవర్తింపక సుప్తపురుషుని వలె ఆవిషయములనుండి యుపరామమును బొందియున్నాఁడో ఆసన్న్యాసి ముగ్ధుఁ డనఁబడును. ఈప్రకారముగా నజిహ్వాత్వాదిషడ్ధర్మములయొక్క-యభ్యాసానంతరము చిన్మాత్రవాసనాభ్యాసము చేయవలయును.

## [*] (16) చిన్మాత్రవాసనానిరూపణము. [*]

అచ్చట, ఈనామరూపాత్మకసర్వజగత్తు చైతన్యమునందుఁ గల్పిత మగుట వలన స్వతస్సత్తాస్ఫురణరహితమై యున్నది. అందువలన నధిష్ఠానచైతన్యముయొక్క-సత్తాస్ఫురణపూర్వకముగానే జగత్తుయొక్క-సత్తాస్ఫురణము లున్నవి. ఈరీతిగా జగత్తునందు నామరూపము లనురెం డంశములయొక్క- మిథ్యాత్వనిశ్చయమువలన నుపేక్ష చేసి సర్వత్ర పరిపూర్ణ మైన అస్తిభాతిప్రియరూపాధిష్ఠానచైతన్యము నేనను నిరంతరభావన యేది గలదో, అది చిన్మాత్రవాసన యనఁబడును.

ఆచిన్మాత్రవాసనయును ద్వివిధము, ఒకటి కర్తృకర్మకరణము లను త్రిపుటి యొక్క-స్మరణతోఁ గూడిన చిన్మాత్రవాసన, మఱియొకటి త్రిపుటీస్మరణరహితకేవల చిన్మాత్రవాసన. అందు, నే నీసర్వజగత్తును నామనస్సుచేతఁ జిన్మాత్రరూపముగాఁ దెలిసికొనుచున్నాను. అని యీప్రకారముగాఁ జేయఁబడినభావన యేది గలదో ఆభావన ప్రథమ మగు త్రిపుటీపూర్వకచిన్మాత్రవాసన యనఁబడును.

ఈ చిన్మాత్రవాసనకు సంప్రజ్ఞాతసమాధికోటియం దంతర్భావ మున్నది. అనఁగా, ఈప్రథమచిన్మాత్రవాసననే యోగశాస్త్రజ్ఞులు సంప్రజ్ఞాతసమాధి యందురు. మఱియు, కర్తృకర్మకరణాఖ్యత్రిపుటీస్మరణరహితముగాఁ జిన్మాత్రము నేను అనుభావన యేది గలదో యాభావన కేవలచిన్మాత్రవాసన యనఁబడును. ఈ కేవల చిన్మాత్రవాసన కసంప్రజ్ఞాతసమాధికోటియం దంతర్భావ మున్నది. అనఁగా, ఈ కేవలచిన్మాత్రవాసననే యోగశాస్త్రజ్ఞ లసంప్రజ్ఞాతసమాధి యందురు.

సర్వజగత్తునకుఁ జిన్మాత్రరూపత్వము శుక్రునిచే బలిని గూర్చి చెప్పఁబడి యున్నది. అందు "శ్లో. చిదిహా స్తీహ చిన్మాత్రం సర్వం చిన్మయ మేవ తత్ । చిత్త్వం చిదహ మేతే చ లోకా శ్చిదితి సంగ్రహః" — భావము॥ ఓరాజా! ఈ సర్వజగత్తునందుఁ జైతన్యమే యధిష్ఠానరూపముచే వ్యాప్తమై యున్నది. అందువలన నీసర్వజగత్తును జైతన్యమాత్రమే, నీవును జైతన్యరూపుఁడవే, నేనును జైతన్యరూపుఁడనే, ఈసర్వలోకమును జైతన్యరూపమే. ఈప్రకారముగాఁ జిన్మాత్రవాసనను దృఢముగా నభ్యసింపఁగాఁ, బూర్వోక్తసర్వమలినవాసనలును నివృత్తము లగుచున్నవి. ఇదియే వాసనాక్షయాభ్యాసము.

### [*] (17) మనస్సుయొక్కస్వరూపనిరూపణము. [*]

ఇఁక మనోనాశముఁ జెప్పుటకొఱకుఁ బ్రథమమున మనస్సుయొక్కస్వరూపము చెప్పఁబడుచున్నది. లాక్షాసువర్ణాదులవలె సావయవమును గామాదివృత్తిరూపముగాఁ బరిణమించునదియు నైన యేయంతఃకరణ మున్నదో ఆయంతఃకరణమే మననరూప మగుటవలన మన స్సని చెప్పఁబడును. ఆమనస్సు సత్త్వరజస్తమోనామక త్రిగుణరూపమై యున్నది. ఎట్లనఁగా, సత్త్వరజస్తమస్సు లను త్రిగుణములకుఁ గ్రమముగా వికారరూపము లగు సుఖదుఃఖమోహము లనుత్రివిధధర్మము లున్నవి. ఆత్రివిధధర్మములును మనస్సు నాశ్రయించుకొనియే ప్రతీతము లగుచున్నవి. అందువలన నామనస్సునందు సత్త్వాదిత్రిగుణరూపత్వమే సిద్ధ మగుచున్నది. ఆమనస్సు రాజసతామసవృత్తులచే వృద్ధి పొందినదై యతిస్థూల మగుచున్నది. ఆ స్థూలమన స్సాత్మసాక్షాత్కారముకొఱకు యోగ్య మగుట లేదు. ఏల యన, దుర్విజ్ఞేయ మగుటవలన నాత్మ యతిసూక్ష్మమై యున్నది. అట్టిసూక్ష్మ మగునాత్మను స్థూలమనస్సుచే సాక్షాత్కరించుకొనుటకు సాధ్యము కాదు. స్థూల మగు కుద్దాలముచే సూక్ష్మ మగువస్త్రము కుట్టుటకు సాధ్యము గాక, సూక్ష్మ మగుసూచి (సూది) చేతనే యెట్లు కుట్టఁబడు చున్నదో, అట్లే సూక్ష్మ మనస్సుచేతనే సూక్ష్మ మగు నాత్మ సాక్షాత్కరింపఁబడుచున్నది.

మఱియు "దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః" అను శ్రుతియును అతిసూక్ష్మ మగు బుద్ధిచేతనే యాత్మసాక్షాత్కారము కలుగు నని చెప్పుచున్నది. అందువలన నాత్మసాక్షాత్కారముకొఱకు మనస్సుయొక్కసూక్ష్మత్వ మవశ్య మపేక్షితమై యున్నది. ఆమనస్సుయొక్కసూక్ష్మత్వము రాజసతామసవృత్తులయొక్కనిరోధముచేత సిద్ధించుచున్నది. అందువలన నావృత్తులను నిరోధించి మనస్సుయొక్కసూక్ష్మత్వమును సంపాదించుట యేది గలదో అదియే మనోనాశమై యున్నది.

ఇచ్చటఁ దాత్పర్య మే మనఁగా, ఆమనోనాశము అరూపనాశము సరూపనాశ మనుభేదముచేత ద్విప్రకారమై యున్నది. అందు మనస్సునకుఁ బున రుత్థానము లేక స్వరూపముచేత నాశ మేది గలదో అది యరూపనాశ మనఁబడును. మఱియు స్వరూపముచే నాశముననున్నను ఉపాయముచే నామనోవృత్తులయొక్క నాశ మేది గలదో యది సరూపనాశ మనఁబడును. అచ్చట మనస్సుయొక్క యరూపనాశముచేత నైననో, యీతత్త్వవేత్త యగు పురుషునకు విదేహముక్తి కలుగుచున్నది. మఱియు మనస్సుయొక్కసరూపనాశముచేత జీవన్ముక్తి కలుగు చున్నది. అందువలన మనోనాశశబ్దముచేత నిచ్చట సరూపమనోనాశమే వివక్షిత మై యున్నది.

[*] (18) వృత్తినిరోధనిరూపణము. [*]

శంక:—రాజసతామసవృత్తులను నిరోధించి మనస్సుయొక్కసూక్ష్మతను సంపాదించుట మీరు మనోనాశ మని చెప్పితిరి. ఆవృత్తులయొక్కనిరోధ మే యుపాయముచేత నగును?

సమాధానము:—ఆవృత్తులయొక్కనిరోధోపాయము వసిష్ఠభగవానులచేఁ జతుర్విధముగాఁ జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. అధ్యాత్మవిద్యాధిగమో సాధుసంగమ ఏవచ। వాసనా సంపరిత్యాగః ప్రాణస్పందనిరోధనమ్॥ (1) ఏ తాస్తా యుక్తయః పుష్టాః సంతి చిత్తజయే కిల॥ (2)"—భావము॥ అధ్యాత్మవిద్యాధిగమము సాధుసంగమము వాసనాసంపరిత్యాగము ప్రాణస్పందనిరోధనము అను చతుర్విధోపాయములు చిత్తమును జయించుటకుఁ బ్రబలకారణములై యున్నవి.

అచ్చట, ప్రత్యగాత్మను బ్రహ్మరూపముగాఁ జెప్పునట్టి యేవిద్య యున్నదో అది యధ్యాత్మవిద్య యనఁబడును. ఆయధ్యాత్మవిద్యయొక్కప్రాప్తి యేది గలదో, అది యధ్యాత్మవిద్యాధిగమమై యున్నది. అదియును చిత్తజయమునకు సాధనమై

యున్నది. ఎట్లనఁగా, ఈ నామరూపాత్మకసర్వజగత్తు మిథ్యయే, నేనే సర్వత్ర పరిపూర్ణుఁడను బరమానందుఁడను ఏకరసుండను నాకన్న భిన్నముగా వేఱొకకారణకార్యములు లేవు, నేనే సర్వరూపుండను, అను నధ్యాత్మవిద్య ప్రాప్తము కాఁగాఁ దత్త్వవేత్త యగుపురుషుఁడు సర్వదృశ్యప్రపంచమును మిథ్యారూపముగాఁ దెలియుచున్నాఁడు. అందువలన నావిద్వాంసునియొక్క మనస్సు దృశ్యప్రపంచమందును బ్రవర్తింపదు. మఱియు నాత్మ యైననో మనోవాక్కుల కవిషయమై యున్నది. అందువలన నాత్మయందును ఆమనస్సునకుఁ బ్రవృత్తి కలుగుట లేదు. ఈప్రకారముగా నాంతరబాహ్యప్రవృత్తిరహిత మైన యామనస్సు సర్వవృత్తులయొక్క యనుదయమువలన నింధనరహిత మగు నగ్నివలె స్వాధిష్ఠానరూపకారణమందు లయమొందుచున్నది. అందువలన నధ్యాత్మవిద్యయొక్క ప్రాప్తి మనోనాశమునందు ముఖ్యకారణమై యున్నది.

మఱియు నేపురుషుఁడు బుద్ధిమాంద్యముచేత నాయధ్యాత్మవిద్య సంపాదించుటయందు నసమర్థుఁడై యున్నాఁడో ఆపురుషునిగూర్చి ద్వితీయ మగు సాధుసంగమ ముపాయమై యున్నది. ఏలాగున ననఁగా, మహాత్ము లగుపురుషు లీయధికారిపురుషుని మాటిమాటికిఁ బ్రత్యగాత్మయొక్క బ్రహ్మరూపత్వమును జగన్మిథ్యాత్వమును స్మరింపఁజేయు చున్నారు. అట్లే బోధించుచున్నారు. దానిచేత నీయధికారిపురుషున కధ్యాత్మవిద్య ప్రాప్తమై మనోనాశము కలుగుచున్నది. అందువలన సాధుసంగమముగూడ నధ్యాత్మవిద్యయొక్క ప్రాప్తిద్వారమున మనోనాశమున కుపాయమై యున్నది.

మఱియు నేపురుషుఁడు, విద్యామదము ధనమదము కులమదము ఆచారమదము ఇత్యాదిమదములతోఁ గూడినవాఁడై సాధుసంగమముగూడఁ జేయ నశక్తుఁడో ఆపురుషుని గూర్చి మనోనిరోధమునకు వాసనాసంపరిత్యాగరూపోపాయము చెప్పఁబడి యున్నది. ఇచ్చట వివేకముచే విద్యామదాదిరూపమలినవాసనానివర్తన మేది గలదో, అది వాసనాసంపరిత్యాగ మనఁబడును.

### (19) విద్యామదాదులస్వరూపమును దన్నివర్తకవివేకస్వరూపమును నిరూపించుట.

ఇఁక, అవిద్యామదాదులయొక్క స్వరూపమును వానినివృత్తి చేయు వివేకముయొక్క స్వరూపమును జెప్పఁబడుచున్నది. ఈభూతలమునందు నేనొక్కఁడే పండితుఁడను, నాకన్న వేఱొకపండితుఁడు లేఁడు, ఏపురుషుఁడు పండితుఁ డనఁబడు

చున్నాఁడో వానికేమియుఁ దెలియదు, ఈప్రకారమైన మానసాభిమానమేది గలదో ఆయభిమానము విద్యామద మనఁబడును. ఆవిద్యామద మీవిధమైన వివేకమువలన నివృత్త మగుచున్నది. అది యేవిధ మనఁగా, పండితత్వాభిమానము గల బాలాకిశాకల్యాదులకును అజాతశత్రుయాజ్ఞవల్క్యాదివిద్వాంసులచేఁ బరిభవము గలిగెను. మనుష్యులు మొదలు శ్రీదక్షిణామూర్తిపర్యంతము తారతమ్యముచేత విద్యయొక్కయుత్కర్షము చూడఁబడుచున్నది. సర్వులకు నాదిగురు వగు శ్రీదక్షిణామూర్తి యగు సదాశివునియందే నిరతిశయ మగు విద్యయొక్కయుత్కర్ష మున్నది. తదితరసర్వపండితులయందు సాతిశయ మగు విద్యయొక్కయుత్కర్ష మున్నది. అందువలన నాకుఁగూడ నధికులైన కొందఱుపండితులచేతఁ బరాభవము కలుగునని నిరంతరము చింతన చేయుటవలన నావిద్యామదము నివృత్త మగుచున్నది.

మఱియు నేనే ధనవంతుఁడను, నాకు సమానుఁడైనధనవంతుఁ డెవ్వఁడును లేఁడను నేమానసాభిమాన మున్నదో అది ధనమద మనఁబడును. ఆధనమదముకూడ నీప్రకారమైన వివేకముచే నివృత్త మగుచున్నది. ఆప్రకార మెట్లనఁగా, లక్షపతిపురుషునిచేఁ జేయఁబడిన యేవ్యవహార మున్నదో, ఆవ్యవహారము లక్షపతిపురుషునియందు సంభవింపదు. అందువలన లక్షపతిపురుషునిచేత నలక్షపతిపురుషునకుఁ బరాభవము కలుగుచున్నది. ఈరీతిగానే కోటిపతిపురుషునిచేత నాలక్షపతిపురుషునకును బరాభవము కలుగుచున్నది. నాది యెంతమాత్రము? నాకన్న నధికులగు కుబేరసమానులైన బహుధనవంతు లున్నారు. ఈప్రకారముగా నిరంతరము చింతన చేయుటవలన నాధనమదము నివృత్త మగుచున్నది.

ఈరీతిగానే నాకులము సర్వకులములకన్న శ్రేష్ఠ మను నభిమానరూప మగు కులమదమును, నాయొక్కయాచారము సర్వాచారములకన్న శ్రేష్ఠ మను నభిమానరూప మగు నాచారమదము నను నీద్వివిధమదములును దత్తద్యోగ్య మగు వివేకమువలన నివృత్తము లగుచున్నవి. ఈప్రకారమైన వివేకముచేత నేపురుషుఁడు విద్యామదాదిమలినవాసనలను నివర్తించుచున్నాఁడో, ఆపురుషునకు సాధుసంగమాదులయొక్కప్రాప్తివలన నామనోనాశము సిద్ధించుచున్నది. అందువలన నావాసనాసంపరిత్యాగముగూడ మనోనాశమున కుపాయమై యున్నది.

మఱియు నామలినవాసనలయొక్కయతిప్రబలతవలన నేపురుషుఁ డుక్తవివేకముచే నావాసనలను బరిత్యజించుటయందు సామర్థ్యము లేనివాఁ డగుచున్నాఁడో, ఆపురుషునిగూర్చి శాస్త్రములు ప్రాణస్పందనిరోధరూపోపాయముఁ జెప్పి

యున్నవి. అనఁగా నాపురుషునకుఁ బ్రాణనిరోధముచేత మనోనాశము సిద్ధించు చున్నది.

## [*] (20) ప్రాణనిరోధోపాయనిరూపణము. [*]

ఇఁక, ప్రాణనిరోధోపాయము నిరూపింపఁబడుచున్నది. అందు "శ్లో. ప్రాణాయామ దృఢాభ్యాసా ద్యుక్త్యాచ గురుదత్తయా । ఆసనాశనయోగేన ప్రాణ స్పందో నిరుధ్యతే" — భావము॥ యోగాభ్యాసముఁ జేయు గురువువలనఁ బొందఁ బడిన యేయుక్తి యున్నదో ఆయుక్తిచేతఁ జేయఁబడిన ప్రాణాయామముయొక్క దృఢాభ్యాస మేది గలదో ఆయభ్యాసముచేతను ఆసనయోగముచేతను అశనయోగముచేతను ప్రాణములయొక్క గతి నిరుద్ధ మగుచున్నది.

ఇఁక, ఈశ్లోకార్థము విస్తరముగా నిరూపింపఁబడుచున్నది. దానియందుఁ బ్రథమమునఁ బ్రాణాయామముయొక్క విభాగము చెప్పఁబడుచున్నది. ఆప్రాణాయామము పూరకము రేచకము కుంభక మను భేదముచేతఁ ద్రివిధ మగుచున్నది. అందు వామనాసికచేత బాహ్యవాయువు నాంతరమునకుఁ బూరించుట పూరక మనఁబడును. దక్షిణనాసికచే నాంతరవాయువును బాహ్యమునకు విడుచుట రేచక మనఁబడును. ఆప్రాణవాయువును నిలుపుట కుంభక మనఁబడును.

మఱియు నాకుంభకముకూడ నాంతరబాహ్యభేదముచే ద్వివిధమై యున్నది. అందుఁ బూరింపఁబడిన ప్రాణవాయువును హృదయదేశమందు నిలుపుట యాంతరకుంభక మనఁబడును. రేచింపఁబడిన ప్రాణవాయువును శరీరముయొక్క బాహ్యదేశమందు నిలుపుట బాహ్యకుంభక మనఁబడును. అచ్చట, 16 షోడశమాత్రలచేఁ బూరింపవలయును. 32 ద్వాత్రింశన్మాత్రలచే రేచింపవలయును. 64 చతుష్షష్టిమాత్రలచేఁ గుంభకము చేయవలయును. అనఁగాఁ బూరకమునకన్న ద్విగుణము రేచింపవలయును, రేచకముకన్న ద్విగుణము కుంభింపవలయును. ఇచ్చట మాత్ర యనఁగాఁ గాలపరిమాణమై యున్నది. ఇది యాత్మపురాణముయొక్క యోకాదశాధ్యాయమునందు విస్తరముగాఁ జెప్పఁబడి యున్నది. ఈవిధమైన ప్రాణాయామాభ్యాసమువలన నాప్రాణగతి నిరుద్ధ మగుచున్నది. ఆప్రాణనిరోధమువలన మనోనాశము కలుగుచున్నది.

మఱియుఁ బ్రాణాయామమునకుఁ బ్రాణనిరోధద్వారమున మనోనాశము యొక్క యుపాయత్వము శ్రుతియందును జెప్పఁబడి యున్నది. అది యెట్లనఁగా, యోగులు ద్వివిధులై యున్నారు. దైవసంపద్రూపశుభవాసన గల యోగి యొ

కఁడు, దైవసంపద్రహితుఁడై యాసురసంపద్రూపమలినవాసన గల యోగి మఱి యొకఁడు. అందుఁ బ్రథముఁ డగు యోగి కైననో శ్రుతి పూర్వమంత్రముచేత నిరంతరబ్రహ్మచింతనారూపరాజయోగము నుపదేశించుచున్నది. ఆపూర్వమంత్ర మేది యనఁగా, “త్రిభి రున్నతం స్థాప్య సమం శరీరం హృ దీంద్రియాణి మనసా స న్నివేశ్య । బ్రహ్మోడుపేన ప్రతరేత విద్వాన్ స్రోతాంసి సర్వాణి భయావహాని ”—భావము॥ ఈవిద్వాంసుఁ డగు యోగి యేకాంతదేశమునందుఁ బవిత్రాసనముపైఁ దనశరీరమును గటిగ్రీవాదిదేశములతో సమముగా నిలిపి తనహృదయదేశమునందు మనస్సహితసర్వేంద్రియములను నిరోధించి “అహం బ్రహ్మాస్మి” యని నిరంతరము చింతన చేయవలయును. ఆబ్రహ్మచింతనారూపనౌకచేత నావిద్వాంసుఁ డగు యోగి భయమును బ్రాప్తింపఁజేయు నట్టి మాయారూపనదీప్రవాహమును దరింపవలయును.

మఱియు ద్వితీయ మగు యోగినిగుఱించియో శ్రుతి ద్వితీయమంత్రముచేతఁ బ్రాణనిరోధోపాయరూపహఠయోగము నుపదేశించుచున్నది. ఆద్వితీయమంత్ర మేది యనఁగా, “ప్రాణా న్ప్రపీడ్యేహ స యుక్తచేష్టః క్షీణే ప్రాణే నాసికయో చ్ఛ్వసీత । దుష్టాశ్వయుక్త మివ వాహ మేవం విద్వా న్మనోధారయే దప్రమత్తః ”—భావము॥ యుక్తాహారవిహారాదికచేష్టలు గల యోగి పూర్వోక్త పూరక రేచక కుంభక క్రమముగాఁ బ్రాణాయామము చేసి ప్రాణగతినిరోధము చేయవలయును. తదనంతర మెట్లు ప్రమాదరహితుఁ డైన సారధి యగు పురుషుఁడు దుష్టాశ్వయుక్తరథమును బలాత్కారముగా శ్రేష్ఠమార్గమునందు నిలుపుచున్నాఁడో అట్లు ప్రమాదరహితుఁ డైన విద్వాంసుఁ డగు యోగి దుష్టేంద్రియయుక్తమనస్సును విషయములనుండి నివర్తించి యానందైకరసబ్రహ్మమునందు నిలుపవలయును. అనఁగా ఆబ్రహ్మమునందుఁ జిత్తము నేకాగ్రముఁ జేయవలయును.

## [*] (21) ఆసనయోగము. [*]

ఇఁక, ఆసనయోగము నిరూపింపఁబడుచున్నది. ఆసనయోగముయొక్క స్వరూపము సాధనము ఫలము అను నీమూఁడును బతంజలిభగవానులచేతఁ గ్రమముగా “స్థిరసుఖ మాసనమ్, ప్రయత్నశైథిల్యానంతసమాపత్తిభ్యామ్, తతో ద్వంద్వా నభిఘాతః” అను నీత్రివిధసూత్రములచేఁ జెప్పఁబడి యున్నది. ఈత్రివిధసూత్రములయొక్క తాత్పర్య మే మనఁగా, చలనరహితమును సుఖము నిచ్చునట్టిదియు నైన యాసన మేది గలదో అదియే యోగమున కంగ మైన యాసన మనఁబడును. ఆ యాసనము ప్రయత్నశైథిల్యము అనంతసమాపత్తి అను రెండుసాధనములచేత సిద్ధ

మగుచున్నది. అందు లౌకికవైదికకర్మములయొక్క త్యాగ మేది గలదో అది ప్రయత్నశైథిల్య మనఁబడును. ఏపురుషుఁడు లౌకికవైదికమార్గములయందుఁ బ్రవర్తించుచున్నాఁడో ఆపురుషున కాస్థిరాసనము కలుగనేరదు. అందువలన నాలౌకికవైదికకర్మములయొక్క త్యాగముగూడ నాయాసనమునకు సాధనమై యున్నది. మఱియు నే యనంతభగవంతుఁడు తనసహస్రఫణములపై నీపృథివిని ధరించి వర్తించుచున్నాఁడో ఆయనంతభగవంతుఁడు నేను అను చింతన యేది గలదో అది యనంతసమాపత్తి యనఁబడును. ఈ యనంతసమాపత్తిచేత నాసనప్రతిబంధకము లగు కంపితములు నశించుచున్నవి. ఆయాసనజయమువలన నీయోగికి శీతోష్ణాదిద్వంద్వముల యొక్క తాడనము కలుగదు. అనఁగా శీతోష్ణాదిద్వంద్వములయొక్క నివృత్తి యేది గలదో అదియే ఆయాసనయోగమునకు ఫలమై యున్నది.

## [*] (22) అశనయోగనిరూపణము. [*]

ఇఁక, అశనయోగము చెప్పఁబడుచున్నది. అందు "శ్లో. ద్వౌ భాగౌ పూరయే దన్నై ర్జలే నైకం ప్రపూరయేత్ । మారుతస్య ప్రచారార్థం చతుర్థ మవశేషయేత్ " — భావము॥ యోగాభ్యాసము చేయునట్టి పురుషుఁడు తనయుదరమును రెండుభాగము లన్నముచేతను ఒక్క భాగము జలముచేతను నిండింపవలయును, మఱియుఁ బ్రాణవాయువు సుఖముగా సంచరించుటకొఱకు నొకభాగము నూరకయుంపవలయు. ఈప్రకార మైన ప్రాణాయామము, ఆసనయోగము, అశనయోగము అను మూటిచేఁ బ్రాణగతికి నిరోధము కలుగుచున్నది. ఆప్రాణమునకు నిరోధము కలుగఁగా సర్వచిత్తవృత్తులు నిరుద్ధము లగుచున్నవి. ఏకారణముచేత ననఁగా, చిత్తవృత్తులయొక్క యుదయము ప్రాణగతియొక్క యధీనమే యగుచున్నది. ఇచ్చటఁ దాత్పర్య మే మనఁగా, ఏపదార్థ మేవస్తువుయొక్క యధీన మగుచున్నదో, ఆపదార్థ మావస్తువుయొక్క నిరోధ మగునప్పుడు నిరుద్ధ మగుచున్నది. ఎట్లు పటము తంతువులయొక్క యధీన మగుటవలన నాతంతువులు నిరుద్ధములు కాఁగా నాపటము నిరుద్ధ మగుచున్నదో, మఱియు నెట్లు బాహ్యేంద్రియములు చిత్తముయొక్క యధీనము లగుటవలనఁ జిత్తము నిరుద్ధము కాఁగా నాయింద్రియములు నిరుద్ధము లగుచున్నవో అట్లే చిత్తవృత్తులు ప్రాణగతి కధీనము లగుటవలనఁ బ్రాణము నిరుద్ధము కాఁగా నా చిత్తవృత్తులు నిరుద్ధము లగుచున్నవి. తదనంతరము స్వభావముగానే యాత్మానాత్మాకార మగు నంతఃకరణ మేది యున్నదో ఆయంతఃకరణ మనాత్మాకారవృత్తులు నిరుద్ధములు కాఁగా నేకాత్మాకారమే యగుచున్నది. ఈప్రకార మైనచిత్తవృత్తులయొక్క నిరోధ మేది గలదో ఆనిరోధమే మనోనాశ మని చెప్పఁబడును. ఇట్టి మనోనాశము

బ్రాహ్మణము కాఁగా నీవిద్వాంసుఁ డగు పురుషున కాత్మైకాకారమనస్సుచేత నానంతైకరసాపరిచ్ఛిన్నరూపప్రత్యగాత్మ యొక్క యనుభవము కలుగుచున్నది. ఉక్తార్థము పూర్వవృద్ధాచార్యులచే "ఆత్మానాత్మాకారం స్వభావతో ఽవస్థితం సదాచిత్తమ్। ఆత్మైకాకారతయా తిరస్కృతానాత్మదృష్టి విదధీత" అను శ్లోకముచేతఁ జెప్పఁబడి యున్నది.

పూర్వోక్తవృత్తులయొక్క నిరోధమును పాతంజలశాస్త్రజ్ఞులు యోగ మని చెప్పుచున్నారు. అందుఁ బతంజలిసూత్రము.—"యోగ శ్చిత్తవృత్తి నిరోధః"— భావము॥ చిత్తముయొక్క సర్వవృత్తులనిరోధ మేది గలదో అది యోగ మనఁబడును. అచ్చట, ప్రమాణము విపర్యయము వికల్పము నిద్ర స్మృతి అని చిత్తవృత్తులు పంచ విధములై యున్నవి. అందుఁ బ్రమాణజన్యప్రమాజ్ఞాన మేది గలదో అది ప్రమావృత్తి యనఁబడును. యోగశాస్త్రమం దైననో ప్రత్యక్షము అనుమానము శబ్దము అను త్రివిధప్రమాణములే యంగీకరింపఁబడి యున్నవి. అందువలన వారిమతము నందుఁ బ్రమావృత్తియును త్రివిధమై యున్నది. మఱియు వేదాంతసిద్ధాంతమునందు ప్రమాణము, ప్రత్యక్షము అనుమానము ఉపమానము శబ్దము అర్థాపత్తి అనుపలబ్ధి అనుభేదముచేత షట్ప్రకారముగా నంగీకరింపఁబడి యున్నది. అందువలన వేదాంతసిద్ధాంతమునందు ప్రమావృత్తియును షట్ప్రకారమే యగుచున్నది. ఈ షడ్విధప్రమావృత్తులును ద్వితీయపరిచ్ఛేదమునందు విస్తరముగా నిరూపింపఁబడి యున్నవి.

మఱియు, మిథ్యాజ్ఞానము విపర్యయ మనఁబడును. సంశయము వికల్ప మనఁబడును. సంస్కారజన్యజ్ఞానము స్మృతి యనఁబడును. ఈ మూటియొక్క స్వరూపము పూర్వము తృతీయపరిచ్ఛేదమునందు విస్తరముగా నిరూపింపఁబడి యున్నది. మఱియుఁ దామసవృత్తి నిద్ర యనఁబడును. ఈ పంచవిధవృత్తులయొక్క నిరోధము యోగ మనఁబడును. లేక, పూర్వము చెప్పఁబడిన మైత్రీకరుణాదిదైవవృత్తులును దంభదర్పాద్యాసురవృత్తులు నైన సర్వవృత్తులయొక్క నిరోధము యోగ మనఁబడును.

శంక:—ఆవృత్తులయొక్క నిరోధమునకు సాధన మేది?

సమాధానము:—పతంజలిభగవానులు "అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః" అను సూత్రముచేత నభ్యాసము వైరాగ్యము అను నీరెండే యావృత్తి నిరోధమునకు సాధన మని చెప్పి యున్నారు. అట్లే శ్రీభగవంతుఁడును గీతయందు "అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్ । అభ్యాసేనతు కౌంతేయ

వైరాగ్యేణ చ గృహ్యతే" అను శ్లోకముచేత మనోనిగ్రహమున కభ్యాసవైరాగ్యములే సాధనము లని చెప్పి యున్నాఁడు. అచ్చట నేవస్తువునందు దోషదృష్టివలన వైరాగ్యము కలుగుచున్నదో ఆవస్తువునందు మనస్సునకుఁ బ్రవృత్తి కలుగుట లేదు. అందువలన వైరాగ్యమునకు మనోనిగ్రహసాధనత్వము సంభవించుచున్నది. వైరాగ్యముయొక్క స్వరూపము ద్వితీయపరిచ్ఛేదమునందు విస్తరముగా నిరూపింపఁబడి యున్నది. అందువలన నిచ్చట విరమించితిమి.

## [*] (23) చిత్తవృత్తినిరోధయోగనిరూపణము. [*]

మఱియు, అభ్యాస మైననో యోగమున కంతరంగసాధనమై యున్నది. ఆ యంతరంగసాధనము బహిరంగసాధనము లేక సిద్ధింపదు. గనుక నుపాయసహితముగా బహిరంగసాధనముల నిరూపించి యభ్యాసము నిరూపించుటకొఱకుఁ బ్రథమమున ఫలరూపవృత్తినిరోధవిభాగము చెప్పఁబడుచున్నది. ఆచిత్తవృత్తినిరోధరూపయోగము ద్వివిధమై యున్నది. ఒకటి సంప్రజ్ఞాతసమాధిరూపనిరోధము, మఱియొకటి యసంప్రజ్ఞాతసమాధిరూపనిరోధము. అందు, కర్త కర్మము కరణమను త్రిపుటియొక్క యనుసంధానము లేని యేకలక్ష్యవస్తువిషయకసజాతీయవృత్తులయొక్క ప్రవాహ మేది గలదో, అది సంప్రజ్ఞాతసమాధి యనఁబడును. ఈ సంప్రజ్ఞాతసమాధి కంగ మైన యేసమాధి యున్నదో దానియందు త్రిపుట్యనుసంధానపూర్వకసజాతీయవృత్తులయొక్క ప్రవాహ మున్నది. ఆ యంగసమాధియం దీసంప్రజ్ఞాతసమాధియొక్క లక్షణమున కతివ్యాప్తి నివారించుటకొఱకు నిచ్చటఁ ద్రిపుట్యనుసంధానరహితత్వము చెప్పఁబడినది. ఈ సంప్రజ్ఞాతసమాధిస్వరూప మన్యగ్రంథములయందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. విలాప్య వికృతిం కృత్స్నాం సంభవ వ్యత్యయక్రమాత్ । పరిశిష్టంతు చిన్మాత్రం సదానందం విచింతయేత్॥ బ్రహ్మాకారమనోవృత్తిప్రవాహో ఽహంకృతిం వినా । సంప్రజ్ఞాతసమాధిస్స్యా ద్ధ్యానాభ్యాసప్రకర్షజః"—భావము॥ చేతనమునం దధ్యస్త మైన యజ్ఞానమును ఆయజ్ఞానకార్య మైనప్రపంచమును ఏది గలదో యాసర్వప్రపంచమును, ఉత్పత్తిక్రమమునకు విపరీతక్రమముగా స్థూలసూక్ష్మాదిక్రమముచేతఁ జిదాత్మ యందు లయము నొందించి, అనఁగా, ఆచిదాత్మ కంటె నీప్రపంచము భిన్నము కా దను నిశ్చయము చేసి, శేషించి యుండు సదానందరూపచిన్మాత్రమును గురూపదిష్టమహావాక్యము వలన నభేదరూపముసఁ జింతన చేయవలయును. అనఁగా నేను సచ్చిదానందబ్రహ్మరూపుఁడనే యని చింతన చేయవలయును. మఱియుఁ ద్రిపుటియొక్క యనుసంధాన

రూపమైన యహంకృతి లేక, "అహం బ్రహ్మాస్మి" యను మనోవృత్తులయొక్క ప్రవాహ మేది గలదో అది సంప్రజ్ఞాతసమాధి యనఁబడును. ఈసంప్రజ్ఞాతసమాధి ధ్యానాభ్యాసప్రకర్షము (ప్రాబల్యము) వలనఁ గలుగుచున్నది.

[*] (24) యమాద్యష్టాంగనిరూపణము. [*]

ఇఁక యోగశాస్త్రానుసారముగా నీసంప్రజ్ఞాతసమాధిరూపయోగమున కష్టవిధాంగములు చెప్పఁబడుచున్నవి. అందు, యమము నియమము ఆసనము ప్రాణాయామము ప్రత్యాహారము ధారణ ధ్యానము సమాధి అను నీయెనిమిది సంప్రజ్ఞాతసమాధి కంగములై యున్నవి. దానియందును యమాదిపంచకము సంప్రజ్ఞాతసమాధికి బహిరంగసాధనమై యున్నది. ధారణాదిత్రితయ మంతరంగసాధనమై యున్నది.

యమవర్ణనము.—అహింస సత్యము అస్తేయము బ్రహ్మచర్యము అపరిగ్రహము అను భేదముచేత నాయమము పంచవిధ మగుచున్నది. అందు మనోవాక్కాయము లను మూఁడింటిచే నొకప్రాణినిగూడ హింసింపకుండుట యహింస యనఁబడును. మఱియు యథార్థవచనోచ్చారణము సత్య మనఁబడును. బలాత్కారముగా నైన, లేక, కపటముగా నైనఁ బరులయొక్కధనము నపహరింపకుండుట యస్తేయ మనఁబడును. శరీరయాత్రయం దుపయోగు లైన పదార్థములకన్న నధిక పదార్థములను గ్రహింపక యుండుట యపరిగ్రహ మనఁబడును. అష్టాంగమైథున రహితత్వము బ్రహ్మచర్య మనఁబడును.

ఈ యష్టాంగమైథునముయొక్కస్వరూపము శాస్త్రములయం దిట్లు చెప్పఁబడి యున్నది. అందు "శ్లో. స్మరణం కీర్తనం కేలిః ప్రేక్షణం గుహ్యభాషణమ్। సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిర్వృతి రేవచ॥ ఏత న్మైథున మష్టాంగం ప్రవదంతి మనీషిణః। విపరీతం బ్రహ్మచర్య మనుష్ఠేయం ముముక్షుభిః॥ సత్సంగసన్నిధిత్యాగ దోషదర్శనతో భవేత్" — భావము॥ స్మరణము కీర్తనము కేళి ప్రేక్షణము గుహ్యభాషణము సంకల్పము అధ్యవసాయము క్రియానిర్వృతి అను నీయష్టకమును అష్టాంగమైథున మనఁబడును. అందు భోగ్యబుద్ధిచేత స్త్రీలను జిత్తమునందుఁ జింతించుట స్మరణ మనఁబడును. వాక్కుతో స్త్రీలయొక్కగుణములను జెప్పుట కీర్తన మనఁబడును. మఱియు నాస్త్రీలతో ద్యూతాదిక్రీడలు సల్పుట కేళి యనఁబడును. భోగ్యబుద్ధిచే నాస్త్రీలను జూచుట ప్రేక్షణ మనఁబడును. ఏకాంతదేశమందా స్త్రీలతో భాషించుట గుహ్యభాషణ మనఁబడును. మఱియు నాస్త్రీలను

బొందుట కిచ్ఛించుట సంకల్ప మనఁబడును. మఱియు నాస్త్రీలను బొందవలయు నని బుద్ధియందు నిశ్చయించుట యధ్యవసాయ మనఁబడును. ఆస్త్రీలయొక్క సంభోగము క్రియానిర్వృత్తి యనఁబడును. ఈ యెనిమిదింటిని విద్వాంసు లష్టాంగమైథున మందురు. ఈ యష్టాంగమైథునరహితత్వ మేది గలదో అది బ్రహ్మచర్య మనఁబడును. ఈ బ్రహ్మచర్యము ముముక్షుజను లవశ్యము సంపాదింపవలయును. ఏ కారణముచేత ననఁగా, "యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి, సత్యేన లభ్య స్తపసా హ్యేష ఆత్మా, సమ్యక్జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్, అంత శ్శరీరే జ్యోతి ర్మయో హి శుభ్రో యం పశ్యంతి యతయః క్షీణదోషాః" ఇత్యాదిశ్రుతులు బ్రహ్మచర్యమునే యాత్మజ్ఞానమునకును మోక్షమునకును సాధన మని చెప్పుచున్నవి.

ఆబ్రహ్మచర్యము సత్సంగముచేతను విషయాసక్తస్త్రీపురుషులయొక్క సన్నిధిని ద్యజించుటచేతను దేహముయొక్క దోషదర్శనముచేతను సిద్ధించుచున్నది. అచ్చట సత్సంగమునకు బ్రహ్మచర్యముయొక్క సాధనత్వ మాచార్యులచే "కా తవ కాంతాధరగతచిన్తా వాతుల తవ కిం నాస్తి నియంతా । త్రిజగతి సజ్జనసంగతి రేకా భవతి భవార్ణవతరణే నౌకా" అనువచనముచేతఁ జెప్పఁబడి యున్నది. అందువలన సత్సంగమునకు బ్రహ్మచర్యముయొక్క సాధనత్వము సంభవించుచున్నది. మఱియు దేహమునందు దోషదర్శనము బ్రహ్మాదులచేత చెప్పఁబడి యున్నది. అందు "శ్లో. మాంసా సృక్పూయ విణ్మూత్ర స్నాయు మజ్జాస్థి సంహతౌ । దేహే చే త్ప్రీతిమా న్మూఢో భవితా నరకేపి సః"—భావము॥ మాంసము రుధిరము పూయము మలము మూత్రము నాడి మజ్జ అస్థి ఇత్యాది మలినపదార్థసమూహరూపదేహమునం దే మూఢపురుషుఁడు ప్రీతి గలవాఁ డగుచున్నాఁడో ఆమూఢపురుషుఁడు నరకమునం దును బ్రీతి గలవాఁడు కావలయును. మఱియు నుక్తార్థము శ్రీభగవంతునిచేతను జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. స్వదేహా శుచిగంధేన నవిరజ్యేత యః పుమాన్ । వైరాగ్యకారణం తస్య కి మన్య దుపదిశ్యతే"—భావము॥ ఏపురుషుఁడు తనదేహము యొక్క దుర్గంధముచేత వైరాగ్యము పొందఁడో, ఆపురుషునకు వైరాగ్యము కలుగుటకు వేఱుకారణ మేల యుపదేశింపవలయును? ఈరీతిగాఁ దనశరీరమందును స్త్రీశరీరమునందును దోషచింతన చేయు పురుషున కాశరీరమునందు రాగము కలుగదు. అందువలన నాదోషదర్శనమునకు బ్రహ్మచర్యముయొక్క సాధనత్వము సంభవించు చున్నది. ఈరీతిగానే సన్నిధిత్యాగమునకుఁగూడ బ్రహ్మచర్యముయొక్క సాధనత్వ మున్నది. ఈ కారణముచేతనే స్మృతులు ముముక్షుజనులను గుఱించి స్త్రీలయొక్క సంభాషణాదికము నిషేధించి యున్నవి. అందు "శ్లో. న సంభాషేత్ స్త్రియం

కాంచి త్పూర్వ దృష్టాంచ న స్మరేత్ । కథాంచ వర్జయే త్తాసాం నపశ్యే ల్లిఖితా "పి"—భావము॥ ఈ ముముక్షుజను లొకప్పుడును స్త్రీలతో సంభాషించుటయును పూర్వము చూడఁబడినస్త్రీని జిత్తమునందు స్మరించుటయును గూడదు. మఱియు స్త్రీలయొక్క కథలును విడువవలయును. చిత్రలిఖితస్త్రీనిగూడఁ జూడఁగూడదు.

నియమవర్ణనము.—శౌచము సంతోషము తపము స్వాధ్యాయము ఈశ్వర ప్రణిధానము అను భేదముచేత నానియమము పంచవిధమై యున్నది. అందు శౌచ మాంతరబాహ్యభేదముచేత ద్వివిధమై యున్నది. మైత్రీకరుణాదులచే నంతఃకరణ మును రాగద్వేషాదిరహితముగాఁ జేయుట యాంతరశౌచ మనఁబడును. జలమృత్తి కాదులచేత శరీరము శుద్ధిచేయుట బాహ్యశౌచ మనఁబడును. మఱియు యథాలా భమునందుఁ బ్రసన్నత సంతోష మనఁబడును. హితమును మితమును బవిత్రము నైన యన్నమును భుజించుట తప మనఁబడును. మఱియుఁ బ్రణవాదిపవిత్రమంత్ర ములను జపించుట స్వాధ్యాయ మనఁబడును. అనుష్ఠింపఁబడిన నిత్యాదికర్మములను బరమేశ్వరునియందు సమర్పించుట యీశ్వరప్రణిధాన మనఁబడును.

ఆసనవర్ణనము.—ఆసనముయొక్క స్వరూపమును సాధనమును ఫలమును బూర్వము చెప్పఁబడి యున్నవి. వాని నిచ్చటను దెలియవలయును. ఉక్తాసనము శారీరము బాహ్య మను భేదముచేత ద్వివిధ మగుచున్నది. అందు పద్మము స్వస్తికము భద్రము ఇత్యాద్యాసనములు శారీరాసనము లనఁబడును. ఈ యా సనములయొక్క స్వరూప మాత్స్యపురాణముయొక్క యష్టమాధ్యాయమునందు మాచే నిరూపింపఁబడి యున్నది. దాని నిచ్చటఁ దెలియ నగును. మఱియు సర్వోపద్రవ రహిత మగు నేకాంతదేశమునందుఁ గుశమృగచర్మవస్త్రాదిరూపము లగు నేయాస నము లున్నవో అవి బాహ్యము లగు నాసనము లనఁబడును.

ప్రాణాయామవర్ణనము.—పూరకము రేచకము కుంభక మను భేదముచేత నాప్రాణాయామము త్రివిధ మగుచున్నది. ఈ ప్రాణాయామము పూర్వము చెప్పఁ బడి యున్నది. దాని నిచ్చటను దెలియవలయును. మఱియుఁ జక్షురాదీంద్రియము లను రూపాదివిషయములనుండి మరలించుట ప్రత్యాహార మనఁబడును. ఈ య మాదిపంచవిధబహిరంగసాధనములు సిద్ధము లైనయనంతర మీయధికారిపురుషుఁ డాసంప్రజ్ఞాతసమాధియొక్క ధారణధ్యానసమాధు లను త్రివిధాంతరంగసాధనముల యందుఁ బ్రయత్నము చేయవలయును. అందు బహిరంగసాధనసంపాదనపూర్వక ముగా నంతరంగసాధనములను సంపాదింపవలయు ననునది, శాస్త్రోక్తానుక్రమమై యున్నది. అది చిత్తజయము లేని పురుషులకొఱ కని తెలియవలయును. అయినను

ప్పురుషునకుఁ బూర్వజన్మపుణ్యపరిపాకవశమువలన నంతఃకరణము శుద్ధము కాఁగాఁ బ్రథమముననే ఆధారణాద్యంతరంగసాధనములు ప్రాప్తము లగుచున్నవో ఆపురుషుఁ డాయమాదిపంచబహిరంగసాధనములయందు మరలఁ బ్రయత్నింప నక్కఱ లేదు.

ధారణావర్ణనము.—మూలాధారము మణిపూరకము స్వాధిష్ఠానము అనాహతము ఆజ్ఞ విశుద్ధము అను షట్చక్రములయం దేదైన నొకచక్రమునందుఁ జిత్తమును స్థాపించుట లేక ప్రత్యగాత్మయందుఁ జిత్తమును స్థాపించుట, అనఁగా నాయేక ప్రత్యగాత్మయొక్కస్మరణ మేది గలదో అది ధారణ యనఁబడు. ఈషట్చక్రముల యొక్కస్వరూప మాత్మపురాణముయొక్క యేకాదశాధ్యాయమునందు విస్తరముగాఁ జెప్పఁబడి యున్నది. దాని నచ్చటఁ దెలియ నగును.

ధ్యానవర్ణనము.—చైతన్యరూపలక్ష్యవస్తువునందు సజాతీయవృత్తులయొక్క ప్రవాహీకరణ మేది గలదో అది ధ్యాన మనఁబడును. ఆసజాతీయవృత్తులయొక్క ప్రవాహముకూడ ద్వివిధ మగుచున్నది. ఒకటి విజాతీయవృత్తులచే విచ్ఛిన్నమై యున్నది, మఱియొకటి విజాతీయవృత్తులచే నవిచ్ఛిన్నమై యున్నది. అందుఁ బ్రథమ మగు ప్రవాహ మైనను ధ్యాన మనఁబడును. ద్వితీయ మగు ప్రవాహము సమాధి యనఁబడును. ఆసమాధియును ద్వివిధమై యున్నది. ఒకటి కర్త కర్మము కరణ మను త్రిపుటియొక్కయనుసంధానముతోఁ గూడి యున్నది, రెండవది యాత్రిపుటియొక్కయనుసంధానము లేక యున్నది. అందుఁ బ్రథమసమాధి యంగరూపసమాధి యనఁబడును. ద్వితీయసమాధి యంగిరూపసమాధి యనఁబడును. ఇచ్చట సాధన మంగ మనియును ఫల మంగి యనియును జెప్పఁబడినది.

## [*] (25) సమాధియొక్కవిఘ్నముల నిరూపించుట. [*]

ఇఁక, ఆసమాధియొక్కవిఘ్నములు నిరూపింపఁబడుచున్నది. సంప్రజ్ఞాతసమాధియొక్కయుత్పత్తియందు లయ విక్షేప కషాయ రసాస్వాదము లను చతుర్విధవిఘ్నములు గలవు. ఆవిఘ్నము లున్న యెడల నాసంప్రజ్ఞాతసమాధి కలుగదు. నిద్ర లయ మనఁబడును. విషయములయొక్కపునఃపునరనుసంధానము విక్షేప మనఁబడును. రాగద్వేషాదులచేతఁ జిత్తముయొక్కస్తబ్ధీభావము కషాయ మనఁబడును. మఱియు సమాధియొక్కయారంభకాలమునందు సవికల్పానందముయొక్కయాస్వాదనము రసాస్వాద మనఁబడును.

## [*] (26) సమాధివిఘ్ననివర్తకోపాయనిరూపణము. [*]

ఇఁక, శ్రీగౌడపాదాచార్యులవచనములచేత నాలయాదివిఘ్నములయొక్క నివృత్త్యుపాయములు చెప్పఁబడుచున్నవి. అందు “శ్లో. లయే సంబోధయే చ్చిత్తం

విక్షిప్తం శమయే త్పునః । సకషాయం విజానీయా త్సమప్రాప్తం న చాలయేత్॥ నాస్వాదయే ద్రసం తత్ర నిస్సంగః ప్రజ్ఞయా భవేత్ "— భావము॥ యోగాభ్యాసము చేయుకాలమునం దీపురుషునియొక్క చిత్త మెప్పుడు నిద్రారూపలయమునకు సమ్ముఖ మగుచున్నదో అప్పు డాయభ్యాసవంతుఁ డగుపురుషుఁడు ప్రాణాయామము చేతను నిద్రా శేషముయొక్క నివృత్తిచేతను, స్వల్పభోజనాదులచేతను, చిత్తమును నిద్ర నుండి జాగ్రత్తను బొందింపవలయును. విక్షేపమును బొందినచిత్తమును విషయముల యొక్క దోషదర్శనము బ్రహ్మచింతనము సత్సంగము ఉపాసన ఇత్యాద్యుపాయముల చేత నేకాగ్రత నొందింపవలయును. అనఁగా విషయచింతనారూపవిక్షేపమునుండి నివృత్తముగాఁ జేయవలయును.

అచ్చట బ్రహ్మచింతనవలనఁ జిత్తము విక్షేపరహిత మగుచున్న దను నర్థము శ్రీభగవంతునిచేతను జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. విషయాన్ధ్యాయత శ్చిత్తం విషయేషు విషజ్జతే । మా మనుస్మరత శ్చిత్తం మయ్యేవ ప్రవిలీయతే "— భావము॥ విషయచింతనఁ జేయుపురుషునియొక్క చిత్త మావిషయములయందే సంబంధము నొందుచున్నది, పరమేశ్వరుఁడ నగు నన్ను స్మరణ చేయు పురుషునియొక్క చిత్తము పరమేశ్వరుఁడ నగు నాయందే లయ మొందుచున్నది. మఱియు సత్సంగమునకు విక్షేపనివృత్తియొక్క కారణత్వము వసిష్ఠభగవానులచేఁ జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. సంత స్సదైనగంతవ్యాః యద్య ప్యుపదిశంతి న । యా హి స్వైరకథా స్తేషా ముపదేశా భవంతి తాః "— భావము॥ ముముక్షుజనులు మహాత్ముల యొక్క సమీపమునకు సర్వదా పోవు చుండవలయును, యద్యపి ఆమహాత్ము లగు జను లీముముక్షువులకు సాక్షాత్తుగా నుపదేశించుట లేదు, తథాపి, ఆమహాత్ములయొక్క స్వాభావికకథ లేవి గలవో ఆకథలే యీముముక్షువుల కుపదేశరూపము లగుచున్నవి. మఱియు నాచార్యులచేతను "సఙ్గ స్సత్సు విధీయతాం- భగవతో భక్తి ర్ధృఢాధీయతామ్ " ఇత్యాదివచనములచే సత్సంగము కర్తవ్య మని చెప్పఁబడియున్నది.

ఈప్రకారముగా విక్షేపము నివృత్తి చేసి యనంతరము కషాయసహిత చిత్తమును దెలిసి, యాకషాయమును గూడ నివర్తింపవలయును. మఱియు సమమును- బ్రహ్మమును బొందినచిత్తము, నాబ్రహ్మమునుండి చలింపనీయఁ గూడదు. మఱియు సమాధియొక్క యారంభకాలమందుఁ బ్రాప్త మైన సవికల్పానందము నాస్వాదింపఁగూడదు. మ ఱే మనఁగా, ఉదాసీనబ్రహ్మప్రజ్ఞతోఁ గూడి యుండవలయును. ఈవిధ మైన యుపాయములచేత నెప్పు డాలయాదివిఘ్నములు నివర్తిల్లు చున్నవో అప్పు డాసంప్రజ్ఞాతసమాధి కలుగు చున్నది.

ఇట్టి సంప్రజ్ఞాతసమాధియొక్క యభ్యాసముచేత నెప్పుడు మనస్సు ప్రత్యగాత్మయం దేకాగ్రతను బొందుచున్నదో అప్పు డామనస్సునందు ఋతంభర యను నొకప్రజ్ఞ కలుగుచున్నది. అచ్చట, అతీతానాగత దూరవ్యవహిత సూక్ష్మత్యాది సర్వపదార్థములను విషయముఁ జేయు యోగియొక్క ప్రత్యక్ష మేది గలదో అది ఋతంభరప్రజ్ఞ యనఁబడును. అట్టి ఋతంభరప్రజ్ఞయం దుండుయోగికి నిర్వికల్ప సమాధి ప్రాప్త మగుట లేదు. అందువలన నాఋతంభరప్రజ్ఞను గూడ నిరోధించి సంప్రజ్ఞాతసమాధ్యభ్యాసముఁ జేయు యోగి కాత్మసాక్షాత్కారము ప్రాప్తమై పర వైరాగ్యము కలుగుచున్నది. ఈ పరవైరాగ్యముయొక్క స్వరూపము పూర్వము ద్వితీయపరిచ్ఛేదమునందుఁ జెప్పఁబడి యున్నది. ఆపరవైరాగ్యానంతరముకూడ నీ పురుషున కభ్యాసము చేయఁ దగినదై యున్నది. ఇచ్చట నేయుపాయముచేత నైనను నేను సర్వవృత్తులయొక్క నిరోధరూపాఽసంప్రజ్ఞాతసమాధియందు స్థితుఁడను గావలయు ననను నుత్సాహరూపప్రయత్న మేది గలదో అది యభ్యాస మనఁబడును. ఈయభ్యాసముయొక్క లక్షణము పతంజలిభగవానులు యోగసూత్రములయందు "తత్ర స్థితౌ ప్రయత్నోఽ భ్యాసః" అను సూత్రముచేతఁ జెప్పి యున్నారు. ఆ యుత్సాహరూపప్రయత్నముకూడ నిరుద్ధము కాఁగా, సర్వవృత్తులు నిరుద్ధము లగుచున్నవి. ఆ సర్వవృత్తులయొక్క నిరోధమే యసంప్రజ్ఞాతసమాధి యనఁబడును.

శంక:—ఆ యుత్సాహరూపప్రయత్నముయొక్క నిరోధమందు వే ఱొక సాధన మున్నదా? లేదా? అందుఁ బ్రథమపక్ష మంగీకరించినయెడల ననవస్థాదోషము ప్రాప్త మగును. ఏల యన, ఆ యుత్సాహరూపప్రయత్నముయొక్క నిరోధముకొఱ కంగీకరింపఁబడిన ద్వితీయసాధన మేది గలదో అది యుండఁగా, నాయసంప్రజ్ఞాతసమాధి కలుగదు. కావున నాసాధనముయొక్క నిరోధముకొఱకు వే ఱొక తృతీయసాధన మంగీకరింపవలయును. ఆ తృతీయసాధననివృత్తికొఱకు వే ఱొకచతుర్థసాధన మంగీకరింపవలయును. ఈరీతిగా నుత్తరోత్తరసాధనములయొక్క ధార నంగీకరించుటయం దనవస్థాదోషము ప్రాప్త మగును. మఱియు నాప్రయత్ననిరోధమునకు వే ఱొకసాధనము లే దను ద్వితీయపక్ష మంగీకరించినచో సాధనము లేక యాప్రయత్ననిరోధమే సంభవింపని దగును. మఱియు నాప్రయత్నము తానె తనకు నిరోధక మగుచున్న దనిన, నదియును ఘటిల్లదు. ఏల యన, తనచేతనే తనకు నిరోధ మత్యంతవిరుద్ధమై యున్నది. లోకమందును అట్లు చూడఁబడుట లేదు.

సమాధానము:—ఆ యుత్సాహరూపప్రయత్నము సర్వవృత్తులను నిరోధించినదై, తననిరోధమును దానే చేయుచున్నది. ఉదా—కతకరేణువు జలమునం

దాంగు వృత్తికను నివర్తించి, తానును దనయంతనే నివృత్త మగుచున్నది. ఆ కతక రేణువుయొక్క నివృత్తికొఱకు వేఱొకసాధనాపేక్ష కలుగుట లేదు. ఈలాగుననే యీయుత్థానరూపప్రయత్నము నిరోధించుటకొఱకు వేఱొకసాధనముయొక్క యపేక్ష కలుగుట లేదు. అందువలన ననవస్థాదోషమును దృష్టవిరోధదోషమును బ్రాప్త మగుట లేదు.

మఱియుఁ బూర్వోక్తాసంప్రజ్ఞాతసమాధియొక్కస్వరూప మన్యశాస్త్రములయందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. మనసో వృత్తిశూన్యస్య బ్రహ్మాకారతయా స్థితిః। అసంప్రజ్ఞాతనామాసౌ సమాధి రభిధీయతే॥ ప్రశాంతవృత్తికం చిత్తం పరమానందదీపకమ్। అసంప్రజ్ఞాతనామాసౌ సమాధి ర్యోగినాం ప్రియః"— భావము॥ సర్వవృత్తిశూన్య మైనమనస్సునకు బ్రహ్మాకారతారూపస్థితి యేది గలదో యాస్థితినే యోగశాస్త్రవేత్త లసంప్రజ్ఞాతసమాధి యనుచున్నారు. మఱియుఁ బూర్వోక్తాభ్యాసమువలన నివర్తింపఁబడిన సర్వవృత్తులు గల పరమానందప్రకాశక మగు చిత్త మేది గలదో అదియే యోగిజనులకుఁ బ్రియ మైన యసంప్రజ్ఞాతసమాధియై యున్నది.

ఇఁక నాయసంప్రజ్ఞాతసమాధి కన్యసాధనముకూడఁ జెప్పఁబడుచున్నది. ఆయసంప్రజ్ఞాతసమాధి పూర్వోక్తరీతిగాఁ గేవలపరవైరాగ్యముచేతనే పొందఁబడుట యే గాక, యీశ్వరప్రణిధానముచేతఁగూడఁ బొందఁబడుచున్నది. అందు యోగసూత్రము.—"ఈశ్వరప్రణిధానా ద్వా"— భావము॥ ఆ యసంప్రజ్ఞాతసమాధి పూర్వోక్తక్రమముచేతను ఈశ్వరప్రణిధానముచేతను బ్రాప్త మగుచున్నది.

## [*] (27) ఈశ్వరస్వరూపనిరూపణము. [*]

ఇఁక నీశ్వరప్రణిధానముయొక్కస్వరూపము నిరూపించుటకొఱకుఁ బ్రథమమున నీశ్వరస్వరూపము చెప్పఁబడుచున్నది. అందు యోగసూత్రము.—"క్లేశకర్మ విపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః"— భావము॥ క్లేశము కర్మము విపాకము ఆశయము అను నీనాల్గింటితో నసంబద్ధ మగు పురుషవిశేషము ఈశ్వరుఁ డనఁబడును. అందుఁ బ్రథమ మగు క్లేశమ్ము, అవిద్య అస్మిత రాగము ద్వేషము అభినివేశ మను భేదముచేతఁ బంచప్రకార మగుచున్నది. ఆ పంచవిధక్లేశములు ప్రథమపరిచ్ఛేదమునందు నిరూపింపఁబడి యున్నవి. మఱియుఁ గర్మమో, శుక్లము కృష్ణము మిశ్ర మను భేదముచేతఁ ద్రివిధము. అందు శాస్త్రవిహితపుణ్యకర్మము శుక్లకర్మ మనఁబడును, శాస్త్రనిషిద్ధ పాపకర్మము కృష్ణకర్మ మనఁబడును.

పుణ్యాపాపము లను రెండును మిశ్రకర్మ మనఁబడును. ఈ త్రివిధకర్మము లైననో అయోగిపురుషులకుఁ గలుగుచున్నవి. యోగిపురుషుల కైననో అశుక్లకృష్ణ మను నాల్గవది యగు కర్మము కలుగుచున్నది.

ఈ యుక్తార్థము పతంజలిభగవానులు "కర్మా ఽశుక్లకృష్ణం యోగిన స్త్రివిధ మితరేషామ్" అను సూత్రముచేతఁ జెప్పి యున్నారు. మఱియుఁ గర్మఫలము విపాక మనఁబడును, ఆ విపాకము జాతి ఆయుష్యము భోగ మను భేదముచేతఁ ద్రివిధము. కర్మఫలభోగజన్యసంస్కారరూపవాసన ఆశయ మనఁబడును. ఇట్టి క్లేశకర్మ విపాకాశయము లను నాల్గింటితో సంబంధము గలవారు జీవులు. ఈశ్వరుఁ డైననో యీనాల్గింటితో నసంబద్ధుఁడును సర్వజ్ఞుఁడును సర్వశక్తిమంతుఁడు నై యున్నాఁడు.

ఇఁక నాయీశ్వరప్రణిధానముయొక్క స్వరూపము నిరూపింపఁబడుచున్నది. అందు యోగసూత్రము.—"తస్య వాచకః ప్రణవః, తజ్జప స్తదర్థభావనమ్"— భావము॥ పూర్వోక్తేశ్వరవాచకము ప్రణవశబ్దమై యున్నది. ఆ యోంకారరూప ప్రణవముయొక్క జపముగూడ మాండూక్యోపనిషత్పంచీకరణవార్త్తికోక్తప్రకారముగా నాప్రణవార్థముయొక్క చింతన యేది గలదో అదియును ఈశ్వరప్రణిధాన మనఁబడును. ఆప్రణవార్థముయొక్క చింతనప్రకారము పూర్వము ప్రథమపరిచ్ఛేదము నందు నిరూపింపఁబడి యున్నది.

ఇఁక, అన్యప్రకారమున దృష్టాంతసహితముగా నాప్రణవశబ్దార్థము చెప్పఁబడుచున్నది. అందు "తద్యో ఽహం సో ఽసౌ, యో ఽసౌ సో ఽహమ్" అను నీశ్రుతియందుండు "సః" అను శబ్దముచే బరమాత్మ చెప్పఁబడుచున్నాఁడు. అహ మ్మను శబ్దముచే బ్రత్యగాత్మ చెప్పఁబడుచున్నాఁడు. అందు "సః అహమ్" అను రెండుశబ్దములకుఁ బరస్పరసామానాధికరణ్య మున్నది, అందువలన నారెండు శబ్దములచేత బ్రహ్మాత్మలయొక్క యేకత్వమే చెప్పఁబడుచున్నది. కావున "సో ఽహమ్" అను వాక్యమున కెట్లు పరమాత్మ నేనను జీవబ్రహ్మములయొక్క యేకత్వ మర్థమై యున్నదో అట్లు ఓంకారరూపప్రణవమునకును ఆజీవబ్రహ్మములయొక్క యేకత్వమే యర్థమై యున్నది. అది యెట్లనఁగా, "సో ఽహ" మ్మను వాక్యమునందు వ్యాకరణరీతిగా సకారహకారము లను రెండువర్ణములకును లోపము కలుగఁగా, "ఓ అమ్" అను వాక్యము శేషించుచున్నది. దానియందును వ్యాకరణరీతిగాఁ బూర్వరూప మను సంధిచేత నకారమునకు లోపము కలుగఁగా, ఓ మ్మను శబ్దము సిద్ధ మగుచున్నది. ఈ యర్థ మన్యశాస్త్రములయందును జెప్పఁబడి యున్నది.

అందు "శ్లో. సకారంచ హకారంచ లోపయిత్వా ప్రయోజయేత్ । సంధించే పూర్వరూపాఖ్యాం తతో ఉసౌ ప్రణవో భవేత్ "—భావము॥ "సో ఉహమ్" అను వాక్యమునం దుందు సకారమునకును హకారమునకును లోపము కలుగఁగాఁ దదనంతరము పూర్వరూప మను సంధిని జేయఁగా "సో ఉహ" మ్మనుశబ్దమువలన ఓమ్మను ప్రణవము సిద్ధ మగుచున్నది. అందువలన "సో ఉహ" మ్మను శబ్దమువలె ఓమ్మను ప్రణవశబ్దమునకును "పరమాత్మ నేను" అను నర్థమే సిద్ధ మగుచున్నది. ఈ ప్రకారముగా జీవబ్రహ్మైకత్వరూపప్రణవార్థచింతన యేది యున్నదో అది యీశ్వర ప్రణిధాన మనఁబడును. ఈవిధ మైన యీశ్వరప్రణిధానముచేత నీయధికారిపురుషునిపై నీశ్వరున కనుగ్రహము కలుగుచున్నది. ఆ యీశ్వరానుగ్రహమువలన నీ పురుషున కాయసంప్రజ్ఞాతసమాధి యవశ్యము ప్రాప్త మగుచున్నది. అందువలన నాపరవైరాగ్యమువలె నీశ్వరప్రణిధానముకూడ నసంప్రజ్ఞాతసమాధికి సాధనమై యున్నది.

లేక, ఈయధికారిపురుషుఁడు భూమికలను యథాక్రమముగా జయించి యాసమాధి నభ్యసింపవలయును. ఆభూమికాజయముయొక్క క్రమము శ్రుతి యందుఁ జెప్పఁబడి యున్నది. అందు శ్రుతి.—"యచ్ఛే ద్వాఙ్మనసీ ప్రాజ్ఞ స్త ద్యచ్ఛేద్ జ్ఞాన ఆత్మని । జ్ఞాన మాత్మని మహతి నియచ్ఛే చ్ఛాంత ఆత్మని "—భావము॥ లౌకికవైదికసర్వశబ్దోచ్చారణములకు హేతు వైన యేవాగింద్రియ మున్నదో యా వాగింద్రియము నీయధికారిపురుషుఁడు మనస్సునందు లయ మొందింపవలయును. అనఁగా వాగాదీంద్రియములయొక్క సర్వవ్యాపారములను బరిత్యజించి కేవలమనో వ్యాపారమాత్రముచేత స్థితుఁడు కావలయును. తథాపి, ఈ యధికారిపురుషుఁడు సమాధియొక్క యుత్పత్తికాలపర్యంతము ప్రణవమంత్రజపము పరిత్యజింపఁగూడదు. ఇఁక నే మనఁగా, ఆప్రణవజపమునకన్న నన్య మైన వాగ్వ్యాపారము లేనివాఁడు కావలయును. ఈరీతిగా గోమహిషాదికమువలె వాక్కుయొక్క సమ్యగ్నిరోధ మేది గలదో ఆనిరోధము ప్రథమభూమిక యనఁబడును. ఆప్రథమభూమిక జిత మైన యనంతరము మనోనిరోధరూపద్వితీయభూమికయందుఁ బ్రయత్నము చేయవలయును. అనఁగా సంకల్పవికల్పరూపమనస్సును జ్ఞానాత్మయందు లయము పొందింపవలయును. అచ్చట "మను ష్యోహం బ్రాహ్మ ణోహమ్" ఇత్యాది విశేషాహంకారములను జ్ఞానాత్మ యందురు. ఆ జ్ఞానాత్మమాత్రరూపమున స్థితుఁడు కావలయును. ఈప్రకారముగా సర్వసంకల్పవికల్పములను బరిత్యజించుటచేత బాలమూకాదులవలె నేనిర్మనస్త్వ మున్నదో అది ద్వితీయభూమిక యనఁబడును. ఆద్వితీయభూమికాజయా

నంతర మీాయధికారిపురుషుఁడు విశేషాహంకారనిరోధరూపతృతీయభూమికయందుఁ బ్రయత్నము చేయవలయును. అనఁగా నావిశేషాఽహంకారమును మహదాత్మయందు లయము పొందింపవలయును. అనఁగా "మనుష్యోహమ్, బ్రాహ్మణోహమ్" ఇత్యాదికమునం దహంకారపరిత్యాగముచేత నస్మితామాత్రము శేషించి యున్నది. అచ్చట నహంకారముయొక్క యేసూక్ష్మావస్థ యున్నదో అది యస్మిత యనఁబడును. ఈ యస్మితను మహత్తత్త్వ మనియును సూక్ష్మాహంకార మనియును జెప్పుదురు. ఈరీతిగా నాలస్యాదాసీనులవలె నేవిశేషాహంకారరహితత్వ మున్నదో అది తృతీయ భూమిక యనఁబడును. ఆ తృతీయభూమికాజయానంతర మీాయధికారిపురుషుఁ డస్మితానిరోధరూపచతుర్థభూమికయందుఁ బ్రయత్నము చేయవలయును. అనఁగా, అస్మితారూపమహదాత్మ నేకరసచైతన్యరూపశాంతాత్మయందు లయము పొందింప వలయును. అనఁగా, అస్మితనుగూడఁ బరిత్యజించుటవలనఁ గేవలచైతన్యమాత్రము శేషించుచున్నది. యద్యపి, అన్యశ్రుతియందు మహత్తత్త్వముకన్న నవ్యక్తము పర మనియును, అవ్యక్తముకన్నఁ జైతన్యపురుషుఁడు పరుఁ డనియును జెప్పఁబడి యున్నది, అందువలన నిచ్చటను మహత్తత్త్వమున కవ్యక్తమునందే లయము చెప్పుట యుచిత మై యున్నది, తథాపి, కారణమునందు నిరుద్ధ మైనకార్యము లయమునే పొందు చున్నది. అందువలన నవ్యక్తరూపకారణమునందు మహత్తత్త్వరూపకార్యమును లయము పొందించుటవలన నీపురుషునకు నిద్రయే ప్రాప్త మగును, నిరోధసమాధి ప్రాప్తము గాదు. ఈకారణమువలన నవ్యక్తపరిత్యాగముచేత, మహత్తత్త్వమునకుఁ జైతన్యాత్మయందు లయము చెప్పఁబడినది. ఈప్రకారముగాఁ జైతన్యాత్మయందుఁ జిత్తముయొక్క సర్వప్రకారనిరోధ మేది గలదో, ఆనిరోధమే యసంప్రజ్ఞాతసమాధి రూపచతుర్థభూమిక యనఁబడును. ఈప్రకారముగా నుక్తచతుర్భూమికలయందుఁ బూర్వపూర్వభూమికాజయానంతర ముత్తరోత్తరభూమికాజయక్రమముచేత సమాధి యొక్క యభ్యాస మేది గలదో, దానిచేతను ఆయసంప్రజ్ఞాతసమాధి ప్రాప్త మగు చున్నది. అచ్చట, పూర్వము చెప్పఁబడిన సమాధ్యభ్యాసప్రకారములయం దే ప్రకార మైన సమాధ్యభ్యాసముచేత నైనను అంతఃకరణముయొక్క యతిసూక్ష్మత్వా పాదన మేది గలదో, యది మనోనాశ మనఁబడును. మఱియు నాసూక్ష్మమనస్సుచేత నీయధికారిపురుషునకుఁ బ్రథమమునఁ ద్వంపదలక్ష్యార్థరూపప్రత్యగాత్మయొక్క సాక్షా త్కారము కలుగుచున్నది; తదనంతరము తత్త్వమస్యాదిమహావాక్యములచే "అహం బ్రహ్మాస్మి" యను ప్రత్యగాత్మయొక్క బ్రహ్మరూపత్వసాక్షాత్కారము కలుగుచున్నది. ఈప్రకారముగా నాసమాధ్యభ్యాసమునకును బ్రహ్మసాక్షాత్కారముయొక్క సాధ నత్వ మున్నది.

శంక:—శ్రీవ్యాసభగవానులచేత బ్రహ్మసూత్రమునందు "ఏతేన యోగః ప్రత్యుక్తః" అను సూత్రముచేత సాంఖ్యశాస్త్రమువలె యోగశాస్త్రము గూడ ఖండింపఁబడి యున్నది. మఱియుఁ బూర్వోక్తసమాధ్యభ్యాసము యోగశాస్త్రమునందే చెప్పఁబడి యున్నది. అందువలన సమాధ్యభ్యాసమునకు బ్రహ్మసాక్షాత్కారముయొక్క సాధనత్వ మంగీకరించుటయం దావ్యాససూత్రమునకు విరోధము కలుగును.

సమాధానము:—సాంఖ్యశాస్త్రజ్ఞులవలె యోగశాస్త్రజ్ఞులును అచేతనమగు ప్రధానమునే మహత్తత్త్వాదిక్రమముచే జగత్తునకుఁ గారణ మని యంగీకరించుచున్నారు. ఆప్రధానకారణవాదము సిద్ధాంతమునం దంగీకరించుట లేదు. అందువలనఁ బ్రధానకారణవాదముయొక్క ఖండనాఽభిప్రాయముచేతనే సూత్రకారులు యోగశాస్త్రమును ఖండించి యున్నారు. నిరోధసమాధిరూపయోగముల దేనిని ఖండించు నభిప్రాయముచేత నాయోగశాస్త్రమును ఖండించినవారు గారు. ఏకారణముచేత ననఁగా, సిద్ధాంతమునందును జిత్తనిరోధరహితవిక్షిప్తచిత్తపురుషులకు బ్రహ్మసాక్షాత్కారోత్పత్తి సంభవించుట లేదు. అందువలన బ్రహ్మసాక్షాత్కారముకొఱ కాచిత్తనిరోధ మవశ్య మపేక్షితమై యున్నది.

మఱియు "సమాధ్యభావాచ్చ, అపి సంరాధనే ప్రత్యక్షానుమానాభ్యామ్, నిదిధ్యాసితవ్యః, విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత, ధ్యానే నాత్మని పశ్యంతి, ధ్యానయోగేన సంపశ్య న్నాత్మ న్యాత్మాన మాత్మనః" ఇత్యాదిసూత్రశ్రుతిస్మృతివచనములచేతను, నిరోధరూపయోగమునకు బ్రహ్మసాక్షాత్కారముయొక్క సాధనత్వము సిద్ధ మగుచున్నది. అందువలన మహావాక్యజన్యబ్రహ్మసాక్షాత్కారోత్పత్తియం దాసమాధ్యభ్యాస మవశ్య మపేక్షితమై యున్నది.

శంక:—సమాధిని బ్రహ్మసాక్షాత్కారమునకు సాధన మని యంగీకరించినయెడల, నాసమాధిరహితపురుషుల కాబ్రహ్మసాక్షాత్కారము కలుగఁగూడదు. వాసిష్ఠాదిగ్రంథములయందు జనకాదుల కాసమాధి లేకయే, కేవలసిద్ధగీతాశ్రవణమాత్రమువలన బ్రహ్మసాక్షాత్కారోత్పత్తి చెప్పఁబడి యున్నది. యీసర్వ మసంగత మగును.

సమాధానము:—కేవలము సమాధిచేతనే బ్రహ్మసాక్షాత్కారము కలుగుచున్న దను నీనియమము లేదు. మఱి యే మనఁగా, వివేకముచేతను ఆబ్రహ్మసాక్షాత్కారము కలుగుచున్నది. అచ్చట, అంతఃకరణమును దద్వృత్తులును అను వీనిఁ బ్రకాశింపఁజేయు త్వంపదలక్ష్యార్థరూపప్రత్యక్సాక్ష్యాత్మ యన్నమయాదిపంచకోశముల

కెన్నఁ బృహత్కను నిశ్చయ మేది గలదో అది వివేక మనఁబడును. ఆవివేకముచేత నీయధికారి పురుషునకుఁ దత్త్వమస్యాదిమహావాక్యములవలన "అహం బ్రహ్మాస్మి" యను బ్రహ్మసాక్షాత్కార మవశ్యము కలుగుచున్నది. అందువలన సమాధివలె నావిచారరూపవివేకమును బ్రహ్మసాక్షాత్కారమునకు హేతువై యున్నది. ఇచ్చటఁ దాత్పర్య మే మనఁగా, బ్రహ్మసాక్షాత్కారమున కధికారులు ద్వివిధులు. ఒకఁడు బహువ్యాకులచిత్తము గలవాఁడు, మఱియొకఁ డవ్యాకులచిత్తము గలవాఁడు. అందుఁ బ్రథమాధికారుల కైనచో ఆనిరోధసమాధ్యభ్యాసముచేతనే బ్రహ్మసాక్షాత్కారము కలుగుచున్నది. మఱియు ద్వితీయాధికారుల కైనచో సమాధ్యభ్యాసము లేకయే కేవలవిచారమాత్రముచేత నా బ్రహ్మసాక్షాత్కారము కలుగుచున్నది.

ఈయర్థ మన్యగ్రంథములయందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. అవ్యాకులధియాం మోహమాత్రే ణాచ్ఛాదితాత్మనామ్ । సాంఖ్యనామవిచారో ఽయం ముఖ్యో ఝడితి సిద్ధిదః"—భావము॥ ఏపురుషునియొక్క బుద్ధి వ్యాకులతారహిత మయ్యును మఱియు నజ్ఞానమాత్రముచేత నాత్మ యావృత మయ్యె నున్నదో, అట్టి పురుషున కీసాంఖ్యనామవిచారమే బ్రహ్మసాక్షాత్కారమునకు ముఖ్యసాధనమై యున్నది. ఏలాగున ననఁగా నాసాంఖ్యనామవిచార మీయధికారిపురుషునకు సమాధ్యభ్యాసాపేక్షకన్న శీఘ్రముగానే బ్రహ్మసాక్షాత్కారప్రాప్తిని జేయుచున్నది. ఈరీతిగా సమాధికిని విచారరూపవివేకమునకును అధికారిభేదముచేత నర్థవత్త్వ ముండుటవలన వికల్పముచేత వానికి బ్రహ్మసాక్షాత్కారసాధనత్వ మున్నది. అందువలన సమాధి లేక కేవలము విచారమాత్రముచేత బ్రహ్మసాక్షాత్కారప్రాప్తిని జెప్పునట్టి వచనములకును సమాధివలన బ్రహ్మసాక్షాత్కారప్రాప్తిని జెప్పునట్టి వచనములకును, బరస్పరవిరోధము కలుగుట లేదు. ఇఁక నే మనఁగా, ఉక్తాధికారిభేదమువలన నాద్వివిధవచనములును సార్థకములై యున్నవి.

మఱియు నుక్తార్థము శ్రీవసిష్ఠభగవానులచేతను జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. ద్వౌ క్రమౌ చిత్తనాశస్య యోగో జ్ఞానంచ రాఘవ । యోగ స్తద్వృత్తిరోధో హి జ్ఞానం సమ్య గవేక్షణమ్॥ అసాధ్యః కస్యచి ద్యోగః కస్యచిద్ జ్ఞాననిశ్చయః । ప్రకారౌ ద్వౌ తతో దేవో జగాద పరమేశ్వరః"—భావము॥ ఓరాఘవా! బ్రహ్మసాక్షాత్కారమునం దుపయోగి యైన చిత్తముయొక్క సూక్ష్మత యేది యున్నదో, ఆసూక్ష్మత్వాపాదనరూపచిత్తనాశ మేది గలదో, ఆచిత్తనాశమునకు రెండుకారణములు గలవు. ఒకటి యోగరూపకారణము, మఱియొకటి వివేకరూపకారణము. అందుఁ జిత్తముయొక్క సర్వవృత్తులను నిరోధించుట యేది గలదో, అది

యోగ మనఁబడును. అన్నమయాదిపంచకోశములకన్నఁ బ్రత్యగాత్మను బృథక్కుగాఁ జూచుట యేది గలదో అది వివేక మనఁబడును. ఆ ద్వివిధోపాయములయందుఁ గొందఱ అధికారుల కైననో నాయోగము కఠిన మగుచున్నది, వివేకము సుగమ మగుచున్నది. మఱికొందఱ అధికారుల కైననో వివేకము కఠిన మగుచున్నది. యోగము సుగమ మగుచున్నది. ఈకారణమువలన గీతయందు భగవంతుఁ డధికారిభేదముచేత రెండుప్రకారములు చెప్పి యున్నాఁడు. అచ్చట గీతయొక్క తృతీయాధ్యాయమునందు "ఇంద్రియాణి పరాణ్యాహుః" అను వచనము మొదలు "కామరూపం దురాసదమ్" అను వచనముపర్యంతము శ్రీభగవంతుఁ డావివేకరూపోపాయముఁ జెప్పి యున్నాఁడు. మఱియు గీతయొక్క షష్ఠాధ్యాయమునం దా యోగరూపోపాయము చెప్పి యున్నాఁడు. మఱియు గీతయొక్క పంచమాధ్యాయమునందు "యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే" ఇత్యాదివచనములచేత నావివేకరూపసాంఖ్యవిచారమునకును యోగమునకును ఒకటేఫలముయొక్క సాధనత్వము వక్కాణించి యున్నాఁడు.

శంక:—ఆ యోగాభ్యాసముచేత సాధ్యమగు మనోనాశము బ్రహ్మసాక్షాత్కారమునకు హేతు వని యంగీకరించినయెడల నామనోనాశముచేత బ్రహ్మసాక్షాత్కారోత్పత్త్యనంతరము విద్వాంసుఁ డగు పురుషునకు సర్వబంధములు నివృత్తములై కృతకృత్యత్వమే కలుగుచున్నది. అట్టి విద్వాంసుఁ డగు పురుషునకు మరల వాసనాక్షయాద్యభ్యాసము చేయుటవలన నేప్రయోజనమును లేదు.

సమాధానము:—ఏ యధికారిపురుషునకు యోగాభ్యాసపూర్వకముగా మహావాక్యమువలన బ్రహ్మసాక్షాత్కార ముత్పన్న మైనదో ఆతత్త్వవేత్త యగుపురుషున కైననో బ్రహ్మసాక్షాత్కారానంతరము తత్త్వజ్ఞానవాసనాక్షయమనోనాశాభ్యాసములయొక్క యుపేక్ష కలుగుట లేదు. అయినను ఏయధికారిపురుషునకు వివేకపూర్వకముగా మహావాక్యమువలన బ్రహ్మసాక్షాత్కార ముత్పన్న మైనదో యాపురుషున కాబ్రహ్మసాక్షాత్కారానంతరము ప్రారబ్ధభోగముచే సంపాదింపఁబడిన కర్తృత్వభోక్తృత్వాదిరూపబంధములు ప్రతీతము లగుచున్నవి. బంధప్రతీతి నివృత్తి చేయుటకొఱకుఁ దత్త్వజ్ఞానవాసనాక్షయమనోనాశములయొక్క యభ్యాస మవశ్యమపేక్షితమై యున్నది. ఆమూటియొక్క యభ్యాసముచేతనే యాపురుషునకు జీవన్ముక్తి సిద్ధించుచున్నది. అందువలనఁ దత్త్వజ్ఞానవాసనాక్షయమనోనాశము లను మూడును జీవన్ముక్తికి సాధనములై యున్న వనునది సిద్ధ మైనది. ఇంతయుఁ జెప్పుటచేత, సాధనములయొక్క యభావమువలన జీవన్ముక్తి కభావము చెప్పునట్టివాదము ఖండింపఁబడిన ట్లయినది.

## [*] (28) జీవన్ముక్తియొక్క ప్రయోజనవర్ణనము. [*]

ఇఁక జీవన్ముక్తియొక్క ప్రయోజనము చెప్పఁబడుచున్నది. జీవన్ముక్తికి జ్ఞానరక్షతపము విసంవాదాభావము దుఃఖనివృత్తి సుఖావిర్భావము అను నీయైదును ప్రయోజనములై యున్నవి. అందు బ్రహ్మసాక్షాత్కారము గల తత్త్వవేత్త యగు పురుషునకు మరల సంశయవిపర్యయములయొక్క యనుత్పత్తి యేది గలదో అది జ్ఞానరక్ష యనఁబడును. అజ్ఞానరక్ష జీవన్ముక్త్యభ్యాసమువలననే సిద్ధ మగుచున్నది. కావున నాజ్ఞానరక్షకు జీవన్ముక్తియొక్క ప్రయోజనత్వము సంభవించు చున్నది.

శంక:—ఏపురుషునకు వేదాంతశాస్త్రరూపప్రమాణముచేత బ్రహ్మసాక్షాత్కారము కలిగి యున్నదో యాపురుషున కాసాక్షాత్కారానంతరము సంశయ విపర్యయములు ప్రాప్తము లగుట లేదు. మఱియుఁ బ్రాప్తవస్తువునకే నిషేధము కలుగుచున్నది. అప్రాప్తవస్తువునకు నిషేధము కలుగుట లేదు. అందువలన జ్ఞాన రక్ష జీవన్ముక్తికిఁ బ్రయోజన మనుట ఘటిల్లదు.

సమాధానము:—యద్యపి శాస్త్రప్రమాణమునందుఁ గుశలు లైన ముఖ్యాధికారులకు బ్రహ్మసాక్షాత్కారానంతర మాసంశయవిపర్యయములు సంభవించుట లేదు, తథాపి అన్యాధికారులకు నిమిత్తవశమువలన నాసంశయవిపర్యయములు సంభవించు చున్నవి. అందు భ్రాంతపురుషులయొక్క వచనములే సంశయ విపర్యయములయందు నిమిత్తములై యున్నవి. అవి చూపఁబడు చున్నవి. కొందఱు భ్రాంతపురుషులో యిట్లు చెప్పుచున్నారు. ఏపురుషులు తాము బ్రహ్మజ్ఞానుల మని యనుకొనుచున్నారో ఆపురుషులయందును అజ్ఞానిపురుషులయందువలె "మనుష్యోహమ్, బ్రాహ్మణోహమ్" అను వ్యవహారము చూడఁబడు చున్నది. అట్లే రాగద్వేషాదికమును జూడఁబడు చున్నది. ఒకవేళ నీపురుషులకు వేదాంతశ్రవణాదికమువలన బ్రహ్మాపరోక్షసాక్షాత్కారము కలిగినను ఆరాగద్వేషాదికము నశించుట లేదు. అందువలన నాశ్రవణాదులచేత నీపురుషుల కాపాతజ్ఞానమే కలుగుచున్నది. ఈవిధముగా భ్రాంతు లగు వాచాలకపురుషులయొక్క వచనములను వినుటచేత నావ్యుత్పన్నాధికారుల కుత్పన్న మైన బ్రహ్మసాక్షాత్కారమందును సంశయవిపర్యయములు గలుగు చున్నవి.

మఱి కొందఱు అజ్ఞానిజనులో యిట్లనుచున్నారు. మరణపర్యంతము వేదాంతశ్రవణాదులచేతను ఈపురుషునకు బ్రహ్మముయొక్క యపరోక్షజ్ఞానము గలుగుట లేదు. ఇఁక నే మనఁగా నా వేదాంతవాక్యములవలన నీపురుషునకుఁ బరోక్ష జ్ఞానమే కలుగుచున్నది. ఏకారణముచేత నట్లఁగా నాపురుషులయందుఁ బరోక్ష

జ్ఞానముయొక్క చిహ్నములే చూడఁబడు చున్నవి. అపరోక్షజ్ఞానముయొక్క చిహ్న [illegible] టు లేక. మఱియు నొకవేళ నీపురుషున కీకాలమునందును [illegible] కలుగ నన్న యెడల నంతఃకరణముచేత నావరణసహితా [illegible] కర్తను కాఁగా నజ్ఞానవంతుఁ డగుపురుషున కీశ్వరునివలె సర్వజ్ఞత్వాదికము కలుగవలయును. ఏల యన, శుకసనకాదిపూర్వజ్ఞానులయం దీశ్వరునియందువలె నాసర్వజ్ఞత్వాదిధర్మము లున్న వని శాస్త్రమువలనఁ బ్రతీత మగుచున్నది. మఱియు నాసర్వజ్ఞత్వాదికము తపముయొక్క లేక యోగముయొక్క ఫలమై యున్నది, జ్ఞానముయొక్క ఫలము గాదు, ఆశుకసనకాదిజ్ఞానులు తపోయోగములు గలవారై యున్నారు, అందువలన వారియందు సర్వజ్ఞత్వాదికము గలిగి యుండెను, ఈకాలము నందలిజ్ఞానులు తపోయోగరహితు లగుటవలన వారియం దాసర్వజ్ఞత్వాదిధర్మములు లేవు, అని యిట్లు చెప్పినయెడల నదియును ఘటిల్లదు. ఏల యన నాతపోయోగములు గల పురుషులకే యాత్మజ్ఞానము కలుగు చున్నది. ఆ తపోయోగరహితు లగు పురుషుల కాత్మజ్ఞానమే కలుగుట లేదు. అందువలన నీకాలమునందు శ్రవణాదులవలన నుత్పన్న మైన జ్ఞాన మాపాతరూపమే యగుచున్నది. అజ్ఞాననివృత్తి చేయుటయం దసమర్థ మైనజ్ఞాన మాపాతజ్ఞాన మనఁబడును.

ఈప్రకారముగా భ్రాంతు లగు మూర్ఖులయొక్క వచనములను వినుటచేత నప్రవృత్తపన్నాధికారుల కుత్పన్న మైన సాక్షాత్కారమందును సంశయవిపర్యయములు కలుగుచున్నవి. ఎప్పు డాయధికారిపురుషుఁడు బ్రహ్మసాక్షాత్కారానంతరము పూర్వోక్తరీతిగా జీవన్ముక్త్యభ్యాసము చేయు చున్నాఁడో, అప్పు డాయధికారిపురుషున కాభ్రాంతపురుషులయొక్క సంగమమే కలుగుట లేదు. కావున నాసంశయవిపర్యయము లుత్పన్నము లగుట లేదు. ఇదియే జ్ఞానరక్షయై యున్నది. దీనిచేత నాజ్ఞానరక్షకు జీవన్ముక్తియొక్క ప్రయోజనత్వము సంభవించుచున్నది.

మఱియు నస్మదాదు లగు నకృతోపాస్తిపురుషులకు బ్రహ్మసాక్షాత్కారానంతర ముక్తనిమిత్తమువలన సంశయాదులు కలుగు ననువార్తయం దేయాశ్చర్యమును లేదు. మఱి యే మనఁగాఁ బూర్వు లగు శుక రాఘవ నిదాఘ భగీరథాదులకును అపరోక్షజ్ఞానానంతరము సంశయాదికము కలిగి యుండెను. అందు శుకునకుఁ బ్రథమమునఁ దనవివేకముచేతనే బ్రహ్మసాక్షాత్కారము కలిగెను. అనంతర మాజ్ఞానమునందు సంశయమును బొంది, శుకుఁడు తనతండ్రి యగు వ్యాసునిసమీపమునకుఁ బోయి ప్రశ్న చేసెను. ఆ శుకుని గూర్చి వ్యాసభగవానులు తత్త్వోపదేశముఁ జేసిరి. అపుడును ఆశుకునకు సంశయనివృత్తి కాక పోయెను. తదనంతర మా

వ్యాసభగవానులాశుకుని జనకరాజునొద్దకుఁ బంపెను. అచ్చట నాజనకునియుప దేశమువలన సంశయరహితుఁడై నిర్వికల్పసమాధిని బొంది ముక్తిని బొందినవాఁ డాయెను. ఈ కథ వాసిష్ఠరామాయణమునందుఁ బ్రసిద్ధమై యున్నది. ఈప్రకార ముగా నిదాఘాదులయొక్క కథలును బురాణాదులయందుఁ బ్రసిద్ధములై యున్నవి.

శంక:—జ్ఞానవంతునకా సంశయవిపర్యయము లుండినను దానిచేత వా నికి హాని యేమి?

సమాధానము:—ఎట్లజ్ఞానము మోక్షమునకుఁ బ్రతిబంధకమో అట్లా సంశయవిపర్యయములు గూడ మోక్షమునకుఁ బ్రతిబంధకములే యగుచున్నవి. ఈ యర్థము శ్రీభగవంతుఁడును గీతయందు "అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి" అను వచనముచేఁ జెప్పి యున్నాఁడు. కనుక విద్వాంసుఁ డగుపురుషుఁడు జీవన్ముక్తియొక్క యభ్యాసముచేత నా సంశయవిపర్యయములయొక్క నివృత్తి నవశ్య ము చేయవలయును.

శంక:—ఏయధికారిపురుషునకు సంశయవిపరీతభావనారహితముగా నాత్మ యొక్క దృఢాపరోక్షజ్ఞానము కలిగి యున్నదో మఱియు వ్యవహారబాహుళ్యముచేఁ బూర్వోక్తజీవన్ముక్త్యభ్యాస ముండుట లేదో, ఆయధికారిపురుషునకు మోక్షము కలుగుచున్నదా? లేదా? అందు వానికి మోక్షము కలుగు నను ప్రథమపక్ష మం గీకరించినచో, జీవన్ముక్త్యభ్యాసము వ్యర్థ మగును. ఏల యన మోక్షముకన్న నధిక ముగా నొకపదార్థమును లేదు. ఆమోక్ష మైననో ఆత్మజ్ఞానముచేతఁ బ్రాప్త మగు చున్నది. కావున జీవన్ముక్త్యభ్యాసము వ్యర్థమే యగును. మఱియు దృఢాపరోక్ష జ్ఞానము గలవానికి మోక్షము కలుగ దను ద్వితీయపక్ష మంగీకరించినయెడల, నాత్మ జ్ఞానమువలన మోక్షప్రాప్తిని జెప్పునట్టి "జ్ఞానా దేవతు కైవల్యమ్" ఇత్యాది శ్రుతి స్మృతిరూపశాస్త్రములకు విరోధము కలుగును.

సమాధానము:—యద్యపి దృఢాపరోక్షజ్ఞానికి మోక్ష మవశ్యము కలుగు చున్నది, తథాపి ఆజీవన్ముక్త్యభ్యాసము లేక దృష్టసుఖము ప్రాప్తించుట లేదు. అందువలన నాదృష్టసుఖప్రాప్తికొఱకు జ్ఞానవంతునకును జీవన్ముక్త్యభ్యాసము సంభవించుచున్నది. అనఁగా దృష్టసుఖమే జీవన్ముక్త్యభ్యాసమునకుఁ బ్రయోజనమై యున్నది. మఱియు జీవన్ముక్తపురుషులకును భూమికలయొక్క తారతమ్యముచేత దృష్టసుఖముయొక్క తారతమ్యమే కలుగు చున్నది. అందు శ్రుతి.—"ఆత్మక్రీడ ఆత్మ రతిః క్రియావా నేవ బ్రహ్మవిదాం వరిష్ఠః"—భావము॥ ఆత్మయందు దపరోక్షానుభవ క్రీడ గలవాఁ డాత్మక్రీడుఁ డనఁబడును, అనఁగా "అహం బ్రహ్మాస్మి" యను నప

రోక్షజ్ఞానము గల విద్వాంసున కాత్మక్రీడుఁ డని పేరు. ఈయాత్మక్రీడ గల విద్వాంసుఁడు శాస్త్రమునందు బ్రహ్మవిత్తని చెప్పఁబడి యున్నాఁడు. మఱియు నాత్మయందు విజాతీయవృత్తులయొక్క తిరస్కారపూర్వక సాక్షాత్కారరూపరతి గలవాఁ డాత్మరతి యనఁబడును. అనఁగా ఆత్మానందమును నిరంతర మపరోక్షముగా ననుభవించువాని కాత్మరతి యని పేరు. ఈ యాత్మరతి యగు విద్వాంసుఁడు శాస్త్రమునందు బ్రహ్మవిద్వరుఁ డని చెప్పఁబడి యున్నాఁడు. మఱియు బ్రహ్మధ్యానమునకుఁ గ్రియ యని పేరు. ఆబ్రహ్మధ్యాన మెవనికిఁ బ్రాప్తమై యున్నదో వానిని గ్రియావంతుఁ డందురు. అనఁగా బ్రహ్మైకత్వమునందు సమాధి గల పురుషునకుఁ గ్రియావంతుఁ డని నామము. ఈ క్రియావంతుఁ డగు విద్వాంసుఁడు శాస్త్రమునందు బ్రహ్మవిద్వరీయుఁ డని చెప్పఁబడి యున్నాఁడు. ఈ బ్రహ్మవిద్వరీయుఁడు తానుగా సమాధినుండి యుత్థానమును బొందుట లేదు. ఇఁక నేమనఁగాఁ బరులచేత నుత్థానమును బొందు చున్నాఁడు. మఱియు నే విద్వాంసుఁ డగు పురుషుఁడు తనచేతఁ గాని పరులచేతఁ గాని యుత్థానమును బొందుట లేదో ఆవిద్వాంసుఁ డగు పురుషుఁడు బ్రహ్మవిద్వరిష్ఠుఁ డని చెప్పఁబడు చున్నాఁడు.

అచ్చట బ్రహ్మవిదుఁడు బ్రహ్మవిద్వరుఁడు బ్రహ్మవిద్వరీయుఁడు బ్రహ్మవిద్వరిష్ఠుఁడు అను నీ్రశుత్యుక్తచతుర్విధవిద్వాంసులను గూర్చి వసిష్ఠభగవానులచే జ్ఞానముయొక్క సప్తభూమికలయందుఁ జతుర్థభూమిక మొదలు క్రమముగాఁ జెప్పఁబడి యున్నది. ఆసప్తభూమిక లేవి యనఁగా, "జ్ఞానభూమి శ్శుభేచ్ఛాస్య ప్రథమా సముదాహృతా। విచారణా ద్వితీయాస్యా త్తృతీయా తనుమానసా॥ సత్త్వాపత్తి శ్చతుర్థీ స్యా త్తతో ఽసంసక్తి నామికా। పదార్థాభావినీ షష్ఠీ సప్తమీ తుర్యగా స్మృతా"—భావము॥ శుభేచ్ఛ విచారణ తనుమానస సత్త్వాపత్తి అసంసక్తి పదార్థాభావిని తురీయ అను నీసప్తకమును జ్ఞానభూమికలై యున్నవి. ఆసప్తజ్ఞానభూమికలయందుఁ బ్రథమ మగు శుభేచ్ఛ యైననో శ్రవణరూపమై యున్నది. ద్వితీయ మగు విచారణ మననరూపమై యున్నది. తృతీయ మగు తనుమానస నిదిధ్యాసనరూపమై యున్నది. అందువలన నుక్తభూమికలు మూఁడును సాధనరూపములై యున్నవి. శ్రవణ మనన నిదిధ్యాసనములయొక్క స్వరూపము పూర్వము ద్వితీయపరిచ్ఛేదమునందుఁ జెప్పఁబడి యున్నది. మఱియు సత్త్వాపత్తి యను చతుర్థభూమికయం దీపురుషునకు బ్రహ్మసాక్షాత్కారము కలుగు చున్నది. ఈకారణముచేతనే యాచతుర్థభూమికయం దుండు పురుషుని బ్రహ్మవిత్తని చెప్పుదురు. పంచమ్యాదిభూమికలయం దుండు జ్ఞానవంతు లగు పురుషులకుఁ జిత్తవిశ్రాంతియొక్క తారతమ్య

ఘువలన దృష్టసుఖమునకును దారతమ్య మున్నది. అందువలనఁ బంచమభూమిక గలవానిని బ్రహ్మవిద్వరుఁ డని చెప్పుదురు. షష్ఠభూమిక గలవానిని బ్రహ్మవిద్వరీయుఁ డని చెప్పుదురు. సప్తమభూమిక గలవానిని బ్రహ్మవిద్వరిష్ఠుఁ డని చెప్పుదురు. అచ్చట బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయో బ్రహ్మవిద్వరిష్ఠు లను నీముగ్గురును జీవన్ముక్తు లని చెప్పఁబడు చున్నారు. అందు "భూయ శ్చాంతే విశ్వమాయా నివృత్తిః, జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః" ఇత్యాది శ్రుతిస్మృతివచనములు "అహం బ్రహ్మాస్మి" యను బ్రహ్మజ్ఞానముచేత నజ్ఞాననివృత్తిఁ జెప్పి యున్నవి. మఱియు "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి, బ్రహ్మవి దాప్నోతి పరమ్, జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" ఇత్యాది శ్రుతిస్మృతివచనములు బ్రహ్మజ్ఞానముచేత బ్రహ్మభావప్రాప్తిని జెప్పి యున్నవి. అజ్ఞాననివృత్తిపూర్వక మగు బ్రహ్మభావప్రాప్తి యేది గలదో, అది మోక్ష మనఁబడును. ఆమోక్షము బ్రహ్మవి ద్బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయో బ్రహ్మవిద్వరిష్ఠు లను నల్వురకును సమానమే యగుచున్నది. ఆ మోక్షమునందుఁ గించిన్మాత్రమును విలక్షణత్వము లేదు. అయినను దృష్టసుఖమునందుఁ దారతమ్య మున్నది. ఈ యర్థ మన్యగ్రంథములయందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. తారతమ్యేన సర్వేషాం చతుర్ణాం సుఖ ముత్తమమ్ । తుల్యా చతుర్ణాం ముక్తిః స్యా ద్దృష్టసౌఖ్యం విశిష్యతే"— భావము॥ బ్రహ్మవిదాదు లగు నల్వురకును దారతమ్యవంత మైన సుఖ మున్నది. మఱియు ముక్తి యైనను నల్వురకును సమానమై యున్నది. ఆ ముక్తియందుఁ గించిన్మాత్రమును విశేషము లేదు. మఱి యే మనఁగా దృష్టసుఖమునందే విశేష మున్నది.

## (29) జీవన్ముక్తియొక్క ద్వితీయప్రయోజనరూప తపోనిరూపణము.

ఇఁక జీవన్ముక్తియొక్క తపోరూపద్వితీయప్రయోజనము నిరూపింపఁబడు చున్నది. చిత్తైకాగ్రత తప స్సనఁబడును. ఈ తపస్సుయొక్క స్వరూపము స్మృతియందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. మనస శ్చేంద్రియాణాం చ ఐకాగ్ర్యం పరమం తపః । తజ్జ్యాయః సర్వధర్మేభ్యః సధర్మః పర ఉచ్యతే"—భావము॥ మనస్సుయొక్కయుఁ జక్షురాదీంద్రియములయొక్కయు నేకాగ్రత్వ మేది గలదో అది యే పరమతపస్సై యున్నది. మఱియు యోగవేత్త లగు పురుషులచేతను ఆ చిత్తైకాగ్రతారూపధర్మమే యగ్నిహోత్రాదిసర్వధర్మములకన్న శ్రేష్ఠ మని చెప్పఁబడి యున్నది. ఇట్టి యేకాగ్రతారూపయోగమ్ము గీతయందు శ్రీభగవంతునిచేత "తపస్విభ్యో ఽధికో యోగీ జ్ఞానిభ్యో ఽపి మతో ఽధికః । కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భ వార్జున" అనువచనముచేత సర్వధర్మములకంటె నధిక మని చెప్పఁబడి యున్నది.

శంక:—ప్రారబ్ధకర్మభోగముచేత విక్షిప్తచిత్తము గల యేజ్ఞానవంతుఁ డున్నాఁడో వానికిఁ జిత్తైకాగ్రతారూపతప మెట్లు కలుగును?

సమాధానము:—యద్యపి చతుర్థభూమిక గల జ్ఞానవంతుఁ డగు పురుషునకును బ్రపంచముయొక్కమిథ్యాత్వనిశ్చయముచేతను జైతన్యాత్మయొక్కసత్యత్వరూపనిశ్చయముచేతను ఆచిత్తైకాగ్రత విద్యమానమై యున్నది, తథాపి ఆజ్ఞానవంతునకుఁ బ్రారబ్ధకర్మభోగకాలమునందు బాధితానువృత్తిచేత నామరూపాత్మకప్రపంచముయొక్కప్రతీతి కలుగు చున్నది. అందువలన నాజ్ఞానవంతునకు నిరంకుశచిత్తైకాగ్రత సంభవించుట లేదు. మఱియు జీవన్ముక్తుఁ డగు జ్ఞానవంతున కైననో యోగాభ్యాసముచేత మనస్సు నష్టమై యున్నది. అందువలన నాజీవన్ముక్తపురుషునకు సర్వవృత్తులయొక్కయనుదయమువలన నానిరంకుశచిత్తైకాగ్రత సంభవించు చున్నది. ఆనిరంకుశచిత్తైకాగ్రతారూపతపస్సే యాజీవన్ముక్తికిఁ బ్రయోజనమై యున్నది.

శంక:—ఆజీవన్ముక్తపురుషులయొక్కతపస్సు దేనియం దుపయోగియై యున్నది?

సమాధానము:—ఆ జీవన్ముక్తపురుషులయొక్కతపస్సు లోకసంగ్రహముకొఱకై యున్నది. అందు, తాను సదాచారప్రవృత్తుఁడై లోకులను గూడ నాసదాచారమునందుఁ బ్రవర్తింపఁజేయుట యేది గలదో అది లోకసంగ్రహ మనఁబడును. విద్వాంసులయొక్కతపస్సు మొదలగునది లోకసంగ్రహముకొఱకే యున్నది. ఈ యర్థము గీతయందు శ్రీభగవంతునిచేతను "లోకసంగ్రహ మే వాపి సంపశ్య న్కర్తుమర్హసి" అనువచనముచేతఁ జెప్పఁబడి యున్నది. ఆ సంగ్రహింపఁబడు నధికారులు శిష్య భక్త తటస్థు లను భేదముచేతఁ ద్రివిధులై యున్నారు. అందు శాస్త్రప్రతిపాదితసన్మార్గములయందు వర్తించువాఁడు శిష్యుఁ డనఁబడును. ఆశిష్యుఁడో బ్రహ్మవేత్త యగు గురువుచే నుపదేశింపఁబడినమార్గముచేత వేదాంతశాస్త్రశ్రవణాదులవలనఁ బ్రత్యగభిన్నబ్రహ్మసాక్షాత్కారము గలవాఁడై ముక్తినే పొందుచున్నాఁడు. అందు శ్రుతి.—"ఆచార్యవా న్పురుషో వేద, తస్య తావ దేవ చిరం యావ న్నవిమోక్ష్యే ఒథ సంపత్స్యే"—భావము॥ బ్రహ్మవేత్త యగు నాచార్యుని శరణు పొందిన శిష్యుఁడే బ్రహ్మమును సాక్షాత్కరించుకొనుచున్నాఁడు, జ్ఞానవంతుఁ డగు పురుషున కెంతపర్యంతము భోగముచేతఁ బ్రారబ్ధకర్మము నశించుట లేదో అంతపర్యంతమే విదేహమోక్షమునందు విలంబ మున్నది, ప్రారబ్ధకర్మనివృత్త్యనంతర మాజ్ఞానవంతుఁడు విదేహమోక్షమును బొందుచున్నాఁడు. మఱియు జీవన్ముక్తజ్ఞానియొక్క యేభక్తుఁ డున్నాఁడో ఆభక్తుఁడును ఆజ్ఞానవంతుని పూజనార్చనములచేతను అతనికన్నపానవస్త్రాదిపదార్థముల నిచ్చుటచేతను మనోవాంఛితపదార్థములను బొందుచున్నాఁడు. అందు శ్రుతి.—"యం యం లోకం మనసా సంవిభాతి విశుద్ధసత్త్వః

కామయతే యాంశ్చ కామాన్ తం తం లోకం జయతే తాంశ్చకామాన్, తస్మా దాత్మజ్ఞం హ్యర్చయే ద్భూతికామః "—భావము॥ శ్రద్ధాభక్తిపూర్వకముగా శుద్ధాంతఃకరణమువలన జ్ఞానవంతుఁ డగుపురుషుని బూజించుభక్తజను లేయేలోకములఁ బొందుట కిచ్ఛించుచున్నారో యేయేపదార్థములఁ బొందుటకుఁ గోరిక గలవా రగుచున్నారో ఆయాలోకములను ఆయాపదార్థములను బొందుచున్నారు. అందువలన సంపదిచ్ఛ గలపురుషులు శ్రద్ధాభక్తులచేత బ్రహ్మవేత్త యగుపురుషునకే పూజనాదికముఁ జేయవలయును. ఈ యర్థము స్మృతియందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. య ద్యేకో బ్రహ్మవి ద్భుంక్తే జగ త్తర్పయతే ఽఖిలమ్ । తస్మా ద్బ్రహ్మవిదే దేయం యద్యా స్తే వస్తు కించన "—భావము॥ ఏపురుషునియొక్క గృహమునందు బ్రహ్మవేత్త యగుపురుషుఁ డొకఁ డైనను భుజించుచున్నాఁడో యతఁడు సర్వజగత్తును దృప్తిని బొందించుచున్నాఁడు. అనఁగా సర్వజగత్తును దృప్తిఁ బొందించుటవలన నేపుణ్యము కలుగుచున్నదో ఆపుణ్య మొకబ్రహ్మవేత్త యగుపురుషుని భుజింపఁ జేయుటవలనఁ గలుగుచున్నది. అందువలనఁ బురుషునియొద్ద నేదైన యున్నవస్త్రాది ప్రియవస్తువు లున్నయెడల నావస్తువుల నీపురుషుఁడు బ్రహ్మవేత్త లగుపురుషులకే యిచ్చుట యోగ్యమై యున్నది. ఈ యర్థ మన్యస్మృతియందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. య త్ఫలం లభతే మర్త్యః కోటిబ్రాహ్మణభోజనైః । తత్ఫలం సమవాప్నోతి జ్ఞానినం యస్తు భోజయేత్॥ జ్ఞానిభ్యో దీయతే యచ్చ తత్కోటి గుణితం భవేత్ "— భావము॥ ఈ జీవుఁడు కోటిబ్రాహ్మణుల భుజింపఁజేయుటవలన నేఫలమును బొందుచున్నాఁడో ఆఫలము నీపురుషుఁ డొకజ్ఞానవంతుని భుజింపఁ జేయుటవలనఁ బొందుచున్నాఁడు. మఱియు జ్ఞానవంతునికొఱ కేవస్తువు నీయఁబడుచున్నవో అది కోటిగుణ మధిక మగుచున్నది. ఇత్యాద్యనేకశ్రుతిస్మృతివచనములు జ్ఞానవంతునియొక్క సేవచేత మనోవాంఛితపదార్థములయొక్క ప్రాప్తిని జెప్పుచున్నవి.

మఱియుఁ దటస్థపురుషులు ద్వివిధులు, ఒకఁడు సన్మార్గవర్తి, మఱియొకఁ డసన్మార్గవర్తి. అందు సన్మార్గవర్తి తటస్థుఁ డైననో, జీవన్ముక్తపురుషునియొక్క సదాచారప్రవృత్తిని జూచి తానును ఆసదాచారమునందుఁ బ్రవర్తించుచున్నాఁడు. ఈ యర్థము గీతయందు శ్రీభగవంతునిచేతను "యద్య దాచరతి శ్రేష్ఠ స్త త్త దేవేతరో జనః । స య త్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే" అనుశ్లోకముచేఁ జెప్పఁబడి యున్నది. మఱియు ద్వితీయుఁ డగు నసన్మార్గవర్తి తటస్థుఁ డైననో, యాజీవన్ముక్తపురుషునిదృష్టివలన సర్వపాపరహితుం డగుచున్నాఁడు. అందు స్మృతి.—"యస్యానుభవపర్యంతం బుద్ధి స్తత్త్వే ప్రవర్తతే । త ద్దృష్టిగోచరా స్సర్వే ముచ్యంతే సర్వకిల్బిషైః" — భావము॥ "అహం బ్రహ్మాస్మి" యను నపరోక్షానుభవపర్యంత

మేపురుషునియొక్క బుద్ధి ప్రత్యక్తత్త్వమునందుఁ బ్రవర్తమానమై యున్నదో ఆజ్ఞాన వంతుఁడగు పురుషునియొక్క దృష్టి కేయేపురుషులు విషయభూతు లగుచున్నారో ఆసర్వపురుషులును సర్వపాపరహితు లగుచున్నారు. మఱియు నాజీవన్ముక్తపురుషుల నేదుష్టపురుషులు ద్వేషించి నిందించుచున్నారో ఆదుష్టపురుషు లాజ్ఞానవంతుని పాపములను బరిగ్రహించుచున్నారు. అందు శ్రుతి.—"తస్య పుత్రా దాయ ముపయంతి సుహృదః సాధుకృత్యాం ద్విషంతః పాపకృత్యామ్"—భావము॥ జ్ఞానవంతుఁడగు పురుషునియొక్క ధనాదిపదార్థములను బుత్రులు పొందుచున్నారు, మఱియుఁ బుణ్యకర్మములను సేవఁ జేయు సుహృజ్జనులు పొందుచున్నారు, పాపకర్మములను నింద చేయు ద్వేషిపురుషులు పొందుచున్నారు. ఈప్రకారముగా నా జీవన్ముక్తపురుషునియొక్క తపము లోకసంగ్రహముకొఱకై యున్నది. ఆ తపము జీవన్ముక్తికి ద్వితీయప్రయోజనమై యున్నది.

## (30) జీవన్ముక్తియొక్క విసంవాదాభావరూప తృతీయ ప్రయోజననిరూపణము.

ఇఁక నా జీవన్ముక్తియొక్క విసంవాదాభావరూప తృతీయప్రయోజనము నిరూపింపఁబడుచున్నది. అచ్చట నాజీవన్ముక్తపురుషునియొక్క వ్యుత్థానకాలమందు దుష్టపురుషకృతనిందాదులను వినుటచేతను, పాషండక్రూరనిష్ఠురాదిపురుషులను జూచుటచేతను ఆ జీవన్ముక్తపురుషునకు రాగద్వేషాదివృత్తు లుత్పన్నములు గావు. అందువలన జీవన్ముక్తపురుషున కానిందకదుష్టపురుషులతోఁ గలహరూపవిసంవాదము కలుగుట లేదు. మఱియు నేపురుషుఁడు జీవన్ముక్త్యభ్యాసరహితుఁ డగుచున్నాఁడో ఆపురుషునకైననో ఆదుష్టజనులతో సర్వథా కలహరూపవిసంవాదము కలుగుచున్నది. అందువలన నావిసంవాదాభావమునందు జీవన్ముక్తియొక్క ప్రయోజనత్వము సంభవించుచున్నది. ఈయర్థము వృద్ధాచార్యులచేతను జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. జ్ఞాత్వా సదా తత్త్వనిష్ఠా ననుమోదామహే వయమ్ । అనుశోచామహే చాన్యా న్నభ్రాంతై ర్వివదామహే" — భావము॥ సర్వదా తత్త్వనిష్ఠయందుండు పురుషులను జూచి మే మానందమును బొందుచున్నాము, మఱియుఁ దత్త్వనిష్ఠారహితపురుషులను జూచి మేము శోకమును బొందుచున్నాము, భ్రాంతపురుషులతో వివాదము చేయుట లేదు. ఈ విసంవాదాభావము జీవన్ముక్తికిఁ దృతీయప్రయోజనమై యున్నది.

## (31) జీవన్ముక్తియొక్క దుఃఖనివృత్తిరూప చతుర్థప్రయోజననిరూపణము.

ఇఁక నాజీవన్ముక్తియొక్క దుఃఖనివృత్తిరూపచతుర్థప్రయోజనము చెప్పఁబడుచున్నది. అచ్చట దుఃఖనివృత్తి ద్విప్రకారమగుచున్నది. ఒకటి యైహికదుఃఖనివృత్తి, మఱియొకటి పరలోకదుఃఖనివృత్తి. అందాత్మజ్ఞానముచేత భ్రాంతినివృత్తి

యగుటవలనను యోగాభ్యాసముచేత సర్వవృత్తులు నిరుద్ధము లగుటవలనను జీవన్ముక్తపురుషునియొక్క చిత్తము కేవలాత్మాకారముగానే యగుచున్నది. అన్యాకారమగుట లేదు. అందువలనఁ బ్రారబ్ధభోగ ముండినను ఆజీవన్ముక్తపురుషునకు దుఃఖము ప్రతీత మగుట లేదు. మఱియే మనఁగా, సర్వదుఃఖములు నివృత్తము లగుచున్నవి. ఇదియే యైహికదుఃఖనివృత్తి యనఁబడును. ఈ యైహికదుఃఖనివృత్తియే "ఆత్మానం చే ద్విజానీయా దయ మస్మీతి పూరుషః । కి మిచ్ఛ న్కస్య కామాయ శరీర మను సంజ్వరేత్" అను శ్రుతియందుఁ జెప్పఁబడి యున్నది. ఆత్మజ్ఞానముచేత నజ్ఞానము నివృత్తము కాఁగా సర్వసంచితకర్మములకు నాశము కలుగుచున్నది. మఱియు నాత్మజ్ఞానముయొక్క ప్రభావమువలన జ్ఞానవంతుఁ డగు పురుషున కాగామికర్మములయొక్క స్పర్శయే కలుగుట లేదు. ఆ యజ్ఞానసహితసంచితకర్మమే, పరలోకదుఃఖమునకు హేతు వగుచున్నది. దానియొక్క నాశముచే జీవన్ముక్తపురుషునకుఁ బరలోకముయొక్క సర్వదుఃఖములు నివృత్తము లగుచున్నవి. అందు శ్రుతి.—"ఏతం హావావ నతపతి కి మహం సాధు నాకరవం కి మహం పాప మకరవమ్"—భావము॥ నేను పుణ్యకర్మ మేలచేయక పోయితిని నేను బాపకర్మ మేల చేసితి నను చింతారూపాగ్ని యెట్లజ్ఞానిపురుషునిఁ దపింపఁజేయు చున్నదో, అట్లు జీవన్ముక్తపురుషుని నాచింతారూపాగ్ని తపింపఁజేయుట లేదు. యద్యపి చతుర్థభూమిక గల జ్ఞానవంతునకును ఆ దుఃఖనివృత్తి యగుచున్నది, తథాపి, అజ్ఞానవంతునకుఁ బ్రారబ్ధభోగకాలమునందు బాధితానువృత్తిచేత "అహం సుఖీ, అహం దుఃఖీ" ఇత్యాద్యనుభవము కలుగుచున్నది. అందువలన నాజ్ఞానవంతున కాదుఃఖనివృత్తి సురక్షిత మగుట లేదు. మఱియు నాజీవన్ముక్తపురుషునకు యోగాభ్యాసముచేత సర్వవృత్తులు నిరుద్ధము లగుచున్నవి. అందువలన నాజీవన్ముక్తపురుషున కాదుఃఖనివృత్తి సురక్షిత మగుచున్నది. అనఁగా నాజీవన్ముక్తపురుషున కేకాలమునందును ఆదుఃఖము ప్రతీత మగుట లేదు. కాఁబట్టి యీదుఃఖనివృత్తియందు జీవన్ముక్తియొక్క ప్రయోజనత్వము సంభవించు చున్నది. ఈ దుఃఖనివృత్తి జీవన్ముక్తికిఁ జతుర్థప్రయోజనమై యున్నది.

## (32) జీవన్ముక్తియొక్క సుఖావిర్భావరూపపంచమప్రయోజననిరూపణము.

బ్రహ్మసాక్షాత్కారముచేతను యోగాభ్యాసముచేతను, ఆ జీవన్ముక్తపురుషున కజ్ఞానమును అజ్ఞానకృతావరణమును వ్యవహారరూపవిక్షేపమును నివృత్తములైనవి. అజ్ఞానకృతావరణమును విక్షేపము నను నీరెండే బ్రహ్మానందానుభవమునందుఁ బ్రతిబంధకములై యున్నవి. ఆ ప్రతిబంధకములు నివృత్తములు కాఁగా, జీవన్ముక్తపురుషునకుఁ బరిపూర్ణబ్రహ్మానందముయొక్క నిరంతరానుభవ మేది యున్నదో, అది సుఖావిర్భావ మనఁబడును. అందు శ్రుతి.—"సమాధి నిర్ధూత మలస్య చేతసో నివేశిత స్యాత్మని య త్సుఖం భవేత్ । న శక్యతే వర్ణయితుం గిరా తథా స్వయం తదం

తఃకరణేన గృహ్యతే"—భావము॥ సమాధిచేత రాగద్వేషాదిమలములు నివృత్తములై కేవలాత్మయందు స్థిత మైనచిత్త మేది యున్నదో ఆచిత్తమునకు సమాధికాలమునం దేస్వరూపసుఖము ప్రాప్త మగుచున్నదో, ఆసుఖము వాక్కుచేఁ జెప్పుటకు సాధ్యము గానిదియై యున్నది. మఱే మనఁగా నాసుఖ మాయంతఃకరణముచేతనే గ్రహింపఁబడు చున్నది. ఈ సుఖావిర్భావ మాజీవన్ముక్తికిఁ బంచమప్రయోజనమై యున్నది. ఈప్రకారముగా నాజీవన్ముక్తికిఁ బంచవిధప్రయోజనములు సిద్ధించుచుండఁగాఁ బ్రయోజనాభావమువలన జీవన్ముక్త్యభావకథనము మిథ్యయే యగుచున్నది.

ఈప్రకారముగా స్వరూపలక్షణము, ప్రమాణము, సాధనము, అధికారి, ఫలము, నను నీయైదింటిని నిరూపించి యీచతుర్థపరిచ్ఛేదమునందు విదేహముక్తి జీవన్ముక్తి అను ద్వివిధముక్తులును నిరూపింపఁబడినవి. కావున నీయర్థము సిద్ధ మగుచున్నది. బ్రహ్మవేత్త యగు జీవన్ముక్తపురుషుఁడు భోగముచేతఁ బ్రారబ్ధకర్మనాశానంతర మీవర్తమానశరీరము నశింపఁగా నఖండైకరసబ్రహ్మానందరూపముగా స్థితుఁడగుచున్నాఁడు. ఆ బ్రహ్మవేత్త యగు పురుషునకుఁ బునరుత్థానము కలుగుట లేదు. అందు శ్రుతి.—"న తస్య ప్రాణా ఉత్క్రామంత్యత్రైవ సమవలీయంతే, బ్రహ్మైవ స ద్బ్రహ్మాప్యేతి, బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి"—భావము॥ జ్ఞానవంతుఁ డగు పురుషుని యొక్క ప్రాణములు అనఁగా లింగశరీరము మరణకాలమునం దీశరీరమునుండి యుత్క్రమించుట లేదు. మఱే మనఁగాఁ బ్రత్యగాత్మయందే లయమును బొందుచున్నది. ఇచ్చటఁ దాత్పర్య మేమన, ఈ శరీరనాశానంతర మెట్లజ్ఞానియొక్క లింగశరీరము కర్మఫలభోగముకొఱకుఁ బరలోకమునకుఁ బోవుచున్నదో, అట్లు జ్ఞానవంతునియొక్క లింగశరీరము పరలోకమునకుఁ బోవుట లేదు. ఏల యన, జ్ఞానవంతుఁ డగు పురుషునకుఁ బ్రారబ్ధకర్మ మైననో భోగముచేత నష్ట మగుచున్నది. మఱియు సంచితకర్మము జ్ఞానముచేత నష్ట మగుచున్నది. ఆగామికర్మము జ్ఞానముయొక్క ప్రభావమువలన స్పృశించుట లేదు. మఱియు నజ్ఞానముకూడ నాత్మజ్ఞానముచేత నష్ట మగుచున్నది. ఆ యజ్ఞానసంచితకర్మాదిక మే పునర్జన్మమునకుఁ గారణ మగుచున్నది. ఆకారణము నశింపఁగా, జ్ఞానవంతునియొక్క లింగశరీరము పునర్జన్మమును బొందుటకొఱకీశరీరమునుండి యుత్క్రమించుట లేదు. ఇఁక నే మనఁగా, నీప్రత్యగాత్మయందే లయమును బొందుచున్నది. మఱియు జ్ఞానవంతుఁ డగుపురుషుఁడు జీవితావస్థయందే బ్రహ్మసాక్షాత్కారముచేత నజ్ఞానము నివృత్తము కాఁగా, బ్రహ్మరూపుఁ డయ్యె ప్రారబ్ధకర్మనివృత్త్యనంతరము బ్రహ్మరూపముచే స్థితుఁ డగుచున్నాఁడు. బ్రహ్మవేత్త యగుపురుషుఁడు బ్రహ్మరూపుఁడే యగుచున్నాఁడు.

మఱియు నీయాత్మజ్ఞానమునకు మోక్షరూపఫలము విష్ణుపురాణమునందును జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. విభేదజనకే ఽజ్ఞానే నాశ మాత్యంతికం గతే । ఆత్మనో బ్రహ్మణో భేద మసంతం కః కరిష్యతి॥ తద్భావభావ మాపన్న స్తతో౽సౌ పరమాత్మనః । భవ త్యభేదో భేదశ్చ తస్యా జ్ఞానకృతో భవేత్ "—భావము॥ జీవబ్రహ్మములయొక్క భేదమునకు జనక మగు నేయజ్ఞాన మున్నదో ఆ యజ్ఞానమునకు బ్రహ్మసాక్షాత్కారముచేత నత్యంతము నాశము కలుగఁగా జీవాత్మకును బ్రహ్మమునకును అసద్భేదము చేయుట కెవ్వని కగును? ఇఁక నే మన, నెవ్వనికిని గాదు. బ్రహ్మసాక్షాత్కారముచేత బ్రహ్మభావమును బొందిన యీజీవాత్మ బ్రహ్మముతో నభిన్నమే యగుచున్నది. ఈ జీవాత్మకు బ్రహ్మముతో నేభేదము ప్రతీత మగుచున్నదో ఆభేద మజ్ఞానకృతమై యున్నది. ఆ యజ్ఞానము నష్టము కాఁగా భేదమును నివృత్త మగుచున్నది. అందువలన జ్ఞానవంతుఁ డగుపురుషుఁ డఖండైకరసబ్రహ్మరూపముగా స్థితుఁ డగుచున్నాఁడు.

మఱియు నీచెప్పినఫలము శ్రీవ్యాసభగవానులచేతను బ్రహ్మసూత్రమునందుఁ జెప్పఁబడి యున్నది. అందు సూత్రము.—"అస్మి న్నస్య చ తద్యోగం శాస్తి"—భావము॥ ఈ బ్రహ్మవేత్త యగు పురుషునకు బ్రహ్మమునం దభేదమే యున్నది. ఈయర్థము శ్రుతి చెప్పుచున్నది. ఆశ్రుతి యేది యనఁగా "య దా హ్యేవైష ఏతస్మి న్నదృశ్యే ఽనాత్మ్యే నిరుక్తే ఽనిలయనే ఽభయం ప్రతిష్ఠాం విందతే. ఽథసో ఽభయం గతో భవతి"—భావము॥ ఈ సాధనచతుష్టయసంపన్నాధికారి పురుషుఁ డేకాలమునందు స్థూలసూక్ష్మకారణశరీరములకన్న విలక్షణ నిత్యాపరోక్షరూపప్రత్యగాత్మయం దభయప్రతిష్ఠను బొందుచున్నాఁడో ఆకాలమునం దా యధికారిపురుషుఁ డఖండైకరసబ్రహ్మభావమును బొందుచున్నాఁడు. అందువలన నిది సిద్ధమగుచున్నది. "అహం బ్రహ్మాస్మి, తత్త్వ మసి" ఇత్యాది మహావాక్యజన్యాపరోక్షజ్ఞానమువలన నజ్ఞాననివృత్తిపూర్వకముగా బ్రహ్మభావరూపమోక్షమును బొందుచున్నాఁడు. మఱియు నాముక్తపురుషుఁడు పునరావృత్తిని బొందుట లేదు, అనఁగాఁ బునర్జన్మమును బొందఁడు. అందు శ్రుతి.—"న స పున రావర్తతే"—భావము॥ ముక్తపురుషుఁడు పునర్జన్మమును బొందుట లేదు. ఈ యర్థము గీతయందు శ్రీభగవంతునిచేతను జెప్పఁబడి యున్నది. అందు "శ్లో. త ద్బుద్ధయ స్త దాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః । గచ్ఛం త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః"—భావము॥ పరమాత్మయందే బుద్ధియును మనస్సును నిష్ఠయును గలవారును, ఆపరమాత్మయే పరమస్థానముగాఁ గలవారును, ఆత్మజ్ఞానముచేత నివృత్తము లైన సర్వపాప

రూపకల్మషములు గలవారు నైన జ్ఞానవంతు లగు పురుషులు పునరావృత్తినే పొందు చున్నారు. అనఁగాఁ బునర్జన్మమును బొందుట లేదు. మఱియు నుక్తార్థము వ్యాస భగవానులు బ్రహ్మసూత్రమునందుఁ జెప్పి యున్నారు. అందు సూత్రము.—"అనావృత్తి శ్శబ్దా దనావృత్తి శ్శబ్దాత్"— భావము॥ తత్త్వవేత్త లగుపురుషులకుఁ బునర్జన్మమరణములయొక్క నివృత్తిరూప మగు ననావృత్తియే కలుగుచున్నది. ఏకారణముచేత ననఁగా శ్రుతిస్మృతిరూపశాస్త్రములే యీయర్థమును జెప్పుచున్నవి. ఇచ్చటఁ దాత్పర్య మే మనఁగా నేపురుషున కీమనుష్యశరీరమునందు శ్రవణాదులచేత బ్రహ్మసాక్షాత్కారము కలుగుచున్నదో ఆపురుషున కైననో ఈ మనుష్యశరీరమునం దా బ్రహ్మభావరూపమోక్షము కలుగుచున్నది. ఈయర్థమును "యదా సర్వే ప్రముచ్యంతే కామా యేస్య హృది స్థితాః। అథ మర్త్యో ఽమృతో భవ త్యత్ర బ్రహ్మ సమశ్నుతే" అను శ్రుతి చెప్పుచున్నది. మఱియు నేనిష్కామపురుషు లహంగ్రహోపాసనచేత బ్రహ్మలోకమునకుఁ బోవుచున్నారో ఆ యుపాసకపురుషుల కు బ్రహ్మలోకమునందే బ్రహ్మసాక్షాత్కారము కలిగి, బ్రహ్మతోఁగూడ మోక్షమును బొందుచున్నారు. ఈ యర్థము గూడ "బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే। పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరంపదమ్" ఇత్యాది స్మృతివచనములు చెప్పుచున్నవి. మఱియు నే సకామపురుషులు పంచాగ్నివిద్యాదికములచే బ్రహ్మలోకమునకుఁ బోవుచున్నారో, ఆ సకామపురుషులకు బ్రహ్మలోకమునం దా బ్రహ్మసాక్షాత్కారము కలుగుట లేదు. ఈకారణముచేతనే, ఆ సకామపురుషులకా బ్రహ్మలోకమునుండి పునరావృత్తి కలుగుచున్నది. ఈ యర్థమునే "ఇమం మానవమావర్త మావర్తంతే, ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తి నోఽర్జున" ఇత్యాది శ్రుతిస్మృతివచనములు చెప్పుచున్నవి. సర్వప్రకారములచేతను బ్రహ్మసాక్షాత్కారము గల పురుషుఁడు పునరావృత్తిరహితుఁడై బ్రహ్మభావరూపమోక్షమునే పొందుచున్నాఁడు.

ఇది శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య శ్రీస్వామ్యుద్ధవానందగిరిపూజ్యపాదశిష్య స్వామి చిద్ఘనానందగిరి విరచిత ప్రాకృత తత్త్వానుసంధానముయొక్క చతుర్థపరిచ్ఛేదము సమాప్తము.

శ్రీ కృష్ణార్పణ మస్తు.

తత్త్వానుసంధానము సమాప్తము.

